

# సమూహాల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## తృతీయ సంపుటము

## 7, 8 మండలములు


ఆంధ్రానువాద కర్త
కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

సంకలన కర్త-పరిష్కర్త-పూరణ కర్త
బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"






ప్రచురణ :
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి
1982

# SAMULA
# SRIMADANDHRA RUGVEDA SAMHITA

III VOLUME
7, 8 Mandalas

*Telugu Translation*
*by*
Kavya teertha
NEMANI VENKATA NARASIMHA SASTRY

*Compiled, Edited*
*and Completed*
*by*
*Brahmarshi*
*Vangmaya Mahadhyaksha*
Dr. VADLAMUDI GOPALA KRISHNAIAH
Kala-Prapoorna

T. T. D. Religious Publication Series No. 108
*FIRST EDITION*
*Copies : 2,000*
Price : Rs. 100

*Published by :*
SRI G. KUMARA SWAMY REDDY, I. A. S.
*Executive Officer,*
*Tirumala Tirupati Devasthanams*
TIRUPATI
*Andhra Pradesh*
INDIA

*Printed at :*
SWATANTRA PRESS
1-7-166, Bakaram,
Hyderabad - 500 048.

# విషయసూచిక

యదద్య కచ్చ వృత్రహన్నుదగా అభి సూర్య ।

సర్వం తదిన్ద్ర తే వశే ॥

(ఋగ్వేదం-8 మం-93 సూ-4వ ఋక్కు-968 పేజీ)

చరాచరాత్మరూపకా ! సమస్త జగద్దీపకా !
అజ్ఞానతిమిరనాశకా ! అఖిలలోకజాల కాల
సర్వస్వము నీ వశమై సంచరించుఁ బరమాత్మా !

(974 వ పేజీలో ఉండవలసిన అర్థాంతరానువాదము)


బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

విజయీ భవ !

*కమలాకుచచూచుకకుంకుమతో
నియతారుణితాతులనీలతనో !
కమలాయతలోచన ! లోకపతే !
విజయీభవ ! వేంకటశైలపతే ! ॥

*"కమల = పద్మములయొక్క, ఆకుచ = బీజకోశములమీద వున్న - అనగా దుద్దులపైన వున్న, చూచుక = కింజల్కములమీద కల, కుంకుమతః = ఎర్రనిపుప్పొడిరజమువల్ల, నియత = ఎల్లప్పుడూ, అరుణిత = ఎర్రగా చేయబడిన, అతుల = సాటిలేని, నీలతనోః = నీలిమవర్ణంతోవున్న శరీరం కలవాడా!-" అని అసలైన అర్థం. అంటే-"నీలిమవర్ణంతోవున్న సాటిలేని నీ శరీరం ఆపాదమస్తకమూ నియత పూజలో ఉపయోగింపబడే అరుణవర్ణ పద్మ కింజల్కాల పుప్పొడితో యెర్రగా వుంటుం"దని తాత్పర్యం. సాంప్రదాయ సిద్ధంగా గతానుగతికంగా చెప్పుకుంటున్న "శ్రీదేవియొక్క చనుమొనల యందలి కుంకుమపూవు రంగువలన" అన్న అర్థంలో బొత్తిగా ఔచిత్యంలేదు. చనుమొనలమీది కుంకుమ-ముఖం-వక్షస్థలం-హస్తతలాదులమీద అంటుకొనడానికి అవకాశంవున్నదిగాని పాదాలూ-ఊరువులు-ఉదరంవంటివాటిమీదా, మిగిలిన శరీరమంతటా అంటుకొనే అవకాశంలేదు. అందువల్ల యీ గతానుగతికార్థంలో సార్థకతకాని ఔచిత్యంకాని అణుమాత్రమైనా లేదు.

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

# తొలి పలుకు

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

వేదమనేది ఒక దైవీయమైన మహాకావ్యం. సర్వమానవాళికీ సంబంధించిన పర్వేశ్వర సాహిత్య సమగ్ర స్వరూపం. విశ్వశ్రేయమే దీని ఏకైక పరమలక్ష్యం. వేదం అఖండ జ్యోతిలాగ తాను ప్రకాశిస్తూ విశ్వమంతటికీ వెలుగును ప్రసాదిస్తూవుంటుంది.

మన సంస్కృతి కంతటికీ మూలభూతమైన వేదం పవిత్రం, శక్తిమంతం, సత్యధర్మాలు సనాతన సంస్కృతికి జీవనాడులు. వేదసంస్కృతి వైభవమూ, వైశిష్ట్యమూ సత్యధర్మాల మీదే ఆధారపడి వున్నది. వేద హృదయ మర్మాలు గ్రహించగలిగినప్పుడే మనం మన సంస్కృతిని గుర్తించగలం. వేదసంస్కృతి సమారాధనం చేయని జాతిభవిష్యత్తు మంగళకరం కాజాలదని ప్రజల ప్రగాఢ విశ్వాసం. అందువల్లనే ఆస్తికులంతా పరమానురక్తితో, భక్తితో వేద ధర్మానుసారంగా జీవితరీతులను దిద్దుకుంటున్నారు.

సర్వాన్నీ దైవమయం చేసుకోగలిగిన భారతీయ దివ్య జీవనవిధానం ఎంతో పవిత్రం. భగవత్సంబంధమైన విజ్ఞానాన్ని ఆవిష్కరించటమే భారతీయుల పరమార్థం. ఆదినుంచీ ఆ దివ్యనిర్ణయం మన మనుగడకు మార్గదర్శకం. పరమేశ్వర తత్వాన్ని సమగ్రంగా, సాధికారంగా విశదీకరించగలిగిన మనోబలం వేదాధ్యయనం వల్లనే లభిస్తుంది. అందుమూలంగానే వేద విజ్ఞానాన్ని నిజమైన ఈశ్వరీయవిజ్ఞానంగా మనం భావిస్తున్నాము.

వేదం ఒక ప్రాంతానికిగాని, ఒక జాతికిగాని సంబంధించిందికాదు. వేదవిజ్ఞాన సముపార్జనకు ప్రతి ఒక్కరూ ప్రయత్నించవచ్చు. మానవుల మధ్య అనుక్షణం సమైక్యభావ ధోరణిని ప్రోత్సహిస్తూ విశాలదృష్టిని కలగజేస్తున్న వేదగానాలు జాతి అభ్యుదయానికి నిధానాలు. యోగ్యత వున్నవాళ్ళకే వేదమాతృ హృదయం సమగ్రంగా అర్థమవుతుంది. అందువల్ల వైదుష్యం అందరికీ అవసరమనీ, దాన్ని ఆర్జించడానికి శ్రద్ధవహించమనీ జాతికి వేదం ప్రబోధించింది.

విశ్వంలోని మానవులంతా వైదుష్యం సముపార్జించుకుని పరస్పర ప్రేమభావంతో ధర్మమార్గానుసారులై, సత్యపథానుగాములై సాధుతత్వంతో వ్యవహరించి సర్వేశ్వరుడి కటాక్షంవల్ల సఫలమనోరథులై చరితార్థులు కావాలనే విశ్వకల్యాణకాంక్ష వేదాలలో సర్వత్రా వ్యక్తమవుతున్నది.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అనే నాలుగు వేదాలూ మానవజాతికి తరుణోపాయాన్ని సూచిస్తున్న పరమేశ్వరజ్ఞాన భాండాగారాలు. ఈ చతుర్వేదాలు భారతీయ జీవిత విధానంలో పూజనీయాలుగా భావించబడుతున్నాయి. మధురభావనలతో మానవాళిని అలరిస్తూ, మహోత్తమోపదేశంచేస్తూ మనుగడలను ధన్యంచేసిన వేదమాతఋణాన్ని ఎవరూ తీర్చుకోలేరు. వేదాధ్యయన తత్పరతతో, వేదధర్మానురక్తితో మాత్రమే మానవులు కొంతవరకూ ఈ ఋణాన్ని తీర్చుకోగలుగుతారు.

అల్లి బిల్లిగ అల్లుకునివున్న వేదవిజ్ఞానాన్ని తెలుసుకోవడానికి సునిశితమూ విశాలమూ అయిన దివ్య చక్షువు అవసరం. ఈ దృష్టి అందరికీ లభించడం అసాధ్యం. అందువల్ల ఏదో ఒక ప్రాచీన భాష్యాన్ని అనుసరించి, ఆ భాష్యదృక్కోణంతోఅయినా వేద విషయ పరిజ్ఞానం సంపాదించవలసి వున్నది. సంప్రదాయ సిద్ధమైన అధ్యయనాధ్యాపన పద్ధతివల్ల వేదవిజ్ఞానం కొద్దిమందికి మాత్రమే లభిస్తున్నది. అలాంటి పరిస్థితుల్లో వేద విషయ జ్ఞానాన్ని ఒక భాష్యదృక్కోణంతో అయినా ఆంధ్రులందరికీ అందించాలనే వుద్దేశంతో తెలుగులో వేదాలను ప్రచురించే కార్యక్రమాన్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రారంభించారు.

వేదాలు పదం పదంలోనే కాకుండా ప్రతి అక్షరంలోనూ దివ్యత్వాన్ని దీపింపచేస్తూ మొట్టమొదట వెలుగు జిలుగులను వెలయించిన మేలి ధ్రువతారలు. అప్పటినుంచీ భారత ప్రజానీకానికీ, పావన భారత భూభాగానికీ మొక్కవోని చెక్కుచెదరని అపూర్వకీర్తినీ, అనంత సౌభాగ్యాన్నీ సంస్కృతభాషే సమకూర్చి పెడుతున్నది. మహోన్నతమూ, మహోజ్వలమూ అయిన సంస్కృతభాషలోని సామరస్యాన్నీ, శాస్త్ర మర్యాదలనూ ఆకళించుకున్న కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు సుమారు అర్ధశతాబ్దంక్రితం అహోరాత్రాలూ పరిశ్రమించి ఋగ్వేదాన్ని ఆంధ్రీకరించారు.

వైదిక వాఙ్మయంమీద విసుగూ విరామం లేకుండా పరిశోధనలు సాగించిన శ్రీ శాస్త్రిగారు బరంపురంలోని కళ్ళికోట కళాశాలలో తెలుగు పండితులుగా పనిచేస్తూ యేసంస్థ అండదండలూ లేకుండా యెన్నో శ్రమలకోర్చి ఋగ్వేదాన్ని పద్యగద్యాత్మకంగా అనువదించడంద్వారా వేద విజ్ఞానానికి చేసిన సేవ చిరస్మరణీయం. విశేష విజ్ఞతతో, విలక్షణ విశాల భావనతో శ్రీ నేమానివారు 1926-1932 మధ్య కాలంలో ఈ గ్రంథాన్ని రచించారు. రాజమహేంద్రవరంలోని గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడ్డ ఈ అనువాదగ్రంథం వ్రాత ప్రతులన్నీ అర్ధశతాబ్దంపాటు అముద్రితాలుగా, అప్రకటితాలుగా నిలిచిపోయాయి. వేదాలను తెలుగులో ప్రచురించాలనే విధానానికి తొలిమెట్టుగా శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను చేపట్టడం జరిగింది. దేవస్థానంవారి కోరిక మేరకు సంపాదకత్వమూ, సంహిత-శేషభాగపూరణ కార్యభారమూ బ్రహ్మర్షి, "కళా-ప్రపూర్ణ", వాఙ్మయమహాధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు స్వీకరించారు.

మూల ఋగ్వేదం తెలుగులిపిలో సంపూర్ణంగా యింతవరకూ వెలువడలేదు. తెలుగు అనువాదం మాత్రమే కాకుండా మూల ఋగ్వేదాన్నికూడా అందిస్తే అందరికీ ఉపయోగకరంగా వుంటుందనే అభిప్రాయంతో సర్వ మంత్ర సూక్త సంకలితమై సుసమగ్రతను సంతరించుకునే విధంగా ఈ గ్రంథం రూపొందించబడుతున్నది. ఈ సందర్భంలో ఎంతో పరిశోధన, పరిశ్రమ సాగిస్తున్న శ్రీ వడ్లమూడి వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

గతంలో ప్రథమ, ద్వితీయ మండలాలతో కూడిన ప్రథమ సంపుటమూ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతో కూడిన ద్వితీయ సంపుటమూ విడుదలయ్యాయి. సప్తమ, అష్టమమండలాలతో వున్న తృతీయ సంపుటం ప్రస్తుతం ప్రకటిత మవుతున్నది. శ్రీ నేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహిత పది మండలాలలోను తొమ్మిది మండలాలలో పద్యాలే అత్యధికంగా వుండి గద్యాలు తక్కువగా వున్నవి. కాని ఈ సంపుటంలోని యేడవ మండలం మొత్తం రమారమి గద్యాత్మకంగా శ్రీ నేమానివారు వ్రాయడం విశేషం. నవమ, దశమ మండలలాతో వున్న చతుర్థ సంపుటం కూడా త్వరలోనే వెలువడుతుంది.

ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రచురణ సందర్భంగా తమ అమూల్యమైన సందేశం యిచ్చిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ కోట్ల విజయ భాస్కరరెడ్డిగారికి మా హార్దికమైన ధన్యవాదములు.

భారత ప్రభుత్వ విదేశాంగశాఖా మంత్రిగా తీరికలేని వివిధ కార్యక్రమాలలో నిమగ్నులై వుండికూడా తమ అమూల్యమైన కాలాన్ని కొంత వినియోగించి ఈ గ్రంథానికి చక్కని 'పరిచయం' వ్రాసిన బహు భాషాకోవిదులూ, విమర్శకులూ, రచయితలూ అయిన గౌరవనీయులు శ్రీ పి. వి. నరసింహారావుగారికి మా హృదయ పూర్వకమైన కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథానికి దయతో "ఆముఖం" వ్రాసిన ఆంధ్రప్రదేశ్ దేవాదాయ - ధర్మాదాయ శాఖామాత్యులు గౌరవనీయులైన శ్రీ గోగినేని నాగేశ్వరరావుగారికి మా కృతజ్ఞతాంజలులు.

సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత శీఘ్రంగా వెలుగు చూడడంలోనూ, నిరాటంకంగా ప్రచురణాది కార్యక్రమాలు జరగడంలోనూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రజాసంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తికి నా అభినందనలు. శ్రీ నేమానివారి శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులను ప్రచురణ నిమిత్తం మా కందించిన రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంవారికి మా అభివందనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆంధ్రప్రజానీకానికి తొలిసారిగా అందిస్తున్న ఈ ఋగ్వేదవైదిక ప్రసూనం ఆంధ్రు లందరికీ శిరోధార్యం కాగలదని ఆశిస్తున్నాము.

విజయదశమి
దుందుభి-నిజాశ్వయుజం
తిరుపతి

జి. కుమారస్వామిరెడ్డి
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

—"మన వేదాలు ప్రాచీన భారతీయ విజ్ఞాన నిధానాలు. భారతదేశ అత్యంత ప్రాచీన సంస్కృతీ చరిత్రలకు దర్పణంవంటివి. తన ప్రాచీన సంస్కృతీ చరిత్రల పురావైభవాన్ని విస్మరించే జాతి పతన స్థితికి అభిముఖమైనట్లే! అందువల్ల మన గౌరవాన్ని మనకీర్తి ప్రతిష్ఠలను దశదిశలా వ్యాపింప చేయాలంటే మన ప్రాచీన వేద విజ్ఞాన సంస్కృతులను పునరుద్ధరింపజేయవలసిన అవసరం యెంతైనావున్నది."—

—శ్రీమతి ఇందిరా గాంధీ



మన ప్రధాని

శ్రీమతి ఇందిరా గాంధీ



మన ముఖ్యమంత్రి
శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం




# సందేశం

శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

వేదాలు ప్రపంచ వాఙ్మయ చరిత్రలోనే అతి ప్రాచీన గ్రంథాలుగా ప్రసిద్ధి నొందాయి. భారతీయ మహర్షులు స్రష్టలుగా కాక ద్రష్టలుగా ఆవిష్కరింపజేసిన మహిమాన్విత మహత్తర గ్రంథాలు మన వేదాలు.

లౌకికంగా కనిపించే మానవజాతి వికాసానికీ, పూర్ణాభివృద్ధికీ మాత్రమేకాక, అలౌకికమై, నిరాకారమై నిర్వికారమై, సచ్చిదానందమయమైన బ్రహ్మానుభూతి లక్ష్యంగా వేద విజ్ఞానాన్ని రూపొందించడం జరిగింది. "లోకాస్సమస్తాః సుఖినోభవంతు" అని సమస్త లోకాలలోని ప్రాణికోటి సుఖ, సౌభాగ్యాలను కోరే విశ్వజనీన గ్రంథాలు మనవేదాలు.

వేదం మొట్టమొదట బృహత్తరమైన ఏకైక గ్రంథంగానే అవతరించినా దానిని దూరదృష్టితో మన మహర్షులు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదాలుగా నాలుగువేదాలుగా విభజించారు. అధ్యయనం చేయడానికి వీలుగా వుండాలనే వుద్దేశంతో ఒక్కొక్క దానిని తిరిగి పెక్కు శాఖలుగా కూడా విభజించి వేద విజ్ఞానాన్ని పొందడానికి మార్గాన్ని సుగమం చేశారు.

అనువంశికంగా గురుశిష్య పరంపరగా అనాదినుండి అధ్యయనం చేస్తూ మనవారు వీటిని యెంతగా భద్ర పరచుకుంటూవచ్చినా, సహస్రాధికంగా విస్తరించిన వేద శాఖల్లో అనేకం దురదృష్టవశాత్తూ కాలగర్భంలో కలిసి పోయాయి. ప్రస్తుతం మనం వేళ్ళమీద లెక్కపెట్టుకోడానికి సరిపోయేన్ని చతుర్వేద శాఖాసంహితా గ్రంథాలు మాత్రమే మనకు లభించాయి.

భారతీయ విజ్ఞానానికి పెట్టనికోటలుగా ప్రపంచంలో వెలుగొందుతూ వచ్చిన వేదాలు క్రమేపీ ఆంగ్ల విద్యా వ్యవస్థాదుల ప్రభావంవల్ల ఉపేక్షా భావనకు, నిరాదరణకు గురైన సంగతి అందరికీ తెలిసిందే. స్వాతంత్ర్యానంతరం భారతీయ సంస్కృతీ వికాసానికి దోహదం చేసే అనేక కార్యక్రమాలను మనం చేపట్టాం. సంస్కృత భాషా వికాసానికి వేద వాఙ్మయ ప్రచారానికి కూడా పూర్తిగా చేయూతనిచ్చి వాటిని తిరిగి వున్నతస్థితికి తీసుకురావాలన్న దృష్టితో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృషి చేస్తున్నది. మన రాష్ట్రంలో అనేక సంస్కృత పాఠశాలలను, కళాశాలలను

ప్రభుత్వం స్వయంగా నిర్వహిస్తున్నది. ప్రయివేటు పాఠశాలలకు,కళాశాలలకుకూడా ఉదారంగా ప్రభుత్వం గ్రాంటులు యిస్తూ సహాయం చేస్తున్నది. సంస్కృతాన్ని చదువుకునేందుకు విద్యార్థులకు ఉపకారవేతనాలు కూడా యిస్తూ ప్రోత్సహిస్తున్నది. ప్రతి సంవత్సరం సుప్రసిద్ధులైన వేద పండితులలో కొందరిని ఎన్నికచేసి సన్మానించి గౌరవించడం జరుగుతున్నది. ఇంకా అనేక విధాలుగా సంస్కృత భాషా సాహిత్యాల అభివృద్ధికై కృషిని కొన సాగించడానికిగాను, వేరువేరు భాషలకు వున్నట్లే సంస్కృతానికి కూడా ఒక ఎకాడమీని ఏర్పరచాలనే ప్రతిపాదన వున్నది.

ప్రాచీన వేద విజ్ఞానాన్ని పునరుద్ధరించి, ప్రచారం చేసి దానికొక పూజనీయస్థానాన్ని ఏర్పాటు చేయడానికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు విశేషంగా కృషిచేస్తున్నారు. వేదాలన్నింటినీ తెలుగులోకి అనువదింపజేసి మూల మంత్రాలతో సహా ప్రకటించి అందరికీ అందుబాటులోకి తేవాలని దీక్షాకంకణులై కృషిచేస్తున్నారు. తత్ ఫలితంగానే "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" అన్న పేరుతో మూలఋగ్వేదాన్ని ఆంధ్రానువాదంతో సహా ప్రచురించడం జరుగుతున్నది. బరంపురం కళ్ళికోట కాలేజీలో ప్రధాన ఆంధ్రోధ్యాపకులుగా పనిచేస్తూ 1932లో కీర్తిశేషులైన కావ్యతీర్థ శ్రీనేమాని వేంకటనరసింహ శాస్త్రిగారు సరళమైన తెలుగుభాషలో అనువదించిన ఋగ్వేదాన్ని దేవస్థానం వారు ప్రచురించడం అభినందనీయం. అసంపూర్తిగా వున్న ఈ ఋగ్వేద సంహితను సుప్రసిద్ధకవి, పండిత పరిశోధకులు, బ్రహ్మర్షి, వాఙ్మయ మహోధ్యక్ష బిరుదాంకితులు అయిన కళా-ప్రపూర్ణ, డాక్టర్ వఝ్ఝల్లమూడి గోపాల కృష్ణయ్యగారు పూర్తిగా ఆంధ్రీకరించి పరిష్కరించి యివ్వడం ప్రశంసనీయం. ఇందులో మరుగున పడివున్న అనేక "ఖిల"మంత్రాలను, "ఖిల"సూక్తాలనుకూడా డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు సేకరించిచేర్చి మొదటిసారిగా ఋగ్వేదాన్ని సుసమగ్రంచేసి ప్రచురించడం మరీ విశేషం. ఈ మహాగ్రంథానికి బహుభాషా కోవిదులు, భారతవిదేశాంగశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారు "పరిచయం" వ్రాయడం పేర్కొన దగింది. గతంలో ప్రథమ, ద్వితీయ మండలాలతో వున్న ప్రథమ సంపుటమూ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతో వున్న ద్వితీయ సంపుటమూ వెలువడినాయి.

ఇప్పుడు సప్తమ-అష్టమ మండలాలతో వున్న తృతీయ సంపుటం వెలువడుతున్నందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. అతి సమర్థులు, తిరుమల తిరుపతి దేవస్థానం కార్య నిర్వాహణాధికారి అయిన శ్రీ గంగిసాని కుమారస్వామిరెడ్డి ఐ. ఏ.ఎస్. గారు అత్యంత భక్తి శ్రద్ధలతో సమర్థవంతంగా ఈ ఋగ్వేద ప్రచురణ కార్యక్రమాన్ని నిర్వర్తిస్తున్నందుకు హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. మిగిలిన నవమ - దశమ మండలాలతో వున్న చతుర్థ సంపుటం కూడా త్వరలోనే వెలువడగలదని ఆశిస్తున్నాను.

హైదరాబాదు
7-10-82

కె. విజయభాస్కరరెడ్డి

# పరిచయము

శ్రీ పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖా మంత్రి
భారత ప్రభుత్వము

వేదములు మన ప్రాచీన భారతీయ మహర్షులు ద్రష్టలుగా అవతరింపజేసిన అపౌరుషేయ మహాసంపదలు. "అనంతా వై వేదాః" అని వేదమే పేర్కొన్నట్లు వాస్తవమునకు వేదము లనంతములు. అనంతములైన యీ వేదములలో మనకు లభ్యమైనవి కొన్ని మాత్రమే. మొదట వేద మొక్కటిగానే అవతరించగా దానిని చతుర్వేదములగు ఋగ్వేద - యజుర్వేద - సామవేద-అథర్వ వేదములుగా వేదవ్యాస మహర్షి విభజించి ప్రచారక ప్రవక్త అయినట్లు ప్రసిద్ధి కలదు. వేదమును నాల్గువేదములుగా విభజించి ప్రచారమొనరించిన తొలిమహర్షి పైల మహర్షి యని కొందరు భావింపగా కపిల మహర్షి యని కొందరు తలంచినారు. ఏకైకమైన వేదము చతుర్వేదములుగా విభజితమైనప్పటికిని చతుర్వేదములు సైతము మహత్తరాలైన బృహత్తర గ్రంథాలుగానుండి అధ్యయన అధ్యాపనలకు క్లిష్టముగా నున్నందువల్ల మనమహర్షులే ప్రాచీనకాలములో ఋగ్వేదమును 21 శాఖలుగను, యజుర్వేదమును 101 శాఖలుగను, సామవేదమును సహస్రశాఖాత్మకములుగను, అథర్వవేదమును నవసంఖ్యా పరిమిత శాఖలుగను విభజించి వివిధ శిష్య బృందములకు ఒక్కొక్కశాఖ వంతున బోధించి విభిన్నశాఖలను పరివ్యాప్తిచెందించి ప్రచార మొనరించిరి. 21 శాఖలుగా విభజితమైన ఋగ్వేద శాఖలలో ఐతరేయ శాఖ - శాకల శాఖ - పౌఋియ శాఖ అన్న త్రివిధ నామాలతో నిర్దిష్టమైన ఒకే ఒక సంహితాగ్రంథము మనకు లభ్యమై విస్తృత ప్రచారము నొందినది. అత్యంత ప్రాచీన కాలమునుంచి ఒక్క ఋగ్వేదమే కాక మిగిలిన వేదశాఖలు కొన్ని మాత్రమే గురుశిష్య పరంపరగా అధ్యయన అధ్యాపనలతోగూడ సురక్షితముగా నిలిచియున్నవి. వేదాలు కేవలము గురుశిష్య పరంపరలో అధ్యయన అధ్యాపనల రూపములో మాత్రమేకాక ఆదినుండియు, వేదముల లేఖనమునకు సంబంధించిన 'లిపి' యేర్పడి యున్నదనియు, పుస్తకరూపములో వ్రాసియుంచుటద్వారాకూడా మన మహర్షులు వేదములను రక్షించినారనియు డాక్టర్ వక్కలమూడి గోపాల కృష్ణయ్యగారు ప్రథమ సంపుటమునకు వ్రాసిన పీఠికలో వివరించినారు. దీనివల్ల ప్రాచీన భారతీయ ఆర్ష వాఙ్మయ వ్యవస్థ యెంత స్థిరముగా వెలుగొందినదో మన మూహించ వచ్చును.

ప్రస్తుతము భారతదేశములో విస్తృత ప్రచారములో నుండి మన కుపలభ్యమానమైన ఋగ్వేదఐతరేయశాఖ కాత్యాయనముని సంపాదితమైనది. అధ్యయన రూపముగానే కాక గ్రంథరూపమునగూడ ఋగ్వేదములోని సూక్తములకు, అధ్యాయములకు - అష్టకములకు - మండలములకు ఒకానొక క్రమవ్యవస్థ నేర్పరచిన వ్యక్తులలో కాత్యాయన మహర్షి ఒకరు. అనంతమైన వేదమునకు ఆద్యంతములు పేర్కొనుట సాధ్యము కాకున్నను అధ్యయన అధ్యాపనలకు ఏదో ఒక క్రమ వ్యవస్థ ఆవశ్యకము. అందువల్ల సకారణముగానే ప్రాచీనులొక క్రమ మేర్పరచిరి. సృష్టివ్యవస్థకు మూలము అగ్నికాబట్టి అగ్నిసూక్త మాదిగా ఋగ్వేద శాకల శాఖను ప్రాచీనులు రూపొందించినారు. ఈ ఋగ్వేద శాకల శాఖకు కాత్యాయనముని సంకలిత సంహితకు పూర్వమే సాంఖ్యాయన మహర్షి ఒక సంహితను, బాష్కల మహర్షి మరొక సంహితను, శౌనక మహర్షి వేరొక సంహితను రూపొందించినట్లు కొన్ని వివరాలతో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు ప్రథమ సంపుటమునకు వ్రాసిన పీఠికలో వివరించినారు. ఈ విషయము

లన్నింటిని పరిశీలించగా చరిత్రకారులూహించిన కాలమునందే కాక అత్యంత ప్రాచీన వేదకాలములోనే భారతీయుల లేఖనా స్వరూపమైన 'లిపి' చాల సువ్యవస్థితమై యున్నదని చెప్పక తప్పదు. లిపి-లేఖన వ్యవస్థయే లేనిచో ఋగ్వేద మందలి ఒకే ఒక శాఖకు ఇన్ని సంహితలు యేర్పడియుండెడివి కావు. కాగా వేదకాలమున లిపి ఉన్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును.

యాస్కాచార్యుని నిరుక్తము వేద పదార్థములకు స్వచ్ఛమైన దర్పణము వంటిది. భాష్యకర్తలందరిలో సాయనాచార్యులు, స్కందాచార్యులు ప్రసిద్ధులు. ఆంధ్రుడై పుట్టి పెరిగి క్రీస్తుశకము 15 వ శతాబ్దములో నున్న సాయనాచార్యులు రచించిన వేదభాష్యము ఒక్క ఆంధ్రదేశమునందే కాక ఆసేతు హిమాచల పర్యంతము పూర్వము నుంచి నేటి వరకును విస్తృతప్రచారము నొంది పరమప్రామాణికమై శిరోధార్యముగా భావింపబడుచున్నది. ఆధునిక యుగములో నార్షసంస్కృతీ ప్రచారమునకు వేదవాఙ్మయ ప్రచారమునకు శ్రీ దయానంద సరస్వతి చేసిన సేవ అమూల్యమైనది. శ్రీ దయానంద సరస్వతి విరచించిన వివిధ వేద భాష్య విమర్శనాది గ్రంథములు భారతదేశ మంతటను వివిధదేశ భాషలలో ననూదితములై బహుళ ప్రచారము నొందినది.

ఆధునిక యుగములో లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక్ - డాక్టర్ రాయల్ - శ్రీ ధీరేంద్రనాథ మహోపాధ్యాయ - శ్రీ పి. సి. సేన్‌గుప్త - శ్రీ సి. ఆర్. దత్తు - వి. వి. కేత్కర్ - రాహుల్ సాంకృత్యాయన మొదలైన భారతీయులు శ్రీ జాకొబ్, డాక్టర్ ఫర్నెల్, డాక్టర్ వింటర్నిట్జ్, ప్రొఫెసర్ మాక్సుముల్లర్, హెచ్. జి. వెల్స్ - ప్రభృతి పాశ్చాత్య పండిత పరిశోధకులు వివిధ దృక్కోణాలతో పరిశోధనలు చేసి విమర్శా పూర్వకమైన పెక్కు రచనలు చేసినారు. వేదాలను సేకరించి భద్రపరచి పండితులతో సుపరిష్కృతము కావించి, ప్రచురించి విస్తృతముగా పండితప్రజల కందించుటకు కృషిచేసిన విదేశీయులలో మాక్స్‌ముల్లర్ ప్రథముడు. వేద విజ్ఞానముమీద, వేద సంస్కృతమీద, వేదములమీద, మాక్స్‌ముల్లర్‌కున్న గౌరవ మపారమైనది.

ప్రాచీనకాలమున చతుర్వేదములకు నెందరెందరో పండితులు భాష్యములు రచించిరి. కాని యవి యన్నియు వివిధ భారతీయ దేశ భాషలలోనికి అనూదితములై, ప్రకటితములై సులభముగా ప్రజల కందుబాటులోనికి రావలసిన యవసర మెంతయును కలదు. విశ్వశాంతి సౌభాగ్యాలకు పెట్టనికోటలుగా వెలుగొందు బహుముఖమైన వేద విజ్ఞాన రహస్యములు ప్రజల కందుబాటులో లేకుండ పోయినందువల్లనే మన అమూల్యమైన ప్రాచీన భారతీయ సంస్కృతి దెబ్బతిన్నది. సాహితీ సంస్కృతులు జాతికి జీవనాడుల వంటివి. సాహితీ సంస్కృతులు ప్రజలకు దూరమైనచో జాతి నిర్వీర్యమైపోవును. అందువల్ల వేదములను వివిధ దేశభాషలలోని కనువదించి ప్రజల కందించుట చాల అవసరమని ఈ శతాబ్దములోనే అనేకులు గుర్తించిరి. తత్ఫలితముగా అనేకులు ఆంగ్లభాషలో విజ్ఞానప్రదములైన విమర్శాగ్రంథములు వ్రాయగా శ్రీ దయానంద సరస్వతి హిందీలో పెక్కు గ్రంథములు విరచించిరి.

ఇట్టి యావశ్యకతను 50 సంవత్సరాలకు పూర్వమే గుర్తించి కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహ శాస్త్రిగారు ఋగ్వేదమును చాలవరకు సాయన భాష్యానుసారముగా లలిత పద సంకలితమైన పద్య గద్యాత్మకముగా నాంధ్రీకరించిరి. శ్రీ నేమానివారు 1882 ప్రాంతములో జన్మించి 1932లో హఠాత్తుగా కీర్తిశేషులయిరి. శ్రీ శాస్త్రి రు సంస్కృతాంధ్ర, ఆంగ్ల, హిందీ, ఒరియా భాషలలో మంచి కవి. పండితులు, విమర్శకులు, పరిశోధకులు. వారు దాదాపు ఆరు సంవత్సరములపాటు రాత్రింబవళ్ళు కృషిచేసి బహుగ్రంథ పరిశీలనతో "శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత" అన్న పేరుతో ఋగ్వేద శాకల శాఖను చాలవరకు ఆంధ్రీకరించిరి. మధ్యమధ్య వివిధ సూక్తములలోని

కొన్నికొన్ని ఋక్కులు, కొన్నికొన్ని సూక్తములు ప్రమాద వశమునను-కొన్ని ఋక్కులు, సూక్తములు దుర్గ్రాహ్యములుగా నున్నందువల్లను ఆంధ్రీకరించక విడిచిపెట్టిరి. వారు కీర్తిశేషులైన తరువాత వారి యాంధ్ర ఋగ్వేదసంహిత వ్రాతప్రతులు రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయములో భద్రపరుచబడగా వాటిని స్వీకరించి తిరుమల తిరుపతి దేవస్థానమువారు మూల వేదముతోసహా యీ ఆంధ్ర ఋగ్వేద సంహితను బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష బిరుదాంచితులు, నాకు చిరపరిచితులు నగు మిత్రులు డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ" గారిచేత సంకలనము చేయించి పరిష్కరింపించి ఉత్తరభాగ పూరణములు చేయించి ప్రకటించుట ముదావహమైన విషయము.

డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు సుప్రసిద్ధ పండిత పరిశోధకులు. గత ముప్పది సంవత్సరములుగ వివిధ శాస్త్రములలోను బహుముఖమైన వేద విజ్ఞానములోను నవిశ్రాంతముగా పరిశోధన లొనరించుచున్న మేధావి. పైగా అత్యంత హృదయంగమమైన లలిత కవిత రచియించగల మనీషి. కావ్యతీర్థ బిరుదాంచితులైన శ్రీ నరసింహశాస్త్రి గారి ఆంధ్ర ఋగ్వేదమును పరిష్కరించి శేషభాగ పూరణము చేసి మూల ఋగ్వేదముతో సంకలనము చేయు బాధ్యతను వారు వివిధ దృక్కోణములలో చక్కగా నిర్వహించి యీ బృహత్తరమైన సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను నాలుగు సంపుటాలలో రూపొందించినారు.

మూల ఋగ్వేదము సంపూర్ణముగా తెలుగులిపిలో ప్రచురణ మగుట యిదే ప్రథమము. మూల ఋగ్వేదమును రూపొందించుటలో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వివిధ ముద్రితప్రతులను వ్రాతప్రతులను తులనాత్మకముగా పరిశీలించి పాఠాంతరములను ఆయా సందర్భములలో ఫుట్‌నోట్‌లలో నిచ్చిరి. వేదము పదములమీదనేకాక సుప్రతిష్ఠితమైన స్వరవ్యవస్థపైనసైతము నాధారపడియున్నది. స్వరము మారినచో నర్థముమారునని తత్ఫలితముకూడ భిన్నమగునని ప్రాచీన మహర్షులు చెప్పిరి. ఒక్క ఋగ్వేద శాకలశాఖకే బాష్కల సంహిత-సాంఖ్యాయన సంహిత శౌనక సంహిత-కాత్యాయనముని సంహిత అని నాలుగు భిన్నసంహిత లేర్పడినప్పుడు శబ్దముల విపరిణామములలోనే కాక స్వరముల విపరిణామములలోనుగూడ, మహర్షులలోనే అభిప్రాయభేదము లున్నవనుట స్పష్టము. ఈ వేద స్వరశబ్దవ్యవస్థల విషయమై మనమహర్షుల అడుగుజాడలలో ఆచరణపూర్వకముగా బహుముఖమైన పరిశోధనలు జరుపవలసియున్నది. ఈ పరిశోధనలలో నార్షవిజ్ఞానపు నిగ్గులు తేల్చుటకు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారిచ్చిన వివిధ పాఠాంతరము లెంతైనను నుపయుక్తములు కాగలవు.

వేదాలంకారాల విషయమై డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు ప్రథమ సంపుటము పీఠికలో వ్రాసిన విషయములు మౌలికములు. మనకున్న అలంకారశాస్త్రములు తెలుగువ్యాకరణ దీపమువలె చాల చిన్నవి. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు చెప్పినవిధముగా వేదాలంకారాలవిషయమై అంతరాంతరాలలోనికి వెళ్ళి పరిశోధనలు చేయవలసియున్నది.

ఈ తృతీయ సంపుటమునకు వ్రాసిన పీఠికలో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వేద ఖగోళ విజ్ఞానము దృష్ట్యా అష్టమము మర్మస్థానమన్న దృక్పథముతో గుహ్యాతిగుహ్యములైన పెక్కు రహస్యాంశములు బైట పెట్టినారు. వీటిని పరిశీలింపగా డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి బహుముఖ వేద విజ్ఞాన పరిశోధనలన్నియు వెలుగు చూడవలసిన యవసరమెంతేని కలదని తెల్లమగుచున్నది.

ఆధునికయుగములో ఖగోళశాస్త్రము కొత్తమలుపు తిరిగి ఆధునిక విజ్ఞానబలముతో గ్రహాంతరయానమునకు మార్గమును సుగమము చేసినది. ఇదియెంతయు ప్రశంసనీయము. గర్వకారణము. మన వేదర్షులు తమ

తపస్సుతో ఓషధీమంత్రయోగాది విద్యలతో ఒక్క భూమ్యాకర్షణశక్తిని మాత్రమేకాదు, యే గ్రహాకర్షణశక్తులకు సైతము లోబడక వాటి ఆకర్షణశక్తిని సైతము అరికట్టి కేవలమానసికశక్తితో గ్రహాంతరయానమును నిత్యకృత్యముగా నొనరించుకున్నట్లు చరిత్రయు వేదవిజ్ఞానములును చాటుచున్నవి. ఇటువంటి బహుముఖమైన వేదవిజ్ఞానములో అసాధారణమైన మౌలికమైన పరిశోధనలుచేసి మహత్తరభారతీయ వేదవిజ్ఞానమును ప్రపంచము ముందుంచవలసిన అవసరమెంతయుగలదు. ఈ దృష్ట్యా మూలవేద మంత్రశబ్ద, నిశ్శబ్ద శక్తులమీద బహుముఖములుగా ఆచరణపూర్వకముగా పరిశోధనలు చేయుట కీ మూలఋగ్వేద మెంతయు నుపయుక్తము కాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు హిందూధర్మప్రచారమునకు బహుముఖాలుగా కృషి చేయుచున్నారు. అనేక గ్రంథములను ప్రచురించి చౌకధరలకు ప్రజల కందించుచున్నారు. వేదముల ప్రచారమునకు కూడ అనేక విధముల కృషి చేయుచున్నారు. వేదపండితులకు గౌరవవేతనమిచ్చి పోషించుట, వేదవిద్యార్థులకు, ఉపకారవేతనములిచ్చి వేదాభ్యాసమును ప్రోత్సహించుటయేకాక, ఆధునికతా ప్రభావమున క్రమక్రమముగా క్షీణించుచున్న వేదాధ్యయనవ్యవస్థను దృష్టిలో పెట్టుకొని వివిధవేదములను సస్వరముగా ప్రామాణికులైన పండితులచేత చదివించి టేప్‌రికార్డ్ కూడా చేయించి ముందుతరాలవారికోసమై పరిశోధనల నిమిత్తమై భద్రపరచుచున్నారు. చివరికి వేదముల నన్నింటిని నాంధ్రీకరింపజేసి సమూలముగా ప్రచురించి యేవిధమైన లాభాపేక్షయేకాదు తాముపెట్టినపెట్టుబడినైనను తిరిగి రాబట్టవలయు నను దృష్టికూడా లేకుండ చాల తక్కువవెలకు ప్రజల కందునట్లు చేయవలయునను సంకల్పముతో నీకృషికి సమకట్టినారు. ఇందుకు ప్రతిఫలముగానే యీ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను నాలుగు బృహత్తర సంపుటలలో ప్రకటించుచున్నారు. లోగడ ప్రథమ, ద్వితీయ మండలములతోనున్న ప్రథమ సంపుటము- తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠమండలములతోనున్న ద్వితీయ సంపుటమును బ్రకటితములైనవి. సప్తమ, అష్టమ మండలములతోనున్న తృతీయ సంపుటమిప్పుడు వెలువడుచున్నది. నవమ, దశమ మండలములతో నున్న చతుర్థ సంపుటమునుకూడ నచిరకాలములోనే వెలువరింతురని ఆశించుచున్నాను.

ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను ప్రచురించుచున్నట్లే సమూల శ్రీమదాంధ్ర శుక్ల-కృష్ణ యజుర్వేద సంహితలను, సమూల శ్రీమదాంధ్ర సామవేద కౌథుమ-జైమిని- రాణాయనీయశాఖా సంహితలను కూడ ప్రామాణిక గ్రంథములుగా ప్రకటించవలసిన అవసరమెంతయుగలదు. ఏవో చిన్నచిన్న భాగములు తప్ప అథర్వవేద మింతవరకును మూలగ్రంథమే ముద్రితము కాలేదు. అయిదారు సంవత్సరముల క్రిందట ఒరిస్సా రాష్ట్రములో ఒక అథర్వవేద లిఖితప్రతి లభ్యమైనట్లు పత్రికలలో వార్తవచ్చినది. ఈ లిఖితప్రతి ఒరిస్సాప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో భద్రపరుపబడియున్నది. దీని నాంధ్రీకరింపజేసి అముద్రితముగనున్న మూలగ్రంథముతోపాటు ముద్రించి ప్రకటింపవలసిన అవసరమెంతేని కలదు. తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ కర్తవ్య నిర్వహణలో కృతార్థులయి విజయవంతులు కాగలరని హృదయపూర్వకముగా నాశించుచున్నాను.

ఇట్లు
పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖా మంత్రి
భారత ప్రభుత్వము

9. మోతీలాల్ నెహూ్ర మార్గ్
కొత్త ఢిల్లీ



శ్రీ పి. వి. నరసింహారావు
భారత విదేశాంగ శాఖా మంత్రి



శ్రీ గోగినేని నాగేశ్వరరావు

దేవాదాయ - ధర్మాదాయ శాఖా మంత్రి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# ఆముఖం

శ్రీ గోగినేని నాగేశ్వరరావు
దేవాదాయ - ధర్మాదాయ శాఖా మంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

ప్రాచీన భారతీయ మహత్తర సంపదలలో అతి ముఖ్యమైనవి వేదాలు. అపౌరుషేయాలని ప్రాచీన మహర్షులచే, భారతీయులచే విశ్వసింపబడి గౌరవింపబడ్డాయి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అని వేదం నాలుగు విధాలుగా అత్యంత ప్రాచీనకాలంలోనే విభజితమైనది. యజుర్వేదం - శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదం అని రెండు విధాలుగా విభజితమైన సంగతి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. అత్యంత విశాలమైన వాఙ్మయంగా అవతరించిన, బృహద్గ్రంథమైన ఏకైకమైన వేదాన్ని గురు శిష్య పరంపరగా గ్రహణ ధారణ శక్తులు క్రమంగా ప్రాచీన కాలంలోనే సన్నగిల్లడంవల్ల, ఆ వేద వాఙ్మయాన్ని రక్షించడంకోసం విభిన్నశాఖలుగా విభజించి కొంత కొంతగ్రంథభాగాలను కొంతమందికి వర్గీకరణతో వాటి సంరక్షణ సముద్ధరణ బాధ్యతలను అప్పజెప్పి, విజ్ఞాన ప్రదంగా నేర్పించడం జరిగింది. అతి ప్రాచీనకాలంనుంచి ఋషి పరంపరగా, గురుశిష్య పరంపరగా, ఆనువంశికంగా అత్యంతశ్రద్ధాభక్తులతో వేదాలు అధ్యయనం చేయబడ్డా, వాటిపట్ల అనాదరణదృష్టిప్రాచీనకాలంలోనే యేర్పడినందువల్ల వివిధ వేదాలలో అనేకశాఖలు నామమాత్రావశిష్టాలై పోయాయి. ఋగ్వేదంలో 21 విభిన్నశాఖలు ఉంటేగా ప్రస్తుతం 8 అష్టకాలతో, 10మండలాలతోనుఉన్న ఋగ్వేద శాకలశాఖ ఒక్కటే మనకు లభించింది. సృష్టిప్రారంభంలో మహర్షులు ద్రష్టలుగా మంత్రాత్మకాలైన వేదాలను గుర్తించి, వేదర్షులుగా శాశ్వతమైన కీర్తిని సంతరించుకున్నారు. గురుశిష్యపరంపరగా, సంరక్షింపబడుతూ అధ్యయన రూపంతోనేకాక గ్రంథరూపంలోకూడా 10 మండలాలలో ఉన్న ఋగ్వేదం రూపొందింది. ఇదికూడా సుసమగ్రమైన ఋగ్వేదం అని చెప్పలేము. ఈసృష్టిలో బహుముఖ విజ్ఞానాత్మకమై, శ్రవణీయ దర్శనీయ సాహిత్యంగా శాశ్వత జ్యోతులుగా వేదాలు విరాజిల్లుతున్నాయి. సృష్టిస్థితిలయాలు పరమేశ్వరాధీనాలు. ఒక అపూర్వమైన క్రమశిక్షణతో సృష్టివ్యవస్థను కొరడా పట్టి నడుపుతున్నట్లు ప్రతినిత్యమూ సూర్యోదయాస్తమయాలు, గ్రహనక్షత్రాల చలన ఉదయాస్తమయాలూ జరుగుతూఉన్నాయంటే అదికేవలం పరమేశ్వరుని చిద్వి

లాసమే అనాలి. ఈ ఖగోళ వ్యవస్థలోని క్రమ శిక్షణను చూచి ఎంత విజ్ఞాని, మహామేధావి అయిన మానవుడైనా ఆశ్చర్యపడక తప్పదు. పరమేశ్వర నిశ్వసిత రూపంగా అవతరించిన వేదవాఙ్మయం విశ్వవిజ్ఞానాన్ని అనంతంగా, బహు ముఖంగా ఆవిష్కరించింది. దైవ స్వరూప ధ్యానంతో లోకశాంతికి, విశ్వకళ్యాణానికి దోహదం చేయగల శక్తి వేదమంత్రోచ్చారణలోను, ఆ మంత్రాక్షరాధిదేవతా శక్తులలోను నిండినిబిడీకృతమై ఉన్నది. ఆయా శక్తులను, విజ్ఞానాన్ని వెలికి తీయగలిగినవాడు సరియైన వేదతత్వజ్ఞుడు మాత్రమే!

కాలక్రమంగా పూర్వకాలంనుంచి భారతీయ సంఘంలో వచ్చిన నిరాదరణ, నిర్లిప్తతలు కారణంగా వేదాలు దాదాపు క్షీణదశకు చేరుకున్నాయనే చెప్పవచ్చును. హిందూమత ధర్మరక్షణకు, సాహితీ సంస్కృతుల వికాసానికి పరివ్యాప్తికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు అనేక లక్షలు ఖర్చుపెట్టి పెక్కు సార్థకములైన ప్రయత్నాలను ఆచరణపూర్వకంగా చేస్తున్నారు. ఆంధ్రదేశమంతటా ఉన్న వేద పండితులకందరికీ వేదాధ్యయనం కోసం, వేదాధ్యాపనంకోసం వేద ప్రచారంకోసం రకరకాలైన ఉపకార వేతనాలను ఇచ్చి, వేద సంరక్షణతోపాటు వేద ప్రచారార్థంకూడా అభినందించవలసిన కృషి చేస్తున్నారు. ఋగ్వేదానికి మాత్రమేకాక, ఉపలభ్యమానాలైన విభిన్న వేదాల కన్నిటికీ, ప్రాచీనులైన అనేకమంది విద్వాంసులు భాష్యాలు వ్రాశారు. యాస్కాదులు నిఘంటువులు వ్రాశారు. ఈ వేదా లన్నింటినీ ప్రాంతీయ భాషలలోకి అనువదించి ప్రకటించితే ప్రజలకు దూరంగా ఉన్న వేదాలు సన్నిహితం అవుతాయనీ, అందుబాటులో ఉంటాయనీ, చిరకాలంగా అనేకమంది ప్రముఖులు విద్యావేత్తలు భావిస్తూ వచ్చారు. ఇదేవేదాల పరిరక్షణకు ప్రచారానికి మూలకందంకూడా! ఈ పరిరక్షణ ప్రచారాల దృష్టితోనే ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదాలను నాల్గింటిని తెలుగు అనువాదాలతోసహా మూల గ్రంథంతోపాటు ప్రకటింపాలని తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్ణయించి, ఈ పథకాన్ని అమలుపరుస్తున్నారు. ఆంధ్రీకరణతో మూలవేదాల ప్రచురణ జరగడం అటు తెలుగుసాహిత్య చరిత్రలోను, ఇటు సంస్కృత వాఙ్మయ చరిత్రలోను ఒక సువర్ణాధ్యాయ మనే చెప్పాలి. ఈ మహోద్యమానికి ప్రాతిపదికగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు మొట్టమొదట-తొలి వేదమైన "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను నాలుగు భాగాలుగా ప్రకటిస్తున్నారు. ఇప్పటికి ప్రథమ ద్వితీయ మండలాలతో ఉన్న ప్రథమ సంపుటమూ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతో వున్న ద్వితీయ సంపుటమూ గతంలోనే వెలువడ్డాయి. ప్రస్తుతం సప్తమ అష్టమ మండలాలతో ఉన్న తృతీయ సంపుటం వెలువడుతున్నది. కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు బరంపురంలోని కళ్ళికోట కాలేజీలో ప్రధానాంధ్రాధ్యాపకులుగా పనిచేస్తూ, ఆరు సంవత్సరాలకు పైగా కృషిచేసి 1926-1932 సంవత్సరాల మధ్యకాలంలో ఋగ్వేదం పదిమండలాలలో దాదాపు చాలాభాగంవరకూ తెలుగులో అనువదించి, అది పూర్తిచేయకుండానే, 1932లో కీర్తిశేషులయ్యారు. వారు అసమగ్రంగా అనువదించిన ''ఆంధ్ర ఋగ్వేద సంహిత" అముద్రితంగా రాజమండ్రిలోని "గౌతమీ గ్రంథాలయం'' లో భద్రపరచబడి ఉన్నది. ఈ ఋగ్వేద సంహితను ఆంధ్రీకరించడంలో శ్రీనేమానివారు

అత్యధిక భాగం సాయణాచార్య భాష్యగ్రంథాన్ని అనుసరించినా, ఆధునిక పరిశోధక విమర్శకులు వ్రాసిన అనేక వేద విమర్శనా గ్రంథాలనుకూడా పరిశీలించి యీ అనువాదాన్ని విరచించారు. శ్రీ నేమానివారు పరిశోధించిన గ్రంథాలలో వివిధ వేదాలు, విభిన్న వేద భాష్యాలు, దయానంద సరస్వతి గ్రంథాలు, బ్రాహ్మణారణ్యక గ్రంథాలు, ఉపనిషత్తులు, పురాణాలు, స్మృతులు, చరక, సుశ్రుతాది వైద్యగ్రంథాలు, వెండిడాడు, జెండ్ అవెస్త వంటి గ్రంథాలు మొ॥ పేర్కొనదగినవి. అచ్యుతుని వేంకటాచలపతిరావు, అలెగ్జాండర్, జాకోబి, డా॥ ఫర్నెల్, డా॥ రాయల్, ధీరేంద్రనాథ ముఖోపాధ్యాయ, బాలగంగాధర తిలక్, సి.ఆర్. దత్, హెచ్.జి. వెల్స్, మాక్స్‌ముల్లర్ మొదలైన పరిశోధకుల గ్రంథాలుకూడా బహు శ్రమలకోర్చి అధ్యయనం చేశారు. శ్రీ నేమానివారు సంస్కృతాంధ్ర హిందీ, ఉరుదూ ఆంగ్ల భాషలలో అసాధారణమైన పాండిత్యాన్ని సంపాదించారు. వారి కవిత ధారాశుద్ధి కలిగి, సరళమై, ద్రాక్షాపాకంతో విరాజిల్లుతూ ఉంటుంది. మామూలు కథాకావ్యాలు విరచించడానికీ, వేదాన్ని ఆంధ్రీకరించడానికీ సంబంధమే ఉండదు. వేదాలలో కేవలం స్తుతి రూపాలు, విజ్ఞానప్రదాలు అయిన ఋక్కులు బహుముఖంగా చోటుచేసుకున్నాయే కాని కథాగమనంతోను, పరిపుష్టితోనుకూడ, వివిధ ఘట్టాలతో, సంఘటనలతో నిండి వస్తునాత్మకమైన ఏ పురాణ రూపంగానో, ఇతిహాస రూపంగానో, కావ్యరూపంగానో, అవతరించిన గ్రంథం కాదు. ఇటువంటి విశిష్ట లక్షణాలతో విరాజిల్లే సాంకేతికమైన వేదాన్ని, కవిత్వరూపంలో ఆంధ్రీకరించడం అంత సులభతరమైన పనికాదు. అంతేకాదు స్వయంకృషితో కూడిన, మౌలికమైన విజ్ఞాన దృక్పథంతో ఆంధ్రీకరించడం అత్యంత కష్టసాధ్యమైనప్పటికీ సాయణ భాష్యానుగుణంగా ఆంధ్రీకరించడంకూడా అంత సులభమైనపనికాదు.

శ్రీ నరసింహశాస్త్రిగారు వివిధ మండలాలలో భ్రమ ప్రమదాలవల్ల కొన్ని ఋక్కులను, తమకు సందేహాస్పదంగా ఉన్న మరికొన్ని సూక్తాలను, ఋక్కులను ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టి, దశమమండలంలోని చివరి అధ్యాయాలను, అసలు ఆంధ్రీకరించకుండానే హఠాత్తుగా కీర్తిశేషులయ్యారు. శ్రీ నరసింహశాస్త్రిగారు విరచించిన "శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత"ను ప్రకటించాలని తొలుతఅభిప్రాయపడిన తిరుమలతిరుపతిదేవస్థానంవారు సుప్రసిద్ధకవి, పండితులు, పరిశోధకులు అయిన బ్రహ్మర్షి, వాఙ్మయమహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ డాక్టర్ వఝ్ఝలుమూడి గోపాలకృష్ణయ్యగారిచేత లుప్తభాగాలను శేషభాగాన్ని పూర్తిచేయించి, ప్రకటించాలని నిర్ణయించారు. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి సలహామేరకు యీ శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను మూలంతో సహా ప్రకటించాలని నిశ్చయించి, తిరుమల తిరుపతి దేవస్థానం వారు యీ బృహత్తర కార్యక్రమాన్ని డాక్టర్ గోపాలకృష్ణయ్యగారికే అప్పగించడం ఎంతో ప్రశంసనీయమైన విషయం. వేదపండిత విమర్శక లోకానికే గౌరవప్రదమైన విషయం.

డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు అనేక శాస్త్రాలలోను వేదవాఙ్మయంలోను, బహుముఖాలైన పరిశోధనలు చేస్తూ చిరకాలంగా కీర్తిని గడించారు. గోపాలకృష్ణయ్యగారు గుంటూరుజిల్లా పొన్నూరులో ఉన్న శ్రీ భావనారాయణ స్వామి సంస్కృతకళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులుగా 1951-1952-1953 సంవత్సరాలలో పనిచేశారు. అప్పటినుంచి వారి బహుముఖమైన కృషిని-శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధి చెందిన వారి కీర్తిప్రతిష్ఠలను-కని, విని, ఎంతో

షించేవారిలో నే నొకణ్ని. నాకు అత్యంత గౌరవనీయులు ఆత్మీయులూ అయిన డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి బహుముఖ కవితా పాండితీ గరిమలనుగూర్చి నాకై నేను వ్రాయడంకంటే 1971, జనవరి 17వ తేదీన జరిగిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి పట్నాల్గవ "కాన్వకేషన్"లో గోపాలకృష్ణయ్యగారికి "కళా-ప్రపూర్ణ" బిరుదునిచ్చి, సంభావించిన సందర్భంగా- మనదేశంలో మహా వైయాకరణులుగా చిరకీర్తి గడించిన కళా-ప్రపూర్ణ శ్రీ వజ్ఝలచిన సీతారామస్వామి శాస్త్రిగారి శిష్యులు, సుప్రసిద్ధ పండితులూఅయిన కళా-ప్రపూర్ణ శ్రీ దువ్వూరి వెంకట రమణశాస్త్రిగారు రచించగా శ్రీ పి. జగదీశ్వరరావుగారు చదివినప్రఖ్యాపన ప్రసంగం (Citation) లోని అంశాలను యథాతథంగా పేర్కొంటే సముచితంగా ఉంటుందని తలచి ఆ అంశాలనే యిక్కడ ఉటంకిస్తున్నాను.

—"గోపాలకృష్ణయ్యగారు 1928 అక్టోబరు 24 న కృష్ణా మండలమందు కపుతరమున జన్మించినారు. వీరి తల్లిదండ్రులు శ్రీ సరస్వతీ రంగారావులు. అనగా సరస్వతీరంగము వీరి జన్మస్థాన మన్నమాట. దానికి తగినట్లు గోపాలకృష్ణయ్యగారి నిరంతర సంచార భూమిగూడ సరస్వతీరంగమే యగుట సముచితమయిన సంఘటన. బాల్యము నుండియు వీరు ఆ సరస్వతీరంగముననే బహుముఖ పరిశోధన ప్రదర్శనములకయి విసుగు విరామములేని వ్యాసంగము సాగించుచుండుట అద్భుత సన్నివేశము. అనేకములగు సారస్వత పరిశోధన ప్రసక్తులలో ఎంతవారినయిన నెదుర్కొనుట, ఔనని వారిచేతనే యొప్పించి మెప్పు లందుట వీరి సారస్వత జీవితమున చాల ఘట్టములందు చూపట్టును.

వీరు బాల్యమున సంస్కృతాంధ్రములు చక్కగా నభ్యసించి కొవ్వూరులోని ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమున 1950లో భాషా-ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణులయినారు. పూవు పుట్టగనే పరిమళము. వీరివాద ప్రతివాద భంగీ సంకులమయిన సారస్వత సంగ్రామము, గురువులతోనే ఆరంభమయినది. ఆ విద్యాపీఠమున వీరికి గురువులయిన పండిత ప్రకాండులు వేదులవారు రచించిన అప్పకవీయ వివరణము పయిని పెక్కులు విమర్శవ్యాసములు వీరు ప్రకటించినారు. అందు అనేకవిషయములు సప్రమాణముగ ఖండించుటగాంచి పరిశీలన పాటవమునకు నాశ్చర్యమునొందుచు ఆ గురువులు తమ్ము మించిన యీ శిష్యుని "మా విద్యాన్వయ చూడామణి"వని మెచ్చుకొని మిక్కిలిగానభినందించినట్లు ప్రసిద్ధమయిన యంశము. సంస్కృతాంధ్రములలో ఛందోలంకార వ్యాకరణ లక్షణములందును,కావ్యనాటకాది బహుముఖ సాహితీ ప్రక్రియలందును, నాట్యసంగీతాది కళలయందును, జ్యోతిషాయుర్వేదాది శాస్త్రములందును, సాంఖ్యయోగాది దర్శనములందును, కామతంత్ర మంత్రశాస్త్రములందును, భాషావాఙ్మయ చరితములందును, శ్రుతులందును, స్మృతుల యందును,సరస కవితా నిర్మితియందును,చిత్రకవితా రచనమునందును,వీరి బుద్ధి తుల్య మగు నుత్సాహముతో ప్రవేశింపగలదు. ప్రవేశించి వినోదింపగలదు. వీటి యన్నిటినింగూర్చి వీరు ప్రకటించిన పరిశోధన వ్యాసము లనేకములుగలవు పొత్తు కలియని భిన్న భిన్న సారస్వత శాఖలను బరిశోధించుటలో యిట్టి యాసక్తి, యింత ఏకాగ్రత, ఇట్టి యాత్మవిశ్వాసము, ఇంతసాహసమును ఏకవ్యక్తి నిష్ఠములయి కానంబడుట కష్టము. తొలుత గురువులతోనే వివాదవినోదము నుపక్రమించిన వీరు క్రమముగా అనుభవశాలురను, సుప్రసిద్ధ పరిశోధకులు నయిన వజ్ఝలవారు, గిడుగువారు,

నిడుదవోలు వారు మున్నగు ప్రముఖులతో విమర్శ సమరములు సాగించి వారిని ఒప్పించి తుదికి ఆ సంగ్రామ రంగములను క్రీడారంగములుగా పరిణమింపజేసిన పటుత్వము గల వారీ వడ్లమూడి వారు. మరియు వీరు వ్యావహారికాంధ్రమును గూడ నుద్ధరింప దలచి అపూర్వమయిన "వ్యావహారిక భాషా వ్యాకరణము" నొకదానిని వెలయించినారు. మునుపటి వ్యావహారిక వాదప్రవీణులు సాధింపని ఈ ఘనకార్యమును అసహాయముగా ఒక్క చేతిమీదుగా సాధింప గలిగిరను ప్రఖ్యాతి నందుకొన్నారు. ఆ గ్రంథ మావిష్కృతమయిన మద్రాసు మహాసభలో దాని విశిష్టతను, చిన్నయసూరి సూత్రశైలిని దలపించు దాని శైలీ పటుత్వమును కోవిదులు పెక్కురు కొనియాడి యుండిరి. గోపాలకృష్ణయ్యగారు వ్యావహారిక వాదప్రియులయ్యును చిన్నయ సూరిని చిన్మయసూరిగా భావించి గారవించు హృదయము గల వారగుటంబట్టి ఆ సూత్ర శైలీ పటుత్వమునెడ అభిరుచిగల వారగుటకు సందియము లేదు. అసాధారణమయిన యీ వ్యాకరణ గ్రంథము నభినందించుచు గొప్ప సమ్మాన సంఘ మొకటి యేర్పడి 1956లో పండిత ప్రకాండులు పరిశోధన ప్రవీణులు పలువురు సమావిష్టులయిన మహాసభలో వడ్లమూడి వారిని కనకాభిషేకముతో గారవించినారు. సువర్ణఘంటా కంకణముతో సత్కరించినారు. రతనములు పొదిగిన బంగరు పతకముతో సమ్మానించినారు. "వాఙ్మయమహాధ్యక్ష" బిరుదముతో బహూకరించినారు. ఆ పిమ్మట గుడివాడలో ఆంధ్రస[illegible] పక్షమున జరిగిన ఒక మహా పరిషత్తునందు అచ్చటి ముఖ్యులు "పంచ గజ పంచ పంచానన గండపెండే[illegible] తొడిగి వీరిని అలంకరించినారు"—

డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు కవిగా వివిధ వేద శాఖా సాహిత్యరంగాలలో పండిత పరిశోధక విమర్శకులుగా చేసిన అనేకములైన మౌలిక రచనలు విద్వల్లోకానికి తలమానికాలు. వేద వాఙ్మయంలోను, వేద విజ్ఞానంలోను, ఆ విజ్ఞానాలతో అవినాభావ సంబంధం కలిగిన వివిధశాస్త్రాలలోను పరిశోధనలు చేసి సరస్వతీ ప్రియ పుత్రులుగా ప్రస్తుతింపబడి "కళా-ప్రపూర్ణ" అనే ఆనరరీ డాక్టరేటుతో గౌరవింపబడి ఏకైక వేద కళా-ప్రపూర్ణులుగా కీర్తి పొందిన డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు తిరుమల తిరుపతి దేవస్థానం వారి కోరికపై ఋగ్వేద సంకలన-పరిష్కరణ-పూరణల బాధ్యతలను స్వీకరించడం యెంతైనా ముదావహమైన విషయం. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారికి అప్పగించిన యీ బృహత్తరమైన బాధ్యతను, అత్యంత ప్రశంసనీయంగా నిర్వర్తించారనడంలో యే మాత్రమూ సందేహంలేదు. ఒక్క "శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను పరిష్కరించి, పూరించడమేకాక, వివిధ మూల ఋగ్వేద ముద్రిత ప్రతులను, తాళపత్ర గ్రంథాలను వ్రాతప్రతులను, డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు పరిశోధించి, వివిధ పాఠాంతరాలను ఇవ్వడంతో పాటు ఎక్కడెక్కడో చెల్లాచెదురుగాపడి వున్న "ఖిల" మంత్రాలను, "ఖిల" సూక్తాలను సేకరించి, పరిష్కరించి సముచిత స్థానాలలో ఆంధ్రీకరణలతో సహా వాటిని కూర్చి, సంస్కృతమూల ఋగ్వేదానికి మొట్టమొదటి సారిగా ఒక విశిష్టమైన సుసమగ్రతను సమకూర్చడం జరిగింది. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ, ద్వితీయ సంపుటాలకు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వ్రాసిన పీఠికలలో అమూల్యాలైన అనేక నూతన పరిశోధనాంశాలను విజ్ఞానాంశాలను వెల్లడించిన సంగతి విజ్ఞులందరికీ తెలిసిందే. వేదఖగోళ విజ్ఞానరీత్యా "అష్టమ"స్థానం సూర్యస్థానం అన్న

దృష్టితో ఋగ్వేదాష్టమ మండలంలో ఉన్న రహస్యాంశాలను కొన్నిటిని సప్రామాణికంగా డాక్టర్ గోపాల కృష్ణయ్యగారు ఈ తృతీయ సంపుటం పీఠికలో ఆశ్చర్యకరంగా ఆవిష్కరించారు. శ్రీనేమానివారి కవిత ఒక ఫక్కిలో నడువగా డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి కవిత మరొక ఫక్కిలో శ్లేషాత్మకంగా, బహుముఖ విజ్ఞానప్రతిబింబ కంగా, మహాప్రవాహంగా దొర్లిపోతుంది. ఈ వైశిష్ట్యంగురించి ప్రత్యేకించి నేను చెప్పడంకంటే, కోవిదులైన కవి పండిత పరిశోధకవిమర్శకులు అంతరాంతరాలలోకివెళ్ళి, పరిశీలించి, ఆమహత్తర విజ్ఞాన విషయాలను గ్రహించి, సంతోషించడం సముచితం కాగలదు.

వేద వాఙ్మయ ఆర్షవిజ్ఞానాల పునరుద్ధరణకు, ప్రచారానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న మహత్తరకృషిని హృదయపూర్వకంగా అభినందిస్తూ, అత్యంత సమర్థులు, పరిపాలనాదక్షులు,విశాలహృదయులు నయిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, I.A.S. గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

గతంలో వెలువడిన ప్రథమ, ద్వితీయ మండలాలతో కూడిన "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" తొలి సంపుటాన్ని, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతో కూడిన ద్వితీయ సంపుటాన్ని ఆదరించినట్లే సప్తమ, అష్టమ మండలాలతో ఉన్న యీ తృతీయ సంపుటాన్నికూడా కవి పండిత విద్వద్విమర్శకలోకం ఆదరిస్తుం దని ఆశిస్తున్నాను.

రంగాభవనం
హైదరాబాద్
22-9-1982

గోగినేని నాగేశ్వరరావు
దేవాదాయ - ధర్మాదాయ శాఖ మంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



కావ్యతీర్థ

నేమాని వేంకటనరసింహశాస్త్రి

# పీఠిక


బ్రహ్మర్షి

వాఙ్మయ మహోధ్యక్ష

## డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"


గతంలో సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ, ద్వితీయ మండలాలతోవున్న ప్రథమసంపుటమూ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతోవున్న ద్వితీయ సంపుటమూ ముద్రితమై ఆవిష్కృతాలయ్యాయి. ఇది సప్తమ, అష్టమ మండలాలతో వున్న తృతీయసంపుటం.

వేద ఖగోళ జ్యోతిర్విజ్ఞానం ప్రకారం అష్టమం గుహ్యస్థానం. మర్మస్థానం. గుహ్యాతిగుహ్యమైన విషయాలకు స్థానభూతమైనదీ ప్రాణప్రదమైనదీ అష్టమం. అష్ట అష్టకాలతో దశ మండలాలతోనూ వున్న ఋగ్వేదంలోని అష్టకాలు అన్నీకూడా అష్టాధ్యాయ సంభరితాలు. వివిధ అధ్యాయాలలో వున్న ప్రతి ఎనిమిదవ అధ్యాయంలోనూ ఎనిమిదవ మండలంలోనూ అష్టమాష్టకంలోనూ తదితర అధ్యాయాలలోకంటే మండలాలలోకంటే అష్టకాలలోకంటే అత్యధికమైన గుహ్యాతిగుహ్యతర వేదవిజ్ఞాన మర్మ విషయాలు అనేకం అభివర్ణించడం జరిగింది. వేదాలు అపౌరుషేయాలనీ వాటికి మూలభూతుడైనవాడు శ్రీ మహావిష్ణువు మాత్రమేననీ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత ప్రథమ సంపుటానికి వ్రాసిన పీఠికలో నేను స్పష్టపరచివున్నాను. వేదాలు నిత్యవాక్కులని ఋగ్వేదం అష్టమ మండలంలో వున్న ఈ క్రింది ఋక్కులో విస్పష్టంగా చెప్పడం జరిగింది.

తస్మై నూనమభిద్యవే వాచా విరూప నిత్యయా ।
వృష్ణే చోదస్వ సుష్టుతిమ్ ॥
(ఋ- 8 మం, - 75 సూ - 6 ఋక్కు - 899 పేజీ)

పదకొండు సంవత్సరాల క్రిందట కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం ముఖంగా నా పేరుపైన 'ఆర్ష విద్యాభూషణ' శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు అధ్యక్షత వహించగా, శ్రీ కేశిరాజు వెంకట నృసింహ అప్పారావుగారు ప్రారంభించగా జరిగిన ఒకమహాసభలో నేను వేదసంస్కృతిగురించి ఉపన్యసించడం జరిగింది. ఈసందర్భంలో సభాప్రారంభకులైన శ్రీ అప్పారావుగారు తమ ప్రారంభోపన్యాసంలోనూ అధ్యక్షులైన శ్రీపురుషోత్తంగారు తమఅధ్యక్షోపన్యాసంలో తొలిపలుకుల్లోనూ వేదాలుఅపౌరుషేయాలు నిత్యసత్యాలనేవిషయం నొక్కివక్కాణించడం జరిగింది. అప్పుడు నావుపన్యాసం ప్రారంభంకాకపూర్వమే అధ్యక్ష, ప్రారంభకుల ఉపన్యాస విషయాలను దృష్టిలోపెట్టుకుని సభాసదులలో ఒకరు "వేదాలు అపౌరుషేయాలని చెప్పారు. సోమకాసురుడు బ్రహ్మవద్దనుంచి వేదాలనెత్తుకుపోగా మహావిష్ణువు సోమకాసురుణ్ని సంహరించి తిరిగి వేదాలను తీసుకొని బ్రహ్మ కిచ్చినట్లు పురాణాలు చెప్తున్నాయిగదా! దీనివల్ల వేదాలు గ్రంథరూపంలో వుండగా బ్రహ్మ వద్దనుంచి సోమకాసురుడు బలవంతంగా లాక్కొని వెళ్ళాడని అర్థమవుతున్నది. అయినప్పుడు వేదాలు అపౌరుషేయాలు యేవిధంగా అవుతాయి?'' అని ఒక ప్రశ్ననూ ''వేదశాఖలనేకం వున్నాయి. ఆ శాఖలన్నిటిలోనూ మనకు ఒక వంతు గ్రంథమైనా దొరకలేదనీ మిగిలినవి రూపుమాసిపోయాయనీ పెద్దలంటారు. అయినప్పుడు వేదాలు నిత్యసత్యాలేవిధంగా అవుతాయి?" అని మరొక ప్రశ్ననూ వ్రాసి పంపారు. శ్రీ పురుషోత్తంగారూ, అప్పారావుగారూ యీప్రశ్నలు చదివి సమాధానం యేంచెప్పాలో

తోచక ఆ ప్రశ్నలున్న చీటీ నాకు చూపించి చాలా కలవరపడ్డారు. ఆ చీటీ చూచిన తరవాత "ఫరవాలేదు. ఆప్రశ్నలను మీరు మైకులో సభాసదులకు వినిపించండి! నేను వాటికి తగిన సమాధానం చెపుతాను'' అని చెప్పడమూ ఆ తరువాత అధ్యక్షులవారు ఆ ప్రశ్నలను సభాసదులకు వినిపించడమూ నేను వాటికి సూటిగా సమాధానం చెప్పి సభాసదులను ఆశ్చర్య చకితులను చేయడమూ జరిగింది. ఆ సమాధానాలు యివి. ''సోమకాసురాదులు వేరువేరు సందర్భాలలో వేదాలను అపహరించారంటే గ్రంథరూపంలో వున్నవాటిని అపహరించారని అర్థంకాదు. ఒకవేళ గ్రంథరూపంలో వున్నవాటిని అపహరించారనుకున్నా ఒక బ్రహ్మకేకాదు. అనేకమంది వేదబ్రహ్మలకూ రకరకాల పండితులకూ వేదాలు కంఠగతాలుకాబట్టి వాటిని వారు చదివి యితరులకు నేర్పాగలరు. అవసరమనుకుంటే తిరిగి గ్రంథరూపంలో తీర్చిదిద్దాగలరు. ఈ పరిస్థితిలో వేదాలను అపహరించిన సోమకాసురాదులను వేదసంరక్షణార్థమై మహావిష్ణువు సంహరించవలసిన అవసరంలేదు. ఇక్కడ వేదాపహరణ అంటే యిదికూడా విశిష్టమైన ఒక వేదవిద్యకు సంబంధించిందే. ''పరవిద్యాభక్షణి" అని ఒక వేదవిద్యవున్నది. దీనికి సంబంధించిన మంత్రాన్ని జపించి సిద్ధి పొంది ఆశక్తిని ఒకరిమీద గాని, అనేకమందిమీదగాని, వేదాభ్యాసం చేసిన పండిత మండలి సర్వస్వం మీదగాని సక్రమంగా ప్రయోగిస్తే ఆ వేదవిద్యలన్నీ ఆయా పండితులవద్దనుండి విలుప్తమైపోయి మంత్రప్రయోగం చేసిన వ్యక్తిని ఆశ్రయిస్తాయి. ఇటువంటి ప్రయోగంతో ఒక్క బ్రహ్మవద్ద నుండేకాదు. ఈ అనంత విశ్వంలో ఎక్కడెక్కడవున్న వేదవేదాంగాది విద్యలనైనా విజ్ఞానాలనైనా ఎవరివద్దవున్నా ఎంతమందివద్దవున్నా హరించవచ్చును. ఇటువంటి సందర్భంలో వేదరక్షణకు రెండే రెండు మార్గాలున్నాయి. వేదాపహరణ చేసిన వ్యక్తిని భయపెట్టి, లోబరచుకొని ఆయా విద్యలను ఎవరివి వారికిప్పించడం ఒక మార్గం, లేదా ఆ అపహర్తను సంహరించి ఆయావిద్యలను యథా స్థానాలకు చేర్చడం రెండవ మార్గం. ఇంతకు మించి మార్గాంతరం లేదు. సోమకాసురుడు కూడా యీ "పరవిద్యా భక్షణి" విద్యా ప్రయోగంతోనే చతుర్ముఖ బ్రహ్మవద్ద నుంచి వేదాలను అపహరించాడు. అందుకే శ్రీ మహావిష్ణువు తన అజేయమైన శక్తితో సోమకాసురుణ్ని సంహరించి వేదాలను కాపాడడం జరిగింది. మహావిష్ణువుకున్న అపూర్వ మహాశక్తులలో రెండు చాలా ముఖ్యమైనవి. వీటిలో ఒకటి సుదర్శనశక్తి. రెండవది అఘోరాస్త్ర శక్తి. సుదర్శనాన్ని ఎవరిమీద ప్రయోగిస్తామో వారు తమకు వచ్చిన విద్యా విజ్ఞానాలను విసర్జిస్తూ అస్త్రసన్యాసం చేసి దాసోహం అంటే ఆది వారిని సంహరించదు. అస్త్ర సన్యాసం చేయకుండా శత్రువు ఎదురుతిరిగినట్లయితే అతడెక్కడికి వెళ్ళినా సుదర్శన శక్తి వెంటాడి తరిమి తరిమి సంహరించి తీరుతుంది. అఘోరాస్త్ర శక్తి అయిన రెండవది ఒక విచిత్రమైన శక్తి. శత్రువు యెటువంటి శక్తి ప్రయోగం చేసినా అదే శక్తి తిరోగమనంతో వెనకకువెళ్ళి తత్ప్రయోక్త అయిన వ్యక్తినే బాధ పెట్టేటట్లు చేయగల లేదా సంహరించేటట్లు చేయగల శక్తి సామర్థ్యాలు యీ అఘోరాస్త్ర విద్యకున్నాయి. ఈసుదర్శన అఘోరాస్త్ర విద్యలుకల వ్యక్తి జగజ్జేగీయమానుడై ఎదురులేనివాడై తిరుగులేనివాడై వెలుగొందగలడు. ఈశక్తులతోపాటు ఆనేకానేక అమేయశక్తులుకలవాడే శ్రీమహావిష్ణువు. వేదాలన్నిటికీ మూలాధారభూతుడైనవాడూ తొలి ఉపదేష్ట అయినవాడూ శ్రీ మహావిష్ణువే. భూలోకంలో సహస్రాధికంగా ఉండవలసిన వేదశాఖలు ప్రస్తుతం ఒక వందైనా లభించని మాట వాస్తవమే. వేదాలు భూలోకంలో పండితులవద్దనుండిగాని, మరే యితరలోకంలో వున్నటువంటి పండితులవద్దనుంచైనా గాని, వేద బ్రహ్మల వద్దనుంచి గాని, అసలు బ్రహ్మవద్దనుంచైనాగాని, హరించి పోవచ్చును. కాని శ్రీ మహావిష్ణువు దగ్గరనుంచి మాత్రం యే కాలంలోనూ చివరికి మహాప్రళయ కాలంలోనైనాసరే హరించకుండా నిత్య సత్యాలై శాశ్వతంగా వుండగలవు. అందువల్లనే "వేదాలు నిత్యాలు" అని వేదమే అభివర్ణించడం జరిగింది.''

ఈ విధంగా నేను సమాధానాలు చెప్పగా ప్రశ్నలు వేసిన వ్యక్తితోసహా సభాసదు లందరూ హర్ష ధ్వానాలు చేస్తుంటే సభాధ్యక్షులైన శ్రీ పురుషోత్తం గారు "మా గోపాల కృష్ణయ్య తాను నిజంగా బ్రహ్మర్షి నని నిరూపించుకున్నాడు. గురువులకు గురువు ననిపించుకున్నాడు.'' అని బహుధా ప్రశంసించారు. వేదాలు క్షీరాబ్ధిలో ఆదిశేషమహాఫణిరాజశాయి అయిన శ్రీ మహావిష్ణువువద్దనుంచి చతుర్ముఖ బ్రహ్మకు లభించగా ఆ బ్రహ్మ చతుర్ముఖాలనుంచి వెలువడే నాలుగు వేదాల నాదాలనూ వాణి తన వీణ కచ్ఛపిపై మంద్రస్వరంతో నినదింప చేస్తూ వుంటుంది. ఇది నిత్య సత్యమైన పరమ వైజ్ఞానిక విషయం. అనంత ఖగోళగతమై విరాజిల్లే యీ పరమ వైజ్ఞానిక సత్యాన్ని యీ ఋగ్వేద అష్టమ మండలంలోనే నాలుగు ఋక్కులలో వివరించడం జరిగింది.

సముద్రే అంతః శయత ఉద్నా వజ్రో అభీవృతః।
భర_న్త్యస్మై సంయతః పురఃప్రస్రవణా బలిమ్॥
యద్వాగ్వదంత్యవిచేతనాని రాష్ట్రీ దేవానాం నిషసాద మన్ద్రా।
చతస్ర ఊర్జం దుదుహే పయాంసి క్వ స్విదస్యాః పరమా జగామ॥
దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి।
సా నో మన్ద్రేషమూర్జం దుహానా ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు॥
సఖే విష్ణో వితరం వి క్రమస్వ ద్యౌర్దేహి లోకం వజ్రాయ విష్కభే।
హనావ వృత్రం రిణచావ సింధూ నిన్ద్రస్య యంతుప్రసవే విసృష్టాః॥

(ఋ. 8 మం- 100 సూ. 9, 10, 11, 12 ఋక్కులు)

నిత్య సత్యాలైన వేదాలు అత్యధికంగా ఉదాత్తాదిస్వరవ్యవస్థలమీదా శబ్దశక్తులమీదా వైజ్ఞానికంగా ఆధారపడి ఉన్నాయి. ఒక్కొక్క స్వరవ్యవస్థకు, ఒక్కొక్క విశిష్టార్థం నిర్దిష్ట మవుతూవుండడంవల్ల స్వరంమారితే అర్థం మారిపోతుంది. మామూలు మాటల్లో కాకువును బుద్ధిపూర్వకంగానే ఉపయోగించినా- పొరపాటున ఉపయోగించినా అప్రయుక్తమైన కాకువును పురస్కరించుకొని అర్థప్రాప్తి జరిగినట్లు వేద మంత్ర పఠనంలో సైతం బుద్ధిపూర్వకంగానే కాని, పొరపాటున గాని స్వరాన్ని మార్చి చదివితే ఆ స్వర ప్రయోగానికి తగిన అర్థప్రాప్తి జరుగుతుంది. అయితే మనస్సులో ఒకానొక ఫలాపేక్షను ఉంచుకొని తత్ఫలప్రాప్తినిచ్చే స్వరవ్యవస్థకు భిన్నమైనస్వరంతో మంత్రోచ్చారణ చేస్తే ఆ అపేక్షిత ఫలం ఉపలభ్యం కాదు సరికదా అందుకు భిన్నంగా యే స్వరోచ్చారణ చేశామో ఆ స్వరఫలిత మే లభిస్తుంది. ఈ ఫలితం సత్ఫలితమూ కావచ్చు- దుష్ఫలితమూ కావచ్చు- ఇందుకు ఉదాహరణగా "ఇంద్ర శత్రు వర్ధస్వ" అన్న తైత్తిరీయసంహితా మంత్రభాగాన్ని చిరకాలంగా అనేకమంది ఉదాహరించడం జరుగుతున్నది. దీనికి సంబంధించిన స్వరదోష విషయమూ తద్దోషఫలితంగా కలిగిన దుష్పరిణామవిషయకథా యిది. వృత్రాసురుడు ఇంద్రునిమీద అభిచారప్రయోగంచేసి అతని శక్తిని శమయింప జేయాలనే తలంపుతో "ఇంద్ర శత్రు వర్ధస్వ" అన్న మంత్ర భాగాన్ని ఉచ్చరించాడు. అసలు దీన్ని "ఇంద్రునియొక్క శత్రువును వృద్ధి పొందింపుము" అన్న అర్థం వచ్చేట్లు అంత్యంలో ఉదాత్తస్వరం ఉండేట్లుగా తత్పురుష సమాసంచేసి ఉచ్చరించాలి. ఇందుకు భిన్నంగా అంత్యోదాత్త స్వరం లేకుండా ఆదిలోనే ఉదాత్తస్వరాన్ని ఉంచి చదివితే అది తత్పురుష సమాసం కాకుండా బహువ్రీహి సమాసంగా మారి (శత్రువుగా యే ఇంద్రుడు ఉన్నాడో వాడిని) "శత్రువైన యింద్రుణ్ని వృద్ధి పొందింపుము" అనే అర్థం వస్తుంది. ఈ విధంగా పొరపాటుగా చదవడంవల్ల తన్నుతాను శపించుకున్నట్లయింది. ఇంద్ర నాశనాన్ని కోరి వృత్రాసురుడు చేసిన అభిచార ప్రయోగం యెదురు తిరిగి తన వాక్కే తనకు వ్యతిరేకంగా వజ్రమై వృత్రాసురుణ్ణి శమింపజేసింది. ఇక్కడ స్వరం మారడంవల్ల -ఉద్దిష్ట ఫలితాని కనుగుణంగా స్వరాన్ని ఉపయోగించక పోవడంవల్ల తద్భిన్నమైన ఫలిత మే- ప్రయుక్త స్వరానుగుణమైన దుష్ఫలిత మే సంప్రాప్తమయ్యింది కాని స్వరం మారడంవల్ల అసలు ఫలితం లేదనికాదు. ఎవరైనా తమ్ముతాము శమింపచేసుకోదలిస్తే వారు ఇంద్రునిపై శత్రుత్వం వహించి ఆదిలో ఉదాత్తస్వరాన్ని ఉంచి బహువ్రీహిసమాసంగా ఉచ్చరించితే ఆ ఉద్దిష్టమైన స్వశమయితాపూర్వకమైన ఆత్మ బలహీనతా ఫలిత మే సంభవిస్తుంది. కాగా మంచి చెడు ఫలితాలతో నిమిత్తం లేకుండా మంత్రఫలితాలన్నింటిపైనా ఆచరణ పూర్వకంగా పరిశోధనలు జరిపి వాటిని విశ్వశాంతికి లోకక్షేమానికి ఉపయోగించడంవల్ల వేదసార్థకత లభించగలదనడంలో సందేహం లేదు. అందువల్ల వేదమంత్రపఠనంలో స్వరవ్యవస్థ చాలా ప్రాధాన్యం వహిస్తున్నది. ఈ దృష్ట్యా పాణినిమహర్షి తన రచిన పాణినీయ శిక్షా గ్రంథంలో వేద మంత్రోచ్చారణకు సంబంధించిన స్వరచ్యుతను స్పష్టపరుస్తూ అయిదు శ్లోకాలు విరచించాడు.

సుతీర్థాదాగతం వ్యక్తం స్వామ్నాయం సువ్యవస్థితం।
సుస్వరేణ సువక్త్రేణ ప్రయుక్తం బ్రహ్మ రాజతే॥
మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధాత్॥
అనక్షరం హ్యనాయుష్యం విస్వరం వ్యాధిపీడితమ్।
అక్షతాశస్త్రరూపేణ వజ్రం పతతి మస్తకే॥
హస్తహీనం తు యోఽధీతే స్వరవర్ణవివర్జితమ్।
ఋగ్యజుస్సామభిర్దగ్ధో వియోనిమధిగచ్ఛతి॥
హస్తేన వేదం యోఽధీతే స్వరవర్ణార్థసంయుతమ్।
ఋగ్యజుస్సామభిః పూతో బ్రహ్మలోకే మహీయతే॥

(పాణినీయా శిక్షా - 51, 52, 53, 54, 55)

పాణిని వేదస్వరవ్యవస్థను దృష్టిలోపెట్టుకొని తనకు అత్యంత ప్రాచీనకాలంనుంచి సాంప్రదాయసిద్ధంగా వస్తున్న ఒక అపస్వరోచ్చారణా ఫలితమైన సంఘటనను ఉదాహరించి "మంత్రోహీనః"ఇత్యాది శ్లోకం విరచించాడు. ఈ పాణిని మహర్షి సాంప్రదాయసిద్ధంగా పేర్కొన్న విషయాన్నే దృష్టిలో పెట్టుకుని మహర్షి పతంజలి తన వ్యాకరణ మహాభాష్యంలో పస్పశాహ్నికంలోని శాస్త్రప్రయోజనాధికరణంలో యీ క్రింది విధంగా వివరించాడు.

దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్॥
ఇతి దుష్టాచ్ఛబ్దాన్మాప్రయుక్ష్మహీత్యధ్యేయం వ్యాకరణమ్॥

(వ్యాకరణ మహాభాష్యం – 1 అ – 1 పా – )

పతంజలి రచించిన యీ మహాభాష్యానికి కైయటుడు విరచించిన తన "ప్రదీప" వాఖ్యలో యీ క్రింది విధంగా మరింత వివరణ యిచ్చాడు.

—"దుష్టః శబ్ద ఇతి స్వరేణ-స్వరతః, ఆద్యాదిత్వాత్తసిః. మిథ్యాప్రయుక్త ఇతి. యదర్థప్రతిపాదనాయ ప్రయుక్తస్తతోఽర్థాంతరం స్వరవర్ణదోషాత్ ప్రతిపాదయన్నాభిమతమర్థమాహేత్యర్థః. వాగేవ వజ్రో హింసకత్వాత్. యథేన్ద్రశత్రుశబ్దః స్వరదోషాద్యజమానం హింసితవానిత్యర్థః. ఇంద్రస్యాభిచారో వృత్రేణారబ్ధస్తత్ర "ఇంద్రశత్రుర్వర్ధస్వ" ఇతి మంత్ర ఊహితః. తత్రేంద్రస్య శమయితా శాతయితా వా భవ-ఇతి క్రియాశబ్దోఽత్ర శత్రుశబ్ద ఆశ్రితో న తు రూఢిశబ్దః, తదాశ్రయణే హి బహుబ్రీహితత్పురుషయోరర్థాభేదః. తత్రేంద్రామిత్రత్వే సిద్ధే సతి "ఇంద్రస్య శత్రుర్భవ"ఇత్యర్థే ప్రతిపాద్యేఽన్తోదాత్తే ప్రయోక్తవ్య ఆద్యుదాత్త ఋత్విజా ప్రయుక్త ఇతి-అర్థాంతరాభిధానాదింద్ర ఏవ వృత్రస్య శాతయితా సంపన్నః, ఇంద్రశత్రుత్వస్య చ విధేయత్వాత్ సంబోధనవిభక్తేరనువాద్య విషయత్వాదిహాభావః. యథా-రాజా భవ యుధ్యస్వేతి. ఊహ్యమానస్యచామంత్రత్వాత్ "యజ్ఞకర్మణి" ఇతి జపాదిపర్యుదాసేన మంత్రాణామేకశ్రుతిర్విధీయమానానేహ భవతి."—

ఈ విషయాన్నే సాయణాచార్యులు కూడా

"స త్వష్టా గ్రహప్రవారసమయే ఇంద్రశత్రురితి పూర్వపదాదుదాత్తతయా ఇంద్రః శత్రుర్యస్యేతి

బహువ్రీహి సమాసం కృత్వా మంత్రం ప్రయుక్తవానత స్తమింద్రో జఘాన. యద్యసౌ అంతోదాత్తతయా తత్పురుష సమాసేన వా ఇంద్రస్య శత్రురితి వ్యస్తనిర్దేశేన వా బ్రూయాత్తదా నిశ్చితమేవ స ఇంద్రం హన్యాత్.''

అని వివరించాడు.

కైయటుడుగాని, పతంజలిగాని, పాణినిగాని తమకు అత్యంత ప్రాచీనకాలంనుంచీ సాంప్రదాయసిద్ధంగావస్తున్న స్వరాదివ్యవస్థను, దాని బహుముఖ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని యీ వివరణ పూర్వకమైన విశేషాల ప్రాకారేగాని వీటిని వీరెవ్వరూ ఆర్షవిజ్ఞానానికి భిన్నంగాగాని విరుద్ధంగాగాని ప్రకల్పనంచేసి వ్రాయలేదు. ఈ పద శుద్ధస్వరంగురించీ వృత్రాసుర "ఇన్ద్ర శత్రుర్వర్ధస్వ" మంత్ర విస్వర ఫలితంగురించీ మొట్టమొదట చెప్పినవాడు పాణిని మహర్షి కానేకాదు. ఈ విషయం ప్రాక్పాణినీయాలలో అనేక గ్రంథాలలో పేర్కొనబడిందే. సరిగ్గా యీ మంత్రంగురించే శతపథ బ్రాహ్మణంలో

''అథ యదబ్రవీత్ ఇంద్రశత్రుర్వర్ధస్వేతి తస్మాదు హైనమింద్ర ఏవ జఘాన. అథ యద్ధ శశ్వదవక్ష్యత్- ఇంద్రస్య శత్రుర్వర్ధస్వేతి శశ్వదుహ స ఇంద్రమేవాహనిష్యత్''

(శత - బ్రా — 1కా - 5ప్ర— 2 బ్రాహ్మణం)

అని పేర్కొనడం జరిగింది.

## బ్రాహ్మణారణ్యకాల కాలానికే కనుమరుగైన స్వరసార్థకత!

వేదస్వర శబ్దాదుల పరిశుద్ధత్వంగురించి ఋగ్వేదంలోని అష్టమ మండలంలోనే యీ క్రింది మూడు ఋక్కులలోనూ విస్పష్టంగా చెప్పడం జరిగింది.

ఏతో న్వింద్రం స్తవామ శుద్ధం శుద్ధేన సామ్నా।
శుద్ధైరుక్థైర్వావృధ్వాంసం శుద్ధ ఆశీర్వాన్ మమత్తు॥
ఇంద్ర శుద్ధో న ఆ గహి శుద్ధః శుద్ధాభిరూతిభిః।
శుద్ధో రయిం ని ధారయ శుద్ధో మమద్ధి సోమ్యః॥
ఇంద్ర శుద్ధో హి నో రయిం శుద్ధో రత్నాని దాశుషే।
శుద్ధో వృత్రాణి జిఘ్నసే శుద్ధో వాజం సిషాససి॥

(ఋ. 8 మండలం — 95 సూ— 7, 8, 9 ఋక్కులు)

"ఋక్కులు ఒక్క స్వరపరంగామాత్రమే కాక వర్ణశబ్దాదు లన్నింటిపరంగాకూడా సర్వతోముఖంగా పరిశుద్ధమై స్వచ్ఛంగా వుండాలి" అని వక్కాణించడమేకాక సామవేదంలోని ఋక్ స్వరాలు వర్ణ శబ్దాదులు మరింత స్వచ్ఛంగా పరిశుద్ధంగా ఉండాలని నిస్సందేహంగా పేర్కొనబడింది. వృత్రవధవల్లకలిగిన బ్రహ్మహత్యాపాపంతో అపవిత్రుడైన యింద్రుణ్ని అత్యంత శుద్ధమైన సామమంత్ర శబ్దస్వరశక్తులతో పరిశుద్ధునిగా చేయడం జరిగినట్లు "ఇన్ద్ర శుద్ధో హి" ఇత్యాది ఋక్కులలో తేటతెల్లం చేయబడింది.

స్వరం మారితే అర్థం మారుతుందనీ అభిలషిత శుభ సుఖ విజయ లాభ క్షేమంకరాలైన అర్థాలకు భావాలకు లక్ష్యాలకు వ్యాఘాతం కలుగుతుందనీ వేదర్షులు వేదవిజ్ఞానులు భావించారు. ఇక్కడ వున్న రహస్యమేమంటే కేవలం లోకక్షేమంకరాలు విశ్వశ్రేయస్కరాలు అయిన భావాలతోనే ఆయా శుభలాభలక్ష్యసిద్ధులను దృష్టిలో పెట్టుకొనిమాత్రమే తత్తత్ సిద్ధులను సాధించ ప్రసాదించ గల స్వరవ్యవస్థనుమాత్రమే పరిశుద్ధస్వరాలుగా మనవేదర్షులు భావించి — విశ్వవినాశకార్థకాలు — లోకక్షేమవిధ్వంసకార్థదాయకాలు అయిన వివిధవిషవిస్వరవ్యవస్థలను దుష్టస్వరవ్యవస్థలను గుర్తించిన మనమహర్షులు ఆ స్వరాలను దూరంగా ఉంచి వాటిజోలికి పోవలదని శాసించారు. దీనివల్ల స్వరం మారితే అర్థం మారదని వారభిప్రాయ పడినట్లు మనం భావించరాదు. స్వరం మారితే అర్థం మారుతుందనీ

నిర్దిష్టార్థం శుభంకరార్థం ఉపలభ్యంకాదనీ పైగా అనభ్యుదయకరమై అనభిలషితమైన ఆత్మవినాశకార్థంకూడా ప్రాప్తించవచ్చుననీ, మహర్షులు తేటతెల్లంచేశారు. అయితే కేవలం అనభ్యుదయకరమై దుష్టఫలప్రదంకాగల స్వరమంత్రవ్యవస్థ కావాలని కోరుకున్నప్పుడు ఆ దుష్ప్రయోగములుకూడా వేదాలనుంచి మనకు లభ్యమవుతాయని మహర్షులే తెలియజెప్పారు. అందువల్లనే అతిప్రాచీన కాలంలోనే మనమంత్ర శాస్త్రవ్యవస్థ నామమాత్రావశిష్టమై దుర్వ్యవస్థంకు అనాచార దురాచారాలకు సైతం ఆలవాలమై అభిచార క్రియలతో అనేకరకాలుగా వెర్రితలలు వేసి కుక్షింభరులు విరచిరువేసి ఏకరకాల విషఫలాలను విరగకాచింది. అందువల్ల మంత్రశబ్ద స్వరాదులన్నీ సర్వక్షేమంకరాలై శుభసుఖ ప్రదాలై సవ్యవ్యవస్థతో విలసిల్లాలని మహర్షులు వేదమంత్రాలలోనే నిర్దేశించడంలో యెంత విశ్వశ్రేయస్కరాలైన దృక్పథాలున్నాయో మనం గ్రహించవచ్చు.

బహుళార్థసాధకాలు – సాధనాలు అయిన వేద మంత్రస్వర సద్వ్యవస్థలపట్ల ఆర్షదృక్పథం అత్యంత ప్రాచీనకాలంలోనే కొన్ని వేలు లక్షల సంవత్సరాలకు పూర్వమే విలుప్తమై ప్రభ్రష్టమైపోయినందువల్ల ఏకైకమైన వేదాన్ని చతుర్విధాలుగా ఋగ్వేద - యజుర్వేద – సామవేద - అథర్వవేదాలుగా విభజించడంలోని ఆంతర్యాన్ని సైతం ప్రాచీన పండితలోకం గుర్తించలేకపోయింది. మొట్టమొదట వేదం ఏకైకమే అనడానికి ప్రత్యక్షసాక్షీభూతాలుగాఉన్నవి వివిధ వేదాలలో కనిపిస్తున్న ఏకైకస్వరూపంకల వేదమంత్రాలే. విభిన్న అర్థ దృక్పథాలలో విభిన్నశాస్త్ర విషయాలతో వేదాలు చతుర్విధాలుగా విభజింపబడ్డాయేగాని వేదకారణంతో కానేకాదు. ఒకేఒక ఋక్కు అటు ఋగ్వేదంలోనూ యిటు శుక్ల – కృష్ణ యజుర్వేదాలలోనూ – ఇంకా తదితరాలైన సామవేద – అథర్వవేదాలలోనూకూడా వుండ వచ్చును. అంతమాత్రంచేత ఆ ఋక్కుకు అన్ని వేదాలలోనూ ఒకే ఒక అర్థం వున్నదనీ వాటి నిర్దిష్టఫలితం ఒకటేననీ భావించడం వేద విభజన మూల సూత్రానికీ బహుముఖమైన వేద విజ్ఞానానికీ పూర్తిగావిరుద్ధమైన విషయం. ఈవిషయాన్ని అణుమాత్రమైనా గుర్తించ లేని ప్రాచీన పండిత ప్రతిపాదకమైన ఏకైకార్థ భావ ప్రతిపాదక భాష్య వ్యవస్థ వారి వేదవిజ్ఞాన అభిజ్ఞతకు ప్రత్యక్ష దాహాయణం వంటి చెరుగులేని చెరుపరాని చెరుపలేని చెరగబోని దురర్థభావవిద్యావశులే శాశ్వతచిహ్నం. ఈ సందర్భంలో మనం గుర్తించవలసిన అత్యంత ఆశ్చర్యకరమైన విషయ రహస్యం ఒకటున్నది. ఏదైనాసరే ఒకే ఒక్క ఋక్కు వివిధ వేదాలలో యథాతథంగా శబ్దమై వ్యవస్థల్లో యే విధమైనమార్పులేకుండానే ఉండవచ్చును. అయినా ఆ ఋక్కుకు చెప్పవలసిన ఋగ్వేదార్థంవేరు – శుక్లయజుర్వేదార్థంవేరు కృష్ణయజుర్వేదార్థం వేరు – సామవేదార్థం వేరు – అథర్వ వేదార్థం వేరు. విభిన్నశాఖలలోకూడా యీ విభిన్నార్థవ్యవస్థకు వేదవిజ్ఞాన పరంగా చెరుగులేని స్థానం వున్నది. యెప్పుడో బ్రాహ్మణారణ్యక ప్రాతిశాఖ్య గ్రంథాల అవతరణకు పూర్వమే యీ విభిన్నార్థ ఋగ్వ్యవస్థాజ్ఞానం వినాశమైపోయిందికాబట్టి యీ అనేకార్థకవ్యవస్థను వేదపండితలోకం గుర్తించకపోవడంలో ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. కాని "స్వరంమారితే అర్థంమారుతుంది. అభిలషితమైన సదర్థం లభించకపోగా దుష్పరిణామాలకు దుష్ఫలితాలకు చివరికి ఆత్మ వినాశనానికి సైతం దారితీయవచ్చును" అని సాంప్రదాయసిద్ధంగా అనుస్యూతంగా తరతరాలుగా బ్రాహ్మణ గ్రంథాలకు పూర్వ కాలంనుంచి అధ్యయనం చేస్తూ ప్రబోధం చేస్తూవచ్చిన వేదపండితలోకమే సామవేద మంత్ర స్వర గాన వ్యవస్థకు - తద్భిన్న వేద మంత్ర స్వర గాన వ్యవస్థకు ఉన్న భిన్నత్వాన్ని వైశిష్ట్యాన్ని గుర్తించలేకపోయిందంటే మనకు ఆశ్చర్యం కలుగకమానదు. ఈరూపంగా సామవేదస్వరసార్థకత యెన్నెన్నోలక్షల సంవత్సరాల కాలానికి పూర్వమే విలుప్తమైపోయిందంటే మరింతగా ఆశ్చర్యం కలుగక మానదు. బహుముఖమైన సామవేదస్వరసార్థకత యెంతగా వినాశనమైపోయిందో తెల్సుకొనడానికి ఉదాహరణగా ఒక ఋక్కును పేర్కొంటున్నాను.

అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే।

ని హోతా సత్సి బర్హిషి॥

(ఋగ్వేదం- 6 మండలం- 16 సూక్తం- 10 ఋక్కు)

ఈ పై శబ్ద స్వర వ్యవస్థతో ఉన్న ఋక్కుకు ఋగ్వేద భాష్యంలో సాయణాచార్యులు వ్రాసిన భాష్యం యిది.

"హే అగ్నే త్వమ్ ఆ యాహి ఆగచ్ఛ. కిమర్థమ్. వీతయే హవిషాం భక్షణార్థమ్. కించ హవ్యదాతయే హవ్యాని హవీంషి దేవేభ్యో దాతుమ్. గృణానః స్తూయమాన స్త్వం బర్హిషి ఆస్తీర్ణే దర్భే హోతా సన్ ని సత్సి నిషీద ఉపవిశ."

(ఋగ్వేద సాయణ భాష్యం)

"అగ్న ఆ యాహి" ఇత్యాదిగాగల యిదే ఋక్కు సామవేద కౌథుమ- జైమినిశాఖ లనబడిన వాటిల్లోనూ రాణాయణీయ శాఖ లోనూ యీక్రింది విధంగా వున్నది.

2 3 1 2 3 1 2 3 2 3 1 2
అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే।

1 2ర 3 1 2
ని హోతా సత్సి బర్హిషి॥

పై ఋక్కుకున్న స్వర చిహ్నాలు 1 ఉదాత్త చిహ్నం -2 స్వరిత చిహ్నం, 3 అనుదాత్త చిహ్నం. సామవేదంలో మామూలు ఉదాత్త స్వరిత అనుదాత్త స్వరాలకు తోడు "ప్రచయ" "సన్నతర" స్వరాలు మరి రెండు ఉన్నాయి. అంతేకాక ర, క, ఉ, అ, వంటి అక్షర చిహ్నాలుకూడా విశేష స్వర చిహ్నాలుగా ఉన్నాయి. ఇంకా విచిత్రమేమంటే ఉదాత్త చిహ్నంగా లోగడ పేర్కొన్నట్లు 1 సంఖ్యను కాక 2 సంఖ్యనుకూడా కొన్ని కొన్ని సందర్భాలలో ప్రాచీన కాలంలోనే వ్రాయడం జరిగింది. అనేక ఉదాత్త స్వరాలున్న ఆద్యంత్య స్వరాల మీద యెక్కడో ఒకచోట ఒకానొక చిహ్నం- అనేక స్వరిత స్వరాలున్నప్పుడు ప్రత్యేక స్థలాలలో ఒకానొక చిహ్నం- అదేవిధంగా అనేక అనుదాత్త స్వరాలున్నప్పుడు ఆద్యంత్య స్వర స్థానాలలో ప్రత్యేక సంఖ్యాక్షర చిహ్నాలు వ్రాయడంకూడా జరిగింది. ఇంకా విచిత్రమేమంటే ఉదాత్త చిహ్నం-స్వరితానికీ- అనుదాత్తనికి, స్వరిత చిహ్నం- ఉదాత్తనికి- అనుదాత్తనికి, అనుదాత్త చిహ్నం-ఉదాత్తానికి-స్వరితానికి, చిహ్నాలుగా సైతం ప్రత్యేక సంఖ్యాక్షరాలుగా ప్రాచీన కాలంలోనే పేర్కొనడం జరిగింది. ఒక నిర్దిష్ట స్వరవ్యవస్థ లేని యీ పరస్పర విరుద్ధాలైన క్రమకలవల్ల యేది ఉదాత్తమో యేది అనుదాత్తమో యేది స్వరితమో స్పష్టంగా చెప్పడానికి వీలులేని దుర్వ్యవస్థకు ప్రాచీనకాలంలోనే సామవేదం తావల మైపోయింది. స్వర వ్యవస్థ యింతగా కకావికలమయి పోయినప్పుడు స్వర వ్యవస్థపై ఆధారపడి చెప్పవలసిన అర్థం- "స్వరం మారితే అర్థం మారిపోతుంది" అన్న ఆర్ష సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకొనిమరీ భాష్య నిర్వచనం చేయవలసిన పరిస్థితిలో ఋగ్వేదంలోని ఋగర్థమే సామ వేదంలోనూ చెప్పితే అది స్వర సార్థకతను మటుమాయం చేసినట్లు కావడం లేదా? ఋగ్వేదంలోనూ సామ వేదంలోనూ ఉన్న ఋక్కులు రెండు వేదాలలోనూ ఏకార్థ దాయకాలే అయితే మామూలుగా అవి వేద మంత్రాలంటే సరిపోదా? అర్థ విభిన్నత్వం వైశిష్ట్యం లేనప్పుడు అంతా ఒకే ఒక వేదానికి చెందినవి అని చెప్తే సరిపోతుంది కదా! ప్రత్యేకించి ఋగ్వేద మంత్రమనీ సామవేద మంత్రమనీ నిర్దేశించవలసిన అవసరం లేదు కదా! అయినప్పుడు అర్థ భిన్నత్వం ఉన్నది కాబట్టే స్వర సార్థకత ఉన్నది కాబట్టే విభిన్న విశేష ఫల సార్థకత ఉన్నది కాబట్టే ఒకే ఒక ఋక్కును విభిన్న వేదాలలో పేర్కొన్నా భిన్న వేద మంత్రంగానే ప్రాచీనులు పరిగణించి భిన్న వేదంగా పేర్కొన్నారని భావించడం సత్య సమ్మతమూ సార్థకసన్నిహితమూ కాదా ? స్వరం మారితే అర్థం మారుతుందన్న దృష్టితో చూచినా "అగ్న ఆ యాహి" ఇత్యాది మంత్రానికి ఋగ్వేదంలోనూ సామవేదంలోనూ ఉన్న స్వర భిన్నత్వాన్ని పురస్కరించుకొని విభిన్నార్థాలు చెప్పవలసిన అవసరం వున్నది. కాని సాయణాచార్యులు మాత్రం మాటలు మార్చినా "అగ్న ఆ యాహి" ఇత్యాది ఋక్కుకు ఋగ్వేద భాష్యంలో యెటువంటి భాష్యం వ్రాశాడో సామవేద భాష్యంలోకూడా అటువంటి భాష్యాన్నే యీ క్రింది విధంగా వ్రాశాడు.

"హే అగ్నే అంగనాదిగుణవిశిష్ట త్వం ఆయాహి అస్మద్ యజ్ఞం ప్రత్యాగచ్ఛ. కిమర్థం ? వీతయే హవిషాం చరుపురోడాశాదీనాం భక్షణాయ."

(సాయణాచార్యకృత సామవేదభాష్యం)

విశిష్టవైశిష్ట్యమూ లేకుండా ఒకేఒక మంత్రాన్ని ఒకవంక ఋగ్వేదంగానూ మరోవంక సామవేదంగానూ పేర్కొనడం నిర్హే కాదా? లేనిపోని శ్రమ కాదా? ఉపలభ్యమానాలైన సామవేద కౌథుమ-జైమినీ రాణాయనీయ శాఖల్లో 1875 ఋక్కులు కనిపిస్తా వీటిల్లో దాదాపు 1840 ఋక్కులు ఋగ్వేద – యజుర్వేద – అథర్వవేదాల్లో ఉన్నవే. యీ ఋక్కులకు యే విశిష్టార్థపరిగ లేనప్పుడు వీటిని సామవేద మంత్రాలుగా పరిగణించవలసిన అవసరం లేనేలేదు. గానవ్యవస్థకు–ఆ గానవ్యవస్థకు మూలభూతమైన వ్యవస్థకు-ఈ రెండింటికీ మూలమై వివిధ రూపాలలో వికృతం పొందుతున్న పదస్వరూప స్వభావాలకు-విశిష్ట ప్రత్యేక ప్రపత్తి భూతంగా ఉండబట్టే వీటిని మన మహర్షులు ప్రత్యేకంగా పరిగణించి సామవేదంగా పేర్కొనడం జరిగింది. నిజం చెప్పాలంటే "అ ఆ యాహి" ఇత్యాది ఋగ్వేద మంత్రానికి సామవేదంలో స్వర మార్పుతో చెప్పవలసిన అర్థం వేరు. యీ అర్థం ఋగ్వేద ఋగర్థ నిస్సందేహంగా విభిన్నమైనది. విశిష్టమైనది. ఇంకా అంతరాంతరాలలోకి వెళ్ళి పరిశీలించి చెప్పాలంటే సామవేదసంహితకు భిన్నమైన ఇతర వేద సంహితలకు సంబంధం లేనేలేదు. సామవేదంలో ఋక్కులు గానాత్మకాలు. గానాత్మకత్వంతో స్వరవ్య యెంతో మార్పు చెందుతుంది. అంతేకాదు. కేవల స్వరపరంగానే కాక శాబ్దికంగా సైతం ఋక్కులు సామవేదంలో మార్పు చెందుతా కాగా ఇతర వేదాలలో ఉన్న ఋక్స్వరూపాలు సామవేదంలో యథాతథంగా ఉండనే ఉండవు. మామూలుగా ఋగ్యజురథర్వ వేదా కనిపించే సంహితాగతమైన ఋక్కు సామవేదంలో గానాత్మకత్వంతో వివిధ వికృతులకు లోనై సార్థకమైన విశిష్ట స్వర వ్యవస్థ ప్రత్యేక పదసంకలితమై విభిన్న సంహితా పాఠంగా-విభిన్నమైన ఋక్కుగా రూపొందుతుంది. ఈ దృష్ట్యా పైన ఉదాహరి "అగ్న ఆ యాహి" ఇత్యాది ఋక్కు ఋగ్వేదగతమైనదేగాని వాస్తవానికి సామవేదగతమైనది కానేకాదు. ఈ ఋక్కు సామవేద గానాత్మకత్వంతో కేవల స్వర వ్యవస్థలోనే కాక పదక్రమ స్వరూప స్వభావ విషయాలలో కూడా విలక్షణాలుగా మహర్షుల దృష్టి మార్పులను సంతరించుకొన్నది. "గోతమ" మహర్షి ప్రత్యక్ష పరిశోధనల దృష్టిలో "అగ్న ఆ యాహి" ఇత్యాదిగా గల ఋగ్ ఋక్కు రెండు విధాలుగా యీ క్రింది రూపాలలో పదక్రమ స్వర సార్థకతతో గానరూపం దాల్చింది.

4 2ర ర 1 2 1
(1)— ఓగ్నాఇ। ఆయా హీ3 వోఇ వోఈతోయా 2ఇ। తోయా 2ఇ।

1 ర ర2 1 1 1 2ర 1
గృణానో హ। వ్యదాతోయా 2ఇ। తోయా 2ఇః నా3 హో తా సా 2 3

3 1ర 3 3
త్సా 2ఇ। వా 2 3 4 ఔ హో వా ర్హి 2ఇ 4షి॥

1 4 4ర 4ర 4 4 ర ర 2 2 2
(2)— అగ్న ఆయా హి। వో 5 ఇ తయా ఇ గృణా నో హవ్య దా 1 తా 3 యే।

3 5 1 2 1 1
ని హోతా 2 3 4 సా। త్సా 2 3 4 ఇ వా। హో 2 3 3 4 ఇ షో 6 హాఇ॥

ఈ పై రెండు విధాలకు భిన్నంగా యీ "అగ్న ఆ యాహి" ఇత్యాది ఋక్కునే "కాశ్యప" మహర్షి యీ క్రింది సంహి స్వరరూపంగా వేరొక సార్థకతతో గానం చేశాడు.

4 5 4ర 5ర
(3)— అగ్న ఆయా హో। వో తయాఇ। గృణానో హవ్యదాతా

1ర ర 2 1 5
2 3 యా ఇ ని హోతా సత్సి బర్హా 2 3। ఇ షి।

1 3 5 ర 2 1 1 1 1
బర్హా2 ఇషా 1 3 4 ఔ హో వా। బర్హి। 3 షి 2 3 4 5 ॥

"అగ్న ఆ యాహి" ఇత్యాది ఋగ్వేద ఋక్కుకు అసలైన సామవేద స్వరరూప మంత్రాలే ఈ మూడు విధాలైన మంత్రాలు. వీటిలో యిద్దరు మహర్షుల మతాలలో - గౌతముని మతంలో ఒకేఒక మంత్రం రెండువిధాలుగానూ కాశ్యపుని మతంలో వేరొక విధంగానూ - మొత్తం మూడు విధాలైన రూపులు దాల్చింది. ఈ మూడింటిలోనూ వున్న విభిన్న శబ్దవ్యవస్థను స్వరవ్యవస్థను మనం తేలికగా గుర్తించవచ్చును. స్వరం మారితేనే అర్థం మారుతుందన్న ఆర్షవిజ్ఞానం దృష్టితో చూస్తే పదస్వరూపం మారినా అక్షరం మారినా అర్థం మారితీరుతుంది. వివిధాక్షర శబ్ద నిశ్శబ్ద శక్తుల ప్రభావాలు ఆ ప్రభావాల ఫలితాలు మారితీరుతాయి. అయినప్పుడు ఋగ్వేద మంత్ర ఫలితమూ సామ వేద మంత్ర ఫలితమూ - ఆ ఋక్కు ఒక్కటే అయినా - పఠనగానాలతో శబ్దస్వరాల వ్యవస్థ మారితీరుతుంది కాబట్టి - ఏకైకంగానే ఉంటుందని చెప్పడం వైపరీత్యం కాదా? ఆర్షేయ అధునాతన విజ్ఞానాలకే విరుద్ధం కాదా? సత్యవ్యవస్థకే విఘాతకం కాదా? ఈ స్వర శబ్ద సార్థక వ్యవస్థ యెప్పుడో బ్రాహ్మణాల కాలంనాటికే కకావికలై పోయి ప్రభ్రష్టమైపోయిన విషయం నగ్నసత్యం. ఈ నగ్న సత్యాన్ని బహుముఖ వేద విజ్ఞానాల వైశిష్ట్యాన్ని గుర్తించలేని ఒక్క సాయణాచార్యులే కాదు "దేవరాజయజ్వ, స్కందస్వామి, రామావ దేవ, శ్రీనివాస, మాధవదేవ, ఉవ్వటభట్ట, భాస్కరమిశ్ర, భరతస్వామి," ప్రభృతు లందరూ అప్రామాణికాలైన వివిధభాష్యాలను వ్రాసి సామవేద విజ్ఞానాన్ని సమాధి చేశారనే చెప్పవచ్చు. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ, ద్వితీయ సంపుటాలకు నేను వ్రాసిన పీఠికలలో వివరించినట్లు ఋగ్వేదం వివిధ సౌరమండలాల విజ్ఞానానికి సంబంధించింది కాగా శుక్ల-కృష్ణ యజుర్వేదాలు వివిధ చంద్రమండలాల విజ్ఞానానికి సంబంధించినవి. సౌరమండలాలూ, చంద్రమండలాలూ వాటి ననుసరించి వాటి పరిధుల్లో సంచరించే వివిధ గ్రహనక్షత్రాదులన్నీ కూడా కాలబద్ధమై సంచరించేవే. వాటి పరిభ్రమణంవల్ల కలిగే శబ్దశక్తులుకూడా (ధ్వని) కాలబద్ధమై అవతరించేవే. అందువల్లనే వివిధ సామవేద శాఖలు కాలబద్ధాలుగా గానాత్మకాలై అవతరించాయి. గానం తాళలయాత్మకం - తాళలయలు కాలబద్ధాలు. కాగా తాళలయ గానాత్మకత్వంతో వెలుగొందే సామవేదం వివిధ శబ్ద నిశ్శబ్ద శక్తుల స్వరూప పుంజాలతో ఖగోళకాల వ్యవస్థకు శాబ్దిక పదగానతాళలయ సంగీత వ్యవస్థకు ప్రతీకగా అవతరించింది. గానం కేవలం బాహిర శబ్ద పదాక్షర ధ్వన్యాత్మకం మాత్రమే కాదు. నిశ్శబ్దాత్మకం కూడా - శబ్దశక్తి కంటే నిశ్శబ్ద శక్తి మహాశక్తివంతమైనట్లు గానం కంటే మౌనగానం మహాశక్తివంతమైనది. గాన-మౌన గానాత్మకమైన యీ శబ్ద నిశ్శబ్ద శక్తుల విభిన్న ప్రభావాలగురించి శక్తులగురించి తుంబుర నారదాది మహర్షులు దివ్యజ్ఞానులై వేద విజ్ఞానులై మహత్తరమైన పరిశోధనలు ఆచరణ పూర్వకంగా చేశారు. ఈ పరిశోధనల ఫలితాలు సంప్రదాయ సిద్ధంగా మనకు ఉపలభ్యం కాకపోయినా సంగీతం మాత్రం కొంతవరకూ ఆనందదాయకంగా నిలిచి వున్నది. సంగీత రాగ నామ సార్థకత సైతం అతిప్రాచీనకాలంలోనే దాదాపు రూపుమాసిపోయిందనే చెప్పాలి. వేదాభ్యాసంతో పనిలేకుండానే అలవర్చుకొనడానికి వీలైన సంగీత విజ్ఞానం - నామసార్థకత వెల్లివిరిసే రాగశక్తి - ప్రజలకు దూరమైనప్పుడు వీటికి మూలమైన సామవేద స్వరగాన సార్థకత పండిత మండలికి దూరమైపోవడంలో విచిత్ర మేముంది? మన వేదర్షుల అడుగు జాడలలో బహుముఖాలుగా వేదవిజ్ఞానాలలో పరిశోధనలు చేసి నేను రచిస్తున్న "వేద వ్యాకరణం" లోని "సామ పరిచ్ఛేదం"లో వున్న "స్వర-గాన-ప్రకరణా''లలో యీ సామవేద స్వరగాన సార్థకతను పరమ వైజ్ఞానికంగా నిరూపించి పునరుద్ధరించడం జరిగింది. ఋగ్వేదం అష్టమ మండలంలోని ఋక్కుల్లో పేర్కొన్న శుద్ధ సామ-శుద్ధశబ్ద-శుద్ధ స్వరశక్తుల స్వరూప స్వభావాలను మాత్రమే కాదు. అశుద్ధసామ-అశుద్ధశబ్ద-అశుద్ధ స్వరశక్తుల స్వరూప స్వభావా లనుసైతం యీ నా "వేదవ్యాకరణం" లోని ''సామపరిచ్ఛేదం''లో వున్న ''స్వర-గాన-ప్రకరణా'' లలో వివరించడం జరిగింది. ఈ దృష్ట్యా వివిధ వేద విజ్ఞానాలతో పాటు సామవేద విజ్ఞానాన్ని సైతం వివిధ వికృతుల ఫల వివరణలతో స్వర సార్థకతతో సహా ప్రామాణికంగా నా ''వేదవ్యాకరణం''లో పునరుద్ధరించడం జరుగుతున్నది. బ్రాహ్మణాల కాలంనుంచి వేద స్వరాన్ని శుద్ధంగా చదవాలని ''గుడ్డెద్దు చేలో పడినట్లుగా'' అనుస్యూతంగా చెప్పుకొనడమే గాని వేద పద శబ్ద స్వర వ్యవస్థలను, వాటి శబ్ద నిశ్శబ్ద శక్తుల వ్యవస్థలను సరైన పద్ధతులలో గ్రహించి ఆచరణ పూర్వకంగా నిలబెట్టుకొనలేకపోవడంవల్లనే యితర వేద విజ్ఞానాలకంటే మరింతగా సామవేద విజ్ఞానం - సామ స్వర సార్థకతావిజ్ఞాన మహావృక్షం కూకటివేళ్ళతో సహా సర్వవిధాలా వినాశన మైపోయింది.

వేద వాఙ్మయంలో ఇంద్రుడు దేవతగా ఉన్న ఋక్కులు సహస్రాధికంగా ఉండడం విష్ణువుకు సంబంధించిన ఋక్కులు చాలా తక్కువగా ఉండడంవల్లకూడా వేద కాలంలోనూ వేదాలలోనూ ఇంద్రుని కున్నంత ప్రాధాన్యం విష్ణువుకు లేదని అనేకమంది విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఒక్క ఋగ్వేదంలోనే ఇంద్రుడు దేవతగా ఉన్న సూక్తాలు రెండు వందల నలభై యేడు ఉండగా -

ఇతర దేవతలతో కలిసి ఇంద్రుడు దేవతగా ఉన్న సూక్తాలు యాభైనాలుగువరకూ ఉన్నాయి. కాగా ఒక్క ఋగ్వేదంలోనే "ఇంద్రుడు" దేవతగావున్న ఋక్కులు మూడు వేలకు పైగా ఉన్నాయి. యజుర్వేదంలో అటు శుక్ల యజుర్వేదంలోనూ, ఇటు కృష్ణ యజుర్వేదంలోనూ కలిపి చూస్తే ఇంద్రుడు దేవతగా ఉన్న ఋక్కులు రెండువందల యాభై పైగా కనిపిస్తున్నాయి. సామ వేద శాఖలుగా భావించబడిన కౌథుమాది సామవేదగాన భాగాలలో కూడా ఇంద్రుడు దేవతగా ఉన్నవి అరవైమూడు ఋక్కులు పైగా కనిపించగా ఇతర దేవతలతో కలిసి ఇంద్రుడు దేవతగా ఉన్నవి పద్నాలుగువరకూ ఉన్నాయి. సామ వేద "వాంకార" శాఖలో సైతం ఇంద్రుడు దేవతగా ఉన్న ఋక్కులదే పైచేయిగా ఉన్నది. ఇంద్రుడు దేవతగా ఉన్న ఋక్కులు అత్యధికంగా ఉన్నంతమాత్రంచేత ఇంద్రుడు విష్ణువుకంటే గొప్పవాడని భావించడం జరిగిందంటే అది పూర్తిగా వేద విజ్ఞాన విదూరమైన విషయం. పైగా సత్య సమ్మత మైన విషయం అసలుకానే కాదు.

## ఇంద్రుడొక్కడేనా?

వాస్తవం చెప్పాలంటే విష్ణువుతో పోల్చడానికి యింద్రుడు అణుమాత్రమైనా సమర్థుడూ కాడు సమర్థుడూ కాడు. ఆర్ష విజ్ఞానం ప్రకారం పరిశీలించినా వేదశాస్త్ర పురాణవాఙ్మయాల నవలోడించినా అసలు ఇంద్రుడు అనేపేరుతో ఒక దేవుడున్నట్లే కనపడదు. ఇంద్రత్వ మనేది ఒక పదవి. అది స్వర్గాధిపత్యాన్ని యివ్వగల పదవి. ఈ స్వర్గలోకాధిపత్యాత్మకమైన ఇంద్రపదవిని బల శౌర్య పరాక్రమాల మీద ఆధారపడి యెవరైనా సంపాదించవచ్చునని "బలి చక్రవర్తి" కథవల్ల పురాణాల ద్వారా తెలుస్తున్నది. బలి చక్రవర్తి తన బల శౌర్య పరాక్రమాలతో ఇంద్రుణ్ని స్వర్గాధిపత్యంనుంచి దూరం చేసి ఆ అధిపత్యాన్ని తన హస్తగతం చేసుకొన్న విషయం పురాణజ్ఞులకు సువిదితం. హిరాణ్యాక్ష- హిరణ్యకశ్యప - రావణాసురాదులనేకులు స్వర్గాధిపత్యంకోసం అప్పటి ఇంద్రునిమీద యుద్ధాలు చేసిన విషయంకూడా పురాణాలవల్లనే విదిత మవుతున్నది. శతయజ్ఞాలు చేసిన వాడెవడైనా స్వర్గాధిపత్యాన్ని వహించి ఇంద్రుడు కాగలడని పురాణాలలో సుప్రసిద్ధంగాఉన్న "నహుషుని" కథ చెప్పక చెబుతున్నది. పురాణాలవల్ల శతక్రతువులు చేసి స్వర్గాధిపత్యం వహించినవాడు ఒక్క నహుషుడని మాత్రమే మనకు తెలుస్తున్నది. కాని వేద విజ్ఞానం ప్రారంభమైనతర్వాత ఈ అనేక కోట్ల సంవత్సరాలలో ఎంతమంది మహానుభావులు శతక్రతువులు చేశారో మనకు ఊహకైనా అందని విషయం. కొంత కాలం ఇంద్రపదవి నధిష్టించినవారిలో ప్రహ్లాదుడు- బలి కూడా ఉన్నారు.

ఆర్ష విజ్ఞాన ప్రకారం, ఖగోళ శాస్త్ర పురాణాదుల ప్రకారం మనకు స్వాయంభు- స్వారోచిష- ఉత్తమ- తామస- రైవత- చాక్షుష-వైవస్వత-సూర్య సావర్ణిక- దక్ష సావర్ణిక-బ్రహ్మ సావర్ణిక-రుద్ర సావర్ణిక- ధర్మ సావర్ణిక-రౌచ్య-భౌచ్య- నామకాలైన పద్నాలుగు మన్వంతరాలున్నాయి. మన్వంతరానికి మానవ కాలమానం ప్రకారం 30 కోట్ల 67 లక్షల 20 వేల సంవత్సరాలు. మన ఖగోళాదిశాస్త్రాల ప్రకారం చూస్తే ప్రతి మన్వంతరానికి అంటే ప్రతి 30,67, 20, 000 సంవత్సరాలకూ ఇంద్రుడు ఖచ్చితంగా మారిపోతాడు. "స్వాయంభువ" మన్వంతరంలో "రోచనుడు" అనేవాడు ఇంద్రుడు. "స్వారోచిష" మన్వంతరంలో "విపశ్చితుడు" అనేపేరుగలవాడు ఇంద్రుడు- "ఉత్తమ" మన్వంతరంలో కేనోపనిషత్తు ననుసరించి "సుశాంతు" డనేవాడు ఇంద్రుడు. ఇదే మన్వంతరంలో మహాభారతం ప్రకారం "సత్యజిత్తు" అనబడేవాడు ఇంద్రుడు. "తామస" మన్వంతరంలో మామూలు శిబి చక్రవర్తి కాడు "ప్రశకు" డయిన "శిబి" అనే పేరు కలవాడు ఇంద్రుడు. "రైవత" మన్వంతరంలో "విభు" డనే పేరుగలవాడు ఇంద్రుడు. "చాక్షుష" మన్వతరంలో "మనోజవుడనే పేరుగలవాడు ఇంద్రుడు. "వైవస్వత" మన్వతరంలో "ఓజస్వి" అనే పేరుగలవాడు ఇంద్రుడు. "సూర్య సావర్ణిక" మన్వంతరంలో "బలి" అనే పేరుగల వాడు ఇంద్రుడు. "దక్ష సావర్ణిక" మన్వంతరంలో "కుమారస్వామి" "అద్భుతు" డన్న పేరుతో ఇంద్రుడు. "రుద్ర సావర్ణిక" మన్వంతరంలో "ఋతధాము" డనే పేరుగలవాడు ఇంద్రుడు. "రౌచ్య" మన్వంతరంలో "బృహస్పతి" అనేపేరుగలవాడు ఇంద్రుడు. ఇంకా "బ్రహ్మ సావర్ణిక - ధర్మ సావర్ణిక-భౌచ్య" నామకాలైన మూడు మన్వంతరాలలోనూ ఇంద్ర పదవి నధిష్టించే వారిపేరు లేమిటో పరిశోధించి తెలిసికొనవలసిన అవసరం ఉన్నది.

అంతేకాదు. లభ్యమానమైన వేదవాఙ్మయాన్ని పరిశోధిస్తే "త్రైలోక్యాత్మ" డైన ఇంద్రు డొకడు – "విశ్వకర్మ" అయిన ఇంద్రు డొకడు– ఉన్నట్లు తెలుస్తున్నది. ఇంకా చెప్పాలంటే అసలు శ్రీమహావిష్ణువుకు నివాస స్థానమైన వైకుంఠమే నివాసంగా కలిగిన "ఇంద్రుడు" మరొకడు ఉన్నట్లు కూడా తెలుస్తున్నది.

## త్రైలోక్యాత్మేంద్రుడు

సామవేద కౌథుమ-జైమిని-రాణాయనీయ శాఖల గానభాగాలలో పేర్కొనబడిన 641, 642, 643, 644, 645, 646, 647, 648, 649, 650, ఋక్కులకు "దేవతా ఇంద్రస్త్రైలోక్యాత్మా" అని పేర్కొనడం జరిగింది. ఆ ఋక్కులివి.

దేవతా — ఇన్ద్రస్త్రైలోకాత్మా

విదా మఘవన్ విదా గాతు మనుశం సిషో దిశః ।
శిక్షా శచీనాం పతే పూర్వీణాం పురూవసో ॥

అభీష్ట్వమభిష్టిభిః స్వా౽౩న్నాంశుః ।
ప్రచేతన ప్రచేతయేన్ద్ర ద్యుమ్నాయ న ఇషే ॥

ఏవా హి శక్రో రాయే వాజాయ వజ్రివః ।
శవిష్ఠ వజ్రిన్నృఞ్జసే మంహిష్ఠ వజ్రిన్నృఞ్జసే ।
ఆ యాహి పిబ మత్స్వ ॥

విదా రాయే సువీర్యం భవో వాజానాం పతిర్వశాగ్ం అను ।
మంహిష్ఠ వజ్రిన్నృజసే యః శవిష్ఠః శూరాణామ్ ॥

యో మంహిష్ఠో మఘోనామంశుర్న శోచిః ।
చికిత్వో అభి నో నయేన్ద్రో విదే తము స్తుహి ॥

ఈశే హి శక్రస్తమూతయే హవామహే జేతారమపరాజితమ్॥
స నః స్వర్షదతి ద్విషః క్రతుశ్ఛన్ద ఋతం బృహత్॥

ఇన్ద్రం ధనస్య సాతయే హవామహే జేతారమపరాజితమ్।
స నః సర్షదతి దిషః స నః స్వర్షదతి ద్విషః ॥

పూర్వస్య యత్తే అద్రివో౽ంశుమదాయ ।
సుమ్న ఆ ధేహీ నో వసోపూర్తిః శవిష్ఠ శస్యతే ।
వశీ హి శక్రో నూనం తన్నవ్యం సన్యసే ॥

ప్రభో జనస్య వృత్రహన్త్సమర్యేషు బ్రవావహై ।
శూరో యో గోషు గచ్ఛతి సఖా సుశవా అద్వయః ॥

ఏవాహ్యే ౨౩౨౩౨౩ వ । ఏవాం హ్యగ్నే ।
ఏవాహీన్ద్ర । ఏవా హి పూషన్ । ఏవా హి దేవాః ॥

(చూడు : సామవేద వాంకారశాఖ :
"వాఙ్మయ మహర్ద్యుతుని సామవేద విశ్వరూప ప్రదర్శన :
253-254-255 పేజీలు. )

## విశ్వకర్మేంద్రుడు

శుక్లయజుర్వేదంలో "విశ్వకర్మేంద్రు" డని ప్రత్యేకంగా ఒక ఇంద్రుడు ఈ క్రింది మంత్రానికి దేవతగా ఉన్నట్లు పేర్కొనడం జరిగింది.

దేవతా — విశ్వకర్మేంద్రః

విశ్వకర్మన్ హవిషా వర్ధనేన త్రాతర మిన్ద్రి మకృణో రవధ్యమ్ ।
తస్మై విశః సమనమన్త పూర్వీ రయ ముగ్రో విహవ్యో యథాసత్ ।
ఉపయామ గృహీతో౽సీన్ద్రాయత్వా విశ్వకర్మణ ఏష తే యోనిరిన్ద్రాయత్వా విశ్వకర్మణే॥

(శు. యజు. అధ్యా 8. మంత్రం. 46)

## వైకుంఠేంద్రుడు

ఋగ్వేదంలో ప్రత్యేకించి యెనిమిది ఋక్కులలు వైకుంఠ వాసియైన ఇంద్రుడు దేవతగా ఉన్నట్లు విస్పష్టంగా పేర్కొనడం జరిగింది. వికుంఠ అనే స్త్రీకి ఇంద్రుడే పుత్రుడై పుట్టినందువల్ల వైకుంఠేంద్రు డనబడ్డాడన్న పురాణాల కథ వాస్తవం కాదు. ఆ "వైకుంఠేంద్రుడు" దేవతగా ఉన్న ఋగ్వేదంలోని ఋక్కులు ఈ క్రింద ఉదాహరించడం జరుగుతున్నది. ఈ ఋక్కులకు "సప్త గురాంగిరసుడు" ఋషి.

దేవతా — వైకుంఠ ఇన్ద్రః

జగృభ్మాతే దక్షిణ మిన్ద్రహస్తం, వసూయవో వసువతే వసూనామ్।
విద్మాహిత్వా గోపతిం శూరగోనా, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 1.

స్వాయుధం స్వవసం సునీథం, చతుః సముద్రం ధరుణం రయీణామ్ ।
చర్కృత్యం శంస్యం భూరివార, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 2.

సుబ్రహ్మాణం దేవవన్తం బృహన్త, మురుం గభీరం పృథుబుధ్న మిన్ద్ర ।
శ్రుత ఋషిముగ్రమభిమాతిషాహ, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 3.

సనధ్వాజం విప్రవీరం తరుత్రం, ధనస్పృతం శూశువాం సంసుదక్షమ్ ।
దస్యుహనం పూర్భిదమిన్ద్ర సత్య, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 4.

అశ్వావన్తం రథినం వీరవన్తం, సహస్రిణం శతినం వాజమిన్ద్ర ।
భద్రవ్రాతం విప్రవీరం స్వర్షా, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 5.

ప్రసప్తగుమృతధీ తిం సుమేధాం, బృహస్పతిం మతిరచ్ఛా జిగాతి ।
య ఆఙ్గిరసో నమసో పసద్యో, ౭ స్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 6.

వనీవానో మమ దూతాస ఇన్ద్రం, స్తోమాశ్చరన్తి సుమతీ రియానాః ।
హృదిస్పృశో మనసా వచ్యమానా, అస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 7.

యత్ త్వాయామీ దద్ధి తన్న ఇన్ద్ర, బృహన్తం క్షయమసమం జనానామ్।
అభిదత్ ద్యావాపృథివీ గృణీతా, మస్మభ్యం చిత్రం వృషణం రయిందాః ॥ 8.

(ఋగ్వే. మం 10, సూ 47,)

ఇదే విధంగా సామవేద కౌథుమ జైమిన్యాది గానభాగాలలో ఉన్న పూర్వసంహితలో సైతం ఒక ఋక్కుకు వైకుంఠేంద్రుడు దేవతగా ఉన్నట్లు పేర్కొనడం జరిగింది. ఆ ఋక్కు యిది.

దేవతా — ఇంద్రో వైకుంఠః

జగృహ్మాతే దక్షిణ మింద్ర, హస్తం వసూయవో వసుపతే వసూనామ్ ।

విద్మాహిత్వా గోపతిగ్ం శూరగోనామస్మభ్యం, చిత్ర(త్రం-పా) వృషణగ్ం రయిందాః ॥

(సా-పూ, సం-4 ప్ర-3ద-5 ఋక్కు.)

ఋగ్వేద, వివిధ సామవేద గానభాగాలలో కొన్ని ఋక్కులకు వైకుంఠవాసి యైన ఇంద్రుడు దేవతగా పేర్కొనబడడం చూడగా వైకుంఠవాసియై వైకుంఠాధిదేవుడైన ఆ శ్రీమహావిష్ణువుకు నిత్య ఆశ్రితుడుగా నిత్య సన్నిహితుడుగా ఇంద్రు డుండడంవల్లనే శ్రీమహావిష్ణువుకు అసలు "ఉపేంద్రు" డనే పేరు సార్థకంగా యేర్పడిందేమో ననిపిస్తున్నది.

ఇంద్రులలో మామూలు ఇంద్రుడే కాక త్రైలోక్యాత్మేంద్రుడు - విశ్వకర్మేంద్రుడు — వైకుంఠేంద్రుడు — మాత్రమేకాక పధ్నాలుగు మన్వంతరాలలోనూ ఒక్కొక్క మన్వంతరానికి ప్రత్యేకంగా వేరు వేరు ఇంద్రు లున్నట్లు గతంలోనే ఒకసారి పేర్కొనడం జరిగింది. తమ మహత్తరమైన బలపరాక్రమాలతో అప్పటికి ఉన్న ఇంద్రుణ్ణి పారద్రోలి స్వర్గాధిపత్యాన్ని వహించి ఇంద్రత్వాన్ని పొందిన "బలి" చక్రవర్తి వంటి వారు యెందరున్నారో మనకు తెలియదు. అసలు వంద యజ్ఞాలు చేసినవ్యక్తి ఇంద్రపీఠాన్ని అధిరోహిస్తాడని పురాణాలలోని "నహుష"ని కథవల్ల స్పష్టపడుతున్నట్లు గతంలోనే గ్రహించాము. "నహుషని" వలె శతక్రతువులు జరిపి యెంతమంది ఇంద్రత్వాన్ని చేబట్టారో ఎవరూ చెప్పలేరు. ఈ పరిస్థితిలో ఋగ్వేదంలోగాని యజుర్వేద సామవేదాలలోగాని ఇంద్రుడు దేవతగా ఉండి వేలాదిగా వున్న ఋక్కులన్నీ కేవలం ఒకే ఒక ఇంద్రునకు సంబంధించినవని ఖచ్చితంగా చెప్పే అధికారం యెవరికీ ఉండదు. ఒక్క ఋగ్వేదంలోనే 325 సూక్తాలలో ఇంద్రాధిదైవతత్వం స్పష్టంగా కనిపిస్తున్నది. ఆయా సూక్తాలుకాని ఋక్కులు కాని యే యే ఇంద్రుణ్ని ఉద్దేశించి ఆవిష్కృతా లయ్యాయో సప్రామాణికంగా వివరించాలంటే ఆర్ష విజ్ఞానంలో అగాధమైన పరిశోధన జరపవలసి ఉన్నది. ఆయా సూక్తోక్తులైన యింద్రు లందరూ ఒకే ఒక్క యింద్రుణ్ణి నిర్దేశిస్తారని చెప్పడానికి వీలు లేదు. మామూలుగా "నామలింగానుశాసన" నామక అమరకోశాది లౌకిక సంస్కృతభాషానిఘంటువులలో యింద్రునికి పర్యాయపదాలుగా పేర్కొనబడిన ఇంద్ర-మరుత్వ-మఘవ-బిడౌజ-పాకశాసన-వృద్ధశ్రవ-శునాసీర-పురుహూత-పురంధర-జిష్ణు-లేఖర్షభ-శక్ర-శతమన్యు దివస్పతి-సుత్రామ-గోత్రభిత్-వజ్రి-వాసవ-వృత్రహ-వృష-వాస్తోష్పతి-సురపతి-బలారాతి-శచీపతి-జంభభేది-హరిప్రియ - స్వారాట్ నముచిసూదన-సంక్రందన-దుశ్చ్యవన-తురాషాట్-పులోమజిత్-వంటి పదాలన్నీ ఏకైక ఇంద్ర వాచకాలని చెప్పడానికి ఆర్షవిజ్ఞాన దృష్ట్యా అవకాశాలు తక్కువగా కనిపిస్తున్నాయి. వేదాలలోనే కొన్ని ఋక్కులకు "ఇంద్రుడు" దేవతగా పేర్కొనబడగా మరికొన్ని ఋక్కులకు "మహేంద్రుడు" దేవతగానూ వేరే కొన్ని ఋక్కులకు "వాసవుడు" దేవతగానూ పేర్కొనడం జరిగింది. వీటిల్లో ఆర్షవిజ్ఞాన దృష్ట్యా విభిన్న ధృక్పథం లేకపోతే వీరు విభిన్నేంద్రు లన్న అభిప్రాయమే లేకపోతే ఈ విధంగా వేరు వేరు నామాలతో ఇంద్రుణ్ని పేర్కొనడం జరిగివుండేదే కాదు. దీనికితోడు కొన్ని ఋక్కులకు ప్రత్యేక విశిష్టత కల దేవతలుగా పేర్కొనబడిన మరుత్కేంద్రుడు — త్రైలోక్యాత్మేంద్రుడు — విశ్వకర్మేంద్రుడు — వైకుంఠేంద్రుడు వేరువేరు ఇంద్రులుగా నిర్వివాదంగా ఉండనే ఉన్నారు. అంతేకాదు. ఇంద్రునికి సహస్రాక్షు డనే నామాంతరం ఉన్నట్లు అనేక లౌకిక సంస్కృత గ్రంథాలవల్ల మనకు తేటతెల్లమవుతుంది. కాని ఇంద్రత్వా న్నధిరోహించిన ప్రతివాడూ సహస్రాక్షు డవుతా డనుకొనడం పొరపాటే కాగలదు. † "నహుషుడు" శతక్రతువులు చేసి కొంతకాలమైనా ఇంద్రపదవిలో ఉన్నాడు. అతడు సహస్రాక్షుడు కానే కాడు. "బలి చక్రవర్తి" కూడా తన బలపరాక్రమాలతో కొంతకాలం "ఇంద్ర" పదవి నధిరోహించాడు. ఈ "బలి" కూడా సహస్రాక్షుడు కానే కాడు.

---

† మానవదేహంమీద ఉన్న చర్మచక్షువులను (శరీరంమీది సూక్ష్మరంధ్రాలను) పురస్కరించుకొని ప్రతిమానవుడూ సహస్రాక్షు డవుతాడనే విషయం వేరు. ఇది అస్వేదగాత్రులైన దేవతల విషయమై వర్తించదు.

ప్రత్యక్షుడుకూడా అంతే. కాగా "ఇంద్రి" శబ్ద పర్యాయ పదాలుగా లౌకిక సంస్కృత వాఙ్మయంలో చలామణీ అవుతున్నా యీ శబ్దా లన్నీ ఏకైక ఇంద్రవాచకాలుగా తీసుకోవడం ప్రామాణికం కానేరదు. ఈ శబ్దాలన్నీ చాలావరకూ విభిన్నులైన ఇంద్రులను సూచించేవిగా కనిపిస్తున్నవి. అయితే ఈ ఇంద్రు లందరిగురించీ ఇదమిత్థమని సాధికారికంగా తేల్చి చెప్పాలంటే విభిన్నాలైన వివిధ వేద శాఖ లన్నింటినీ మనకు ఉపలభ్యమానాలైన వాటిని పరిశోధించి తీరాలి. వేదా లన్నింటినీ పరిశీలించకుండా విభిన్నులైన ఇంద్రులగురించి పట్టించుకోకుండా ఇంద్రు డేకైకుడే నని పేర్కొనడం సాహసమే కాగలదు.

అయితే "ఇంద్రుడు" దేవతగా ఉన్నట్లుగానే "ఇంద్రు" డనే పేరుతో ఒక వేదర్షి కూడా ఉన్నాడు. పైగా ఋగ్వేదం పదవ మండలం ముప్పై యెనిమిదవ సూక్తంలోని అయిదవ ఋక్కుకు ఋషిగా "ముష్కవాన్ ఇంద్రః" అనికొందరు పేర్కొనడం జరిగింది. ఈ ముష్కరేంద్రుడు ఒక దేవతగా భావించినవారూ కొంద రున్నారు. ఋగ్వేదం పదవ మండలంలోని నలభై యేడవ సూక్తానికి "సప్తగురాంగిరసుడు" మహర్షిగానూ "వైకుంఠేంద్రుడు" దేవతగానూ స్పష్టంగా పేర్కొనడం జరిగింది. ఈ పదవ మండలంలోనే నలభై యేడవ సూక్తానికి తరువాతి సూక్తాలైన నలభై యెనిమిది, నలభై తొమ్మిది, యాభై యవ, సూక్తాలకు "వైకుంఠేంద్రుడు'' మహర్షి గానూ, "ఇంద్రుడు'' దేవతగానూ పేర్కొనడం జరిగింది. దీనివల్ల దేవతలపేర్లు ఋషులకు సైతం ఉన్నట్లు మనకు దృఢంగా స్పష్ట మవుతున్నది. మామూలుగా మానవులలో స్త్రీ పురుషులకు స్త్రీ పురుష దేవతలపేర్లు పెట్టుకునే సంప్రదాయం పురాణాలకాలంనుంచి మాత్రమే యేర్పడలేదనీ అసలు లౌకిక సంస్కృత వాఙ్మయ ఆవిర్భావ కాలంనుంచే ఏర్పడలేదనీ అంతకు చాలా పూర్వకాలంనుంచే వేదర్షుల కాలంనుంచే ఈ సంప్రదాయం ఉన్నదనీ, వేదర్షులు కూడా దేవతలపేర్లు పెట్టుకున్నారనీ, మనం ఆర్షవాఙ్మయందృష్ట్యా సాధికారికంగా పరిగ్రహించవలసి ఉన్నది.

ఇంతకూ అసలు చెప్పవలసిం దేమిటంటే "ఇంద్రు"డనేవాడు ఏకైకుడు కానేకాడనీ, విభిన్న ఇంద్రులు యిరవై మందికి పైగా ఉన్నారనీ, మనకు సాధికారికంగా నిరూపణ అవుతున్నప్పుడు పైగా శతక్రతువులద్వారానో-బలపరాక్రమాలద్వారానో ఇంద్ర పదవి నధిరోహించినవా రెంతమంది ఉన్నారో చెప్పలేనప్పుడు ఇంద్రుణ్ణి విష్ణువుకంటే గొప్పవానిగా వేదాలు పేర్కొన్నాయనడం కేవలం పొరపాటే కాగలదని మాత్రమే. వాస్తవానికి ఇంద్రుడు స్వర్గాధిపతి కావచ్చును. కాని మామూలుగా సామాన్యులైన విభిన్నులైన తదితర యే దేవతలకూ లేని పరిమిత వ్యవస్థ- ఆధికారిక వ్యవస్థ ఇంద్రునికున్నది. ఇంద్రుడు స్వర్గలోక వాసుల కధిపతే అయినా ఆ స్వర్గలోకవాసుల కున్నంత స్థిరత్వం ఇంద్రునికిమాత్రం లేదు. ముష్కరుడైన ఇంద్రు డొకడున్నట్లు కొందరు భావించారని యింతకు ముందు పేర్కొనడం జరిగింది. ఈ ముష్కరేంద్రుణ్ణిగురించి చెప్పిన వేదమంత్రం యిది.

స్వవృజం హిత్వా సుహమింద్ర శుశ్రవానానుదం వృషభ రధ్రచోదనం।
ప్రముంచస్వపరి కుత్సాదిహాగహికిముత్వా వాన్ముష్కయోర్బద్ధ ఆసతే ॥

(ఋ-10, మం-38 సూ-5 ఋక్కు)

ఇంద్రు లనేకమంది ఉన్నారనీ, వారిలో అతిదుష్టుడైన ముష్కరేంద్రు డొకడున్నాడనీ, తెలియనివారు "రకరకాల ఈర్ష్యా ద్వేషాలూ దుష్టత్వాలూ నీచత్వాలూ గూడుకట్టిన ఇంద్రుడు అసలైన యింద్రుడే" అని ప్రాచీన కాలంనుంచీ పొరపాటున అనేక మంది భావించడం జరిగింది. "ఇంద్రుడు పచ్చితాగుబోతు. పచ్చివ్యభిచారి. కేవలం ఈర్ష్యాద్వేషాలుకల అసూయాపరుడు. అంతటి స్వార్థపరుడూ పిరికివాడూ దేవతలలో ఇంకొకడు లేడు. దేవతలలో ఉండవలసిన సుగుణం ఒక్కటి కూడా ఇంద్రునిలో కలికానికైనా కనపడదు. మహర్షుల తపస్సును చెడగొట్టడానికై దేవవేశ్యలను పురికొల్పి పంపి ఉపయోగించే నీచుడు. తాను దుర్బలుడైనప్పుడూ, శత్రువులతోటి యుద్ధంలో అసమర్థుడై ఓటమినియెదుర్కొనవలసిన పరిస్థితి వచ్చినప్పుడూ మహావిష్ణువును ఆశ్రయిస్తాడు".అనిఅనడానికి వీలుగా బహుముఖమైన అతని నీచత్వాన్నీ దుర్మార్గత్వాన్నీ వర్ణించే రక రకాల కథలూ, గాథలూ, సంఘటనలూ, అనేక రామాయణ మహాభారత భాగవతాది గ్రంథా లలోనూ, అష్టాదశపురాణాలలోనూ ఉపపురాణాలలోనూ, వర్ణించడం జరిగింది. ఈ దుష్టకథలన్నీ దుష్టేంద్రు లైన ముష్కరేంద్రుని వంటి వారికి సంబంధించినవే నని గుర్తించని పురాణ కర్తలు దేవతలలో ఒక విశిష్టుడుగానూ, అనంత అసాధారణ శక్తియుక్తులుగల దేవుడు

గానూ త్రిమూర్తులకు తరువాతివాడుగానూ వర్ణించిన వేదోపనిషత్తుల వాక్యాలను వాటి అంతర్యాన్ని సూచనామాత్రంగానైనా గ్రహించలేక పోయారు. బహుముఖమైన వేద ఖగోళ విజ్ఞానాన్ని గుర్తించలేని పురాణ కర్తలు యింద్రాదులకు సంబంధించిన లోక క్షేమంకరాలైన విజ్ఞాన విషయాలను, దుష్ట ముష్కరేంద్రులకు సంబంధించిన అజ్ఞాన విషయాలను, కలగాపులగంచేసి కొన్ని కొన్ని కాకమ్మ కథలను అవకతవకలతో రూపొందించడం జరిగింది. అసలైన యింద్రుణ్ని గురించి వృష్టిప్రదుడూ నిత్యతరుణుడూ అనవనతుడూ అయిన ఆ ఇంద్రుణ్ని గురించి ఋగ్వేదంలో అష్టమమండలంలోని అనేక సూక్తాలలో వివిధ ఋక్కులలో వర్ణించడం జరిగింది. సర్వ వ్యాపి అయిన ఇంద్రస్థానంగురించి తెలిసికొనడం అంత సులభం కాదని ఋగ్వేద అష్టమమండలంలోని ఈ క్రింది రెండు ఋక్కులలో గుహ్యాతిగుహ్యంగా పేర్కొనడం జరిగింది.

క్వఽస్య వృషభో యువా తువిగ్రీవో అనానతః।
బ్రహ్మా కస్తం సపర్యతి॥ (7)
కస్య స్విత్ సవనం వృషా జుజుష్వాగ్ం అవ గచ్ఛతి।
ఇన్ద్రం క ఉ స్విదా చకే॥ (8)

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత, తృతీయ సంపుటం, 8 మండలం, 64 సూక్తం, పేజీ 836)

అంతే కాదు. ఇంద్రుణ్ని చూడడం అంత సులభమైన విషయం కాదనీ, ఇంద్రు డొక్కడే అని పేర్కొనడంకూడా వాస్తవం కాదనీ, ఇంద్రు లనేకమంది ఉన్నారనీ, అష్టమ మండలంలోనే యీక్రింది ఋక్కులో స్పష్టపరచడం జరిగింది.

ప్ర సు స్తోమం భరత వాజయన్త ఇన్ద్రాయ సత్యం యది సత్యమస్తి ।
నేన్ద్రో అస్తీతి నేమ ఉ త్వ ఆహ క ఈం దదర్శ కమభిష్టవామ ॥
(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత-తృతీయ సంపుటం, 8 మండలం, 100 సూక్తం-3 ఋక్కు-పేజీ 1014)

సాయణ భాష్యం మీద ఆధారపడి శ్రీనేమానివారు స్వవచనవ్యాఘాతాలతో కూడిన (1017 పేజీ,1471 గద్యం) అనువాదం చేశారే కాని ఇందులో భార్గవనేముని ఇంద్రత్వ ప్రసక్తికి అసలు అద్వైత సిద్ధాంతరీత్యా కానేకాదు అర్ధాద్వైతసిద్ధాంతరీత్యానైనా కూడా బొత్తిగా అవకాశం లేనేలేదు. విశ్వసృష్టిలో భచక్ర వ్యవస్థకున్న నేమానికీ (చక్రంయొక్క నేమికి అంటే అంచుకు) ఇంద్రునికీ ఉన్న సంబంధాన్ని ఎవరు దర్శించగల రన్న పరమ వైజ్ఞానిక విషయాన్ని పేర్కొనగా భచక్రపరమైన నేమ శబ్దాన్నిచూచి కొందరు భాష్య కర్తలు తికమకపడి ఇది భార్గవుడైన వేదర్షికి సంబంధించినదని అభిప్రాయపడి అపభాష్యాలువ్రాశారు. అసలు ఇంద్రు లెందరున్నారో చెప్పడం సాధ్యం కాదని ఋగ్వేదంలో అష్టమ మండలంలో 100 వ. సూక్తంలోని "ప్ర సు స్తోమం" ఇత్యాదిఋక్కు యెలుగెత్తి చాటుతుంటే ఇంద్రు డనేవాడు ఒకే ఒక్కడున్నాడనీ అంతటి పరమదుష్టుడు ఇంకొకడు లేడనీ పురాణ కవి పండిత విమర్శక లోకం భావించిందంటే ఇది యెంత అవాస్తవికమైన విషయం అనాలి? ఎంతటి అజ్ఞాన విలసితమైన విషయ మనాలి ?

ఇంద్రుడు — వృత్రవధ — బ్రహ్మహత్యా పాప దోషం

ఇంద్రు లనేకమంది ఉన్నారనేది విస్పష్టం. అయితే ఒక్క ఋగ్వేదంలోనే దాదాపు 325 సూక్తాలలో వివిధ ఋక్కులలో పేర్కొనబడిన ఇంద్రుడు ఏకైకుడు మాత్రం కాడు. కాని వృత్రవధ చేసిన యింద్రుణ్ని మొత్తం 104 సూక్తాలలో వివిధ ఋక్కులలో (విశ్వక్షేమ ఘాతుకుడైన వృత్రుని వధించిన వీరుడుగా) అభివర్ణించడం జరిగింది. మరి మిగిలిన 221 సూక్తాలలోనూ వున్న వివిధేంద్రుల వర్ణన వృత్రఘాతకుడైన యింద్రుని వర్ణన కాకుండా తద్భిన్నులైన యింద్రుల వర్ణనగా భావించవలసి వున్నది. ఈ దృష్ట్యా యీ 221 సూక్తాలలోగల వివిధ ఋక్కులలో యే యే యింద్రులు వర్ణించబడ్డారో పృథక్కరించి ప్రత్యేకించి యే వర్ణన యే యింద్రునికి సంబంధించిందో చెప్పడం సాధ్యపడదు. విభిన్నులైన యింద్రుల నామాలను వివక్షించి వివేచించి వేదకాలంలో చెప్పన లేమని చెప్పలేంకాని తదనంతరకాలంలో ఆ నామా లన్నీ కాలగర్భంలో కలిసిపోయివుంటాయి అనిమాత్రం చెప్పక తప్పదు. వృత్రాసురుణ్ని

వధించిన యింద్రుడు కేవలం వృత్రాసురుణ్ణిమాత్రమే వధించలేదు. అనేకమంది ప్రముఖ రాక్షసులనుకూడా సంహరించినట్లు వేదమే పేర్కొంటున్నది. ఇంద్రుడుచేసిన వధల్లో వృత్రవధ అత్యంతప్రాముఖ్యాన్ని వహించినమాట వాస్తవమేగాని దీనికి మూలభూతాలైన విషయాలు మరికొన్ని ఉన్నాయి. వాటికి సంబంధించిన ప్రాచీన కావ్యపురాణోపనిషదారణ్యకబ్రాహ్మణాది గ్రంథ విశేషాలివి.

“రచన” అనే దనుజకాంతకు త్వష్టప్రజాపతికి విశ్వరూపుడనే మహాశక్తివంతుడైన పుత్రుడు త్రిశిరస్కుడై పుట్టి ఘోరమైన తపస్సు చేస్తాడు. ఒకసారి దేవగురువైన బృహస్పతిని యింద్రుడు చూచి ప్రత్యుత్థానుడై లేచి గౌరవించలేదన్న కారణంతో అగౌరవం పాలైన బృహస్పతి అంతర్ధానుడై పోతాడు. అప్పు డింద్రాదులు మహాతపస్విఅయిన త్వష్టని కుమారుడైన విశ్వరూపుణ్ణి దేవగురువుగా పురోహితుడుగా ఉండవలసిందని కోరి అతన్ని పూజిస్తూ యజ్ఞభాగాలిస్తూ వుంటారు. విశ్వరూపుడు ఆయా యజ్ఞభాగాలను కేవలం దేవతలకు మాత్రమే పంచిపెట్టకుండా తన తల్లి రాక్షసస్త్రీ “రచన” వైపు బంధువులై మాతృపరంగా దాయాదులైన దానవులకుకూడా పాక్షిక దృష్టితో పంచిపెడ్తూవుంటాడు. కేవలం దేవతలకుమాత్రమే పంచిపెట్టవలసిన యజ్ఞభాగాలను దేవతలకేకాక రాక్షసులకుకూడా విశ్వరూపుడు దేవగురు పీఠంలో వుండి పంచిపెట్టడం ధర్మవిరుద్ధమని భావించి యింద్రుడు విశ్వరూపుని శిరస్సును ఖండించి సంహరిస్తాడు. మహాశక్తివంతుడై దేవగురు స్థానంలోవున్న తన పుత్రుడైన విశ్వరూపుణ్ణి యింద్రుడు సంహరించినందుకు ఆగ్రహించి త్వష్ట ప్రజాపతి యింద్రునిపై వైరం పూనుతాడు. తత్ఫలితంగా యింద్రుణ్ణి యింద్రపదవీభ్రష్టుణ్ణి చేయించాలనే దృష్టితో తన తపశ్శక్తితో మరొక “విశ్వరూపుణ్ణి” సృష్టిస్తాడు. ఈ రెండవ “విశ్వరూపుడు” తండ్రియైన త్వష్టప్రజాపతి ఆజ్ఞమేరకు యింద్రపదవి కోరి ఘోరతపస్సు చేస్తూవుంటాడు. ఈ విశ్వరూపునితపస్సుకు భంగం కలిగించవలసిందిగా రంభాది అప్సరసలను అనేకమందిని యింద్రుడు నియమిస్తాడు. అయినా, విశ్వరూపుడు ఆయా రంభాద్యప్సరసల నృత్య సంగీతాది హావభావాలకు లొంగక, అణుమాత్రమైనా చలించక, అంతర్ముఖుడై యింద్రపదవి కోరి ఘోరతపస్సు చేస్తూనే ఉంటాడు. అప్పు డింద్రుడు సహించలేక అతని శిరస్సును ఖండిస్తాడు. తన రెండవపుత్రుడై మహాతపశ్శక్తిఫలంగా సంజనితుడైన విశ్వరూపుణ్ణికూడా యింద్రుడు సంహరించాడని తెలిసి సహించలేని త్వష్ట ప్రజాపతి మరింత మహోగ్రుడై యింద్ర సంహరణార్థమై తన హోమగుండంలోని మహా యజ్ఞాగ్నిలోనుంచి వృత్రాసురుణ్ణి సృష్టిస్తాడు. వృత్రుడు మహాగ్ని సంజాతుడై మహోగ్రాగ్ని స్వరూపుడై మహత్తర తపశ్శక్తితో విశ్వకంటకుడుగా రూపొందినందువల్లనే యీ వృత్రవధ విశేష ప్రశస్తిని ప్రచారాన్ని పొంది ప్రముఖంగా అభివర్ణింపబడిందేగాని వృత్రాసురుని అన్నలవంటివారు “త్వష్ట ప్రజాపతి రచనా” దంపతుల స్వశరీర ప్రత్యక్షపుత్రుడైన విశ్వరూపుని వధ - త్వష్ట ప్రజాపతి మహా తపశ్శక్తితో సంజనితుడైన రెండవ విశ్వరూపుని వధకూడా వేదంలో పేర్కొనబడక పోలేదు.

అపాం ఫేనేన నముచేః శిర ఇన్ద్రోదవర్తయః ।

విశ్వా యదజయః స్పృధః ॥

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత-తృతీయ సంపుటం - 8 మండలం - 1 సూక్తం - 13 ఋక్కు. 553 పేజీ)

త్వష్ట ప్రజాపతి ప్రత్యక్షతనూజాతు డొకడు, తపఃఫలసృష్టిభూతు డింకొకడు అయిన యిరువురు విశ్వరాక్షసుల విషయం అనేక ఋక్కులలో యింద్ర ప్రశంస సందర్భంగానే ప్రస్తావించబడినా ప్రాచీన భాష్యకర్తలు - యెంతసేపూ యింద్రుని వృత్రవధను మాత్రమే ప్రముఖంగా తమదృష్టిలో ఉంచుకున్నందువల్ల, “విశ్వ” రాక్షసుణ్ణి నిర్దేశించే “విశ్వ” శబ్దం యే ఋక్కులో యెక్కడ కనిపించినా – ఆ “విశ్వ”నామక రాక్షసార్థం చెప్పకుండా తద్భిన్నార్థాలతో సరిపెట్టుకుంటూ పోయారు. అంతేకాదు. శత్రుఘాతుకుడుగా యింద్రుడే ఋక్కులలో వర్ణింపబడినా -ఆ ఋక్కులలో వృత్రశబ్ద ప్రయోగం లేక పోయినా -అది వృత్రవధకు సంబంధించిన ఋక్కేనని భావించి భాష్యాలు వ్రాసిన సందర్భాలుకూడా అనేకం వున్నాయి. యింద్రుడు వధించినవారు విశ్వరూపు లిద్దరేకాక మరి అనేకమంది వున్నా యీ భాష్యకర్తల దృష్టిలో అత్యధికంగా వృత్రాసురు డుండమే విచిత్రంగా కనిపిస్తుంది. ఇంద్రునికి సంబంధించిన సూక్తాలలో ఋక్కులలో యీ “విశ్వ” రాక్షసుని ప్రసక్తి అనేకచోట్ల కనిపిస్తుంది. ఉదాహరణకు కొన్ని ఋక్కులు.

త్వష్టపుత్రుడైన విశ్వరూపుడు దేవపురోహితుడైనట్లు కృష్ణ యజుర్వేద సంహితలో విస్పష్టంగా పేర్కొనడం జరిగింది.

విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్ ।

(కృష్ణ యజుర్వేదసంహిత: 2 వ కాండం. 5 వ ప్రపాఠకం - 1 వ అనువాకం)

త్వమిన్ద్ర స్రవితవా అపస్కః పరిష్ఠితా అహినా శూర పూర్వీః ।

త్వద్ వా వక్రే రథ్యో 3 న ధేనా రేజన్తే విశ్వా కృత్రిమాణి భీషా ॥

భీమో వివేషాయుధేభిరేషామపాంసి విశ్వా నర్యాణి విద్వాన్ ।

ఇన్ద్రః పురో జర్హృషాణో వి దూధోత్ వి వజ్రహస్తో మహినా జఘాన ॥

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత:- తృతీయ సంపుటం.
7 వ మండలం - 21 వ సూక్తం - 3-4 ఋక్కులు: 87 వ పేజీ)

ఆ నో విశ్వాభిరూతిభిః సజోషా బ్రహ్మ జుషాణో హర్యశ్వ యాహి।

వరీవృజత్ స్థవిరేభిః సుశిప్రాఽస్మే దధత్ వృషణం శుష్మమిన్ద్ర॥

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత: - తృతీయ సంపుటం-
8వ మండలం, 24వ సూక్తం - 4వ ఋక్కు - 98 వ పేజీ)

త్వమిన్ద్ర ప్రతూర్తిష్వభి విశ్వా అసిస్పృధః ।

అశస్తిహా జనితా విశ్వతూరసి త్వం తూర్య తరుష్యతః ॥

అను తే శుష్మం తురయన్తమీయతుః క్షోణీ శిశుం న మాతరా ।

విశ్వాస్తే స్పృధః శ్నథయన్త మన్యవే వృత్రం యదిన్ద్ర తూర్వసి ॥

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత:- తృతీయ సంపుటం -
8వ మండలం - 99వ సూక్తం -- 5-6 ఋక్కులు. 1010-1011 పేజీలు)

అష్టమండలంలో 14 వ సూక్తంలోవున్న ఈ క్రింది 13 వ ఋక్కులో స్పష్టంగా యింద్రుడు "విశ్వ"రూప రాక్షసుని శిరస్సును ఛేదించినట్లు అభివర్ణించబడింది.

అపాం ఫేనేన నముచేః శిర ఇన్ద్రోదవర్తయః।
విశ్వ యదజయః స్పృధః॥

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత - తృతీయ సంపుటం -
8 వ మండలం 14 వ సూక్తం- 13 వ ఋక్కు- 553 పేజీ)

అనేకసందర్భాలలో "విశ్వ" రాక్షసవధను తెల్పే ఋక్కులు ఉన్నప్పటికీ ఇంద్రుని వృత్రవధ విషయమే సుప్రసిద్ధంగా ఉన్నందువల్లా, యీ విశ్వరూప రాక్షసుల వధ విషయం పండితమండలికి అంతగా తెలియనందువల్లా, వృత్రాసురుని అన్నల వధ విషయం ప్రసిద్ధం కానూకాలేదు. వేద ఋక్కులలో వర్ణితమైనా వాస్తవ దృక్పథంతో అర్థభావావిష్కరణం జరగనూ జరగలేదు.

తొలి విశ్వరూపుడు ఇంద్రునికి విరుద్ధంగా అవతరించినవాడూ కాడు. పెరిగినవాడూకాడు. అతడు రచనా త్వష్టప్రజాపతుల సహజ సంతతిగానే పుట్టి పెరిగి మహాతపస్సంపన్నుడై దేవ గురుపీఠాన్ని అయాచితంగానే అధిరోహించగలిగాడు. రెండవ విశ్వరూపుడు ఇంద్ర వైరంకోసం సంజనితుడై యింద్రపదవికోసం ఘోరమైనతపస్సుచేసి యింద్రుని వజ్రాయుధంచేత హతుడైనాడు. వృత్రాసురుడు ఇంద్రాధిపత్యాది వాంఛ లేవీ లేకుండా కేవలం యింద్రుణ్ని సంహరించడంకోసమే పుట్టి పెరిగి ఘోరతపస్సు చేసినవాడు. ఒక్క

ఇంద్రసంహార వాంఛ తప్ప వృత్రాసురుడు మరే యితర వాంఛా అణుమాత్రమైనా లేని నిష్కామ కర్మయోగి అని చెప్పవచ్చు. అసలు త్వష్ట ప్రజాపతి వృత్రాసురుణ్ని మహాయజ్ఞాగ్నిహోమకుండంలోనుంచి సృష్టించింది కేవలం యింద్రసంహారార్థం మాత్రమే. ఆ వృత్రుడు మహాతపస్సంపన్నుడై మహత్తర మహిమాన్విత శక్తిమంతుడై - "నా అన్న త్రిశిరుని చంపిన యింద్రుణ్ని సంహరించితీరుతాను" అన్న పట్టుదలతో తత్సిద్ధికోసం అహరహం నిర్విరామంగా వర్తించాడు. ఇంద్రవధాయత్నంలో యింద్రుడు చేసే లోకక్షేమంకరకార్యాల నన్నింటినీ తన మహోగ్రాగ్నిశక్తితో ధ్వంసం చేయడానికి కంకణం కట్టుకొని కృషి చేశాడు. పరమ లోకకంటకుడుగా నిలిచాడు. అయినా చివరికి విధి వక్రించి ఇంద్రుని వజ్రాఘాతంతో స్వరభంగోచ్చారణతో స్వయంకృతాపరాధపూర్వకంగానే నిర్వీర్యుడై తుదికి శిరచ్ఛేదానికి గురయ్యాడు. ఇంద్రునిచేతిలోనే హతుడయ్యాడు.

ఈ వృత్రవధకు వేదఖగోళ విజ్ఞానపరంగా లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక్, శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవ రావుగార్లు ఒక ప్రత్యేక సమన్వయాన్నిచ్చారు. విశేషంగా శ్రీ గొబ్బూరువారు తమ "నక్షత్రములు" (50-51-125 పేజీలు) గ్రంథంలోను, "జ్యోతిర్వేదము" (42-43-44 పేజీలు) గ్రంథంలోను మృగశిరా నక్షత్రమే వృత్రాసురుడుగానూ జ్యేష్ఠానక్షత్రమే ఇంద్రుడుగానూ చిత్రించి ఇంద్రవృత్రాసురులు ప్రతిస్పర్థులైనట్లే జ్యేష్ఠ మృగశిరా నక్షత్రాలుకూడా ప్రతిస్పర్థులని వివరించారు. పైగా జేష్ఠ తూర్పున ఉదయించినప్పుడు పడమట మృగశిర అస్తమిస్తుంది కాబట్టి దానినే వృత్రవధగా మన మహర్షులు చిత్రీకరించినట్లుకూడా స్పష్టపరచారు. వేదఖగోళవిజ్ఞానదృష్ట్యా యీ సమన్వయం పూర్తిగా అప్రామాణికమైనది మాత్రమేకాదు. అసమంజసమైనదికూడా. జ్యేష్ఠానక్షత్రం యింద్రదైవత్య మన్నమాట వాస్తవమే. కాని మృగశిర వృత్రాసుర డనడానికి అణుమాత్రమైనా అవకాశం లేదు. జ్యేష్ఠనక్షత్రంపేరుమీద దాని అధిదేవత అయిన యింద్రుణ్ని గ్రహించినప్పుడు మృగశిరా నక్షత్రంపేరుమీద దాని అధిదేవత అయిన "సోమదేవత"ను గ్రహించాలేగాని వృత్రాసురుడెట్లా పరిగృహీతు డవుతాడు ? మృగశిరాధిదేవత వృత్రాసుర డని యే ఆర్షఖగోళశాస్త్ర గ్రంథంలోనూ పేర్కొనబడలేదే! పైగా సోముడే మృగశిరాధిదేవతగా ఆ అధిదైవత్వాలగురించి పేర్కొన్న అన్ని సందర్భాలలోనూ తేటతెల్లం చేయడంజరిగింది. అంతేకాదు- ఈ నక్షత్రోదయాస్తమయ సిద్ధాంతాలమీద ఆధారపడి వృత్రవధవంటి కథల్ని సమన్వయపరచాలని చూస్తే అదే సిద్ధాంతంప్రకారం వృత్రవధాది కథలన్నీ కాలాంతరంలో యెదురుతిరుగుతాయి. రాశిచక్రంలోవున్న ప్రతినక్షత్రానికీ దానికి యెదురుగాఉండే నక్షత్రం యేదో-అది ప్రతిస్పర్థి అవుతూనే ఉంటుందా? కాదు. మామూలుగా యేదో ఒక నక్షత్రం మరొక నక్షత్రానికి యెదురుగా ఉండనే ఉంటుంది. రాశిచక్రంలో వున్న నక్షత్రాలన్నీ క్రమానుగతంగా తూర్పున ఉదయించేవే-తూర్పున ఉదయించిన ప్రతినక్షత్రమూ తిరిగి పశ్చిమాన అస్తమించేదే. ఈ కార్యక్రమం యెప్పుడూ చక్రనేమిక్రమంలో జరుగుతూవుండేదే! ఉదయించిన నక్షత్రం విజయవంతమైనట్లు భావించి దానికి యెట్టయెదుట పడమట అస్తమించిన నక్షత్రం అపజయంపాలైనట్లో ! మృతి చెందినట్లో ! భావిస్తే ప్రతినక్షత్రమూ ఉదయించి ప్రతినక్షత్రమూ అస్తమిస్తూనే ఉంటుందికాబట్టి అన్నీ యెప్పుడో ఒకప్పుడు (ఉదయించినప్పుడు) విజయవంతాలైనట్లే-అన్నీ అపజయం (అస్తమించినప్పుడు) పాలైనట్లే మృతిచెందినట్లే భావించవలసివస్తుంది. "జ్యేష్ఠ" తూర్పున ఉదయించినప్పుడు దానికి యెదురుగాఉన్న నక్షత్రమైన "మృగశిర" అస్తమిస్తుందికాబట్టి-జేష్ఠాధిపతియైన యింద్రుడు-మృగశిర రూపుడైన వృత్రాసురుణ్ని వధించినట్లుగానే మనం సమన్వయపరచదలిస్తే - "మృగశిర" తూర్పున ఉదయించినప్పుడు దానికి యెదురుగాఉన్న నక్షత్రమైన "జ్యేష్ఠ" సహజంగానే అస్తమిస్తుందికాబట్టి "మృగశిరా" రూపుడైన వృత్రాసురుడు జ్యేష్ఠాధిదేవత అయిన యింద్రుణ్ని సంహరించినట్లు మనం తప్పనిసరిగా యీ సమన్వయదృష్టితోనే ఆమోదించవలసివస్తుంది. అయినప్పుడు వృత్రవధకూ యింద్రవిజయానికీ సార్థకత లేనేలేదు. రానేరాదు. అందువల్ల యీ నక్షత్రోదయాస్తమయాలను పురస్కరించుకొని విజయాపజయాలనుగాని జీవన్మరణాలనుగాని నిర్ధారించడానికి అవకాశం బొత్తిగా లేదు. అసలు మనం గ్రహించవలసివస్తే అధిదైవత్వపరంగా జ్యేష్ఠానక్షత్రాన్ని పురస్కరించుకొని ఇంద్రుణ్ని గ్రహించినప్పుడు మృగశిరానక్షత్రాన్ని పురస్కరించుకొని దాని అధిదేవతఅయిన సోమదేవతను గ్రహించవలసివుంటుందేతప్ప తద్భిన్నంగా సంబంధంలేని వృత్రాసురుణ్ని గ్రహించడానికి వీలులేదు. పైగా నక్షత్రానికి దాని అధిదైవత్వానికి అసలు ద్వైధీభావాన్ని మన మహర్షులు నిర్దేశించారేగాని ఏకత్వాన్ని నిర్దేశించలేదు. జ్యేష్ఠానక్షత్రానికి అధిదేవత యింద్రు డన్నారేగాని ఆ జ్యేష్ఠయే యింద్రు డని మహర్షు లెవరూ యెక్కడా చెప్పలేదు. కృత్తికాది నక్షత్రాలన్నింటికీ ఉన్న వాటి అధిదేవత లన్నీ ఆయా నక్షత్రాలు యే పరిస్థితుల్లోనూ కావు. ఆయా నక్షత్రాలే ఆయా దేవత లయితే వాటికి అధిదేవతలతో పనేముంది?

ప్రతినక్షత్రానికీ దానిపై ఆధిపత్యాన్ని వహించి అధికారాన్ని చెలాయించి తన ప్రభావంతో దాన్ని నడిపించగల అధిదేవత ఆ నక్షత్రానికి అతీతంగా ఉంటుం దనేదే వేద ఖగోళవిజ్ఞానులయిన మన మహర్షుల అభిప్రాయం-అందుకే తమ దివ్యచక్షువుతో అనంత ఖగోళవేధ చేసి వివిధ నక్షత్రాలను తమ అదుపు ఆజ్ఞల్లో ఉంచుతూ తమ మహత్తర ప్రభావంతో జ్వలింపచేస్తూ చలింపచేస్తున్న అధిదేవతలను గుర్తించి శాస్త్రీయంగా ప్రకటించారు. అందువల్ల మృగశిరపరంగా దాని అధిదేవత కానటువంటి వృత్రాసురుణ్ని గ్రహించి జ్యేష్ఠవరంగా తదధిదేవతఅయిన యింద్రుణ్ని గ్రహించి చెప్పడానికి వీలులేదుసరికదా పైగా ఆ జ్యేష్ఠానక్షత్రమే యింద్రు డని చెప్పడానికి అసలే వీలులేదు. ఈ రూపంగా శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు మొదలైనవారంతా వేదఖగోళ విజ్ఞానం పేరుతో వివిధనక్షత్రాల ఉదయాస్తమయాలపై ఆధారపడి యిచ్చిన దేవరాక్షసుల జయాపజయాలగాథల సమన్వయాలు - దేవ రాక్షసయుద్ధసంహారకాండాది సమన్వయాలుఅన్నీ నిర్ద్వంద్వంగా అప్రామాణికాలుగానే నిలుస్తాయి. అందువల్ల యీ అప్రామాణికమైన వేదఖగోళసమన్వయాలను త్రోసిరా జనక తప్పదు. అంతమాత్రంచేత వృత్రవధాదిగాథలకు విష్ణుమాయావిలాసంగా కృష్ణలీలగా అవతరించిన యీ మహాసృష్టిలో వేద ఖగోళవిజ్ఞానపరంగా సమన్వయం లేదనికాని వాస్తవికత లేదనికాని చెప్పడానికి వీలులేదు.

"వృత్రాసుర" నక్షత్ర మన్నది "మృగశిర" కానేకాదు. అది వొక భయంకరమైన తోకచుక్క - అపూర్వ అమేయ ధూమకేతువు. కొన్నికోట్ల కోట్ల మైళ్లనిడివి వైశాల్యమూ కల మహావిషపూరితాగ్నిస్వరూప మైనది. విశ్వసృష్టిలోవున్న కాలపరమైన జలరాశినాభులను తన మహోగ్రాగ్నిచ్ఛటలతో హరించి అసలు వర్ష మన్నమాటే లేక నీటిచుక్కే లేకుండా హరించి లోకకంటకంగా రూపొందిన వృత్రాసురవిష ధూమకేతువును ఇంద్రుడు తన శక్తియుక్తులతో సంహరించి వృష్టికారకుడై లోకత్రాణపరాయణుడై మానవమాత్రులతోనేకాదు సకలప్రాణులతోను జేజేలతోనహా జేజేలు పలికించుకొన్నాడు. వాస్తవానికి మృగశిర వృష్టికారక నక్షత్రం - మృగశిరలో సూర్యుడు ప్రవేశించగానే ముసలి యెద్దులుకూడా లేచి రంకెలువేసే విధంగా వాన జల్లులు పడతాయి. "మృగశిర కార్తె రాగానే ముసలి యెద్దుకూడా రంకె వేస్తుం"దన్నది వేదర్షుల సంతతి అయిన తెలుగువారి తరతరాల సామెత -అనంత ఖగోళవిజ్ఞానాన్ని ప్రతిబింబించే నిత్యసత్యమైన చెరుగరాని చెరుపరాని సామెత - యిక్కడ ముసలి యెద్దు అంటే లౌకికంగా బాగా వయస్సుమీరి కదల లేని స్థితిలోవున్న యెద్దనిమాత్రమే అర్థం. మృగశిరకార్తెలోపడిన ఆ వర్షపు చినుకుల సత్తువకు-అంతకుముందు రోళ్లుకూడా పగిలే విధంగా యెండలుకాచిన రోహిణీకార్తెలో అట్టుడికినట్టు ఉడికిన శరీరంకల - ముసలియెద్దుకూడా తెప్పరిల్లి నూతనశక్తితో రంకెవేస్తుంది అని అర్థం. కాని అలౌకికంగా-ముసలియెద్దు అంటే చాలా ముసలిదైన యెద్దు - తండ్రు లందరికీ తండ్రి అన్నట్లు యెద్దు లన్నింటికీ తండ్రివంటి యెద్దయిన - అతిప్రాచీనపు వృషభరాజు - సృష్టిలో తొలి వృషభరాజు అయిన ఆ ఖగోళవృషభంకూడా రంకెలు వేస్తుంది అని అర్థం - మృగశిరాపరమైన వృషభం ఆ కార్తెలో క్రొక్కారు మేఘాల ఉరుముల పేరుతో రంకెలు వేస్తుం దని అర్థం. సూర్యసంగమంతో మృగశిర నక్షత్రం వృష్టికారకమై నిత్యప్రత్యక్ష విజ్ఞానప్రదర్శకమై అఖండంగా వెలుగుతూవుండగా-ఆ వృష్టి కారకమైన మృగశిరను - వృష్టినిరోధకుడైన వృత్రాసురుడుగా పేర్కొనడం పూర్తిగా వాస్తవవిరుద్ధ మైన విషయం.

వృత్రాసురుడు - త్వష్టప్రజాపతి తన మహాయజ్ఞాగ్నిగుండంనుంచి ప్రాదుర్భవింపజేసిన మహోగ్రాగ్నిస్వరూపుడు. ఇంద్రుణ్ని సంహరించే వీరశూరుడుగా శక్తిసంపన్నత కలవాడుగా ఉద్భూతుడు కావాలని-త్వష్టప్రజాపతిచేత తనమహాయజ్ఞాగ్నిగుండంలో కేవల మహావిషమ విషోగ్రాగ్ని స్వరూపుడుగా కావాలని సృష్టింపబడినవాడు వృత్రాసురుడు. అతని జననలక్ష్యం కేవలం యింద్రవధ మాత్రమే. ఈ లక్ష్యంతో కేవలం విషాగ్నిరూపుడుగా బుద్ధిపూర్వకంగా సృష్టింపబడిన వృత్రాసురుడు సహజంగానే యింద్రవధ చెయ్య గల శక్తిసంపన్నుడుగా జన్మించినా అతడు వెంటనే యింద్రవధకు పూనుకోలేదు. బ్రహ్మనుగూర్చి సంవత్సరాలతరబడి అహోరాత్రులు తపస్సుచేసి బ్రహ్మవల్ల అనేకానేక అపూర్వ అమేయ వరాలు పొందాడు. బ్రహ్మత్వసిద్ధి సంపాదించాడు. తన జన్మతోనే రూపొందిన మహాగ్నిస్వరూపం మరింత మహోగ్రరుద్రరూపంగా దశదిశల్లోనూ పెంపొందింది. శంభు, విభు, గణాధ్యక్ష, త్ర్యక్ష, త్రిదశ వందిత, సంవాహ, వివాహ, నభ, లిప్సు, విచక్షణ, దశరుద్రులకు ప్రతిగా ఊర్ధ్వదిక్కులోనూ - కపాలీశ, అబ్ధి, బిద్ధరుద్ర, వజ్ర దేహ, ప్రమర్దన, విభూతి, అవ్యయ, శాంత, పినాకి, త్రిదశాధిప, దశరుద్రులకు ప్రతిగా ప్రాగ్దిశలోనూ - అగ్ని, హుతాశన, పింగళ, ఖాదక, హర, జ్వలన, దహన, బభ్రు, భస్మాంతక, క్షయాంతక, దశరుద్రులకు ప్రతిగా ఆగ్నేయదిశలోనూ - యామ్య, మృత్యు హర, ధాతృ, విధాతృ, కర్తృ, కాల, ధర్మ, అధర్మ, సంయుక్తృ, వియోజక, దశరుద్రులకు ప్రతిగా దక్షిణదిశలోనూ - నైఋతి, మారుత, హస్త, క్రూరదృష్టి, భయానక, ఊర్ధ్వకేశి,విరూపాక్ష, ధూమ్ర, లోహిత, దశరుద్రులకు ప్రతిగా నైఋతిదిశలోనూ-

బల, అతిబల, పాశహస్త, మహాబల, శ్వేత, జయభద్ర, దీర్ఘబాహు, జలాంతక, బడబ, భీమ, దశరుద్రులకు ప్రతిగా పశ్చిమ దిశలోనూ – శీఘ్ర, లఘు, వాయువేగ, సూక్ష్మ, తీక్ష్ణ, భయాంతక, పంచాంతక, పంచశిఖ, కపర్ది, మేఘవాహన, దశరుద్రులకు ప్రతిగా వాయువ్యదిశలోనూ – జటామకుటధారి, నానారత్నధర, నిధీశ, రూపవంత, ధన్య, సౌమ్యదేహ, ప్రసాదకృత్, ప్రసాద, లక్ష్మీవంత, కామరూప, దశరుద్రులకు ప్రతిగా ఉత్తరదిశలోనూ– విద్యాధర, జ్ఞానధర, సర్వజ్ఞ, వేదపారగ, మాతృవృత్, పింగాక్ష, భూతపాల, బలిప్రియ, సర్వవిద్యావిధాత, సుఖదుఃఖకర, దశరుద్రులకు ప్రతిగా యీశాన్యదిశలోనూ దశదిశల్లోనూ కలిపి దశదశరుద్రులుగా – మృగవ్యాధరుద్రునికి పోటీగా– మాయామృగరూపుడుగా వృత్రాసురుడు వ్యాప్తిచెంది విశ్వసృష్టిలోని శీతజలనాభులను హరించి సూర్యసంగమంతో సంభవించే మృగశిర కున్న తొలకరిశక్తినిసైతం హరించివేశాడు. తొలకరికి మూలమైన మృగశిరా వర్ష శక్తినిసైతం హరించిన వృత్రాసురుడు, మృగశిరను తన మహోగ్రాగ్నితో ఆవరించి సంహరింపజూచిన వృత్రాసురుడు, మృగశిరకు భిన్నుడే అవుతాడుగాని మృగశిరానక్షత్రమే యే విధంగా అవుతాడు ? మృగశిరాశక్తినిసైతం హరించి యింద్రుని వర్షశక్తినేకాదు అసలు యింద్రుణ్నే సంహరించా లనుకున్న వృత్రాసురుణ్ని – అతనికి ప్రతిస్పర్ధిగా జ్యేష్ఠాధిదేవతగా వెలుగొందే యింద్రుడు తన శక్తియుక్తులతో చివరికి శిరచ్ఛేదంచేసి సంహరించి లోకాల్లో శాంతిని నెలకొల్పాడు. తన సువృష్టితో విశ్వాన్ని చల్లబరిచాడు. ఋగ్వేదం సప్తమమండలంలోవున్న 27వ సూక్తంలోని మూడవఋక్కులో యింద్రుడువిషువత్తును రక్షించి జలనాభిని పునరుజ్జీవితంచేసి జగత్తుకు వృష్టిని ప్రసాదించినట్లు వసుశక్తుల్ని ప్రసాదించినట్లు పేర్కొనబడింది. ఇంద్రాధిదైవత్వంకల ఆ ఋక్కు యిది.

ఇన్ద్రో రాజా జగతశ్చర్షణీనామధి క్షమి విషురూపం యదస్తి ।

తతో దుదాతి దాశుషే వసూని చోదద్ రాధ ఉపస్తుతశ్చిదర్వాక్ ॥

(స. శ్రీ, ఋ. తృతీయ సంపుటం – 107 పేజీ)

ఋగ్వేదం చతుర్థమండలం 18 వ సూక్తంలోవున్న 6,7,8,9 ఋక్కులవల్లా యింకా అనేక యితర సూక్తాలలో వున్న వివిధ ఋక్కులవల్లా వర్షనిరోధకుడై జలశీతనాభుల్ని హరించివేసిన వృత్రాసురుణ్ని యింద్రుడు వధించి జలాధారభూతమైన విశ్వసృష్టి నిత్యజలధారలను ప్రసాదించాడని స్పష్టంగా తెలుస్తుంది.

వేదఖగోళ విజ్ఞానం ప్రకారం యీ వృత్రాసుర ధూమకేతు సంజనన ప్రవృద్ధ పరివ్యాప్తి సంహారకాండ యావత్తూ సృష్టి జరిగిన తరువాత తొలి మన్వంతరమైన "స్వాయంభువ" మన్వంతర కాలంలో యిప్పటికి దాదాపు 184,03,20,000 సంవత్సరాలకు పూర్వకాలంలోనూ 197,12,16,000 సంవత్సరాలకు ప్రారంభంలోనడచిన 12,08,96,000 సంవత్సరాలకాలంలో జరిగివుండవచ్చు నని అనిపిస్తున్నది. ఈ వృత్రాసురుణ్ని సంహరించినవాడు "రోచనేంద్రుడు." విశ్వ వృత్రాసురుల తండ్రి అయిన త్వష్టప్రజాపతి విశ్వ కర్మ అనే యితడు ఈ వైవస్వత మన్వంతరంలో ప్రస్తుత చతుర్యుగంలోని ద్వాపరాంతంలోను కలియుగ ప్రాభవంలోనూ వున్న పాండవులకాలంలో వున్నాడని కొన్ని పురాణకథలవల్ల తెలుస్తున్నవి. అయితే ఆర్షవైజ్ఞానికదృష్టితోగాని ఆధునిక విజ్ఞానదృష్టితోకాని వృత్రాసురుడు యింత సన్నిహిత ప్రాచీనకాలంలోని వాడుగా కనవడడు. పాండవుల కాలంకంటే మరి కొన్నివేల సంవత్సరాలు ప్రాచీనతను సంతరించుకోగల నహుషుని కాలంలో ఈ వృత్రాసురవధ జరిగినట్లు మరొక పురాణకథవల్ల తెలుస్తున్నదికాని యిదికూడా వైజ్ఞానికంగా చూస్తే వాస్తవంగా కనపడదు. ప్రహ్లాదుని అనుచరులూ గోత్రీయులూ అయిన కొందరు రాక్షసులను వధించిన కాలంలోనే, వారిని వధించిన ఆ యింద్రుడే వృత్రాసురుణ్ని కూడా వధించినట్లూ ఈ రూపంగా ఈ వధ నరసింహావతారానికి తరువాతి కాలంలో– అంటే హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులకు తరువాతి కాలంలో జరిగినట్లూ మరొక పురాణకథవల్ల ద్యోతక మవుతున్నదికాని హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులను మించిన శక్తియుక్తులు గల వృత్రాసురుడు అప్పటివాడుగా కనవడడంలేదు. వృత్రుని వధించిన యింద్రుడువేరు– ప్రహ్లాదానుయాయులను వధించిన యింద్రుడు వేరు. వైవస్వతమన్వంతరేంద్రుడు వేరు. సృష్టిప్రారంభమైన తరువాత తొట్టతొలి మన్వంతరంలోనే తోకచుక్కలకే తోకచుక్కవంటి బ్రహ్మాండమైన యీ వృత్రాసుర ధూమకేతువు తన మహావిషోగ్రాగ్నిజ్వాలలతో విశ్వరూపం దాల్చి వ్యాపించినట్లు కనిపిస్తున్నది. ద్వితీయ మన్వంతరంలోకాని తదనంతర మన్వంతరాలలో గాని యీ వృత్రాసుర ధూమకేతువు దృశ్యమానమై పర్యాప్తి చెందినట్లు కనవడదు.

నక్షత్ర గణాలలో దేవ మానవ రాక్షస గణా లున్నాయి. మహాగ్నివిషరూపాలయిన ధూమకేతువు లన్నీ వివిధ రాక్షస స్వరూపాలే. ఆ యా దేవ మానవ రాక్షస గ్రహనక్షత్ర ధూమకేతువుల అంశతో రకరకాల శిష్టదుష్టశక్తి స్వరూపులు దేవమానవ

రాక్షస ప్రాణులు వివిధలోకాలలో పుట్టి వారి వారి జన్మకర్మల గతుల కనుగుణమైన సపనజ్జీవితాలను దైవలీలగానే గడుపుతారు. ఇది యీ సృష్టిలోని విచిత్రం. వింత! వింతలకు వింత! ఆ జగన్నాటక సూత్రధారి గగనతలంలో నక్షత్రాదుల రూపంలో కథాకథనంగా నడిపే నాటకాలన్నీ వివిధ లోకాలలో యీవిశ్వసృష్టిలో నడిచేవే. ఇదే విధంగా వృత్రాసుర ధూమకేత్వంశతో ఒకానొక మహావిషాగ్ని రూపరాక్షస గుణాలు కలిగి లోకకంటకుడైన వృత్రాసురుడు పుట్టి వుండనూ వచ్చును. మహావిష్ణ్వంశాసంభూతుడై యింద్రత్వ ప్రభావప్రతిభలలో మరొక అవతారమూర్తి అవతరించి ఆ మాయా వృత్రాసురుణ్ని సంహరించనూ సంహరించి వుండవచ్చును. వృత్రాసురుణ్ని వధించినందువల్ల ఇంద్రునికి బ్రహ్మహత్యాదోషం వచ్చిందనీ, ఆదోషంవల్ల యింద్రపదవి కోల్పోగా ఆకాలంలోనే నహుషుడింద్రపదవి నధిరోహించి భ్రష్టుడైన తరువాత మహర్షులు అసలైన యింద్రుణ్ని వెతికి తీసుకొనివచ్చి అగస్త్యుని సలహాప్రకారం ఆ యింద్రుణ్ని వేదమంత్రాలతో బ్రహ్మహత్యాదోష విముక్తుణ్నిచేసి తిరిగి యింద్రపదవిని అధివసించేట్లు చేసినట్లూ ఒక మహాభారత కథ కలదు. అయితే మహాభాగవతంలో వున్న మరొక కథప్రకారం యిందుకు భిన్నవిషయాలు తెలుస్తున్నాయి. "యింద్రపదవిని కోరి తపస్సు చేస్తున్న రెండవ విశ్వరూపుణ్ని సంహరించినందువల్ల యింద్రునికి బ్రహ్మహత్యాపాపం చుట్టుకొన్నట్లూ, ఆతర్వాత యింద్రుడు తన బ్రహ్మహత్యాపాపాన్ని స్వీకరించవలసిందిగా స్త్రీలను, జలాన్ని, వృక్షాలను, భూమిని, కోరగా ఆ యింద్రకృత బ్రహ్మహత్యాపాపాన్ని స్త్రీలు రజోవికారరూపంలోను, నీరు యెందుకూ కొరగాని నీటిబుడగల నురుగు రూపంలోను, లతావృక్షాదులు తాము విడిచిపెట్టే బొగ్గువులును గాలి రూపంలోను, భూమి "యిరిణి" రూపంలోనూ అంటే చవిటినేల రూపంలోను నాలుగు భాగాలుగా స్వీకరించడానికి ఆమోదించి అందుకు ప్రతిఫలంగా లాభంగా కామసుఖానుభవంతోపాటు రజోవికార దోషదర్శనరూపంలో సంభోగదోషంపోయేట్లు స్త్రీలూ, తమతో ప్రక్షాళనమైనవల్లా పరిశుద్ధంగా తయారయ్యేట్లు జలసమూహమూ, ఛేదితాలైనా తిరిగి ప్రాణప్రరోహంతో చిగిర్చి మొగ్గతొడిగి పూచి కాచేట్లు వృక్షలతాదులూ, తనలో యేర్పడిన యేగొయ్యి అయినా దానంతట అదే పూడిపోయేట్లుగా భూమీ వరాలడుగగా వాటిని యింద్రుడు ప్రసాదించి తన బ్రహ్మహత్యాపాపాన్ని ఆ స్త్రీజన, జల, లతావృక్ష, భూములకు, యిచ్చివేసి తాను పవిత్రుడయ్యాడు." అని మహాభాగవతం కథవల్ల తెలుస్తున్నది. అయితే విశ్వరూపుణ్ని వధించడంవల్ల బ్రహ్మహత్యాపాపం ఇంద్రుణ్ని చుట్టుకున్నదా ? లేక వృత్రాసురవధవల్ల చుట్టుకున్నదా ? అన్న విషయం యీ పురాణకథలవల్ల వివాదాస్పదంగా తయారైనది. అయితే సాయణాచార్యులు ఋగ్వేదం చతుర్థ మండలంలో వున్న 18 వ సూక్తంలోని యీ క్రింది యేడవ ఋక్కుకు భాష్యం వ్రాస్తూ వృత్రాసుర వధవల్ల యింద్రుడికి బ్రహ్మహత్యాపాపం వచ్చినట్లు వ్రాయడం జరిగింది.

**కిము ష్విదస్మై నివిదో భనన్తేన్ద్రస్యావద్యం దిధిషన్త ఆపః ।**
**మమైతాన్ పుత్రో మహతా వధేన వృత్రం జఘన్వాం అసృజద్వి సిన్ధూన్ ॥**

(స. శ్రీ. ఋ. ద్వితీయ సంపుటం- 4వ మండలం- 18వ సూక్తం -- 7వ ఋక్కు--320 వ పేజీ)

ఈ ఋక్కుకు సాయణాచార్యులు వ్రాసిన భాష్యప్రాయమైన వాక్యాలివి.

— "యదేన్ద్రో వృత్రాసురం హతవాన్ తదా శాశ్వతీం బ్రహ్మహత్యాం ప్రాప్తవానితి వామదేవస్యాభిప్రాయమస్నీయ అదితిః ఆహ. నివిదః మరుత్వతీయశస్త్రే ప్రయుజ్యమానాని "మరుస్తోత్రో మరుద్గణః" ఇత్యాదీన్ద్రస్తుతిప్రతిపాదకాని కానిచిత్ పదాని నివిచ్ఛబ్దేనోచ్యన్తే. తా నివిదః అస్మై ఇమం వృత్రవధనిమిత్తం బ్రహ్మహత్యారూపం పాపం ప్రాప్నువన్తమిన్ద్రం కిము ష్విత్ భవన్త భవన్తి. కిం వదన్తీతి చేత్. తర్హి ఇన్ద్రం పాపరహితం మత్వా నివిదః స్తువన్తి. కథమిన్ద్రస్య పాపరహితత్వమ్ ?. ఉచ్యతే. ఆపః ఫేనరూపేణాస్య ఇన్ద్రస్య అవద్యం బ్రహ్మహత్యాదిరూపం పాపం దిధిషన్తే ధారయన్తి. మమ పుత్రః మదీయః పుత్ర ఇన్ద్రః మహతా ప్రభూతేన వధేన-వధ ఇతి వజ్రనామైతత్. వజ్రేణ వృత్రం జఘన్వాన్ హతవాన్. తతః ఏతాన్ సిన్ధూన్ ఉదకాని వి అసృజత్ విశేషణ స్వైరత్వేన సర్తుం సృష్టవాన్. ఇన్ద్రేణోత్సృష్టా ఆపస్తస్య పాపం జగృహురిత్యర్థః. "—

(సాయణాచార్య కృత ఋగ్వేదభాష్యం)

అయితే శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు ఋగ్వేదం చతుర్థ మండలంలోని 18 వ సూక్తాన్ని ఆంధ్రీకరిస్తూ సప్తమ ఋగనువాద సందర్భంగా "బ్రాహ్మణుడగు వృత్రుని జంపుటవలన గలిగిన యింద్రుని పాపమును జలసమూహము ఫేనరూపముగా ధరించెను. అందుచేత నింద్రుడు బ్రహ్మహత్యా పాపరహితుడయ్యెను" అని సాయణాచార్యభాష్యవాక్యాన్ని ఆంధ్రీకరణలో ఉదాహరించి- "వృత్రుడు బ్రాహ్మణుడైనట్లు పురాణకథ కలదు. కాని వేదములో నెక్కడను కనపడదు. ఇంద్రునకు

బ్రహ్మహత్యా పాపమున్నట్లు గానరాదు"- (స. శ్రీ. ఋ- ద్వితీయ సంపుటం- 323 పేజీ) అని యింద్రునికి బ్రహ్మహత్యా దోషం లేనట్లు స్పష్టంగా వ్రాయడమేకాక ఇంద్రుని బ్రహ్మహత్యాపాపదోషజుష్టత్వ విషయం వేదప్రామాణికం కాదనికూడా తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. అంతే కాదు. ఋగ్వేదం అష్టమమండలం 32 వ సూక్తంలోని "అహం వృత్రమ్" ఇత్యాది 26 వ ఋక్కును ఆందీరి కరిస్తూ యీ క్రింది విధంగా ఫుట్‌నోటు వ్రాశారు.

— "వృత్రవధ విషయమై కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తులో (కౌ॥ 3-1. ఐ. బ్రా 7-28) ఇంద్రుడు ప్రతర్దనునకు "నేను వృత్రాసురుని (వాడు బ్రాహ్మణుడైనను) జంపితిని. బ్రహ్మ ప్రతిపాదక ఋక్కుల నెరుంగని వ్యాసులను ముక్కలు ముక్కలుగ నరికి తోడేళ్ళపాల వేసితిని. మా ప్రతిజ్ఞల ననేకముల నుల్లంఘనము జేసినవారును, బ్రహ్లాదుని యాప్తులును గోత్రజులు నైన పౌలోమ కాల ఖంజనామ రాక్షసుల వధించితిని. ఇట్టివి యెన్ని యొనర్చినను వానిచే ("తస్యమే తత్ర స లోమం చ మా మీయడే") నా లోమమునకైనను వంకర కలుగలేదు" అని చెప్పెను. ఇంకను నెవ్వరు పూర్ణముగ నాత్మజ్ఞానము కలవారై యున్నారో, వారికి మాతృవధ పితృవధ బ్రూణహత్య స్తేయాదు లగు నితర కర్మల దోషములు కలుగవు. ఇట్టి విషయములు మనస్సునం దిడుకొని యింద్రుడు ప్రతర్దన కాత్మవిద్య బోధించెను. (గీతారహస్యము)" (నే-వేం-న-శా)—

(స. శ్రీ. ఋ- తృతీయ సంపుటం - అష్టమమండలం- 32 సూక్తం- 678 పేజీ)

యెంతెంతమంది బ్రాహ్మణులను సంహరించినా "బ్రహ్మహత్యాపాపం మాట దేవు డెరుగునుగాని"- అసలు పాపమే నాదరికి చేరనే చేరలేదు. అసలు "నా వెంట్రుక ఊడనైనా ఊడలేదనైనాకాదు"- "నా వెంట్రుక వంక రయినా తిరగలేదు" - అంటే "కదలనైనా కదలలేదు" అన్న అభిప్రాయంతో ప్రతర్దునికి యింద్రుడు చెప్పినట్లుగా ఉన్న ఆ ఋగ్వేదీయ కౌషీతకీ బ్రాహ్మణోపనిష ద్వాక్యాలివి.

— "ప్రతర్ద నోహ వై కైవోదాసి రింద్రస్య ప్రియం ధామో పజగామ యుద్ధేన పౌరుషేణ చ తం హేంద్ర ఉవాచ• ప్రతర్దన వరం తే దదానీతి స హోవాచ ప్రతర్దన స్త్వమేవ వృణీష్వయం త్వం మనుష్యాయ హితతమం మన్యస ఇతి తం హేంద్ర మువాచ నవై వరం పరస్మై వృణీతే త్వమేవ వృణీష్వేత్యద్ధి వరో వై తర్హి కిల మ ఇతి హోవాచ ప్రతర్దనోఽథో ఖల్వింద్ర స్సత్యా దేవనేయాయ స్సత్యం హీంద్ర హీంద్రస్య హోవాచ మా మేవ విజానహ్యేతదే వాహం మనుష్యాయ హితతమం మన్యేయ స్త్వాం విజానీయాం త్రిశీర్షాణం త్వాష్ట్ర మహన మవాఙ్ముఖా న్యతీంత్సాలావృకేభ్యః ప్రాయచ్ఛం బహ్వీస్సంధా అతిక్రమ్య దివి ప్రహ్లాదన తృణ మహమంతరిక్షే పౌలోమాన్ పృథివ్యాం కాలకాశ్యాం స్తస్య మే తత్ర న లోమచనా మీయడే సయో మాం విజానీయా న్నాస్య కేనచ కర్మణా లోకో మీయతే న మాతృవధే న పితృవధే నస్తేయే న న భ్రూణహత్యయా నాస్య పాపంచ న చ కృషో ముఖాన్నీలం వేత్తీతి."—

(కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు : తృతీయాధ్యాయం)

వ్యాసు లనేకమంది వున్నా రనడం వాస్తవం. వారిలో "బ్రహ్మజ్ఞానానభిజ్ఞులయిన వ్యాసులను సంహరించాను" అని యింద్రు డన్నట్లు యీ ఉపనిషద్వాక్యంలో వున్నా యింద్రుడు బ్రహ్మజ్ఞానాభిజ్ఞులైన - అంటే - అజ్ఞాను లయిన వ్యాసులను కాక — బ్రహ్మజ్ఞాన విరోధు లైన వ్యాసులను వధించినట్లు గ్రహించడం సముచితం కాగలదు. అస లిక్కడ "వ్యాసులా ? వ్యంసులా ?" అన్న సంగతి చర్చనీయాంశమై వేరే ఉండనే వున్నది. "వ్యంసు"డంటే మోసగాడు- వంచకుడు అని అర్థం. అయితే యింద్రుడు బ్రహ్మహత్యా పాపపంకిలుడు కాలేదని యీ ఉపనిషద్ వాక్యాలు చెబుతున్నా యిది వాస్తవంగా కనపడదు. విశ్వకర్మ అయిన త్వష్ట ప్రజాపతి బ్రాహ్మణుడు. త్వష్ట ప్రజాపతివల్ల రచనకు కలిగిన విశ్వరూపుడు త్రిశిరస్కుడై మహోగ్రతపస్సుచేసి దేవగురువైన బృహస్పతి పీఠాన్ని అధిరోహించడానికి తగిన మహోన్నత స్థానాన్ని సంపాదించాడు. యింద్రుడు చేసిన అగౌరవం కారణంగా అదృశ్యమయిపోయిన బృహస్పతియొక్క దేవగురువు పీఠాన్ని యింద్రాది దేవతల కోరికపై అధిరోహించిన విశ్వరూపుడు తన తల్లివైపు బంధువులైన రాక్షసులకుకూడా దేవతలు తన కిచ్చే యజ్ఞభాగాలను పంచి పెడుతూ ఈ అధర్మ క్రియతో యింద్రుని ఆగ్రహానికి గురై సంహరింపబడ్డాడు. ఈ విశ్వరూపుడు దేవగురువు పీఠాన్ని అధిరోహించినా దేవతలీయాయగా దేవతలకు మాత్రమే ఈయవలసిన యజ్ఞభాగాలను దేవతలతోపాటు సమానప్రతిపత్తితో లోకకంటకులైన రాక్షసులకుకూడా పంచిపెడుతూ అధర్మకర్మకాండకులోనై తన బ్రాహ్మణీయమైన పుణ్య-శక్తిని క్రమంగా కోల్పోయి వుంటాడుకాబట్టి అటువంటి విశ్వరూపుణ్ని వధించిన యింద్రునికి బ్రహ్మహత్యాపాపం వచ్చివుండకపోవచ్చును. యింక రెండవ విశ్వరూపుడు త్వష్ట ప్రజాపతిచేత కృత్రిమంగా యింద్రునిమీద కోపంతో సృష్టింపబడినవాడై కేవలం యింద్రపదవీ కాంక్షతో మాత్రమే అబ్రహ్మజ్ఞుడై

ఘోరాతిఘోరమైన తపస్సుచేస్తూ వచ్చాడు. అందువల్ల ఈ విశ్వరూపుడు జన్మతఃకాని బ్రహ్మజ్ఞత్వంతోకాని బ్రాహ్మణుడు కాడుకాబట్టి యితనిని వధించడంవల్లకూడా యింద్రుడికి బ్రహ్మహత్యాదోషం అంటివుండక పోవచ్చును. యింక వృత్రాసురుడు తొలివిశ్వరూపునివలె రచనా త్వష్టప్రజాపతి దంపతులకు సంజనితుడైనవాడు కాడు. త్వష్టప్రజాపతి మహోగ్రంగా యింద్రద్వేషరూపం దాల్చి వేల్చిన మహత్తర యజ్ఞాగ్ని హోమగుండంనుంచి అగ్నిస్వరూపుడుగా ఉద్భవించినవాడు వృత్రాసురుడు. సహజంగానే మంత్రపూతమైన పవిత్ర యజ్ఞాగ్నిగుండంనుంచి అగ్నితేజస్కుడై సంజనితుడైన వృత్రాసురుడు యింద్రసంహారణార్థమై ఉద్భవించాడు. యింద్రుని సంహారమే వృత్రాసుర జన్మలక్ష్యం. జీవితలక్ష్యం. మహాశక్తివంతుడుగా పుట్టినా వృత్రాసురుడు బ్రహ్మ నుద్దేశించి ఘోరతపస్సుచేసి బ్రహ్మజ్ఞానంతోపాటు బ్రహ్మప్రత్యక్షాన్నిసైతం సాధించి అనేకానేకవరాలు పొంది బ్రహ్మజ్ఞులకు బ్రహ్మజ్ఞుడుగా రూపొందాడు. వృత్రాసురుడు మహాగ్నిరూపంతో దశదిశలా వ్యాపించి యింద్రసంహారలక్ష్యంతో లోకకంటకంగా రూపొంది ప్రకృతి విరుద్ధమైన వ్యవస్థతో జలలోతనాభులనుసైతం హరించి అనేక రూపాలలో ప్రకృతిమాతనే క్షోభపెట్టాడు. అయినా యిన్ని పాపకర్మలతో అతడి పుణ్యం హరిస్తున్నా-బ్రహ్మజ్ఞులకు బ్రహ్మజ్ఞుడైన బ్రహ్మజ్ఞానిగా బ్రహ్మ సాక్షాత్కారంతో అతనినుంచి అనేకవరాలు పొందినకారణంగా యింద్రునికి ఎదురొడ్డి వృత్రాసురుడు మహాశక్తివంతుడుగా నిలిచాడు. ఇంద్రుడు యెన్నిసార్లు యుద్ధంచేసినా వజ్రాయుధ ప్రయోగంచేసినా వృత్రాసురుణ్ని సంహరించలేకపోయాడు. అతనిపై విజయం సాధించలేకపోయాడు. కాగా చివరికి వృత్రుడు యింద్రుణ్ని సంహరించ డానికై అభిచారక్రియతో మంత్రప్రయోగం చేస్తూ వుంటాడు. అప్పుడు యింద్రుడు తన వజ్రాయుధాన్ని అనేకసార్లు ప్రయోగించి వృత్రుని వేదమంత్రోచ్చారణలో స్వరదోషాలు వచ్చేట్లుగా చేస్తాడు. వేదమంత్రప్రయోగం చేస్తున్న వృత్రుడు "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అన్న వాక్యాన్ని స్వర నిర్దేశంతో "యింద్రునియొక్క శత్రువును వృద్ధిపొందించుము" అని అర్థం వచ్చేట్లు చదవా లనుకొని యింద్రుని వజ్రాఘాతంవల్ల జరిగిన స్వరాల తబ్బిబ్బుతో "యింద్రుడైన శత్రువును వృద్ధిపొందించుము" అని అర్థం వచ్చేటట్లుగా మంత్రోచ్చారణ చేస్తాడు. ఈ ప్రయోగంతో యింద్రునికంటే శక్తివంతుడుగా రూపొందా లనుకున్న వృత్రాసురుడు యింద్రునికంటే బలహీనుడై పోగా- యింద్రుడు మరింతగా శక్తివంతుడు అవుతాడు. అప్పుడు యింద్రుడు-వృత్రాసురుడు బలహీనుడైన అదను చూచుకొని తిరిగి వజ్రాయుధప్రయోగంచేసి వృత్రాసురుని శిరస్సును ఛేదిస్తాడు. "ఇంద్రుడు వృత్రాసురుని శిరస్సును ఖండించలేదనీ, ఋషులు దేవతలు ప్రార్థించగా మహేశ్వరుడు వృత్రాసురుని తపశ్శక్తిని హరించగా ఆ తరువాత యింద్రుడు వజ్రాయుధంతో వృత్రాసురుణ్ని కొట్టి అతని జవసత్వాలను పోగొట్టి ఓడించాడనీ, ఈ విధంగా ఓడిపోయిన వృత్రుడు యింద్రపదవివంటి వాటిమీద వ్యామోహం లేనివాడుకాబట్టి "అవిచలితుడై'' వుండగా రాక్షస గురువైన శుక్రాచార్యుడువచ్చి "ఎందు కిట్లా అవిచలితుడవై ఉన్నావు?" అని ప్రశ్నిస్తే కలిమిలేములు కాలవశాలు. బుద్ధి జ్ఞానం లేనివారు వాటివల్ల సుఖదుఃఖాలు పొందుతారు. నా కటువంటి ఆశాపాశాలు ఏమీ లేవు" అని వృత్రుడు సమాధాన మిచ్చాడనీ, అయినా శుక్రాచార్యుడు వృత్రుని పరీక్షించడానికి యెంతవాదించినా తన కేకోరికా లేదనీ యింద్రశక్తికి మూలమైన మహావిష్ణు మహిమను బోధించి అతనిలో ఐక్యమయ్యే మార్గాన్ని తెలుపవలసిందనీ వృత్రుడు కోరగా- శుక్రుడు అప్పుడే అక్కడకు వచ్చిన సనత్కుమారుణ్ని వృత్రాసురుడికి విష్ణుమాహాత్మ్యం చెప్పవలసిందిగా కోరినట్లూ- తరువాత సనత్కుమారునివల్ల మహావిష్ణు మాహాత్మ్యం విని వృత్రుడు తనకైతాను ప్రాణాలు విడిచి ఆ అనంతుణ్ని చేరినట్లూ" మహాభారతంలోనే ఒకానొక కథ వున్నది. ఇది వాస్తవం కాదు. పైగా యింద్రుడు వృత్రాసురుని శిరస్సును ఖండించినట్లు ఋగ్వేదంలోనే స్పష్టంగా ఉన్నది.

అయమిన్ద్రో మరుత్సఖా వి వృత్రస్యాభినచ్ఛిరః । వజ్రేణ శతపర్వణా ॥

(స. శ్రీ. ఋ. - తృతీయ సంపుటం - 8 వ మండలం - 76వ సూక్తం - 2 ఋక్కు - 903 వ పేజీ)

మహాహోమాగ్ని స్వరూపుడుగా, తపస్సంపన్నుడుగా, బ్రహ్మజ్ఞానిగామాత్రమే కాక బ్రహ్మ ప్రత్యక్షాన్నిసైతం పొంది అనేక వరాలు పడసిన వృత్రాసురుణ్ని వధించడం గురించి యెవరు ప్రశ్నించినా ప్రశ్నించక పోయినా యింద్రుని తల్లియైన అదితి, శ్రీ మహావిష్ణువూ వీరిద్దరూ ఆక్షేపించినట్లూ ఆ ఆక్షేపణను రాక్షసగురువైన శుక్రాచార్యుడుసైతం తిరస్కరించి "ఒకవేళ నీవు వృత్రహంతకుడైనయింద్రుణ్ని సంహరించితే నీవు కూడా చంపబడతావు" అని ఆ శ్రీ మహావిష్ణువునే శుక్రాచార్యుడు బెదరించినట్లూ "ఉతమాతా" ఇత్యాది ఋగ్వేద ఋక్కుకు అనేకమంది భాష్యం వ్రాశారు.

**ఉత మాతా మహిషమన్వవేనదమీ త్వా జహతీ పుత్రదేవాః ।**

**అథాబ్రవీద్ వృత్రమిన్ద్రో హనిష్యన్ త్సఖే విష్ణో వితరం వి క్రమస్వ ॥**

(స. శ్రీ. ఋ. - ద్వితీయ సంపుటం - 4 వ మండలం - 18 వ సూక్తం - 11 వ ఋక్కు - 321 వ పేజీ)

వృత్రవధ విషయంలో రాక్షసగురువైన శుక్రాచార్యుడు కూడా యింద్రుణ్ని సమర్థించాడంటే వృత్రవధ యెంత సహేతుకమైనదో అర్థం అవుతుంది. అయినా యింద్ర, అదితి, వామదేవులు ఋషులుగాను దేవతలుగా సైతం రూపొంది వున్న ఈ 18వ సూక్తంలోని ఋక్కులకు ప్రాచీనులు వ్రాసిన భాష్యాలు ప్రామాణికమైనవిగా కనిపించడంలేదు. సూక్తద్రష్టలైన ఋషు లెవరో, మంత్రాధిదేవత లెవరో తెలియని పరిస్థితులలో లభించిన ఈ సూక్తగత ఋక్కులకు "ఆర్షవిజ్ఞానరహితులైన భాష్యకర్తలు వ్రాసిన వ్యాఖ్యానాలు పరమ ప్రామాణికాలు"అని చెప్పడానికి వీలులేదు. యింద్రులనేక మంది వుండగా "యింద్రుడు ఒకడే వున్నట్లు ఆ ఒక యింద్రుడే ధర్మవిరుద్ధంగా యదేచ్ఛాకర్మలు ఆచరించాడు కాబట్టి నేనుకూడా యదేచ్ఛావర్తనుడ నవుతా నని వామదేవుడు యెదురుతిరిగినట్లు దానికి యింద్రునితోసహా అదితి తరలివచ్చి సమాధానం చెప్పినట్లుగానూ వున్న సంభాషణా వ్యవస్థను పురస్కరించుకొని అవతరించిన భాష్యాలు కొంచెమైనా ప్రామాణికాలని యెట్లా చెప్పగలం ? యింద్రునికి వృత్రునితో జరిగిన అనేక యుద్ధాలలో వృత్రాసురుని అనుచరబృందమైన అనేక మందిని యింద్రుడు సంహరించినట్లుకూడా అష్టమమండలంలోని ఈ క్రింది ఋక్కులవల్ల స్పష్టపడుతున్నది.

**తువిగ్రీవో వపోదరః సుబాహురన్ధసో మదే । ఇన్ద్రో వృత్రాణి జిఘ్నతే ॥**

**ఇన్ద్ర ప్రేహి పురస్త్వం విశ్వస్యేశాన ఓజసా । వృత్రాణి వృత్రహఞ్జహి ॥**

(స. శ్రీ. ఋ - తృతీయ సంపుటం - 17 వ సూక్తం-8-9 ఋక్కులు - 567 పేజీ)

అంతేకాదు. దేవతల యజ్ఞభాగాలను అధర్మప్రవృత్తితో రాక్షసులకు యిస్తున్న తొలివిశ్వరూపుణ్ని యింద్రుడు సంహరించాడన్న కోపంతో అతని తండ్రి అయిన త్వష్టప్రజాపతి యింద్రుణ్ని పదవీభ్రష్టుణ్నిచేసి యింద్రపదవి నధిష్ఠించడానికై తపస్సుచేసే మరొక విశ్వరూపుణ్ని సృష్టించాడు. ఈ రెండవ విశ్వరూపుణ్నికూడా యింద్రుడు సంహరించేసరికి మరింత ఉగ్రుడైన త్వష్ట అసలు ఇంద్రుని యింద్ర పదవీభ్రష్టత్వకోసం కాదు-యింద్రుణ్ని సంహరించి హరింపచేయాలనే దృష్టితో ఆ లక్ష్యసిద్ధికోసం వృత్రాసురుణ్ని సృష్టించాడు. యింద్రుడు నానా అవస్థలూ పడి వృత్రాసురుణ్ని కూడా సంహరించిన తరువాత- "త్వష్ట మరింతగా ఆగ్రహించి పట్టుదలకుపోయి మరొక ఘోర రాక్షసుణ్ని యెవణ్ని సృష్టిస్తాడో? లేక తనకు తానుగానే యింద్రవధకు పూనుకుంటాడోయేమో'' అన్న భయం యింద్రునికి కలగడం సహజం. అందువల్ల యింద్రుడు ముందాలోచనతో దూరదృష్టితో ఈ విలయాలకు కారకుడైన అసలు త్వష్టప్రజాపతినే సంహరించాడని ఈ ఋక్కు పేర్కొంటున్నట్లు ప్రాచీనులైన అనేకమంది వేదజ్ఞులు భావించారు.

**కస్తే మాతరం విధవామచక్రచ్ఛయుం కస్త్వామజిఘాంసచ్చరన్తమ్ ।**

**కస్తే దేవో అధి మార్డీక ఆసీద్ యత్ ప్రాక్షిణాః పితరం పాదగృహ్య ॥**

(స. శ్రీ. ఋ-ద్వితీయ సంపుటం. 4 వ మండలం-18 వ సూక్తం--12 ఋక్కు-321 పేజీ)

ఈ ఋక్కును పురస్కరించుకొని యింద్రుడు త్వష్టప్రజాపతిని సంహరించి వృత్రాసురుని తల్లిని అంటే త్వష్టప్రజాపతి భార్య అయిన "రచన"ను విధవగా చేసినట్లు కొందరు భావించారు. అయితే వేరే ఇంకొందరు అసలు యింద్రుడు తన తండ్రినే సంహరించి తన తల్లినే విధవను చేశాడని యిదే ఋక్కులో పేర్కొనబడినట్లు భావించారు. ఏది యేమైనా యింద్రుడు ఎన్నెన్ని బ్రహ్మహత్యలు కావించినా విశ్వశ్రేయస్సుకోసం చేసిన ఈ హత్యలవల్ల యింద్రునికి బ్రహ్మహత్యా పాపం రాకపోయినా - మహాయజ్ఞాగ్ని స్వరూపుడుగా అవతరించి బ్రహ్మజ్ఞానిగా బ్రహ్మ ప్రత్యక్షంతో అతనివద్ద నుంచి అనేక వరాలు పొందిన తొలి విశ్వరూపుని మించిన మహాబ్రహ్మజ్ఞాని అయిన వృత్రాసురుణ్ని సంహరించడంవల్ల యింద్రునికి బ్రహ్మహత్యా పాపం అంటి ఉండవచ్చును. అపర బ్రహ్మ అయిన త్వష్టప్రజాపతిని సంహరించడంవల్ల కూడా బ్రహ్మహత్యా దోషం యింద్రునికి సంప్రాప్తమై ఉండవచ్చును. అశ్వమేథయాగం చేయించటంద్వారా యింద్రుని బ్రహ్మహత్యాపాపాన్ని పోగొట్టవలసిందని ఋషులకు అగస్త్యుడు సలహా యిచ్చినట్లూ ఋషులు ఆ సలహాను పాటించి తదూరంగా యింద్రుణ్ని బ్రహ్మహత్యాపాప విముక్తుడుగా చేసి పునీతుణ్ని చేసినట్లూ పురాణాలలోనే కథలు వున్నాయి. వివిధ వేదమంత్రాలతో, శుద్ధస్వరాలతో

విశుద్ధ సామాలతో యింద్రుడు ప్రక్షాళిత పాపపంకిలుడై పునీతు డయ్యాడని ఋగ్వేదంలోనే వక్కాణించబడినట్లు యిదివరకే పేర్కొనడం జరిగింది. దుష్టస్వరమంత్రోచ్చారణలతో అశక్తుడై పోయిన వృత్రాసురుణ్ని యింద్రుడు సంహరించుతున్నప్పుడు వృత్రుడు ఆగ్రహించి "నీవు ఇటుకరాయివై ఉందువుగాక!" అని యింద్రుణ్ని శపించినట్లూ, ఆ తరువాత యింద్రుడు మహావిష్ణువును ప్రార్థించి అతని అనుగ్రహంతో శాపవిముక్తి పొందినట్లూ, మహాభారతంలో వేరొక కథకూడా వున్నది. దీనివల్ల వృత్రాసురుడు యెంతటి శక్తి సంపన్నుడుగా ఉద్భవించాడో "యెంతటి మహాగ్ని తేజస్స్వరూపుడుగా పెరిగిపెద్దవాడై విస్తృత వ్యాప్తి చెందాడో! మనం గ్రహించ వచ్చును. అయినా యింద్రుడు సామాన్యుడు కాడు. "మహావిష్ణ్వంశా సంభూతుడు. బ్రహ్మమాహేశ్వర స్వరూపుడు. మహావీరుడు. వీరమాహేశ్వరుడు." అనడంలో విశేషంలేదుగాని బ్రహ్మ స్వరూపుడుగాను, వీరబ్రహ్మ స్వరూపుడుగాను, ఈ క్రింది ఋక్కులో వేదమే వర్ణించిందంటే యింద్రుడు యెంతటివాడో మనం గుర్తించవలసి వుంటుంది.

బ్రహ్మన్ వీర బ్రహ్మకృతిం జుషాణో ఒర్వాచీనో హరిభిర్యాహి తూయమ్ ।

అస్మిన్నూ షు సవనే మాదయస్వోప బ్రహ్మాణి శృణవ ఇమానః ॥

(స. శ్రీ. ఋ - తృతీయ సంపుటం - 7 వ మండలం - 29 వ సూక్తం - 2 ఋక్కు - 111 పేజీ)

యింద్రుడు ఒక్కడు కాదన్నది కళ్ళకు కడుతున్న నగ్నసత్యం. నీచాతి నీచాలైన అనేక అకృత్యాలకు కేవల స్వార్థ పరత్వంతో అసహన ఈర్ష్యాద్వేషాలతో దేవ మానవ రాక్షసాది భేదాలు లేకుండా అందరినీ అష్టకష్టాలపాలు చేసిన దుష్టేంద్రుని సంగతి కాదు- విశ్వశ్రేయస్కరుడూ, సృష్టిస్థితి లయాత్మకమైన ప్రకృతి ప్రభా ప్రతిభాసంపన్నుడూ, త్రిమూర్త్యాత్మకుడూ, అయిన యింద్రుడు దేవేంద్రుడే అవుతాడుకాని మానవేంద్రుడూ కాడు. రాక్షసేంద్రుడూ కాడు.

## ద్వైతాద్వైతుడు!

వామనావతారానికి మూలమైన మహావిష్ణు ద్వైతాద్వైత రూప వ్యవస్థను త్రిపాదాత్మక విశ్వవ్యాపిత్వ వ్యవస్థను ఋగ్వేద అష్టమ మండలంలోని 52 వ సూక్తంలోవున్న యీ క్రింది రెండు ఋక్కులలోనూ చక్కగా అభివర్ణించడం జరిగింది.

య ఉక్థా కేవలా దధే యః సోమం ధృషితా పిబత్ ।

యస్మై విష్ణుస్త్రీణి పదా విచక్రమ ఉప మిత్రస్య ధర్మభిః ॥

యస్య త్వమిన్ద్ర స్తోమేషు చాకనో వాజే వాజిఞ్ఛతక్రతో ।

తం త్వా వయం సుదుఘామివ గోదుహో జిహూమసి శ్రవస్యవః ॥

(స. శ్రీ. ఋ. - తృతీయ సంపుటం - 729_794 పేజీలు)

శ్రీమహావిష్ణువుకు సంబంధించిన విభిన్న వివిధ అవతారా లన్నీ కేవల ద్వైతపరాలో అద్వైతపరాలో అయి మాత్రమే అవతరించాయి. కాని వామనావతారం ఒక్కటిమాత్రం అటు ద్వైతపరంగానూ-యిటు అద్వైతపరంగానూ రెండింటికీ ప్రతీకగా వెలు గొందడం విశేషం. సృష్టి స్థితి లయాత్మకత్వంలో లయానంతరమహావిష్ణుశక్తి స్థితి వ్యవస్థనుసైతం శాశ్వతంగా ప్రతిబింబించే యీ ద్వైతాద్వైత దేవతాప్రతిపాదన మహత్తరమైనది.

## ఆదిత్యుడు వేరు - సూర్యుడు వేరు

ఆదిత్య సూర్యాద్యాది శబ్దాలు పర్యాయపదాలుగా బ్రాహ్మణాలకు పూర్వకాలంనుంచికూడా భ్రమ ప్రమాదాలకు లోనై భావించడం జరిగింది. ఆదిత్య మహాగ్రహాలు ద్వాదశ సంఖ్యకుమాత్రమే పరిమితాలు. సూర్యులు అంటే సౌరమండలాలు లెక్కకు మిక్కిలిగా యెన్నివున్నాయో యెవరూ చెప్పలేనన్ని వున్నాయి. ఈదృష్ట్యానే "ఆదిత్యా ద్వాదశ"అని ఆదిత్యులు పన్నిండుగా చెప్పిన వేదమే "దశదిశో నానా సూర్యాః" అని దశదిక్కుల్లోనూ అనేకమంది సూర్యులున్నారని చెప్పింది. ఆ సౌరగోళాలను సంఖ్యాపరిమితితో బంధించి గుణించి గణించలేకపోయింది. బ్రాహ్మణాలకాలంనుంచి ఆదిత్యశబ్దాన్ని సూర్యపర్యాయ వాచకంగా పొరపాటుగా చెప్పుకొనడం

జరుగుతున్నది. "ద్వాదశ మాసాః పంచర్తవస్త్రయః ఇమే లోకా అసావాదిత్య ఏకవింశః" (ఐ. బ్రా. 1-30) † అని ఐతరేయ బ్రాహ్మణంలో పొరపాటుగా చెప్పినదాన్ని పట్టుకుని "ఆదిత్యుడంటే సూర్యుడేనని చైత్రాది-లేదా-మేషాది ద్వాదశ మాసాత్మకత్వంలో సూర్యుడు ద్వాదశాదిత్యులుగా పరిగణనకు వచ్చాడని" అతి ప్రాచీనకాలంనుంచి పండితులు భావించి వివిధ శాస్త్రేశాస్త్ర గ్రంథాలలో వ్రాసిపెట్టడం జరిగింది. అనేక సౌరమండలాలున్నాయని వేదమే ఘోషిస్తుంటే సూర్యులు పండ్రెండుగురున్నారని ద్వాదశ సంఖ్యకు పరిమితం చెయ్యడమేమిటి అజ్ఞానం కాకపోతే! వేదఖగోళ విజ్ఞానప్రకారం ఆదిత్యులు వేరు, సూర్యులు వేరు. వేద విజ్ఞానాన్ని అనుసరించబట్టే "ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్" అని భగవద్గీత ఆదిత్యులలో విష్ణువనే ఆదిత్యుడుగాను, ప్రకాశవంతమైన సూర్యుల్లో "రవి" అనబడే సూర్యుడుగాను వివేచించి ఆదిత్య-సూర్యగ్రహాలు విభిన్నమైనవని స్పష్టపరచింది. త్రిమతాచార్యులు ముగ్గురూ యీ విభిన్న ఆదిత్య-సూర్యవ్యవస్థలను వేద ప్రోక్తాలుగా గుర్తించలేక యీ సందర్భంలో ఆదిత్య శబ్దాన్ని సౌరపరంచేసి భగవద్గీతా భాష్యాలలో వ్యాఖ్యలు వ్రాయడం జరిగింది. ఒకే ఒక శ్లోకంలో తన రూపంగా వివేచన చేయడంలో పునరుక్తిగా ఆదిత్య-రవులను యెందుకు పేర్కొంటాడనైనా వారు ప్రశ్నించుకోకుండా ఏకార్థకత్వ ప్రతిపాదన చేశారు. అయితే ఋగ్వేదం అష్టమ మండలంలో 69వ సూక్తంలో ఉన్న యీ క్రింది ఋక్కులో ఆదిత్య స్థానాలు త్రిసప్త సంఖ్యకు (21 సంఖ్యకు) పరిమితాలుగా అభివర్ణించినట్లు గ్రాహ్యానడం జరిగింది.

> ఉద్యద్బ్రధ్నస్య విష్టపం గృహమిన్ద్రశ్చ గన్వహి ।
> మధ్వః పీత్వా సచేవహి త్రిః సప్త సఖ్యుః పదే ॥

(స. శ్రీ. ఋ. తృతీయసంపుటం-964-867 పేజీలు)

ఆదిత్యులు ద్వాదశసంఖ్యకు పరిమితాలుగదా! మరి ఆదిత్యస్థానాలు 21 గా యేవిధంగా ఉంటాయి?" అని సందేహం రావడం సహజం. ఆదిత్య నామకమహాగ్రహాలు ద్వాదశ సంఖ్యకు (12) పరిమితా లనడంవాస్తవం. ఒక్కొక్క ఆదిత్యుడు కొన్ని కొన్ని సౌరమండలాలకు ఆధిపత్యం వహించి పరిభ్రమిస్తూవుంటాడు. అంటే అనేక గ్రహ నక్షత్రాదిగోళాలను తన పరిధిలో స్థితికాల పరిభ్రమణ బద్ధంచేస్తూ సూర్యుడు వెలుగొందుతన్నట్లే- మన సౌరమండల పరిధిలో అనేక గ్రహనక్షత్రాదులు బద్ధమైవున్నట్లే అనేక సౌరమండలాలు ఒక ఆదిత్య మహాగ్రహ పరిధిలో ఆ మహాగ్రహశక్తికి లోబడి పరిభ్రమిస్తూవుంటాయన్నమాట. ఇటువంటి మహాగ్రహ రూపాలైన ఆదిత్య మహాగ్రహాలు మొత్తం పన్నిండు ఉన్నాయి. ఈ పన్నిండు ఆదిత్య మహాగ్రహాలలోను "విష్ణు" నామకమైన మహాగ్రహం మిగిలిన పదకొండు ఆదిత్య మహాగ్రహాలకంటే మరింత మహత్తరమైనది. మహిమాన్విత మైనది. మహావిష్ణునామక ఆదిత్య మహాగ్రహానికి సృష్టి స్థితిలయాత్మక మహాశక్తులన్నీ సమానశక్తితో అసమాన పీఠత్రయంగా త్రిస్థానాలుగా మూర్తీభవించి ఉంటాయి. కాని మిగిలిన పదకొండు ఆదిత్యమహాగ్రహాలలోను విష్ణుస్థితిశక్తి అతిసామన్యంగావుండి అవి అటు దశవిధబ్రహ్మకళాశక్తులతోనూ

† ఏకవింశతి స్థానాలు అంటే ద్వాదశమాసాలు అయిదు-మూడు ఋతువులు అని మొత్తం 12 + 5 + 3 = 21 అని బ్రాహ్మణాలకాలంనుంచీ భావించడం జరిగింది. ఇది శుద్ధ పొరపాటు. ద్వాదశ మాసాలు సంవత్సరకాలంలో భాగాలేకాని స్వతంత్ర వ్యవస్థ కలవి కావు. వేద ఖగోళ విజ్ఞానప్రకారం ఆరు ఋతువులు సంవత్సరకాలంలో సామాన్యవ్యవస్థ కలవి. పంచ ఋతువులు సకృత్తుగా వచ్చే లుప్తమాన వ్యవస్థకులోనైన సంవత్సర కాల ఋతువ్యవస్థకు సంబంధించినవి. "త్రినాభి చక్రమ్" ఇత్యాది దీర్ఘతమపఠిత ఋక్కును పురస్కరించుకొని మూడు పెద్ద ఋతువులని కొందరు బ్రాహ్మణాల కాలంలోనే భావించారుకాని అవి మూడు పెద్ద ఋతువులు కావు. రెండు ఋతువులు ఒక నాభిగా పరిగణనకు వచ్చే త్రికాలాత్మక వ్యవస్థను (వేసాకాలం-వర్షాకాలం-శీతాకాలంగా) ప్రతిబింబించేది "త్రినాభి" వ్యవస్థ. ఇది ఉష్ణ-జల-శీతనాభులకు ప్రతీకగా నిలిచిన కాలవ్యవస్థ. ఇదికూడా ద్వాదశ మాసాల వలె, షడృతువుల వలె, లుప్తమాన భరితాలైన పంచ ఋతువుల వలె- సంవత్సరాత్మక కాలవ్యవస్థలో అంతర్గతాలు మాత్రమే. వీటిని ఆదిత్యస్థానాలుగా కాదు కనీసం సూర్యస్థానాలుగా పేర్కొనాలన్నా యిందులో నిర్ణీతమైన వ్యవస్థ లేదు. ఈ వ్యవస్థను శుక్ల-కృష్ణ పక్షాలకు, 360-లేదా 365 రోజులకు- దివారాత్రులకు నైతం వర్తింపచేయవచ్చును. అయినప్పుడు యీ స్థానాలు ఏకవింశతి సంఖ్యకు పరిమితం కానేరవు. కావు. కాగా యీ పై బ్రాహ్మణ వాక్యార్థం అప్రామాణికమని వేరే చెప్ప నవసరంలేదు.

దశవిధ రుద్రకళా శక్తులతోనూ ప్రతి ఆదిత్యగ్రహమూ బ్రహ్మ శివ స్థానాలలో ఒక్కొక్కటి యిరవై స్థానాలు - పీఠాలు- కలిగిఉంటుంది. కాగా సృష్టిలయాత్మక శక్తులతో విష్ణ్వితరాలైన ఆదిత్య మహాగ్రహాలు వింశతి (యిరవై) స్థాన వ్యవస్థలతో నిలువగా మహావిష్ణునామకాదిత్య మహాగ్రహం ఏకైక మైన మహత్తర మహామహిమాన్విత సమానాసమానశక్తిప్రభాసంవలితమై సంకలితమై సృష్టి స్థితిలయాత్మక మహాశక్తి కేంద్రంగా వెలుగొందుతుందన్నమాట. అందువల్లనే ఆదిత్యులు ద్వాదశ సంఖ్యకు పరిమితాలే అయినా యీ మహావిశ్వసృష్టిలో వాటి మహాస్థానాలు ఏక వింశతిగా- [యిరవై యొక్కటిగా]-ఋగ్వేదం అభివర్ణించింది. అసలు అనేకానేక సౌరమండలాల వ్యవస్థనే గుర్తించలేని నేటి ఆధునిక విజ్ఞానలోకం వేదర్షులు తమ దివ్య చక్షువుతో గుర్తించిన సౌరమండలాలకు మూలభూతాలై ఆధారభూతాలైన ఆదిత్యమహాగ్రహవ్యవస్థలను సృష్టి – స్థితి లయాత్మక వ్యవస్థల మూలశక్తి స్వరూపాన్ని యెప్పటికి గుర్తించగల్గుతుందో! యెన్నెన్ని జన్మలకు యెన్నెన్నికోట్ల సంవత్సరాలకు గుర్తించ గల్గుతుందో !

## నదులు

అత్యంత ప్రాచీనకాలంలో అపూర్వంగా అగాథంగా ఖగోళపరిశోధనలుచేసిన వేదర్షులు అనంత విజ్ఞాన ప్రతిబింబకాలైన వేదవిషయాలను విజ్ఞాన ప్రతిఫలాలనుదృష్టిలో పెట్టుకొని యీ విజ్ఞానాన్ని సర్వజనవ్యాప్తం చెయ్యడానికి - వీలైనంత యెక్కువ కాలం విజ్ఞానాన్ని ప్రజల్లో నిలపడానికి భూగోళంమీద ఖగోళప్రతిబింబకమైన ఒకానొక చిత్రపటంవంటి వ్యవస్థను యేర్పరచినట్లు కనిపిస్తున్నదని కొన్ని విశేషాలను నా పరిశోధనారచన "శ్రీ విరూపాక్ష-శ్రీరామశాసనములు; - ఆరవీటి వంశచరిత్ర" † అన్న గ్రంథంలో కొంత వివరించి వున్నాను. వేదఖగోళ విజ్ఞానులు ఖగోళంలోవున్న వివిధ గ్రహనక్షత్రాదుల వర్గాలను దృష్టిలో పెట్టుకొని వాటికి చిహ్నంగా ప్రత్యేక నామాలను వస్తుస్థలనిర్దేశాలతో ఒక చిత్రపటంవలె భూమిమీద వివిధ ప్రాంతాలకు యేర్పరచినట్లు కనిపిస్తున్నది. ఆర్షవిజ్ఞానదృష్ట్యా అగాథమైన సృష్టివ్యవస్థను పరిశీలిస్తే ఒక్క భూమండలమేకాదు మొత్తం సృష్టే భగవంతుని ఒక లీలగా క్రీడగా కనిపిస్తుంది. దీన్ని లీల అనడం తప్ప మన ప్రాచీనులు మరొకమాట అనలేకపోయారు. ఈ లీలలో అగాథమైన విచిత్రం కూడా వున్నదేమో అనిపిస్తుంది. భూమండలంలో ఆర్యావర్తానికి, ఈ రూపంగా ప్రాచీన భారతదేశానికి, సృష్టిలో సహజంగా ఒకవిశిష్టత వున్నట్లు కనిపిస్తున్నది. ఖగోళంలో ఉత్తరదిగ్భాగంలో బ్రహ్మాండమైన హిమగోళాలున్నాయని ఆధునిక ఖగోళశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. కొద్ది సంవత్సరాలక్రిందట రష్యాలో ఎడారివంటి ఒక పెద్దప్రదేశంలో ఒక గ్రామమంత బృహత్తరమైన మంచుగడ్డ ఆకాశంలోనుంచి పడింది. దీనిని పరిశీలించిన తరువాత ఉత్తరఖగోళంలో హిమగోళా లున్నాయని రష్యావైజ్ఞానికులు అభిప్రాయపడ్డారు. పార్వతి అనబడిన నక్షత్రపుంజం ఖగోళంలోని ఆ హిమగోళాలనుంచి ఉద్భవించింది కావచ్చును. అయితే ఇక్కడ మనం గుర్తించవలసిన విచిత్రవిషయం భారతదేశానికి సరిగ్గా ఉత్తర దిగ్భాగంలోనే హిమాలయ పర్వతాలుండడం. అందుకే అసలు భారతదేశానికి సృష్టిలోనే యేదైనా ప్రత్యేకత ఉన్నదేమోనని అనిపిస్తున్నది. ఈ ప్రత్యేకతే లేకపోతే "భారతదేశంలో పుట్టినంతమంది మహర్షులు ప్రపంచంలో మరెక్కడా పుట్టలేదేమి ?" అన్న ప్రశ్న యెదురవుతుంది. ఖగోళంలో నక్షత్రరూపమైన గంగానది విష్ణుపాదోద్భవి అయి మిథునరాశిగా వున్న నక్షత్రరూపమైన శివుని జటాజూటంమీదకు వచ్చి దిగువకు జారిపోతున్నట్లు కనిపిస్తుంది. ఆకాశంలోవున్న యీ గంగకు ప్రతిబింబంగా భూమిమీదవున్న ఒక నదికి గంగానది అని పేరుపెట్టినట్లు కనిపిస్తున్నది. యమునా, సరస్వతీ, కృష్ణా, గోదావరీ మొదలైన జీవనదులన్నింటికీ వివిధ ప్రవాహాలవలె బారులు తీరివున్న నక్షత్రాల శ్రేణులను దృష్టిలోపెట్టుకొని పేర్లు పెట్టినట్లు తోస్తున్నది. సుప్రసిద్ధ క్షేత్రాలు, దేవాలయాలు ప్రాచీనకాలంలో వెలసినవన్నీ ఖగోళంలోని దివ్యశక్తిమంతాలైన నక్షత్రాలకు ప్రతిబింబకాలుగా యేర్పరచినట్లు కనిపిస్తున్నది. ఈ సిద్ధాంతాన్ని మనం ఆమోదించనప్పుడు "ఆకాశంలో గంగ పేరుతో నక్షత్ర సముదాయం యెందుకుండాలి ? దాని కాపేరు యెందుకు పెట్టాలి ? శతసహస్రాబ్దాలుగా గంగానదిని ఆ పేరుతోనే యెందుకు పిలువవలసి వచ్చింది ? ఆ యా నదుల కసలు ఆ పేర్లే యెందుకు పెట్టాలి ?" అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పలేము. కన్యాకుమారి అగ్రమన్నది క్రీస్తు అవతరణ తరువాత ఆ మతప్రభావంతో యేర్పడింది కాదు. అది కన్యారాశికి చిహ్నంగా వేదర్షులు యేర్పరచిన ప్రాంతమేకాని వేరుకాదు. ఈ దృష్ట్యా మన మహర్షులు తమ ఖగోళపరిశోధనలను దృష్టిలోపెట్టుకొని మేషాదిద్వాదశరాశుల ప్రతిబింబంగా భూమండలవ్యవస్థను నిర్ణయించారని భావించవలసివున్నది. మన మహర్షులు ఖగోళంలోవున్న మేరువుకు చిహ్నంగా భూమండలంలోని ఒక పర్వతానికి మేరువు అని పేరు పెట్టివుండవచ్చును. ఖగోళంలోని వివిధనక్షత్రరూపాలైన మహాగోళాలకు చిహ్నాలుగా వింధ్యాది పర్వతనామాలనుసైతం మన మహర్షులు యేర్పరచి వుండవచ్చును. ఇంతమాత్రంచేత భూమిమీదవున్న వస్తుస్థలాదులు ఖగోళంలో వున్నవాటితో దీటురాగలవి- సమానమైనవి అని అనుకొనడం పొరపాటే కాగలదు. కొన్నికోట్ల భూమండలాల వైశాల్యంకల ఖగోళంలోని కన్యారాశిని భూమిమీదవున్న కన్యాకుమారి అగ్రంతో మనం పోల్చగలమా ? ఇదే విధంగా యెన్నెన్నో కోట్ల భూమండలాలను

† శ్రీ విరూపాక్ష - శ్రీరామశాసనములు – ఆరవీటి వంశచరిత్ర; రచన:- వాఙ్మయమహాధ్యక్ష, "కళా – ప్రపూర్ణ" డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య - ప్రచురణ- ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం - పరిశోధనాలయం - హైదరాబాద్ (1973 ప్రచురణ.)

మించివున్న నక్షత్రఝరియైన ఆ గగనగంగతో పోల్చినపుడు భూమి మీది గంగానది ఆవగింజలో అరవయ్యోవ వంతుకైనా దీటురాదు. గంగ మామూలుగా విష్ణుపాదోద్భవి కాబట్టి విష్ణువుకు పుత్రికగానూ మహేశ్వరుడికి భార్యగానూ పురాణాదులు పేర్కొన్నాయి. వాస్తవం పరిశీలిస్తే గంగ విష్ణువు పుత్రిక కాదు. మహావిష్ణువు వామనావతార కాలంలో భూ నభోంతరాళాలు మాత్రమేకాక విశ్వసృష్టి నంతటినీ ఆక్రమించిన ఆ దేవదేవుడైన మహావిష్ణు పాదాన్ని బ్రహ్మ తన కమండలంలోని ఉదకంతో కడుగగా ఆ పాదప్రక్షాళనంతో జారిన బ్రహ్మకమండలంలోని వుదకమే "గంగ" గా అభివర్ణించ బడిందనీ ఒక వంక విష్ణుపురాణమూ మరోవంక బ్రహ్మవైవర్తపురాణమూ వర్ణిస్తున్నాయి. పైగా గంగ మహావిష్ణువుకు పుత్రిక కాక భార్య అనికూడా ఉద్ఘోషిస్తున్నాయి. మరి గంగ బ్రహ్మపుత్రిక అయినప్పుడు మహావిష్ణువుకు భార్యఅవడంలో విచిత్రమేమీ లేదు. ఒక్క గంగమాత్రమే కాదు. సరస్వతీ యమునలు కూడా మహావిష్ణువు భార్యలే నని బ్రహ్మవైవర్తపురాణం, బ్రహ్మాండ పురాణం వక్కాణిస్తున్నాయి. సరస్వతి బ్రహ్మమానస పుత్రిక - ముఖవాసిని-"శివలింగాంతం చూచా"నని బహ్మ అబద్ధం ఆడినందు వల్ల బ్రహ్మముఖవాసిని అయిన సరస్వతిని నదిని కావలసిందిగా శివుడు శపించినట్లు బ్రహ్మాండపురాణం చెప్తున్నది. సరస్వతి బ్రహ్మపుత్రిక అనీ బ్రహ్మకే భార్య అన్న విషయం సుప్రసిద్ధం. అయితే బ్రహ్మ పుత్రిక అయిన సరస్వతి మహావిష్ణువుకు భార్య అని విశిష్టంగా బ్రహ్మవైవర్తపురాణం పేర్కొంటున్నది - మహాభారత వచనప్రకారం సరస్వతి "సుభద్ర, కనకాక్షి, విశాల, సురితన్వ, ఓఘమాల, సువేదాని, విమలోదక" అని సప్తరూపాలు ధరించినట్లు తెలుస్తున్నది. "కాంచనాక్షి, విశాలానది, మనోరమ, ఓఘవతి, సురేణునది, భీమలోద, సుప్రభ" అని సప్తసరస్వతులుగా సరస్వతీనది భూతలంమీద రూపుదాల్చిందన్న సంగతి ప్రత్యక్ష సాక్షీభూతమైన విషయం. మామూలుగా "యమున" సూర్యాసంజ్ఞల పుత్రిక అని పురాణాది గ్రంథాలలోనే కాక వేదాలలోకూడా ప్రసిద్ధమైనదే. అయితే వేదవిజ్ఞాన ఆంతర్యాలను దృష్టిలో పెట్టుకుంటే "యమ" పరమైన మహాశక్తికి స్థానభూతమైనవాడు "బ్రహ్మ" కాబట్టి "యమున" కూడా బ్రహ్మమానస పుత్రికగా విరాజిల్లక తప్పదు, అందుకే శుక్ల యజుర్వేదం బ్రహ్మకూ యమునకూ వున్న పితృ-పుత్రికాస్థానపరమైన అవినాభావ సంబంధాన్ని పెక్కుసార్లు వర్ణించింది. కాగా బ్రహ్మపుత్రికలుగా వెలుగొందుతున్న గంగ-యమున-సరస్వతులు ముగ్గురూ త్రివేణులై మహావిష్ణువు భార్యలుగా విరాజిల్లే అవకాశం లభించింది. బ్రహ్మ మహావిష్ణు నాభికమల సంజాతు డన్న విషయం దృష్టిలోపెట్టుకుంటే విష్ణువు తండ్రిగాను-బ్రహ్మ పుత్రుడుగాను విలసిల్లుతారు. మరి బ్రహ్మపుత్రికలైన గంగ-యమున - సరస్వతులు ముగ్గురూ మహావిష్ణువుకు మనుమరాళ్లే అవుతారు. పుత్రపుత్రికాసంతతీవివేచనావివక్షను విసర్జిస్తే తాతా మనుమరాళ్లను దృష్టి పెట్టుకొని "మనుమరాలా నన్ను పెళ్లాడతవా!'' - "ఏమేపిల్లా తాతను పెళ్లాడతవా?" వంటి వరుసల సరసల్లాపాలు అవైదికాలని మనం అనడానికి అవకాశాలు లేవు. దీనికి మూలం-మహావిష్ణు-గంగ-యమున-సరస్వతుల తాతమనుమరాళ్ల పరసతీత్వాల సంబంధబాంధవ్యాలేననడంలో విచిత్రమేమీలేదు. మొదట విభిన్న త్రిమార్గగాములుగా గంగ-యమున-సరస్వతులు ఒరవళ్లుపెట్టి పరువు లెత్తినా భూమిమీదవున్న త్రివేణీసంగమంనుంచి పరిశీలిస్తే సరస్వతి అంతర్వాహిని-బ్రహ్మమానసపుత్రికలై వక్షస్థలస్థాయినుంచి అవతరించిన గంగ-యమునలు-బ్రహ్మముఖ సంజనితమై పరిశప్తఅయిన సరస్వతిని తమలో సంలీనంచేసుకొని తాము ఉపరితలస్థితిగతులతో ఉరకలు పెట్టడం అపూర్వ విషయ మేమీకాదు. అయినా ఆ అంతర్వాహిని అయిన సరస్వతీనదిపవిత్రతఅమేయమైనది. అపూర్వమైనది.

త్వే విశ్వా సరస్వతి శ్రితాయూషి దేవ్యామ్। శునహోత్రేషు మత్స్వ ప్రజాం దేవి దిదిడ్ఢి నః ॥

(స. శ్రీ. ఋ. ప్రథమ సంపుటం-ద్వితీయమండలం-42 సూ. 17 ఋక్కు - 825 పేజీ)

అని అసలు సృష్టిజీవాధారశక్తికి మూలభూతాలైన ప్రాణకణాలు సరస్వతీనదిలోనే ఉన్నట్లు వేదమే వర్ణించింది. అంతే కాదు. దీనికి పూర్వం వున్న ఋక్కులోనే "అమ్బితమే నదీతమే దేవితమే సరస్వతి'' (సమూలశ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత-ప్రథమ సంపుటం-ద్వితీయమండలం-42సూ, 16 ఋక్కు-825 పేజీ) అని సరస్వతీనది తల్లులకు తల్లిగా-నదులకు నదిగా - దేవులకు దేవిగా అభివర్ణితమైనది. "సరస్వతీ సప్తథీ సింధుమాతా" (ఋ. 7 మండలం - 36 సూ, 6 ఋక్కు) అని నదీమతల్లులకు తల్లిగా సైతం నుతించబడింది. సరస్వతీనదీ మాహాత్మ్యన్ని వైభవాన్ని ఋగ్వేదం సప్తమమండలంలోవున్న 95,96 సూక్తగతాలైన వివిధ ఋక్కులలో విశిష్టంగా వర్ణించడం జరిగింది.

ప్రక్షోదసా ధాయసా సస్ర ఏషా సరస్వతీ ధరుణమాయసీ పూః।
ప్రభాబధానా రథ్యేవ యాతి విశ్వా అపో మహినా సిన్ధురన్యాః ॥
ఏకాచేతత్ సరస్వతీ నదీనాం శుచిర్యతీ గిరిభ్య ఆ సముద్రాద్।
రాయశ్చేతన్తీ భువనస్య భూరేర్ఘృతం పయో దుదుహే నాహుషాయ ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం. 7 వ మండలం - 370 పేజీ)

"ప్రక్షోదసా'' ఇత్యాదిగాగల ఋక్కులో "విశ్వా అపో మహినా'' అని సరస్వతీ నదియొక్క మహిమాన్వితమైన విశ్వవ్యాప్తిత్వాన్ని విస్పష్టంగా వర్ణించిన విషయాన్ని గుర్తించలేక వేదఅపౌరుషేయత్వాన్ని విస్మరించి, ఏకాచేతత్" ఇత్యాదిగాగల ఋక్కులో

ఉన్న "గిరిభ్య ఆ సముద్రాద్" అన్నగిరి సముద్ర శబ్దాలను చూచి భూగోళ వ్యవస్థితమైన పర్వత సముద్రా లని భావించి వేద విజ్ఞాన విరుద్ధంగా వాస్తవ విరుద్ధంగా కేవలలౌకికార్థాన్ని కొండ రజ్జులు ప్రవచించడం జరిగింది. వాస్తవానికి భూమిమీద ఒక్కలవణ సముద్రం మాత్రమే వున్నది. కాని మిగిలిన ఇక్షు, సుర, సర్పి, దధి, క్షీర, జల, సముద్రాలు ఆరూ భూమండలంమీద లేనేలేవుకదా! అయినప్పుడు "ఆ సముద్రాద్" అన్న శబ్దంచేత భూగోళంమీదవున్న సముద్రమే నిర్దిష్టమైనదని చెప్పడం దుస్సాహసం కాగలదు. "గిరి" శబ్దంచేత అంతరిక్షంలో ఉన్న మేరు వింధ్యాది పర్వతాలు పరిగృహీతా లౌతాయని తెలిసికొనలేక కేవలం భూగోళంమీద ఉన్న హిమాలయం వంటి మామూలు పర్వతం పరిగృహీత మౌతుం దనుకొనడం శుద్ధపొరపాటు. సప్తసముద్రాలను గుర్తించినట్లే సప్తసింధు వులను-అంటే-సప్త నదులనుకూడా వర్ణించిన ఋక్కులను వేదర్షులు గుర్తించి ఉటంకించినట్లు కన్పిస్తున్నది. ~~అసలు "సింధు" శబ్దం~~ అతిసామాన్య నదీవాచకంగానే వేదంలోప్రయుక్తమైనట్లు కూడా స్పష్టపడుతున్నది.

అశ్వ్యో వారో అభవస్తదింద్ర స్కృకే యత్ త్వా ప్రత్యహన్ దేవ ఏకః ।
అజయో గా అజయః శూర సోమ మవాసృజః సర్తవే సప్త సింధూన్ ॥

(స. శ్రీ. ఋ. ప్రథమ సంపుటం-ప్రథమమండలం-32 సూ-12 ఋక్కు - 80 పేజీ)

త్వా యుజా తవ తత్ సోమ సఖ్య ఇన్ద్రో అపో మనవే సుస్రుతస్కః ।
అహన్నహిమరిణాత్ సప్త సిన్ధూ నపావృణో దపిహితేవ ఖాని ॥

(స. శ్రీ. ఋ. ద్వితీయ సంపుటం-చతుర్థమండలం - 28 సూ. 1 ఋక్కు - ... పేజీ)



సింధుశబ్దం కేవలనదీ వాచకమన్న సంగతి గుర్తించక యాస్క్రింది ఋక్కులను చూచి సరైన అవగాహనకు రాలేక "ఓ సింధునదీ! నీవు ప్రవహించునట్టి గోమతీనదిని కూడుటకయి పర్వతోపరిభాగమునుండి క్రిందికి దిగుచు ప్రథమమున "తృష్టామ" యను నది తోడ గలసితివి. తరువాత సుసర్తు, రస, శ్వేత, త్యా, కుభా, మేహత్ను యను నదులతోడగలసి ఒకే రథము నధిష్ఠించిన దానివలె ప్రవహించుచున్నావు." అని ఒకవిధంగానూ, "ఈయేడు నదులును 1 గంగ, 2 యమున, 3 సరస్వతి, 4 శతద్రు, 5 పరుష్ణి, 6 అసిక్ని 7 సింధునదులయియున్నవి". అని వేరొకవిధంగానూ స్వవచన వ్యాఘాతంగా భౌగోళిక చారిత్రకారులు పేరుతో కొందరు దుర్వ్యాఖ్యలు వివరించారు.

ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా ।
అసిక్న్యా మరుద్వృధే వితస్తయా ఽఽర్జీకీయే శృణుహ్యా సుషోమయా ॥
తృష్టామయా ప్రథమం యాతవే సజూః సుసర్త్వా రసయా శ్వేత్యా త్యా ।
త్వం సిన్ధో కుభయా గోమతీం క్రుముం మేహత్న్వా సరథం యాభిరీయసే ॥

(ఋగ్వేదం - దశమమండలం. 78 సూక్తం. 5, 6 ఋక్కులు)

ఒకవంక సింధునదితోసహా కలిపి సప్తనదు లంటూనే "సింధు-గోమతి - తృష్టామ-సుసర్తు - రస-శ్వేతి-త్యా-కుభా-మేహత్ను" నదు లని మొత్తం తొమ్మిది నదులను స్వవచనవ్యాఘాతంగా పేర్కొంటున్నా మనే ఆలోచనకూడా యీ పరిశోధకులకు రానేలేదు. వాస్తవానికి సప్తసింధువులు వేరు-ఆదేవిధంగా "సప్తద్వీపా వసుంధరా" అన్నట్లు సప్తద్వీపాలు వేరు. వీటినే ఆర్షవిజ్ఞానులు సప్త సింధుద్వీపాలనికూడా భావించడం జరిగింది. వేదవిజ్ఞాన దృష్టితో పరిశీలిస్తే "వసుంధర" అంటే భూమి అని అర్థంకాదు. నిజానికి అష్టవసువదార్థ సర్వస్వాన్నీ ధరించగల ధరించగల ఖగోళ వ్యవస్థితమై సృష్టి స్థితికి మూలభూతమైన మహాశక్తి "వసుంధర". ఈ చిక్కుముళ్లలో పడి కొట్టుకోలేకనే లోకమాన్య బాలగంగాధరతిలక్ తన పరిశోధనారచన "Arctic Home of vedas" అన్న గ్రంథంలో "NAY, IT IS MORE LIKELY THAT CELESTIAL RIVERS ARE REFERRED TO EVERYWHERE BY THE EXPRESSION OF SAPTA SINDHAVAH" ( Page 290 ) అని యీ సప్తనదులు "దివిజనదులు" అయివుండ వచ్చు నని పేర్కొనడం జరిగింది.

## వివిధ లోకాలు

విశ్వసృష్టిలో లోకా లెన్ని ఉన్నాయో వేదర్షులు చెప్పినట్లు కనపడదు. "దశదిశో నానా సూర్యాః" అని దశదిశలలోనూ యెన్నెన్ని సౌరమండలా లున్నాయో చెప్పడానికి సాహసించలేని వేదర్షులు లోకా లెన్ని ఉన్నాయో గుర్తించి చెప్పారనుకొనడం పొరపాటే కాగలదు. మామూలుగా త్రిలోకాలంటే స్వర్గ-మర్త్య-పాతాళలోకాలని అనుకుంటూ వుంటాము. ఇది "కట్టె-కొట్టె-తెచ్చె" అన్న మూడు మాటల్లో రామాయణ కథ చెప్పడంవంటిది. అది మధ్యాంతలోకాలను మూడింటినీ పేర్కొంటే సమస్తలోకాలూ పరిగృహీతా లవుతాయని భావించి యీ విధంగా పేర్కొనడం జరిగింది. వక్షాంతరంగా కాక - వీటికి విపులీకరణగా సప్త ఊర్ధ్వలోకాలు - సప్త

అధోలోకాలూ వున్నాయని కొందరు ప్రాచీనులు పేర్కొన్నారు. ఈ చతుర్దశలోకాల్లో "భూలోకం, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం సప్తఊర్ధ్వలోకాలూ, అతల-వితల-సుతల-రసాతల-మహాతల-తలాతల-పాతాళలోకాలు యేడు అధోలోకాలూ వున్నాయని మన ప్రాచీనులు భావించారు. పరమవైజ్ఞానికంగా అవతరించిన యీ చతుర్దశభువనవ్యవస్థ అతి ప్రాచీనకాలంనుంచీ కూడా భారతీయ సంస్కృతిలో సంలీనమైపోయింది. మృతిచెందినవా రెవరైనాసరే పుణ్యలోకాలకు వెళ్తారనీ అందులోనూ సప్తఊర్ధ్వలోకాలలో అత్యున్నతమైనదీ చిట్టచివరిదీ అయిన స్వర్గలోకం పొందుతారని భావించేవారు. చనిపోయినవ్యక్తి యెంతదుర్మార్గుడైనా యెంతటి పాపాత్ముడైనా అతడుకూడా పుణ్యగతులు పొందాలనీ స్వర్గప్రాప్తి పొందాలనీ అత్యంత విశాల హృదయంతో వాంఛించేవారు. ఈ దృష్టితోనే మృతిచెందినవారి దేహానికి అంత్యక్రియలు జరపడానికై తీసుకొనివెళ్లే సందర్భంగా యేడంటే యేడేయేడు మెట్లతో కట్టిన వాసాల వాహనంమీద ఉంచి యేడు కట్లతోనే కట్టిమరీ మోసుకొని వెళ్తారు.* ఈ సాంప్రదాయం అతి ప్రాచీనకాలంనుంచి యిప్పటివరకూ భారతీయ సంఘంలో చెక్కుచెదరకుండా వున్నది. ఒక సౌరమండలంలోనే యెన్నెన్ని లోకాలున్నాయో తెలియదు. యేడేడు పధ్నాలుగు లోకాలు మాత్రమేకాదు పధ్నాలుగుపధ్నాలుగుల (196) లోకాలూ వుండవచ్చు. యింకా యెక్కువ లోకాలూ వుండి వుండవచ్చు. మామూలు దృష్టితోచూస్తేనే స్వర్గలోకమే – యింద్రలోకం – మరి బ్రహ్మలోకం వేరు. వైకుంఠలోకం వేరు. మాహేశ్వర కైవల్యలోకం వేరు. వివిధ దేవతావర్గాల లోకాలు వేరు. మరి "దశదిశో నానా సూర్యాః" అన్నట్లు దశదిశల్లోనూ యెన్నెన్ని సౌరమండలాలున్నాయో చెప్పలేని స్థితిలో బ్రహ్మ – విష్ణు – మాహేశ్వర ఇంద్రాదిలోకాలు మాత్రమేకాక మరెన్నెన్ని లోకాలున్నాయో యెవరు చెప్పగలరు? అయినప్పుడు వివిధ మానవులతో విభిన్న మానవులతో కూడిన లోకాలు కేవలం భూలోకం మాత్రమేకాక! యింకా వేరే మరినాలుగు మానవలోకాలున్నాయనీ–అంటే మొత్తం అయిదు విభిన్న మానవలోకాలున్నాయనీ వేదం యెలుగెత్తి చాటుతున్నది.

యత్ పాఞ్చజన్యయా విశేన్ద్రే ఘోషా అసృక్షత ।
అస్తృణాద్బర్హణా విపో ఽ ర్యో మానస్య స క్షయః ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం. అష్టమ మండలం. 63 సూ. 7 ఋ. 832 పేజీ)

సప్త ఊర్ధ్వలోకాల్లోనూ సత్యలోకం–స్వర్గలోకం–తప్ప మిగిలిన అయిదు లోకాలూ విభిన్న మానవలోకాలేనని కొందరు ప్రాచీన మహర్షులు భావించారు. విభిన్న కాలమానాలదృష్టితో వివిధలోకాలెన్నెన్నివున్నాయో చెప్పడం వేదర్షుల దివ్యదృష్టికే సాధ్యం కానప్పుడు కేవల లౌకిక భౌతిక విజ్ఞానమయమైన ఆధునిక విజ్ఞానులదృష్టికి సాధ్యమవుతుందనుకొనడం పొరపాటే కాగలదు. అనేక ఋక్కులలో "పంచత్వంతోకూడిన జను" లన్న పరమ ఆర్ష వైజ్ఞానిక దృక్పథంతో ప్రయుక్తమైన "పంచజన" శబ్దాన్ని చూచి ప్రాచీన భాష్యకర్తలూ విమర్శకులూ రకరకాల ఊహాపోహలతో అర్థాలు వెల్లడిస్తూ గాలితో యుద్ధం చేశారుగాని ఇది వాస్తవం కాదు. ఇది ఒకానొక అజ్ఞాన వైజ్ఞానిక పంచమత్వంతోకూడిన పంచనార్థమేకాని వేరుకాదు. వరుణ పరివృతాలైన వివిధ లోకాలు యిరవైయొక్కటి (త్రిసప్త) ఉన్నాయనీ - మూడు స్వర్గాలూ–మూడువిధాలైన భూలోకాలుకూడా వున్నాయనీ వేదర్షి తన దివ్యచక్షువుతో గుర్తించిన యీ క్రింది ఋక్కుల్లో ప్రతిబింబితమైనది.

ఉవాచ మే వరుణో మేధిరాయ త్రిః సప్త నామాఘ్న్యా బిభర్తి ।
విద్వాన్ పదస్య గుహ్యా న వోచద్ యుగాయ విప్ర ఉపరాయ శిక్షన్ ॥
త్రిస్రో ద్యావో నిహితా అన్తరస్మిన్ త్రిస్రో భూమీరుపరాః షడ్విధానాః ।
గృత్సో రాజా వరుణశ్చక్ర ఏతం దివి ప్రేంఖం హిరణ్యయం శుభే కమ్ ॥

[స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం. సప్తమ మండలం. 87 సూ. 4, 5 ఋక్కులు. 334 పేజీ]

మూడువిధాలైన దివులూ (స్వర్గాలూ), మూడు రకాలైన భూలోకాలూ అంతరిక్షంలో ఉపరిభాగంలో వున్నాయని మైత్రావరుణియైన వశిష్ఠ మహర్షి "త్రిస్రోద్యావో" ఇత్యాది ఋక్కులో స్పష్టపరిచాడు. అయితే అంతరిక్షంలో ఉపరిభాగంలో మూడు స్వర్గాలూ మూడు భూలోకాలూ వున్నాయని వశిష్ఠుడంటున్నాడంటే యీ "త్రిసంఖ్య" ఉపరిలోకాలకు మాత్రమే పరిమితమై అధోలోకాలలో కూడా దివి భువి లోకాలున్నాయనీ, అవి యెన్నెన్ని ఉన్నాయో తాను యిక్కడ చెప్పబోవడంలేదనీ, మన వెన్నుతట్టి చెప్తున్నాడని అర్థం. అధోలోకాలలో నాగలోకంకూడా ఒకటున్నదని మన మహర్షులు భావించారంటే నాగదేవతాలోకంకూడా ఒక దేవలోకంగా

---

* ఈ విశ్వంలోని సౌరమండల మంతా సూర్యునితోసహా గ్రహనక్షత్రాది వివిధ గోళాలన్నీ ఉత్తరదిశవైపు ప్రయాణం చేస్తున్నాయని ఆధునిక వైజ్ఞానికులు పేర్కొన్నారు. ఒక మన సౌరమండలమేకాదు. మొత్తం సృష్టిలోని సౌరమండలాలన్నీ ఉత్తరంవైపు ప్రయాణించి చివరికి మహావిష్ణు నక్షత్రాలలో లయమవుతున్నాయని వేదాలు వర్ణించాయి. ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకొనే చనిపోయిన వారిదేహాలకుసైతం ఉత్తర దిశలో అంత్యక్రియలు జరపటం పరమ వైజ్ఞానికంగా భావించి వేదర్షులయిన తెలుగువారు ప్రాచీనకాలంలో ప్రతి ఊరుకూ ఉత్తరదిక్కులోనే శ్మశానాలను యేర్పరచారు. ఇది ప్రస్తుతాంశం కాదు.

వారు పేర్కొన్నారనే చెప్పవచ్చు. అయినప్పుడు అధోలోకాలు కేవలం సప్త సంఖ్యకే పరిమితాలనిగాని యీ అధోలోకాలలో యిన్ని దేవలోకాలు యిన్ని భూలోకాలు వున్నాయనిగాని నిర్ణయించి చెప్పడానికి యెవరు సాహసిస్తారు ? అసలు మనం నివసిస్తున్న భూమండల గతమైన భూమి వివిధ ప్రదేశాలలో యెన్నెన్ని రూపాలలో యెన్నిన్ని స్వభావాలతో యెన్ని రకాలుగా ఉన్నదో యెవరూ చెప్పలేరు. అందువల్ల భూలోకంలోని భూమి మూడురకాలని వేదర్షి చెప్పివుంటాడనడానికి అసలు అవకాశం బొత్తిగా లేదు. ఒకవంక "త్రిస్రో ద్యావో" అని స్వర్లోకాలు మూడింటినీ, "త్రిస్రో భూమీరుపరాః" అని ఉపరిలోకాలుగా దేవలోకాలతోపాటు భూలోకాలు మూడింటినీ పేర్కొంటూ మొత్తం షడ్విధ లోకవ్యవస్థను ఘంటాపథంగా చెప్తుంటే యిందుకు భిన్నంగా, వాస్తవ విరుద్ధంగా భూరూపంలో వున్న మట్టి మూడు రకాలుమాత్రమే కానప్పుడు- మట్టి మూడు రకాలని చెప్పినట్లు యేవిధంగా భావించగలం ! మట్టి త్రివిధాలని చెప్పినట్లే యిక్కడ భావిస్తే స్వర్లోక పదార్థంకూడా త్రివిధాలని భావించవలసి వస్తుంది. పైగా అసలు "ఉపరి" శబ్దంతో విభిన్న గోళ-లోక-వ్యవస్థనే స్వీకరించకపోతే "కేవల ఉపరి పదార్థంమాత్రమే త్రివిధాలనీ, అంతరాంతర పదార్థం యెన్నివిధాలో తెలియదనీ" వేదర్షి తెలివి తక్కువగా అవైజ్ఞానికంగా-వాస్తవ విరుద్ధంగా-చెప్పినట్లు కాదా? అందువల్ల వేదర్షి తాను దైవీయ వేదఋగ్దృష్టితో గుర్తించిన ఋక్కులో యిరవై యొక్క లోకాలలో కేవల ఉపరిలోకాలలోనే మూడు స్వర్లోకాలు మూడు భూలోకాలూ వున్నాయని స్పష్టపరిచినట్లు మనం గుర్తించ వలసివున్నది. వశిష్ఠుడు ఉపరిస్థిత త్రివిధ భూలోకాలగురించే పేర్కొన్నాడుగాని మధుచ్ఛందుడు గుర్తించిన యీ క్రింది ఋక్కులో అయిదు భూలోకాలున్నట్లు పేర్కొనడం జరిగింది.

యః ఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి ఇన్ద్రః పంచ క్షితీనామ్ ॥

(స. శ్రీ. ఋ. ప్రథమ సంపుటం- ప్రథమ మండలం. 7 సూ. 9 ఋక్కు- 18 పేజీ)

వశిష్ఠుడు ఉపరితలంలో ఉన్న మూడు భూలోకాలను పేర్కొన్న సంగతి గతంలో గుర్తించాము. కాని అంతరిక్షోపరితలంలో వున్న యీ మూడు భూలోకాలకు తోడు అధోతలంలోవున్న మరి రెండు భూలోకాలనుకూడా మధుచ్ఛందుడు గుర్తించి మొత్తం "పంచక్షితు"లు అయిదు భూలోకా లున్నట్లు అవి వసువులతోసహా యింద్రుని ఆధిపత్యానికి లోబడివున్నట్లు పేర్కొంటున్నాడు. ఈ ఋక్కులోనే కాక యితర సందర్భాలలోకూడా అనేకచోట్ల ప్రయుక్తమైన "పంచక్షితి-పంచజన" వంటి శబ్దాలను చూచి ఆర్షవిజ్ఞానదృష్ట్యా వాటి వాటి అంతర్యాన్ని గ్రహించలేక ప్రాచీన భాష్యకర్తలూ విమర్శక పరిశోధకులూ మన భూమండలంమీద వివిధ మానవజాతుల విషయమై-ప్రత్యేకించి ఆర్యజాతిగత వర్ణాది వ్యవస్థలను దృష్టిలో పెట్టుకుని వీటిని ప్రయోగించినట్లు భావించారు గాని యీ అభిప్రాయాలు కేవలం ఆర్ష విజ్ఞానపరమైన సృష్టివ్యవస్థకే విరుద్ధమైనవి. కాగా యీ సృష్టి లోక భిన్నాభిప్రాయాలు అపరిగ్రాహ్యాలు.

## అస్త్ర విద్యలు

అనంతమైన వేద విజ్ఞానంలో వాయవ్య, నారాయణ, బ్రహ్మ, వైష్ణవ, నాగ, ఆగ్నేయ, మేఘ, కౌబేర, మానవ, యమ, గంధర్వ, ఇంద్ర, పాశుపత, రౌద్ర, బ్రహ్మశిరోనామక, మోహన, వజ్ర, జృంభక, శబ్దభేది, గారుడ, వైద్యాధర, పైనాక, దండ, వారుణ, ఐషీక, కంకణ, కంకాల, కాందర్ప, కాపాల, క్రౌంచ, గభస్తి, నందన, పైశాచ, ప్రమథ, శిఖర, సత్య, సోమ, మకర, సింహ, శార్దూల, శూల, త్రిశూల, గద, సుదర్శనాది అస్త్రాలు అనేకం వాటిమహాశక్తి స్వరూపస్వభావాల వివేచనతో ప్రయోగోప సంహారపురస్సరాలుగా దైవీయాలుగా అభివర్ణితాలయ్యాయి.

త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం - సప్తమ మండలం- 159 సూ. 12 ఋక్కు- 237 పేజీ)

ఇది మృత్యుంజయ సిద్ధిదాయకమైన మంత్రమని కొందరు- అకాల మృత్యు- అపమృత్యుహరణ మంత్రమని కొందరూ అత్యంత ప్రాచీనకాలంనుంచీ మనవారు భావిస్తూవచ్చారు. ఆర్షేయమైన వేద విజ్ఞానాన్ని ఆ అక్షర అనులోమ విలోమ పూర్వకమైన అక్షయ శబ్ద నిశ్శబ్ద శక్తుల ఆంతర్యాన్ని గుర్తించలేనందువల్ల యీ మంత్రఫలితం యే వేదర్షులకో బ్రహ్మర్షులకోతప్ప- అందరికీ అందని పండుగానే నిలిచిపోయింది. కేవల పద-క్రమ- జటాంతంగానేకాదు, ఘనాంతంగా సైతం వేదమంతటినీ కాదు, యీ 59వ సూక్తాన్నిగాని యీ ఋక్కునుగాని అనుదినమూ అనునిత్యమూ "నామస్మరణ" కంటే అధికంగానే చదువుతున్నా-జపం చేస్తున్నా-వారు శబ్ద నిశ్శబ్ద పూర్వక ప్రాణశక్తికి సంబంధించిన సిద్ధినికాని-దానికి మూలమైన వాక్శుద్ధిని కాని పొందినవారు కాకపోవడంతో కాలధర్మం పాలేకాదు, అకాలమరణం పాలుకూడా అవుతూనే వున్నారు. అపమృత్యువాత పడుతూనే వున్నారు. ఆర్షేయమైన భారత దేశంలో పతనమైన ఆర్ష విజ్ఞానవ్యవస్థ మామూలు కాలాకాల మరణాలకు శరణమైపోయింది.

ఒక్క అపూర్వ అమేయ దైవీయమైన శక్తికితప్ప మిగిలినసృష్టిలో ఈర్ష్యాద్వేషాదులు అతిసామాన్యాలు. ఋషులలోనేకాదు ఋతుపర్ణాది రాజర్షులలోను, జైమిన్యాదికాండర్షులలోను, శునశ్శేపాది శ్రుతర్షులలోను, వ్యాసాదిమహర్షులలోను, భేలాది పరమర్షులలోను, వశిష్ఠాది బ్రహ్మర్షులలోను, అంగిరసాది వేదర్షులలోను, నారదాది దేవర్షులలోను కూడా యీ యీర్ష్యాద్వేషాదిదుర్గుణాలు స్థానం సంపా

దించకపోలేదు. విభిన్న ఋషివర్గాల మాటెందుకు? రాక్షస వర్గాలలో యీ యీర్ష్యాద్వేషాదు లన్నీ మామూలే కాని మరి వివిధ దేవవర్గాలలో కూడా వీటికి స్థానం లేకపోలేదు. వీటికి సంబంధించిన కథలూ గాథలూ మనకు పురాణాలలో కోకొల్లలు. ఈ యీర్ష్యాద్వేషాదులు కారణంగా పరపీడనం - హింస మొదలైన దుర్గుణాలన్నీ రూపొంది గూడుకట్టుకొని వివిధ దశల్లో విభిన్న రూపాలలో ప్రతిబింబిస్తూవుంటాయి. కాగా ప్రాణికోటికి సహజంగా ప్రాప్తించే జరావ్యాధి మరణాదులేకాక అసహజంగా - అకాలంలో - కృతకంగాసైతం శత్రుప్రయోగాత్మకంగా జరావ్యాధి మరణాదులు పెక్కు రూపాలలో ప్రాప్తిస్తూవుంటాయి. కేవలం ఔషధాయుధాది ప్రయోగాలవల్ల మాత్రమేకాక తదితర యే పదార్థాలవల్లనైనా యీ బాధలు కలుగవచ్చును. చివరికి వాయువుకూడా ఒక పదార్థమే కాబట్టి దానివల్లకూడా - అంటే వాయుప్రభావంతో - వాయుపీడనంతో మాత్రమేకాదు- వాయుమూలకమైన వివిధ విభిన్న శబ్ద నిశ్శబ్ద శక్తి స్వరూపాలైన అనేక అక్షరమంత్ర ప్రయోగాలతో ప్రభావాలతో కూడా యీ క్షయత్వం ప్రాప్తించవచ్చును. శత్రుకృత వివిధ విభిన్న విరూప దుష్టమంత్ర ప్రభావాలను శక్తులను - తరిమి తరిమి కొట్టడమేకాదు - ఆయా దుష్టశక్తులను ప్రయోగించిన వారినే ఆ శక్తులే యెదురు తిరిగి బాధించి రూపుమాపగల మహిమాన్వితమైన దైవీయమైన అపూర్వశక్తి "అఘోరాస్త్ర" మహాశక్తి. ఈమహాశక్తి సిద్ధి పొందనందువల్ల ఆదిశంకరాదులేకాదు అనేకమంది మహర్షులు కూడా-దుర్భేద్యాలైన శత్రుశక్తుల్ని నిర్జించలేక అష్టకష్టాలపాలైనారు. అకాలమరణాల పాలైనారు. అపమృత్యువుల పాలైనారు. శ్రీమహావిష్ణుహస్తగతమైన సుదర్శనవిష్ణుచక్రశక్తికి తరువాత అతిలోక మహత్తర దైవీయ శక్తిగా పేర్కొనదగింది "అఘోరాస్త్ర" మహాశక్తి.

తత్ సు నః శర్మ యచ్ఛతా౽౽దిత్యా యన్ముమోచతి ।
ఏనస్వన్తం చిదేనసః సుదానవః ॥
యో నః కశ్చిద్రిరిక్షతి రక్షస్త్వేన మర్త్యః ।
స్వైః ష ఏవై రిరిషీష్ట యుర్జనః ।
సమిత్ తమఘమశ్నవద్దుః శంసం మర్త్యం రిపుమ్ ।
యో అస్మత్రా దుర్హణావాగ్ం ఉప ద్వయుః ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం. అష్టమ మండలం. 18 సూ. 12,13,14 ఋక్కులు. 572-573 పేజీలు)

ఋగ్వేదాష్టమమండలంలో 18 వ సూక్తంలోవున్న యీ ఋక్త్రియంలో అఘోరాస్త్ర మహామంత్ర వ్యవస్థ స్వరూప స్వభావ ప్రభావాలు ఆర్షవిజ్ఞానందృష్ట్యా ప్రతిబింబితా లయ్యాయి. ఈ అఘోరాస్త్రశక్తికి కొంత తక్కువ స్థాయిగల శక్తి పాశవిమోచక శక్తి. యెన్నెన్ని మహత్తరశక్తు లున్నవాడైనా పాశబద్ధుడైతే అతని వద్దవున్న మిగిలిన శక్తు లన్నీ వ్యర్థాలే అవుతాయి. పాశవిమోచకశక్తి రహితుడైన వ్యక్తి తత్పాశబద్ధుడు కాకతప్పదుకాబట్టి అతనివద్దగల శక్తులన్నీ వ్యర్థాలే. అణిమాద్యష్టసిద్ధులన్నీ పొంది దైవ స్వరూపుడుగా - రామునికి ప్రతిగా - నిలువగల ఆంజనేయుడే లంకలో పాశబద్ధుడైపోయి నిర్వీర్యుడుగా నిలిచినప్పుడు - పాశవిమోచకశక్తిలేని ఆంజనేయుని నిస్సహాయతను గుర్తించిన సీతామహాదేవి తనవద్దగల పాశవిమోచకశక్తిని ప్రయోగించి ఆంజనేయుణ్ని పాశవిముక్తుణ్నిచేసి సురక్షితుణ్ని చేస్తుంది. ఈ పాశవిమోచనీమహామంత్రస్వరూపస్వభావాలను అభివర్ణించిన ఋగ్వేద ఋక్కు యిది.

ధ్రువాసు త్వాసు క్షితిషు క్షియన్తో వ్యస్మత్ పాశం వరుణో ముమోచత్ ।
అమో వన్వానా అదితేరుపస్థాద్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం. సప్తమ మండలం - 88 సూక్తం - 7 ఋక్కు - 338 పేజీ)

అమృతసిద్ధి - బ్రహ్మాస్త్రశక్తులకు దీటురాగల మహామహిమాన్వితశక్తిగా యీ పాశవిమోచకశక్తిని పేర్కొనడానికి వీలులేదు కాని కొన్నికొన్ని సందర్భాలలో బ్రహ్మాస్త్రశక్తి వలెనే పనిచేసి బంధవిమోచనం కలిగించగల యీ మహాశక్తి కూడా అల్పమైనదేమీ కాదు. వరుణ దేవాధీనమైన యీ పాశశక్తిని వరుణదేవుడేకాక అమృతవర్షిణీ-బ్రహ్మాదిశక్తులుకూడా ఉపసంహరించగలవు.

## వర్షీకరణం - రకరకాల వానలు

ఘృణిమయమైన ఆదిత్యశక్తి కేవలం భూమండలోపరిస్థితమైన వర్షశక్తి మాత్రమేకాదు సమస్త గోళోపరిస్థితమైన వర్షశక్తిని చివరికి జలనాభినిసైతం హరించి మహోష్ణవ్యవస్థను సృజించగలదు. గతంలో అనేకమంది మహర్షులు యిటువంటి ప్రయోగాలు చేశారు. వరుణు డంతటివాడు ఉచథ్యుని భార్య సౌందర్యానికి మోహితుడై ఆమె నెత్తుకుపోగా ఆగ్రహించిన ఉచథ్యుడు ఒక్క భూమండలంమీది మేఘరాజిలోని నీటినేకాదు వివిధ లోకాలపై నున్న మేఘాల నీటిని—జలనాభిని—చివరికి జలనాభికి మూలమైన వరుణ లోకంలోని జలవ్యవస్థనే హరించి ఆ వరుణలోకాన్ని ధూళిధూసరితం చేసి అట్టుడికినట్లు ఉడికించి ఆ వరుణుణ్నే పాదాక్రాంతుణ్ని చేసుకున్నాడు. ఉచథ్యు డెవరో కాదు—తెలుగువారికి అక్షరాలా తాత- తండ్రి తండ్రి—వేదర్షి- వేదవిజ్ఞానమూర్తి. ఇందుకు భిన్నంగా వర్షీకరణప్రయోగమంత్రజపయజ్ఞయాగాది క్రియామార్గాలుకూడా అనేకంవున్నాయి. మామూలు మేఘరాజిని మాత్రమేకాకుండా జలనాభిని

సైతం ఛేదించి లేదా రంజింపజేసి అనేకరకాలైన వర్షాలను వివిధ లోకాలలో వర్షింపచేయవచ్చును. ఋగ్వేదం సప్తమమండలంలో వున్న 101 - 102 సూక్తాలు ప్రత్యేకించి వర్షీకరణ సూక్తాలుగా మన ప్రాచీన మహర్షులు భావించడం జరిగింది. (చూ. 381 - 382- పేజీలు) "ఆస్యదఘ్నం విగాహ్యాపః ప్రాఙ్ముఖః ప్రయతశ్శుచిః సూక్తాభ్యాం త్రిస ఆదిభ్యా ముపతిష్ఠేత భాస్కరమ్" అన్న "ఋగ్విధాన" గ్రంథంలోని శ్లోకంలో శౌనకుడు ఆ సూక్తాలను మూడుసార్లు పఠించాలని చెప్పినట్లు కొందరు భావింపగా "త్రిస" శబ్దాదిగా వున్న ఋక్కుతో ప్రారంభమైన సూక్తాదిగా రెండు సూక్తాలను పఠించాలని శౌనకుడు చెప్పినట్లు కొందరు భావించారు. నీటికరువువచ్చి నీటికై యెద్దడి యేర్పడినప్పుడుకదా వర్షాలుకావాలని కోరేది! జలాభావస్థితిలో వర్షకామి అయినవాడు వర్షంకురిపించగలిగిన వేరుమార్గాల గురించి చెప్తే ఔచిత్యమూ సార్థకతా వుంటుందికాని "కంఠదఘ్నం"గా నీటిలో నిలబడి జపం చెయ్యాలంటే ఔచిత్య మేముంటుంది ? "అయనే ఉంటే మంగలివాడెందు" కన్నట్లు కంఠంలోతుగల నీటిలో నిలబడి జపంచేయడానికి అవకాశం వున్నప్పుడు అంత నీరే ఉన్నప్పుడు-కొంత ఆలస్యంగానైనా వర్షాలుకురిపించగల మార్గాల్నే-కంఠదఘ్నంగా నీటిలో నిలబడవలసిన పనిలేకుండానే వర్షాలు కురిపించగల మార్గాల్నే అనుసరించికురిపించవచ్చును. ఈ సందర్భంలో 101_102 సూక్తాలను మాత్రమేకాక 103 వ సూక్తాన్ని సైతం వర్షీకరణసూక్తంగా కొందరు ప్రాచీనులు భావించారు. భారతదేశంలో ప్రత్యేకించి తెలుగునాట వర్షాభావం యేర్పడినప్పుడు వర్షం కురవాలని కోరుతూ రకరకాల పాటలు పాడుతూ కప్పల పెళ్ళిళ్ళు చేయడం చిరకాలంగా అనూచానంగా జరుగుతున్నది. వర్షీకరణసూక్తాలుగా శౌనక మహర్షి పేర్కొన్న యీమూడు సూక్తాలకుతోడు పండితమండలిలో సుప్రసిద్ధమైన వరుణసూక్తం వర్షీకరణసూక్తంగా వుండనే ఉన్నది. ఏదో వరుణసూక్తం వర్షీకరణసూక్తంగా ప్రాచీనకాలంనుంచి పండితులు భావిస్తూవచ్చారుగాని ఋగ్వేదదేవతా వ్యవస్థాంతరాంతరాలను పరిశోధిస్తే-వరుణుడు ఇంద్రుడు విభిన్నంగాగాని కలిసికాని దేవతలుగా వున్న సూక్తాలన్నీకూడా విభిన్నాలైన వివిధ వర్షాలను కురిపించగలవేనని తేటతెల్లమవుతున్నది. భూమండలంమీద కురుస్తున్న వర్షం యే కాలంలో కురిసినా యే విధంగా కురిసినా యెంతగా కురిసినా ఒకే రకమైన వర్షమనే అభిప్రాయం సామాన్య ప్రజల్లోనేకాదు పండితుల్లోనూ విజ్ఞుల్లోను విజ్ఞానుల్లోనుకూడా వున్నది. ఇది వాస్తవం కాదు. మామూలుగా మన ప్రాచీనులు చెప్పిన వైద్యశాస్త్రాల ప్రకారమే వర్షపునీరు ఒకరకమైనది కాదు. సాధారణంగా వాననీరు చలువ చేస్తుంది. వీర్యగతమైన మహోష్ణాన్ని కూడా తగ్గించివేస్తుంది. నిద్ర, శ్లేష్మ ప్రకోపం, బలవృద్ధివంటి వాటిని కలిగించడమేకాక సమస్త మలదోషాలను మలాలను నిర్మూలిస్తుంది. వాతాన్ని పెంచి ఆకలిని మందగింపచేస్తుంది. సామాన్యంగా రాత్రిపడిన వర్షపునీరు కఫాన్ని పెంచుతుంది. ఇది సముద్రోదకంతో సరిసమానమైందనికూడా కొందరు భావించారు. వాతాన్నికూడా పెంచేదే అయినా చలువ కారి. పగలుపడిన వాననీరు కఫ విదాహాలను హరిస్తుంది. వాతప్రకోపదమైనా లఘుత్వం కలిగి ఉంటుంది. మేఘచ్ఛన్నమై రాత్రింబవళ్ళు మబ్బు పట్టినప్పుడు కురిసిన వాననీరు సాధారణంగా వాతభూయిష్ఠంగా ఉంటుంది. శోష పోగొట్టి తృప్తి నిచ్చినా కఫాన్ని పెంచుతుంది. శ్రావణమాస వర్షం వాతపిత్త శ్లేష్మాలను ప్రకోపింపజేసి దురదల్ని అనేక వ్యాధుల్ని పుట్టిస్తుంది. ఈ నీరు త్రాగడానికి ప్రశస్తం కాదు. భాద్రపదమాస వర్షపునీరు చిక్కగా ఉంటుంది. మధురంగా కూడా ఉంటుంది. పిత్తరోగాల్ని శమింపజేస్తుంది. అయినా శ్లేష్మవాతాల్ని పెంచి రక్తాన్ని దూషితం చేస్తుంది. ఆశ్వయుజమాసంలోని వర్షం రూక్షగుణం కలదిగా ఉంటుంది. పిత్త ప్రకోపకం- ఆమ్లరసనంభరితం- కాని గుల్మవ్యాధుల్ని, రక్త వికారాల్ని కూడా కలిగిస్తుంది. కార్తీకమాస వర్షపు నీరు చల్లదనాన్ని కలిగించి తాపాన్ని హరిస్తుంది. వాత పిత్త శ్లేష్మహారిగా పనిచేస్తుంది. సమస్త సస్యాలకు మేలు సమకూరుస్తుంది. విదాహాన్ని జ్వరాన్ని హరిస్తుంది. బలాన్ని, వీర్యవృద్ధిని కలిగిస్తుంది. చిత్తానక్షత్ర వర్షం సస్యాలకు కీడు చేసేది ఖరమైనది అనీ, స్వాతి వాన చాలా పథ్యకరమైనదనీ, ప్రాచీనులు కొందరు భావించారు. ఇవి మామూలు వర్షజలాలకు సంబంధించిన విషయాలు. అయితే వసంత విషువచ్చలనంతో అయనాంశచలనమూలకంగా నిలకడలేని ఋతువ్యవస్థతో చైత్రాదివివిధమాసాలలో మారుతూఉండే విభిన్న ఋతు పరిణామాలవల్ల కలిగే ఆ యా వర్షజలాల స్వరూప స్వభావాలు యెప్పటికప్పుడు మాసపౌర్ణిమానక్షత్ర ఋతుప్రారంభ-మధ్య-అంత్య కాలాల వ్యవస్థనుబట్టి మారిపోతూవుంటాయి. ఈ వర్ష జలగుణవ్యవస్థ లనేకం. అందువల్ల ఒక వర్షాకాలంలోనేకాక వివిధ విభిన్న ఋతువులలో కురిసే వర్షాలన్నీకూడా ఏకైకస్వరూపస్వభావాలు కలవి కావని మనం గ్రహించాలి. అసలు మామూలుగా వర్షఋతువులో కురిసే వాన నీరు మినహా మిగిలిన యే ఋతువులో కురిసిన వాన అయినా సర్వప్రాణులకీ వాతపిత్త శ్లేష్మాలను ప్రకోపింపజేసి - ప్రత్యేకించి శ్లేష్మరోగాలను అధికం చేస్తుందనీ, అసలీ వాన నీరు యేమాత్రమూ మంచిది కాదనీ చెప్పిన ప్రాచీనులూ ఉన్నారు. వాస్తవానికి వసంత,గ్రీష్మ,వర్ష, హేమంత, శిశిర, శరద్ ఋతువులలో కురిసే వర్షాలు విభిన్నమైనవే కాని ఏకైక స్వరూప స్వభావాలు కలవి కావు. షడ్విధాలయిన ఈ ఋతుజలాలలో శరద్ఋతువర్ష జలం వియద్గంగానది ప్రభావంతో సంభవిస్తుందని వేదవిజ్ఞానులు పేర్కొన్నారు. "సుశ్రుత"కర్త అయిన ధన్వంతరి వేదవిజ్ఞానాన్ని ప్రతిబింబిస్తూనే శరద్ఋతు వర్షజల విశిష్టతగురించి వక్కాణించాడు అంతేకాక రవి, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్ర గ్రహాల ప్రభావంతో అంటే ఏకైక వ్యస్తగ్రహ ప్రభావంతోను ద్విత్రిచతురాదిగ్రహాల సంయోగ సమిష్టిప్రభావంతోను, అశ్విన్యాది వివిధనక్షత్రాల ప్రభావంతోనూ, వర్షించేజలం ఏకైకశక్తిస్వభావాలు కలదికాదు. చివరికి ఆదిత్య సోమాది విభిన్నసప్తవారాలలో కురిసే వర్షజలగుణాలు కూడా ఏకైకం కావు. అంతేకాదు, అసలు వర్షాలలోనే శతసహస్రాధికమైన భేదాలున్నాయి. ఈ భేదాలు జలరూప వ్యవస్థలోనేకాదు జలస్వభావంలోకూడా వున్నాయి. అసలు జలఉత్పత్తి స్వభావంలోనే యీ విభిన్నత్వా లున్నాయి. ఒక్క భూమండలంమీద రకరకాల వివిధవిభిన్నప్రదేశాలలో మాత్రమేకాదు, భూమీతరాలైన

గోళాలమీద కల విభిన్నవివిధప్రదేశాలలోవున్న జలంసైతం ఏకైకస్వరూపస్వభావాలుకలది కాదు. అనేక విభిన్న స్వరూప స్వభావాలు కలదే. మాటవరసకు భూమండలంమీద ఉన్న నీటిసంగతే చూదాం. భూమి అంతా ఒక్కటే మండలమైనా వివిధ ప్రదేశాలలోవున్న భూమి ఏకైక స్వభావం కలదికాదు. ఈ భూమి స్వభావాలలో యెన్నెన్ని రకాల గుణగణాలుకల భూమి వున్నదో చెప్పడం కష్టం. భూమిమీద యెన్నిరకాల నీరు వున్నా ఆ రకరకాల నీళ్ళన్నీ సూర్యాతపంవల్ల ఆవిరికాక మానవు. ఆవిరియైన నీరు మేఘ రూపం దాల్చుతుంది. మేఘాలన్నీకూడా ఒకటేక మైనవని చెప్పడానికి వీలులేదు. మామూలుగా మనం మేఘవాచకాలు అనుకునే పదాలు మేఘ విశేషాలను వర్ణించే వివిధ శబ్దాలు వాటివాటికి అవి పర్యాయపదాలని అనుకుంటూ వుంటాం. వేద విజ్ఞానదృష్టితో, ఆర్ష విజ్ఞాన దృష్టితో యివన్నీ పర్యాయపదాలు మాత్రం కావు. అభ్ర, మేఘ, వారివాహ, స్తనయిత్ర, బలాహక, ధారాధర, జలధర, తటిత్వాన్, వారిద, అంబుభృత్, ఘన, జీమూత, ముదిర, జలముక్, ధూమయోని ఇత్యాదిగాగల పదాలు సామాన్యపదాలైన మేఘవాచక పర్యాయపదాలు కావు. ఇవన్నీ విభిన్న స్వరూప స్వభాలుగల విశేష మేఘవాచకాలే! ఇదేవిధంగా సంవర్త, ఆవర్త, పుష్కలావర్త, ద్రవణ, కాళ, నీల, మహాకాళాదులు, కాదంబిని, మేఘమాల, మేఘపంక్తి, అభ్రియం, స్తనితం, గర్జితం, రసితం, శంప, శతహ్రద, హ్రాదిని, ఐరావతి, క్షణప్రభ, తటిత్, సౌదామిని, విద్యుత్, చంచల, చపల, మేఘజ్యోతి, ఇరమ్మథ, స్ఫూర్జథు, వజ్రనిర్ఘోష, ఇంద్రధనస్సు, రోహితం, ఋజు, వృష్టి, ధారాసంపాత, ఆసార, శీకర, అంబుకణ, వర్షోపల, కరక ఇత్యాది శబ్దాలన్నీ దేని కదే వ్యస్తంగా విశిష్టార్థదాయకమే అవుతుంది. జలం పేరుకు జలమేగాని జలభేదాలలో శతసహస్రాదిభేదా లున్నాయి. వివిధ తటాకాలు, నదీనదాలు, సముద్రాలు అన్నింట్లోను ఉన్న జల మంతా ఒకే ఒక స్వరూపం స్వభావం కలది కాదు. వీటన్నింటిలోను వున్న విభిన్న జలగుణాలన్నీ జలంతో సూర్యరశ్మితోసహా ఆవిరిరూపం దాల్చి రకరకాల మేఘరూపం దాల్చేవే. లవణ, ఇక్షు, సుర, సర్పి, దధి, క్షీర, జల సముద్రాలలోవున్న నీరు, సప్తగంగలలో వున్న నీరు, విభిన్నమైనదేకాని ఏకైకమైనదికాదు. కాంచనాక్షి, విశాల, మనోరమ, ఓఘవతి, సురేణు, భీమలోద, సుప్రభ, గౌతమి, వశిష్ఠ, వైనతేయ, తుల్యభాగ, ఆత్రేయ, భారద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, భాగీరథి, సుభద్ర, కనకాక్షి, సురతస్వ, ఓఘమాల, సువేణి, విమలోదక, గంగ, యమున, సరస్వతి, కృష్ణ, కావేరి, తుంగభద్రాదులు, తామ్రపర్ణి సింధు, సరయు, నర్మద, నళిని, హ్రాదిని, పావని, తరంగణి, సరిత్, శైవలిని, తటిని, ధుని, స్రోతస్విని, దీవవతి, స్రవంతి, నిమ్నగ, ఆపగ, కూలంకష, నిర్ఝరిణి, రథోవక్ర, త్రిపథగ, త్రిస్రోత, కాళింది, శమన,స్వస, దేవ, సోమోద్భవ, మేఖలకన్యక, కరతోయ, సదానీర, బాహుద, సైతవాహిని, శతద్రు, విపాశ, శోణ,కుల్య, కృత్రిమ, శరావతి, వేత్రవతి, చంద్రభాగ, భీమరథి, ప్రణాళి ఇత్యాదిగాగల నదుల జలాలన్నీ ఒకటి కావు. వర్షపాతానికి మూలమైన వాయువులు కూడా ఒకటి కావు. కాగా విభిన్నవాయు ప్రభావాలతో కురిసే వర్షమూ, జలమూ, విభిన్నమైనదే కాని ఏకైక మైనదికాదు. అయినప్పుడు ఆవహ, సంవహ.అతివహ,అనువాహ,ఏరీవాహ, వాహాది భేదాలతోవున్న విభిన్న వాయుప్రభావాలతో సంభవించే వర్షజలం విభిన్నమైనదే. భూగర్భ గత కౌబేరాది జలనాడులనుంచి సంభవించే విభిన్నజలాలుకూడా ఏకైకస్వభావం కలవికావు.ఎరుపు, పసుపు, ఆకుపచ్చ, మొదలుగాగల ఏడు రంగులలోవున్న జలాలు, వివిధవర్ణ మిశ్రితజలాలు, వేరువేరుగా వుండనే వున్నాయి. జలగుణరసాలకుసంబంధించి మధుర (తీపి) కటు (కారం) లవణం (ఉప్పు) కషాయ (వగరు) ఆమ్ల (పులుపు) తిక్త (చేదు) రసాలతో ఏకైకగుణరసవ్యవస్థతోనే కాక అల్పాధిక మిశ్రితగుణాలతోవుండే విభిన్న వర్షజలాలు అనేకం వున్నాయి. హిత, పాషాణ, అమృత, హీన, నిర్మల, మలినాదిభేదాలతో విభిన్న వర్షజలాలుకూడా వున్నాయి. వివిధ ఖగోళగోళాలలో వున్న చంద్రకాంతాది మణిశిలా ప్రభావాలతోను సూర్యకాంతాది మణిశిలా ప్రభావాలతోను కురిసే వాననీరు కూడా వుంటుంది. సౌగంధిక, కలహారాది పరిమళ పుష్పాలప్రభావంతోను, హల్లక, రక్తసంధ్యక, ఉత్పల, కువలయ, నీలాంబుజ, ఇందీవర, కైరవ, పద్మ, నలిన, అరవింద, మహోత్పల, కమల, కుశేశయ, పంకేరుహ, తామర, సారస, సరసీరుహ, బిసప్రసూన, రాజీవ, పుష్కర, అంబురుహ, పుండరీక, రక్తసరోరుహ, రక్తోత్పల, కోకనదాది వివిధ భిన్నాలైన కలువల పద్మాల ప్రభావంతో కురిసే వర్షాలేకాక దివిజగంగాగతాలు మాత్రమేకాక అనేకానేక వివిధ దేవనదులలోను, మహాసరస్సులలోను ఉండే శతపత్ర సహస్రదళ పద్మ మహా విశాల షండాల ప్రభావంతో కురిసే విశేషవర్షాలు వుంటాయి. కరహాట సౌగంధికాది కందాల ప్రభావంతోనూ, వారివర్ణి, శైవలినుల ప్రభావంతోనేకాక వివిధ కుముద్వతుల మృణాళనాళాల ప్రభావంతో కురిసే వర్షాలు సైతం అనేక విధాలుగా వున్నాయి. వివిధ విభిన్న వృక్షాల ప్రభావంతో కురిసే విభిన్న విశిష్ట వర్షాలు సంకరవర్షాలు అనేకం వున్నాయి. ఉదాహరణకు మైళ్లతరబడిఉన్న కేవల అశోకవృక్ష వనాల మాహాత్మ్యంతో కురిసేవర్షాలు అశోక వృక్షస్వభావ ప్రభావితాలై తద్గుణకాలై వుంటాయి. యిదేవిధంగా అనేక వివిధ తరులతాతండాల ప్రభావంతో విభిన్న వర్షాలు కురవవచ్చును. అనేకానేక ఖగోళ-వృక్షశాస్త్రాల పరంగా సమన్వయ పరచవలసిన వర్షాలు యింకా పెక్కులున్నాయి. హిమశిలలతో కూడిన వర్షాలు [వడగళ్ల వానలు] కురవడం మనం చూస్తూనే ఉంటాము. యిదేవిధంగా వివిధ నవరత్న వర్షాలుకూడా కురియవచ్చును. మామూలు శిలావర్షాన్ని విపరీతంగా కురిపించి యాదవులను బాధించాలని యింద్రుడు ప్రయత్నించగా శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్నియెత్తి యాదవులను కాపాడినవిషయం భాగవతంవల్ల తెలుసుకున్నాము. ఈ విధంగా శిలావర్షమేకాదు యిసుక వర్షం, బురదవర్షం, నత్తగుల్లల వర్షం, ఆలిచిప్పల ముత్యపుచిప్పల వివిధశంఖాల వర్షాలూవున్నాయి. చివరకి వివిధ క్రిమికీటకాదుల వర్షాలేకాక, ఝష మత్స్యాదివివిధమీనాల వర్షాలు గంటక, శకులార్భకాది పిల్లచేపలతో కూడిన 'శెల్ల'ల వర్షాలు, పీతలు, క్షుద్రాండ, మత్స్య సంఘాత, పోతాధాన, నడమీన, శఫరి, ప్రోష్ఠి, ఉలూపి, రోహిత, మద్గుర, శాల

రాజీవ, శకుల, సహస్రదోష్ట్రి, తిమి, తిమింగిల, తిమింగిలగిల, మండూకాది జల జంతువుల వర్షాలుకూడా వున్నాయి. విభిన్న క్షుద్ర, నీచ సర్ప మహానాగాదివర్షాలూ వున్నాయి. యింతెందుకు? విడుగుల వర్షమేకాదు, అగ్నివర్షంకూడావున్నది. మహా హిమవర్షం వున్నది. విషవర్షం వున్నది. చివరికి దివ్యమైన "అమృత వర్షం" కూడా వున్నది. శత సహస్రాధికంగా వున్న యిన్నిన్ని వర్షాలలో యే వర్షాన్న యినా సరే అవతరింపచేయగల మహాశక్తులు అనేకం దివ్యజ్ఞానులయిన మన ప్రాచీన వేదర్షుల కుండేవి. ఈ విభిన్న వివిధ అనేకానేక వర్షాల విషయమై వరుణుడు అధిదేవతగావున్న ఋగ్వేదంలోని 1 వ మండలం 24, 25 సూక్తాలు, 2 వ మండలం 28 సూక్తం, 7వ మండలం 86,87,88,89 సూక్తాలు, 8వ మండలం 41,42 సూక్తగతాలయిన వివిధఋక్కులలోనూ మరికొందరు యితర దేవతలతో కూడా కలిసి వరుణుడు అధిదేవతగావున్న 1 వ మండలం 2,15,17,22,23,41,43,94,136,137,139,151-2వ మండలం 37, 42-3 వ మండలం 62-4 వ మండలం 1,41,42 - 5 వ మండలం 62,63,64,65,66,67,68,69,70,71,72,85 - 6 వ మండలం 67,68,75-7 వ మండలం 41,50,60,61,62,63,64,65,66,82,83,84,85-8 వ మండలం 25,59,69,101-10 వ మండలం 124,134,172,198 సూక్తగతాలయిన వివిధ ఋక్కులలోను ఈ విభిన్న విశేష వర్షీకరణలనుగురించి వర్ణించడం జరిగింది. ఇదేవిధంగా యింద్రుడు అధిదేవతగా వున్న వివిధసూక్త మంత్రాలన్నీ అనేకానేకవర్షీకరణ మంత్రపూరితాలే. కేవలం యింద్రుడు మాత్రం అధిదేవతగావున్న ఋగ్వేదంలోని విభిన్నమండలాలలోవున్న సూక్తాలు యివి. 4,5,7,8,9,10,11,16,17,29, 32,33,51,52,53,54,55,56,57,61,62,63,80,81,82,83, 84,100,101, 102, 103, 104, 130, 131,133,169, 170,173,174,176,177,178(1 వ మండలం)-11,12,13,14,15,16,17,18,19,20,21,22 [2వ మండలం]-30,31, 32,34,35,36,37,38,39,40,41,42,43,44,45,46,47,48,49,50,51,52[3వ మండలం]-16,17,19,20,21,22,24, 25,29,31 [4 వ మండలం]-29,32,33,34,35,36,37,38,39 [5 వ మండలం]-17,18,19,20,22,23,24,25,26,29, 30,31,32,33,34,35,36,37,38,39,40,41,42,43,44,46(6వ మండలం)-19,20,21,22,23,24,25,26,27,28,29, 30,31,32(7వ మండలం)-12,13,14,15,16,32,33,34,36,37,49,50,51,52,53,61,62,64,65,66,70,76,77,78, 81,82,88,89,90,91,92,95,97,98,99(8వ మండలం)-22,23,27,29,32,38,42, 43,44,48,49,50,54,55,73,74, 86,99,104,105,111,112,113,116 120,135,136,140,147,150,151,156,157,164,176,184,185(10వ మండలం) విభిన్నలయిన యితర దేవతలతోకూడిన వివిధ ఋగ్వేద మండలాలలోవున్న-యిక్కడ పేర్కొంటున్న ఆ యా సూక్తాలలోని యింద్రసంబంధమైన ఋక్కులు కూడా వివిధవిభిన్నవర్షీకరణప్రయోగాలకు సంబంధించిన మంత్రపూరితాలైనవే. యితరదేవతలతో కూడిన యింద్రాధిపత్యంగల ఋగ్వేద సూక్తాలు యివి. 2,3,6,14,15,18,21,22,23,30,108,109,121,129,132,135, 139,142,155,165,167,168,171 (1 వ మండలం)-24,30,32,37,42 (2వ మండలం)-12,25,33,53,60,62 (3 వ మండలం)-18,23,26,27,28,30, 32,41,42,46,47 (4 వ మండలం)-27,30,31,40,51,86 (5 వ మండలం) - 21, 27,28,45,47,57,59,60,68,69,72 (6వ మండలం)-18,33,41,44,55,82,83,84,85,90,91,92,93,94,97,98, 99,104(7వమండలం)-1,2,3,4,6,17,21,38,40,45,46,54,55,56,59,63,68,69,80,93,96,100 (8 వ మండలం)- 24,28,33,47,60,89,103,124,129,133,165,172,198-(10వ మండలం) ఇంద్రాధిదైవత్వంగల ఋక్కులలో యింద్రుని బలశౌర్యపరాక్రమాదులను బహుముఖంగా వర్ణించడంజరిగిందని భాష్యకర్తలు విమర్శకులందరూ భావించారు. ఇది యధార్థంకాదు. వేద విజ్ఞానాన్ని దృష్టిలోపెట్టుకొన్నప్పుడు యింద్రుని బలశౌర్య పరాక్రమాదులన్నీ విశ్వశ్రేయస్సుకు భిన్నంగా లోకకంటకంగా విజృంభిస్తున్న రాక్షసశక్తుల సంహారంకోసం ఉపయోగపడినవే కాని తద్భిన్నంకాదు. పైగా విశ్వశ్రేయస్సుకు భిన్నంగా లోకకంటకంగా విజృంభించే ఈ దుష్ట రాక్షసశక్తులుకూడా విశ్వసృష్టికి ప్రాణాధారభూతమై ప్రాణప్రదమైన జలనాభిని మూలమట్టంగా హరించేవే కావడం విశేషం. ఈ జలనాభిని హరించడంలో మహాశక్తిమంతులుగా పరిఢవిల్లినవారు విశ్వరూపరాక్షసుడు, వృత్రాసురుడు వారి అనుయాయులు వారివారి వర్గీయులు. విశ్వసృష్టికి విధ్వంసాన్ని కలిగిస్తూ విశ్వసృష్టి వినాశకమైన వివిధ విభిన్న క్రియాప్రతిక్రియలతోను యుక్తిప్రయుక్తులతోనూ విజృంభించిన ఈ రాక్షసుల సంహారకాండకు కంకణంకట్టుకున్నవాడుకాబట్టే మహేంద్రుడు మహావీరుడుగా అనేక ఋక్కులలో అభివర్ణించబడి విస్తరించబడ్డాడు. ఈ సంగతి గుర్తించలేని ప్రాచీన భాష్యకర్తలు విమర్శకులూ యీ ఋక్కులన్నీ కేవలం యింద్రస్తోత్రపరాలని పొరపాటుగా భావించారు. వరుణాధిదైవత్వంతోపాటు యింద్రాధిదైవత్వం కలిగిన వివిధ సూక్తాలు ఋక్కులు అన్నీ జలనాభివ్యతిరిక్తమైన దుష్టశక్తులను నాశనంచేసి అనేకాలయిన వికరకాల వర్షాలను కురిపించే శక్తిదాయకాలైన మంత్రపూరితాలు. ఏయే సూక్తమంత్రాలవల్ల యెటువంటి వర్షాలు పడతాయో ఆయా సూక్త ఋక్కులలో ఆర్షవిజ్ఞాన దృక్పథంతో పేర్కొనడం జరిగింది. ఈ వర్షీకరణ ప్రయోగాలకు సంబంధించిన వివిధ సూక్త మంత్రరహస్యవిషయాలనుగురించి వాటితో అవినాభావ సంబంధం కలిగిఉన్న ఆ యా విభిన్నవర్ష స్వరూప స్వభావాదులగురించి నా మహత్తర పరిశోధనారచన "వాఙ్మయమహాధ్యక్షుని ఋగ్వేద దివ్యాలోకనం" అన్న గ్రంథంలోను "వాఙ్మయ మహాధ్యక్షుని వేదవిజ్ఞానసర్వస్వం" * అన్న గ్రంథంలోను సప్రామాణికంగా సాధికారికంగా వివరించడం జరిగింది.

---

* వాఙ్మయ మహాధ్యక్షుని వేదవిజ్ఞాన సర్వస్వం - "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"- ద్వితీయ సంపుటానికి వ్రాసిన

## దుస్స్వప్న దోషహరణం

నిద్రావస్థకు తొలిమెట్టయిన స్వప్నావస్థలో ప్రాణికోటికి రకరకాల కలలు వస్తూవుంటాయి. వీటిలో శుభస్వప్నాలు అశుభ స్వప్నాలూ వుంటాయి. సుఖసంతోషాలలో తేలిస్తూ ఆనందడోలల్లో వూగించే సుస్వప్నాలూ భయాందోళనలతో గుండెలు బెంబేలు పడగా బాధామయంగా హార్దిక మానసికానారోగ్యాలు కలిగించే దుస్వప్నాలూ వస్తాయి. వాతపిత్తశ్లేష్మాదిదోషాలవల్ల వచ్చే స్వప్నాలు నిష్ఫలాలని స్వప్నశాస్త్రాలు పేర్కొంటున్నాయి. ఈ స్వప్నాలు మానవుల కొక్కరికే రావు. పశుపక్ష్యాదులకేకాక దేవతలకుకూడా వస్తాయి. దేవతలు "అనిమిషు" లనే విషయం సుప్రసిద్ధం–అనిమిషులంటే రెప్పపాటు లేనివారని అర్థం. ఈ అనిమిషత్వాన్ని దృష్టిలో పెట్టుకొని దేవతలకు నిద్రావస్థ లేదని ప్రాచీనులు చెప్పినట్లు కొందరు భ్రమపడ్డారుగాని అది వాస్తవంకాదు. అనిమేషస్థితి వేరు. నిద్రావస్థ వేరు. ఈ రెండింటికీ అసలు సంబంధమే లేదు. అసలు అనిమేషస్థితికాని నిమేషస్థితికాని మెలకువలోనే వుంటాయి. నిద్రావస్థలో కాదు. ఈ స్వప్నభేదాలగురించి విశేషాలగురించి "కృష్ణశతశతి" అన్న నా పద్యకృతిలో యీక్రింది విధంగా వివరించాను.

కలలు వచ్చు నిద్ర మెలకువలో రావు, పగటినిద్ర వచ్చుఁ బగటి కలలు
కలలతీరుఁబట్టి ఫలితమ్ము లుండురా! † యుగయుగాల నిజము కృష్ణగీత॥

కలలు పెక్కు లగుచు నెలమి స్వప్నావస్థఁ, బగలురాత్రులందు వచ్చుచుండు
నిద్రకాని నిద్ర నిర్నిద్రగతి తోప, యుగాయుగాల నిజము కృష్ణగీత॥

దోష, సహజ, మంత్ర, దూరశ్రవణదృష్టి, శక్తివంత దైవజమ్ములగుచుఁ
గలలు షష్ఠ విధము లలలుగాఁ జెలఁగురా!, యుగయుగాల నిజము కృష్ణగీత॥

స్వప్నమైనయెడలఁ బైత్యాదిదోషాల, ఫలిత ముండ దండ్రు పగలు రాత్రి
పగటి కలలుకూడఁ బాటిరా వన్నారు, యుగయుగాల నిజము కృష్ణగీత॥

సహజమైన కలలు సహజమ్ముగనె వచ్చు, జపమువలన మంత్రజమ్ము లగును
దైవజమ్ము లగును దేవాళి కృపచేత, యుగయుగాల నిజము కృష్ణగీత॥

దూరదృష్టి అల్ల దూరశ్రవణమును, గల్గు సిద్ధు లిచ్చు కలలు నుండు
వారి చిత్తశుద్ధిపై సత్యమౌ నవ్వి, యుగయుగాల నిజము కృష్ణగీత॥

దోషజములు సిద్ధదుష్ట సంకల్పజ, స్వప్నములును దక్క సకలము లగు
కలలు కలలుకావు కల్లలు కావురా!, యుగయుగాల నిజము కృష్ణగీత॥

పూర్ణ సత్యములగు భూతభవిష్యత్తు, వర్తమానవిషయమూర్తు లగుచుఁ
జెల్లు కలలు మంచి చెడ్డలఁ దెల్పురా!, యుగయుగాల నిజము కృష్ణగీత॥

(కృష్ణశతశతి: ఆంధ్రభూమి - సచిత్ర తెలుగు వార పత్రిక 3-11-1977, 10-11-1977 సంచికలు.)

ఆఁ కలల్లో యేముంది? అని మనం కొట్టిపారవెయ్యడానికి వీలులేదు. సుఖశాంతుల్లో ఆనందడోలల్లో తేలిఆడించే శుభ స్వప్నాలు వస్తే మంచిదే–కాని పగలంతా–పగలు - వగలు - సెగలు - పొగల్తోను వివిధ కష్టనష్టాలతోను, భయాందోళనలతోను,

---

పీఠికలో "వాఙ్మయ మహాధ్యక్షుని ఆర్ష విజ్ఞాన సర్వస్వం" అన్న గ్రంథాన్ని నేను విరచించినట్లు పేర్కొన్నాను. 1965లో శీలపు రామకృష్ణశాస్త్రి విరచితమైన "ఆర్ష విజ్ఞాన సర్వస్వము" రెండు భాగాలు వెలువడినా అది సరైన విజ్ఞాన సర్వస్వం కాదన్న దృష్టితోనే దాన్ని త్రోసిరాజని నా రచనకు "ఆర్ష విజ్ఞాన సర్వస్వం" అన్నపేరునే పెట్టడం జరిగింది. "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" ప్రథమ–ద్వితీయ సంపుటాలు వెలువడినతరువాత తిరుమలతిరుపతిదేవస్థానంవారు "ఆర్ష విజ్ఞాన సర్వస్వం" అన్నపేరుతో అనేక సంపుటాలను ప్రకటించా లని నిశ్చయించి తొలి సంపుటాన్ని ప్రకటించడం జరిగింది. మద్విరచితమైన "ఆర్ష విజ్ఞానసర్వస్వం" కేవలం విజ్ఞాన ప్రతిబింబకం. తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించినదానికీ నా రచనకూ బొత్తిగా పోలిక లేదు. అయినా ఒకేపేరుతో యీ భిన్న గ్రంథాలుండడం మంచిదికాదని భావించి నా "ఆర్షవిజ్ఞాన సర్వస్వ" గ్రంథనామం "వాఙ్మయ మహాధ్యక్షుని వేద విజ్ఞాన సర్వస్వం"గా మార్పు చేయడం జరిగింది.

---

†"కృష్ణశతశతి" పద్యాలు "ఆంధ్రభూమి"లో ప్రకటితమైనప్పుడు తొలుత "జననుతాంతరంగ! వినుర! రంగ!" అన్న మకుటంతో ప్రకటితమైనాయి. అనంతరం యీ మకుటాన్ని "యుగయుగాల నిజము కృష్ణగీత" గా మార్చడం జరిగింది.

గడిచే మానవునికి రాత్రిపూట పైగా నాలుగు మెతుకులు తిని గుండెమీద చెయ్యివేసుకొని హాయిగా నిద్రపోయే స్థితిలో దానికి తొలిమెట్టయిన స్వప్నావస్థలోకూడా సుఖశాంతులు కరువైపోతే యెలా ? మామూలు బ్రతుకులోనే కాదు - స్వప్నావస్థలో-అంటే-కలలో కూడా జీవితం సుఖమయం ఆనందమయం కాకుండా బాధామయమే భయావహమే అయితే ఆ ప్రాణి జీవితం యేమనుకోవాలి ? రోజు రోజుకూ భయావహాలూ దుఃఖప్రదాలూ అయిన కలలు వస్తూనేవుంటే యెంత గుండెనిబ్బరం కలవాడైనా యెంతటి ధీధైర్యశాలి అయినా "కలలోకూడా సుఖంలేదే" అని బెంబేలు పడిపోడా ! దిగాలుపడిపోడా ! కాగా కష్టనష్టాల్లో సతమతమయ్యే మానవుడు మరింత అసమర్థుడైతే నిర్వీర్యుడుగా దిగజారిపోడా ! పైత్యాదిదోషాలవల్ల వచ్చినా-సంఘంలో జరిగే వివిధసంఘటనలప్రభావంతో వచ్చినా-శత్రుభూత ప్రయోగాలవల్ల వచ్చినా, దైవీయంగానే వచ్చినా, ఆ దుస్వప్నాల ప్రభావంతో మానవుడు దుర్బలుడుకాకుండా స్థిరచిత్తంతో సబలుడుగానే నిలవడానికి దేవదేవుడైన ఆ మహావిష్ణు నామస్మరణతో గుహ్యాద్గుహ్యంగా అష్టవిధనామాలను కనీసం ఎనిమిది పర్యాయాలైనా జపించడం శ్రేయస్కరమని మన ప్రాచీనులు చెప్పారు.

అచ్యుతం కేశవం విష్ణుం హరిం సత్యం జనార్దనం। హంసం నారాయణంచైవ హ్యేతన్నామాష్టకం శుభమ్॥

అని మహావిష్ణు నామాష్టకాన్ని అష్టావృత్తితోనైనా స్మరించడం శుభప్రదంగా బోధించారు. స్వప్నాలు శత్రుకృతాలయినా, చివరికి దైవకృతాలయినా, వాటి దుష్టత్వం దేవదేవుడైన అ మహావిష్ణుశక్తికి అతీతమైందికాదుగదా ! వేదవిజ్ఞానం అందరికీ అలవడటంసాధ్యం కాదుకాబట్టి ఈ మహావిష్ణు నామాష్టక స్మరణను తద్జ్ఞులు యేర్పాటు చేశారేగాని ఋగ్వేదంలోని అష్టమమండలంలో అష్టాదశఋక్కులతో వున్న ఆదిత్యోషస్సులు దైవీయాలుగా-మహావిష్ణు ఆదిత్యపరంగా వివిధ దుస్వప్న దోషఘ్నంగా 47వ సూక్తం విరాజిల్లుతున్నది. (చూ-స.శ్రీ.ఋ. అష్టమ మండలం-47వ సూక్తం-767వ పేజీ) అష్టాదశవ్యసనాలప్రభావంతోను అష్టాదశదేహసంభవగుణాలప్రభావంతోనూ మాత్రమేకాక అష్టాదశవిద్యల ప్రభావంతోగాని అష్టాదశ దేవగణాలయిన అమర, సిద్ధ, సాధ్య, గరుడ, కిన్నర, కింపురుష, గంధర్వ, యక్ష, విద్యాధర, భూత, పిశాచ, రుద్ర, ఉరగ, ముని, తుషిత, దైత్య, భాస్వర, గుహ్యక, గణాలప్రభావంతోగాని వచ్చే దుస్వప్నాల దోషాన్నిసైతం రూపుమాపగల ఈ సూక్తాన్ని త్రితమహర్షి ఆవిష్కరించాడు. నాద, శృతి, స్వర, గ్రామ, మూర్ఛన, తాన, వర్ణ, అలంకార, గమక, జాతి,రాగ,భాష,భాషాంగ,విభాష,అంతర్భాష,ఉపాంగ,క్రియాంగ వ్యవస్థలతో సంగీతశాస్త్రాల పరంగానూ-అంతర్గంగ, పావనాశిని, ఛాయామల్లికార్జున, వేదసంగమేశ్వర,గణికాసిద్ధేశ్వర,మోక్షేశ్వర, భుజంగ,బ్రహ్మనారాయణ,మణికర్ణిక,ప్రయాగ, మాధవ, సోమసిద్ధేశ్వర, దేవద్రోణ, నాదాతుంగసంగమ, కలకలేశ్వర, నాగభోగేశ్వర, శుక్లేశ్వర, అగ్నిరూపాలైన లౌకికాలౌకిక అష్టాదశ మహాతీర్థాల పవిత్రతనుసైతం భౌతికంగానూ, సమకూర్చేదిగా ఈ అష్టాదశ ఋక్సంభరితమైన సూక్తాన్నివేదర్షిఆవిష్కరించి అష్టవిధ బ్రహ్మ, వాసవ, ఆత్మ, విద్య, అద్వైత, విషయ, సహజ, యోగానందాలకు అతీతంగా మహానందప్రదాయకం చేశాడు.

## అపభాష్యాలు

ప్రాచీన భాష్యకర్తలలో వేదాలు మానవవిరచితాలు కావని దైవీయాలైన అపౌరుషేయాలని చాలా సుదృఢమైన అభిప్రాయం ఉన్నదనడంలో విప్రతిపత్తి యేమీ లేదు. అయినా వారిలో అర్షవిజ్ఞాన దృక్పథం కొరవడినందువల్ల అనేకఋక్కులకు భాష్యాలు వ్రాయడంలో అవి మానవ విరచితాలేనని మానవ సంఘ వ్యవస్థ విషయ ప్రతిబింబకాలనీ లౌకికాలనీ అభిప్రాయపడేటట్లుగా భ్రమ ప్రమాదాలకు లోనై వ్రాశారు. యిటువంటి వాటిని అంతరాంతరాలలోకి వెళ్ళి పరిశీలించి వేద ఖగోళ మంత్ర విషయపూరితా లయిన విశిష్టార్థాలను ప్రవచించుకొనడంద్వారా మనం పునరుద్ధరించుకొనవలసిన అవసరం యెంతైనా వున్నది. "ఆవదింద్ర యమునా" ఇత్యాది ఋక్కులో (7వ మం. 18 సూ. 19 ఋ. 68, 74 పేజీలు) అప్పటి భారతదేశంలోని వివిధ దేశ నామాలు (రాష్ట్రనామాలు) పేర్కొనబడినట్లు భావించడం జరిగింది. ఇదే విధంగా "రాజా రాష్ట్రానాం" ఇత్యాది ఋక్కులో (7వ మం. 34 సూ. 11 ఋ. 141, 146 పేజీలు) వివిధ రాష్ట్రనామాలను ఉద్దేశించి రాష్ట్రశబ్దం ప్రయుక్తమైనట్లు భావించడం జరిగింది. వాస్తవానికి యివి గోళార్థకాలుగాని లోకార్థకాలుగాని అవుతాయే తప్ప ఒకే భూమండలం మీద వున్న రాష్ట్రాలు మాత్రం కాదు. "తపన్తి శత్రుం" ఇత్యాది ఋక్కులో (7 మం. 34 సూ.19 ఋ. 143-147 పేజీలు) మహా సేనాసహితమైన రాజసమూహా లున్నట్లు భావించడం జరిగింది. ఇక్కడ దేవసేనాభివర్ణనం చేయబడిందేగాని మానవసేనాభివర్ణనం చేయబడలేదని విశ్వేదేవగణ దేవతాధిపత్యమే తేటతెల్లం చేస్తుంది. "ఉద్ ద్యామివేత్" ఇత్యాది ఋక్కులో (7 మం. 33 సూ. 5 ఋ. 134,137 పేజీలు) దాశరాజయుద్ధం అభివర్ణితమైనట్లు లోకమాన్య శ్రీబాలగంగాధరతిలక్‌వంటివారు దీనికి రామాయణగాథతోను దశకంఠునితోను సమన్వయించాలని ప్రయత్నించారు. రావణుని తమ్ముడైన కుంభకర్ణుడు యెడతెగకుండా 6 నెలలు నిద్రపోవడాన్నికూడా దీనితో ముడివేసి ధ్రువ మండల దీర్ఘరాత్రి దీనివల్ల సూచిత మవుతున్నట్లు అనేకవిధాల సమన్వయం చేయాలని ప్రయత్నించారు కాని యింద్ర వశిష్ఠపుత్ర దేవతాధిపత్యం కలిగిన ఈ ఋక్కులలో రామాయణగాథ వంటి అతిస్వల్ప విషయాలు కాక సౌర మండలాలకు తదంతర్గతా లయిన విభిన్న చంద్రమండలాది విశేషాలకు సంబంధించిన వివిధ లోకాల విషయాలు అభివర్ణితమయ్యాయే కాని తద్భిన్నం కాదు. దీర్ఘరాత్రులకు సంబంధించిన విషయాలుకూడా అనేకానేక కృష్ణపక్షాధిక చంద్ర మండలాలకు సంబంధించినవే కాని వేరుకాదు. ఋగ్వేదసప్తమమండలంలోని 104వ సూక్తంలోగల (391,393,394,395,396 పేజీలు) వివిధ ఋక్కులలో భూమండలగతమైన మానవులలో వున్న ఆర్య అనార్యాదిజాతుల విషయాలూ వారి యజ్ఞయాగాదుల ప్రశంసలూ

అనార్యుల యాగవిధ్వంసకకార్యకలాపాల నిరసనలూ అభివర్ణిత మైనట్లు అనేకమందిభావించారుగాని యిది వాస్తవం కాదు. ఈఋక్కులలోని ఆర్య శబ్దం మానవవాచకంగా కాక-దైవ వాచకంగామాత్రమే ప్రయోగితమై అనార్యశబ్దం పాశవికార్యులనుదృష్టిలోపెట్టుకొన్నది కాక-లోకకంటకులైన రాక్షసులనునిర్దేశించేదిగానే ప్రయుక్తమైనట్లుమనంభావించాల్సివుంటుంది. ఇందుకుభిన్నంగానేచెప్పినప్పుడు ఈసూక్త ఋగ్దైవత్వాలతో సమన్వయం కుదరనేకుదరదు. "మోఘవరుణ" ఇత్యాది ఋక్కులో (7మం.89సూ.1ఋక్కు.340 341 పేజీలు) ఆర్యుల మృణ్మయగృహాల అభివర్ణనం ఉన్నట్లు "ప్రక్షోదసాధాయసా"ఇత్యాది ఋక్కులో(7మం.95 సూ. 1ఋ. 360-361పేజీలు) ఆర్యులు నిర్మించుకున్న యినుప యిళ్ళ విషయం అభివర్ణిత మయినట్లు భావించడం జరిగింది. "మోఘవరుణ" ఇత్యాది ఋక్కులో "వరుణమృణ్మయం" అన్న శబ్దాలను "వరుణం + ఋణ్మయం"అని విభజించి సత్యమయమయిన వరుణలోక వ్యవస్థనుఅభివర్ణించడం ఉద్దేశించని అర్థం చెప్పుకొనడానికి మారుగా "వరుణం + మృణ్మయం" అని"రాముని తోక"వంటి పొరపాటు విభజన చేసుకొనడం వల్ల ఈ మట్టి యిళ్ళకు సంబంధించిన దురర్థం-అయోమయమయిన విషయాలతో ప్రకల్పితమైనదే గాని వేరుకాదు. పైగా యీ మంత్రాధిదేవత అయిన పవిత్ర సరస్వతీ మాతను దృష్టిలో పెట్టుకొన్నప్పుడు - ఖగోళగతమైన దివ్య నదీమతల్లిని దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ఈ అయోమయ (యినుప) పురాలన్నీ కేవల అమోమయ (దారీ తెన్నూలేని) పురాలుగానే నిలుస్తాయి. యిదేవిధంగా "క్వాత్యాని నౌ" ఇత్యాదిఋక్కులో (7 మం. 88 సూ. 5 ఋ. 337,339 పేజీలు) "సహస్ర"ద్వారశబ్దాన్ని చూచి "వెయ్యి ద్వారాలున్న యిళ్ళు కూడా ఆర్యులకు వుండే"వని పెక్కుమంది భావించారు గాని యిది యదార్థం కాదు. అనేకానేకలోకాలను తన జలశక్తితో ప్రభావితం చేసి సహస్రముఖాలుగా వర్షధారలు కురిపించే వరుణశక్తిని దృష్టిలోపెట్టుకొన్నప్పుడు ఈ గృహం మామూలుగృహం కాదనీ వరుణలోకమనీ మనం అర్థం చేసుకోగలం. వాస్తవానికి యిక్కడ సహస్ర శబ్దం సహస్ర సంఖ్యావాచకంమాత్రం కాదు. "సహస్ర కిరణ"శబ్దంలోని సహస్రశబ్దంవంటిది. కాగా ఇది అనేకానేక సహస్రాధిక సంఖ్యావాచకంఅన్నమాట. "దశస్యంతా" ఇత్యాదిఋక్కులో(8మం.22సూ.6ఋ. 608,612పేజీలు) ఆర్యుల వ్యవసాయపద్ధతులవిషయమైఅభివర్ణితమైనట్లు కొందరుభావించారుగాని ఈ సూక్త దేవతలయిన అశ్వినీదేవతలను దృష్టిలో పెట్టుకొన్నప్పుడూ, ఋక్కులో ప్రయుక్తమైన దివి శబ్దాన్ని చూచినప్పుడూ, ఈసందర్భంలో వర్ణితమైనవి భూలోకవ్యవసాయ విషయాలు కానేకావని తేటతెల్లం కాగలదు. "మహాంతా మిత్రావరుణా"ఇత్యాదిఋక్కులో (8మం.25 సూ. 4 ఋ. 633, 638పేజీలు) స్వరాజ్యరాజ్యాంగవిధానం పేర్కొనబడినట్లు అనేకమంది భావించారు. పైగా యిటువంటి స్వరాజ్యరాజ్యాంగవిధానం భారతదేశంలోని దక్షిణభాగంలోఉన్నట్లు ఐతరేయ బ్రాహ్మణంలోనే పేర్కొనబడిందంటే బ్రాహ్మణాలకాలం నాటికే వేద విజ్ఞానం యెంతగా కనుమరుగైపోయిందో చెప్పవచ్చును. "ఏతస్యాం ప్రతీనీం దిశి ఏకేచ నౌచ్యానాం రాజానో ... నాచచక్షత (ఐ.బ్రా. 8-14) అంటూ లౌకిక స్వరాజ్యవిషయకంగాఉన్న ఐతరేయ బ్రాహ్మణవాక్యం ప్రామాణికం కానేకాదుసరికదా "మహాంతా మిత్రావరుణాసమ్రాజా దేవావసురా" అని మిత్రావరుణులు దేవసమ్రాట్టులుగా స్పష్టంగా పేర్కొనబడుతుంటే వారు భూమండలంమీది స్వరాజ్యాధిపతులు యెట్లా అవుతారు? "పురమేలేనప్పుడు అంతఃపురంయెక్కడుంటుం"దన్నట్లుమానవార్యరాజులూ వారిపరిపాలనా యుద్ధాలూ మొదలైనవి అసలుఋగ్వేదంలో అభివర్ణితాలే కానప్పుడు "రాజేవహి జనిభిః" (7 మం. 18 సూ. 2ఋ 65, 70 పేజీలు) "ఈయుర్గావో" (7మం. 18 సూ. 10 ఋ. 66, 72పేజీలు)"ఏకంచయో"(7మం.18సూ.11ఋ.66,72పేజీలు) "విన ద్యో విశ్వా" (7మం.18 సూ.13ఋ. 67,72 పేజీలు) ఇత్యాదిఋక్కులలో ఆర్యరాజుల బహుభార్యాత్వం-మానవరక్షారహితాలైన పశుగణాలు పంటచేలను పాడుచేయడంవంటి విషయయాలు, పల్లెటూళ్ళ విషయాలు, సప్తప్రాకారపుర వర్ణనాది విషయాలు, అభివర్ణిత మయ్యాయంటే ఆలోచనాపరు లెవ్వరూ ఆమోదించలేరు. ఒక వంక ఇంద్ర దైవత్వంతో ఇతరలోకరాక్షస సంబంధిత సప్తప్రాకారపురాలను భేదించినవాడుగా అనేక సందర్భాలలో యింద్రుణ్ణిఅభివర్ణిస్తుంటే ఇవి భూమండలంమీదవున్న మానవార్యుల పురాలవర్ణనకు సంబంధించిన వనుకోవడం కేవలం తెలివితక్కువకాక మరేమవుతుంది?

ఇంతకంటే ఘోరాతిఘోరమైన విషయమేమంటే ఆత్రేయి అయిన "అపాల" ఋషికగా ఇంద్రుడు దేవతగా రవి, చంద్ర, కుజ, గురు, శని, బుధ, శుక్ర నామక సప్తగ్రహాధిపత్యవిషయచిహ్నితమై ద్వాదశరాశ్యాత్మకాభివర్ణనామయమై "కన్యా వారవాయతీ" ఇత్యాదిసప్తఋగ్విలసితమైన (8 మం. 91 సూ. 951, 952 పేజీలు.) సూక్తానికి వ్రాసిన భాష్యం నీచాతినీచం పాపభూయిష్ఠమై "అథఃకేశాల" ప్రసక్తులతో ఆవిష్కృతం కావడం. వెనకటికి యెవడో ఒక వెర్రివాడు "మేనమామ చెవులమీద వెంట్రుకలు వుంటే మేనల్లుడికి సిరిసంపదలు కలుగుతాయని విని నిష్ఠతో భగవంతుణ్ణిగూర్చి ఘోరమైన తపస్సు చేశాడట. ఆ తపస్సుకు భగవంతుడు మెచ్చి ప్రత్యక్షమై ఏం వరాలు కావాలో కోరుకొమ్మని అడిగితే యింతా తపస్సుచేసిన ఆ వెర్రివాడు తనకు ప్రత్యక్షమయిన భగవంతుణ్ణి అనేక సిరిసంపదలు అనుగ్రహించవలసిందని కోరకుండా "మా మేనమామ చెవులమీద వెంట్రుకలు మొలిపించ"మని వేడాడట. ఈ వెర్రి కథను స్ఫురింపజేస్తూ ఋషికగా గుర్తింపబడి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన 'అపాల' యింద్రుణ్ణిగూర్చి తపస్సుచేసి "తన చర్మ రోగాలు పోగొట్టవలసిందని కోరడంతోపాటు తన తండ్రి తలమీద వెంట్రుకలను మొలిపించవలసిందనీ తన మర్మస్థలంమీద కూడా రోమాలు మొలిపించవలసిందనీ" కోరినట్లు ప్రాచీనులు హీనాతిహీనంగా భాష్యార్థాలు చెడవ్రాసి పెట్టారు. (చూ-952-953-954-955-956 పేజీలు) దివ్యమై దైవీయమై మహాపూజనీయ స్థానంలోవున్న వేదగౌరవాన్ని సర్వనాశనంచేసి అమూల్యమైన వేదఖగోళ జ్యోతిర్మంత్ర విజ్ఞాన విషయాలను గుర్తించలేక అథఃపాతాళంలోకేకాదు నీచాతినీచమైన అత్యంత హీనస్థితికికూడా వేదాన్ని దిగజార్చడం జరిగింది. ఈసూక్తంలోవున్న 7ఋక్కుల్లోను రవ్యాదిసప్తగ్రహాల విషయాలు తదాధిపత్యవీక్షణాదఫలితాలు మేషాదిద్వాదశరాశ్యాత్మక

మైన కాంతివృత్త బహుముఖ ప్రభావాలు అభివర్ణిత మయ్యాయి. ఈ సూక్తంలోని "అపాల" "రోమ" శబ్దాలు వేదభాష్యకర్తలందరూ భావించినట్లు కేవలసామాన్యార్థకాలు కావు. ఇక్కడ "అపాల" శబ్దం 'రలయోరభేదః' అన్న సూత్రం ప్రకారం రకారంగా రూపొంది "పారములేనిది" "అంతులేనిది" అన్న భావంతో "అనంత" అనే అర్థంలో ప్రయుక్తమైందేకాని వేరుకాదు. యిదేవిధంగా ఈ ఋక్కులలో వున్న "రోమ"శబ్దానికి వెంట్రుక అని అతి సామాన్యార్థం చెప్పటానికి బొత్తిగా అవకాశం లేదు. యిక్కడ రోమ శబ్దంచేత "మేక-గొర్రెపొటేలు" లుగా నిర్దిష్టమై అశ్విన్యాదిగా అశ్వినీదేవతలతో ప్రారంభమై భరణినేకాదు, అపభరణి అయిన యమదైవత్వాన్ని సైతం మధ్యలో యిరికించి కృత్తికాప్రథమ పాదాంత్యంగా మహాగ్నిరూప ప్రారంభంతో ముగిసిన ఖగోళగతమైన మేషరాశి వివక్షిత మైనది. వేదఖగోళ విజ్ఞానపరంగా - అపాల (ర) - అంటే - అనంత-విశాల విశ్వస్వరూపిణి అయిన కన్యారాశికి సంబంధించిన విషయాలూ - యీ కన్యకు గుహ్యాతిగుహ్యమైన అష్టమ స్థానం - రోమశ - అంటే - మేషరాశికి సంబంధించిన విషయాలూ - యీ సూక్తంలో వివరించడం జరిగింది. ఈ దృష్ట్యా ఈ ఋక్కులన్నింటికీ అటు సప్తగ్రహాలపరంగాను యిటు ద్వాదశరాశులపరంగాను అనేక విశేషార్థాలను ప్రవచించవలసి ఉన్నది. గ్రహనక్షత్రాల ప్రభావాలతో రకరకాల రూపాలలో విరాజిల్లే ఆయుర్వేదవైద్య ఔషధ విషయ రహస్యాలుకూడా అశ్వినీదేవవైద్యులను పురస్కరించుకొని యీ సంపుటంలో అభివర్ణితా లయ్యాయి. ఈ వేదఖగోళ జ్యోతిర్మంత్రాయుర్వేదాదివిషయాలను దృష్టిలోపెట్టుకొని ఈసూక్తగతాలయిన ఋక్కులకువినూతనాలయిన విభిన్న భాష్యాలనువిరచించవలసివున్నది. యిటువంటి అమూల్య విశేషాలు కేవలం సాయణయాస్కాచార్యుల కాలాలనాటికేకాదు, బ్రాహ్మణాలకాలాలనాటికే పూర్తిగా కనుమరుగయి పోయాయని "శాట్యాయన బ్రాహ్మణ" గ్రంథంలో ఉటంకించబడిన "అపాల-యింద్రుల" కథ తేటతెల్లంచేస్తున్నది. (చూ.స.శ్రీ.ఋ. తృతీయ సంపుటం. అష్టమమండలం. 952, 953 పేజీలు) ఈ సూక్త గతమయిన విజ్ఞాన విషయా లన్నింటినీ యిక్కడ స్థలాభావం చేత వివరించడంలేదు - ఈ విజ్ఞాన విశేషాలన్నీ నా పరిశోధనారచన "ఋగ్వేద దివ్యాలోకనం" లోను, "వేదవిజ్ఞాన సర్వస్వం" లోను సప్రామాణికంగా వివరించడం జరిగింది. ఇన్నిన్ని అలౌకిక విజ్ఞాన విశేషాలు కల ఋగ్వేదం దైవీయంకాక లౌకికమూ మానవ విరచితమూ యేవిధంగా అవుతుంది ? ఇదే విధంగా అష్టకదృష్టితో మర్మాష్టకమైన ఋగ్వేద అష్టమాష్టకంలో కూడా పెక్కు రహస్య విషయాలు పరిగర్భితమై వున్నాయి. వీటి విషయమై చతుర్థ సంపుటం పీఠికలో కొంత వివరిస్తాను.

1, 2, 3, 4, 5 మండలాలలోవున్న సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ, ద్వితీయ సంపుటాలలో మూల సంస్కృత ఋగ్వేద ఋక్కులకున్న వివిధ పాఠాంతరాలను అనేక వ్రాతప్రతులను ముద్రితప్రతులను పరిశోధించి యిచ్చిన విధంగానే 7, 8 మండలాలలోవున్న ఈ సంపుటంలోకూడా వివిధ పాఠాంతరాలను ఫుట్ నోట్‌లలో యివ్వడం జరిగింది. అనేక వ్రాతప్రతులను పరిశోధించి పెక్కు "ఖిల" మంత్రాలను నా ఆంధ్రీకరణలతోసైతం యీ సంపుటంలోకూడా సమకూర్చడం జరిగింది.

## ఋ - అరు

తెలుగువారు అతిప్రాచీనకాలంనుంచీ అక్షరాలను నేర్పేటప్పుడు ఋ - ౠ లను అరు - అరూలుగాను, ఌ - ౡ లను అలు - అలూలుగాను ఉచ్చరించి చెప్పడం వున్నది. ఋ - ఌ లకు అభిన్నత్వం వున్నందువల్ల ఋకారంతో పాటు ఌ కారాన్నికూడా గ్రహించడం జరిగిందిగాని యిక్కడ ఋకార విషయమే పేర్కొనబడుతున్నది. ఋషి మొదలయిన శబ్దాలలోవున్న ఋకారాన్ని "అరు"కారంగా ఉచ్చరించడం వేదకాలంనుంచీ వున్నది. వేదఋషులలోవున్న ఈ సాంప్రదాయమే తెలుగువారిలోకూడా గురుశిష్య పరంపరలో వేదంవలెనే అధ్యయన అధ్యాపనల్లో నిలిచిపోయింది. మొట్టమొదటి వేదర్షులయిన అంగిరసాదులు తెలుగువారే అయినందువల్ల ఈ ఋకారాన్ని అరుకారంగా ఉచ్చరించే సంప్రదాయం యితరదేశభాషీయుల్లోకాకుండా తెలుగువారిలోనే తరతరాలుగా నెలకొనడంలో విశేషం లేదు. ఋగ్వేదంలో సప్తమ, అష్టమ మండలాలలో ప్రత్యేకించి ఋషిశబ్దంలోని ఋకారం 'అరు'గా ఈ క్రింది ఋక్కులలో విశిష్టంగా ప్రయుక్తమైంది.

అప స్వసురుషసో నగ్జిహీతే రిణక్తి కృష్ణీరరుషాయ పన్థామ్ ।
అశ్వామఘా గోమఘా వాం హువేమ దివా నక్తం శరుమస్మద్ యుయోరమ్॥

(స. శ్రీ. ఋ. - తృతీయ సంపుటం-7 వ మండలం - 71 సూ. 1 ఋ. 283 పేజీ)

శతం వేణూఞ్ఛతం శునః శతం చర్మాణి మ్లాతాని ।
శతం మే బల్బజస్తుకా అరుషీణాం చతుఃశతమ్॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం - 8 వ మండలం - 55 సూ. 3 ఋ. 802 పేజీ)

ఈరెండు సందర్భాలలోనేకాక ఋగ్వేదంలో శతసహస్రాధిక ఇతరసందర్భాలలోకూడా ఋవర్ణాదిగాగల పదాలన్నీ అరుకారంగానేపేర్కొనబడుతూవుండేవి. అంతేకాదు. వ్రాతలోకూడా అనేకసందర్భాలలో ఋకారాన్ని అరుకారంగా వ్రాయకుండా విశేషంగా 'అఋ' కారంగా వ్రాయడం జరిగేది. యిటువంటి వ్రాతలు వ్రాతప్రతుల్లో అకారప్రశ్లేషచిహ్నాలతో సైతం అనేకసందర్భాలలో నిర్దిష్టమవుతూ వచ్చాయి.

సామవేద జైమినీ కౌథుమ రాణాయనీయ శాఖల్లోనేకాక వాంకారశాఖలోకూడా అనేక ఋక్కుల గానాలలో 'ఋ'కారం 'అ'కార పూర్వకంగానే ఉచ్చరింపబడుతూ వుంటుంది. మామూలుగా ఋషి మొదలగు శబ్దాలలోని 'ఋ' కారం ఇత్వ విశిష్ట ఋకారోచ్చారణ కలదని ప్రాచీన సంస్కృత వ్యాకరణ సంప్రదాయాభిజ్ఞుల అభిప్రాయాల ప్రకారం భావింపబడుతూ వచ్చింది. అంతేకాక ఋకారానికున్న "రు"కారోచ్చారణం తరువాతి పరిణామ మని ఆధునికమనికూడా భావించడం జరిగింది. ఈ ప్రాచీన రికార ఉచ్చారణ, అర్వాచీన రుకారోచ్చారణ సిద్ధాంతాల విషయమై నా పరిశోధనా రచన "ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష" లేక "ధ్వని-లిపి-పరిణామం" అన్న గ్రంథంలో (53-114 పేజీలు) ప్రతిపాదించివున్నాను. కాని వేదభాషా స్వరూప స్వభావాలను పరిశోధిస్తే ఋకారాన్నికున్న రుకారోచ్చారణ అరు కారోచ్చారణలు అత్యంత ప్రాచీనాలనీ వేదకాలంనాటివేననీ సప్రామాణికంగా నిరూపిత మవుతున్నది. ఈ విషయా లన్నింటినిగురించి సాధికారికంగా సప్రామాణికంగా నా మహత్తర పరిశోధనా రచన "సామవేద విశ్వరూప ప్రదర్శన" లో నిరూపించడం జరిగింది. "అవస్వ నరుష" ఇత్యాదిఋక్కును "శతఃవేణాఇచ్ఛతం" ఇత్యాదిఋక్కును ఆంధ్రీకరించడంలో శ్రీ నేమానివారు ప్రాచీన భాష్యకర్తల ననుసరించి ఋషిశబ్దభిన్నమైన దృక్పథంతో "సూర్యాశ్వములగు నరుషులకు మార్గమును చూపెట్టెను" (284 పేజీ. 622 గద్యం.) 'శత చతుష్టయమును నరుషులును నున్నవి". (803 పేజీ. 942 గద్యం) అని వ్రాశారు. కాని వాస్తవానికి ఋక్కులలోవున్న "అరుషాయ- అరుషీణాం" అన్న శబ్దాలను ఋష్యర్థదాయకాలుగానే పరిగ్రహించాలిగాని అందుకు భిన్నంగా పరిగ్రహించడానికి యే మాత్రమూ వీలులేదు.

శేషభాగాలను పూరించడంలోను ఆంధ్రానువాదంలో ఖిలమంత్రాలను ఆంధ్రీకరించడంలోను నేను అనుసరించిన పద్ధతులగురించి ప్రతిబింబించిన విశేషాలనుగురించి ప్రత్యేకించి నేను పేర్కొనవలసింది యేమీలేదు. శ్రీనేమాని వెంకటనరసింహశాస్త్రిగారి అనువాద పద్ధతులగురించి సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ, ద్వితీయసంపుటాలకు వ్రాసిన పీఠికలలో తెలియజేసేఉన్నాను. ఋగ్వేద ఆంధ్రానువాదసందర్భంగా ఆరోజుల్లో అనేకమందిపండితులు తెలుగువచనంలో అనువాదం చేయవలసిందిగా నేమానివారిని ఒత్తిడి పెట్టి నట్లు ప్రథమ సంపుటం పీఠికలోనే తెలియజేశాను. బహుశా ఈ వత్తిడుల ప్రభావంచేతనే కాబోలు శ్రీ నేమానివారు దాదాపు సప్తమ మండలమంతా గద్యాత్మకంగానే అనువదించారు. అయితే సప్తమ మండలంలోవున్న ఋక్కులు చిన్నవి పెద్దవి యెటువంటివి వున్నా చిన్నవాటినేకాక అనేక పెద్ద ఋక్కులను కూడా గద్యాత్మకాలుగానే నేమానివారు అనువదించడం విశేషం. చిన్న ఋక్కుల్ని తేటగీతి, ఆటవెలది, కందం మొదలైన ఛందస్సుల్లో అనువదించవచ్చును. నేమానివారు అనేక ఋక్కులను కలిపి ఉత్పలమాల, చంపకమాల, సీసపద్యంవంటి ఛందస్సుల్లో ఒకే ఒక పద్యంలో అనువదించినసందర్భాలు ఇతరమండలాలలో అనేకం వున్నాయి. యిదేవిధంగా అనేక ఋక్కుల్ని వివిధాలైన పెద్ద వృత్తాలుగా సప్తమమండలంలోకూడా అనువదించవచ్చును. అయినా దాదావు సప్తమమండలమంతా గద్యాత్మకంగానే అనువదించడం విశేషం. ఖిల ఋక్కులుకాక సప్తమమండలంలోని ఋక్కులు 841. ఋగ్వేదం 6 వ మండలంలోని 62 వ సూక్తం మొదలుకొని నడచిన శ్రీనేమానివారి అనువాదరచన 8 వ మండలంలోని 11 వ సూక్తాంత్యంవరకూ నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు గద్యరూపంలోనే నడిచింది. యీభాగమంతా పంచమాష్టకమనే చెప్పాలి. ఈ పంచమాష్టకగతమే సప్తమమండలం. పంచ మాష్టకానువాదంలో వివిధ ఋగనువాదాలుగా 1229 గద్యా లుండగా కేవలం 28 మాత్రమే పద్యా లున్నాయి. సప్తమమండలం అను వాదంలో శ్రీనేమానివారు విరచించిన 820 పద్యగద్యాలలో గద్యాలు 804 కాగా పద్యాలు 16 మాత్రమే వున్నాయి. కేవల గద్యరూప అనువాదంతో శ్రీనేమానివారు సంతృప్తిపడినట్లు కనపడదు. కాగా అష్టమ, నవమ, దశమ మండలాలోవున్న ఋక్కులను నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు పద్యాత్మకంగానే అనువదించడం జరిగింది.

## ఆంధ్రానువాదంలో వ్యాకరణచ్ఛందో విశేషాలు

శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితా రచనలో శ్రీ నేమానివారుచేసిన వ్యాకరణ చ్ఛందో విశేషాలనుగురించి సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ సంపుటం పీఠికలో అనేక విషయాలను, ద్వితీయసంపుటం పీఠికలో మరికొన్ని విషయాలను, నేను వివరించడం జరిగింది. ఈ తృతీయ సంపుటంలోవున్న సప్తమ, అష్టమమండలాలలోని వ్యాకరణఛ్ఛందో విశేషాలనుగురించి యిక్కడ వివరించడం జరుగుతున్నది.

"తాను నేను" పదాలు ద్రుతప్రకృతికాలని ప్రాచీన లాక్షణిక కవిపండిత గ్రంథకర్తలు అనేకమంది భావించడం జరిగింది. సకృత్తుగా కొద్దిమంది "తాను నేను" పదాలు కళలుగా భావించారు. నేమానివారు వీటిని ద్రుతప్రకృతికాలుగానే భావించి తదనుగుణ మైన సంధిప్రయోగాలు అనేక సందర్భాలలో చేశారు. మామూలుగా "తాను + అరుగుచు" అన్నప్పుడు "తా నరుగుచు" అని నకారయుక్త మైన సంధిరూపాన్నిగాని "తాను నరుగుచు" అని ద్రుతయుక్తమైన విసంధిరూపాన్ని కాని ప్రయోగించవలసివున్నది. ద్వితీయా ప్రత్యయ మైన 'ను' వర్ణకాని కున్నట్లుగానే ప్రథమా విభక్త్యంతా లయిన "తాను, నేను" పదాలలోని 'ను' వర్ణానికి ద్రుతత్వం దుతప్రకృతికత్వం కూడా విశిష్టంగా వున్నది. కాగా అజాదిపదం పరమైనప్పుడు "తాను, నేను"ల్లోని "ను" వర్ణాలకు సంధి విసంధి రూపాలు రెండూ విశిష్టంగా రూపొందుతాయి. అయితే శ్రీనేమానివారు తాను + అరుగుచు అన్నప్పుడు "తా నరుగుచు" అన్న నకారయుక్తమైన సంధిరూపాన్ని కాకుండా "తాయరుగుచు" అన్న 'య'డాగమ యుక్తరూపాన్ని 'య' ప్రాసబద్ధంగా "వాయువ" ఇత్యాది పద్యంలో ప్రయోగించడం జరిగింది.

క॥ వాయువ ! తగు నధ్వర్యుఁడు
పాయక హవ్యములఁ బ్రీతి భక్షింపంగా
న్యాయ మగు మార్గమునఁ బడి
తాయరుగుచు నుండుఁగాకఁ! దత్పరమతియై ॥

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం-8 మండలం. 101 సూ. 1025 పేజీ-1492 పద్యం.)

తాను + అరుగుచు అన్నప్పుడు "తానరుగుచు" అన్న "న" వర్ణయుక్తమైన సంధిరూపాన్ని కాకుండా "తా యరుగుచు"అని నేమానివారు విశిష్టంగా ప్రయోగించడంలో వారు ఒక ప్రత్యేక దృక్పథం కలిగివున్నట్లు కనిపిస్తున్నది. 'తాను'లోని'ను'వర్ణం ద్రుతంకాబట్టి పదాంతమైన ద్రుతానికి విభాషగా లోపంవస్తుంది. ద్రుతలోపం అయినప్పుడు 'తా' శబ్దం కళగానే మిగులుతుంది. ద్రుతలోపమైన 'తా' శబ్దంలోని 'ఆ' కారానికి అచ్చు పరమైనప్పుడు సంధి జరుగదుకాబట్టి తా + అరుగుచు అన్నప్పుడు విలుప్తమైన 'ను' వర్ణంతో సంధిజరిగే సమస్యే ఉత్పన్నం కాదుకాబట్టి యిక్కడ నేమానివారు "య"డాగమం చేసినట్లు కనిపిస్తున్నది. అయితే పదాంత ద్రుతానికి అచ్చు పరమైనప్పుడు ఒక సంధి భావవ్యవస్థలోనే తప్ప విసంధి వ్యవస్థలో ద్రుతలోపాన్ని ప్రాచీనులు పాటించలేదు. పైగా ద్రుతలోపం పద్య పాదాంతాల్లో గణవ్యవస్థనుబట్టి జరుగుతుందనికూడా భావించారు. కాని యీ ద్రుతలోపం వచనంలోని వాక్యాంతాలలోకూడా జరుగవచ్చు. అయినా శ్రీనేమానివారు ప్రాసలో అగత్యకంగా "య"డాగమ ప్రయోగం చేసినట్లు స్పష్టపడుతున్నది. కాగా దీన్ని మనం వ్యాకరణ విశేష ప్రయోగంగా పరిగ్రహించవలసి వున్నది.

సవితృ శబ్దం 'ఋ'కారాంతం. ఋ కారం అచ్చుకాబట్టి 'తృ'వర్ణపూర్వకమైన 'వి' వర్ణం లఘువే అవుతుంది. అయితే 'ఋ' వర్ణంలోవున్న రేఫతత్వాన్ని దృష్టిలోపెట్టుకొని సవితృశబ్దంలోని 'తృ' వర్ణాన్ని సంయుక్తంగా భావించి 'వి' వర్ణానికి గురుత్వాన్నిచ్చి శ్రీనేమానివారు ఈక్రింది ఉత్పలమాలలో విశిష్టంగా ప్రయోగించారు.

ఉ॥ ఓపి సవితృఁడే ఋతము యుక్తిని సంజ స్వపృష్టితాపముల్

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం-8వ మండలం- 86సూ. 939- పేజీ 1273 పద్యం)

పైపద్యంలోని సవితృ శబ్దంలో వివర్ణాన్ని గురువుగానే రగణాద్యక్షరంగా శ్రీనేమానివారు పయోగించినా వ్రాతలో మాత్రం సవితృ శబ్దంలోని 'తృ' వర్ణాన్ని 'త్రు' వర్ణంగా సంయుక్తాక్షరంగాకాక 'తృ' వర్ణంగానే 'ఋ'కార విశిష్టంగానే వట్రువసుడితో స్పష్టంగా వ్రాశారు. (చూ. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత-వ్రాతప్రతి-9వ సంపుటం 314-పేజీ) కాగా సవితృ శబ్దంలోని ఋవర్ణం రేఫాంశ కలదికాబట్టి దాన్ని సంయుక్తంగా భావించి శ్రీనేమానివారు వివర్ణాన్ని విశిష్టంగా గురువుగా ప్రయోగించారని మనం భావించవలసివున్నది.

'ఆకృష్ట' శబ్దంలోని 'కృ' వర్ణంలో వున్న తలకట్టును చూచి అకారమని భ్రమపడి "అపరివృతుడు" లోని ఆది అచ్చుకు శ్రీనేమానివారు భ్రమప్రమాదపూరితంగా ఈ క్రింది పద్యంలో యతి ప్రయోగంచేశారు.

సీ॥ నీ వభీష్టదుఁడవు నీవు కామప్రదా కృష్ణుండ వరులచే నపరి వృతుఁడ

(స. శ్రీ. ఋ. తృతీయ సంపుటం-8మండలం - 33సూ. 684 పేజీ-662 పద్యం.)

"అ"కార రహితమైన 'కృ' వర్ణంలోని తలకట్టునుచూచి అది అకార చిహ్నమన్న భ్రమతో దానిలో లేని అకారానికి శ్రీనేమానివారు ఒక్కరే యతి వెయ్యలేదు. కస్తూరి రంగకవి తన ఆనందరంగరాట్ఛందంలోను, ఎఱ్ఱాప్రగడ హరి వంశంలోను, యిటువంటి భ్రమాపూరితమైన ప్రయోగాలు చెయ్యక పోలేదు. తెలుగులో అకారేతర స్వరాలున్న కొన్ని హల్లులమీదకూడా ఉపయోగించబడుతూ వచ్చిన యీ తలకట్టువల్ల యేర్పడిన అనేక చిక్కులనుగురించి "ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష" లేక "ధ్వని-లిపి - పరిణామం" (85-99 పేజీలు) అన్న నా పరిశోధనారచనలో చర్చించడం జరిగింది.

ఋకారం పొల్లు హల్లుతో మేళనమైనప్పుడు వట్రువసుడిగా "ృ"గా మారుతుంది. ఈ మార్పు ప్రకారం ఋకార స్వరాంకల హల్లులను వాస్తవానికి క్ృ-గ్ృ-త్ృ-అనే పద్ధతిలోనే వ్రాయవలసి వుంటుంది. కాని ఈ విధంగా మనమే కాకుండా మనపూర్వులుకూడా వ్రాసియెరుగరు. ప్రప్రథమంగా ప్రతిఅక్షరానికీ పైన అడ్డగీతగా నిలబడి రానురాను అకారం గుర్తుగా కొన్నిహల్లులమీదమాత్రం మిగిలి మరి కొన్నిటిమీద అందాన్ని, నిండుతనాన్ని, అపేక్షించడంవల్ల వచ్చిన తలకట్టు తెలుగు భాషకు తెచ్చిన నష్టం ఇంతా అంతా కాదు. మహాకవుల్ని పప్పులో కాలువేయించింది. విమర్శక శిఖామణుల్ని వెక్కిరించిందని బొల్తా కొట్టించింది.ఇక సామాన్యుల మాట చెప్పేదేముంది?

ఒకసారి 1053లో ఇంకా ఒక సంవత్సరం దాటితే"తెలుగు పండిత పదవి"నలంకరించే ఒక భాషా ప్రవీణ విద్యార్థిని "కుమారుడు అన్నప్పుడు "కు" అనే దానికి వర్ణక్రమం చెప్పవయ్యా!" అని అడిగితే - క్ + అ + ఉ కలిస్తే"కు"అయిందని చటుక్కున చెప్పి వూరుకున్నాడు. అంతేనా? అని రెట్టించి అడిగేసరికి అయిదు నిమిషాల్లో తెప్పరిల్లి "తప్పు చెప్పానండి మేష్టారూ! క్ + ఉ కలిస్తే కు అవుతుందండి!" అని సర్దుకున్నాడు. ఇక చిన పిల్లల్లో ఈ విధంగా యెన్నిసార్లు జరుగుతుందో చెప్పలేము. కాస్త హొరవా, బుఱ్ఱా వున్న కుర్రవాడెవడైనా "మాష్టారండీ! "క" అన్నప్పుడు తలకట్టు అకారం గుర్తుకాదా "కు" అన్నప్పుడు తలకట్టుకూడా అకారం గుర్తు అని

అనకూడదా? యెందుకని?" అని యే ఎలిమెంటరీ టీచర్‌నో అడిగితే అయనకు పచ్చివెలక్కాయగొంతున పడ్డట్లయి "అది అంతేరా వెధవ!" అని కసిరి సరిపుచ్చాల్సిందే కాని కుర్రాణ్ణి యేమని సంతృప్తి పరచగలడు?

ఈ తలకట్టు క, గ, చ, ఛ, త, థ, మొదలైన అక్షరాలమీద అకారం గుర్తుగా వచ్చింది. అంతేకాక కు, గు, చు, ఛు, తు, థు, దు, ధు, తూ, దూ, కృ, హృ, వృ, మొదలైన అక్షరాలమీదకూడా తలకట్టు వుంటోంది. అకారవ్యతిరిక్తస్వరాలతో కూడుకున్న హల్లుల మీద కూడా తలకట్టును పెట్టుకోవడం కేవలం ఆ అక్షరాలు బోడిగాను, బోసిగాను వుండకూడదనీ, అందాన్ని, నిండుతనాన్ని కోరుకొని మాత్రమే. ఈ అందంకోసంవచ్చిన తలకట్టువల్ల మహాకవులు కొందరు, విమర్శకులుకూడా కొందరు ప్రమాదవశులయ్యారు. అటువంటి ప్రమాదాలవల్ల జరిగిన లోపాలు కొన్ని పరిశోధనల్లో బయటపడ్డాయి చూడండి! కృ వృ, హృ ఇత్యాదుల్లో ఋకారం స్వరం గుర్తును(వట్రువసుడిని) హల్లుకు అంటకుండా వేరే ప్రత్యేకంగా వ్రాస్తాము. ఇటువంటి కృ, వృ, మొదలైన అక్షరాల్లో క్రిందుగాను, ప్రత్యేకంగాను వుండే వట్రువసుడిని చూడక పైన వుండే తలకట్టును చూచి కృ, వృ, ఇత్యాద్యక్షరాలను క, వ ఇత్యాద్యక్షరాలుగా భావించిన పెద్దలు లేకపోలేదు. ఈ క్రింది పూర్వకవుల ప్రయోగాలు చూడండి.

వృత్తమున కౌభ జ స-వృత్తి న భ జ ల్ స న ల-పై గురులు రంగ నృపధీరా! (అ. రం. ఛందం - 4 ఆ - 131ప.)

ఇది "మంగళమహాశ్రీ" అనే వృత్తంలోని ఒక పాదం. దీనికి యెనిమిదేసి అక్షరాలమీద పాదానికి రెండు యతులు వుంటాయి. చూడండి-వృత్తమున 4; కౌభజస 4; $(4+4=8)$ తరువాత వృత్తిలోని "వృ" మొట్టమొదటి యతిస్థానం. యింక రెండవది మరల యెనిమిది అక్షరాలు దాటిన తరువాత వృత్తినభ 4; జల్ సనల 4; $(4+4=8)$ "పై" అనే అక్షరం యతి స్థానం అయింది. మొదటి అక్షరం వృకారానికి యెనిమిది అక్షరాల తరువాత వృకారానికి మొదటి యతి చెల్లింది. రెండవ యతి స్థానంలో "పై" అనే అక్షరం వున్నది. వాస్తవానికి "వృ" అనేదానికి "పై"కి యతిమైత్రిలేదు. ఇక్కడ"వృ"లో ఋకారంవున్న సంగతి మరచిపోయి పైనున్న తలకట్టు చూచి "వ" అనుకొని "పై" అనే అక్షరానికి యతి సరిపెట్టుకొన్నాడు రంగకవి. ఈ సందర్భంలో - పాఠాంతరాలు కూడా కావు, సవరణలు ప్రతిపాదించి రంగకవి వద్ద ప్రమాదాన్ని తొలగించాలని యెవరో ఒకానొకరు ప్రయత్నించారు. కాని పద్య లక్షణం చెబుతున్న ఆ రంగకవి పద్యంలో "సనలపైగురులు" అన్నప్పుడు-మీద - తర్వాత - అనే అర్థంలో వాడిన ఆ "పై" అనే శబ్దానికి అర్థంతో యెంత సంబంధమున్నదో వారు గమనించలేదు.

మనకు పరమ ప్రామాణికుడైన యెఱ్ఱాప్రెగడ రచించిన హరివంశంలోని ఒక పద్యంలో యిట్లాగే మరొక యతి వున్నది-

క॥ విషయేంద్రియ ప్రపంచము, హృషీక మనఁ బరగు నీ వతీతుఁడవై యు
న్మిషితముగ నది ధరించుట, హృషీకేశ నామ శోభివైతివి కృష్ణా!॥

(హరివంశం- ఉత్తరభాగం - 6ఆశ్వాసం - 80ప)

అసలు ఈ పద్యమే విచిత్రమైన పద్యం - ఇందులో నాలుగో పాదం కందపద్య లక్షణాన్ని అమాంతంగా వుల్లంఘించింది. పద్యం దిద్దడానికి వీలుకాని ఘట్టం-వైగానాల్గోపాదంలో "హృ-ఐ" లకు యతి వేయబడింది. యిక్కడకూడా "హృ"లో వట్రసుడి వున్నసంగతి మరచిపోయి పైన వున్న తల కట్టునుచూచి "హ" అత్వవిశిష్టమైన దనుకొనడంవల్లనే యీ పొరపాటు జరిగింది.

తలకట్టు భ్రమవల్ల యిక్కడ యెఱ్ఱాప్రెగడ "హృ" కారంలో వట్రువసుడిని చూచుకోక "హ"కారంగా భావించి "హృ-ఐ" లకు యతి వేశాడన్న సంగతి గమనించక హరివంశం ముద్రణ ప్రతిలో పరిష్కర్తలు "హృషీకేశ నామ శోభి వీవో కృష్ణా!" అని యతి కోసం సంస్కరించి ముద్రింపించారు. (ఈ సంస్కరణైనా మధ్యలోజరిగిందేకాని మొట్టమొదట అసలుజరగనేలేదు. మొదటిముద్రణలో యథాతథంగా "హృషీకేశనామశోభి వైతివి కృష్ణా!" అనేవున్నది. కాని యీపాఠాన్ని 1926 సంవత్సరం వావిళ్ళవారిముద్రణ కొత్త కూర్పులో "హృషీకేశనామశోభి వీవో కృష్ణా!" అని దిద్దబడింది. ఈ దిద్దుబాటైనా పద్యభాగంలో జరగలేదు. తప్పొప్పుల పట్టికలో జరిగింది. పద్యభాగంలో మామూలుగా "శోభివైతివి" అనే పాఠమే వున్నది.)యతికోసమని గత్యంతరంలేక తొందరపడి "శోభివీవో" అని సంస్కరించారేకాని ఆ సంస్కరణ ఆ పద్యార్థానికి యెంతవరకు సరిపోతుందో చాలదో వారు చూచుకోలేదు - పై కందం పూర్వార్థంలో "హృషీకమనఁ బరగు నీ వతీతుఁడవై" అని "నీవు" శబ్దం ఒకసారి ప్రయోగింపబడింది. పూర్వార్థంలోనే నీవు వుండగా తిరిగి వుత్తరార్థంలో "ఈవు" అని పెట్టడంలో అర్థమేమిటి? పోనీ యీ "నీవు" "ఈవు" అనే పదాలు భిన్నవాక్యాల్లో వున్నా బాగానే వుండేది. అలా కాకుండా ఒకే ఒకవాక్యంలో రెండుసార్లు-నీవు-అని ఒకసారి — ఈవు అని మరొకసారి ఏకార్థక శబ్దాలు వుండడంలో ఔచిత్యమేమిటి ? "విషయేంద్రియ ప్రపంచము హృషీకము - అనఁ - బరఁగు"-ఓ కృష్ణా! నీవు + అతీతుడవై యున్మిషితముగ నది * ధరించుట (న్ = ధరించుటచేత) హృషీకేశ నామ శోభి వీవు"-అని ఈ ఒకే వాక్యంలో రెండుసార్లు ఏకార్థకాలైన "నీవు - ఈవు" శబ్దాలు వుండడంలో అర్థంకాని కనీసం అందంకాని యేదైనా వున్నదా ?

* ఇక్కడ "అది" శబ్దంచేత "హృషీకమనఁ బరఁగు విషయేంద్రియ ప్రపంచము" గ్రాహ్యం.

"తెలుగు లిపికి తలకట్టు తెచ్చిన ఉప్పులు" అనే నా వ్యాసాన్ని "ఆంధ్రప్రభ" దినపత్రికలో చదివి "కళా-ప్రపూర్ణ" శ్రీవజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు 12.3.1958న నాకు జాబు వ్రాస్తూ "హృషీకపతి నామ శోభి వీగతిఁ గృష్ణా" అను రీతిది కవిప్రయుక్తమై యుండును" - అని వ్రాశారు.† అసలు ఈ యెఱ్ఱాప్రగడపద్యం "శివుడు శ్రీకృష్ణు మహాత్మ్యము నభివర్ణించి నుతి చేయుట" అనే సందర్భంలోనిది. ఈ సందర్భంలో ఈశ్వరుడు "విష్ణు, నారాయణ, వాసుదేవ, త్రివిక్రమ, మాధవ, హృషీకేశ," మొదలైన పేర్లు శ్రీకృష్ణుడికి యెందువల్లవచ్చాయో—వాటి వ్యుత్పత్త్యర్థాలను వివరంగా చెప్పాడు—యీ చెప్పే సందర్భంలో ప్రతి పద్యంలోను ఏదో ఒక క్రియ ప్రయోగించాడు.

1. విష్ణు నామము ... ... యతిశయిల్లు 75ప.
2. నారాయణుఁడనఁగా నీ పేరు .... వెలయు .... 76ప.
3. వాసుదేవుఁ డందురు ..... 77ప.
4. త్రివిక్రముఁ డైతి (వి) త్రివిక్రమంబులన్... 78ప.
5. మాధవాఖ్యఁ బొగడుదురు ..... 79ప.
6. హృషీకేశనామ శోభి వైతివి ..... 80ప.
7. వామనుఁడనఁ బరగితివి ..... 81ప.

ఈ పద్ధతిలో ఆ పద్యా లన్నీ నడిచాయి — "హృషీకేశ" అనే శబ్దాన్ని క్రింద చతుర్థ పాదంలో ఆదిలో పెట్టడమే గణభంగానికి దారితీసింది-ఎంతో ప్రసిద్ధిగావున్న కేశవనామాల్లో సైతం "హృషీకేశాయ నమః" అని "హృషీకేశ" శబ్దాన్ని వ్యవహరించడమే ప్రాచీనకాలంనుంచీ వున్నది కాని "హృషీకపతి" శబ్దాన్ని వ్యవహరించడ మనేది శ్రుతపూర్వం కానేకాదు. ఎఱ్ఱాప్రెగడకూడా మామూలు వ్యవహారంలోవున్న "విష్ణు, నారాయణ, వాసుదేవ, త్రివిక్రమ, మాధవ" ఆదిగాగల శబ్దాలను గ్రహించినట్లుగానే "హృషీకేశ" అనే ప్రసిద్ధశబ్దాన్ని గ్రహించి వుంటాడనడమే సమంజసం కాని అప్రసిద్ధమైన, వ్యవహారంలో లేని "హృషీకపతి" శబ్దాన్ని గ్రహించి వుంటాడనడం సమంజసంకాదు. పాల్కురికి సోమన "అనుభవసారము, చతుర్వేదసారము, చెన్నమల్లుసీసములు" మొదలుగాగల గ్రంథాలలో విరచించిన తన పద్యాలలో వేదవచనాలను ఉదాహరిస్తూ పేర్కొనవలసి వచ్చినప్పుడు ఆవచనాలు వున్న వివున్నట్లుగానే యథాతథంగా ప్రయోగించాలంటే గణభంగంజరుగుతుందని సంకోచించకుండా వాటిని వున్న వివున్నట్లుగా (గణభంగానికి అంగీకరించి) ప్రయోగించాడు. అలా గణభంగం జరిగిన ప్రయోగాలు అతని సీసపద్యాల్లో కోకొల్లలు- "అపి మాషం మషం కుర్యాత్ ఛందోభంగం న కారయేత్" "మాషం అనే శబ్దాన్ని మషం అనైనా చెయ్యిగాని ఛందోభంగం మాత్రం చెయ్యకు" అనే ప్రాచీనుల వాక్యాన్ని తప్పనిసరిగా "ఛందోభంగమైనా చెయ్యిగాని సుశబ్దాన్ని అపశబ్దంగా మార్చకు" అని కూడా మనం మార్చుకొనక తప్పదు. ఒక మంత్రభాగాన్ని సుస్వరంగా పద్యంలో పెట్టాల్సివచ్చినప్పుడు గణభంగం కాక యేమవుతుంది? అక్కడ మంత్రానికే ప్రాధాన్యం కాని యితరాలకు కాదు-ఈ విధంగానే యిక్కడ "హృషీకేశ" అనే శబ్దాన్నే వినియోగించాలని భావించిన యెఱ్ఱాప్రెగడ గణభంగాన్ని అంగీకరించడంలో ఆశ్చర్యంవుండదు- శ్రీవజ్ఝలవారు సూచించిన 'ఈ గతి' అనేదే చేరిస్తే నిజంగా (హృషీకపతి నామ శోభి వీ గతిఁ గృష్ణా!")అక్కడ గతిలేక పెట్టుకొన్నట్లే కన్పడుతుంది. "ఈ గతి" అనేదానికి అర్థపుష్టి గాని సందర్భశుద్ధిగాని ఈ పద్యంలో యేదీలేదు—గణయతి భంగాలు జరిగినప్పటికీ "హృషీకేశనామ శోభి వైతివి కృష్ణా!" అనేపాఠంలోనే యెంతో అర్థం, అందం, రెండూ కన్పడుతున్నాయి.

ఈ విధంగానే క్రింద విడిగావుండే వట్రువసుడిని గమనింపక, ఆ అక్షర (స్వరవ్యంజనాల) విభాగాన్ని దృష్టిలోవుంచుకోకా కొందరు వ్యాకరణ వ్యాఖ్యాకర్తలు సైతం పైనున్న తలకట్టునుచూచి దాన్ని అకారంగారుగా భావించి భ్రమలు పడ్డారు. ఆంధ్ర శబ్ద చింతామణి అజంత పరిచ్ఛేదంలో 'ఉర్ద్వంద్వే రః' అని వొక సూత్రం వుంది. ద్వంద్వసమాసంలో పూర్వోత్తరపదాలు ఋకారాంతాలయి నప్పుడు పూర్వ పదాంత ఋకారస్థానంలో (ఆదేశంగా) అత్వవిశిష్టమైన 'ర' అనేది వస్తుందని దాని అర్థం. ఆంధ్రశబ్ద చింతామణికి క్రీ॥ శ॥ 1600 ప్రాంతంలో వ్యాఖ్య వ్రాసిన బాలసరస్వతిమొదలు ఆతనికి తర్వాతవారుకూడా దాన్ని యే విధంగా వ్యాఖ్యాసించారో చూడండి!

---

† ఆ లేఖలో నా వ్యాసానికి సంబంధించిన వాక్యా లివి—"రేఫ శబ్దముకూడా అత్వ విశిష్టరకారవ్యంజనవాచిగ వాడుకలు గలవు- "చ॥ న జ భ జ జల్ జ రేఫలఁ బెనంగి ....." (కవిజనాశ్రయము) "హృషీకనామ శోభి వైతివి కృష్ణా!" అను భగ్నచ్ఛందము భగ్న యతియు నగు పాఠము ప్రబంధ పరమేశ్వర ప్రయుక్తము కాదని విమర్శకు లంగీకరింప నగును. ముద్రణ సంస్కార లోపమున నట్లు పడినదని నిశ్చయము. "హృషీకపతినామశోభి వీ గతిఁ గృష్ణా!" అనురీతిది కవి ప్రయుక్త మన నోపును. ఇంకను స్వారసికమగు పాఠము పండిత కవీంద్రులు కల్పింతురు గాక." —

1. "ద్వంద్వే = ద్వంద్వసమాసమందలి, ఊః = ఋకారాంత శబ్దముల ఋకారమునకు, క్వచిత్ = కొన్నిచోటుల, రః = రేఫము వచ్చును. "మాత్ర పితృ భావమున శైలపుత్రిం గొలుతు" - (బాలసరస్వతీయం-207 వ. పుట.)

* 2. "ఋకారాంత ద్వంద్వే పూర్వపదసంబధినో ఋకారస్య స్థానే రః స్యాత్ = మాత్రపితృబుద్ధి నంబోధిపుత్రిం గొలుతు"
(వాసుదేవవృత్తి-నా వద్ద వున్న తాళ పత్రప్రతి-15 పత్రం-మొదటివైపు - మొదటి పంక్తి)

3. "ఋకారాంత ద్వంద్వే పూర్వపద సంబంధి యః ఋకార స్తస్య స్థానే ర స్స్యాత్ - మాత్రపితృబుద్ధి వై దేహపుత్రి దలంతు" - (అహోబలపండితీయం - 298 పుట.)

4. "ద్వన్ద్వే = ద్వన్ద్వ సమాసమునందు, ఊః - ఋకారమునకు, రః = రేఫాదేశము, వా = వికల్పముగా నగును."
(ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము - 2 సంపుటము. 1244 పుట)

ఋకారస్థానంలో అత్వవిశిష్టమైన రకారం వస్తుందని యీ వ్యాఖ్యాకర్తలెవ్వరూ చెప్పలేదు. బాల సరస్వతి ఖచ్చితంగా రేఫ స్తుందన్నాడు-వాసుదేవుడు "రః" అన్నాడుకాబట్టి అత్వంతో కూడిన రకారంగా భావించాడని చెప్పుకోవచ్చు-అయినా స్పష్టపరచాల్సింది. అహోబలుడుకూడా రః అనే అన్నాడు కాని ఆ వ్యాఖ్యలోనే దాన్ని రేఫగా వ్యవహరించాడు - శ్రీ వజ్ఝలవారు "రేఫ" అనే అన్నారు.

మాత్రపితలు_దీనిలో మొదటిపదం మొదటిస్థితి ఋకారాంతత్వంలో మాతృ అని వుంటుందికదా! "తృ" లో ఋకారస్వరం ఒక్కటే వున్నదికాని అకారం లేదు. "తృ" మీద వున్న తలకట్టుచూచి అకారం అనుకొని ఋకారస్థానంలో రేఫ-అంటే - పొల్లురకారం (వ్యంజనం మాత్రం) వస్తుందని అనుకొని "త్ర" అవుతుం దనుకున్నారు-ఒకవేళ ఆ "తృ" లో వున్నతలకట్టే అకారమయితే ఋకార స్థానంలో వా రనుకొన్నట్లు రేఫే (పొల్లు రకారమే) వస్తే "తర్" అవుతుందికాని "త్ర" యెట్లా అవుతుంది? "ర్" అనేది "త్ - అ" అనే వాటికి మధ్యలో వస్తేనే గాని (త్ + ర్ + అ = త్ర) అవి కలిసి "త్ర" కాదు-అసలు "తృ" లో ఋత్వమేకాని అత్వం లేనేలేదు - అయితే ఆ పైనున్న తలకట్టు ఆ అక్షరం-బోడిగా-బోసిగా - వుండకూడదనీ, అందాన్నీ, నిండుతనాన్నీ అపేక్షించి వచ్చిందే కాని వేరుకాదు-

ఈ సందర్భంలో చిన్నయ్యసూరి బాల వ్యాకరణంలోని సూత్రం చూడండి-

"ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు"-మాత్రపితలు-మాతాపితలు-ఇత్యాదులు-(బాల-సమా-24సూ)

ఈ సూత్రంలో స్పష్టంగా ఋకారస్థానంలో అత్వవిశిష్టమైన "ర" వస్తుందని "రవర్ణము" అని వర్ణశబ్దం వుంచి చిన్నయసూరి నిర్దేశిస్తుంటే వ్యాఖ్యాతలు చూడండి యెంత వింతగా వాఖ్యానించారో!

1. - "ద్వంద్వ సమాసంబునందుఁ బూర్వ పదాంతంబయిన ఋకారంబునకు రవర్ణంబు (క్రావడి) వైకల్పికంబుగా నగును-"
(గూఢార్థ ప్రకాశిక - 282 పుట - కర్త : కల్లూరి వెంకటరామశాస్త్రి)

2. - " మాతృ + పితృ - ఇందుఁ దొలి నున్న మాతృశబ్దము తుది ఋకారమున కీ విధిచే రేఫము కల్గెను" - † ("గ్రాంధికాంధ్రకల్పము అను నామాంతరము కల బాలవ్యాకరణ సారస్య సర్వస్వ పేటిక." అను టీక -353 - 354 పుటలు - కర్త; దూసి రామమూర్తిశాస్త్రి )

3. "ద్వంద్వ సమాసమున మొదటి పదము చివర నున్న ఋకారమునకు రేఫము వికల్పముగా నగును-(మాతృ + పితలు)- మాత్రపితలు - ఇందు మాతృ తొలి పదము - దాని చివరి ఋకారము రేఫముగా మారినది" -

(బులుసు వెంకట రమణయ్యగారి లఘుటీక - 200 పుట)

అని యీ విధంగా బాలవ్యాకరణ వ్యాఖ్యాత లందరూ అకారంతో కూడిన రకారం వస్తుందనడానికి రేఫ వస్తుందనే చెప్పారు. పై పెచ్చు శ్రీ కల్లూరివారు "క్రావడి" వస్తుందని స్పష్టంగా వ్రాశారు — ఈ విమర్శకులైన వ్యాఖ్యాకర్తల ప్రమాదాలకు కారణం (మాతృ) తృ మొదలైన వాటిల్లో తలకట్టు వుండడమే! - తలకట్టు అకారం అనుకొని, ఋకారం రావత్తుగా - అంటే - క్రావడిగా మారిపోతుందని భ్రమపడ్డారు - "తృ" లోని తలకట్టు అకారం గుర్తు కాదు; ఋకారం క్రావడిగానూ మారదు - నిక్కచ్చిగా "తృ"

---

* అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యాతల్లో వొకడైనప్పటికీ అతని వ్యాఖ్య సంధిపరిచ్ఛేదంతోనే ముగిసినందువల్ల ఈ సూత్రానికి వ్యాఖ్య వ్రాయలేదు.

† ఈ సూత్ర వ్యాఖ్యా సందర్భంలో దూసివారు పెక్కుచోట్ల రేఫ రేఫ అంటూ రేఫను వ్యవహరించారే కాని ఒక్కసారైనా అత్వంతో కూడిన రకార మని వ్రాయలేదు.

అన్నప్పుడున్న "త్ + ఋ" అనే వాటిల్లో ఋకార స్థానంలో అత్వవిశిష్టమైన "ర" వర్ణం ఆదేశంగా వచ్చి "త్ + ర = త్ర" అవుతుందేగాని వేరుకాదు. ఈ సందర్భంలో మనం ముఖ్యంగా గమనించవలసిన విశేషం వొకటుంది - "తృ" అన్నప్పుడున్న తలకట్టు అకారం గుర్తు కానేకాదు - "తృ" అనే దాంట్లో అకారం లేనేలేదు - "త్ర" అన్నప్పుడున్న తలకట్టు అకారం గుర్తు - "త్ర" అనే దాంట్లో అకారం వున్నది - త్ + ఋ అక్షరాల మేళనం జరిగినప్పుడు వచ్చేమార్పు రూపంలో - అంటే - తృ అనేదాంట్లో తలకట్టు వుంటుంది. అయితే అది అకారం గుర్తు మాత్రం కాదు - ఈ "తృ" అన్నప్పుడున్న (త్ + ఋ) ఋకారస్థానంలో అత్వ విశిష్టమైన రకారం అనేది ఆదేశంగా వస్తుంది-అంటే "ఋ"కారస్థానంలో "ర్ + అ" అనేవి రెండూ (ఆదేశాలుగా) వస్తాయన్నమాట- ఆదేశంగా వచ్చే ర్ + అ అనే యీ రెండక్షరాలూ "త్" అనే పొల్లుహల్లుతో కలిసేటప్పుడు-* "ర్" అనేది క్రావడి (◡) గాను, "అ" అనేది తలకట్టు (✓) గాను, మారి మరీ కలుస్తాయి - అంటే - "తృ" కారంలో అందంకోసం, నిండుతనంకోసమని వున్న తలకట్టుపోయి సార్థకమైన తలకట్టు (అకారవాచ్యమైన తలకట్టు) వచ్చి దాని క్రింద పొల్లు రకారంగా క్రావడి వస్తుందన్నమాట - అప్పుడు "తృ" అనేది "త్ర" గా మారి త్ + ర్ + అ = అనే అక్షరాల సంహితత్వాన్ని (పరస్పరసన్నికర్షత్వాన్ని) తెలియపరుస్తుంది- ఈ విషయాన్ని (తృలోని తలకట్టు అకారం గుర్తు కాదనీ, త్రలోని తలకట్టు అకారం గుర్తనీ) గమనించక శ్రీ కల్లూరివారు "రవర్ణంబు (క్రావడి) వైకల్పికంబుగా నగును" అని వ్రాయడం కేవలం పొరపాటు - మామూలుగా ఏ ఒత్తులైనా పొల్లుహల్లులకే గుర్తులుకాని స్వరసహితాలకు కానేకావు- క్త-క్మి-క్రు-క్లె-క్లొ మొదలైన యిటువంటి అక్షరాల్లో స్వరాల గుర్తులు (తలకట్టు) ✓ - (గుడి) ◌ి - (కొమ్ము) ◌ు - (ఎత్వం) ◌ె - (ఒత్వం) ◌ొ - అనేవి అక్షరాలకు పైభాగంలో వుండనే వుంటాయి.† (ఒక్క ఐకారం గుర్తుమాత్రం హల్లుల్లో పైన (ఎత్వం గుర్తు) ◌ె - క్రింద ◌ౖ అనే గుర్తుగా పైనా క్రిందా రెండుచోట్లా కలిపి వున్నది - ) కాబట్టి క్రింద వచ్చే ఒత్తులన్నీ వ్యంజనాలకు మాత్రమే చిహ్నా లనడం సమంజసం-అయితే శ్రీ కల్లూరివారు వ్రాసినవిధంగా "తృ" లో వున్న ఋకారం క్రావడిగానే మారితే అది స్వరరహితమైన "త్, ర్" అనే రెండు వ్యంజనాల రూపంమాత్రమే అవుతుంది కాని "త్ర"

---

* ఇక్కడ సందర్భవశాత్తు తృ-త్ర అనే వాటినే గ్రహించాను గాని ఋకార స్థానంలో పై సూత్రాలచేత రవర్ణం ఆదేశంగా వచ్చే యే అక్షరాన్నైనా గ్రహించవచ్చు-ఈ తృ-త్రలు ఇతర అక్షరాలకు కూడా ఉపలక్షణం -

† న్యాయానికి సంయుక్తాల్లో స్వరాలు మొదటి హల్లుమీద వుండకూడదు. చివరి హల్లుమీదనే వుండాలి-కాని మనం ప్రాచీన కాలం నుంచీకూడా వ్రాతలో మొదటి హల్లుమీదనే స్వరం వ్రాసుకొనడమూ వర్ణక్రమ విచక్షణ వచ్చేసరికి ఆ స్వరం చివరి హల్లుకి సంబంధించిందని భావించుకొని వ్యవహరించడమూ జరుగుతున్నది-వాస్తవానికి క్త-క్మి-క్రు-క్లె-క్లొ అని వ్రాస్తున్న యిటువంటి సంయుక్తాక్షరాల నన్నింటినీ క్‌త-క్‌మి-క్‌రు-క్‌లె-క్‌లొ-అని యీ విధంగా చివరిహల్లుమీద స్వరంవుండేటట్లుగానే వ్రాయాలి- ఈ విషయాన్నే అప్పకవి యీ క్రింది పద్యంలో స్పష్టంగా చెప్పాడు.

తే॥గీ॥ ఎన్ని హల్లులు జడ్డలై‡ యున్ననేమి
పొల్లులకు మీఁద నుండెడు హల్లు లెల్లఁ
గడపటను వ్రాయు ద్విత్వమొక్కటియె తాల్చు
దానితలకట్లు మొదలైన వాని నెల్ల॥ (అప్పకవీయం - 2ఆ - 39ప.)

అయితే సంయుక్తాలను క్‌త - క్‌మి - క్‌రు - అనే పద్ధతిలో వ్రాయడమనేది క్త - క్మి - క్రు - అనే పద్ధతిలో వ్రాయడంకంటే కష్టతరమైంది. అందుకే యీ కష్టాన్ని భరించలేని మన పూర్వులు ఈ విధమైన లిపిని సుఖాపేక్షతో మనకు సృష్టించిపెట్టారు - కాని యిటువంటి లిపి సక్రమమైన దనడానికి ఆస్కారంలేదు.

---

‡ ద్విత్వాలైన హల్లుల్ని (క్క - త్త - చ్చ - మొదలైనవాటిని) మాత్రమే కాకుండా అన్యహల్ సంయుక్తాలను(క్ర-త్మ - శ్చ- మొదలైనవాటిని) కూడా "జడ్డ" శబ్దంతో అప్పకవిలాగా ప్రాచీన లక్షణ గ్రంథకర్తలు చాలామంది వ్యవహరించారు. యీ వ్యవహారం సరైందికాదు - "జడ్డ" అనేది ద్విత్వానికే సంజ్ఞ - ద్విత్వశబ్దాన్ని అన్యహల్సంయుక్తాలకు కూడా ప్రాచీనులు కొందరు వాడారు - అదికూడా సరికాదు - ద్విత్వ మనేది ద్విరుక్తానికే సంజ్ఞ -

తే॥గీ॥ ద్విత్వమున కాది వర్ణంబు తెనుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామిధాత్రి కనఁగ ॥(ఛందోదర్పణం - 1ఆ - 67ప.)

అని అనంతు డీ సందర్భంలో అన్యహల్ సంయుక్తాల నుద్దేశించి "ద్విత్వ" శబ్దాన్ని ప్రయోగించడం సమంజసం కాదు.

యేలా అవుతుంది ? ఈ విషయమంతా గమనించని ఒకానొకరు శ్రీ కల్లూరివారి వ్రాతను సమర్థిస్తూ "రవర్ణము వస్తే తెలుగు లిపి స్వభావమునుబట్టి క్రావడి అని వ్రాసియుంటారు" - అని ఒకచోట వ్రాశారు - అత్వవిశిష్టమైన రకారం తెలుగు లిపిలో క్రావడిగా మారుతుందా? మారితే అందులో స్వరం ఎక్కడ? - అత్వవిశిష్టమైన వర్ణం యెప్పుడూ క్రావడిగా మారదు - అందులోవున్న వ్యంజన రకారం మాత్రమే క్రావడిగా మారి మిగిలిన అకారం మరొక గుర్తుగా యేర్పడుతుంది - (ట మొదలైన కొన్ని అక్షరాల్లో తలకట్టు వుండదు. కాబట్టి అత్వంవున్న అవస్థలో అవి యే విధంగా వుంటాయో ఆ విధంగానే వుంటాయి.)

అత్వవిశిష్టమైన రకారానికి "రేఫ" శబ్దాన్ని వ్యవహరించకూడదని యిదివరకే తెలిపాను-అయితే లోగడ నేను ఉదాహరించిన లేఖలో (LXV పేజీ) "రేఫ" శబ్దం అత్వవిశిష్ట రకారానికి మారుగా వాడడం వున్నదని శ్రీ వజ్ఝలవారు పేర్కొన్నారు. అందుకు ఉదాహరణగా "చ॥ నజభజజల్ జరేఫలఁ జెనంగి..." (కవిజనాశ్రయము) అని ఒక ప్రయోగాన్ని యిచ్చారు-గణవాచకాలైన భ,జ,న,స,మ, య,ర,త, మొదలైన అక్షరాల్లోవున్న అకారాలు ("హయవరట్" మొదలైన సూత్రాల్లో వున్నట్లుగా) ఉచ్చారణ సౌలభ్యంకోసం (భ్-జ్-న్-స్-మ్-య్-ర్-త్-అని వుచ్చరించడం కష్టం కాబట్టి) వచ్చినవేకాని వేరుకాదు - భ,జ,న, ఇత్యాదుల్లోవున్న అకారాలు వుచ్చారణ సౌలభ్యంకోసం వచ్చినవే కాకపోతే

చంపకకేసరి॥ "సజసాస్వలౌ యతి గజంబులఁ జంపకకేసరిన్"॥
కుసుమితలతావేల్లిత॥ "విన్మత్నల్ యాయల్ కుసుమితలతా వేల్లితన్ వళ్ళు రుద్రుల్"॥

(లక్షణసార సంగ్రహం-1ఆ-35 పుట.)

మేదిని (వాణి)॥ "మృడయతి నజ్భజర్గముల మేదినీ సమాఖ్యన్"॥

( అప్పకవీయం - 4ఆ - 16ఛందం - 239పుట. )

మొదలైన వృత్తాల్లో చిత్రకవిపెద్దన్న అప్పకవులు "స,వ" అనడానికి "స్వ" అనీ; "మ,త,నల్" అనడానికి "మత్నల్" అనీ; "న,జ,భ,జ,ర,గములు" అనడానికి "నజ్భజర్గములు" అనీ గణాక్షరాలను సంయుక్తాలుగాచేసి ప్రయోగించడానికి అవకాశమే లేదు - భ,జ,న మొదలైన గణాక్షరాలలో వున్న అకారస్వరం సహజమైందికాక ఉచ్చారణ సౌలభ్యంకోసం వున్నది కాబట్టే అది లోపించడానికీ, "జ్భ" మొదలైన సంయుక్తరూపాలు యేర్పడడానికి అవకాశం లభించింది. ఉచ్చారణార్థం వున్న స్వరంకాబట్టే కవిజనాశ్రయకర్తకూడా రగణంలోని రకారాన్ని రేఫగా వ్యవహరించాడు. అత్వవిశిష్టమైన రకారానికి "రేఫ" అని వ్యవహరించడమనేది కేవలం తెలుగులోనేకాదు - సంస్కృతంలోకూడా యెక్కడా లేదు - ఉన్నది అని గట్టిగా వాదించేవారు తగినఆధారంతో "రేఫ" శబ్దాన్ని అత్వ విశిష్టరకానికి గ్రహణ అయ్యేట్లుగా యెక్కడ యే విధమైన రూపసాధనలో సంస్కృత వ్యాకరణ కర్తలు పేర్కొన్నారో సోదాహరణంగా నిరూపించడం అవసరం - ఇది అలా వాదించేవారి కర్తవ్యంకూడా - ఆ విధంగా నిరూపించుకొనకుండానే ఊరికే వాదించి ప్రయోజనం వుండదు.

"రేఫ" అంటే పొల్లురకారమేగాని అత్వవిశిష్టరకారం కాదని స్పష్టంగా అభిప్రాయపడిన చిన్నయ్యసూరి తన "ఆంధ్రశబ్దశాసనం" లో (32పుట) "ఋత్వంబునకు రవర్ణం బగు" అనీ, "సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం" లో - "ఉరానజ్వ్యషయస్య రో వా" - అనజ్వ్యషయస్య ఋతో రః - అనీ-బాలవ్యాకరణంలో "ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు" అనీ-సూత్రాలు రచించి వేటిల్లోనూ "రేఫ" అని వ్యవహరించలేదు - బాల వ్యాకరణంలో యెక్కడైనా రేఫ రకారశబ్దాలను మాత్రమే చిన్నయ్య ఉపయోగించాడు గాని ఈ "ద్వంద్వంబున" ఇత్యాది పై సూత్రంతో తప్ప మరెక్కడా కూడా "రవర్ణము" అని వర్ణశబ్ద ప్రయోగంతో "ర"ను నిర్దేశించలేదు - "ఈ ఒక్క సందర్భలోనే చిన్నయ "రవర్ణము" అని యెందుకు వ్యవహరించాలి? ఇతర చోట్లల్లోలాగానే యిక్కడకూడా "రేఫ" శబ్దాన్ని యెందుకు ప్రయోగించలేదు?" అనే యీ ప్రశ్నలకు సమాధానం - "రేఫంటే పొల్లు రకారమేకాని స్వర విశిష్టం కాదు కాబట్టే" అనేదే సమాధానం - "రి,రు,రె.రొ" మొదలైన వాటిల్లో హల్లునుకూడా మనం రేఫలుగానే వ్యవహరిస్తాము- ఇక్కడ స్వరవిశిష్టంగా కాక కేవలం పొల్లురకారాన్ని మాత్రమే(వ్యంజనాన్నే) గ్రహిస్తాంకాబట్టే కేవలం రేఫశబ్దాన్ని యిటువంటిచోట్ల వ్యవహరిస్తాము - స్వర విశిష్టంగానే గ్రహించాల్సి వచ్చినప్పుడు "రి"కారం, "రు"కారం అనే పద్ధతిలోనో లేక "రీ" "రూ" అనే పద్ధతిలోనో గ్రహిస్తాము - దీన్నిబట్టి చూచినా "రేఫ" అంటే రకార వ్యంజన మనే మనకు తేలే సారాంశం -

అసలు ర + ఇఫ = రేఫ - అనిగదా రూపం - ర + ఇఫ - అన్నప్పుడున్న రకారంలోని అకారం యెప్పుడైనా ఉచ్చారణ సౌకర్యానికి వచ్చిందిగానే భావించుకొని సంధి (గుణం) చేసుకోవాలేగాని స్వతస్సిద్ధమైన అకారంగా భావించుకొని సంధి చేసుకోకూడదు. వాస్తవానికి స్వతస్సిద్ధమైన అకారంకల "ర" వర్ణానికి "ఇఫ" ప్రత్యయం చేరనే చేరదు. - ఆ విధంగా స్వతస్సిద్ధమైన అకారంకల

"ర" వర్ణం మీదనే "ఇఫ" ప్రత్యయం చేరవలసివస్తే రి,రు, రే,రో మొదలైన సహజాలైన ఇతర స్వరాలుకల వాటిమీదకూడా చేరి "రీఫ-ర్విఫ-రయిఫ-రవిఫ" వగైరా వైరిరూపాలన్నీ తయారవుతాయి-అందుకే మామూలుగా ఉచ్చారణసౌలభ్యం కోసమని పెట్టుకొన్న † అకారంకల రకారానికి మాత్రమే ఇఫ ప్రత్యయం చేరుతుందనీ, సహజమైన అకారంకల రకారానికి చేరదనీ భావించడం సర్వవిధాలా సమంజసం-* ఇంతకూ ఈచర్చవల్ల "కు,కృ" మొదలైన అకారవ్యతిరిక్త స్వరాలుకల హల్లులమీద తలకట్టు వుండడంవల్ల అందమూ, నిండుతనమూ తప్ప ప్రత్యేకమైన ప్రయోజనమేమీ లేదనీ, ఆ విధంగా ప్రయోజన రహితంగా వున్న యీ తలకట్టువల్ల కొందరు కవి పండిత విమర్శకులు కొన్ని పొరపాట్లు వ్రాశారనీ తేలుతున్నది-

శ్రీ కల్లూరివారు తమ గుప్తార్థ ప్రకాశిక 4 వ పుటలో (ప్రథమ ముద్రణం) "క్లృప్తము" అని వ్రాసినందుకు శ్రీ వజ్ఝలవారు తమ ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వంలో (49పుట)- "గుప్తార్థ ప్రకాశికాకర్త "కప్తము" అని చూపక "క్లృప్తము" అని చూపుటచే(...) ౡకారము హల్లుపయి నిల్చునపుడు "అ" కారసూచకమగు తలకట్టు వ్రాయరాదని యాతఁడు తలంచెనని తోచుచున్నది - ఆపక్షము నందు దుఃఖము మున్నగుచోటులందలి యుకారలేఖనము సందును..." - అని విమర్శించారు - కాని అకార వ్యతిరిక్త స్వరాలుగల హల్లులపై ఆ తలకట్టు ఉండడంవల్ల ప్రయోజనమేమో చర్చింపలేదు - అసలు ఈ పరిశీలనవల్ల కొందరు కవిపండితులు "కృ, వృ" ఇత్యాదుల్లో క్రిందుగా విడిగావుండే వట్టువసుడి సహజత్వాన్నీ, దాని సంపూర్ణవర్ణతత్వాన్నీ, గమనింపక పైని అందంకోసమై వచ్చిన తలకట్టును చూచి ఆ తలకట్టు అకార స్వరచిహ్నంగా భావించారని స్పష్టపడుతున్నది. అకార చిహ్నంగా అవతరించిన తలకట్టు అకారేతరస్వరాలున్న కొన్ని హల్లులమీదకూడా అందంకోసం నిండుతనంకోసం నిలవడంవల్ల యెంతమంది యెన్నిరకాల భ్రమ ప్రమాదాలకు లోనయ్యారో ఈ పరిశీలనవలన స్పష్టపడుతున్నది. యెర్రాప్రెగడవంటి ప్రాచీనమహాకవులు హేమాహేమీ లనబడిన లక్షణ వేత్తలయిన వైయాకరణులే భ్రమప్రమాదాలకులోనై పొరపాట్లుపడగా శ్రీనేమానివారు "నీ వభీష్టదుఁడవు నీవు కామప్రదాకృష్టుండ వరులచే నపరివృతుఁడ" వన్నపాదంలో "ఆకృష్ట" శబ్దంలోని 'కృ' కారంలోవున్న తలకట్టునుచూచి అకారంగా భ్రమపడి "అపరివృత" శబ్దంలోని తొలి అకారంతో యతి మైత్రిని పాటించడంలో విచిత్ర మేమీ లేదు.

ఉక్తాది 26 ఛందస్సుల్లోనూ పుట్టిన సమవృత్తాలు 13,42,17,726. ఈ సమవృత్తాలమీద ఆధారపడి అవతరించిన అనేకానేక అర్ధసమవృత్తాలు 5404324355 1,51,80,050-వివిధ ఛందస్సుల్లో ఉద్భవించిన ఈ విభిన్నసమవృత్తాల సమ్మేళనంతో రూపొందిన స్వస్థాన విషమవృత్తాలు పరస్థాన విషమవృత్తాల సంఖ్య 7205799135,35,73,400. పై సమవృత్త సంఖ్యమీదనే ఆధారపడి అవతరించిన సర్వస్వస్థాన విషమవృత్తాలు సర్వపరస్థాన విషమవృత్తాల సంఖ్య 9007033898 63,01,138. ఈ సమ అర్ధసమ విషమవృత్తాలగురించి "దేశి ఛందస్సులను అంతర్లీనంచేసుకోగల అనంతకోటి సంస్కృత ఛందోరీతులు" అన్న నా బృహద్వ్యాసంలోను

---

† అయితే యిక్కడ "ఉచ్చారణ సౌలభ్యం కోసం అకారాన్నే యెందుకు పెట్టుకోవాలి? ఇకారాన్ని కాని ఉకారాన్ని కాని ఏదో ఒక యితర స్వరాన్ని యెందుకు పెట్టుకోకూడదు? ఉచ్చారణ సౌలభ్యానికై అకార వ్యతిరిక్త స్వరాలనే పెట్టుకొని రి + ఇఫ = రీఫ, రు + ఇఫ = ర్విఫ అనే పద్ధతిలో "రీఫ" అనికాని "ర్విఫ" అనికాని ఆయారూపాలతో రకారవ్యంజనాన్ని యెందుకువ్యవహరించ కూడదు? కేవలం'అకారం మాత్రమేచేర్చి ర + ఇఫ = రేఫఅనే యెందుకు వ్యవహరించాలి?" -అని యెవరైనా ప్రశ్నలు వెయ్యడానికి అవకాశం ఉన్నది- "ఉచ్చారణ సౌలభ్యానికై అకారాన్ని మాత్రమే చేర్చడమనేది అనాదిగా వున్న ఒక సాంప్రదాయం-ఎప్పుడో కొన్ని పందలు వేల యేళ్ళకు పూర్వం "హ,య,వ,ర,ట్-ఞ,మ,ఙ,ణ,నమ్,-ఝభఞ్-ఘఢధష్" మొదలైన మహేశ్వర సూత్రాల్లో అకారమే ఉచ్చారణ సౌకర్యార్థం వినియోగించబడింది-అకారం బ్రహ్మ (ఆనందో బ్రహ్మ) పదార్థవాచకమని దాన్నివినియోగించి వుండవచ్చు-లేదా అక్షర సమామ్నాయంలో అకారం మొట్టమొదటిది కాబట్టి ముఖ్యంగా దాన్నే వినియోగించి వుండవచ్చు-అసలు అకార వ్యతిరిక్త స్వరాలను వినియోగించి ఉచ్చరించడంకంటే అకారాన్ని వినియోగించి ఉచ్చరించడం సులభం, సుఖంకూడా - ఈ సులభాపేక్షతోనే, ఈ సుఖాపేక్షతోనే ఆమహేశ్వర సూత్రాల్లో హకారాదుల్లో అకారం వుచ్చారణ సౌకర్యార్థం ప్రవేశపెట్టబడి వుంటుంది-అనాదిగా-అనుశ్రుతంగా అలవాటుగా-మన తాతముత్తాతల దగ్గరనుంచి మనకు నియమపూర్వకంగా సంక్రమించింది కాబట్టే వుచ్చారణా సౌకర్యానికి హల్లులమీద అకారం ఒక్కటే చేర్చబడుతున్నది!" అనేదే పై ప్రశ్నలకు సమాధానం-

* "అనజ్ స్యాదృతో ద్వంద్వే। రేఫశ్చారికవేన్మతే" అని అథర్వణ విరచితంగా వెలసిన యీ వికృతివివేకకారికలో రవర్ణాన్ని వుద్దేశించి "రేఫ" శబ్దాన్ని వినియోగించడం కేవలం పొరపాటని యీ పరిశీలనవల్ల తేలుతున్నది-చింతామణి, బాలవ్యాకరణ సూత్రవ్యాఖ్యాకర్తలలాగానే క్రావడి తత్వాన్ని దృష్టిలో పెట్టుకోక పైనుండే తలకట్టును అకారంగా భావించడంవల్లనే యీపొర పాటుకూడా దొర్లిందనడం సమంజసం-

(ఆంధ్రప్రభ-దినపత్రిక 15-8-1960, 21-8-1960) "మార్గ-దేశి" అన్న నా పరిశోధనా గ్రంథంలోను-"శృంగారపదములు" † అన్న గ్రంథానికి నేను వ్రాసిన పీఠికలోను చర్చించడం జరిగింది. సమ అర్ధసమవృత్తాలను విడిచిపెడితే రూపొందే స్వస్థాన విషమ వృత్తాలు, పరస్థాన విషమవృత్తాలు, స్వస్వస్థాన విషమవృత్తాలు, స్వపరస్థాన విషమవృత్తాల మొత్తంసంఖ్య 1621283303 3,98, 74,538. ఇన్ని కోటానుకోట్ల భేదాలతోవున్న విషమవృత్తాలు కేవలం ఉక్తాది 26 ఛందస్సులలో ఉద్భవించిన సమవృత్తాలమీద ఆధారపడినవి మాత్రమే. యిందుకుభిన్నంగా ఉద్ధురమాలాది వృత్తాదుల రూపంలోను అంటే-పాదానికి 26 కంటే అధికంగా అక్షరాలుగల వృత్తాలరూపంలోను-ఆయా వృత్తాల విషమ వృత్తాల ఛందస్సుల రూపంలోను-అవతరించే వృత్తసంఖ్య మరెన్నెన్ని కోట్లకు చేరుతుందో చెప్పలేము. మన ప్రాచీనకవులు 'ఛందశ్శాస్త్రకర్తలు' 13 కోట్ల పైగావున్న సమవృత్తాలలో శతాధికమైన వృత్తాలనైనా ఉపయోగించ లేదు. వివిధ అర్ధసమ విషమవృత్తాలను వేళ్ళమీద లెక్కపెట్ట తగినన్నింటిని లక్షణకర్తలు వివరించడం జరిగింది. కావ్యరచనలో ప్రాచీనకవులు విషమవృత్తాలను వాడిన సందర్భాలు మృగ్యాలనే చెప్పవచ్చు. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితా రచనలో శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు అష్టమమండలంలో విభిన్నసూక్తానువాదాలలో మూడు విధాలయిన విషమవృత్తాలను వివరించారు. అయితే ఈ వృత్తాలను శ్రీ నేమానివారు విషమ వృత్తాలుగా సరిగా గుర్తించనందువల్లకాబోలు వీటికి మామూలు సమవృత్తనామాలను - పైగా సుప్రసిద్ధమైన నామాలనే పెట్టి-లక్షణ విరుద్ధంగా పేర్కొనడం జరిగింది.

మత్త భద్రము

రుద్రపుత్రకు లసుర హంతలు రూఢ యౌవనవంతులై
భద్రమైన నణస్సు వీడుచు వచ్చి యే నుతివల్ల మా
క్షుద్రకాంక్షిత మెల్లఁ దీర్తురొ! సూటి నా స్తుతిగీతి ని
ర్నిద్రఁ బొందుచుఁ గాంక్షితంబుల నిత్యమీర లొసంగరే !॥

(స. శ్రీ. ఋ. - తృతీయసంపుటం - 8 మండలం - 20 సూ - 597 పేజీ - 474 పద్యం)

"రుద్రపుత్రకులు" ఇత్యాదిగా వున్న ఈ పై వృత్తాన్ని "మత్తకోకిల"గానో, "మత్తమయూరం" గానో, "మత్తావృత్తం" గానో, భావించాలన్న దృష్టితోనోయేమో శ్రీ నేమానివారు వ్రాతప్రతిలో స్వహస్తంతోనే "మత్త॥" అని వ్రాసి నిర్దేశించారు. (చూ. వ్రాతప్రతి. 9 సంపుటం. 57 పేజీ) "మత్తకోకిల"కు పాదానికి పద్దెనిమిది అక్షరాలవంతున "ర,స,జ,జ,భ,ర" గణాలు ఆరుంటాయి. "మత్తమయూరానికి"పాదానికి పదమూడు అక్షరాలవంతున "మ,త,య,స,గ"గణాలుంటాయి."మత్తావృత్తా"నికిపాదానికి పదిఅక్షరాల వంతున "మ,భ,స,గ"గణాలుంటాయి. ఈమూడూ సమవృత్తాలు. ఈమూడు వృత్తలక్షణాలలో యేఒక్కలక్షణంకూడా"రుద్రపుత్రకులు" ఇత్యాది పద్యానికి అనువర్తించడంలేదు. ఈ "రుద్రపుత్రకులు" ఇత్యాది పద్యాన్ని శ్రీ నేమానివారు విషమవృత్తంగానే భావించి కేవలం "మత్త" అని మాత్రమే పేరు పెట్టారేమో అని భావించడానికి వీలులేదు. కారణమేమంటే విభిన్న లక్షణాలతోవున్న ముందు ఉదాహరించ బోయే మరొక విషమవృత్తాన్నికూడా "మత్త॥" అని యీ రెండక్షరాలతోనే నేమానివారు నిర్దేశించారు. అందువల్ల రెండు విభిన్న విషమ వృత్తాలను "మత్త॥" అని నిర్దేశించడంలో శ్రీ నేమానివారు పొరపడ్డారనే తేటతెల్లమవుతున్నది. "రుద్రపుత్రకు" లిత్యాది పద్యంలో తొలిపాదం "అతిధృతి" ఛందస్సులో పంధొమ్మిది అక్షరాలతో 1,86,107 వ వృత్తపాదంగా "ర,స,స,స,జ,జ,గ" గణాలతోను-రెండు, మూడు, నాలుగు, పాదాలు"ధృతి" ఛందస్సులో పద్దెనిమిదిఅక్షరాలతో 93,019వ వృత్తపాదంగా "ర,స,జ,జ,భ,ర" గణాల తోను విషమవృత్తంగా వున్నది. తొలిపాదంలో పన్నెండవ అక్షరం యతిస్థానంకాగా మిగిలిన మూడు పాదాలలోను పదకొండవ అక్షరం యతిస్థానం. విభిన్న గణాలతోవున్న యీ పరస్థాన విషమవృత్తానికి "మత్తభద్రవృత్తం"గా నేను నూతననామం పెట్టినా-శ్రీ నేమానివారు పొరపాటునో గ్రహపాటునో పెట్టిన "మత్త" అన్న అక్షరద్వయనామాన్ని విస్మరించడం యిష్టంలేకనే "మత్త" శబ్దంతోనే ప్రారంభించి నేను యీ నూతన విషమవృత్తనామం పెట్టడం జరిగింది.

"మత్త భద్ర" పరస్థాన విషమ వృత్తం

| పాదసంఖ్య | - ఛందస్సు | అక్షరసంఖ్య | వృత్తక్రమసంఖ్య | గణాలు | యతిస్థానం |
|---|---|---|---|---|---|
| 1 | అతిధృతి | 19 | 1,86,107 | ర,స,స,స,జ,జ,గ | 12 |
| 2 | ధృతి | 18 | 93,019 | ర,స,జ,జ,భ,ర | 11 |
| 3 | ధృతి | 18 | 93,019 | ర,స,జ,జ,భ,ర | 11 |
| 4 | ధృతి | 18 | 93,019 | ర,స,జ,జ,భ,ర | 11 |

పైన ఉదాహరించిన "రుద్రపుత్రకులు" ఇత్యాదిపద్యంలోని మూడవ పాదంలో "సూటి నా స్తుతిగీతిని" అన్నదానికి మారుగా

† ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ - హైదరాబాద్-ప్రచురణ.

వ్రాతప్రతిలో "నూటి నా స్తోత్రాశినిన్" అని శ్రీనేమానివారు వ్రాసినపాఠంవున్నది. ఈపాఠాంతరంతోకూడినప్పుడు "క్షుద్రకాంక్షిత మెల్లదీర్పురొ నూటి నా స్తోత్రాశినిన్" అని పాదం భిన్న లక్షణంతో మారుతుంది కాబట్టి యిది "ధృతి" ఛందస్సులోని "ర,స,జ,జ,భ,ర" గణాలతోవున్న 93,019వ వృత్తపాదంగాకాక-పాదానికి పదిహేడుఅక్షరాలతోవున్న "అత్యష్టి" ఛందంలోని 35,675వ వృత్తపాదంగా "ర,న,జ,జ,మ,వ" గణాలతో ఏకాదశాక్షరం యతిస్థానంగానే రూపొందగలదు. ఈ పాఠాంతరంతో కూడినప్పుడు త్రివిధాలయినగణాలతో అతిధృతి,ధృతి, అత్యష్టి ఛందస్సులలోని మూడు విభిన్న పరస్థాన సమ వృత్తపాదాల సాంకర్యంతో ఈ పరస్థాన విషమ వృత్తం యేర్పడగలదు. యేమైనా "రుద్రదివృత్రులు" ఇత్యాది పద్యం పరస్థానాత్మకాలైన ద్వివిధ ఛందస్సులతోకాని త్రివిధ ఛందస్సులతోకాని విషమవృత్తంగా ఆవిష్కృతమైందనడంలో విప్రతిపత్తి యేమీలేదు.

సుమేళవృత్తము

పరస్వరోపమేయులైన వరుణ మిత్రు లిద్దఱున్<br>
బరీత దీప్తు లౌచు హవ్యభాగ్యసంయుతుల్ గదా !<br>
కరంబు వారు సకల దివిని గల్పనంబుఁ జేయుచున్<br>
బరుల్ పఠించు సూక్తి సూర్యుఁ బరమదీప్తుఁ జేయరే ! ॥

(స. శ్రీ. ఋ- తృతీయ సంపుటం-3మండలం - 29సూ. 661పేజీ. 624పద్యం)

"పరస్వరోపమేయులైన" ఇత్యాది పద్యాన్ని శ్రీనేమానివారు వ్రాతప్రతిలో "సుగంధివృత్తము" అనిస్పష్టంగా పేర్కొనడం జరిగింది. (చూ. వ్రాతప్రతి-9వ సంపుటం-109 పేజీ) సమవృత్తమైన "సుగంధి" వృత్తానికి "ర,జ,ర,జ,ర,వ," గణాలుంటాయని ఛందశ్శాస్త్రకర్తలు అనేకమంది యెలుగెత్తిచాటారు. "సుగంధి" వృత్తం "అత్యష్టి" ఛందంలోనిది. శ్రీనేమానివారు విరచించిన పరస్వరేత్యాది పద్యాన్ని ప్రథమ చతుర్థపాదాలు "అత్యష్టి" ఛందస్సులోపదిహేడు అక్షరాలతో 44,886వ వృత్తపాదాలుగా "జ,ర,జ,న,ర,వ," గణాలతో పదవఅక్షరం యతిస్థానంగాను-రెండవపాదం "అష్టి" ఛందస్సులో పదహారు అక్షరాలతో 21,846వ వృత్తపాదంగా "జ,ర,జ,ర,జ,గ" గణాలతో పదవఅక్షరం యతిస్థానంగాను-మూడవపాదం "ధృతి" ఛందస్సులో పద్దెనిమిది అక్షరాలతో 88,054వ వృత్తపాదంగా "జ,భ,న స,జ,ర" గణాలతో పన్నిండవ అక్షరం యతిస్థానంగాను-ఒకానొక విశిష్ట విషమ వృత్తలక్షణయుక్తంగా త్రివిధ విషమ ఛందస్సులతో విరచించడం జరిగింది. అందువల్ల యిది "సుగంధి వృత్తం" కానే కాదు.

"సుమేళ" పరస్థాన విషమ వృత్తం

| పాదసంఖ్య | ఛందస్సు | అక్షరసంఖ్య | వృత్తక్రమసంఖ్య | గణాలు | యతిస్థానం |
|---|---|---|---|---|---|
| 1 | అత్యష్టి | 17 | 44,886 | జ,ర,జ,న,ర,వ | 10 |
| 2 | అష్టి | 16 | 21,846 | జ,ర,జ,ర,జ,గ | 10 |
| 3 | ధృతి | 18 | 88,054 | జ,భ,న,స,జ,ర | 12 |
| 4 | అత్యష్టి | 17 | 44,886 | జ,ర,జ,న,ర,వ | 10 |

విభిన్న త్రివిధ ఛందస్సులతో త్రివిధ వృత్త గణాలతో పరస్థానవిషమవృత్తంగా రూపొందిన "పరస్వరోపమేయులైన" ఇత్యాది పద్యానికి పరస్థాన విషమవృత్తాలలో "సుమేళవృత్తం"గా నేను పేరు పెట్టడం జరిగింది.

మత్తభృంగి

ఏ పృథుశ్రవసుండు మా కిల నెల్ల ధనము నొసంగఁ దా<br>
నోపి మనసునఁ దల్చి తుష్టిని నొందియుండెనో ! యాతఁడే<br>
యా పరాక్షు, సుకృత్వు, నహుషుని నా యరధ్వని ప్రీతితో<br>
నేపు మీరఁగ ధనము నడిగెను నీయు మంచుఁ బ్రపత్తితోన్ ॥

(స. శ్రీ. ఋ. – తృతీయ సంపుటం-8మండలం-46సూ-765పేజీ. 851పద్యం.)

"రుద్రవృత్రకులు" ఇత్యాదిపద్యాన్ని శ్రీనేమానివారు "మత్త॥" అని రెండక్షరాలతో నిర్దేశించినవిధంగానే "ఏ పృథుశ్రవసుండు" ఇత్యాదిగాగల పైపద్యాన్నికూడా "మత్త॥" అన్న రెండక్షరాలతోనే వ్రాతప్రతిలో వృత్తనామంగా స్వహస్తంతోనే వ్రాసి నిర్దేశించారు. (చూ. వ్రాతప్రతి. 9వ సంపుటం. 183పేజీ) గతంలోపేర్కొన్నవిధంగానే యిది మత్తకోకిలగాని, మత్తమయూరంగాని, మత్తావృత్తంగాని

కానేకాదు. ఈపద్యంలో తొలిపాదం "అతిధృతి" ఛందస్సులో పంధొమ్మిది అక్షరాలతో 1,95,419వ వృత్తపాదంగా "ర,స,జ,జ,న,జ,గ" గణాలతో పదకొండవ అక్షరం యతిస్థానంగాను, రెండవపాదం "అతిధృతి" ఛందస్సులో పంధొమ్మిది అక్షరాలతో 1,86,047 వృత్త పాదంగా "భ,న,ర,స,జ,జ,గ" గణాలతో పన్నెండవ అక్షరం యతిస్థానంగాను-తృతీయపాదం "అతిధృతి" ఛందస్సులోనే పంధొమ్మిది అక్షరాలతో 1,86,331వ వృత్త పాదంగా "ర,స,న,స,జ,జ,గ" గణాలతో పన్నెండవ అక్షరం యతిస్థానంగాను-చతుర్థపాదం "కృతి" ఛందస్సులో యిరవై అక్షరాలతో 3,72,731వ వృత్త పాదంగా "ర,న,న,న,ర,స,వ" గణాలతో పదమూడవఅక్షరం యతిస్థానంగాను రెండు విభిన్న ఛందస్సుల్లో నాలుగు విభిన్న వృత్తలక్షణాలుగల పాదాలతో ఈ "మత్తభృంగి" పరస్థాన విషమవృత్తం రూపొందింది.

## "మత్తభృంగి" పరస్థాన విషమవృత్తం

| పాదసంఖ్య | ఛందస్సు | అక్షరసంఖ్య | వృత్తక్రమసంఖ్య | గణాలు | యతిస్థానం |
|---|---|---|---|---|---|
| 1 | అతిధృతి | 19 | 1,95,419 | ర,స,జ,జ,న,జ,గ | 11 |
| 2 | అతిధృతి | 19 | 1,86,047 | భ,న,ర,స,జ,జ,గ | 12 |
| 3 | అతిధృతి | 19 | 1,86,331 | ర,స,న,స,జ,జ,గ | 12 |
| 4 | కృతి | 20 | 3,72,731 | ర,న,న,న,ర,స,వ | 13 |

ద్వివిధ విభిన్న ఛందస్సులలో చతుర్విధాలయిన వేరు వేరు వృత్తలక్షణాలతో రూపొందిన ఈ పరస్థాన విషమ వృత్తానికి గతంలో వలెనే శ్రీనేమానివారు నిర్దేశించిన "మత్త" నామ శబ్దాన్ని పరిత్యజించకుండా "మత్తభృంగి" అని నేనే నూతనంగా పేరుపెట్టడం జరిగింది. ఇవి యీ సంపుటంలోవున్న శ్రీనేమానివారు ప్రయోగించిన వ్యాకరణ ఛందో ప్రయోగ విశేష విషయాలు.

ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-శేషభాగపూరణల కార్యక్రమాలు నిర్వహించడంలోను, అనేక మూల ఋగ్వేద ముద్రిత ప్రతులతోను, వ్రాతప్రతులతోను తులనాత్మకమైన పరిశీలన చెయ్యడంలోను, నా జ్యేష్ఠ కుమార్తె కుమారి వడ్లమూడి జయశ్రీ బి.యస్‌సి., నా అర్ధాంగి శ్రీమతి శశికళ అహరహం అహోరాత్రులు నాతోపాటు పరిశ్రమించడం జరిగింది. నా ద్వితీయ కుమార్తె కుమారి వడ్లమూడి సత్యశ్రీ (బి.ఏ.) సహితం ఈ కార్యక్రమంలో భక్తితత్పరతతో నిరపేక్షగా పరిశ్రమించడం జరిగింది. అందుకు వీరు ముగ్గురికీ నా హృదయ పూర్వకమైన శుభాకాంక్షలు. ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణల-బాధ్యతలు నా కప్పగించాలని ఆచరణలో తొలుత ఉత్తర్వులు యిచ్చినవారు తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు అధ్యక్షులు అయిన డాక్టర్ సి. అన్నారావు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ పి.ఎస్. రాజగోపాలరాజు I.A.S. గార్లు. వీరు చేసిన నిర్ణయాన్ని ఆ తరువాత హృదయపూర్వకమైన గౌరవాభిమానాలతో 1979 లో అమలు పరచాలనే నిర్ణయానికి వచ్చిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తలమండలికి నూతనంగా అధ్యక్షులయిన డాక్టర్ ఎన్. రమేశన్ I.A.S. గారు. ఈ నిర్ణయాన్నే అమలుపరచిన వారు తరువాత ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ వి.వి. ఆర్. కె. ప్రసాద్ I.A.S. గారు. వీరి అభిమాన గౌరవాలతో గతంలో సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ సంపుటమూ, ద్వితీయ సంపుటమూ ముద్రితమై ఆవిష్కృత మయినాయి. ఇప్పుడు నిరాడంబరులు, మహాభక్తులు, అతిసమర్థులు, నీతినిజాయితీలకు స్థానభూతులు, ఆపన్నప్రాయులు, పరిపాలనాదక్షులు, ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానంఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అయిన శ్రీ గంగిసాని కుమారస్వామిరెడ్డి I.A.S. గారి ఆదరాభిమానాలవల్ల సప్తమ, అష్టమ, మండలాలతో వున్న ఈ తృతీయ సంపుటం వెలువడుతున్నది. అందుకు వీరందరికీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు. ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రచురణ కార్యక్రమం ఒక సంపుటం తరువాత మరొకటిగా-కొనసాగడంలో సంపూర్ణంగా సహకరించిన ప్రస్తుతం బోర్డు అధ్యక్షు లయిన శ్రీ బి. నాగిరెడ్డిగారికి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ గంగిసాని కుమారస్వామిరెడ్డి I.A.S. గారికి, తదితర బోర్డు సభ్యులకు, నా మనః పూర్వకమైన కృతజ్ఞతలు. ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత త్వరగా వెలుగుచూడడానికై ముద్రణాది కార్యక్రమాలు శీఘ్రంగా జరగడంలో పూర్తిగా సహకరిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానం పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తి M.A. గారికి నా అభినందనలు. ఇతర విషయాలలో నాకు తోడ్పడిన సప్తగిరి ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావుగారికి అభినందనలు.

సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ఈ తృతీయ సంపుటాన్ని అనేక శ్రమల కోర్చి ముద్రించిన "స్వతంత్ర ప్రెస్" అధిపతులయిన శ్రీ థియో ఇమాన్యుయేల్, శ్రీమతి క్లరినా ఇమాన్యుయేల్ దంపతులకు-శ్రీ క్రిష్టి జోసెఫ్, శ్రీమతి బర్ని జోసెఫ్ దంపతులకు-శ్రీ నెల్లో ఇమాన్యుయేల్ గారికి నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు.

2-2-1136/7/2
న్యూ నల్లకుంట
హైదరాబాద్
ఆంధ్రప్రదేశ్

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ ద్వితీయ సంపుటాలను భారత విదేశాంగ శాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు వరంగల్లులో 1982 మార్చి 14న ఆవిష్కరిస్తున్న దృశ్యం.



తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల మండలి

ముందువరుస : ఎడమనుంచి కుడికి - శ్రీ వై.వి. రామిరెడ్డి. బి.ఎ.బి.ఎల్; శ్రీ సైదయ్య. ఎమ్.ఎల్.ఎ; శ్రీ ఎస్. సూర్యప్రకాశరావు. బి.ఎ.ఎమ్.ఎల్.ఎ. శ్రీ బి. నాగిరెడ్డి (అధ్యక్షులు), శ్రీమతి కె. ప్రభావతమ్మ. ఎమ్. ఎల్. ఎ; శ్రీ కె. హీరారెడ్డి.

వెనుకవరుస : [illegible]

# తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల మండలి

# అభినందన!

సామాన్య కుటుంబమున న
సౌమ్యాత్మఁ బుట్టి పెరిగి శశ్వచ్ఛక్తిన్
సామాజిక నవ చైత
న్యామృతుఁడగు నాగిరెడ్డి నభినందింతున్॥

పండిన వయసున నిండగు
గుండెలు మెండుగను నేడు కొండల గుడులై
పండఁగ నద్యక్షుండై
రెండింతల కీర్తి నాగిరెడ్డి వెలిఁగెడున్॥

ఒకవంక వేదాల యకలంక నాదాలు విమలశక్తుల నిండి విస్తరిల్ల
నొకవంక శాస్త్రాలు వికసించు మార్గాల వేలువేలుగఁ బూలు వెల్లివిరియ
నొకవంక సాహిత్య సకల శాఖలు వేరువేరు రూపులు దాల్చి వెలుఁగుచుండ
నొకవంక సంగీత చకిత నృత్యరవళుల్ చెవులు గింగురుమంచుఁ జెలఁగుచుండ
వరల బహుముఖాలఁ దిరుమల తిరుపతి
దేవళముల నెల్లఁ దీర్చిదిద్ది
శాశ్వతంపుఁ గీర్తి సకల దిశల వెల్గ
శ్రీ బి. నాగిరెడ్డి శ్రీల నేలు॥

చెలఁగ శారదా విజయలక్ష్మి ప్రశస్తి
లక్ష్మినారాయణప్రసాద్ లక్ష్యశుద్ధి
వేణుగోపాల - విశ్వనాథ్ - విమలవృత్తు
లలర వేంకటరాముఁడు నభ్యుదయపు
మార్గముల నాగిరెడ్డి సమాన్యుఁ డగుత!॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



శ్రీ బి. నాగిరెడ్డి

అధ్యక్షులు

తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల మండలి



శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

# శుభాశంస!

1

ఉయ్యాల గోత్రజుం డుత్తమ వంశజుండై వృద్ధి నందిన యమలమూర్తి
నెయ్యాన మైత్రిమై నిత్య సంభృతి మెయిన్ "నిర్మల" హృదయుఁడౌ సీతిమూర్తి
ఉన్నతోన్నత విద్య నూర్జితమేధమైఁ బాలనా దక్షుఁడై వరలు మూర్తి
భక్తి సంయుక్తుఁడై ముక్తి సంరక్తుఁడై నవ్యత్వమును గోరు భవ్యమూర్తి
ప్రీతి జీ. కుమారస్వామిరెడ్డి వరుఁడు
అలరు తిరుమల తిపుపతి నమరు దేవ
దేవు దివ్యసేవల నాంధ్రి తేజరిల్లఁ
జేయుతనుగాక! సకల సుశ్రీలు చెలఁగ॥

2

శ్రీ రామిరెడ్డి తనయా!
రారాజ మహా జన పద రాజద్వినయా!
సారామృత వాక్సునయా!
ధీ రాజిత ప్రభుత శక్తి దేయానునయా! ॥

3

వేదోపనిషదాది విమల సద్విద్యలు వేల లోలల నాడి వెల్లివిరియ
నాగమముల. సృష్టి యాగక్రియల తుష్టి విజ్ఞానదృష్టితోఁ బుష్టి నొంద
వివిధ శాస్త్రావళు లవితథ విస్తృతిన్ దివ్యమౌ జ్ఞానాలఁ దేజరిల్ల
బహుముఖ సాహిత్య భవ్య శాఖలు మహావాణి మేఖల ఠాచుఁ బరిఢవిల్ల
ధృతిని శ్రీ కుమారస్వామిరెడ్డి! సుకృతి
స్వచ్ఛ పరిపాలనాదృతి సర్వగతుల
దివ్య తిరుమల తిరుపతి దేవళములఁ
దీర్చి దిద్దుమ! ధన్యతన్ దేజరిలఁగ॥

4

"సాయికల్పన" యొక చక్కఁ జక్క వెలుఁగ
విమల "వెంకటసాధన" వెల్లివిరియ
నల "జగత్కుమారసవీనుఁ" డలర ముందు
"నిర్మలా కుమారస్వామి" నెగడుఁగాక! ॥

5

అంబర కుటుంబమై జగ
దంబా సంరక్తి భక్తు లలరంగ-నిరా
డంబర కుమారసామి కు
టుంబము-వే వెలుఁగులుగఁ గడుం గడు వెలుఁగున్॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

# ఆశీస్సు

సమూల
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
సంకలన - పరిష్కరణ - పూరణల
మహత్తర కార్యక్రమంలో
అనవరతం - అహరహం - అహోరాత్రులు
నాతోపాటు
అవిశ్రాంతంగా కృషిచేసిన
నా జ్యేష్ఠ కుమార్తె
చిరంజీవి సౌభాగ్యవతి
కుమారి వద్లమూడి జయశ్రీ బి. ఎస్‌సి. కి
భగవంతుడు
దీర్ఘాయు రారోగ్య సౌభాగ్య భాగ్యముల నొసగి
కాపాడుగాక !

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"




ఓమ్

# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
## తృతీయ సంపుటము
## 7, 8 మండలములు









# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

అంకితము

## ఆంధ్రులకు

కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

**1**

సీ॥ ఐతరేయ బ్రాహ్మణాది వర్ణిత వైభవోపేత దేశమై యుండె నెద్ది?
రాజనరేంద్ర సంపూజిత పద నన్నయ కవి భూషిత మౌచు నమరె నెద్ది?
కృష్ణరాయని పేరఁ గృతులు రచించిన కవ్యష్టకముతోడఁ గ్రాలె నెద్ది?
కావ్యనిర్మాణ సంకల్పనచణులైన కవివతంసుల నెల్లఁ గలిఁగె నెద్ది?
గీ॥ యఖిల జనులకుఁ గ్రొత్తదైనట్టి శక్తిఁ, బుట్టఁజేసిన గ్రంథముల్ పొందె నెద్ది?
యట్టి మా యాంధ్ర దేశమునందుఁ గలుఁగు, నాంధ్రులకు దీని నర్పింతు నంకితముగ ॥

**2**

సీ॥ రాజరాజ నరేంద్ర తేజః ప్రసక్తిచే నన్నయ ఫణతులు మున్నె వెలిఁగె
శ్రీరామ మహిమంబుచేతఁ బోతనమంత్రి భాగవతం బిలఁ బాడుకొనియెఁ
గృష్ణరాయనివల్లఁ గీర్తిగాంచిన పెద్దనాదుల కృతు లెల్ల నతిశయించెఁ
గడు రెడ్ల సంపద కలిమిచేఁ దెన్గున శ్రీనాథ కావ్యంబు శ్రీలు గాంచె
గీ॥ నట్టి మా యాంధ్ర దేశంబునందుఁ గల్గు, నూతన సుశక్తి పుత్రుఁడు పూతమతిని
నన్నుఁ దనియింపఁజేయుచున్నాఁడు తెనుఁగు, వేదమును నాదరింపఁడే! వేయి పాళ్ళు ॥

కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

**3**

ఆ॥వె॥ దేవ వేద వేద దేవైక్యమై వెల్గు, వేద మనువదించు వాద మగునె ?
శబ్ద మనువదించు శబ్దశక్తుల నెవ్వఁ, డనువదించునోయి ! యమృత గతిని ॥

**4**

సీ॥ పరిభవించి వేలేళ్ళ విభవమ్ముతో నుండి శుక్లశక్తిని మహాశోభ నొంది
యల ప్రమదౌత్యము లలరార సృజన శక్త్యతివిపులగతి సహస్ర వత్స
రాలు లెన్నెన్నియో! యధిగమింపఁగఁ బృథ్విపైఁ బ్రజోత్పత్తి సుప్రాభవముగ
నా పైని నాంగిరుఁ డవతరించుచు నాంధ్రజాతికి మూలమై చదలు నంట
గీ॥ వేద విద్యా విస్తృతి దీప్త విమల శక్తి, దీర్ఘతముఁ డాదిగ మును లుదీర్ణతగను
నాంధ్రులకును మత్కృత సుకృతాంధ్రదేవ, పద్యపారిజాతాల నర్పణ మొనర్తు ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## అథ సప్తమం మండలమ్

### అనువాకః—1, సూక్తమ్—1

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః†

దేవతా—అగ్నిః

ఛందః—విరాట్; 19 25-త్రిష్టుప్.

(1) అగ్నిం నరో దీధితిభిరరణ్యోర్హస్తచ్యుతీ జనయన్త ప్రశస్తమ్।
[1]దూరేదృశం గృహపతిమథర్యుమ్॥ 1

(2) తమగ్నిమస్తే వసవో న్యృణ్వన్ సుప్రతిచక్షమవసే[2] కుతశ్చిత్।
దక్షాయ్యో యో దమ[3] ఆస నిత్యః॥ 2

---

† వసిష్ఠుఁడు ఋషిగానున్న సర్వ సూక్తములలోను గేవల వసిష్ఠుఁడుగా మాత్రమే యీ సప్తమ మండలములో సాయన భాష్య, మాక్స్‌ముల్లర్ ప్రతులలోఁ గలదు. "వశిష్ఠ" శబ్దము "శ" వర్ణయుక్తముగాఁ గొన్ని ప్రతులలోనుఁ "స" వర్ణయుక్తముగాఁ గొన్నిటిలోను గలదు.

1. దూరోదృశం, 2. వసవో నృ, 3. దమఉఆస. [ప్రా.ప్ర.]

(3) ప్రేద్ధో[1] అగ్నే దీదిహి పురో నో ఽజస్రయా సూర్మ్యా యవిష్ఠ ।
త్వాం శశ్వన్త[2] ఉప యన్తి వాజాః ॥ 3

(4) ప్ర తే[3] అగ్నయోఽగ్నిభ్యో వరం నిః సువీరాసః శోశుచన్త ద్యుమన్తః ।
యత్రా నరః సమాసతే సుజాతాః ॥ 4

(5) దా నో[4] అగ్నే ధియా రయిం సువీరం స్వపత్యం సహస్య ప్రశస్తమ్ ।
న యం యావా తరతి యాతుమావాన్ ॥ 5

(6) ఉప యమేతి యువతిః సుదక్షం దోషా వస్తోర్హవిష్మతీ ఘృతాచీ ।
ఉప స్వైనమరమతిర్వసూయుః ॥ 6

(7) విశ్వా[5] అగ్నేఽప దహారాతీర్యేభిస్తపోభిరదహో జరూథమ్ ।
ప్ర నిస్వరం చాతయస్వామీవామ్ ॥ 7

1. ప్రేద్ధోఽఅగ్నే, 2. శశ్వన్తఽఉప, 3. తేఽఅగ్నయోగ్ని 4. దా నోఽఅగ్నే, 5. విశ్వాఽఅగ్నే. (ప్రా. ప్ర.

(8) ఆ యస్తే[1] అగ్న ఇధతే అనీకం వసిష్ఠ శుక్ర దీదివః పావక ।

ఉతో న[2] ఏభిః స్తవథైరిహా[3] స్యాః ॥ 8

(9) వి యే తే[4] అగ్నే భేజిరే అనీకం మర్తా నరః పిత్ర్యాసః పురుత్రా ।

ఉతో న[2] ఏభిః సుమనా[5] ఇహ స్యాః ॥ 9

(10) ఇమే నరో వృత్రహత్యేషు శూరా విశ్వా[6] అదేవీరభి సన్తు మాయాః ।

యే మే ధియం పనయన్త ప్రశస్తామ్ ॥ 10

(11) మా శూనే[7] అగ్నే ని షదామ నృణాం మా శేషసో[8]ఽవీరతా పరి త్వా ।

ప్రజావతీషు దుర్యాసు దుర్య ॥ 11

(12) యమశ్వీ నిత్యముపయాతి యజ్ఞం ప్రజావన్తం స్వపత్యం క్షయం నః ।

స్వజన్మనా శేషసా వావృధానమ్ ॥ 12

---

1. యస్తేఽగ్నఽఇధతేఽఅనీకం, 2. నఽఏభిః, 3. ఇహాస్యాః, 4. తేఽఅగ్నే, 5. సుమనాఽఇహ, 6. విశ్వాఽఅదేవీః. 7. శూనేఽఅగ్నే, 8. మాశేషసోవీరతా. [వా.ప్ర.]

(13) పాహి నో[1] అగ్నే రక్షసో అజుష్టాత్ పాహి ధూర్తేరరరుషో[2] అఘాయోః ।

త్వా యుజా పృతనాయూగ్ంరభి ష్యామ్ ॥ 13

(14) సేదగ్నిరగ్నీగ్ం[3]రత్యస్త్వన్యాన్ యత్ర వాజీ తనయో వీళుపాణిః ।

సహస్రపాథా[4] అక్షరా సమేతి ॥ 14

(15) సేదగ్నిర్యో వనుష్యతో నిపాతి సమేద్ధారమంహస[5] ఉరుష్యాత్ ।

సుజాతాసః పరి చరన్తి వీరాః ॥ 15

(16) అయం సో[6] అగ్నిరాహుతః పురుత్రా యమీశానః సమిదిన్ధే హవిష్మాన్ ।

పరి యమేత్యధ్వరేషు హోతా ॥ 16

(17) త్వే[7] అగ్న ఆహవనాని భూరీశానాస[8] ఆ జుహుయామ నిత్యా ।

ఉభా కృణ్వన్తో వహతూ మియేధే ॥ 17

---

1. నో౽అగ్నే రక్షసో౽అజుష్టాత్, 2. రరుషో౽అఘాయోః, 3. రగ్నీగ్ం౽రత్య. 4. పాథా౽అక్షరా,
5. మంహస౽ఉరుష్యాత్, 6. సో౽అగ్ని, 7. త్వే౽అగ్న౽ఆహవ, 8. శానాస౽ఆ, [వ్రా.ప్ర.]

(18) ఇమో[1] అగ్నే వీతతమాని హవ్యా[2] అజస్రో వక్షి దేవతాతిమచ్ఛ ।
ప్రతి న[3] ఈం సురభీణి వ్యన్తు ॥ 18

(19) మా నో[4] అగ్నేఽవీరతే పరా దా దుర్వాససేఽమతయే[5] మా నో[6] అస్యై ।
మా నః క్షుధే మా రక్షస[7] ఋతావో మా నో దమే మా వన[8] ఆ జుహూర్థాః ॥ 19

(20) నూ మే బ్రహ్మాణ్యగ్న[9] ఉచ్ఛశాధి త్వం దేవ మఘవద్భ్యః సుషూదః ।
రాతౌ స్యామోభయాస[10] ఆ తే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 20

(21) త్వమగ్నే సుహవో రణ్వసందృక్ సుదీతీ సూనో సహసో దిదీహి ।
మా త్వే సచా తనయే నిత్య[11] ఆ ధఙ్మా వీరో[12] అస్మన్నర్యో వి దాసీత్ ॥ 21

(22) మా నో[13] అగ్నే దుర్భృతయే సచైషు దేవేద్ధేష్వగ్నిషు ప్ర వోచః ।
మా తే[14] అస్మాన్ దుర్మతయో భృమాచ్చిద్ దేవస్య సూనో సహసో[15] నశన్త ॥ 22

---

1. ఇమో౽అగ్నే, 2. హవ్యాజస్రో, 3. నఽఈం, 4. నో౽అగ్నే, 5. దుర్వాససేఽమతయే, 6. నో౽అస్యై
7. రక్షసఽఋతావో, 8. వనఽఆ 9. బ్రహ్మాణ్యగ్నఽఉచ్ఛ 10. భయాసఽఆ తే, 11. నిత్యఽఆ, 12. వీరోఽస్మన్,
13. మా నో౽అగ్నే, 14. మా తే౽అస్మాన్, 15. సహసో నశన్త, (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### అనువాకము—1, సూక్తము—1

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుడు†

దేవత—అగ్ని*

(1) గద్యము ॥

ప్రశస్తుడు, దూరదృశ్యమానుడు, గృహపతి, గమనవిశిష్టుడునగు నగ్నిని నేతలు
"అరణి"ద్వయమునుండి హస్తాంగుళులతోఁ బుట్టింపఁగలరు ॥ 1

(2) గద్యము ॥

నిత్యపూజనీయుఁడగు సుదర్శనాగ్నిని సర్వవిధముల భయము లేకుండఁ జేయుటకు
వసువులు గృహమందు స్థాపించిరి ॥ 2

(3) గద్యము ॥

ఓ యువకాగ్నీ! నీ వెక్కువగ వెలింగి యజ్ఞసజ్వాలామండితుఁడవై మా ముందఱఁ బ్రజ్వలిల్లుము.
అన్నము మీ సమీపమునకు వచ్చును ॥ 3

(4) గద్యము ॥

సుజాతనేతలారా! ఏయగ్ని సమీపమునందు వసించెదరో! లౌకికాగ్నిసమూహముకంటె
నధికదీప్తిమంతుఁడును, కళ్యాణకరుఁడును, పుత్రపౌత్రాదిప్రదుఁడునగు నాయగ్ని
విశేషరూపమున దీప్తి నొందును ॥ 4

---

† వశిష్ఠ—వసిష్ఠ శబ్దములు రెండును వ్రాతప్రతిలోఁ బ్రయుక్తములైనవి.

* వ్రాతప్రతిలో (7వ సంపుటము. 37వపుట) శ్రీనేమానివారీసూక్తమునకు మూలానుగుణముగా "అగ్ని" దేవతగానే వ్రాసి 15b సంపుటములోఁగల ఋషి దేవతల పట్టికలో "ఆప్రీసులు" దేవతలుగాఁ బొరపాటున వ్రాసిరి.

(5) గద్యము ॥

అభిషవకుశలుఁడగు నగ్నీ! శత్రువులను హింసించుచు నేది బాధాకరముకాదో! కళ్యాణ
కరముఁ బుత్రపౌత్రప్రదమును మనోహరాపత్యయుతము నగునట్టి ధనము
స్తుతుఁడవై మా కిడుము! ॥ 5

(6) గద్యము ॥

హవ్యయుక్తయువతియగు జుహువు దివారాత్రము దక్షుఁడగు నగ్నిసమీపమునకు
వచ్చును. స్వకీయ దీప్తి ధనము నభిలషించి దాని చెంతకుఁ బోవును ॥ 6

(7) గద్యము ॥

ఓయగ్నీ! నీ వే తేజస్సువలనఁ బరుషశబ్దముఁజేయువానిని వధ్యము గావించెదవో!
యా తేజస్సున సమస్తశత్రుగణములను నశింపఁజేయుము! నీవు ప్రతాపమును
బోఁగొట్టుచు రోగమును శాంతింపఁజేయుము! ॥ 7

(8) గద్యము ॥

ఓవశిష్ఠకుక్షుఁడా! దీప్తుఁడా! పావకా! అగ్నీ! యెవ్వరు మిమ్ము భాసింపఁజేయుదురో!
వారి స్తోత్రములకువలె మా స్తోత్రములకు సంతుష్టులై యీ యజ్ఞమందు వసింపుఁడు! ॥ 8

(9) గద్యము ॥

ఓయగ్నీ! పితృహితులగు నే మానవ నేతలు మీ తేజస్సును బహుదేశములయందు
విభక్తము కావించెదరో! వారి స్తుతులకువలె మా స్తోత్రములకుఁ బ్రసన్నులయి
యజ్ఞమునకు రండు! ॥ 9

(10) గద్యము ॥

ఎవ్వరు మాశ్రేష్ఠకర్మల స్తుతిఁ జేయుదురో! యట్టి శూరనేతలు సంగ్రామములయందు
మాయను దిరస్కరింతురుగాక! ॥ 10

(11) గద్యము ॥

ఓయగ్నీ! మా శూన్యగృహమున నివసింపుము! గృహమునకు హిత మొసంగెడు నగ్నీ! మేము పుత్ర శూన్యులము. వీర శూన్యులము. మేము మీ పరిచర్యఁజేయుచుఁ బుత్రయుక్త గృహమందు వసించెదము ॥ 11

(12) గద్యము ॥

అశ్వవంతుఁడగునగ్ని యజ్ఞాశ్రయభూతమగు గృహమునకుఁ జనును. భృత్యాదియుక్తము, సపత్యసహితము, నౌరసజాతపుత్రద్వారా వర్ధమానము నగు గృహమును మాకు నొసంగును ॥ 12

(13) గద్యము ॥

ఓయగ్నీ! నీ వప్రీతికర రాక్షసులబారినుండి మమ్ము రక్షింపుము! లోభులు, పాపాత్ములు హింసకులనుండి మమ్ముఁ గాపాడుము! నీ సాహాయ్యమువలనఁ బ్రబలనాయుధ వ్యక్తులను పరిహరించెదము ॥ 13

(14) గద్యము ॥

బలవంతము, దృఢహస్తము, బహ్వన్నవిశిష్టముఁ దనయరహితము నగు స్తోత్రము ద్వారా యెవఁ డగ్నికిఁ బరిచర్యఁజేయునో! యతఁ డగ్నికై యగ్నిని సమిధమించునుగాక! ॥ 14

(15) గద్యము ॥

ఎవఁడు ప్రబోధకుని హింసాపాపములనుండి సంరక్షించునో! యెవనిని సుజన్ములగు పితరు సేవింతురో! యతఁడే యగ్ని ॥ 15

(16) గద్యము ॥

సమృద్ధహవ్యయుక్తుఁడగు వ్యక్తి బాగుగ నెవనిని వెలిఁగించునో! యెవనిని హోత యజ్ఞమునకు చేర్చునో! యట్టి యగ్ని బహుప్రదేశములయం దాహూతుఁడగును ॥ 16

(17) గీ॥ అనఘుఁడా! మేము ధనమున కధిపతులము
నీ నిమిత్తము స్తోత్రంబు నిత్య ముగ్గ
డింపుచున్ శస్త్రములచేత నంచితేష్టు
లందు హవ్యంబు నొసఁగెదమయ్య! నీకు ॥ 17

(18) గద్యము ॥

ఓయగ్నీ! నీ వనవరతము దేవతల సమీపమున కత్యంత కమనీయ హవ్యమును
వహించుచుండుము! దేవతలు ప్రత్యేకము మావలన సురభిహవ్యమును
గాంక్షించుదురుగాక! ॥ 18

(19) గద్యము ॥

ఓయగ్నీ! మా కపుత్రతాదానము నొసఁగకుము!.తుచ్ఛవస్త్రముల నీయకుము! దుర్మతిని
మాకుఁ బ్రసాదింపకుము! కోపమును బూనకుము! మమ్ము రాక్షసహస్తములయం
దర్పింపకుము! సత్యవంతుఁడవగు నగ్నీ! గృహమందును వనమందును మమ్ము
హింసింపకుము! ॥ 19

(20) గద్యము ॥

ఓయగ్నీ! మా యన్నమును బోషింపుము! ఓదేవా! నీవు యజ్ఞవంతుల కన్న
మెమ్ము! మే ముభయులము నీ దానమువల్లనే జీవించియుండెదము. నీవు
సర్వదా మాకు మంగళ మొసంగుచుఁ గాపాడుము! ॥ 20

(21) గద్యము ॥

ఓబలపుత్రుఁడా! యగ్నీ! నీవు మనోహరాహ్వానవిశిష్టుఁడవు! రమణీయ దర్శనుఁడవు!
శోభనదీప్తితో వెలుంగుము! నీవు సహాయకుఁడవుకమ్ము! మా యౌరస పుత్రులను
నష్టపెట్టకుము! మా మనుష్యులనుగాని హితముఁజేయు పుత్రులనుగాని
క్షయ మొందువారిగా నొనర్పకుము! ॥ 21

(22) గద్యము ॥

నీవు సహాయకుఁడ వగుము! ఓయగ్నీ! సుఖము నొసంగుమని ఋత్విగ్గణసమిద్ధుఁడగు
నగ్నితో ననుము! ఓబలపుత్ర! యగ్నీ! నీ నిగ్రహబుద్ధి మాపై బ్రసరింపఁజేయకుము! ॥ 22

(23) గద్యము ॥

ఓయమర్త్యాగ్నీ! నీకు హవ్య మొసంగెడువాఁడు ధనవంతుఁడగును. ఎవనిచెంతకు
స్తోత యర్థియై చనునో! యట్టి యగ్నిదేవుఁడు యజమానులను ధరించును ॥ 23

(24) గద్యము ॥

ఓయగ్నీ! నీవు మా కళ్యాణకర్మల నవగతములు గావించుకొనుము!బలపుత్రుఁడా! మేము నీస్తోతలము దేనివలన మే మక్షీణపూర్ణాయుస్సుఁగలవారమై పుత్రపౌత్రాదియుతులమై సంతసించుచుండెదమో! యట్టి మహాధనము నొసంగుము! ॥ 24

(25) గద్యము ॥

ఓ యగ్నీ! మా యన్నమును విశేషముగాఁ బోషింపుము! దేవా! యజ్ఞవంతుల కన్న మిమ్ము! మే ముభయులమును నీవల్లనే జీవించియుండెదము. నీవు సర్వదా మంగళ మొసంగుచు మమ్ముఁ గాపాడుము! ॥ 25

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబా గర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమునఁ బ్రథమాధ్యాయము
సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## సప్తమం మండలమ్

పంచమోఽష్టకః—ద్వితీయోఽధ్యాయః

### సూక్తమ్—2

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—(ఆప్రీసూక్తం) 1-ఇధ్మః సమిద్ధోఽగ్నిర్వా, 2-నరాశంసః,
3-ఇళః, 4-బర్హిః, 5-దేవీర్ద్వారః, 6-ఉషాసానక్తా, 7-దైవ్యా హోతారా ప్రచేతసా,
8-తిస్రో దేవ్యః సరస్వతీళాభారత్యః, 9-త్వష్టా, 10-వనస్పతిః, 11-స్వాహాకృతయః.
ఛందః—త్రిష్టుప్.

(1) జుషస్వ నః సమిధమగ్నే అద్య శోచా
బృహద్ యజతం ధూమమృణ్వన్ ।
ఉప స్పృశ దివ్యం సాను స్తూపైః సం
రశ్మిభి స్తతనః సూర్యస్య ॥ 26

(2) నరాశంసస్య మహిమానమేషాముప
స్తోషామ యజతస్య యజ్ఞైః ।
యే సుక్రతవః శుచయో ధియంధాః
స్వదన్తి దేవా[1] ఉభయాని హవ్యా ॥ 27

1. దేవాఽఉభ. [వ్యా.ప్ర.]

(3) ఈళేన్యం వో¹ అసురం సుదక్షమన్తర్దూతం

రోదసీ సత్యవాచమ్ ।

మనుష్వదగ్నిం మనునా సమిద్ధం

సమధ్వరాయ సదమిన్మహేమ ॥ 28

(4) సపర్యవో భరమాణా² అభిజ్ఞు ప్ర వృఞ్జతే నమసా బర్హిరగ్నౌ ।

ఆజుహ్వానా ఘృతపృష్ఠం పృషద్వదధ్వర్యవో హవిషా మర్జయధ్వమ్ ॥ 29

(5) స్వాధ్యో౩ వి దురో దేవయన్తో ఽశిశ్రయూ రథయుర్దేవతాతా ।

పూర్వీ శిశుం న మాతరా రిహాణే సమగ్రువో న సమనేష్వఞ్జన్ ॥ 30

(6) ఉత యోషణే దివ్యే మహీ న³ ఉషాసానక్తా సుదుఘేవ ధేనుః ।

బర్హిషదా పురుహూతే మఘోనీ⁴ ఆ యజ్ఞియే సువితాయ శ్రయేతామ్ ॥ 31

(7) విప్రా యజ్ఞేషు మానుషేషు కారూ మన్యే వాం జాతవేదసా యజధ్యై ।

ఊర్ధ్వం⁵ నో అధ్వరం కృతం హవేషు తా దేవేషు వనథో వార్యాణి ॥ 32

---

1. వోఽఅసురం, 2. భరమాణాఽఅభిజ్ఞు 3. మహీ నాఽఉషా 4. మఘోనీఽఆ 5. ఊర్ధ్వం నోఽఅధ్వరం. [వా.ప్ర.]

(8) ఆ భారతీ భారతీభిః సజోషా[1] ఇళా దేవైర్మనుష్యేభిరగ్నిః ।
సరస్వతీ సారస్వతేభిరర్వాక్ తిస్రో దేవీర్బర్హిరేదం సదన్తు ॥ 33

(9) తన్నస్తురీపమధ పోషయిత్ను దేవ త్వష్టర్వి రరాణః స్యస్వ ।
యతో వీరః కర్మణ్యః సుదక్షో యుక్తగ్రావా జాయతే దేవకామః ॥ 34

(10) వనస్పతేఽవ సృజోప దేవానగ్నిర్హవిః శమితా సూదయాతి।
సేదు హోతా సత్యతరో యజాతి యథా దేవానాం జనిమాని వేద॥ 35

(11) ఆ యాహ్యగ్నే సమిధానో అర్వాఙిన్ద్రేణ దేవైః సరథం తురేభిః।
బర్హిర్న[2] ఆస్తామదితిః సుపుత్రా స్వాహా దేవా[3] అమృతా మాదయన్తామ్॥ 36

1. సజోషాఽఇళా 2. బర్హిర్నఽఆస్తా 3. దేవాఽఅమృతా. [వ్యా.వ్య.]



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము — ద్వితీయాధ్యాయము

### సూక్తము—2

ఋషి — మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత — అప్రీసులు †

(1) గద్యము ॥

ఓయగ్నీ! నీవు మా సమిధలను సేవింపుము! యజనీయ ధూమమునుఁ బ్రేరేపించుచు
మిక్కిలి దీప్తుఁడవు కమ్ము! తప్తరశ్మలద్వారా యంతరిక్షముయొక్క-
సానుప్రదేశములను స్పృశింపుము! అటులనే సూర్యరశ్మిసమూహమును
గలిసికొనుము! ॥ 26

(2) గద్యము ॥

సుక్రతువులు, దీప్తిమంతులు, కర్మసమూహమును ధరించువారునగు నేదేవత
లుభయహవ్యమును భక్షింతురో! యాదేవతలమధ్య నేను యజనీయుండగు
నరాశంసుని స్తుతించెదను ॥ 27

(3) గద్యము ॥

నీవు, స్తుతియోగ్యుఁడును, వసురుఁడును, సుదక్షుఁడును,ద్యావాపృథివీమధ్యమున
దూతయు, సత్యవాక్కు-ను నగు మనుకృతసమిద్ధాగ్నిని మనుష్యగణమువలెఁ
బూజింపుము! ॥ 28

† వ్రాతప్రతిలోఁ (7వ సంపుటము. 43వ పుట) పొరపాటున "అత్రి" దేవతగాఁ బేర్కొ-ని 15b సంఖ్యగల సంపుటములోఁగల ఋషి దేవతల పట్టికలో "అగ్ని" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి. ఇది యాప్రీసూక్తము.

(4) గద్యము ॥

పరిచర్యాభిలాషులు జానువులపై నిలువఁబడి పాత్రములు పూర్ణములుగా నొనర్చుచు
హవ్యసహితాగ్నికి బర్హిస్సు నిచ్చుచున్నారు. ఓయధ్వర్యుగణమా!
ఘృతపృష్ఠమును, స్థూలా బిందుయుక్తమునగు బర్హిస్సును
హోమముఁ జేయుము! ॥ 29

(5) గద్యము ॥

సుకర్ములు, దేవాభిలాషులు, నగు రథాభిలాషులు యజ్ఞద్వారముల నాశ్రయించుచున్నారు.
మాతృద్వయము శిశువును ముద్దిడునట్లు లేహనకారులును బూర్వాభిలాషులును నగు
నధ్వర్యుగణము నదివలె యజ్ఞమును దడుపుచున్నారు ॥ 30

(6) గద్యము ॥

యువతియు, దివ్యయు, మహతియుఁ, గుశసమాసీనయు, బహుస్తుతయు, ధనపతియు,
యజ్ఞార్హయు, నహోరాత్రము కామములను బూరించునదియు నగు
ధేనువువలెఁ గళ్యాణమునకై మాకు నాశ్రయ మిచ్చుఁగాక! ॥ 31

(7) గద్యము ॥

విప్రులు, జాతవేదులు, మానవ యజ్ఞకర్తలు నగు దేవీద్వయమా! మీకు
యాగముఁజేయుటకై స్తుతించుచున్నాను. స్తుతించినపిదప మమ్మ
దేవాభిముఖులుగా నొనర్పుఁడు! మీరు దేవతల మధ్య విరాజిల్లు
వరణీయ ధనమును విభాగించి యిండు! ॥ 32

(8) గద్యము ॥

భారతీగణముతోఁగూడిన భారతి వచ్చుఁగాక! దేవతలతోడను, మనుష్యులతోడను,
ఇలాదేవి వచ్చుఁగాక! దేవీత్రయము వచ్చి సుఖముగాఁ గుశలపై నుండుఁగాక! ॥ 33

(9) గద్యము ॥

ఓదేవత్వష్టృఁడా! నీవు సంతుష్టుఁడవై, దేనివలనవీరుఁడును, గర్మకుశలుఁడును,
బలశాలియు, సోమాభిలాషకై ప్రస్తరమును ధరించి దేవతలఁ గోరు వాఁడు నగు
పుత్రుఁ డుత్పన్నుఁడగునో! త్రాణ కుశలమును బుష్టికారియు నగునట్టి
వీర్యమును మాకు నిమ్మ! ॥ 34

(10) గద్యము॥

ఓ వనస్పతీ! నీవు దేవతలను సమీపమునకుఁ దెమ్ము! పశుసంస్కారకుండగు నగ్ని (వనస్పతి) దేవతలకై హవ్యమును బ్రేరేపించుఁగాక! యజ్ఞరూప దేవతలను బిలుచు నగ్ని యజ్ఞమును జేయుఁగాక! అతఁడే దేవతాజన్మము నెఱింగినవాఁడు॥ 35

(11) గద్యము॥

ఓ యగ్నీ! నీవు దీప్తియుక్తుఁడవై యింద్రుని దేవతలను నొకరథముమీఁదనే మా కభిముఖముగాఁ దెచ్చెదవుగాక! పుత్రవిశిష్టయగు నదితి మా కుశలపై విశ్రమించుఁగాక! నిత్యమును దేవతలు హవ్యయుక్తులై తృప్తిని బొందుదురుగాక!॥ 36

## సూక్తమ్—3

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా — అగ్నిః

ఛందః — త్రిష్టుప్

(1) అగ్నిం వో దేవమగ్నిభిః సజోషా యజిష్ఠం దూతమధ్వరే కృ[1]ణుధ్వమ్।
యో మర్త్యేషు నిధ్రువిరృతావా తపుర్మూర్ధా ఘృతాన్నః పావకః॥ 37

(2) ప్రోథదశ్వో న యవసేఽవిష్యన్ యదా మహః సంవరణాద్ వ్యస్థాత్।
ఆదస్య వాతో[2] అను వాతి శోచిరధ స్మ తే వ్రజనం కృష్ణమస్తి॥ 38

1. కృణుధ్వమ్, 2. వాతోఽఅను. [ప్రా.ప్ర.]

(3) ఉద్ యస్య తే నవజాతస్య వృష్ణో ఽగ్నే చరన్త్యజరా[1] ఇధానాః।
అచ్ఛా ద్యామరుషో ధూమ[2] ఏతి సం దూతో అగ్న ఈయసే హి దేవాన్॥ 39

(4) వి యస్య తే పృథివ్యాం పాజో[3] అశ్రేత్ తృషు యదన్నా సమవృక్త జమ్భైః।
సేనేవ సృష్టా ప్రసితిష్ట[4] ఏతి యవం న దస్మ జుహ్వా వివేక్షి॥ 40

(5) తమిద్ దోషా తముషసి యవిష్ఠమగ్నిమత్యం న మర్జయన్త నరః।
నిశిశానా[5] అతిథిమస్య యోనౌ దీదాయ శోచిరాహుతస్య వృష్ణః[6]॥ 41

(6) సుసందృక్ తే[7] స్వనీక ప్రతీకం వి యద్ రుక్మో న రోచస[8] ఉపాకే।
దివో న తే తన్యతురేతి శుష్మశ్చిత్రో[9] న సూరః ప్రతి చక్షి భానుమ్॥ 42

(7) యథా వః స్వాహాగ్నయే దాశేమ పరీళాభిర్ఘృతవద్భిశ్చ హవ్యైః।
తేభిర్నో[10] అగ్నే అమితైర్మహోభిః శతం పూర్భిరాయసీభిర్ని పాహి॥ 43

---

1. జరాఽఇధానాః, 2. ధూమఽఏతి సందూతోఽఅగ్నఽఈయసే, 3. పాజోఽఅశ్రేత్, 4. ప్రసితిష్టఽఏతి, 5. నిశిశానాఽఅతిథి, 6. వృష్ణః, 7. సుసందృక్తే, 8. రోచసఽఉపాకే, 9. శుష్మశ్చిత్రో, 10. తేభిర్నోఽఅగ్నేఽఅమి. [వా. ప్ర.]

(8) యా వా తే సన్తి దాశుషే[1] అధృష్టా గిరో వా యాభిర్నృవతీరురుష్యాః ।
తాభిర్నః సూనో సహసో ని పాహి స్మత్ సూరీఞ్జరితౄఞ్జాతవేదః ॥ 44

(9) నిర్యత్ పూతేవ స్వధితిః[2] శుచిర్గాత్ స్వయా కృపా తన్వా రోచమానః ।
ఆ యో మాత్రోరుశేన్యో జనిష్ట దేవయజ్యాయ సుక్రతుః పావకః ॥ 45

(10) ఏతా నో[3] అగ్నే సౌభగా దిదీహ్యపి క్రతుం సుచేతసం వతేమ ।
విశ్వా స్తోతృభ్యో గృణతే చ సన్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 46

## సూక్తము—3

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత— అగ్ని

(1) ఉ॥ ఎవ్వఁడు మర్త్యమధ్యగతుఁ డెవ్వఁడు ప్రజ్ఞను గల్గువాఁడొ! యిం
కెవ్వఁడు తాపకుం డగునొ! యెవ్వఁడు దేవతలార! శ్రేష్ఠుఁడో!
యెవ్వఁడు తేజముం గనునొ! యెవ్వఁడు యాజ్ఞిక పుంగవుండొ! తా
నెవ్వఁడు భిన్నవహ్నిఁగను నిష్ఠల వానిని దూతఁ జేయుఁడీ! ॥ 37

---

1. దాశుషేఽఅధృష్టా, 2. స్వధితిః, 3. నోఽఅగ్నే. [వ్రా.ప్ర.]

(2) గద్యము॥

అశ్వమువలె నగ్ని ఘాసమును భక్షించుచు, శబ్దమును జేయుచు, మహానిరోధమునుండి
వృక్షసమూహములను నవస్థానములుగాఁ జేయుటఁబట్టి యతని దీప్తి ప్రవహించును.
అనంతర మో యగ్నీ! నీకుఁ గృష్ణవర్ణవర్త్మ మగును ॥ 38

(3) గద్యము॥

ఓ యగ్నీ! నవజాతము జరారహితము నగు నే సమిద్ధశిఖ గలదో! దానియొక్క-
యారోచమాన ధూమము ద్యోలోకమునకుఁ బోవును. ఓ యగ్నీ! నీవు
దూతవై దేవతలకు సంప్రాప్తుఁడ వగుము! ॥ 39

(4) గద్యము॥

నీవు కాష్ఠాదులను నన్నమును భక్షించుము! నీతేజస్సు పృథివిలో విమిశ్రిత
మగును. నీ శిఖ సేనవలె విడువఁబడినదియై నడచును. దర్శనీయాగ్నీ! నీవు
శిఖలద్వారా యవలవలెఁ గాష్ఠాదులను భక్షించుము! ॥ 40

(5) గద్యము॥

మనుష్యులు యువతమాతిథినివలెఁ బూజ్యుఁడగు నగ్నిని దత్స్థానమున దివారాత్రమును
వెలిఁగించుచు సతతగామియగు నశ్వమునువలె వాని పరిచర్యఁ జేయుదురు.
ఆహూతాగ్నిశిఖను దీపింపఁజేయుము! ॥ 41

(6) గద్యము॥

ఓ సుందరతేజోవిశిష్టాగ్నీ! నీవు సూర్యునిబోలి సమీపమున దీప్తినొందుచువుకాన నీరూపము
దర్శనీయము. నీ తేజస్సు అంతరిక్షమునుండి యశనివలె నిర్గతమగును. నీవు దర్శనీయ
సూర్యునివలె స్వయముగా దీప్తినిఁ బుట్టించి వెలుఁగుము! ॥ 42

(7) గద్యము॥

ఓ యగ్నీ! గవ్యఘృతయుక్తహవ్యముద్వారా నీకు స్వాహ నొసంగెదను. ఓయగ్నీ! నీ వా
యభిమతతేజోబలమును నపరిమితములు నయోనిర్మితములునగు నగరములద్వారా
మాకు రక్షల నొసంగుము! ॥ 43

(8) గద్యము॥

ఓ బలపుత్ర! జాతవేదుఁడా! నీవు దానశీలుఁడవు. నీ కే శిఖలుగలవో! యెట్టి వాక్యములవలనఁ బుత్రవంతులగు ప్రజలను రక్షించెదవో! యట్టి సముదయముద్వారా మమ్ము రక్షింపుము! ప్రశస్త హవ్యప్రేరకులను రక్షింపుము! ॥ 44

(9) గద్యము॥

శుచియగు నగ్ని స్వకీయశరీరముద్వారా కృపావశమున రోచమానుఁడై తీక్ష్ణతర పరశువువలెఁ గాష్ఠములనుండి నిర్గతుఁడగును. కాఁబట్టి యతఁడు యాగయోగ్యుఁ డగును. కమనీయుఁడు సుకర్మయునగు నగ్ని మాతృభూతారణిద్వయమునుండి పుట్టుచున్నాఁడు ॥ 45

(10) గద్యము॥

ఓ యగ్ని! మా కాసుందరధనము నొసంగుము! సుచేతస్కుఁడు యజనకారియు నగు పుత్రుని నొసంగుటకు సమర్థుఁడ వగుదువు! సమస్తధనము నుద్గాతృగణమునకు స్తుతికారులకుఁ గలుగునుగదా! నీవు సర్వదా స్తుతిద్వారా మమ్ముఁ బరిపాలింపుము! ॥ 46

## సూక్తమ్—4

ఋషిః— మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా— అగ్నిః

ఛందః— త్రిష్టుప్

(1) ప్రవః శుక్రాయ భానవే భరధ్వం హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్।

యో దైవ్యాని మానుషా జనూష్యన్తర్విశ్వాని విద్మనా జిగాతి॥ 47

(2) స గృత్సో[1] అగ్నిస్తరుణశ్చిదస్తు యతో యవిష్ఠో[2] అజనిష్ట మాతుః।
సం యో వనా యువతే శుచిదన్ భూరి చిదన్నా సమిదత్తి సద్యః॥ 48

(3) అస్య దేవస్య సంసద్యనీకే యం మర్తాసః శ్యేతం జగృభ్రే।
ని యో గృభం పౌరుషేయీమువోచ దురోకమగ్నిరాయవే శుశోచ॥ 49

(4) అయం కవిరకవిషు ప్రచేతా మర్తేష్వగ్నిరమృతో ని ధాయి।
స మా నో[3] అత్ర జుహురః సహస్వః సదా త్వే సుమనసః స్యామ॥ 50

(5) ఆ యో యోనిం దేవకృతం ససాద[4] క్రత్వా హ్యగ్నిరమృతాగ్ం[5] అతారీత్।
తమోషధీశ్చ వనినశ్చ గర్భం భూమిశ్చ విశ్వధాయసం[6] బిభర్తి॥ 51

(6) ఈశే హ్యగ్నిరమృతస్య భూరేరీశే రాయః సువీర్యస్య దాతోః।
మా త్వా వయం సహసావన్నవీరా మాప్సవః పరి షదామ మాదువః॥ 52

---

1. సగృత్సోఽఅగ్నిః, 2. యవిష్ఠోఽఅజ 3. స మా నోఽఅత్ర, 4. ససాదక్రత్వా,
5. తాగ్ంఽఅతారీత్, 6. విశ్వధాయం. (వ్రా.ప్ర.)

(7) పరిషద్యం హ్యరణస్య రేక్ణో నిత్యస్య రాయః పతయః స్యామ।
న శేషో[1] అగ్నే అన్యజాతమస్త్యచేతానస్య మా పథో వి దుక్షః॥ 53

(8) నహి గ్రభాయారణః సుశేవో ఽన్యోదర్యో మనసా మన్తవా[2] ఉ।
అధా చిదోకః పునరిత్ స[3] ఏత్యా ఽఽ నో వాజ్యభీషాళేతు నవ్యః॥ 54

(9) త్వమగ్నే వనుష్యతో ని పాహి త్వము నః సహసావన్నవద్యాత్।
సం త్వా ధ్వస్మన్వదభ్యేతు పాథః సం రయిః స్పృహయాయ్యః సహస్రీ॥ 55

(10) ఏతా నో[4] అగ్నే సౌభగా దిదీహ్యపి క్రతుం సుచేతసం వతేమ।
విశ్వా స్తోతృభ్యో గృణతే చ సన్తు యూయం పాత స్వస్తిభిః సదా నః॥ 56

## సూక్తము—4

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము ॥

నీవు శుభ్రదీప్తాగ్నికి సుపూతహవ్యము నిచ్చి స్తుతింపుము! అగ్ని దైవ మనుష్య సంబంధములగు పదార్థముల మధ్యమునకుఁ బ్రజ్ఞద్వారా పోవును ॥ 47

1. శేషోఽఅగ్నేఽఅన్యజాతమ్, 2. మన్తవాఽఉ, 3. సఽఏత్యా, 4. ఏతా నోఽఅగ్నే సౌభగా. [ద్రా.ప్ర.]

(2) గద్యము॥

అగ్ని యరణినుండి యుపతముఁడై పుట్టుచున్నాఁడు. కాఁబట్టి యా మేధావియగు నగ్ని తరుణుఁ డగుచునుగదా! దీప్తాగ్ని వనసమూహమును నగ్ని సంయుతముగాఁ జేయును. క్షణమాత్రమునఁ బ్రభూతాన్నమును భక్షించును ॥ 48

(3) గద్యము॥

మంత్రిగణ మే శుభ్రాగ్నిని దేవస్థానమందుఁ బరిగ్రహించునో! యెవఁడు పురుషగణ కర్తృకగృహీత వస్త్రసేవ నొనర్చునో! యట్టి యగ్ని మనుష్యులకై శత్రు దుస్సేవ్య రూపమునఁ బ్రకాశించును ॥ 49

(4) గద్యము॥

కవి, ప్రకాశకుఁడు, నమరుఁడు నగు నగ్ని, యకవు లగు మర్త్యులలో నుంచఁబడును. ఓ బలవదగ్నీ! మేము సర్వదా నీ భక్తులమైయుండెదము. నీవు మమ్ము హింసింపకుము! ॥ 50

(5) గద్యము॥

అగ్నికర్మద్వారా దేవతలను గృతార్థులుగా నొనర్చుటఁబట్టి యతఁడు దేవకృతస్థానములందుఁ బ్రవేశించును. ఓషధులు వృక్షసమూహములు విశ్వధారకుఁడును, గర్భవిద్యమానుఁడును నగు నా యగ్నిని ధరించును. భూమి వానిని ధరించును ॥ 51

(6) గద్యము॥

అగ్ని ప్రభూతామృత దానము నొసంగుటకు సమర్థుఁడు. సుందర వీర్యయుక్తధనము నిచ్చుటకుఁ దగినవాఁడు. ఓ బలవదగ్నీ! నేను నీవల్లనే పుత్రాదివిరహితుఁడనై యుండను. రూపరహితుఁడనై యుండను. పరిచర్యారహితుఁడనై యుండను ॥ 52

(7) గద్యము॥

అరుణవ్యక్తి ధనము పర్యాప్త మగును. అందుచే మేము నిత్యమును ధనపతుల మగుదుము. ఓ యగ్నీ! యపత్యము అన్యజాతము కాకుండును. అవేత్తపథము తెలియదు ॥ 53

(8) గద్యము॥

అన్యజాతపుత్రుఁడు సుఖకరుఁడైనను వానిని ఋత్తుఁడని గ్రహించుటకుఁగాని తలఁచుటకుఁగాని సమర్థుఁడను గాను.* వాఁడు మరలఁ దన స్థానమునకుఁబోవును. కాఁబట్టి యన్నవంతుఁడు, శత్రునాశకుఁడు, నవజాతుఁడు నగు పుత్రుఁడ మా నికటమునకు వచ్చుఁగాక! ॥ 54

(9) గద్యము॥

ఓ యగ్నీ! నీవు మమ్ము హింసకులబారినుండి సంరక్షింపుము! ఓ బలవంతుఁడా! మమ్ముఁ బాపములనుండి రక్షింపుము! సహస్ర సంఖ్యాకమైన స్పృహణీయధనము నొసంగుదువుగాక! ॥ 55

(10) గద్యము॥

ఓ యగ్నీ! మాకు సుందరధనము నిమ్ము! దానివలన మేము యజ్ఞకారియు సుచేతస్కుఁడునగు పుత్రుని బడయఁగలము. సర్వధనము నుద్గాతృగణములకు స్తోతలకు నగుఁగాక! నీవు స్తుతిద్వారా మమ్ముఁ బాలింతువుగాక! ॥ 56

## సూక్తమ్—5

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వైశ్వానరోఽగ్నిః
ఛందః—త్రిష్టుప్

(1) ప్రాగ్నయే[1] తవసే భరధ్వం గిరం దివో[2] అరతయే పృథివ్యాః ।
యో విశ్వేషామమృతానాముపస్థే వైశ్వానరో వావృధే జాగృవద్భిః ॥ 57

* పాఠకులారా: చూచితిరా! దత్తపుత్రుఁడు తనకు వలదనియు ఔరసపుత్రుఁడే కావలయుననియు ఋషి ప్రార్థించుచున్నాఁడు. పుత్రుఁడు లేనివాఁడు "పుత్" అను నరకమును బొందునని పౌరాణికధర్మముకాని వేదసిద్ధాంతము కానట్టు తోచుచున్నది. (నే.వేం.న.రా.).

1. ప్రాజ్ఞయేం తవసే, 2. దివోఽరతయే. [ప్రా.ప్ర.]

(2) పృష్టో దివి ధాయ్యగ్నిః పృథివ్యాం నేతా సిన్ధూనాం వృషభః స్తియానామ్ ।

స మానుషీరభి విశో వి భాతి వైశ్వానరో వావృధానో వరేణ ॥ 58

(3) త్వద్ భియా విశ[1] ఆయన్నసిక్నీరసమనా జహతీర్భోజనాని ।

వైశ్వానర [2]పూరవే శోశుచానః పురో యదగ్నే దరయన్నదీదేః ॥ 59

(4) తవ త్రిధాతు పృథివీ[3] ఉత ద్యౌర్వైశ్వానర వ్రతమగ్నే సచన్త ।

త్వం భాసా రోదసీ[4] ఆ తతన్థాఽజస్రేణ శోచిషా శోశుచానః ॥ 60

(5) త్వామగ్నే హరితో వావశానా గిరః సచన్తే ధునయో ఘృతాచీః ।

పతిం కృష్టీనాం రథ్యం రయీణాం వైశ్వానరముషసాం [5]కేతుమహ్నామ్ ॥ 61

(6) త్వే అసుర్యం౧ వసవో న్యృణ్వన్ క్రతుం హి తే మిత్రమహో జుషన్త ।

త్వం దస్యూగ్ంరోకసో[6] అగ్న ఆజ ఉరు జ్యోతిర్జనయన్నార్యాయ ॥ 62

---

1. విశఽఆయన్న్, 2. పురవే, 3. పృథివీఽఉత, 4. రోదసీఽఆ, 5. కేతుమహ్నాఽగమ్,

6. రోకసోఽఅగ్నే. [వా౯.వ౯.]

(7) స జాయమానః పరమే వ్యోమన్ వాయుర్న పాథః పరి పాసి సద్యః ।
త్వం భువనా జనయన్నభి క్రన్నపత్యాయ జాతవేదో దశస్యన్ ॥ 63

(8) తామగ్నే[1] అస్మే ఇషమేరయస్వ వైశ్వానర ద్యుమతీం జాతవేదః ।
యయా రాధః పిన్వసి విశ్వవార పృథు శ్రవో దాశుషే మర్త్యాయ ॥ 64

(9) తం నో[2] అగ్నే మఘవద్భ్యః పురుక్షుం రయిం ని వాజం శ్రుత్యం[3] యువస్వ ।
వైశ్వానర మహి నః శర్మ యచ్ఛ రుద్రేభిరగ్నే వసుభిః సజోషాః ॥ 65

## సూక్తము—5

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—వైశ్వానరాగ్ని

(1) గద్యము ॥

ఏ వైశ్వానరుఁడు జాగరిత సర్వదేవతలతో వృద్ధిని బొందునో! ప్రవృద్ధుఁడై యంతరిక్షమునఁ బృథివియందు గమనశీలుఁడగునో! యా వైశ్వానరాగ్నిని నుద్దేశించి స్తుతుల నుచ్చరింపుము! ॥ 57

---

1. తామగ్నేఽఅస్మేఽఇషమే, 2. తం నోఽఅగ్నే. (ప్రా.ప్ర.) 3. శ్రుత్యం.(సా.మా.)

(2) గద్యము ॥

నదులకు నేతయు, జలవర్షియు నర్చితుండు నగు నగ్ని యంతరిక్షమునుండి పృథ్వినుండి
నిస్సృతుం డగును. ఆ వైశ్వానరుఁడు శ్రేష్ఠహవ్యముద్వారా ప్రవర్ధితుఁడయి మనుష్య
ప్రజాభిముఖముగ శోభించును ॥ 58

(3) గద్యము ॥

ఓ వైశ్వానరుఁడా! నీవు పూరువు సమీపమున దీప్యమానుఁడవై వాని శత్రుపురములను
బడఁగొట్టుచు జ్వలించితివి! కావున నీ భయమువలన నసిక్నీ ప్రజాగణము
పరస్పరము సమవేతములై భోజనమును త్యజించుచు వచ్చెను! ॥ 59

(4) గద్యము ॥

ఓ వైశ్వానరుఁడా! యంతరిక్షము, పృథివి, ద్యోలోకము, నీ వ్రతమును సేవించును.
నీ వెల్లపుడునుఁ బ్రకాశముద్వారా దీప్యమానుఁడవై స్వదీప్తివలన ద్యావాభూములను
విస్తారితములుగఁ జేయుము! ॥ 60

(5) గద్యము ॥

వైశ్వానరాగ్నీ! నీవు ప్రజలకుఁ బతివి! ధనమునకు నాయకుఁడవు! ఉషస్సునకు దివసమునకుఁ
గేతుస్వరూపుఁడవు. అశ్వగణము కామయమానమై నిన్ను సేవించును. పాపనాశకము లగు
ఘృతయుక్తవాక్యములు నిన్ను సేవించును ॥ 61

(6) గద్యము ॥

మిత్రగణపూజయితా! యగ్నీ! వసుగణము నీయందు బలమును స్థాపించియున్నది.
నీ వార్యులవిషయమై యధికతేజస్సును బుట్టించుచు దస్యులను స్వస్థానమునుండి
పోవునటులఁ జేసితివి! ॥ 62

(7) గద్యము॥

నీవు పరమవ్యోమప్రదేశమందుఁ బ్రాదుర్భూతుఁడవై వాయువువలె సద్యస్సోమమును ద్రావుము!
ఓ జాతవేదుఁడా! నీవు జలమును బుట్టించుచు నపత్యమువలెఁ బాలనీయవ్యక్తి
కభిలాషలను దీర్చి గర్జించుచుండుము! ॥ 63

(8) గద్యము॥

ఓ సకలవరణీయాగ్నీ! దేనివలన ధనమును రక్షించెదవో! హవ్యదాత యగు మనుష్యుని
యశస్సును గాపాడెదవో! జాతవేదుఁడ వగు వైశ్వానరాగ్నీ! నీవు దీప్తిమంత మగు
నా యన్నము నొసంగుము! ॥ 64

(9) గీ॥ అగ్ని! నీవు యజ్ఞ మాచరించెడు మేము
సరసరీతి నన్న సంపదలను
బుత్రకులను మరియుఁ బూజ్యబలంబు-
దాన మిడుము! మాకుఁ దగినయటుల ॥ 65

గీ॥ ఓయి! వైశ్వానరా! నీ వమేయతుష్టి
తోడఁ గూడుచు రుద్రులతోడ వసు గ
ణంబుతోఁ గూడుచు మహాధనంబు మాకుఁ
గడుఁ బ్రసాదింపుమా! స్థిర కరుణఁబూని ॥ 66

## సూక్తమ్ – 6

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వైశ్వానరోఽగ్నిః
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర సమ్రాజో[1] అసురస్య ప్రశస్తిం పుంసః కృష్టీనామనుమాద్యస్య ।
ఇన్ద్రస్యేవ ప్ర తవసస్కృతాని వన్దే దారుం వన్దమానో వివక్మి ॥ 66

(2) కవిం కేతుం ధాసిం భానుమద్రేర్హిన్వన్తి శం రాజ్యం రోదస్యోః ।
పురందరస్య గీర్భిరా వివాసేఽగ్నేర్వ్రతాని పూర్వ్యా మహాని ॥ 67

(3) న్యక్రతూన్ గ్రథినో మృధ్రవాచః పణీగ్ంరశ్రద్ధాగ్ం[2] అవృధాగ్ం అయజ్ఞాన్ ।
ప్రప్ర తాన్ దస్యూగ్ంరగ్నిర్వివాయ పూర్వశ్చకారాపరాగ్ం[3] అయజ్యూన్ ॥ 68

(4) యో అపాచీనే తమసి మదన్తీః ప్రాచీశ్చకార నృతమః శచీభిః ।
తమీశానం వస్వో[4] అగ్నిం గృణీషేఽనానతం దమయన్తం పృతన్యూన్ ॥ 69

---

1. సమ్రాజోఽసురస్య, 2. రశ్రద్ధాగ్ంఽవృధాగ్ంఽయ, 3. పరాగ్ంఽయజ్యూన్,

4. వస్వోఽగ్నిం గృణీషీనానతం. (బ్రా.ప్ర.)

(5) యో దేహ్యోః అనమయద్ వధస్నైర్యో[1] అర్యపత్నీరుషసశ్చకార ।
స నిరుధ్యా నహుషో యహ్వో[2] అగ్నిర్విశశ్చక్రే బలిహృతః సహోభిః ॥ 70

(6) యస్య శర్మన్నుప విశ్వే జనాస[3] ఏవైస్తస్థుః సుమతిం భిక్షమాణాః[4] ।
వైశ్వానరో వరమా రోదస్యోరాగ్నిః ససాద పిత్రోరుపస్థమ్ ॥ 71

(7) ఆ దేవో దదే బుధ్న్యాః వసూని వైశ్వానర[5] ఉదితా సూర్యస్య[6] ।
ఆ సముద్రాదవరాదా పరస్మాదాగ్నిర్దదే దివ[7] ఆ పృథివ్యాః ॥ 72

## సూక్తము—6

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—వైశ్వానరాగ్ని*

(1) గద్యము ॥

నేను పురములను ఛేదించినవానికి వందనం బాచరించెదను! సమ్రాట్టు, నసురుఁడు, వీరుఁడు, జనస్తుతియోగ్యుఁడు, బలవంతుఁడు నగు నింద్రుని బోలు నా వైశ్వానరాగ్నిని స్తుతులచేతను, గర్మసమూహముచేతను గీర్తించెదను! ॥ 67

1. వధస్నైర్యోఽఅర్యపత్నీ, 2. యహ్వోఽఅగ్ని, 3. జనాసఽఏవై, 4. భిక్షమాణం,

5. నరఽఉదితా, (బ్రా.ప్ర.) 6. సూర్యస్య(సా.మా.), 7. దివా ఆ. (బ్రా.ప్ర.)

* బ్రాహ్మప్రతిలో (7వ సంపుటము. 54వ పుట) దేవత వైశ్వానరుఁడనియు, 15b సంఖ్యగల సంపుటములోఁ ఋషి దేవతల పట్టికలో నగ్నియనియుఁ గలదు.

(2) గద్యము॥

అగ్నులు, కవులకేతుస్వరూపులు, నదీధారులు, దీప్తిమంతులు, సుఖకరులు, ద్యావాభూములకు రాజులును నగు దేవత లా వైశ్వానరాగ్నిని గర్మసమూహములచేతను స్తుతులచేతను బ్రీతునిగా నొనర్తురు. పురీవిదారకుఁ డగు నగ్నియొక్క పురాతనకర్మలవలనను స్తుతులవలనను గీర్తించెదను ॥ 68

(3) గద్యము॥

అగ్ని యజ్ఞరహితులు, జల్పకులు, హింసితవాక్కులు, శ్రద్ధారహితులు, బుద్ధిశూన్యులును నగు పణినామక దస్యులను గొట్టుఁగాక! వాఁడు ప్రధానుఁడై యపరయజ్ఞరహితులను నింద్యులుగా నొనర్చుఁగాక! ॥ 69

(4) గద్యము॥

నేతృతముఁడగు నే యగ్ని యప్రకాశమానమగు నంధకారమున నిమగ్నులగు ప్రజలను హృష్టులుగ నొనర్చుచుఁ బ్రజ్ఞచే ఋజుమార్గగాములుగఁ జేయునో! ధనస్వామియు, ననతుఁడును, యోద్ధ దమనకారియు నగు నా యగ్నిని నేను స్తుతించెదను ॥ 70

(5) గద్యము॥

ఎవఁడుశత్రు కౌశలమును నాయుధములవలన హీనముగాఁ జేయునో! యెవ్వఁ డార్యపత్ని యగు నుషస్సును సృష్టిఁ జేయుచుండునో! యట్టి యగ్ని ప్రజలను బలముతో నిరోధించుచు నహుషరాజునకుఁ గరప్రదులుగాఁ జేయుచున్నాఁడు ॥ 71

(6) గద్యము॥

సమస్తలోకము సుఖము నిమిత్తమై యెవని యనుగ్రహమును బ్రార్థించి హవ్యమును ధరించియుందురో! యట్టి వైశ్వానరాగ్ని పితృమాతృభూతులగు ద్యావాపృథువుల మధ్యనుండు నంతరిక్షమునకు వచ్చును ॥ 72

(7) గద్యము॥

సూర్యుఁ డుదయించిన పైని వైశ్వానరదేవుఁ డంతరిక్షమునుండి తమస్సమూహమును గ్రహించును. అగ్ని యవరాంతరిక్షమునుండి తమస్సును గ్రహించును. సముద్రమునుండి తమస్సును గ్రహించును. ద్యోలోకమునుండి తమస్సును గ్రహించును. పృథివినుండి తమస్సును గ్రహించును ॥ 73

## సూక్తమ్—7

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా — అగ్నిః

ఛందః — త్రిష్టుప్

(1) ప్ర వో దేవం[1] చిత్ సహసానమగ్నిమశ్వం న వాజినం హిషే నమోభిః ।
భవా నో దూతో[2] అధ్వరస్య విద్వాన్ త్మనా దేవేషు వివిదే మితద్రుః ॥ 73

(2) ఆ యాహ్యగ్నే పథ్యాః అను స్వా మన్ద్రో దేవానాం సఖ్యం జుషాణః ।
ఆ సాను శుష్మైర్నదయన్ పృథివ్యా జమ్భేభిర్విశ్వముశధగ్వనాని ॥ 74

(3) ప్రాచీనో యజ్ఞః సుధితం హి బర్హిః ప్రీణీతే[3] అగ్నిరీళితో న హోతా ।
ఆ మాతరా విశ్వవారే హువానో యతో యవిష్ఠ జజ్ఞిషే సుశేవః ॥ 75

(4) సద్యో అధ్వరే రథిరం జనన్త మానుషాసో విచేతసో య[4] ఏషామ్ ।
విశామధాయి విశ్పతిర్దురోణేఽగ్నిర్మన్ద్రో మధువచా[5] ఋతావా ॥ 76

---

1. దేవం, 2. దూతోఽఅధ్వరస్య, 3. ప్రీణీతేఽఅగ్నిః, 4. యఽఏషామ్,
5. మధువచాఽఋతావా. (ప్రా.ప్ర.)

(5)

(5) అసాది వృతో వహ్నిరాజగన్వానగ్నిర్బ్రహ్మా నృషదనే విధర్తా ।

ద్యౌశ్చ యం పృథివీ వావృధాతే[1] ఆ యం హోతా యజతి విశ్వవారమ్ ॥ 77

(6) ఏతే ద్యుమ్నేభిర్విశ్వమాతిరన్త మన్త్రం యే వారం నర్యా[2] అతక్షన్ ।

ప్ర యే విశస్తిరన్త శ్రోషమాణా[3] ఆ యే మే అస్య దీధయన్నృతస్య ॥ 78

(7) నూ త్వామగ్న[4] ఈమహే వసిష్ఠా ఈశానం సూనో సహసో వసూనామ్ ।

ఇషం స్తోతృభ్యో మఘవద్భ్య[5] ఆనడ్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 79

## సూక్తము—7

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత —అగ్ని

(1) గద్యము ॥

ఓ యగ్నిదేవా! నీ వభిభవితవు. అశ్వమువలె వేగవంతుఁడవు. నేను స్తుతిద్వారా నిన్నుఁ బ్రేరేపింతును. ఓ విద్వాంసుఁడా! మా యజ్ఞదూతవు కమ్ము! అగ్నిదేవతలలో దగ్ధ్రదముఁడవను ప్రఖ్యాతి కలదు ॥ 74

1. వావృధాతేఽఆ యం, 2. నర్యాఽఅతక్షన్, 3. శ్రోషమాణాఽఆ యేఽమే, 4. త్వామగ్న ఽఈమహే వాసిష్ఠాఽఈశానం, 5. మఘవద్భ్యఽఆనడ్. (వ్రా. ప్ర.)

(2) గద్యము॥

ఓ యగ్నే! నీవు స్తుతియోగ్యుఁడవు! దేవతలతో సఖ్య మొనర్చుము! నీవు తేజోబలమునఁ బృథివియందుఁగల తృణ గుల్మాదులను సానుప్రదేశములను శబ్దమును జేయునట్లు లొనర్చుచు దంష్ట్రలవలన సమస్త వనములను దహించి స్వమార్గమును బట్టి రమ్ము! ॥ 75

(3) గద్యము॥

ఓ యువతమాగ్నే! నీవు సుఖయుతుఁడవై పుట్టుటవలన యజ్ఞ మనుష్ఠిత మగును! బర్హిస్సుంచఁబడును. స్తుతియోగ్యుఁడగు నగ్నియు, హోతయుఁ దృప్తు లగుదురు. సకలవరణీయలు మాతృభూతలును నగు ద్యావాభూములు నాహూతు లగుదురు ॥ 76

(4) గద్యము॥

ప్రాజ్ఞులు యజ్ఞమందు రథియగు నగ్నిని తత్క్షణమే పుట్టింతురు. వారి హవ్యములను నగ్ని వహించును. మదయిత, మధువాక్కు, యజ్ఞవంతుఁడు, విస్పతి యగు నగ్ని మనుష్య గృహముల స్థాపింపఁబడును ॥ 77

(5) గద్యము॥

ద్యోతకమునఁ బుదమిని నెవనిని నభివృద్ధిఁబరచెదరో! హోత యే వరణీయాగ్నికి యాగ మొనర్చునో! వృతుఁడు, హవ్యవాహకుఁడు, బ్రహ్మ, సకలధారకుఁడు నగు నా యగ్ని వచ్చుచు మనుష్యగృహముల నుపవిష్ఠుఁ డగును ॥ 78

(6) గద్యము॥

ఏ మనుష్యులు పర్యాప్తముగ మంత్రసంస్కారములను జేయుదురో! యే మనుష్యులు శ్రవణేచ్ఛులై వర్ధితు లగుదురో! యే మనుష్యులు సత్యభూతుఁడగు నగ్నిని వెలిఁగింతురో! వా రన్నము ద్వారా సమస్త పోష్యవర్గమును వృద్ధిఁ బొందింతురు ॥ 79

(7) గద్యము॥

ఓ బలపుత్రాగ్నే! నీవు వసుసమూహమునకుఁ బతివి. వసిష్ఠగణము నిను స్తుతి చేయుచున్నారు. నీవు స్తోతలను, యజ్ఞకులను, శీఘ్రముగ నన్నద్వారమున వ్యాప్తులుగ నొనర్పుము! మాకు స్వస్తి నొసంగి పాలింపుము! ॥ 80

## సూక్తమ్—8

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — అగ్నిః
ఛందః — త్రిష్టుప్

(1) ఇన్ధే రాజా సమర్యో నమోభిర్యస్య ప్రతీకమాహుతం ఘృతేన ।
నరో హవ్యేభిరీళతే సబాధ[1] ఆగ్నిరగ్ర ఉషసామశోచి ॥ 80

(2) అయము ష్య సుమహాఁ[2] అవేది హోతా మన్ద్రో మనుషో యహ్వో అగ్నిః ।
వి భా అకః ససృజానః పృథివ్యాం కృష్ణ[3]పవిరోషధీభిర్వవక్షే ॥ 81

(3) కయా నో[4] అగ్నే వి వసః సువృక్తిం కాము[5] స్వధామృణవః శస్యమానః ।
కదా భవేమ పతయః సుదత్ర రాయో వన్తారో దుష్టరస్య సాధోః ॥ 82

(4) ప్రప్రాయమగ్నిర్భరతస్య శృణ్వే వి యత్ సూర్యో న రోచతే బృహద్ భాః ।
అభి యః పూరుం పృతనాసు తస్థౌ ద్యుతానో దైవ్యో[6] అతిథిః శుశోచ ॥ 83

---

1. సబాధఽఅగ్నిరగ్రఽఉషసా, 2. మహాఁఽఅవేది, 3. కృష్ణాపవిరోషధీభిర్వవక్షే, 4. నోఽఅగ్నే,
5. కాముఖధామృణవః, 6. దైవ్యోఽఅతిథిః. (ప్రా.ప్ర.)

(5) అనన్నిత్ త్వే[1] ఆహవనాని భూరి భువో విశ్వేభిః సుమనా[2] అనీకైః ।
స్తుతశ్చిదగ్నే శృణ్విషే గృణానః స్వయం వర్ధస్వ తన్వం సుజాత ॥ 84

(6) ఇదం వచః శతసాః సంసహస్రముదగ్నయే జనిషీష్ట ద్విబర్హాః ।
శం యత్ స్తోతృభ్య[3] ఆపయే భవాతి ద్యుమదమీవచాతనం రక్షోహా ॥ 85

(7) నూ త్వామగ్న ఈమహే వసిష్ఠా ఈశానం సూనో సహసో వసూనామ్ ।
ఇషం స్తోతృభ్యో మఘవద్భ్య[4] ఆనడ్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 86

## సూక్తము—8

ఋషి —మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—అగ్ని

(1) గద్యము ॥

ఎవని రూపము ఘృతముద్వారా యాహుతమగునో! నేతలు బాధాయుతులై హవ్యసహితులై యెవని స్తుతింతురో! రాజు స్వామియు నగునట్టి యగ్ని స్తుతిచే సమిద్ధుఁ డగును. అగ్ని యుషస్సుముందు దీపించును ॥ 81

1. త్వేఽఆహవనాని, 2. సుమనాఽఅనీకైః, 3. స్తోతృభ్యఽఆపయే, 4. మఘవద్భ్యఽఆనడ్. [వా.ప్ర.]

(2) గద్యము॥

హోత, మదయిత, మహాత్ముఁడు నగు నగ్ని మనుష్యకర్తృకమహాత్ముఁడని విఖ్యాతుఁ
డగును. ఆతఁడు దీప్తిని వెదఁజల్లును. కృష్ణవర్త్మయగు నగ్ని పృథ్వియందు
హృష్టుఁడై యోషధులద్వారా వృద్ధి నొందును ॥ 82

(3) గద్యము॥

ఓ యగ్నీ! యే స్వధచే మా స్తుతి వ్యాప్తమగునట్టు చేసెదవు? స్తూయమానమై యే స్వధ
ప్రాప్తించును? ఓ శోభమానాగ్నీ! మే మెట్లు దుస్తర సాధనమునకుఁ బతులమై
తద్విభాగకారుల మగుదుము? ॥ 83

(4) గద్యము॥

ఆ యగ్ని సూర్యునిబోలి బృహత్ప్రతిభాశాలియై ప్రకాశించును. కాఁబట్టి భరతులచేఁ బ్రసిద్ధుఁ
డగును. వాఁడు సంగ్రామములయందుఁ బూరుని బరాభూతునిగ నొనర్చెను. దీప్యమానుఁడు
దేవాతిథియగు నగ్ని ప్రజ్వలించుచున్నాఁడు ॥ 84

(5) గద్యము॥

ఓ యగ్నీ! నీవలన నెక్కువ హవ్య మొసంగఁబడుచున్నది. నీవు సమస్త తేజస్సహితుఁడవై
ప్రసన్నుఁడ వగుము! స్తోతల స్తోత్రముల నాలకింపుము! ఓ సుజాతుఁడా! నీవు
స్తూయమానుఁడవై స్వయముగా శరీరమును వృద్ధిఁబొందించుకొనుము! ॥ 85

(6) గద్యము॥

శతగోవులను విభాగించువాఁడు, సహస్రగోవిశిష్టుఁడు, స్థానద్వయమందు మహాత్ముఁడు నగు
వసిష్ఠుఁ డీ వాక్యములను నగ్ని నుద్దేశించి యుచ్చరించెను. దీప్తిమంతుఁడు, రోగనివారకుఁడు,
రాక్షసనాశకుఁడు నగు నగ్ని స్తోతలకు వాని బంధువులకు సుఖదుఁ డగుఁగాక! ॥ 86

(7) గద్యము॥

బలపుత్రాగ్నీ! నీవు వసుగుణములకుఁ బతివి! వశిష్ఠగణము నిన్ను స్తుతించుచున్నారు.
నీవు స్తోతకు, యజ్ఞకరునకుఁ ద్వరితముగ నన్నము నిమ్ము! నీవు సర్వదా మమ్ము
స్తుతులచేఁ బాలింపుము! ॥ 87

# సూక్తమ్—9

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అగ్నిః
ఛందః— త్రిష్టుప్

(1) అబోధి జార[1] ఉషసాముపస్థాద్ధోతా మన్ద్రః కవితమః[2] పావకః ।
దధాతి కేతుముభయస్య జన్తోర్హవ్యా దేవేషు ద్రవిణం [3]సుకృత్సు ॥ 87

(2) స[4] సుక్రతుర్యో వి దురః పణీనాం పునానో[5] అర్కం పురుభోజసం నః ।
హోతా మన్ద్రో విశాం దమూనాస్తిరస్తమో దదృశే[6] రామ్యాణామ్ ॥ 88

(3) అమూరః కవిరదితిర్వివస్వాన్ త్సుసంసన్మిత్రో[7] అతిథిః శివో నః ।
చిత్రభానురుషసాం భాత్యగ్రే[8] ఽపాం గర్భః ప్రస్వ౧ ఆ వివేశ ॥ 89

(4) ఈళేన్యో వో మనుషో యుగేషు సమనగా[9] అశుచజ్జాతవేదాః ।
సుసందృశా భానునా యో విభాతి ప్రతి గావః సమిధానం బుధన్త ॥ 90

---

1. జారఽఉషసా, 2. కవితమంపావకః, 3. సుకృత్సు, 4. ససుక్రతు, 5. పునానోఽఅర్కం,
6. దదృశోరామ్యా, 7. సన్మిత్రోఽఅతిథిః, 8. భాత్యగ్రేపాం, 9. సమనగాఽఅశు. [ప్రా.ప్ర.]

(5) అగ్నే యాహి దూత్యం మా రిషణ్యో దేవాగ్ం[1] అచ్ఛా బ్రహ్మకృతా గణేన ।
సరస్వతీం మరుతో[2] అశ్వినాపో యక్షి దేవాన్ రత్నధేయాయ విశ్వాన్ ॥ 91

(6) త్వామగ్నే సమిధానో వసిష్ఠో జరూథం హన్ యక్షి రాయే [3]పురంధిమ్ ।
పురుణీథా జాతవేదో జరస్వ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 92

## సూక్తము—9

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత— అగ్ని

(1) గద్యము ॥

అగ్ని జారస్వరూపుఁడు, హోతృస్వరూపుఁడు, మదయిత, కవితముఁడు, పావకుఁడు. వాఁ డుషోమధ్యమునఁ బ్రబుద్ధుఁ డగును. వాఁ డుభయ జంతువులకుఁ బ్రజ్ఞ నొసంగును. దేవతలకు హవ్య మిచ్చును. సుకృతకర్ములకు ధన మందఁజేయును ॥ 88

(2) గద్యము ॥

ఎవఁడు పణులద్వారముల వెల్లడిచేయునో! యట్టి యగ్ని సుకర్మ. వాఁడు మా నిమిత్తము బహుక్షీరవిశిష్టములగు గోవులను గొనితెచ్చును. వాఁడు హోత, మాదయిత, మానదాత. అగ్ని రాత్రులయొక్కయు, జనులయొక్కయుఁ దమస్సును దూరముగఁ గొట్టుచుఁ బరిపుష్టుఁ డగును ॥ 89

---

1. దేవాగ్ంఽఅచ్ఛా, 2. మరుతోఽఅశ్వినాపో, 3. పురాంధిమ్. (ప్రా.ప్ర.)

(3) గద్యము ॥

అమూఢుఁడు, కవి, యదీనుఁడు, దీప్తిమంతుఁడు, శోభనగృహవిశిష్టుఁడు, మిత్రుఁడు, నతిథి,
యస్మన్మంగళకరుఁడు నగు నగ్ని విశిష్టదీప్తియుక్తుఁడై యుషర్ముఖంబందును
శోభించును, మరియు జలగర్భరూపమందు సంజాతుఁడై యోషధీసమూహమందుఁ
బ్రవేశించును ॥ 90

(4) గద్యము॥

ఓ యగ్నీ! మనుష్యుని యజ్ఞకాలమందు నీవు స్తుతియోగ్యుఁడవు! జాతవేదుఁడు
యుద్ధమందుఁ జొరఁబడి వెలుంగును. అగ్ని దర్శనీయతేజముద్వారా
శోభించును. సమూహసమిద్ధుఁడగు నగ్నిని బ్రతిబోధింతును ॥ 91

(5) గద్యము॥

ఓ యగ్నీ! నీవు దేవాభిముఖముగ దౌత్యకార్యమును గొనిపొమ్ము! స్తోతలను
హింసింపకుము! మాకు రత్నముల నొసంగుటకై నీవు సరస్వతి,
మరుద్గణము, నశ్విద్వయము, జలప్రభృతిసకలదేవతలయొక్క
యాగముఁ జేయుము! ॥ 92

(6) గద్యము॥

ఓ యగ్నీ! వసిష్ఠుఁడు నిన్నుఁ బ్రకాశింపఁజేయును. నీవు పరుషభాషలను
వధింపుము! ధనవంతులకై బహుధా దేవతలయాగ మొనర్పుము!
జాతవేదుఁడా! స్తోత్రములచే నిను స్తుతింతుము. నీవు సర్వదా
స్వస్తిద్వారా మమ్ముఁ బాలింపుము! ॥ 93

(4) గద్యము॥

ఓ యగ్నీ! నీవు వసుగణముతోఁ గలిసికొని యింద్రుని బిలువుము! రుద్రులతోఁగూడి మహారుద్రుని నాహ్వానింపుము! ఆదిత్యులతోఁగలిసి విశ్వజనహితకరయగు నదితిని బిలువుము! స్తుతియోగ్యులగు నంగిరోగణములతోఁ గలియుచు,సర్వవరణీయుఁ డగు బృహస్పతిని నాహ్వానింపుము! ॥ 97

(5) గద్యము॥

అభిలాషులగు మనుష్యులు స్తుతియోగ్యుఁడును, హోతయు, యువతముఁడునగు నగ్నిని యజ్ఞమందు స్తుతింతురు. వాఁడు రాత్రివిశిష్టుఁడు. దేవతలకు యాగ మొనర్చుటకై హవ్యదాతకుఁ దంద్రారహితుఁడగు దూతుఁ డగుచుండుటయే యందుకుఁ గారణము ॥ 98

## సూక్తమ్—11

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అగ్నిః
ఛందః—త్రిష్టుప్

(1) మహాగ్ం[1] అస్యధ్వరస్య ప్రకేతో న[2] ఋతే త్వదమృతా మాదయన్తే ।
ఆ విశ్వేభిః [3]సరథం యాహి దేవైర్న్యగ్నే హోతా ప్రథమః సదేహ ॥ 98

(2) త్వామీళతే[4] అజిరం దూత్యాయ హవిష్మన్తః సదమిన్మానుషాసః ।
యస్య దేవైరాసదో బర్హిరగ్నే[5] ఽహాన్యస్మై సుదినా భవన్తి॥ 99

---

1. మహాగ్ంఽఅస్య, 2. నఽఋతే, 3. సురథం, 4. త్వామీళతేఽఅజిరం,

5. బర్హిరగ్నేహాన్యస్మై. [వా.ప్ర.]

(3) త్రిశ్చి[1]దక్తోః ప్ర చికితుర్వసూని త్వే[2] అన్తర్దాశుషే మర్త్యాయ ।
మనుష్వదగ్న[3] ఇహ యక్షి దేవాన్ భవా నో దూతో[4] అభిశస్తిపావా ॥ 100

(4) అగ్నిరీశే బృహతో అధ్వరస్యాఽగ్నిర్విశ్వస్య హవిషః కృతస్య ।
క్రతుం[5] హ్యస్య వసవో జుషన్తా[6]ఽథా దేవా దధిరే హవ్యవాహమ్ ॥ 101

(5) ఆగ్నే వహ హవిరద్యాయ దేవానిన్ద్రజ్యేష్ఠాస[7] ఇహ మాదయన్తామ్ ।
ఇమం యజ్ఞం దివి దేవేషు ధేహి యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 102

## సూక్తము—11

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము ॥

ఓ యగ్నీ! నీవు యజ్ఞప్రజ్ఞాపకుండవై మహాత్మకుఁడ వగుము! దేవతలు నీవు లేకుండ నాకు వశ్యులు కారు. నీవు సర్వదేవతలతోఁ గూడి రథముపై రమ్ము! మరియు నీ కుశలపై ముఖ్యహోతవై విశ్రమింపుము! ॥ 99

---

1. త్రిశ్చిదక్తోః, 2. త్వేఽఅన్త, 3. దగ్నఽఇహ యాక్షి, 4. దూతోఽఅభి, 5. ఋతుం హ్యస్య,
6. జుషన్తాథా, 7. జ్యేష్ఠాసఽఇహ. (ప్రా.ప్ర.)

(2) గద్యము ॥

ఓ యగ్నీ! నీవు గమనశీలుఁడవు! హవిష్మంతుఁడవు! దౌత్యకార్యమును నడపవలసినది యని మనుష్యులు నిన్ను సర్వదా ప్రార్థింతురు. దేవతలతో నీ వెవరి కుశలపై విశ్రమంతువో! వారికి దివసములు సుదినము లగును ॥ 100

(3) గద్యము ॥

ఓ యగ్నీ! ఋత్విక్కులు దివసమును ముమ్మారు హవ్యము నొసంగు మనుష్యులకై నీయందు హవ్యమును బ్రక్షేపింతురు. మనుయజ్ఞమునందువలె నీవు దూతవై యాగము నొనర్పుము! ఇంక మమ్ము శత్రువులబారినుండి రక్షింపుము! ॥ 101

(4) గద్యము ॥

అగ్ని మహాయజ్ఞమునకు స్వామి. అగ్ని సమస్తసంస్కృతహవ్యమునకు స్వామి. వసుగణ మందుచేతనే వానికర్మలను సేవింతురు. మరియు దేవత లగ్నిని హవ్యవాహకునిగాఁ జేసిరి ॥ 102

(5) గద్యము॥

ఓ యగ్నీ! నీవు హవ్యమును భోజనము చేయుటకై దేవతలను నాహ్వానింపుము! ఈ యజ్ఞమునందు నింద్రప్రముఖదేవగణములను బ్రమత్తులుగా నొనర్పుము! నీవు సర్వదా మాకు స్వస్తిని పాలింపుము! ॥ 103

## సూక్తమ్—12

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా — అగ్నిః

ఛందః — త్రిష్టుప్

(1) అగన్మ మహా నమసా యవిష్ఠం యో దీదాయ సమిద్ధః స్వే దురోణే ।
చిత్రభానుం రోదసీ[1] అన్తరుర్వీ స్వాహుతం విశ్వతః ప్రత్యఞ్చమ్ ॥ 103

(2) స మహ్నా విశ్వా దురితాని సాహ్వానగ్నిః[2] ష్టవే దమ ఆ జాతవేదాః ।
స నో రక్షిషద్ దురితాదవద్యాదస్మాన్ గృణత[3] ఉత నో మఘోనః ॥ 104

(3) త్వం[4] వరుణ ఉత మిత్రో అగ్నే త్వాం వర్ధన్తి మతిభిర్వసిష్ఠాః ।
త్వే వసు [5]సుషణనాని సన్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 105

---

1. రోదసీఽఅన్తరుర్వీ, 2. సాహ్వానగ్నిష్టవేదమఽఆ, 3. గృణతఽఉత, 4. త్వకరుణఽఉతమిత్రోఽఅగ్నే,
5. సుషణానాని. [వ్రా.ప్ర.]

## సూక్తము—12

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము॥

ఎవఁడు స్వగృహమందు సమిద్ధుఁడై దీప్తిమంతుఁడగునో! యువతముఁడు, ద్యావాభూముల మధ్యస్థితుఁడు, విచిత్రశిఖా విశిష్ఠుఁడు, సుందరరూపమున నాహూతుఁడు, సర్వత్ర గమనకారియు నగు నగ్ని సమీపమునకు నమస్కారపూర్వకంబుగ వెడలెదను ॥ 104

(2) గద్యము॥

ఆ జాతవేదుఁడు నిజమహత్వమున సమస్తపాపములను బోఁగొట్టును. వాఁడు యజ్ఞ గృహమందు స్తుతింపఁబడును. వాఁడు మా పాపములను నిందితకర్మలను దొలఁగించును. మేము వాని స్తుతించి వానికై యాగము నొనర్తుము ॥ 105

(3) గద్యము॥

ఓ యగ్నీ! నీవు వరుణుఁడవు. మిత్రుఁడవు. వసుగణము నిన్ను స్తుతులచే వృద్ధిఁ బొందింతురు. నీయొద్దగల ధనము సులభ మగును. నీవు మాకు స్వస్తి నొసంగి పరిపాలింపుము! ॥ 106

## సూక్తమ్—13

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — అగ్నిః
ఛందః — త్రిష్టుప్

(1) ప్రాగ్నయే విశ్వశుచే ధియంధే[1] ఽసురఘ్నే మన్మ ధీతిం భరధ్వమ్ ।
భరే హవిర్న బర్హిషి ప్రీణానో వైశ్వానరాయ యతయే మతీనామ్ ॥ 106

---

1. ధియంధేసుర. (ప్రా.ప్ర.)

(2) త్వమగ్నే శోచిషా శోశుచాన[1] ఆ రోదసీ అపృణా జాయమానః ।
త్వం దేవాగ్ం[2] అభిశస్తేరముఞ్చో వైశ్వానర జాతవేదో మహిత్వా ॥ 107

(3) జాతో యదగ్నే భువనా వ్యఖ్యః పశూన్ న గోపా[3] ఇర్యః పరిజ్మా ।
వైశ్వానర బ్రహ్మణే[4] విన్ద గాతుం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 108

## సూక్తము—13

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు*
దేవత—వైశ్వానరాగ్ని

(1) గద్యము ॥

సకలోద్దీపకుఁడు, కర్మధారకుఁడు, నసురవినాశకుఁడు నగు నగ్ని నుద్దేశించి స్తుతింపుము! నేను భీతుఁడనై యభిమతదాతయగు వైశ్వానరుఁగూర్చి హవ్యమును ధరించి స్తుతుల నుచ్చరింతును ॥ 107

(2) గద్యము ॥

ఓ యగ్నీ! నీవు దీప్తిద్వారా దీప్తి విశిష్టుఁడవై పుట్టి ద్యావాపృథువులను నిండింపుచున్నావు. ఓ జాతవేదుఁడా! వైశ్వానరుఁడా! నీవు మహత్వమున దేవతలను శత్రువిముక్తులుగా నొనర్చితివి ॥ 108

1. చానఽఆ రోదసీఽఅపృణా, 2. దేవాగ్ంఽఅభిశస్తే, 3. గోపాఽఇర్యః, 4. బ్రహ్మణో. (వ్రా.ప్ర.)

* వ్రాతపతి 15b సంఖ్యగల సంపుటములోఁగల ఋషిదేవతల పట్టికలో శ్రీనేమానివారు పొరపాటున నీ 13వ సూక్తము మొదలు 29వ సూక్తమువరకు వైశ్వానరుఁడు ఋషిగా వ్రాసిరి.

(3) గద్యము ॥

ఓ యగ్నీ! నీవు సూర్యరూపమునఁ బుట్టితివి. స్వామివి. సర్వత్ర గమనశీలుఁడవు.
గోపాలకుఁడు పశువులను సందర్శించునటుల నీవు భూతసమూహములను
సందర్శింతువు. అందున స్తోత్రరూప ఫలలాభమును జేయుము! ॥ 109

## సూక్తమ్—14

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అగ్నిః
ఛందః—త్రిష్టుప్, 1-బృహతీ.

(1) సమిధా జాతవేదసే దేవాయ దేవ[1]హూతిభిః ।
హవిర్భిః శుక్రశోచిషే నమస్వినో వయం దాశేమాగ్నయే ॥ 109

(2) వయం తే[2] అగ్నే సమిధా విధేమ వయం దాశేమ సుష్టుతీ యజత్ర ।
వయం [3]ఘృతేనాధ్వరస్య హోతర్వయం దేవ హవిషా భద్రశోచే ॥ 110

(3) ఆ నో దేవేభిరుప దేవ[1]హూతిమగ్నే యాహి[4] వషట్కృతిం జుషాణః ।
తుభ్యం దేవాయ దాశతః స్యామ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 111

---

1. దేవహ్యూతిభిః, 2. తేఽఅగ్నే, 3. ఘృతేనాధ్వరస్య, 4. యాహవిషట్కృతిం. (ప్రా.ప్ర.)

## సూక్తము—14

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము ॥

మేము హవిష్మంతులము. మేము సమిధలతో జాతవేదుని పరిచర్య నొనర్తుము. దేవస్తుతిచే నగ్నిదేవుని సేవింతుము. హవ్యమును శుభ్రాగ్నికి నొసంగెదము ॥ 110

(2) గద్యము ॥

ఓ యగ్నీ! మేము సమిధలను ధరించి నీ పరిచర్యఁ జేయుదుము. ఓయజనీయుఁడా! స్తుతిని బఠించి నీసేవఁ జేయుదుము. యజ్ఞహోతా! నీకు ఘృతము నర్పింతుము. ఓ కళ్యాణ కర శిఖావిశిష్టుఁడా! యగ్నిదేవ! నీకు హవ్యము నర్పింతుము ॥ 111

(3) గద్యము ॥

ఓ యగ్నీ! నీవు హవ్యమును వషట్కృతిని సేవించుచు మా యజ్ఞమునకు రమ్మ! నీవు ద్యోతమానుఁడవు. మేము నీ పరిచర్యఁ జేయువారము. నీవు సర్వదా మమ్ముఁ బాలింపుము ॥ 112

## సూక్తమ్—15

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) ఉపసద్యాయ [1]మీళ్హుష ఆస్యే జుహుతా హవిః ।
యో నో నేదిష్ఠమాప్యమ్ ॥ 112

1. మీహ్ళుషఽఆస్యే. [వ్రా.ప్ర.]

(2) యః పఞ్చ చర్షణీరభి నిషసాద దమేదమే ।
కవిర్గృహపతిర్యువా ॥ 113

(3) స నో వేదో[1] అమాత్యమగ్నీ రక్షతు విశ్వతః ।
ఉతాస్మాన్ పాత్వంహసః ॥ 114

(4) నవం ను స్తోమమగ్నయే దివః శ్యేనాయ జీజనమ్ ।
వస్వః కువిద్ వనాతి నః ॥ 115

(5) స్పార్హా యస్య శ్రియో దృశే[2] రయిర్వీరవతో యథా ।
అగ్రే యజ్ఞస్య శోచతః ॥ 116

(6) సేమాం వేతు వషట్కృతిమగ్నిర్జుషత నో గిరః ।
యజిష్ఠో హవ్యవాహనః ॥ 117

---

1. వేదో౽ఉపమాత్య, 2. దృశో రయిర్వీ. (ప్రా.ప్ర.)

(7) ని త్వా నక్ష్య విశ్పతే ద్యుమన్తం దేవ ధీమహి ।

సువీరమగ్న[1] ఆహుత ॥ 118

(8) క్షప[2] ఉస్రశ్చ దీదిహి స్వగ్నయస్త్వయా వయమ్ ।

సువీ[3]రస్త్వమస్మయుః ॥ 119

(9) ఉప త్వా సాతయే నరో విప్రాసో యన్తి ధీతిభిః ।

ఉపాక్షరా[4] సహస్రిణీ ॥ 120

(10) అగ్నీ రక్షాంసి సేధతి శుక్రశోచిరమర్త్యః ।

శుచిః పావక ఈడ్యః ॥ 121

(11) స నో రాధాంస్యా భరేశానః సహసో యహో ।

భగశ్చ దాతు వార్యమ్ ॥ 122

---

1. మగ్నఽఆహుత, 2. క్షపఽఉస్రశ్చ, 3. సువీరాస్త్వ, 4. ఉపాక్షర సహస్రిణీ. (వ్రా.ప్ర.)

(12) త్వమగ్నే వీరవద్ యశో దేవశ్చ సవితా భగః ।

దితిశ్చ దాతి వార్యమ్ ॥ 123

(13) అగ్నే రక్షా ణో అంహసః ప్రతి ష్మ దేవ రీషతః ।

తపిష్ఠైరజరో దహ ॥ 124

(14) అధా మహీ న ఆయస్యనాధృష్టో నృపీతయే ।

పూర్భవా[1] శతభుజిః ॥ 125

(15) త్వం నః పాహ్యంహసో దోషావస్తరఘా[2]యతః ।

దివా నక్తమదాభ్య ॥ 126

## సూక్తము—15

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము ॥

ఎవఁడు మాకు సమీప బంధువో! యుపసదనీయుఁడు నభీష్టవర్షియు నగు నాయగ్ని యొక్క-
ముఖమున హవ్యము నిడెదను ॥ 113

1. పూర్భవా శాతభుజిః, 2. రథాయతః. (వ్రా.ప్ర.)

(2) గద్యము॥

కవియు, గృహపతి, యువయు నగు నగ్ని, ప్రాజ్ఞులగు మనుష్యుల కభిముఖముగఁ
బ్రతి గృహమందును నిషణ్ణుఁ డగును ॥ 114

(3) గద్యము॥

ఆ యగ్ని మా కమాత్యుఁడు. సర్వాపత్తులనుండి ధనమును సంరక్షించును. మమ్ముఁ
బాపములనుండి కాపాడును ॥ 115

(4) గద్యము॥

ద్యోలోకమున శ్యేనమువలె క్షిప్రగామియగు నగ్నినిగూర్చి నూతనస్తోమమును బుట్టించితిని.
వాఁడు మాకు బహుధనము నొసంగుఁగాక! ॥ 116

(5) గద్యము॥

యజ్ఞాగ్రభాగమున దీప్యమానుం డగు నగ్నియొక్క దీప్తిసమూహము పుత్రవంతుండగు
వ్యక్తియొక్క ధనమువలెఁ జూడఁదగినది ॥ 117

(6) గద్యము॥

యాజ్ఞకశ్రేష్ఠుఁడు హవ్యవాహకుఁడు నగు నా యగ్ని యీ వషట్కృతిని గామించుచు
మా స్తుతిని సేవించునుగాక! ॥ 118

(7) గద్యము॥

ఓ యుపగంతవ్యుఁడా! లోకపతిచేఁ బిలవఁబడువాఁడా! యగ్నిదేవా! నీవు
ద్యుతిమంతుఁడవు! సువీరుఁడవు! మేము నిన్ను స్థాపించెదము ॥ 119

(8) గద్యము॥

నీ.వహోరాత్రము ప్రదీప్తుఁడ వగుము! మేము నీవలన సుందరాగ్నిగలవార మగుదుము.
నీవు మాకోర్కెలఁ దీర్చుచు మనోహరస్తోత్రవిశిష్టుఁడ వగుము! 120

(9) గద్యము॥

మేధావులగు నేతలు ఘనకర్మలచే ధనమును గోరి నీ చెంతఁ జేరెదరు! సహస్ర సంఖ్యాకము,
క్షయరహితము నగు స్తుతి నిన్నుఁ జేరును ॥ 121

(10) గద్యము॥

పరిశుభ్రుఁడు, శిఖా విశిష్టుఁడు, మరణ రహితుఁడు, శుచి, పావకుఁడు, స్తుతియోగ్యుఁడు
నగు నగ్ని రాక్షసులకు బాధను గల్పించుఁగాక! ॥ 122

(11) గద్యము॥

ఓ బలపుత్రా! నీ వీశ్వరుఁడవై మాకు ధన మందఁజేయుము! భగవంతుఁడు కోరినధనము
నిచ్చుఁగాక! ॥ 123

(12) గీ॥ పుత్రపౌత్రాదిసంయుత పూర్ణ ధనము
నగ్నిదేవుఁడా! మా కిడు మతిశయముగ
సవితృదేవుఁడు దితియును జారు ధనము
నిచ్చుఁగాక! ముదంబును హెచ్చుగలిఁగి ॥ 124

(13) గద్యము॥

ఓ యగ్ని! నీవు మమ్ముఁబాపములబారినుండి రక్షింపుము! జరారహిత దేవుఁడా! నీవు
హింసాకారులను దాపక మగు తేజస్సున దహింపుము! ॥ 125

(14) గద్యము॥

నీ వ్రపదర్శనీయుఁడవు! ఈ క్షణమందు నీవు మా నరులను రక్షించుటకుఁ బురములు
నయోనిర్మితములు శతగుణములుగలవిగను నగును ॥ 126

(15) గద్యము॥

ఓ యరిహంసనీయరాత్రి నాచ్ఛాదించువాఁడా! నీవు మమ్ముఁ బాపములనుండి పాపాత్ముల
బారినుండి దివారాత్రములు సంరక్షింపుము! ॥ 127

## సూక్తమ్_16

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—అగ్నిః

ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ఏనా వో[1] అగ్నిం నమసోర్జో నపాతమా హువే ।
ప్రియం చేతిష్ఠమరతిం స్వధ్వరం విశ్వస్య దూతమమృతమ్ ॥ 127

(2) స యోజతే[2] అరుషా విశ్వభోజసా స దుద్రవత్ స్వాహుతః ।
సుబ్రహ్మా యజ్ఞః సుశమీ వసూనాం దేవం రాధో జనానామ్ ॥ 128

1. ఏనా వోఽఅగ్నిం, 2. యోజతేఽఅరుషా. (ప్రా.ప్ర.)

(3) ఉదస్య శోచిరస్థాదాజుహ్వానస్య మీళ్హు[1]షః ।
ఉద్[2] ధూమాసో అరుషాసో దివిస్పృశః సమగ్నిమిన్ధతే నరః ॥ 129

(4) తం త్వా దూతం కృణ్మహే యశస్తమం దేవాఁ[3] ఆ వీతయే వహ ।
విశ్వా సూనో సహసో మర్తభోజనా రాస్వ తద్ యత్ త్వేమహే ॥ 130

(5) త్వమగ్నే గృహపతిస్త్వం హోతా నో[4] అధ్వరే ।
త్వం పోతా విశ్వవార ప్రచేతా యక్షి వేషి చ వార్యమ్ ॥ 131

(6) కృధి రత్నం యజమానాయ [5]సుక్రతో త్వం హి రత్నధా[6] అసి ।
ఆ న[7] ఋతే శిశీహి[8] విశ్వమృత్విజం[9] సుశంసో యశ్చ దక్షతే ॥ 132

(7) త్వే[10] అగ్నే స్వాహుత ప్రియాసః సన్తు సూరయః ।
యన్తారో యే మఘవానో జనానా[11] మూర్వాన్ దయన్త గోనామ్ ॥ 133

---

1. మీళ్హుషః, 2. ఉద్ధూమాసోఽరు, 3. దేవాఁఽఆ 4. హోతా నో ఽఅధ్వరే, 5. సుక్రతోత్వం, 6. రత్నధాఽఅసి, 7. ఆ నఽఋతే, 8. శిశీహ విశ్వ, (ప్రా.ప్ర.)9. మృత్విజం, [సా] 10. త్వేఽఅగ్నే, 11. జనానామర్వాన్. [ప్రా.ప్ర.]

(8) యేషామిళా ఘృతహస్తా దురోణ[1] ఆగ్ం అపి ప్రాతా నిషీదతి ।
తాగ్ంస్త్రాయస్వ సహస్య ద్రుహో నిదో యచ్ఛా నః శర్మ దీర్ఘశ్రుత్ ॥ 134

(9) స మన్ద్రయా చ జిహ్వయా వహ్నిరాసా విదుష్టరః ।
అగ్నే రయిం మఘవద్భ్యో న[2] ఆ వహ హవ్యదాతిం చ సూదయ ॥ 135

(10) యే రాధాంసి దదత్యశ్వ్యా మఘా కామేన శ్రవసో మహః ।
తాగ్ం[3] అంహసః పిపృహి పర్తృభిష్ట్వం శతం[4] పూర్భిర్యవిష్ఠ్య ॥ 136

(11) దేవో వో ద్రవిణోదాః పూర్ణాం వివష్ట్వాసిచమ్ ।
ఉద్ వా సించధ్వముప వా పృణధ్వమాదిద్ వో దేవ[5] ఓహతే ॥ 137

(12) తం హోతారమధ్వరస్య ప్రచేతసం వహ్నిం దేవా[6] అకృణ్వత ।
దధాతి రత్నం విధతే సువీర్యమగ్నిర్జనాయ దాశుషే ॥ 138

---

1. దురోణఽఆగ్ంఽఅపి, 2. నఽఆ వహ, 3. తాగ్ంఽఅంహసః, 4. శతపూర్భి, 5. దేవఽఓహతే,
6. దేవాఽఅకృణ్వత. (బ్రా.ప్ర.)

# సూక్తమ్—16

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అగ్ని

(1) గద్యము॥

నేను నీనిమిత్తము బలపుత్ర ప్రియుఁడు, ప్రజ్ఞాపకశ్రేష్ఠుఁడు, గమనశీలుఁడు, సుందరయజ్ఞ
విశిష్టుఁడు, సకలదూత, నిత్యుఁడు,నగు నగ్నిని నీ స్తోత్రములచేఁ బిలచెదను ॥ 128

(2) గద్యము॥

వాఁ డారోచమానుఁడు. సర్వపాలకుఁడు. అశ్వద్వయమును రథమునకు సమకూర్చును.
వాఁడు దేవతలనిమిత్తము ద్రుతగమనముతోఁ బోవును! సుందరముగా నాహూతుఁ
డగును. సుందరస్తుతి గలవాఁడు, యజనీయుఁడు, సుకర్మ, వసువుల ధన
మగ్నిదేవుని చెంతకు వచ్చుఁగాక! ॥ 129

(3) గద్యము॥

అభీష్టవర్షి, యభిహూయమానుఁడు నగు నీ యగ్నియొక్క తేజస్సు పుట్టుచున్నది!
ఆరోచమానము నంతరిక్షస్పర్ధి యగు ధనసమూహము పుట్టుచున్నది!
నరు లగ్నిని వెలిఁగించుచున్నారు ॥ 130

(4) గద్యము॥

ఓ బలపుత్రుఁడా! అగ్నీ! నీ వత్యంత యశస్వివి. మేము నిన్ను దూతగాఁ జేయుదుము.
నీవు హవ్య భోజనమునకై దేవతల నాహ్వానింపుము! మేము నిన్ను యాచించుటంబట్టి
మనుష్యులకు భాగమును (ధనమును) దాన మిమ్ము! ॥ 131

(5) గద్యము॥

ఓ సకల వరణీయాగ్నీ! నీవు మాయజ్ఞమునందు గృహపతివి. హోతవు. నీవు పోతవు.
నీవు ప్రకృష్టమతివి. నీవు వరణీయహవ్యయాగము నొనర్పుము! ॥ 132

(6) గద్యము॥

ఓ సుకర్ముఁడా! నీవు రత్నదాతవుకాఁబట్టి యజమానులకు రత్నములనిమ్ము! నీవు
మా యజ్ఞములందు ఋత్విక్కులను దీక్షలుగా నొనర్పుము!
హోత వృద్ధిఁ బొందింపఁబడెను ॥ 133

(7) గీ॥ సుందరస్వరూప! శోభనాహ్వానుఁడా!
స్తోతలెల్లఁ బ్రియులు సూటి నీకు
ధనము కల్గునట్లు దాతలకును నీవు
ప్రియుఁడ వౌదుకాదె! ప్రియముఁ గరుప ॥ 134

(8) గద్యము॥

ఎవ్వరి గృహమందు ఘృతహస్తయగు నిల పూర్ణయై యుండునో! యో బలవంతుఁడ
వగు నగ్నీ! వారిని ద్రోహులనుండి, నిందకులనుండి రక్షింపుము! మాకు
దీర్ఘకాలము వరకు స్తుతియోగ్య సుఖము నొసంగుము! ॥ 135

(9) గద్యము॥

ఓ యగ్నీ! నీవు హవ్యవాహకుఁడవు. విద్వాంసుఁడవు. నీవు మోదయిత్రియు,
నాస్యస్థానీయయునగు జిహ్వవలన మాకు ధనము నొసంగుము! నేను
హవిష్మంతుఁడను. నీవు హవ్యదాతకుఁ గర్మను బ్రేరేపించుము! ॥ 136

(10) గద్యము॥

ఓ యువతముఁడా! యెవరు మహాయశస్సునుగోరి సాధకాశ్వరూపమగు హవ్యము
నిచ్చెదరో! వారి పాపమును నీవు కొట్టుము. *శతనగరములద్వారా పరిపాలింపుము! ॥ 137

---

* ఆర్యులు గ్రామములనేకాక పట్టణములనుగూడఁ గట్టుకొని యందుఁగాపురములనుగూడఁ జేయుచుండిరి.
వేదకాలమున నాగరికత కలదు. కాని పౌరాణిక నాగరికతకంటె భిన్నముగా నుండెను.
వేదకాలమున నున్నవారికి వాస్తుశాస్త్రము తెలియును. ( నే. వేం. న. శా. )

(11) గద్యము॥

ధనదాత యగు నగ్నిదేవుఁడు మా పూర్ణ స్రుక్కులను గోరును. నీవు సోమరసమునఁ బాత్రలనింపుము! సోమరసము నీయుము! అనంతరముఁ డగు నగ్నిదేవుఁడు మమ్ము వహించును ॥ 138

(12) గద్యము॥

దేవతలు ప్రకృష్టమతి యగు నగ్నిని యజ్ఞవాహకునిగాను, హోతగాను జేయుదురు. అగ్ని పరిచరు లగు హవ్యదాతలకు వీర్యయుతంబులగు రత్నముల నొసంగును ॥ 139

## సూక్తమ్—17

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా— అగ్నిః

ఛందః— ద్విపదా త్రిష్టుప్

(1) అగ్నే భవ సుషమిధా సమిద్ధ[1] ఉత బర్హిరుర్వియా వి స్తృణీతామ్ ॥ 139

(2) ఉత ద్వారః[2] ఉశతీర్వి శ్రయన్తాముత దేవాగ్ం[3] ఉశత ఆ వహేహ ॥ 140

(3) అగ్నే వీహి హవిషా యక్షి దేవాన్ త్స్వధ్వరా [4]కృణుహి జాతవేదః ॥ 141

---

1. సమిద్ధఽఉతబర్హిః, 2. ద్వారఽఉశతీ, 3. దేవాగ్ంఽఉశతఽఆవహేహ, 4. వృణుహి. [వా.ప్ర.]

(4) స్వధ్వరా కరతి జాతవేదా యక్షద్ దేవాగ్ం[1] అమృతాన్ పిప్రియచ్చ ॥ 142

(5) వంస్వ విశ్వా వార్యాణి ప్రచేతః సత్యా భవన్త్వాశిషో నో[2] అద్య ॥ 143

(6) త్వాము తే దధిరే హవ్యవాహం దేవాసో[3] అగ్న ఊర్జ ఆ నపాతమ్ ॥ 144

(7) తే తే దేవాయ దాశతః స్యామ మహో నో రత్నా వి దధ[4] ఇయానః ॥ 145

## సూక్తము—17

ఋషి— మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—అగ్ని

(1) గీ॥ అగ్ని! శోభన సమిధల నతివికాస
మానుండవు కమ్ము! ప్రీతిని బొంది నీవు
దీక్ష నధ్వర్యు లెల్లరు దివ్యకుశలఁ
బరచెదరుగాక! నీకయి భక్తితోడ ॥ 140

(2) గద్యము ॥

దేవాభిలాషులగు ద్వారసమూహముల నాశ్రయింపుఁడు! యజ్ఞమును గాంక్షించు దేవతల
నీ యజ్ఞమునకుఁ గొనితెమ్ము! ॥ 141

---

1. దేవాగ్ంఽఅమృతాన్, 2. నోఽఅద్య, 3. దేవాసోఽఅగ్నఽఊర్జఽఆ 4. దధఽఇయానః. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

జాతవేదుఁడా! యగ్ని! దేవాభిముఖముగఁ బొమ్ము! హవ్యముచే దేవయాగమును జేయుము! వారిని శోభన యాగవంతులుగా నొనర్చుము! ॥ 142

(4) గద్యము॥

జాతవేదుఁడు నమరు లగు దేవతలను సుందరయజ్ఞవంతులుగా నొనర్చుఁగాక! ప్రీతులుగాఁ జేయుఁగాక! ॥ 143

(5) గద్యము॥

ఓ మతిమంతుఁడా! సమస్తవరణీయధనము నిమ్ము! ఆశీర్వాదములు మాకు సత్యము లగును ॥ 144

(6) గద్యము॥

ఓ యగ్ని! నీవు బలపుత్రుఁడవు! దేవతలు నిన్ను హవ్యవాహకునిగాఁ జేసిరి ॥ 145

(7) గద్యము॥

నీవు ద్యోతమానుఁడవు! నీకు మేము హవ్య మొసంగెదము. నీవు మహాత్ముఁడవు. ఉపగమ్యుఁడవు. మాకు రత్నములు నిమ్ము! ॥ 146

## అనువాకః—2, సూక్తమ్—18

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా —ఇన్ద్రః, 22–25–సుదాః పైజవనః
ఛందః — త్రిష్టుప్

(1) త్వే హ యత్ పితరశ్చిన్న[1] ఇన్ద్ర విశ్వా వామా జరితారో[2] అసన్వన్ ।
త్వే గావః సుదుఘాస్త్వే హ్యశ్వా స్త్వం వసు దేవయతే వనిష్ఠః ॥ 146

---

1. పితరశ్చిన్నఽఇన్ద్ర, 2. జరితారోఽఅసన్వన్. (ప్రా.ప్ర.)

(2) రాజేవ హి జనిభిః క్షేష్యేవాఽవ[1] ద్యుభిరభి విదుష్కవిః సన్ ।
పిశా గిరో మఘవన్ గోభిరశ్వైస్త్వాయతః శిశీహి రాయే[2] అస్మాన్ ॥ 147

(3) ఇమా[3] ఉ త్వా పస్పృధానాసో[4] అత్ర మన్ద్రా గిరో దేవయన్తీరుప స్థుః ।
అర్వాచీ తే పథ్యా రాయ[5] ఏతు స్యామ తే సుమతావిన్ద్ర శర్మన్ ॥ 148

(4) ధేనుం న త్వా సూయవసే దుదుక్షన్నుప బ్రహ్మాణి ససృజే వసిష్ఠః ।
త్వామిన్మే గోపతిం విశ్వ[6] ఆహాఽఽ న ఇన్ద్రః సుమతిం గన్త్వచ్ఛ ॥ 149

(5) అర్ణాంసి చిత్ పప్రథానా సుదాస[7] ఇన్ద్రో గాధాన్యకృణోత్ సుపారా ।
శర్ధన్తం[8] శిమ్యుముచథస్య నవ్యః శాపం సిన్ధూనామకృణోదశస్తీః ॥ 150

(6) పురోళా[9] ఇత్ తుర్వశో యక్షురాసీద్ రాయే మత్స్యాసో నిశితా[10] అపీవ ।
శ్రుష్టిం చక్రుర్భృగవో ద్రుహ్యవశ్చ సఖా సఖాయమతరద్ విషూచోః ॥ 151

---

1. క్షేష్యేవాఽవ, 2. రాయేఽఅస్మాన్, 3. ఇమాఽఉ త్వా, 4. నాసోఽఅత్ర, 5. రాయఽఏతు, 6. విశ్వఽఆహా నఽఇన్ద్రః, 7. సుదాసఽఇన్ద్రో, 8. శర్ధతం, 9. పురోళాఽఇత్, 10. నిశితాఽఅపీవ. [వ్రా.ప్ర.]

(7) ఆ పక్థాసో[1] భలానసో భనన్తా ఽలినాసో విషాణినః శివాసః ।

ఆ [2]యోఽనయత్ సధమా ఆర్యస్య గవ్యా తృత్సుభ్యో[3] అజగన్ యుధా నౄన్ ॥ 152

(8) దురాధ్యో[3] అదితిం స్రేవయన్తో ఽచేతసో వి జగృభ్రే పరుష్ణీమ్ ।

మహ్నావివ్యక్ పృథివీం పత్యమానః పశుష్కవిరశయచ్చాయమానః ॥ 153

(9) [4]ఈయురర్థం న న్యర్థం పరుష్ణీమాశుశ్చనేదభిపిత్వం జగామ ।

సుదాస ఇన్ద్రః సుతుకాఁ అమిత్రానరన్ధయన్మానుషే వధ్రివాచః ॥ 154

(10) ఈయుర్గావో న యవసాదగోపా యథాకృతమభి మిత్రం చితాసః ।

పృశ్నిగావః పృశ్నినిప్రేషితాసః శ్రుష్టిం చక్రుర్నియుతో రన్తయశ్చ ॥ 155

(11) ఏకం చ యో వింశతిం చ [5]శ్రవస్యా వైకర్ణయోర్జనాన్ రాజా న్యస్తః ।

[6]దస్మో న సద్మన్ ని శిశాతి బర్హిః శూరః సర్గమకృణోదిన్ద్ర[7] ఏషామ్ ॥ 156

---

1. ఆ పక్థాసో, 2. ఆ యోనయత్సధమాఽఆర్యస్య, 3. తృత్సుభ్యోఽఅజగన్, 4. ఈయురర్థం,
5. శ్రవస్యావైకర్ణ, 6. దస్మో, 7. దిన్ద్రఽఏషామ్. [వా.ప్ర.]

(12) అధ శ్రితం కవషం వృద్ధమప్స్వను ద్రుహ్యుం ని వృణగ్వజ్రబాహుః ।
వృణానా[1] అత్ర సఖ్యాయ సఖ్యం త్వాయన్తో యే[2] అమదన్నను త్వా ॥ 157

(13) వి సద్యో విశ్వా దృంహితాన్యేషామిన్ద్రః పురః సహసా సప్త దర్దః ।
వ్యానవస్య తృత్సవే గయం భాగ్జేష్మ పూరుం విదథే మృధ్రవాచమ్ ॥ 158

(14) ని [3]గవ్యవోఽనవో ద్రుహ్యవశ్చ షష్టిః శతా సుషుపుః షట్ సహస్రా ।
షష్టిర్వీరాసో అధి షడ్ దువోయు విశ్వేదిన్ద్రస్య వీర్యా కృతాని ॥ 159

(15) ఇన్ద్రేణైతే తృత్సవో [4]వేవిషాణా ఆపో న సృష్టా అధవన్త నీచీః ।
దుర్మిత్రాసః ప్రకలవిన్మిమానా జహుర్విశ్వాని భోజనా సుదాసే ॥ 160

(16) అర్ధం వీరస్య శృతపామనిన్ద్రం పరా శర్ధన్తం నునుదే[5] అభి క్షామ్ ।
ఇన్ద్రో మన్యుం మన్యుమ్యో[6] మిమాయ భేజే పథో వర్తనిం పత్యమానః ॥ 161

---

1. వృణానాఽఅత్ర, 2. యేఽఅమ, 3. గవ్యవోనవో, 4. వోవిషాణాఽఆపో న సృష్టాఽఅధ,
5. నునుదేఽఅభి, 6. మన్యుభ్యో. (బ్రా.ప్ర.)

(17) ఆధ్రేణ చిత్ తద్వేకం చకార సింహ్యం చిత్ పేత్వేనా జఘాన ।

అవ స్రక్తీర్వేశ్యావృశ్చదిన్ద్రః ప్రాయచ్ఛద్ విశ్వా భోజనా సుదాసే ॥ 162

(18) శశ్వన్తో హి శత్రవో రారధుష్టే భేదస్య చిచ్ఛర్ధతో విన్ద [1]రన్ధిమ్ ।

మర్తాగ్ం[2] ఏనః స్తువతో యః కృణోతి తిగ్మం[3] తస్మిన్ ని జహి వజ్రమిన్ద్ర ॥ 163

(19) ఆవదిన్ద్రం యమునా తృత్సవశ్చ ప్రాత్ర భేదం సర్వతాతా ముషాయత్ ।

అజాసశ్చ శిగ్రవో యక్షవశ్చ బలిం శీర్షాణి జభ్రురశ్వ్యాని ॥ 164

(20) న త ఇన్ద్ర సుమతయో న రాయః సంచక్షే పూర్వా[4] ఉషసో న నూత్నాః ।

దేవకం చిన్మాన్యమానం జఘన్థాఽవ త్మనా బృహతః శమ్బరం భేత్ ॥ 165

(21) ప్ర యే గృహాదమమదుస్త్వాయా పరాశరః శతయాతుర్వసిష్ఠః ।

న తే భోజస్య సఖ్యం మృషన్తాఽధా సూరిభ్యః [5]సుదినా వ్యుచ్ఛాన్ ॥ 166

---

1. రన్ధి, 2. మర్తా ఏనః, 3. తిగ్మం, 4. పూర్వాఽఉషసే, 5. సుదినా వ్యుచ్ఛాన్. (వా.ప్ర.)వ్యుచ్ఛాన్. (సా)

(22) ద్వే నప్తుర్దేవవతః శతే గోర్ద్వా రథా వధూమన్తా సుదాసః ।
అర్హన్నగ్నే పైజవనస్య దానం హోతేవ సద్మ పర్యేమి రేభన్ ॥ 167

(23) చత్వారో మా పైజవనస్య దానాః స్మద్దిష్టయః కృశనినో నిరేకే ।
ఋజ్రాసో మా పృథివిష్ఠాః[1] సుదాసస్తోకం తోకాయ శ్రవసే వహన్తి ॥ 168

(24) యస్య శ్రవో రోదసీ[2] అన్తరుర్వీ శీర్ష్ణేశీర్ష్ణే విబభాజా విభక్తా ।
సప్తేదిన్ద్రం[3] న స్రవతో గృణన్తి ని యుధ్యామధిమశిశాదభీకే ॥ 169

(25) ఇమం నరో మరుతః [4]సశ్చతాను దివోదాసం న పితరం సుదాసః ।
అవిష్టనా పైజవనస్య కేతం[5] దూణాశం క్షత్రమజరం దువోయు ॥ 170

---

1. పృథివిష్ఠానుదాస, 2. రోదసీఽఅన్త, 3. సప్తోదిన్ద్రం, 4. సశ్చతాను, (వ్రా.ప్ర.) 5. కేతం. (సా.మా.)

## అనువాకము—2, సూక్తము—18

ఋషి—మైత్రావరుణి యగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రుఁడు, 22 — 25 — సుదాసరాజుయొక్క యజ్ఞ స్తవము

(1) గద్యము॥

ఓయీ! యింద్రుఁడా! మా పితృగణము నిన్ను స్తుతించుచు నీవలన సమస్తధనమును బొందినారలు. నీవలన గోవులు సుఖదోహనక్షయము లగుచున్నవి. నీవల్లనే యశ్వము లున్నవి. మరియు దేవాభిలాషులకు వ్యక్తులకు నధికము ధన మొసంగుము! ॥ 147

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు *జాయలతో రాజు మాట్కి దీప్తిసహితుఁడవై నివసింపుము! ఓ మఘవానుఁడా! నీవు విద్వాంసుఁడవు, కవివి,యగుచు స్తోతలకు రూప మిమ్ము! గోవులమూలమునను, నశ్వముల మూలమునను రక్షింపుము! మేము నిన్నుఁ గోరుచున్నాము. మమ్ము ధనమువిషయమై సంస్కృతులుగాఁ జేయుము! ॥ 148

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! స్పర్థమానములు, వరణీయములు నగు స్తుతు లన్నియు నీ సమీపమును జేరును. నీ ధనము మా చెంతకు వచ్చుఁగాక! నీ యనుగ్రహమువలన సుఖవంతుల మగుదుము ॥ 149

(4) గద్యము॥

సుతృణ విశిష్టమగు ధేనువుభంగి నిన్ను దోహనముఁజేయఁ గోరి వసిష్ఠుఁడు స్తోత్రము చేయుచున్నాఁడు. లోకమంతయు నిన్ను గోపతి వని పలుకెదరు. ఓ యింద్రుఁడా! మాకు సుస్థితి కలుఁగుఁగాక! ॥ 150

---

*జాయలతో రాజుమాట్కి నను వాక్యమువలన రాజునకు బహువల్లభత్వ మున్నట్లు ప్రమాణ మిచటఁ గలదు. ( నే. వేం. న. శా. )

(5) గద్యము॥

స్తుతియోగ్యుఁడగు నింద్రుఁడు నదులను బ్రథితములుగాఁ జేయుచు సునికై తలస్పర్శ యోగ్యలుగాను, సుఖపారయోగ్యలుగాను జేయుచున్నాఁడు ॥ 151

(6) గద్యము॥

యజ్ఞశీలుఁడు, దానకారియగు తుర్వశుఁ డనురాజు గలఁడు. అతఁడు మత్స్యమువలె నియంత్రితుఁడైనచో భృగువులు, ద్రుహ్యులు ధనార్థమై సుదాసునకుఁ దుర్వశునకుఁ బరస్పరము సాక్షాత్కారమును గల్పించిరి. వ్యాప్తిశీలు రగు నా యుభయులు సఖుని వధించిరి. ॥ 152

(7) గద్యము॥

హవ్యసమూహపాచకుఁడు, భద్రముఖుఁడు, విషాణహస్తుఁడు, మంగళకరుఁడు నగు వ్యక్తి యింద్రు స్తుతించును. ఇంద్రుఁడు సోమపానమత్తుఁడై యార్యుల గో సమూహమును హింసకుల వశమునుండి తెచ్చెను. స్వయముగ లాభమును గూర్చెను. యుద్ధముల మనుష్యుల వధించెను ॥ 153

(8) గద్యము॥

దురభిసంధు లగు మందమతులు ఖనన మొనర్చుచు మహానదివలెఁ గూలములను భేదించిరి. సుదాసుఁడు మహిమచేఁ బృథ్విని నిందించెను. భయమానపుత్రుఁ డగు కవి, పాలిత పశువువలె శయనించెను ॥ 154

(9) గద్యము॥

నదీజలము గంతవ్యప్రదేశాభిముఖముగ నదీద్వారా పారును. అగంతవ్యప్రదేశాభిముఖముగఁ బ్రవహించదు. అటులనే సుదాసుని యశ్వము గమ్యప్రదేశమునకే చనును. ఇంద్రుఁడు సుదాసునకు మనుష్యమధ్యమున నపత్యవిశిష్టులు జల్పకులు నగు మిత్రులను వశపరచెను ॥ 155

(10) గద్యము॥

† రక్షకవిహీన గోవులు యవలనిమిత్తమై పోవునటుల మాతృప్రేరిత మగు నేకత్రితమరుద్గణము మొదటఁ జేసిన ప్రతిజ్ఞానుసారము మిత్రుఁ డింద్రాభిముఖముగ నటులే పోయెను ॥ 156

(11) గద్యము॥

సుదాసుఁడనెడు రాజు యశోలాభమునకై రెండు *జనపదములలో నేకవింశజనులను వినాశ మొనర్చెను! యజ్ఞగృహమందు యువకుఁడగు నధ్వర్యుఁడు కుశల నెట్లు ఛేదించునో! యటులనే వాఁడు శత్రువులను ఛేదించును. శూరుఁ డగు నింద్రుఁడు వారికై మరుద్గణములను బ్రసవించెను ॥ 157

(12) గద్యము॥

మరియు వజ్రబాహు వగు నింద్రుఁడు శ్రుతుని, గవషుని, వృద్ధుని, ద్రుహ్యుని, నానుపూర్వ్య రూపమున జలమధ్యమున ముంచివేసెను. ఆ సమయమున నెవ్వరో! వానినిఁ గోరుచు స్తుతించిరి. వారు సఖ్యమునకు వరించి, సఖ్యలాభము నొనర్చిరి ॥ 158

(13) గద్యము॥

ఇంద్రుఁడు నిజబలముచే వారి దృఢపురములను వాటి ‡సప్తప్రాకారములను తత్క్షణమే ఛేదించెను! అసురపుత్రుల గృహములను ద్వత్సునకు దాన మొసంగెను. అందువలన నేను దుష్టవాక్యములను శత్రువులను జయింప సమర్థుఁడను ॥ 159

---

† ఇప్పటివలె వేదకాలమందును మనుష్యరక్షక హీనములగు నాలపోతులు మొదలగునవి పొలములఁగల సస్యములను విచ్చలవిడిగాఁ దినుచుఁ దిరుగుచుండెడి వని దీనివలనఁ దెలియ నగును. (నే.వేం.న.శా.)

* ఆ నాఁడె పల్లీగ్రామము లున్నట్లు సూచన కలదు (నే.వేం.న.శా.)

‡ ఆ నాఁడు సప్తప్రాకారములుఁ గల పురములు గలవు. శత్రువులవల్లఁ మృగములకు హాని కలుగకుండ నీ ప్రాకారములను గట్టియున్నట్లు తలంపవచ్చును. ఆహా ! యార్యులు శత్రువులవలన నెంత బాధపడిరో కదా ! (నే. వేం. న. శా.)

(14) గద్యము॥

అసురులు, ద్రుహ్యుని గోవులను గోరువాసును, షష్టిశత సంఖ్యాకులు, షట్సహస్ర
సంఖ్యాకులు, షడధికషష్టి సంఖ్యాకులు నగు పుత్రులు పరిచర్యాభిలాషియగు
సుదాసునికై శయనించినారు. ఈ సర్వకార్యములు నింద్రుని వీర్యసూచకములు॥ 160

(15) గద్యము॥

దుష్టమిత్రవిశిష్టులగు నీ యజ్ఞాన తృత్సుగణ మింద్రునితో యుద్ధమందుఁ దలపడి
పరిగిడుచు నిమ్నగామి యగు జలమువలెఁ బరువెత్తిరి! బాధాప్రాప్తులై సుదాసునకు
సర్వభోగ్య వస్తువుల నొసంగెను ॥ 161

(16) గద్యము॥

వీర్యవంతుఁడగు సుదాసును హింసించెడువారు నింద్రరహితులు, హవ్యదాతలు, నుత్సాహ
మానులు నగు వ్యక్తులను నింద్రుఁడు భూమినుండి ప్రేరేపించెను! వాఁడు క్రోధకారులకుఁ
గ్రోధజనితబాధను గలిఁగించును! సుదాసుఁడు శత్రువుల మార్గమందు నడచుచుఁ
బారిపోవుటకు మార్గమును గనిపెట్టెను ॥ 162

(17) గద్యము॥

ఇంద్రుఁడు దరిద్ర సుదాసునిచేఁ గార్యములను జేయించెను. ఛాగమువలన సింహమును
జంపించెను! సూచిచేత యూపాదులను జెక్కించెను! సమస్త ధనమును
సుదాసుకు దాన మొసంగెను ॥ 163

(18) గద్యము॥

ఓయి! యింద్రుఁడా! నీకు బహుతర శత్రులు వశీభూతు లయిరి! ఉత్సాహవంతుఁ డగు భేదుని
వశ్యునిగా నొనర్చుము! ఎవ్వఁడు నిన్ను స్తుతింపఁడో! వాఁడే భేదుఁడు! వాని కనిష్టము
గూర్చుము! వానికి విరుద్ధముగా నిశితయోద్ధను బుట్టింపుము! ॥ 164

(19) గద్యము॥

ఈ యుద్ధమందు నింద్రుఁడు భేదుని నశింపఁజేసెను! యముఁడు వానిని సంతుష్టునిగాఁ జేసెను! †అజము, శిగ్రువు, యక్షువు నను మూఁడు జనపదములు నింద్రు నుద్దేశించి యశ్వముయొక్క మస్తకమును నుపహారముగా నిచ్చెను ॥ 165

(20) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ పురాతనానుగ్రహము, ధనము, వర్ణనాతీతములు. నూతనానుగ్రహము, ధనమును, వర్ణనాతీతములు. నీవు మన్యమాన్యమానపుత్రుఁడగు దేవకుని వధించితివి. స్వీయముగా మహాశైలమునుండి శంబరుని భేదించితివి ॥ 166

(21) గద్యము॥

ఓ యింద్రుఁడా! యెవనిని ననేకరాక్షసులు హింసించుటకు నిచ్ఛగింతురో! యా పరాశరవసిష్ఠుఁడు నిన్నుఁ గాంక్షించి గృహమునకు వచ్చుచు నిన్ను స్తుతించెను. వాఁడు నీ సఖ్యమును మరువరేదు. నీవు భోజుని మరుచుటలేదని పలికితివి. వానికి సర్వదా సుదినము లుండును ॥ 167

(22) గద్యము॥

ఓ దేవశ్రేష్ఠుఁడా! దేవవంతుఁ డను రాజు పౌత్రుఁడు పిజవనపుత్రుఁడు సుదాసువలన రెండు వందలగోవులు, రెండు రథములు నే నింద్రుని స్తుతించి పొందితిని.
హోత యజ్ఞగృహమునకుఁ బోవునట్టు నేను వెళ్ళితిని ॥ 168

(23) గద్యము॥

దానాంగదత్తుఁడు స్వర్ణాలంకారయుతుఁడునై దుర్గతినుండి ఋజుగామియుఁ బృథివీస్థితుఁడుఁ బిజవనసుతుఁడునగు సుదాసుఁ డిచ్చిన నాలు గశ్వములు పుత్రవత్సాలనీయుఁడగు వసిష్ఠుని పుత్రాన్నార్థమై వహించెను ॥ 169

---

†అజము, శిగ్రువు, యక్షువు నను నవి దేశములు కాని యా దేశనామములు నశించి యా దేశములు భిన్ననామములతోఁ బిలువఁబడుచునుండు. అయ్యవి యిప్పు డేదేశనామములతో వ్యవహరింపఁబడుచుండెనో: నిర్ణయించుట దుస్తరము. (నే.వేం.న.శా.)

(24) గద్యము॥

ఏ సుదాసుని యశస్సు ద్యావాపృథివీమధ్య మున్నదో! యే దాతృశ్రేష్ఠుఁడు శ్రేష్ఠవ్యక్తులకు ధనము నొసంగునో! సప్తలోకములు నా వ్యక్తిని నింద్రునివలె స్తుతించును. నదులు యుద్ధమందు యుధ్యామధినామకుఁ డగు శత్రువును నశింపఁజేసెను ॥ 170

(25) గద్యము॥

ఓ నేత లగు మరుత్తులారా! యీ సుదాసరాజు తండ్రి దివోదాసునివలె మీరు వానిని సేవింపుఁడు! పిజవనపుత్రుని గృహమును గాపాడుము! వానిబలము వినాశరహితమును నశిథిలమును నగును ॥ 171

## సూక్తమ్—19

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — ఇన్ద్రః
ఛందః — త్రిష్టుప్

(1) యస్తిగ్మశృంగో వృషభో న భీమ[1] ఏకః కృష్టీశ్చ్యావయతి ప్ర విశ్వాః ।
యః శశ్వతో[2] అదాశుషో గయస్య ప్రయన్తాసి సుష్వితరాయ వేదః ॥ 171

(2) త్వం హ[3] త్యదిన్ద్ర కుత్సమావః శుశ్రూషమాణస్తన్వా సమర్యే ।
దాసం యచ్ఛుష్ణం కుయవం న్యస్మా[4] అరన్ధయ ఆర్జునేయాయ శిక్షన్ ॥ 172

1. భీమఽఏకః, 2. శశ్వతోఽఅదా, 3. హ త్యాదిన్ద్ర, 4. న్యస్మాఽఅరన్ధయఽఆర్జునే. (ప్రా.ప్ర.)

(3) త్వం ధృష్ణో ధృషతా వీతహవ్యం ప్రావో విశ్వాభిరూతిభిః సుదాసమ్ ।
ప్ర పౌరుకుత్సిం త్రసదస్యుమావః క్షేత్రసాతా వృత్రహత్యేషు పూరుమ్ ॥ 173

(4) త్వం నృభిర్నృమణో దేవవీతౌ భూరీణి వృత్రా హర్యశ్వ[1] హంసి ।
త్వం ని దస్యుం చుమురిం ధునిం [2]చాఽస్వాపయో దభీతయే సుహన్తు ॥ 174

(5) తవ చ్యౌత్నాని వజ్రహస్త తాని నవ యత్ పురో నవతిం చ సద్యః ।
నివేశనే శతతమావివేషీరహంచ వృత్రం నముచిముతాహన్ ॥ 175

(6) సనా తా [3] ఇన్ద్ర భోజనాని రాతహవ్యాయ దాశుషే సుదాసే ।
వృష్ణే తే హరీ వృషణా యునజ్మి వ్యన్తు బ్రహ్మాణి[4] పురుశాక వాజమ్ ॥ 176

(7) మా తే అస్యాం సహసావన్ పరిష్టావఘాయ భూమ హరివః పరాదై ।
త్రాయస్వ [5]నోఽవృకేభిర్వరూథై స్తవ ప్రియాసః సూరిషు స్యామ ॥ 177

---

1. హర్యశ్చ, 2. చాస్వాపయో, 3. తఽఇన్ద్ర, 4. బ్రహ్మాణి, 5. యస్వ నోవృకే. [వా.ప.]

(8) ప్రియాస ఇత్ తే మఘవన్నభిష్టౌ నరో మదేమ శరణే సఖాయః ।
ని తుర్వశం ని యాద్వం శిశీహ్యతిథిగ్వాయ శంస్యం కరిష్యన్ ॥ 178

(9) సద్యశ్చిన్ను తే మఘవన్నభిష్టౌ నరః శంసన్త్యుక్థశాస[1] ఉక్థా ।
యే తే హవేభిర్వి [2]పణీగ్ంరదాశన్నస్మాన్ వృణీష్వ యుజ్యాయ తస్మై ॥ 179

(10) ఏతే స్తోమా నరాం నృతమ తుభ్యమస్మద్ర్యంచో దదతో మఘాని ।
తేషామిన్ద్ర వృత్రహత్యే శివో భూః సఖా చ శూరోఽవితా చ నృణామ్ ॥ 180

(11) నూ ఇన్ద్ర శూర స్తవమాన [3]ఊతీ బ్రహ్మజూత స్తన్వా [4]వావృధస్వ ।
ఉప నో వాజాన్ మిమీహ్యుప స్తీన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 181

ఇతి
పంచమోఽష్టకే ద్వితీయోఽధ్యాయ
స్సమాప్తః

---

1. శాసఽఉక్థా, 2. పణీగ్ంఽరదాన్నస్మాన్, 3. మానఽఊతీ, 4. వావృధస్య. (ప్రా.ప్ర.)

## సూక్తము—19

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఎవ్వఁడు తీక్ష్ణశృంగములుగల వృషభమువలె భయంకరుఁడై యేకాకియై శత్రువులను స్థానభ్రష్టులుగా నొనర్చునో! యెవ్వఁడు హవ్యరహితుల గృహముల నపహరించునో! యా యింద్రుఁ డత్యంతసోమాభిషవకారులకు ధన మొసంగుఁగాక! ॥ 172

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వేకారణమున నర్జునీపుత్రుఁ డగు కుత్సునకు ధనము నిచ్చుచు దాసుని, శుష్ణుని, గుయవుని వశీభూతులుగాఁజేసితివో! యా కారణమున శరీరముచే శుశ్రూషమానుఁడవై యుద్ధమందుఁ గుత్సుని రక్షించితివి ॥ 173

(3) గద్యము॥

ఓ ధర్షకుఁడా! హవ్యదాతయగు సుదాసుని ధర్షకరాజ్యముద్వారా సమస్తరక్షారహిత మగు రక్ష నొసంగుము! యుద్ధమందు భూలాభమునకై పురుకుత్సపుత్రుఁ డగు నీ సదస్యుని బూరుపును సంరక్షింపుము! । 174

(4) గద్యము॥

నేతృస్తుతియోగ్యుఁడ వగు నింద్రుఁడా! నీవు సంగ్రామమందు మరుద్గణములతో బహువృత్రగణములను వధించితివి. ఓ హరిద్యుక్తుఁడా! నీవు దధీతినిమిత్తము, దస్యుని, జమూరిని, ధునికుని, వజ్రముద్వారా చంపితివి ॥ 175

(5) గద్యము॥

ఓ వజ్రహస్తుఁడా! నీ బల మిట్టిది. నీవు నవనవతి పురములను భేదించితివి! నివాసమునకై
శతతమ పురములను వ్యాపించితివి! వృత్రుని నముచిని సంహరించితివి! ॥ 176

(6) గద్యము॥

ఓ! యింద్రుఁడా! హవ్యదాతయు యజమానుఁడు నగు సుదాసునికై నీ ధనము
సనాతన మైనది. బహుకర్మ గలవాఁడా! నీ వభీష్టవర్షివి! నేను నీవిషయమై
యభీష్టవర్షు లగు నశ్వద్వయమును సమకూర్చుచున్నాను. నీవు బలవంతుఁడవు!
స్తోత్రములు నిన్నుఁ జెందునుగాక! ॥ 177

(7) గద్యము॥

ఓ బలవంతుఁడా! యశ్వవంతుఁడా! యీ నీ యజ్ఞమందుఁ బరదానభాగులము కాని
పాపభాగులము కాము. మాకు బాధారహిత మగు రక్షవలన నవన మొసంగుము!
స్తోతలలో నేను బ్రియుఁడ నయ్యెదను! ॥ 178

(8) గద్యము॥

ఓ ధనవంతుఁడా! నీ యజ్ఞమందు నేనే నేతను. నేనే సఖుఁడనునై గృహమందు సంతుష్టుఁడ
నగుదును. నీ వతిథివత్సలసుదాసునకు సుఖసంపాదనమును జేయుచుఁ దుర్వశుని
వశ్యునిగాఁజేయుము! యాద్వను! వశీభూతునిగా నొనర్పుము! 179

(9) గద్యము॥

ఓ ధనవంతుఁడా! నీ యజ్ఞమునందు నేను నేతను. ఉక్థోచ్చారణకారిని. ఇపు డుక్థమును
నుచ్చరించుచున్నాను. నీవు హవ్యముచేఁ బణిగణములకు ధనము నిమ్ము! నన్ను
సఖునిగాఁ బరిగ్రహింపుము! 180

(10) గద్యము॥

ఓ నేతృశ్రేష్ఠుఁడ వగు నింద్రుఁడా! యీ నేతల స్తుతి నీకుఁ బూజనీయ హవ్యమును దాన మిచ్చుచు మా కభిముఖముగ వచ్చుచున్నది. నీవు యుద్ధములం దా నేతలకుఁ గళ్యాణకరుఁడవు, సఖుఁడవు, శూరుఁడవు, రక్షకుఁడవు కమ్ము! ॥ 181

(11) గద్యము॥

శూరుఁడ వగు నింద్రుఁడా! యిపుడు నీవు స్తూయమానుఁడవు, స్తోత్రయుక్తుడవు నయి శరీరమును వృద్ధిఁబొందించుకొనుము! మాకు నన్నము నొసంగుము! గృహముల నిమ్ము! నీవు స్తుతులచే మమ్ముఁ బరిపాలింపుము! ॥ 182

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబా గర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమున ద్వితీయాధ్యాయము
సంపూర్ణము



# సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## సప్తమం మండలమ్

### పంచమోఽష్టకః—తృతీయోఽధ్యాయః

### సూక్తమ్—20

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః — త్రిష్టుప్

(1) ఉగ్రో జజ్ఞే వీర్యాయ స్వధావాంచక్రిరపో నర్యో యత్ కరిష్యన్ ।

జగ్మిర్యువా నృషదనమవోభిస్త్రాతా [1]న ఇన్ద్ర ఏనసో మహశ్చిత్ ॥ 182

(2) [2]హన్తా వృత్రమిన్ద్రః శూశువానః ప్రావీన్ను వీరో జరితారమూతీ ।

కర్తా సుదాసే[3] అహ వా ఉ లోకం దాతా వసు ముహురా దాశుషే భూత్ ॥ 183

---

1. నఽఇన్ద్రఽఏనసో, 2. హతం, 3. సుదాసేఽఅహ వాఽఉ లోకం. (ౘ్రా.ప్ర.)

(3) యుధ్మో[1] అనర్వా ఖజకృత్ సమద్వా శూరః సత్రాషాడ్ [2]జనుషేమషాళ్హః ।
వ్యాస[3] ఇన్ద్రః పృతనాః స్వోజా[4] అధా విశ్వం శత్రూయన్తం జఘాన ॥ 184

(4) ఉభే చిదిన్ద్ర రోదసీ మహిత్వా[5] ఽఽ పప్రాథ తవిషీభిస్తువిష్మః ।
ని వజ్రమిన్ద్రో హరివాన్ మిమిక్షన్ త్సమన్ధసా మదేషు [6]వా ఉవోచ ॥ 185

(5) వృషా జజాన వృషణం రణాయ తము చిన్నారీ నర్యం ససూవ ।
ప్ర యః సేనానీరధ నృభ్యో [7]అస్తీనః సత్వా గవేషణః స ధృష్ణుః ॥ 186

(6) నూ చిత్ స భ్రేషతే జనో న రేషన్ మనో యో[8] అస్య ఘోరమావివాసాత్ ।
యజ్ఞైర్య[9] ఇన్ద్రే దధతే దువాంసి క్షయత్ స రాయ[10] ఋతపా ఋతేజాః ॥ 187

(7) యదిన్ద్ర పూర్వో[11] అపరాయ శిక్షన్నయజ్జ్యాయాన్ కనీయసో [12]దేష్ణమ్ ।
అమృత[13] ఇత్ పర్యాసీత దూరమా చిత్ర చిత్ర్యం భరా రయిం నః ॥ 188

---

1. యుధ్మోఽఅనర్వాఖజ, 2. మషాళ్హః, 3. వ్యాసఽఇన్ద్రః, 4. స్వోజాఽఅధా, 5. మహిత్వాపప్రాథ
6. వాఽఉవోచ, 7. నృభ్యోఽఅస్తీనః, 8. యోఽఅస్య, 9. యజ్ఞైర్యఽఇన్ద్రే, 10. రాయఽఋతపాఽఋతేజాః,
11. పూర్వోఽఅపరాయ, 12. దేష్ణామ్, 13. అమృతఽఇత్. (ప్రా.ప్ర.)

(8) యస్త[1] ఇన్ద్ర ప్రియో జనో దదాశదసన్నిరేకే[2] అద్రివః సఖా తే ।
వయం తే అస్యాం సుమతౌ చనిష్ఠాః స్యామ వరూథే[3] అఘ్నతో నృపీతౌ ॥ 189

(9) ఏష[4] స్తోమో అచిక్రదద్ వృషా త[5] ఉత స్తాముర్మఘవన్నక్రపిష్ట ।
రాయస్కామో జరితారం త[6] ఆగన్ త్వమంగ శక్ర వస్వ[7] ఆ శకో నః ॥ 190

(10) స న[8] ఇన్ద్ర త్వయతాయా[9] ఇషే ధాస్త్మనా చ యే మఘవానో జునన్తి ।
వస్వీ షు తే జరిత్రే[10] అస్తు శక్తిర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 191

1. యస్తఽఇన్ద్ర, 2. రేకేఽఅద్రివః, 3. వరూథేఽఅఘ్నతో, 4. ఏషఃస్తోమోఽఅచిక్ర, 5. వృషా తఽఉత, 6. తఽఆగన్, 7. వస్వఽఆశకో, 8. నఽఇన్ద్రత్వ, 9. యాఽఇషే, 10. జరిత్రేఽఅస్తు. (ప్రా.ప్र.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము_తృతీయాధ్యాయము

### సూక్తము—20

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

బలవంతుఁడు నుగ్రుఁడు నగు నింద్రుఁడు వీర్యప్రకాశమునకై జనించినాఁడు. మనుష్యులకు హిత మొనర్చెడు నింద్రుఁ డేకర్మ మొనర్చుట కిచ్ఛగించునో! తప్పక యా కర్మఁ జేయును. యువ యాశ్రయ మిచ్చుటకు యజ్ఞగృహములకుఁ బోవువాఁడు నగు నింద్రుఁడు పాపములనుండి మమ్ము రక్షించును ॥ 183

(2) గద్యము॥

ఇంద్రుఁడు వర్ధమానుఁడై వృత్రుని వధించెను. వాఁ డాశ్రయదానార్థమై స్తోతలను రక్షించును. వాఁడు వీరుఁడు. సుదాసునికై జనపదత్రయమును నిర్మించెను. యజమానులకు మాటిమాటికి ధనము నొసంగును ॥ 184

(3) గద్యము॥

ఇంద్రుఁడు యోద్ధ. ప్రతిపక్షశూన్యుఁడు. కలహపరాయణుఁడు. శూరుఁడు. స్వభావముచే బహులోకాభిభావి. వాఁడు శత్రువులవలన ననభిభవనీయుఁడు. ప్రకృష్టబలసంయుతుఁడు. ఇంద్రుఁడే శత్రుసేనను గొట్టెను. ఎవరు శత్రుత్వముఁబూనెదరో! వాని నింద్రుఁడే సంహరించును ॥ 185

---

* వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోనున్న ఋషిదేవతల పట్టికలో 20వ సూక్తము మొదలు 29వ సూక్తమువరకును వైశ్వానరుఁడు ఋషిగాఁ బొరపాటున శ్రీ నేమానివారు వ్రాసిరి.

(4) గద్యము॥

బహుధనవంతుఁడ వగు నో యింద్రుఁడా! నీవు బలమువల్లను, మహిమవల్లను, ద్యావాభూములను
బరాభూతములుగా నొనర్చితివి. అశ్వవంతుఁడగు నింద్రుఁడు శత్రువులపై వజ్రములను
విసరుచు యజ్ఞములయందు సోమరససేవితుఁడగును ॥ 186

(5) గద్యము॥

పిత యజ్ఞార్థమై యభీష్టవర్షియగు నింద్రుని బుట్టించెను. నారీ మనుష్యులకు హిత మొసంగెడు
నింద్రుని బుట్టించెను. ఇంద్రుఁడు మనుష్యులకు సేనానియై ప్రభు వగుచున్నాఁడు.
వాఁ డీశ్వరుఁడు. శత్రు నివారకుఁడు. గో సహస్రములను నన్వేషించువాఁడు.
శత్రువులను దిరస్కరించువాఁడు ॥ 187

(6) గద్యము॥

ఏ వ్యక్తి యీ యింద్రునికి శత్రునాశక మనస్సుతోఁ బరిచర్యఁ గావించునో! యావ్యక్తి యే
స్థానము నుండియు భ్రష్టుఁడు కాఁజాలఁడు. ఏ వ్యక్తియందుఁ బరిచర్య సమర్పించునో!
యజ్ఞపాలకేంద్రుఁ డావ్యక్తికి ధనము నిచ్చుటకై పసించును ॥ 188

(7) గద్యము ॥

ఓ విచిత్రేంద్రుఁడా! పూర్వవర్తియగు వ్యక్తి పరవర్తికి నేది దానమిచ్చునో! జ్యేష్ఠుఁడు
కనిష్ఠునివలన నే దేయధనమును బొందునో ( ఏ ధనలాభమును బొంది )
యమృతమువలె దూరదేశమునకు వెడలునో! యీ మూఁడు విధములగు
ధనములు మా నిమిత్తము తెమ్ము! ॥ 189

(8) గద్యము॥

ఓ వజ్రధారీ! యింద్రుఁడా! నీ కే హవ్యదాత ప్రియసఖుఁడు హవ్యము నిచ్చునో! వాఁడు
నీ దానమునందే నిలిచియుండుఁగాక! నేను హింసఁజేయకుండ నీ యనుగ్రహమును
బడయుచు నన్నిటికంటె నధికతరుఁడను నన్నవంతుఁడను నయి మనుష్య
రక్షణ శీలములగు గృహములందు నుండ సమర్థుఁడ నగుదును ॥ 190

(9) గద్యము॥

ధనవంతుఁడ వగు నో యింద్రుఁడా! యీ సోమరసము నీ నిమిత్తము వర్షితమైయున్నది.
మరియు స్తోతలు నీ స్తవము చేయుచున్నారు. ఓ శక్రుఁడా! నేను నీ స్తోతను.
ధనాభిలాషకై మాకుఁ బ్రాప్తుఁడ వయితివి! కాఁబట్టి నీవు శీఘ్రముగ
మాకు వాసయోగ్య మగు ధనము నిమ్ము! ॥ 191

(10) గద్యము॥

ఓ యింద్రుఁడా! మమ్మలను ధరించుము! అందుచేత మేము త్వద్దత్తాన్నము ననుభవింపఁ
గలము. హవ్యదాతలు నిజముగ హవ్యము నిచ్చెదరు. వారిని ధరించుము! అత్యంత
ప్రశస్త స్తుతికార్యములందు మేము సమర్థుల మగుదుము. మేము నీ స్తోతలము.
నీవు మమ్ము సర్వదా స్తుతిచేఁ బరిపాలింపుము! ॥ 192

## సూక్తమ్—21

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — ఇన్ద్రః
ఛందః — త్రిష్టుప్

(1) అసావి దేవం [1]గోఋజీకమన్ధో న్యస్మిన్నిన్ద్రో జనుషేముచోచ[2] ।
[3]బోధామసి త్వా హర్యశ్వ యజ్ఞైర్బోధా నః స్తోమమన్ధసో మదేషు ॥ 192

(2) ప్ర యన్తి యజ్ఞం విపయన్తి బర్హిః సోమమాదో [4]విదథే దుధ్రవాచః ।
న్యు భ్రియన్తే యశసో గృభాదా [5]దూరఉపబ్దో వృషణో నృషాచః ॥ 193

---

1. గోఋజీక, 2. మువేచ, 3. బోధమసి, 4. విదేదుధ్ర, 5. దూరఉపబ్దో. (బ్రా.ప్ర.)

(3) త్వమిన్ద్ర స్రవితవా[1] అపస్కః పరిష్ఠితా అహినా శూర పూర్వీః ।
త్వద్ వావక్రే రథ్యో౩ న ధేనా రేజన్తే విశ్వా కృత్రిమాణి భీషా ॥ 194

(4) భీమో వివేషాయుధేభిరేషామపాంసి విశ్వా నర్యాణి విద్వాన్ ।
ఇన్ద్రః పురో జర్హృషాణో వి దూధోత్ వి వజ్రహస్తో మహినా జఘాన ॥ 195

(5) న యాతవ[2] ఇన్ద్ర జూజువుర్నో న వన్దనా శవిష్ఠ వేద్యాభిః ।
స శర్ధదర్యో విషుణస్య జన్తోర్మా శిశ్నదేవా అపి[3] గుర్ఋతం నః 196

(6) అభి క్రత్వేన్ద్ర భూరధ జ్మన్ న తే వివ్యఙ్ మహిమానం రజాంసి ।
స్వేనా హి వృత్రం శవసా జఘన్థ న శత్రురన్తం వివిదద్ యుధా తే ॥ 197

(7) దేవాశ్చిత్ తే[4] అసుర్యాయ పూర్వే[5] ఽను క్షత్రాయ మమిరే సహాంసి ।
ఇన్ద్రో మఘాని దయతే విషహ్యేన్ద్రం వాజస్య జోహువన్త సాతౌ ॥ 198

1. వాఽఅపస్కః, 2. యాతవఽఇన్ద్ర, 3. అపి గర్ఋతం నః, 4. తేఽఅసుర్యాయ,
5. పూర్వేనుక్షత్రా.(వ్రా.ప్ర.)

(8) కిరిశ్చిద్ధి త్వామవసే జుహావేశానమిన్ద్ర సౌభగస్య భూరేః ।
అవో బభూథ శతమూతే[1] అస్మే అభిక్షత్తుస్త్వావతో వరూతా ॥ 199

(9) సఖాయస్త[2] ఇన్ద్ర విశ్వహ స్యామ నమోవృధాసో మహినా తరుత్ర ।
వన్వన్తు స్మా [3]తేఽవసా సమీకే [4]ఽభీతిమర్యో వనుషాం శవాంసి ॥ 200

(10) స న ఇన్ద్ర త్వయతాయా[5] ఇషే ధాస్త్మనా చ యే మఘవానో జునన్తి ।
వస్వీ షు తే జరిత్రే[6] అస్తు శక్తిర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 201

## సూక్తము—21

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

దీప్త గవ్యమిశ్రితసోమ మభిషుత మయ్యెను. ఈ యింద్రుఁడు స్వభావముచే దీనిని బుచ్చుకొనును. ఓ హర్యశ్వుఁడా! నిన్ను స్తోత్రములచేఁ బ్రబోధింతుము. సోమరసముఁ ద్రావి మదించినపుడు మా స్తోత్రములను దెలిసికొనుము ॥ 193

---

1. మూతేఽఅస్మేఽఅభి, 2. యస్తఽఇన్ద్ర, 3. స్మా తేవసా, 4. సమీకేఽభీతి, 5. తాయాఽఇషే,

6. జరిత్రేఽఅస్తు (వ్రా.ప్ర.)

(2) క॥ యజమానుఁడు యజ్ఞమునకు
నిజముగఁ జనుచుండె దర్భ నెగడచు నుండెన్
యజనంబునఁ బ్రస్తరములు
భజనీయధ్వనినిజేసి పరగుచునుండెన్ ॥ 194

గీ॥ అన్నవంతుఁ డౌచు నతిదూరగామియు
నౌచు శబ్దసహితుఁ డౌచు ఋత్వి
జుండు వర్షకారి సుందరప్రస్తర
ములను గృహమునుండి యెలమిఁ దెచ్చు ॥ 195

(3) గద్యము॥

ఓ శూరుఁ డగు నింద్రుఁడా! నీవు వృత్రుని బంధించి జలమును బ్రేరేపించినావు. నీవు మంచివాఁడ వని సకలనదులు రథులవలె నిర్గతము లగుచున్నవి. సకల కృత్రిమ భువనములు భయముచే వడంకుచుండును ॥ 196

(4) గద్యము॥

ఇంద్రుఁడు మనుష్యులకు హిత మగు కర్మను దెలిసికొని యాయుధముచే భయంకరుఁడై శత్రుగణముల నాక్రమించుచున్నాఁడు. వారి నగరము లన్నియుఁ గంపించుచున్నవి. వాఁడు హృష్టుఁడు, మహిమయుతుఁడు, వజ్రహస్తుఁడునై వారిని వధించెను ॥ 197

(5) గద్యము॥

ఓ యింద్రుఁడా! రాక్షసులు మమ్ము హింసింపరు. బలవత్తమేంద్రుఁడా! రాక్షసులు మమ్ముఁ బ్రజలనుండి వేరుపరుపలేరు. స్వామి యగు నింద్రుఁడు విషమజంతువధవిషయమై యుత్సాహవంతుఁ డగును. శిశ్న దేవగణము మా యజ్ఞమునకు విఘ్నము చేయరు ॥ 198

(6) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు కర్మలద్వారా పృథ్వియందుఁగల జంతువులను దిరస్కరింపుము! లోక మంతయు నీ మహిమను వ్యాప్తమగునట్లు చేయఁజాలదు. నీవు నిజబలమున వృత్రుని సంహరించితివి. శత్రువులు యుద్ధములో నిన్ను జయింపలేరు॥ 199

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! పూర్వదేవగణములబలము ప్రాణివధవిషయమై నీ బలాపేక్షచే ననల్పము లనుమాట విదితమేగదా! ఇంద్రుఁడా! శత్రువులను బరాభవించి భక్తులకు ధన మిమ్ము! స్తోత లన్నమున కింద్రుని స్తుతించెదరు ॥ 200

(8) గద్యము॥

ఓ యింద్రా! నీ వీశానుఁడవు. స్తోత రక్షణమును గోరి నిన్నుఁ బిలుచుచున్నాఁడు. బహురక్షకేంద్రుండా! మా పరిభూతధనమునకు రక్షకుఁడ వగుము! నీతో సమానమగు నే వ్యక్తి మమ్ము హింసించునో! వానిని నివారింపుము! ॥ 201

(9) గద్యము ॥

ఓ యింద్రుఁడా! స్తుతులచే నిన్ను వృద్ధిఁ బొందించుచు సర్వదా నీతో సఖ్యమును జేయుదును. నీవు నిజమహిమచే సకలతారకుఁడవు. నీ యాశ్రయమందు నార్యస్తోతలు యుద్ధకాలమున యుద్ధమునకు వచ్చిన హింసకులను బలముచే హింసింతురుగాక! ॥ 202

(10) గద్యము॥

ఓ యిందుద్రుఁడా! నీవు మమ్ము ధరింపుము! నీ వొసంగిన యన్నమును భోగింతుము. స్వయముగ హవ్యము నిచ్చెడివారిని ధరింపుము! ప్రశస్త స్తుతికార్యమున మాకు సామర్థ్య మున్నది. నేను నీ స్తోతను. నన్ను స్తుతులవలనఁ బరిపాలింపుము! ॥ 203

## సూక్తమ్—22

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః—విరాట్, 9-త్రిష్టుప్

(1) పిబా సోమమిన్ద్ర మన్దతు త్వా యం తే సుషావ హర్యశ్వాద్రిః ।
సోతుర్బాహుభ్యాం సుయతో నార్వా ॥ 202

(2) యస్తే మదో యుజ్యశ్చారురస్తి యేన వృత్రాణి హర్యశ్వ హంసి ।
స త్వామిన్ద్ర ప్రభూవసో మమత్తు ॥ 203

(3) బోధా సు మే మఘవన్ వాచమేమాం యాం తే వసిష్ఠో అర్చతి ప్రశస్తిమ్ ।
ఇమా బ్రహ్మ సధమాదే జుషస్వ ॥ 204

(4) శ్రుధీ హవం విపిపానస్యాద్రేర్బోధా విప్రస్యార్చతో మనీషామ్ ।
కృష్వా దువాంస్యన్తమా సచేమా ॥ 205

(5) స తే[1] గిరో అపి మృష్యే తురస్య న సుష్టుతిమసుర్యస్య విద్వాన్ ।
సదా తే నామ స్వయశో వివక్మి ॥ 206

(6) భూరి హి తే సవనా మానుషేషు భూరి మనీషీ హవతే త్వామిత్ ।
మారే[2] అస్మన్మఘవంజ్యోక్ కః ॥ 207

(7) తుభ్యేదిమా సవనా శూర విశ్వా తుభ్యం బ్రహ్మాణి వర్ధనా కృణోమి ।
త్వం నృభిర్హవ్యో విశ్వధాసి ॥ 208

(8) నూ చిన్ను తే మన్యమానస్య దస్మోదశ్నువన్తి మహిమానముగ్ర ।
న వీర్యమిన్ద్ర తే న రాధః ॥ 209

(9) యే చ పూర్వ[3] ఋషయో యే చ నూత్నా[4] ఇన్ద్ర బ్రహ్మాణి జనయన్త విప్రాః ।
అస్మే తే సన్తు సఖ్యా శివాని యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 210

---

1. వతోగిరోఽఅపి, 2. మారోఅస్మన్మ. 3. పూర్వాఽఋషయో, 4. నూత్నాఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

## సూక్తము—22

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

సోమమును ద్రావుము! సోమము నీకు మదమును బుట్టించుఁగాక! హరినామకాశ్వయుతుఁడా! రశ్మలచే సంయుతములగు నశ్వములవలె నభిషవకర్త యొక్క హస్తద్వయముచే గ్రహింపఁబడిన ప్రస్తరము సోమము దీయుచున్నది ॥ 204

(2) గద్యము॥

హరినామకాశ్వయుతుఁడా! ప్రభూతధనవంతుఁడా! యింద్రుఁడా! యిపుడు నీ కుపయుక్తమగు సోమ మున్నది. దేనివలన నీవు వృత్రగణముఁ బరిమార్చితివో! యా సోమము నీ కొసంగఁబడుఁగాక! ॥ 205

(3) గద్యము॥

ఓ మఘవానుఁడా! వసిష్ఠుఁడు నీ స్తుతి రూప మగు నేకథను జెప్పుచున్నాఁడో! నీ వా మాయా వాక్యములను దెలిసికొనుము! మరియు నీ యజ్ఞమందు స్తుతిని సేవింపుము! ॥ 206

(4) గద్యము॥

ఇంద్రుఁడా! నేను సోమపాన మొనర్చితిని. నీవు మా ప్రస్తరాహ్వానము నాలకింపుము! స్తుతికరుఁడగు విప్రుని స్తుతిని దెలిసికొనుము. భక్తుల పరిచర్యను బుద్ధిస్థముగఁ జేయుము! 207

(5) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు శత్రుహింసకుఁడవు. నీ బలము నే నెఱుంగుదును. నీ స్తుతిని నేను ద్యజింపను. సర్వదా నీ యసాధారణనామమునే యుచ్చరించెదను ॥ 208

(6) గద్యము॥

ఓ యింద్రుఁడా! మనుష్యుల మధ్యమున నీ కభిషవములు పెక్కులు. మనీషి నిన్నే మిక్కిలి పిలుచును. సర్వవిధముల నీవే మనుష్యాహ్వాన యోగ్యుఁడవు! ॥ 209

(7) గద్యము॥

ఓ శూరుఁడా! యీ సోమాభిషవమంతయు ని న్నుద్దేశించియే. నీకొఱకే వర్ధనకరములగు స్తోత్రములను జేయుచున్నాము. నీవే యన్ని విధముల మనుష్యాహ్వాన యోగ్యుఁడవు! ॥ 210

(8) గీ॥ స్తూయమానుండ వైనచో నీ యమేయ
మహిమ నెవ్వఁడు తెలియంగ మరచువాఁడు?
దర్శనీయుఁడ! నీదైన ధనము నెవఁడు
పొందకుండఁడు? జగతినిఁ బొలుపు మిగుల ॥ 211

(9) గద్యము॥

ప్రాచీన ఋషు లెవరు గలరో! నవీన ఋషు లెవరు గలరో! వా రందరును నీకు స్తోత్రములను బుట్టించిరి. మాకు నీ సఖ్యము మంగళకర మగును. మమ్ము స్వస్తిచేఁ బరిపాలింపుము ॥ 212

## సూక్తమ్—23

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — ఇన్ద్రః
ఛందః — త్రిష్టుప్

(1) ఉదు [1]బ్రహ్మాణ్యైరత శ్రవస్యేన్ద్రం సమర్యే మహయా వసిష్ఠ ।
ఆ యో విశ్వాని శవసా తతానోపశ్రోతా మ[2] ఈవతో వచాంసి ॥ 211

(2) అయామి ఘోష[3] ఇన్ద్ర దేవజామిరిరజ్యన్త యచ్ఛురుధో వివాచి ।
నహి స్వమాయుశ్చికితే జనేషు [4]తానీదంహాంస్యతి పర్ష్యస్మాన్ ॥ 212

(3) యుజే రథం గవేషణం హరిభ్యాముప బ్రహ్మాణి జుజుషాణమస్థుః ।
వి బాధిష్ట స్య రోదసీ మహిత్వేన్ద్రో వృత్రాణ్యప్రతీ జఘన్వాన్ ॥ 213

(4) ఆపశ్చిత్ పిప్యుః[5] స్తర్యో౩ న గావో నక్షన్నృతం జరితారస్త[6] ఇన్ద్ర ।
యాహి వాయుర్న నియుతో నో[7] అచ్ఛా త్వం హి ధీభిర్దయసే వి[8] వాజాన్ ॥ 214

---

1. బ్రహ్మాణ్యైరత, 2. మఽఈవతో, 3. ఘోషఽఇన్ద్ర, 4. తానీందహాంస్యతి, 5. పిప్యుస్తర్యో, 6. రస్తఽఇన్ద్ర, 7. నోఽఅచ్ఛా, 8. వివాజానీ. (వ్రా.ప్ర.)

(5) తే త్వా మదా[1] ఇన్ద్ర మాదయన్తు శుష్మిణం తువిరాధసం జరిత్రే ।
[2]ఏకో దేవత్రా దయసే హి మర్తానస్మిఞ్ఛూర సవనే మాదయస్వ ॥ 215

(6) ఏవేదిన్ద్రం వృషణం వజ్రబాహుం వసిష్ఠాసో[3] అభ్యర్చన్త్యర్కైః ।
స నః[4] స్తుతో వీరవద్ ధాతు గోమద్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 216

## సూక్తము—23

ఋషి— మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

అన్నేచ్ఛకై స్తోత్రము లుచ్చరింపఁబడును. ఓ వసిష్ఠుఁడా! నీవు యజ్ఞమందు నింద్రుని స్తుతింపుము! వాఁడు బలముచే సమస్త భువనమును వ్యాపించును. నేను వాని సన్నిధికిఁ బోవుట కిచ్ఛగింతును. వాఁడు మా స్తుతివాక్యములను వినునుగాక! ॥ 213

(2) గద్యము॥

సకలౌషధులు వృద్ధిఁబొందింపఁబడుటచే దేవతలు ప్రియశబ్దమును బల్కెదరు. మరియు లోకమధ్యమునందు నెవ్వరును నీ యాయుఃపరిమాణమును దెలిసికొనలేరు. మా పాపములను దుదముట్టింపుము! 214

1. మదాఽఇన్ద్ర, 2. వీకాదేవ, 3. సోఽఅభ్యర్చ, 4. స న స్తుతో. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

నేను రెండు హస్తములచేతను నిందుని గోప్రాపక రథమును గూర్చెదను. ఇందుడు స్తుతిసేవఁజేసెను. వాని నుపాసించెను. వాఁడు స్వమహిమచే ద్యావాపృథువులను బాధితములుగాఁ జేయుచున్నాఁడు. ఇంద్రుఁడు శత్రుద్వంద్వ సమూహమును నశింపఁజేసెను ॥ 215

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! యప్రసూతగోవువలె జలము వృద్ధిఁబొందును. నీ స్తోతలు జలమును వ్యాప్తిఁ జెందింతురుగాక! వాయు వనిరుద్ధణముచెంతకు వచ్చునటుల నీవు మా కడకు రమ్ము! నీవు కర్మద్వారా యన్నము నిమ్ము! ॥ 216

(5) గద్యము॥

ఓ యింద్రుఁడా! మదకరసోమము నీకు మదమును బుట్టించుఁగాక! స్తోతలకు బలవంతులు బహుధనులు నగు పుత్రులను గలుగఁజేయుము! ఓ శూరుఁడా! దేవతలలో నొక్క- నీవే మనుష్యునియెడల దయఁజూపువాఁడవు. ఈ యజ్ఞమునందు మదించినవాఁడ వగుము! ॥ 217

(6) గద్యము॥

వసిష్ఠగణ మర్చనీయస్తోత్రములచే నిట్లు వజ్రబాహువు నభీష్టవర్షియు నగు నింద్రుని బూజింతురు. వాఁడు స్తుతుఁడై వీరవిశిష్టము గో విశిష్టము నగు ధనము నిచ్చుఁగాక! నీవు మమ్ము స్తుతులచే రక్షింపుము! ॥ 218

## సూక్తమ్—24

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) యోనిష్ట[1] ఇన్ద్ర సదనే అకారి తమా నృభిః పురుహూత ప్ర యాహి ।
అసో యథా నోఽవితా వృధే చ దదో వసూని మమదశ్చ సోమైః ॥ 217

(2) గృభీతం తే మన[2] ఇన్ద్ర ద్విబర్హాః సుతః సోమః పరిషిక్తా మధూని ।
విసృష్టధేనా భరతే సువృక్తిరియమిన్ద్రం జోహువతీ మనీషా ॥ 218

(3) ఆ నో దివ[3] ఆ పృథివ్యా ఋజీషిన్నిదం బర్హిః సోమపేయాయ యాహి ।
వహన్తు త్వా హరయో మద్ర్యఞ్చమాఙ్గూషమచ్ఛా తవసం మదాయ ॥ 219

(4) ఆ నో విశ్వాభిరూతిభిః సజోషా బ్రహ్మ జుషాణో హర్యశ్వ యాహి ।
వరీవృజత్ స్థవిరేభిః సుశిప్రాఽస్మే దధద్ వృషణం శుష్మమిన్ద్ర ॥ 220

---

1. యోనిష్టఽఇన్ద్ర సదనేఽఅకారితమన్నృభిః, 2. మనఽఇన్ద్ర, 3. దివఽఆపృథివ్యాఽఋజీషిన్నిదం. (వ్రా.ప్ర.)

(5) ఏష[1] స్తోమో మహ ఉగ్రాయ వాహే ధురీవాత్యో న వాజయన్నధాయి ।
ఇన్ద్ర త్వాయమర్క[2] ఈట్టే వసూనాం దివీవ ద్యామధి నః శ్రోమతం ధాః ॥ 221

(6) ఏవా న[3] ఇన్ద్ర వార్యస్య పూర్ధి ప్ర తే మహీం సుమతిం వేవిదామ ।
ఇషం పిన్వ మఘవద్భ్యః సువీరాం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 222

## సూక్తము—24

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీకు గృహము కల్పించుటకు స్థానము కల్పింపఁబడినది. ఓ పురుహూతుఁడా! మరుద్గణముతోఁ గలసిరమ్ము! నీ వేరూపమున మాకు రక్షకుఁడవో! యెట్లు మాకు వృద్ధిని గలిఁగించుచున్నావో! యటులనే ధనదానము నిమ్ము! మా సోమముచే మత్తుఁడ వగుము! ॥ 219

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు రెండు స్థానములయందుఁ బూజ్యుఁడవు. నీ మనస్సును నేను గ్రహించితిని. సోమము నభిషుతముగాఁ జేయుచున్నాను. మధుపరిషేదము చేయఁబడుచున్నది. మధ్యమస్వరమున నుచ్చారణ సమాప్తి నొందినది. ఈ స్తుతి వారంవార మింద్రుని బిలిచి యుచ్చరింపఁబడుచున్నది ॥ 220

1. ఏషఃస్తోమో మహఽఉగ్రాయ, 2. మర్కఽఈద్దేవసూనాం, 3. ఏవా నఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు మా యీ యజ్ఞమునకు స్వర్గమునుండి యంతరిక్షమునుండి రమ్ము!
మరియు నశ్వము లానందమునిమిత్తము మా కభిముఖముగా నింద్రుని
స్తోత్రాభిముఖమందు వహించుఁగాక! ॥ 221

(4) గద్యము॥

ఓ హర్యశ్వుఁడా! శోభనహవ్యవిశిష్టుఁడా! యింద్రుఁడా! నీవు సర్వప్రకారముల రక్షా
సహితుఁడవై మరుత్తులతోఁగూడి శత్రువుల హింసించుచు నభీష్టవర్షు లగు
పుత్రులను మా కొసంగుము! ॥ 222

(5) గద్యము॥

రథాశ్వమువలె నీ బలకారకస్తోమము చాల గొప్పది. ఓజశ్శాలి, విశ్వవాహకుఁడు, విశ్వ
కారకుఁ డగు నింద్రు నుద్దేశించి స్థాపింపఁబడినది. ఓ యింద్రుఁడా! స్తోత నీచెంత
ధనమును యాచించును. నీ వాకాశమువలె స్వర్గమువలె శ్రీమంతుఁడగు
పుత్రుని నిమ్ము! ॥ 223

(6) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వీ రూపమున వరణీయధనమున మమ్ముఁ బరిపూర్ణులుగా నొనర్పుము!
మేము హవిష్మంతులము. నీ యనుగ్రహమును బొందెదము. మాకు వీరపుత్ర
విశిష్టమగు నన్నము నిమ్ము! నీవు మమ్ము స్వస్తిద్వారా
పరిపాలింపుము! ॥ 224

## సూక్తమ్—25

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః — త్రిష్టుప్

(1) ఆ తే మహ[1] ఇన్ద్రోత్యుగ్ర సమన్యవో యత్ సమరన్త సేనాః ।
పతాతి దిద్యున్నర్యస్య బాహ్వోర్మా తే మనో విష్వద్ర్యగ్వి చారీత్ ॥ 223

(2) ని దుర్గ[2] ఇన్ద్ర శ్నథిహ్యమిత్రానభి యే నో మర్తాసో[3] అమన్తి ।
ఆరే తం శంసం కృణుహి నినిత్సోరా నో భర సంభరణం వసూనామ్ ॥ 224

(3) శతం తే శిప్రిన్నూతయః [4]సుదాసే సహస్రం శంసా[5] ఉత రాతిరస్తు ।
జహి వధర్వనుషో మర్త్యస్యాఽస్మే[6] ద్యుమ్నమధి రత్నం చ ధేహి ॥ 225

(4) త్వావతో హీన్ద్ర క్రత్వే[7] అస్మి త్వావతోఽవితుః శూర రాతౌ ।
విశ్వేదహాని తవిషీవ[8] ఉగ్రగ్ం ఓకః కృణుష్వ హరివో న మర్ధీః ॥ 226

---

1. మహఽఇన్ద్ర, 2. దుర్గఽఇన్ద్ర, 3. మర్తాసోఽఅమన్తి, 4. సుదాసే, 5. శంసాఽఉత, 6. మర్త్యస్యాస్మే, 7. క్రత్వేఽఅస్మి, 8. తవిషీవఽఉగ్రగ్ంఽఓకః. (బ్రా.ప్ర.)

(5) కుత్సా1 ఏతే హర్యశ్వాయ శూషమిన్ద్రే సహో దేవజూతమియానాః ।
సత్రా2 కృధి సుహనా శూర వృత్రా వయం తరుత్రాః 3సనుయామ వాజమ్ ॥ 227

(6) ఏవా న ఇన్ద్ర వార్యస్య పూర్ధి ప్ర తే మహీం సుమతిం వేవిదామ ।
ఇషం పిన్వ మఘవద్భ్యః సువీరాం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 228

## సూక్తము—25

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ యుగ్రేంద్రుఁడా! నీవు మహాత్ముఁడవు! మనుష్య హితకరుఁడవు! నీ సేనయంతయు సమానము. ఇట్టి యభిమానముఁ బడుచు యుద్ధమును జేయుటచేత నీ హస్తమందుండు వజ్రము మా సంరక్షణమునకై యుపయోగించును. సర్వతోగామి యగు నీ మనస్సు చలింపకుండుఁగాక! ॥ 225

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! యుద్ధమం దే జనులు మా కభిముఖులై మా కభిభవమును గల్పింతురో! యా శత్రువులను బరాభవింపుము! ఎవరు మమ్ము నిందించుటకు నిశ్చయింతురో! వారిమాట నెత్తకుము! మా విషయమై ధనమును దెమ్ము! ॥ 226

1. కుత్సాఽఏతే, 2. సత్రకృధి, 3. సనయామ. (వ్రా.ప్ర.)

(3) గద్యము॥

ఓ యుష్ణీషవంతుఁడ వగు నింద్రుఁడా! నేను సుదాసుఁ డను వాఁడను. నీ శతసంఖ్యాక రక్ష
మా కగుఁగాక! నీ హ్రాసాభిలాష ధనము మేము పొందెదముగాక! హింసకులను
హింసాసాధనాయుధములను వినాశముఁ జేయుము! మాకు దీప్తాన్నమును
రత్నములను దాన మిమ్ము! ॥ 227

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! నేను నీతో సమాను లగువారి కర్మకై నియుక్తుఁడ నైతిని. తత్సదృశ
రక్షకత్వముయొక్క దానమందు నియుక్తుఁడనైతిని. ఓ బలవంతుఁడా!
యో యశస్వీ! యింద్రుఁడా! సర్వదిశలు మాకు స్థానమును
గల్పించుము. ఓ హరివంతుఁడా! మమ్ము హింసింపకుము! ॥ 228

(5) గద్యము॥

మే మైశ్వర్యవంతుఁడగు నింద్రునికై స్తోత్రము నొనర్చి యింద్రుని దేవప్రేరితబలమును
యాచించుచు దుర్గములను విస్తరింపఁజేయుచు బలము నొందెదము. ఓ శూరుఁడా!
మమ్ము శత్రువధక్షములనుగా నొనర్పుము! ॥ 229

(6) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వీరూపమున మమ్ము వరణీయధనముచేఁ బరిపూర్ణులుగాఁ జేయుము!
నేను నీ యనుగ్రహమును సంపాదించెదను. నేను హవిష్మంతుఁడను. మాకు
వీరపుత్ర విశిష్టమగు నన్నము నొసంగుము! స్తుతులచే మమ్ము రక్షింపుము! ॥ 230

## సూక్తమ్—26

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) న సోమ ఇన్ద్రమసుతో మమాద నాబ్రహ్మాణో మఘవానం సుతాసః ।
తస్మా ఉక్థం జనయే యజ్జుజోషన్నృవన్నవీయః శృణవద్ యథా నః ॥ 229

(2) ఉక్థఉక్థే[1] సోమ ఇన్ద్రం మమాద నీథేనీథే మఘవానం సుతాసః ।
యదీం సబాధః పితరం న పుత్రాః సమానదక్షా[2] అవసే హవన్తే ॥ 230

(3) చకార తా కృణవన్నూనమన్యా యాని బ్రువన్తి వేధసః సుతేషు ।
జనీరివ పతిరేకః సమానో ని మామృజే పుర[3] ఇన్ద్రః సు సర్వాః ॥ 231

(4) ఏవా తమాహురుత శృణ్వ[4] ఇన్ద్ర ఏకో విభక్తా తరణిర్మఘానామ్ ।
మిథస్తుర[5] ఊతయో యస్య పూర్వీరస్మే భద్రాణి సశ్చత ప్రియాణి ॥ 232

---

1. ఉక్థఽఉక్థే సోమఽఇన్ద్రం, 2. దక్షాఽఅవసే, 3. పురఽఇన్ద్రః, 4. శృణ్వఽఇన్ద్ర.

5. మిథస్తురఽఊతయో. (ప్రా.ప్ర.)

(5) ఏవా వసిష్ఠ[1] ఇన్ద్రమూతయే నృణాన్ కృష్టీనాం వృషభం సుతే గృణాతి ।
సహస్రిణ[2] ఉప నో మాహి వాజాన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 233

## సూక్తము—26

### ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

### దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ధనవంతుఁడగు నింద్రుని సోమముచే నెవరు యజ్ఞమున నభిషుతము కావింపరో! వారు తృప్తి నొందరు. అభిషుత మొనర్చినను స్తోత్రహీనసోమము తృప్తికరము కాఁజాలదు. మా యే యుక్థ యింద్రుని సేవించునో! రాజు దేనిని వినునో! యా నూతనోక్థము నింద్రునినిమిత్తము పఠించెదను ॥ 231

(2) గద్యము॥

ప్రత్యుక్థము ప్రతిస్తుతికాలమందు సోమధనముగల యింద్రుని దృప్తిపరచును. కాఁబట్టి పరస్పరము మిళితులై సమానోత్సాహమును గలిఁగిన ఋత్విజులు పుత్రుఁడు తండ్రినిఁ బిలుచునట్లు వానిని రక్షకై పిలుతురు ॥ 232

(3) గద్యము॥

స్తోతలు సోమ మభిషుతముకాఁగ నే యే సకలకర్మలఁ జెప్పెదరో! యింద్రుఁడు పూర్వకాలమందే యా కర్మలను జేసెను. ఇపు డన్యకర్మలను జేయుచున్నాఁడు. సమవృత్తుఁడు, సహాయరహితుఁడు నగు నింద్రుఁడు పతిపత్నిని శోధనఁ జేయు నట్లు సమస్తశత్రు నగరములను శోధించెను ॥ 233

---

1. వసిష్ఠఽఇన్ద్ర 2. సహస్రిణఽఉప నో. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

ఇంద్రునకుఁ బరస్పర సంశ్లిష్టమగు రక్షాగుణము కలదు. ఋషు లిట్లు చెప్పుచున్నారు. మఱియు నింద్రుఁడు పూజనీయధనము నిచ్చువాఁడు. వాని కాపదుద్ధారకుఁ డను ప్రతీతి గలదు. వాని ప్రసాదమువలనఁ బ్రీతిదాయక మగు కళ్యాణము మమ్ము సేవించుఁగాక! ॥ 234

(5) గద్యము॥

వసిష్ఠుల రక్షించుటకుఁ బ్రజల కభీష్టము లొసంగుటకు నింద్రుని సోమాభిషవమందు నుతిని జేయుచుండిరి. ఓయింద్రుఁడా! నీవు సహస్రసంఖ్యాకమగు నన్నము నిచ్చెదవుగాక! నీవు మమ్ము స్వస్తిద్వారా పాలింతువుగాక!॥ 235

## సూక్తమ్—27

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా — ఇన్ద్రః
ఛందః — త్రిష్టుప్

(1) ఇన్ద్రం నరో నేమధితా హవన్తే యత్ పార్యా యునజతేధియస్తాః ।
శూరో నృషాతా శవసశ్చకాన1 ఆ గోమతి వ్రజే భజా త్వం నః ॥ 234

(2) య ఇన్ద్ర శుష్మో మఘవన్ తే2 అస్తి శిక్షా సఖిభ్యః పురుహూత నృభ్యః ।
త్వం హి 3దృళ్హా మఘవన్ విచేతా అపా వృధి పరివృతం న రాధః ॥ 235

1. కానఽఆ, 2. తేఽఅస్తి, 3. దృహ్ళా. (వ్రా.ప్ర.)

(3) ఇన్ద్రో॒ రాజా॒ జగ॑తశ్చర్షణీ॒నామధి॒ క్షమి॒ విషు॑రూపం॒ యద॒స్తి ।
త॒తో ద॑దాతి దా॒శుషే॒ వసూ॑ని॒ చోద॒ద్ రాధ[1] ఉప॑స్తుతశ్చిద॒ర్వాక్ ॥ 236

(4) నూ చి॒న్న[2] ఇన్ద్రో॑ మ॒ఘవా॒ [3]సహూ॑తీ దా॒నో వాజం॒ ని య॑మతే న[4] ఊ॒తీ ।
అనూ॑నా॒ యస్య॒ దక్షి॑ణా పీ॒పాయ॑ వా॒మం నృభ్యో॑[5] అ॒భివీ॑తా॒ సఖి॑భ్యః ॥ 237

(5) నూ[6] ఇ॑న్ద్ర రా॒యే వరి॑వస్కృధీ న[7] ఆ తే॒ మనో॑ వవృత్యామ॒ మ॒ఘాయ॑ ।
గోమ॒దశ్వా॑వ॒ద్ రథ॑వ॒ద్ వ్యన్తో॑ యూ॒యం పా॑త స్వ॒స్తిభిః॒ సదా॑ నః ॥ 238

## సూక్తము—27

ఋషి— మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

యుద్ధోద్యోగ స్వకీయకర్మప్రయుక్తమగుటచే లోకు లా యింద్రుని యుద్ధమందుఁ బిలుతురు.
ఇంద్రుఁడా! నీవు మనుష్యులకు ధనప్రదుఁడవు! బలాభిలాషివియై గో సహిత
గోష్ఠమందుండి మరియుఁ బొమ్ము! ॥ 236

1. రాధ॒౦ఉప, 2. చిన్న॒౦ఇన్ద్రో, 3. సహో॑తా, 4. న౦ఊ॒తీ, 5. నృభ్యో॒౦అభి,
6, నూ౦ఇన్ద్ర, 7. కృధీ॒ న౦ఆ॒ తే. (బ్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ పురుహూతుఁడా! యింద్రా! నీ కే బలముకలదో! దానిని స్తోతల కొసంగుము!
ఓ మఘవానుఁడా! నీవు దృఢ పురసమూహములను భేదించుటంబట్టి ప్రజ్ఞను
ప్రకాశింపఁజేయుచు ధనము సంపాదించి యిమ్ము! ॥ 237

(3) గద్యము॥

ఇంద్రుఁడు జంగమ జగత్తునకు మనుష్యులకు రాజు. వాఁడు హవ్యప్రదలకు ధన
మొసంగును. ఆ యింద్రుఁడు మాచే స్తుతింపఁబడి మా కభిముఖముగ
ధనమును బ్రేరేపించుఁగాక! ॥ 238

(4) గద్యము॥

ధనవంతుఁడు దానశీలుఁడు నగు నింద్రుని మేము మరుద్గణములతోఁగూడి పిలిచెదము.
మా సంరక్షణమునకై వాఁ డన్నమును బ్రేరేపించుఁగాక! వాఁడు మనుష్యుల
నుద్దేశించి మనోహర ధనము దోహనముఁ జేయును ॥ 239

(5) గద్యము॥

ఓ యింద్రా! నీవు మాకు ధనము ప్రాప్తించుటకు వరము నిమ్ము! మేము పూజనీయస్తుతి
నుద్దేశించి నీ మనస్సును ద్రిప్పెదము. నీవు గోవులను నశ్వములను గలిఁగి
యున్నవాఁడవు! ధనవంతుఁడవు! నీవు సర్వదా మమ్ము
స్తుతిద్వారా పాలింపుము! ॥ 240

## సూక్తమ్—28

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) బ్రహ్మా ణ[1] ఇన్ద్రోప యాహి విద్వానర్వాంచస్తే[2] హరయః సన్తు యుక్తాః ।
విశ్వే చిద్ధి త్వా [3]విహవన్త మర్తా అస్మాకమిచ్ఛృణుహి విశ్వమిన్వ ॥ 239

(2) హవం త[4] ఇన్ద్ర మహిమా వ్యానడ్ బ్రహ్మ యత్ పాసి శవసిన్నృషీణామ్ ।
ఆ యద్ వజ్రం దధిషే హస్త[5] ఉగ్ర ఘోరః సన్[6] క్రత్వా జనిష్ఠా అషాళ్హః ॥ 240

(3) తవ ప్రణీతీన్ద్ర జోహువానాన్ త్సం యన్నౄన్ న రోదసీ నినేథ ।
మహే క్షత్రాయ శవసే హి జజ్ఞే ఽతూతుజిం చిత్ తూతుజిరశిశ్నత్ ॥ 241

(4) ఏభిర్న[7] ఇన్ద్రాహభిర్దశస్య దుర్మిత్రాసో హి క్షితయః పవన్తే ।
ప్రతి యచ్చష్టే[8] అనృతమనేనా అవ ద్వితా వరుణో మాయీ నః సాత్ ॥ 242

---

1. బ్రహ్మా ణఽఇన్ద్ర, 2. నర్వాంచస్తే హరయః, 3. వహివన్తమర్తాఽఅస్మాక, 4. హవన్తఽఇన్ద్ర, 5. హస్తఽఉగ్ర, 6. సమాక్రత్వాజనిష్ఠాఽఅషాహ్ళః, 7. నఽఇన్ద్ర, 8. యచ్చష్టేఽఅనృతమనేనాఽఅవ. (ప్రా.ప్ర.)

(౯) వోచేమేదిన్ద్రం[1] మఘవానమేనం మహో రాయో రాధసో యద్ దదన్నః ।
యో అర్చతో బ్రహ్మకృతిమవిష్ఠో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 243

## సూక్తము—28

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు తెలిసికొనుచు మా స్తోత్రములనిమిత్తము రమ్ము! నీ యశ్వగణమును మా కభిముఖముగ సమకూర్చుము! ఓ ప్రీతిప్రదుఁడవగు నింద్రుఁడా! సమస్త మనుష్యులు నిన్ను వేరువేరుగాఁ బిలిచెదరు. అయినను నీవు మా మా యాహ్వానములను నాలకింపుము! ॥ 241

(2) గద్యము ॥

బలవంతుఁడవగు నింద్రా! యెందువలన ఋషుల స్తుతులను రక్షించితివో! యందువలన నీ మహిమ స్తోతను బొందుఁగాక! ఓ యోజస్వీ! యింద్రుఁడా! హస్తమున వజ్రమును ధరింపుము! కర్మచే భయంకరుఁడవై శత్రువులకు దుర్ధర్షుఁడ వగుము! ॥ 242

(3) గద్యము॥

ఇంద్రా! నీ యుపదేశము ననుసరించి యే లోకము స్తవ మొనర్చునో యా లోకమును ద్యోలోకమందు, భూ లోకమునందుఁ బ్రతిష్ఠించుము! నీవు మహాబలధనములకై పుట్టియుంటివి! నిన్నుద్దేశించి యెవరు యాగముఁ జేయరో! యట్టి యజ్ఞవిరహితులను హింసించుటకు నీవు సమర్థుఁడవు! ॥ 243

1. చేమేదిన్ద్రం మఘవాన. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

ఇంద్రుఁడా! శత్రుభూతమనుష్యులు వచ్చుచుందురు. ఈః యన్ని దినములును ధనము మా కిమ్ము! మరియుఁ బాపహారియుఁ బ్రజ్ఞావంతుఁడు నగు వరుణుఁడు మా యే పాపములను జూడఁగల్గెనో! యా పాపములను రెండు విధములఁ బోఁగొట్టుము! ॥ 244

(5) గద్యము॥

ఏ యింద్రుఁడు సమరమందు నారాధనీయ మహాధనము నిచ్చునో! యెవఁడు స్తుతికరుల స్తోత్రకార్యములను రక్షించునో! యట్టి ధనవంతుఁ డగు నింద్రుని స్తుతించెదను. ఓ యింద్రా! నీవు స్తుతిద్వారా మమ్ము రక్షింపుము! ॥ 245

## సూక్తమ్—29

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠ
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) అయం సోమ[1] ఇన్ద్ర తుభ్యం సున్వ[2] ఆ తు ప్ర యాహి హరివస్తదోకాః ।
పిబా త్వ౨స్య [3]సుషుతస్య చారోర్దదో మఘాని మఘవన్నియానః ॥ 244

(2) బ్రహ్మన్ వీర బ్రహ్మకృతిం జుషాణో ఽర్వాచీనో హరిభిర్యాహి తూయమ్ ।
అస్మిన్నూ షు సవనే మాదయస్వోప బ్రహ్మాణి శృణవ[4] ఇమా నః ॥ 245

1. సోమఽఇన్ద్ర, 2. సున్వఽఆ తు, 3. ఘషుతస్య, 4. శృణవఽఇమా. [వ్రా.ప్ర.]

(3) కా తే[1] అస్త్యరంకృతిః [2]సూక్తైః కదా నూనం తే మఘవన్ దాశేమ ।
విశ్వా మతీరా తతనే త్వాయా ఽధా [3]మ ఇన్ద్ర శృణవో హవేమా ॥ 246

(4) ఉతో ఘా తే పురుష్యా౩ ఇదాసన్ యేషాం [4]పూర్వేషామశృణోరృషీణామ్ ।
అధాహం త్వా మఘవఞ్జోహవీమి త్వం న ఇన్ద్రాసి ప్రమతిః పితేవ ॥ 247

(5) వోచేమేదిన్ద్రం మఘవానమేనం మహో రాయో రాధసో యద్ దదన్నః ।
యో[5] అర్చతో బ్రహ్మకృతిమవిష్ఠో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 248

## సూక్తము—29

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఇంద్రుఁడా! ని న్నుద్దేశించి సోమ మభిషుత మగుచున్నది. హరివంతుఁడ వగు నింద్రుఁడా! దానిని సేవించుటకు సత్వరము రమ్ము! లెస్సగా నభిషుత మగు సోమమును ద్రావుము! మఘవానుఁడా! మేము యాచించుచున్నాము.
మాకు ధనము నిమ్ము!॥ 246

1. తేఽఅస్త్య 2. సూక్తైఃఽదా, 3. మఽఇన్ద్ర, 4. పూర్వషా, 5. యోఽఅర్చతో. [వ్రా.ప్ర.]

(2) గద్యము॥

బ్రాహ్మణ వీరుఁడ వగు నింద్రుఁడా! స్తోత్రపులను సేవించుచు నశ్వయానముపై శీఘ్రముగ
మా కభిముఖముగ రమ్ము! ఆ స్తోత్రములు మాకు సర్వమును ప్రేరేపించుఁగాక! ॥ 247

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! సూక్తములచే నీ యుపకృతి నెట్లు సంపాదింపఁగలము? ఎట్లు నీకుఁ
బ్రీతిని పుట్టింపఁగలము? నిన్నుఁ గోరుచు సమస్తస్తుతులను బఠించుచున్నాము.
కాఁబట్టి యో యింద్రుఁడా! మా స్తుతి నాలకింపుము! ॥ 248

(4) గద్యము॥

మఘవానుఁడా! యే ఋషుల స్తుతుల నాలకించెదవో! యా ఋషులు పురుషులకు హితకరు
లగుదురు. కాఁబట్టి మేము నిన్ను మాటిమాటికిఁ బిలుచుచున్నాము. ఇంద్రుఁడా!
పితవలె మాకు నీవు బంధువుఁడవు! ॥ 249

(5) గద్యము॥

ఏ యింద్రుఁడు మాకు సమారాధనీయమగు ధనము నిచ్చుచున్నాఁడో! యెవఁడు స్తుతికారుల
స్తోత్రకార్యములను స్తుతించునో! యట్టి ధనవంతుఁడగు నింద్రుని స్తుతించెదను.
నీవు సర్వదా మమ్ము రక్షింపుము! ॥ 250

## సూక్తమ్—30

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఇన్ద్రః

ఛందః — త్రిష్టుప్

(1) ఆ నో దేవ శవసా యాహి శుష్మిన్ భవా వృధ ఇన్ద్ర రాయో[1] అస్య ।
మహే నృమ్ణాయ నృపతే సువజ్ర మహి క్షత్రాయ పౌంస్యాయ శూర ॥ 249

(2) హవన్త ఉ త్వా హవ్యం వివాచి తనూషు శూరాః సూర్యస్య సాతౌ ।
త్వం విశ్వేషు సేన్యో జనేషు త్వం వృత్రాణి రన్ధయా సుహన్తు ॥ 250

(3) అహా యదిన్ద్ర సుదినా వ్యుచ్ఛాన్ దధో యత్ కేతుముపమం సమత్సు ।
న్యగ్నిః సీదదసురో న హోతా హువానో[2] అత్ర సుభగాయ దేవాన్ ॥ 251

(4) వయం తే త[3] ఇన్ద్ర యే చ దేవ స్తవన్త శూర దదతో మఘాని ।
యచ్ఛా సూరిభ్య[4] ఉపమం వరూథం స్వాభువో జరణామశ్నవన్త ॥ 252

---

1. రాయోఽఅస్య, 2. హువానోఽఅత్ర, 3. తఽఇన్ద్ర, 4. సూరిభ్యఽఉపమం. (వ్రా.ప్ర.)

(5) వోచేమేదిన్ద్రం మఘవానమేనం మహో రాయో రాధసో యద్దదన్నః ।
యో[1] అర్చతో బ్రహ్మకృతిమవిష్ఠో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 253

## సూక్తము—30

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

బలవంతుఁడు, ద్యుతిమంతుఁడవు నగు నింద్రుఁడా! బలముతోఁగూడ మా యొద్దకు రమ్ము! సువజ్ర! నృపతి! నీవు మహాబలవంతుఁడ వగుము! శత్రు నాశక మగు మహాపురుషత్వమును బొందుము!॥ 251

(2) గద్యము॥

**ఓ యింద్రుఁడా! నీ వాహ్వానయోగ్యుఁడవు! మహా కోలాహలసమయమున శరీర సంరక్షణమునకై సూర్యునివిధమున ని న్నాహ్వానింతురు. సమస్తలోకముల** మధ్యను నీవుసేనార్హుఁడవు! నీవు సుహంతృనామక వజ్రమున శత్రువులను మాకు వశపరచుము!॥ 252

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! దినమంతయు సుదినమై ప్రభాత మగును. నీవు యుద్ధ సమీపవర్తివని మే మెఱుంగుదుము. అందువలన హోతయగు నగ్ని మా కుత్తమధనము నిచ్చుటకుఁ బిలుచుచు నీ యజ్ఞమం దుపవసించును॥ 253

---

1. యోఽఅర్చతో. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! మేము నీవారము. ఎవరు నీకుఁ బూజనీయహవ్యము నొసంగుచు స్తుతి నొనర్తురో! వారు నీ వారలే. అట్టి స్తోతలకు శ్రేష్ఠగృహముల నిమ్ము! మరియు వారు సుసమృద్ధులై జరను బొందెదరు ॥ 254

(5) గద్యము॥

ఓ యింద్రుఁడా! మాకు సమారాధనీయమగు మహాధనము దాన మిచ్చుచున్నావు. ఎవఁడు స్తుతిపాఠకుల స్తోత్రకార్యములను రక్షించునో! యా యింద్రుని స్తుతించెదము. నీవు మమ్ము స్తుతులచే రక్షింపుము! ॥ 255

## సూక్తమ్—31

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ, 10-12-విరాట్

(1) ప్ర వ[1] ఇన్ద్రాయ మాదనం హర్యశ్వాయ గాయత ।
సఖాయః సోమపావ్నే ॥ 254

(2) శంసేదుక్థం సుదానవ[2] ఉత ద్యుక్షం యథా నరః ।
చకృమా సత్యరాధసే ॥ 255

1. ప్ర వఽఇన్ద్రాయ, 2. సుదానవఽఉత. [వ్రా.ప్ర.]

(3) త్వం న[1] ఇన్ద్ర వాజయుస్త్వం గవ్యుః శతక్రతో ।

త్వం హిరణ్యయుర్వసో ॥ 256

(4) వయమిన్ద్ర త్వాయవోఽభి ప్ర ణోనుమో వృషన్ ।

విద్ధీ త్వ౧స్య నో వసో ॥ 257

(5) మా నో నిదే చ వక్తవేఽర్యో రన్ధీరరావ్ణే ।

త్వే[2] అపి క్రతుర్మమ ॥ 258

(6) త్వం వర్మాసి సప్రథః పురోయోధశ్చ వృత్రహన్ ।

త్వయా ప్రతి బ్రువే యుజా ॥ 259

(7) మహాగ్ం[3] ఉతాసి యస్య తేఽను స్వధావరీ సహః ।

మమ్నాతే[4] ఇన్ద్ర రోదసీ ॥ 260

---

1. త్వం నఽఇన్ద్ర, 2. త్వేఽఅపి, 3. మహాగ్ంఽఉదాసి, 4. మమ్నాతేఽఇన్ద్రరోదసి. [వ్రా.ప్ర.]

(8) తం త్వా మరుత్వతీ పరి భువద్ వాణీ సయావరీ ।
నక్షమాణా సహ ద్యుభిః ॥ 261

(9) ఊర్ధ్వాసస్త్వాన్విన్దవో భువన్ దస్మముప ద్యవి ।
సం తే నమన్త కృష్టయః ॥ 262

(10) ప్ర వో మహే మహివృధే భరధ్వం ప్రచేతసే ప్ర సుమతిం కృణుధ్వమ్ ।
విశః[1] పూర్వీః ప్ర చరా చర్షణిప్రాః ॥ 263

(11) ఉరువ్యచసే మహినే సువృక్తిమిన్ద్రాయ బ్రహ్మ జనయన్త[2] విప్రాః ।
తస్య వ్రతాని న మినన్తి ధీరాః ॥ 264

(12) ఇన్ద్రం[3] వాణీరనుత్తమన్యుమేవ సత్రా రాజానం దధిరే సహధ్యై ।
హర్యశ్వాయ బర్హయా సమాపీన్ ॥ 265

---

1. విశాః పూర్వీః, 2. జనయన్తి, 3. ఇన్ద్రవాణీః. [వ్రా.ప్ర.]

## సూక్తము—31

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ సఖులారా! మీరు సోమపాయియు హర్యశ్వుఁడు నగు నింద్రుని గూర్చి మదకర
స్తోత్రములను గానముఁజేయుఁడు! ॥ 256

(2) గద్యము॥

శోభనదానయుతుఁడు సత్యధనుఁడునగు నింద్రునకు స్తోత లెట్లు దీప్తస్తోత్రములను
బఠించెదరో! నీవు కూడ నట్లే చేయుము॥ 257

(3) గీ॥ నీవు గోకాముఁడవు కమ్ము! నీవు వజ్రి!
యస్మదీయాన్నమును గోరు మతిశయముగ
నోయి! వాసప్రదా! యింద్ర! యుచితహోమ
దాత వగుమయ్య! సంతతప్రీతితోడ॥ 258

(4) గీ॥ మేము నిన్నుఁ గోరి పుక్కిలి వినుతించు
చున్నవార మింద్ర! హౌయలు చెలఁగఁ
గామవర్షి! నీవు ఘన మగు మా స్తుతి
చెవులఁ బెట్టుమయ్య! చెలిమిఁగలిఁగి॥ 259

(5) గద్యము॥

ఓ యార్యేంద్రుఁడా! యింద్రుఁడా! యే పురుషుఁ డవాచ్యముల నుచ్చరించునో! యెవరు
నిందింతురో! యెవరు దాన మీయకుందురో! యట్టివారిని మా కవశీభూతులుగాఁ
జేయకుము! మాస్తోత్రములు నిన్నే చెందుఁగాక!॥ 260

(6) గద్యము॥

ఓ వృత్రహనుఁడా! నీవు మా కవచము. నీవు సర్వవిధములఁ బ్రథితసమ్ముఖ యుద్ధ కారివి! నిన్ను సహాయముగాఁగొని శత్రువులఁ బరిమార్చెదము ॥ 261

(7) గద్యము ॥

అన్నవిశిష్ట లగు ద్యావాభూము లింద్రబలమును స్వీకరించును. ఆ యింద్రుఁడు గొప్పవాఁ డగుచున్నాఁడు ॥ 262

(8) గీ॥ అధికతేజో విరాజిత మైనయట్టి
నీకు సహగామియై కడు నిలుచునట్టి
స్తోతృసంయుతమైనట్టి స్తుతి మహేంద్ర!
నిన్ను గ్రహియించుఁగాకఁ దా నన్నివిధుల ॥ 263

పాఠాంతరము

గద్యము॥

ఓ యింద్రుఁడా! నీకు సహగామినియుఁ, దేజోయుక్తయు, స్తోతృవిశిష్టయు నగు స్తుతి నిన్ను సర్వవిధముల గ్రహించుఁగాక! ॥ 264

(9) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు స్వర్గసమీపమున నున్నవాఁడవు! దర్శనీయుఁడవు! మా సోమ మంతయు నీకైయున్నది. ప్రజలందఱును నీకు నమస్కారములు చేయుచున్నారు ॥ 265

(10) గద్యము॥

ఓ మదీయపురుషులారా! మీరు మహాధనమును వృద్ధిఁ బొందించువాఁడును మహాత్ముఁడు నగు నింద్రు నుద్దేశించి సోమప్రణయన మొనర్పుఁడు! ప్రకృష్టమతికిఁ బ్రకృష్టస్తుతి నొనర్పుఁడు! ప్రజాకామపూరకుఁడా! యెవరు హవ్యమున నిన్నుఁ బూర్ణుని గావింతురో! వారి కభిముఖముగ రమ్ము! ॥ 266

(11) గద్యము॥

ఏ యింద్రుఁడు ప్రభూతవ్యాప్తివిశిష్టుఁడు, మహాత్ముఁడు నగునో! వాని నుద్దేశించి మేధావులు స్తుతులను హవ్యమును బుట్టింతురు. ప్రాజ్ఞులు వాని వ్రతమును హింసింపఁజాలరు॥ 267

(12) గద్యము॥

సర్వవిధముల జగదీశ్వరుఁడు, నప్రతిహతక్రోధుఁడు నగు నింద్రునిస్తుతి సకల శత్రువులఁ దిరస్కరించును. కాఁబట్టి యింద్రుని స్తుత్యర్థము బంధువులఁ బ్రోత్సాహులుగా నొనర్పుము! ॥ 268

## సూక్తమ్—32

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః, 26–పూర్వార్ధర్చస్య శక్తిర్వాసిష్ఠో వా (శాట్యాయనే బ్రాహ్మణే)
26–27 శక్తిర్వాసిష్ఠో వా (తాణ్డకే బ్రాహ్మణే)
దేవతా—ఇన్ద్రః
ఛందః—బృహతీః, సతోబృహతీ (ప్రగాథః) 3–ద్విపదా

(1) మో[1] షు త్వా వాఘతశ్చనా[2]ఽఽరే అస్మన్ని రీరమన్ ।
ఆరాత్తాచ్చిత్ సధమాదం న[3] ఆ గహీహ వా సన్నుప శ్రుధి ॥ 266

(2) ఇమే హి తే బ్రహ్మకృతః సుతే సచా మధౌ న మక్ష ఆసతే ।
ఇన్ద్రే కామం జరితారో వసూయవో రథే న పాదమా దధుః ॥ 267

1. మేషుత్వా, 2. నారేఽఅస్మన్, 3. నఽఆ గహీహ. [వ్రా.ప్ర.]

(3) రాయస్కామో వజ్రహస్తం సుదక్షిణం
పుత్రో న పితరం హువే ॥ 268

(4) ఇమ[1] ఇన్ద్రాయ సున్విరే సోమాసో దధ్యాశిరః ।
తాగ్ం[2] ఆ మదాయ వజ్రహస్త పీతయే హరిభ్యాం యాహ్యోక[3] ఆ ॥ 269

(5) శ్రవచ్ఛ్రుత్కర్ణ[4] ఈయతే వసూనాం నూ చిన్నో మర్ధిషద్ గిరః ।
సద్యశ్చిద్ యః సహస్రాణి శతా దదన్నకిర్దిత్సన్తమా మినత్ ॥ 270

(6) స [5]వీరో అప్రతిష్కుత ఇన్ద్రేణ శూశువే నృభిః ।
యస్తే గభీరా సవనాని వృత్రహన్ త్సునోత్యా చ ధావతి ॥ 271

(7) భవా వరూథం మఘవన్ మఘోనాం యత్ సమజాసి శర్ధతః ।
వి త్వాహతస్య వేదనం భజేమహ్యా దూణాశో భరా గయమ్ ॥ 272

---

1. ఇమ ఉ ఇన్ద్రాయ, 2. తాగ్ం ఉ ఆ మదాయ, 3. క ఉ ఆ, 4. శ్రవచ్ఛ్రుత్కర్ణ ఉ ఈయతే,
5. స వీరో ఉ అప్రతిష్కుత ఉ ఇన్ద్రేణ. (ప్రా.ప్ర.)

(8) సువోతా సోమపావ్నే సోమమిన్ద్రాయ వజ్రిణే ।
పచతా పక్తీరవసే కృణుధ్వమిత్ పృణన్నిత్ పృణతే మయః ॥ 273

(9) మా[1] స్రేధత సోమినో దక్షతా మహే కృణుధ్వం రాయ[2] ఆతుజే ।
తరణిరిజ్జయతి క్షేతి పుష్యతి న దేవాసః కవత్నవే ॥ 274

(10) నకిః సుదాసో రథం పర్యాస న రీరమత్ ।
ఇన్ద్రో యస్యావితా యస్య మరుతో గమత్ స గోమతి వ్రజే ॥ 275

(11) గమద్ వాజం వాజయన్నిన్ద్ర మర్త్యో యస్య త్వమవితా భువః ।
అస్మాకం బోధ్యవితా రథానామస్మాకం శూర నృణామ్ ॥ 276

(12) ఉదిన్న్వస్య రిచ్యతేంఽశో ధనం న జిగ్యుషః ।
య[3] ఇన్ద్రో హరివాన్ న దభన్తి తం రిపో దక్షం దధాతి సోమిని ॥ 277

---

1. మ స్రేధత, 2. రాయఽఆతుజే 3. యఽఇన్ద్రో. [వా.ప్ర.]

(13) మన్త్రమఖర్వం సుధితం సుపేశసం దధాత యజ్ఞియేష్వా ।
పూర్వీశ్చన ప్రసితయస్తరన్తి తం య[1] ఇన్ద్రే కర్మణా భువత్ ॥ 278

(14) కస్తమిన్ద్ర త్వావసుమా మర్త్యో దధర్షతి ।
శ్రద్ధా[2] ఇత్ తే మఘవన్ పార్యే దివి వాజీ వాజం సిషాసతి ॥ 279

(15) మఘోనః స్మ వృత్రహత్యేషు చోదయ యే దదతి ప్రియా వసు ।
తవ ప్రణీతీ హర్యశ్వ సూరిభిర్విశ్వా తరేమ దురితా ॥ 280

(16) తవేదిన్ద్రావమం వసు త్వం పుష్యసి మధ్యమమ్ ।
సత్రా విశ్వస్య పరమస్య రాజసి నకిష్ట్వా గోషు వృణ్వతే ॥ 281

(17) త్వం విశ్వస్య ధనదా[3] అసి శ్రుతో య[4] ఈం భవన్త్యాజయః ।
తవాయం విశ్వః పురుహూత పార్థివో ఽవస్యుర్నామ భిక్షతే ॥ 282

1. యఽఇన్ద్రే, 2. శ్రద్ధాఽఇత్, 3. ధనదాఽఅసి, 4. యఽఈం. (వా.ప్ర.)

(18) యదిన్ద్రా యావతస్త్వమేతావదహమీశీయ ।
స్తోతారమిద్ దిధిషేయ రదావసో న పాపత్వాయ రాసీయ ॥ 283

(19) శిక్షేయమిన్మహయతే దివేదివే రాయ[1] ఆ కుహచిద్విదే ।
నహి త్వదన్యన్మఘవన్ న[2] ఆప్యం వస్యో అస్తి పితా చన ॥ 284

(20) తరణిరిత్ సిషాసతి వాజం పురంధ్యా యుజా ।
ఆ వ ఇన్ద్రం పురుహూతం నమే గిరా నేమిం తష్టేవ సుద్రువమ్ ॥ 285

(21) న దుష్టుతీ మర్త్యో విన్దతే వసు న స్రేధన్తం రయిర్నశత్ ।
సుశక్తిరిన్మఘవన్ తుభ్యం మావతే దేష్ణం యత్ పార్యే దివి ॥ 286

(22) అభి త్వా శూర నోనుమో ఽదుగ్ధా[4] ఇవ ధేనవః ।
ఈశానమస్య జగతః స్వర్దృశమీశానమిన్ద్ర తస్థుషః ॥ 287

---

1. రాయఽఆ, 2. నఽఆప్యం వస్యోఽఅస్తి, 3. తష్టేవసుద్రువమ్ 4. దుగ్ధాఽఇవ. [వ్రా.ప్ర].

(23) న త్వావాఁగ్ం[1] అన్యో దివ్యో న[2] పార్థివో న జాతో న [3]జనిష్యతే ।
అశ్వాయన్తో మఘవన్నిన్ద్ర వాజినో గవ్యన్తస్త్వా హవామహే ॥ 288

(24) అభీ షత స్తదా భరేన్ద్ర జ్యాయః కనీయసః ।
పురూవసుర్హి[4] మఘవన్ త్సనాదసి భరేభరే చ హవ్యః ॥ 289

(25) పరా ణుదస్వ మఘవన్నమిత్రాన్ త్సువేదా నో వసూ కృధి ।
అస్మాకం బోధ్యవితా మహాధనే భవా వృధః సఖీనామ్ ॥ 290

(26) ఇన్ద్ర క్రతుం న[5] ఆ భర పితా పుత్రేభ్యో యథా ।
శిక్షా ణో[6] అస్మిన్ పురుహూత యామని జీవా జ్యోతిరశీమహి ॥ 291

(27) మా నో [7]అజ్ఞాతా వృజనా దురాధ్యో౩ మాశివాసో [8]అవ క్రముః ।
త్వయా వయం ప్రవతః శశ్వతీరపో ఽతి శూర తరామసి ॥ 292

---

1. వాగ్ంఽఅన్యో, 2. నపార్థివోన, 3. జానిష్యతే, 4. పురూవసూర్హి, 5. క్రతుం నఽఆ భర,
6. శిక్షా ణోఽఅస్మిన్, 7. మా నోఽఅజ్ఞాతా, 8. వాసోఽఅవ. [వా. ప్ర.]

## సూక్తము—32

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు, 26-27-వశిష్ఠుఁడు లేక వశిష్ఠపుత్రుఁడు శక్తి †
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! యీ యజమానులు దూరముగనున్న నిన్ను మేము గలిసికొనుట కిష్టపడియున్నచో నీవు దూరమందున్నను మా యజ్ఞమునకు దయసేయుము!॥ 269

(2) గద్యము॥

మధువునందు మధుమక్షిక మెట్లు ప్రవేశించునో! యట్లు స్తోత్రకరులు నీకు సోమమును సిద్ధపరచినచో నందుఁ బ్రవేశింపుము! రథమందుఁ బాదమునుంచునట్లు ధనకాములగు స్తోతలు నింద్రునకు స్తుతుల సమర్పింతురు॥ 270

అర్థాంతరము

*క॥ అసమూహామునుండి మధువు
వెస గ్రహియించిన పగిదిన్ విమలపు సోమం
బసహాయంబుగఁ ద్రావుము!
సని రథమునఁ బాద ముంచుచాగున నింద్రా!॥ 271

*క॥ ధన మడిగెడు స్తోతలు కడు
ఘనభక్తిన్ నిన్ను నుతుల గారవ మొప్పన్
మనమున నుతింప నీవును
బ్రీణతుల వెలుఁగొందు దింద్రా! ప్రభువుల జగతిన్॥ 272

† 26_27 ఋక్కుల ఋషిభిన్నత్వము వ్రాతప్రతి (7వ సంపుటము-109వ పుట)లో లేదు. కాని ఋషిదేవతల పట్టికలుగల వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోఁ గలదు.

* రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(3) గీ॥ పుత్రకుండు తండ్రిఁ బూర్ణస్వరంబునఁ
బిలుచునట్లు నేను లలితధనము
గోరువాఁడ నగుచుఁ జేరి యింద్రుని బ్రీతిఁ
బిలుచువాఁడ నగుదుఁ బెద్ద నగుచు ॥ 273

(4) గద్యము॥

ఈ దధిమిశ్రిత సోమ మంతయు నింద్రునివిషయమై యభిషుత మగుచున్నది.
ఓ వజ్రహస్తుఁడా! యానందమునకు నాసోమమును ద్రావుటకు నశ్వసహితుఁడవై
యజ్ఞాభిముఖముగ నరుగుదెమ్ము! ॥ 274

(5) గద్యము॥

శ్రవణ శీల కర్ణుఁడగు నింద్రుని నా ధనమును యాచించెదను. వాఁడు వాక్యములను
వినుఁగాక! అందువలన వాఁడు నిష్కలుఁ డగును. ఏ యింద్రుఁడు
సత్యసహస్రశతములను దాన మొసంగునో! దానాభిలాషి యగు
నా యింద్రుని నెవ్వరును వారింపలేరు ॥ 275

(6) గద్యము॥

ఓ వృత్రహనుఁడా! యెవ్వరు గో సోమము నభిషవముఁ జేయుదురో! యెవ్వరు
నిన్ననుగమింతురో! వారలే వీరులు. వారికి విరుద్ధముగా మాటలాడు వారెవ్వరో!
వారే పరిచారికవేష్టితు లగుదురు॥ 276

(7) గద్యము॥

ఓ మఘవానుఁడా! యింద్రుఁడా! నీవు హవిష్మంతులకు వర్మస్వరూపుఁడ వగుము!
ఉత్సాహశీలులగు శత్రువులను నశింపఁజేయుము! నీ వే శత్రువుల నష్టపెట్టెదవో!
వారి ధనమును దెచ్చి మా కిచ్చివేయుము! నీ కెవ్వరును నాశమును
గల్పింపలేరు. నీవు మా నిమిత్తము ధనమును దెమ్ము! ॥ 277

(8) గద్యము॥

వజ్రయుతుఁడు సోమపాయియు నగు నింద్రునికి సోమాభిషవమును జేయుము! ఇంద్రుని తృప్తికై ప్రస్తవ్యపాకమును వండుము! కర్తవ్యకార్యములను సంపాదింపుము! ఇంద్రుఁడు సుఖము నొసంగుచు హవ్యపూర్ణునిగాఁజేయును॥ 278

(9) గద్యము॥

సోమయుక్తమగు యజ్ఞమునకు విఘ్నము కలిఁగింపకూడదు. ఎవ్వరును దాని కడ్డుపెట్ట లేరు. శత్రువినాశకుం డగు నింద్రునికి ధనలాభమునకై కర్మ నాచరింపుము! త్వరమాణ వ్యక్తి జయ మందును. నివాస మొసంగును. పుష్టుఁడగును. కుత్సితక్రియాకారికి దేవత కాఁడు॥ 279

(10) గద్యము॥

సుదానశీలవ్యక్తియొక్క రథమును దూరమం దెవ్వఁడును నుంచలేఁడు. ఇంద్రుఁ డెవ్వరి రక్షకుఁడో! మరుద్గణ మెవ్వరి రక్షకమో! వారు గో సహిత గోష్ఠమును జేరుదురు॥ 280

(11) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వే మర్త్యులకు రక్షకుఁడ వగుదువో! వారు నిన్ను బలవంతునిగాఁ జేయుచు నన్నమును బొందెదరు. ఓ శూరుఁడా! మా రథమునకు రక్షకుఁడ వగుము! మా పుత్రకులకు సంరక్షకుఁడ వగుము!॥ 281

(12) గద్యము॥

ఏ హరివంతుఁడగు నింద్రుఁడు సోమముగల యే వ్యక్తికి బలము నొసంగునో! యెవనిని శత్రువులు హింసింపఁజాలరో! యట్టి యింద్రునిభాగము జయశీలవ్యక్తిభాగముకంటె నన్నివిధముల నధికము॥ 282

(13) గద్యము॥

దేవతలలో నింద్రుఁడే యనల్పుఁడు. సువిహితములైన శోభనస్తోత్రములను నర్పించెదను. ఏ వ్యక్తియొక్క కర్మద్వారా యింద్రునిచిత్త మాకర్షించుటకు సమర్థ మగునో! వానిదగ్గర బహువిధబంధనములు చేరఁజాలవు॥ 283

(14) గద్యము॥

నీ వెవ్వని బొందెదవో! యా మనుష్య నెవ్వఁడు ఘర్షణచేయఁగలఁడు? ఓ మఘవానుఁడా! నిన్నుఁగూర్చి శ్రద్ధాయుక్తుఁడై యెవ్వఁడు హవిష్మంతుఁ డగునో! వాఁడు ద్యో లోకమందు దివసమందు ధనము పొందఁగలఁడు ॥ 284

(15) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు మఘవానుఁడవు! ఎవ్వరు నీకుఁ బ్రియమగు ధనము నిచ్చెదరో! యట్టివారిని సంగ్రామములయందుఁ బ్రేరేపింపుము! ఓ హర్యశ్వుఁడా! భవదీయోప దేశానుసారముగ స్తోతలతోఁగూడ దురితములనుండి యుత్తీర్ణుఁడ నయ్యెద ॥ 285

(16) గద్యము॥

ఓ యింద్రుఁడా! యధమధనము నీయదియె. నీవు మధ్యమధనమును బోషింపుము! నీవు సమస్తోత్కృష్ట ధనమునకుఁ గర్త వనుమాట సత్యము. గోవుల విషయమై యెవ్వఁడును నిను వారించుటకు సమర్థుఁడు కాఁజాలఁడు॥ 286

(17) గద్యము॥

నీవు సర్వమునకు ధనదాత వను ప్రసిద్ధి గలదు. యుద్ధములయందుఁగూడ నీవు ధనదాత వను ప్రసిద్ధి గలదు. ఈ సమస్త పార్థివలోకము రక్షాభిలాషచే నన్ను భిక్ష నడుగుచున్నది ॥ 287

(18) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వెంత ధనమున కీశ్వరుఁడవో! యంతధనమునకు నే నీశ్వరుఁడ నగుదును. ఓ ధనపుఁడ! స్తోతలను నేను బరిపాలించెదను. పాపత్వమునకు ధనమును దాన మీయను ॥ 288

(19) గద్యము॥

ఏదో యొక స్థానమందున్న పూజాకారి యగు లోకము నుద్దేశించి ప్రత్యహము ధనదానముఁ జేసెదను. ఓ యింద్రుఁడా! నీవు భిన్నుఁడవు! మాకు బంధువుఁడవు! పితవు కావు ॥ 289

(20) గద్యము॥

త్వరావంతమగు వ్యక్తి కర్మబలమువలన నన్నమును భజించును. త్వష్ట యె ట్లుత్తమకాష్ఠ విశిష్టమగు నైమికమును నమితముగా నొనర్చునో! యట్టులే స్తుతులచేఁ బురుహూతుఁ డగు నింద్రుని నమితునిగాఁ జేసెదను ॥ 290

(21) గద్యము॥

మర్త్యులు మందస్తుతిద్వారా ధనమును బొందఁజాలరు. ధనహింసాకారుల సమీపమునకుఁ బోఁజాలరు. ఓ మఘవానుఁడా! ద్యోలోకమున దివసమందు మత్సదృశులగురించి నీ కెంత దాతవ్య మున్నదోఁ! యది సుకర్మవ్యక్తి పొందఁగలఁడు ॥ 291

(22) గద్యము॥

ఓ శూరుఁడా! నీ వీ జగంబున కనఁగా జంగమ పదార్థమున కీశ్వరుఁడవు! స్థావర పదార్థముల కీశ్వరుఁడవు! సర్వదర్శివి! అశుద్ధధేనువువలె నిన్ను స్తుతించుచున్నాను ॥ 292

(23) గద్యము॥

ఓ మఘవానుఁడా! నీవలె నెవ్వరును స్వర్గమందుఁగాని పృథ్వియందుఁగాని జన్మింపలేదు. జన్మించరు. గోవులను, నన్నమును, నశ్వములను గోరుచు నిన్నుఁ బిలుచుచున్నాను ॥ 293

(24) గద్యము॥

ఇంద్రుఁడా! నీవు జ్యేష్ఠుఁడవు! నేను గనిష్ఠుఁడ నగుచున్నాను. మా నిమిత్త మా ధనమును దెమ్ము! నీవు చిరకాలమునుండి బహుధనవంతుఁడవు! ప్రత్యేక యుద్ధమందు హవ్య లాభయోగ్యుఁడవు! ॥ 294

(25) గద్యము॥

ఓ మఘవానుఁడా! శత్రువులను బరాఙ్ముఖులుగా నొనర్చుచుఁ బ్రేరేపింపుము! మాకు ధనమును సులభముగ నొనర్పుము! సంగ్రామములయందు మమ్ము రక్షింపుము! మాకు రక్షకుఁడవు వర్ధయితవు కమ్ము! ॥ 295

(26) గద్యము॥

ఓ యింద్రుఁడా! మాకుఁ గర్మను దెమ్ము! పిత పుత్రున కిచ్చునట్లు నీవు మాకు ధనము నిమ్ము! ఓ పురుహూతుఁడా! మా యజ్ఞమునకు జీవమువంటివాఁడవు! నేను బ్రత్యహము సూర్యుని బొందెదను ॥ 296

(27) గద్యము॥

ఓ యింద్రుఁడా! హింసకుఁడు, దుష్ప్రసాధ్యుఁడు, నమంగళమయుఁడు, నగు శత్రు వజ్ఞానమున మ మ్మాక్రమించలేఁడు. ఓ శూరుఁడా! నేను నీ చెంత నమ్రుఁడనై యనేక కార్యములను గీర్తించెదను ॥ 297

## సూక్తమ్—33

ఋషిః—1-9-మైత్రావరుణిర్వసిష్ఠః, 10-14-వసిష్ఠపుత్రాః
దేవతా—1-9-వసిష్ఠపుత్రాః ఇన్ద్రో వా, 10-14-వసిష్ఠః
ఛందః—త్రిష్టుప్

(1) శ్విత్యంచో మా దక్షిణతస్కపర్దా ధియంజిన్వాసో1 అభి హి ప్రమన్దుః ।
ఉత్తిష్ఠన్ వోచే పరి బర్హిషో నౄన్ న మే 2దూరాదవితవే వసిష్ఠాః ॥ 293

(2) దూరాదిన్ద్రమనయన్నా సుతేన తిరో వైశన్తమతి పాన్తముగ్రమ్ ।
పాశద్యుమ్నస్య వాయతస్య సోమాత్ సుతాదిన్ద్రోఽవృణీతా వసిష్ఠాన్ ॥ 294

(3) ఏవేన్ను కం సిన్ధుమేభిస్తతారేవేన్ను కం భేదమేభిర్జఘాన ।
ఏవేన్ను కం దాశరాజ్ఞే సుదాసం ప్రావదిన్ద్రో బ్రహ్మణా వో వసిష్ఠాః ॥ 295

(4) జుష్టీ నరో బ్రహ్మణా వః పితౄణామ 3క్షమవ్యయం న కిలా రిషాథ ।
యచ్ఛక్వరీషు బృహతా రవేణేన్ద్రే శుష్మమదధాతా వసిష్ఠాః ॥ 296

---

1. జిన్వాసోఽఅభి, 2. దురాదవితవే, 3. పితృణా. [వ్రా.ప్ర.]

(5) ఉద్ ద్యామివేత్ తృష్ణజో నాథితాసో ఉదీధయుర్దాశరాజ్ఞే[1] వృతాసః ।
వసిష్ఠస్య స్తువత[2] ఇన్ద్రో అశ్రోదురుం తృత్సుభ్యో [3]అకృణోదు లోకమ్ ॥ 297

(6) దణ్డా[4] ఇవేద్ గోఅజనాస ఆసన్ పరిచ్ఛిన్నా భరతా అర్భకాసః ।
అభవచ్చ [5]పురఏతా వసిష్ఠ ఆదిత్ తృత్సూనాం విశో[6] అప్రథన్త ॥ 298

(7) త్రియః కృణ్వన్తి భువనేషు రేతస్తిస్రః ప్రజా[7] ఆర్యా జ్యోతిరగ్రాః ।
త్రయో ఘర్మాస[8] ఉషసం సచన్తే సర్వాగ్ం[9] ఇత్ తాగ్ం అను విదుర్వసిష్ఠాః ॥ 299

(8) సూర్యస్యేవ వక్షథో జ్యోతిరేషాం సముద్రస్యేవ మహిమా గభీరః ।
వాతస్యేవ ప్రజవో నాన్యేన స్తోమో వసిష్ఠా[10]అన్వేతవే వః ॥ 300

(9) త[11] ఇన్నిణ్యం హృదయస్య ప్రకేతైః సహస్రవల్శమభి సం చరన్తి ।
యమేన తతం పరిధిం వయన్తో ఉప్సరస[12] ఉప సేదుర్వసిష్ఠాః ॥ 301

---

1. దాశరాజ్ఞే, 2. స్తువతఽఇన్ద్రోఽఅశ్రో, 3. తృత్సుభ్యోఽఅకృణో, 4. దణ్డాఽఇవేద్గోఽఅజనాసఽఆస,
5. పురఽఏతావసిష్ఠఽఆదిత్, 6. విశోఽఅప్రథన్త, 7. ప్రజాఽఆర్య, 8. ఘర్మాసఽఉష,
9. సర్వాగ్ంఽఇత్తాగ్ంఽఅను, 10. వసిష్ఠాఽఅన్వే, 11. తఽఇన్నిణ్యం,
12. వయన్తోఽఉప్సరసఽఉప. [ప్రా.ప్ర.]

(10) విద్యుతో జ్యోతిః పరి సంజిహానం మిత్రావరుణా యదపశ్యతాం త్వా ।
తత్ తే జన్మోతైకం వసిష్ఠాఽగస్త్యో[1] యత్ త్వా విశ[2] ఆజభార ॥ 302

(11) [3]ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసోఽధి[4] జాతః ।
ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వే దేవాః పుష్కరే త్వాదదన్త ॥ 303

(12) స ప్రకేత[5] ఉభయస్య ప్రవిద్వాన్ త్సహస్రదాన[6] ఉత వా సదానః ।
యమేన తతం పరిధిం వయిష్యన్నప్సరసః పరి జజ్ఞే వసిష్ఠః ॥ 304

(13) సత్రే హ జాతావిషితా నమోభిః కుమ్భే[7] రేతః సిషిచతుః సమానమ్ ।
తతో హ మాన[8] ఉదియాయ మధ్యాత్ తతో జాతమృషిమాహుర్వసిష్ఠమ్ ॥ 305

(14) ఉక్థభృతం సామభృతం బిభర్తి గ్రావాణం బిభ్రత్ ప్ర వదాత్యగ్రే ।
ఉపైనమాధ్వం సుమనస్యమానా[9] ఆ వో గచ్ఛాతి ప్రతృదో వసిష్ఠః ॥ 306

---

1. వసిష్ఠాగస్త్యో, 2. విశఽఆజభార, 3. ఉతసిమైత్రా, 4. మనసోధిజాతః, 5. ప్రకేతఽఉభయ, 6. దానఽఉత, 7. కుమ్భరేతః, 8. మానఽఉదియా, 9. మానాఽఆ వో. [వ్రా.ప్ర.]

## సూక్తము—33

ఋషి —మైత్రావరుణియగు వసిష్ఠుఁడు, 10-14-వశిష్ఠుని పుత్రులు*
దేవత—వసిష్ఠపుత్రగణము లేక ఇంద్రుఁడు, 10-14-వశిష్ఠుఁడు†

(1) గద్యము॥

శ్వేతవర్ణముఁ గర్మపూరకము నగు దక్షిణభాగమందుఁ జూడాధరులు మము హర్షితులుగాఁ జేసిరి. నేను బైనుండి లేచుసమయమున లోక మంతట నిట్లు చాటుము! వసిష్ఠగణము మా చెంతనుండి దూరముగాఁ దొలఁగకుండుఁగాక! ॥ 298

(2) గద్యము॥

వసిష్ఠపుత్రగణము చమసస్థసోమపాయిని నుగ్రుఁడగు నింద్రుఁని దూరమునుండి పాశాదులను దిరస్కరించుచు సోమముద్వారా తెచ్చెను ॥ 299

(3) గద్యము ॥

ఇట్టులనే వారు సుఖముగా నదులను దాటఁగల్గిరి. భేదుఁ డనువానిని జంపఁగలిఁగిరి. ఓ వాసిష్ఠగణమా! యిట్టులనే దశజన రాజుతో జరిగిన యుద్ధమున మీ మంత్ర బలముచేతనే యింద్రుఁడు సుదాసరాజును రక్షింపఁగలిఁగెను ॥ 300

(4) గద్యము॥

ఓ మనుష్యులారా! మీ స్తోత్రముద్వారా పితృదేవతలు తృప్తి నొందుదురు. నేను రథాక్షములను క్షయ మొనర్చెదను. ఓ వసిష్ఠగణమా! మీ శక్వరీ ఋక్కు-శ్రేష్ఠ శబ్దములవలన నింద్రబలమును సంపాదించినది. ఓ వసిష్ఠగణమా! మీరు క్షీణులు కాకూడదు ॥ 301

---

* వ్రాఁతప్రతిలో (7వ సంపుటము.115వపుట) నీ సూక్తమునకు ఋషి "వసిష్ఠ శిష్యగణము" అనియు ఋషి దేవతలపట్టికలుగల15bసంఖ్యగల సంపుటములో "వశిష్ఠుఁడు వానిపుత్రులు (10—14)" అనియుఁగలదు.

† వ్రాతప్రతిలో (7వసంపుటము) దేవత "వసిష్ఠపుత్రగణము" గాను, 15bసంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "వశిష్ఠపుత్రులు, వశిష్ఠుఁడు"గాను వ్రాయఁబడియున్నది.

(5) గద్యము॥

జాతతృష్ణులు, రాజపరివృతులు, వృష్టిప్రేర్తులు నగు వసిష్ఠగణములు దశరాజుతో† జరుగు యుద్ధమున నాదిత్యునివలె నింద్రుని నూర్ధ్వముగ నుత్థాపితునిగ నొనర్చిరి. స్తుతికారి యగు వసిష్ఠుని స్తుతిని నింద్రుఁడు వినెను. రాజులకై విస్తీర్ణలోకము నొసంగెను ॥ 302

(6) గద్యము॥

గోప్రేరకమగు దండము మాటికి భరతగణము (శత్రువులయందు) పరిచ్ఛిన్నానల్ప సంఖ్యాకమై యున్నది. అనంతరము వసిష్ఠుఁడు మాకుఁ బురోహితుఁ డయ్యెను. తృత్సులకుఁ బ్రజావృద్ధి యగుట మొదలిడెను ॥ 303

(7) గద్యము॥

ముగ్గురు జనులు భువనమందు జలమును బుట్టింతురు. వారికి జ్యోతిష్ ప్రముఖులును నార్యులును నగు ముగ్గురు జనులు గలరు. దీప్తిమంతు లగు నా ముగ్గురు నుషన్సును వయన మొనర్తురు. వసిష్ఠుఁడు వారి నందరిని నెరుంగును ॥ 304

(8) గద్యము॥

ఓ వాసిష్ఠగణమా! మీ స్తోమము సూర్యజ్యోతివలెఁ బ్రకాశిత మగును. మీ మహిమ సముద్రము వలె గంభీరమైనది. మీ స్తోమము వాయువేగమువలె నన్యు ననుగమించుట కశక్యమైనది ॥ 305

† దశరాజ యుద్ధ మిది. సుదాసుఁ డనువాఁడు వశిష్ఠునిద్వారా యింద్రుని సహాయమును బడసెనఁట. ఆర్యులు మొదట నార్యావర్తమునకు వచ్చినపు డిచ్చటనున్న యాదిమ నివాసులతోఁ జేసిన యుద్ధ మిచ్చట వర్ణింపఁ బడినదని కొందరూహించుచున్నారు. లోకమాన్యుఁడు (బాలగంగాధరతిలక్) (x. 120_6)మంత్రములో వర్ణింపఁబడిన యంధకారరాక్షసులతోఁజేసిన యుద్ధమే యీరీతిగ వర్ణింపఁబడెనని యభిప్రాయపడెను. ఇంక నీ విషయమునుగూర్చి యిట్లువ్రాసిరి. "రామాయణమునకు నైతిహాసికముల యాధార మేమైన కలదా? యని విచారింపవలసియున్నది. రామాయణమునఁ బ్రతి సూక్ష్మవిషయమున కేదియో యొక చిన్న ఐతిహాసిక విషయ ముండితీరవలయును. రామాయణకవి వైదికగాథలనుండి కొన్ని చిన్నచిన్న యంశములను గ్రహించి మూలమునందు నైతిహాసముగ నున్న ప్రధానాంశములతో సమ్మిశ్రితము కావించి రామాయణకథ నల్లెనని తెలియుచున్నది. దశరాజయుద్ధమందు సుదాసుఁడు అయజ్వలగు పదిమంది రాక్షసరాజులతోఁ బోరాడవలసి వచ్చె ననియు ఋగ్వేదమందుఁ జెప్పఁబడెను. వేదమందుఁ జెప్పఁబడిన యీపదిమంది రాజులె రామాయణమందు పదితలలు కలిఁగిన యొక్క రావణుఁడుగ వర్ణింపఁబడెను. రావణునితమ్ముఁడు కుంభకర్ణుఁడు యెడతెగక యారునెలలు నిద్రపోవుచుండుననుట ధ్రువమండల దీర్ఘరాత్రిని సూచించుచున్నది" అని యే మేమో వ్రాసిరి. ఈ యంశమును బెద్దలు విచారించెదరుగాక! (నే. వేం. న. శా.)

(9) గద్యము॥

ఆ వసిష్ఠగణము హృదయజ్ఞానముద్వారా తిరోహిత సహస్రశాఖలుగల సంసారమందుఁ దిరుగుదురు. వారు యమకర్తృకమగు విస్తృతవస్త్రమును వయన మొనర్చుచు నప్సరో గణములయొద్దకుఁ బోయిరి ॥ 306

(10) గద్యము॥

ఓ వాసిష్ఠగణమా! విద్యుత్తువలె స్వీయజ్యోతిస్సును బరిత్యజించునపుడు మిత్రుఁడు, వరుణుఁడు మిమ్ములను జూచియున్నారు. అగస్త్యవాసస్థానమునుండి మి మ్మెప్పుడు కొని తెచ్చిరో! యప్పుడు మీ కొక్కటియే జన్మము ॥ 307

(11) గద్యము॥

మరియు నో వసిష్ఠుఁడా! నీవు మిత్రావరుణుల పుత్రుఁడవు! ఓ బ్రాహ్మణుఁడా! యూర్వశీ మనస్సునుండి నీవు పుట్టితివి! మిత్రావరుణుల రేతస్సు స్కలన మైనది. విశ్వే దేవ గణము దైవ్యస్తోత్రముద్వారా పుష్కరమధ్యమందు నిన్ను ధరించిరి ॥ 308

(12) గద్యము॥

ప్రకృష్టజ్ఞానసంపన్నుఁడగు వసిష్ఠుఁ డుభయలోకములు తెలిసికొని సహస్రదానుఁడో! సర్వదానవిశిష్టుఁడో! యయ్యెను. యముఁ డొనరించిన విస్తీర్ణవస్త్రమును వయనముఁ జేయుద మను నిచ్ఛచే వశిష్ఠుఁ డూర్వశినుండి పుట్టెను ॥ 309

(13) గద్యము॥

"యజ్ఞమందుఁ బుట్టిన మిత్రావరుణులు స్తుతులచేఁ బ్రార్థింపఁబడినవారై కుంభమధ్యమున నొక్కమారు రేతఃపతనమును గావించిరి. అనంతరము మధ్యనుండి మానము ప్రాదుర్భూత మయ్యెను. ఋషి దానివలనఁ బుట్టినాఁడు" అను ప్రతీతి కలదు ॥ 310

(14) గద్యము॥

ఓ ప్రత్యుద్గణమా ! వసిష్ఠుఁడు మీ నికటమునకు వచ్చినాఁడు. నీవు ప్రసన్న మనస్సుగలవాఁడ వగుటకుఁ బూజ నొనర్పుము! వాఁ డగ్రగవర్తియై యుక్థధారియు, సోమధారియుఁ, బ్రస్తరాభిషవణకారియు నగు నిను ధరించును. మరియు వస్తవ్యావాచన మొనర్చును ॥ 311

## అనువాకః—3, సూక్తమ్—34

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—విశ్వేదేవాః, 16-అహిః, 17-అహిర్బుధ్న్యః

ఛందః—ద్విపదావిరాట్, 22-25-త్రిష్టుప్

(1) ప్ర శుక్రైతు దేవీ మనీషా[1] అస్మత్

సుతష్టో రథో న వాజీ ॥ 307

(2) విదుః పృథివ్యా దివో జనిత్రం

శృణ్వన్త్యాపో[2] అధ క్షరన్తీః ॥ 308

(3) ఆపశ్చిదస్మై పిన్వన్త[3] పృథ్వీర్వృత్రేషు

శూరా మంసన్త ఉగ్రాః ॥ 309

---

1. మనీషాఽఅస్మాత్, 2. పోఽఅధ, 3. పిన్వన్త. [ప్రా.ప్ర.]

(4) ఆ ధూర్ష్వస్మై దధాతాశ్వానిన్ద్రో
న వజ్రీ హిరణ్యబాహుః ॥ 310

(5) అభి ప్ర స్థాతాహేవ యజ్ఞం యాతేవ
పత్మన్ త్మనా హినోత ॥ 311

(6) త్మనా సమత్సు హినోత యజ్ఞం
దధాత కేతుం జనాయ వీరమ్ ॥ 312

(7) ఉదస్య శుష్మాద్ భానుర్నార్త
బిభర్తి భారం పృథివీ న భూమ ॥ 313

(8) హ్వయామి దేవాగ్ం[1] అయాతురగ్నే
సాధన్నృతేన ధియం దధామి ॥ 314

---

1. దేవాగ్ంఽఅయాతు. (బ్రా.ప్ర.)

(9) అభి వో దేవీం ధియం దధిధ్వం ప్ర వో

దేవత్రా వాచం కృణుధ్వమ్ ॥ 315

(10) ఆ చష్ట[1] ఆసాం పాథో నదీనాం

వరుణ[2] ఉగ్రః సహస్రచక్షాః ॥ 316

(11) రాజా రాష్ట్రానాం పేశో నదీనామనుత్తమస్మై

క్షత్రం విశ్వాయు ॥ 317

(12) అవిష్టో అస్మాన్ విశ్వాసు విక్ష్వద్యుం

కృణోత శంసం నినిత్సోః ॥ 318

(13) వ్యేతు దిద్యుద్ ద్విషామశేవా

యుయోత విష్వగ్రపస్తనూనామ్ ॥ 319

---

1. ఆ చష్టఽఆసాం, 2. వరుణఽఉగ్రః. (వా.ప్ర.)

(14) అజీర్నో1 అగ్నిర్దవ్యాన్నమోభిః
ప్రేష్ఠో2 అస్మా అధాయి స్తోమః ॥ 320

(15) సజూర్దేవేభిరపాం నపాతం
సఖాయం కృధ్వం శివో నో అస్తు ॥ 321

(16) అబ్జాముక్థైరహిం గృణీషే
బుధ్నే నదీనాం రజఃసు షీదన్ ॥ 322

(17) మా నోఽహిర్బుధ్న్యో3 రిషే ధాన్మా యజ్ఞో4
అస్య స్రిధదృతాయోః ॥ 323

(18) ఉత న5 ఏషు నృషు శ్రవో ధుః ప్ర
రాయే యన్తు శర్ధన్తో6 అర్యః ॥ 324

---

1. అవిర్నోఽఅగ్ని, 2. ప్రేష్ఠోఽఅస్మాఽఅధాయి, 3. మానోహిర్బుధ్న్యః, 4. యజ్ఞోఽఅస్య,
5. ఉత నఽఏషు, 6. శర్ధన్తోఽఅర్యః (ప్రా.ప్ర.)

(19) తపన్తి శత్రుం స్వ౧ర్ణ భూమా

మహాసేనాసో[1] అమేభిరేషామ్ ॥ 325

(20) ఆ యన్నః పత్నీర్గమన్త్యచ్ఛా త్వష్టా

సుపాణిర్దధాతు వీరాన్ ॥ 326

(21) ప్రతి నః స్తోమం త్వష్టా జుషేత

స్యాదస్మే[2] అరమతిర్వసూయుః ॥ 327

(22) తా నో రాసన్ రాతిషాచో వసూన్యా రోదసీ వరుణానీ శృణోతు ।

వరూత్రీభిః సుశరణో నో[3] అస్తు త్వష్టా సుదత్రో వి దధాతు రాయః ॥ 328

(23) తన్నో రాయః పర్వతాస్తన్న[4] ఆపస్తద్ రాతిషాచ ఓషధీరుత ద్యౌః ।

వనస్పతిభిః పృథివీ సజోషా[5] ఉభే రోదసీ పరి పాసతో నః ॥ 329

---

1. సేనాసోఽఅమే, 2. దస్మేఽఅరమతి, 3. నోఽఅస్తు, 4. పర్వతాస్తన్నఽఆపస్తద్రాతిషాచఽఓషధీ,

5. సజోషాఽఉభే, (ప్రా.ప్ర.)

(24) అను తదుర్వీ రోదసీ జిహాతామను ద్యుక్షో వరుణ[1] ఇన్ద్రసఖా ।
అను విశ్వే మరుతో యే సహాసో రాయః స్యామ ధరుణం ధియధ్యై ॥ 330

(25) తన్న[2] ఇన్ద్రో వరుణో మిత్రో[3] అగ్నిరాప ఓషధీర్వనినో జుషన్త ।
శర్మన్ త్స్యామ మరుతాముపస్థే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 331

## అనువాకము—3, సూక్తము—34

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—విశ్వే దేవగణము, 16-అహి, 17-అహిర్బుధ్న్యుఁడు*

(1) గద్యము॥
దీప్తము, నభీష్టప్రదస్తుతి, వేగవంతము, సంస్కృతము నగు రథమువలె మా
చెంతనుండి దేవతలకడకుఁ జనుము! ॥ 312

(2) గద్యము॥
క్షరణశీల మగు జలముయొక్కయు స్వర్గభూములయొక్కయు నుత్పత్తి తెలిసినది.
మఱియు స్తుతి నాలింపుము! ॥ 313

---

1. వరుణాఽఇన్ద్ర, 2. తన్నఽఇన్ద్రో, 3. మిత్రోఽఅగ్నిరాపఽఓషధీ. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (7వ సంపుటము. 119వ పుట) నీ సూక్తమునకు దేవత "విశ్వేదేవగణము" గాను, ఋషి దేవతల పట్టికలు గల 15b సంఖ్యగల సంపుటములో "విశ్వేదేవగణము, అహిర్బుధ్న్యుఁడు" గాను పేర్కొనఁబడినది.

(3) గద్యము॥

విస్తీర్ణజలము నింద్రు నాప్యాయితగఁ జేయును. ఉపద్రవము వచ్చినపు డుగ్రశూరగణము
వానిని స్తుతి సేయును ॥ 314

(4) గద్యము॥

వాని కభిముఖముగ నశ్వములను రథాగ్రమునందుఁ గూర్చుఁడు! ఇంద్రుఁడు వజ్రధారి.
సువర్ణమయ హస్త విశిష్టుఁడు ॥ 315

(5) గద్యము॥

యజ్ఞాభిముఖముగఁ జనుఁడు! జనులారా! గంతవ్యునివలె మీరు యజ్ఞమార్గమునఁ
జనవలయును ॥ 316

(6) గద్యము॥

సంగ్రామమునకు స్వయముగఁ జనుఁడు! లోకమునకై ప్రజ్ఞాపకముఁ బాపవారము నగు
యజ్ఞము నాచరింపుఁడు! ॥ 317

(7) గద్యము॥

ఈ యజ్ఞబలమునుండి సూర్యుఁడు పుట్టెను. పృథ్వి యెట్లు భూతగణముల భారమును
వహించునో! యట్లు సూర్యుఁడు యజ్ఞభారమును వహించుచున్నాఁడు ॥ 318

(8) గద్యము॥

ఓ యగ్ని! యహింసాది నియమములుగల యజ్ఞములద్వారా మనోరథముల నిండించుచు
దేవతలఁ బిలుచుచున్నాను. వారికై యజ్ఞములను జేయుచున్నాను ॥ 319

(9) గద్యము॥

ఓ జనులారా! మీరు దేవతల నుద్దేశించి దీప్తకర్మ లుద్ధరింపుఁడు! స్తుతులఁ జేయుఁడు! ॥ 320

(10) గద్యము॥

ఉగ్రసహస్రచక్షు వగు వరుణుఁ డీ నదీజలమును దర్శించుఁగాక! ॥ 321

(11) గద్యము॥

వరుణుఁడు రాష్ట్రమునకు† రాజు. నదీరూపుఁడు. వాని బల మవారితము. సర్వతో గామి ॥ 322

(12) గద్యము॥

ఓ దేవగణమా! యందఱి ప్రజలలోను మమ్ము రక్షింపుము! నిందాకరణేచ్ఛు లగు
శత్రువులను దీప్తిరహితులుగా నొనర్పుము! ॥ 323

(13) గద్యము॥

అసుఖజనకులగు శత్రువుల యాయుధములు నాలుగు దిక్కులకుఁ జెదరిపోవుఁగాక!
ఓ దేవతలారా! శరీరపాపమును మానుండి వేరుగాఁ జేయుఁడు! ॥ 324

(14) గద్యము॥

హవ్యభోజి యగు నగ్ని నమస్కారముద్వారా ప్రియతముఁ డగును. వాఁడు మాకు
రక్షఁ జేయును. మేము వానిని స్తుతించెదము ॥ 325

---

†రాష్ట్రమునకు రాజు—ఈ కాలమునఁ బ్రత్యేకరాష్ట్రములుగాఁ గొన్ని కలవనుట కిది నిదర్శనము. ఇంక నైతరేయ బ్రాహ్మణము వరుణప్రస్తావమున రాజ్యవిభాగము లిట్లు కలవు. స్వారాజ్యము, వైరాజ్యము, పారమేష్ఠ్యము, రాజ్యము, మహారాజ్యము, ఆధిపత్యము మొదలగునవి కలవు. వీని వివరణములు వేరొక సందర్భమున లిఖింపఁబడినవి—(నే.వేం.న.శా.)

(15) గద్యము॥

దేవతలకు సహచరుండగు నపాత్తుని సఖునిగాఁ జేసికొనుము! వాఁడు మాకు మంగళకరుఁ
డగును ॥ 326

(16) గద్యము॥

మేఘహంతృ నదీస్థానమునందున్న జలజాతమందుఁ గల యగ్ని స్తోత్రములచే
స్తుతింపుము! ॥ 327

(17) గద్యము॥

అహిర్బుధ్న్యుఁడు మమ్ము హింసకుల హస్తములలోఁ బెట్టకుండునుగాక! యజ్ఞకర్తలయొక్క
యజ్ఞములు క్షీణములు కాకుండుఁగాక! ॥ 328

(18) గద్యము॥

దేవత లీ లోకమునకై యన్నమును ధరింతురు. ధనమున కుత్సహించుచున్న శత్రువులు
వెడలుదురు ॥ 329

(19) గద్యము॥

ఆదిత్యుఁడు భూతగణము నెట్లు తపింపఁజేయునో! †మహాసేనాసహితమగు రాజసమూహము
వారి బలముచే నట్లు శత్రువులను దపింపఁజేయును ॥ 330

---

† మహాసేనాసహితమగు రాజసమూహము—రాజ్యసంరక్షణార్థము రాజులు మహాసేనలను బోషించుచుండిరి. తద్ద్వారా శత్రువులను బాధలు పెట్టుచుండి రనుట కీ మంత్రార్థము నిదర్శనము. (నే.వేం.న.శా.)

(20) గద్యము॥

దేవపత్నులు మా కభిముఖముగ వచ్చెదరు. కాఁబట్టి యుత్తమ హస్తములు గల త్వష్ట
మాకు వీరపుత్రుల నిచ్చుఁగాక! ॥ 331

(21) గద్యము॥

త్వష్ట మా స్తోత్ర సేవఁజేయునుగాక! పర్యాప్తబుద్ధిగల త్వష్ట మాగురించి
ధనకాముఁ డగును ॥ 332

(22) గద్యము॥

దానదక్ష లగు దేవపత్నులు మా కొసంగుట కేమిదలఁచిరో! యది యిచ్చెదరుగాక! దానిని
ద్యావాపృథ్వులు, వరుణానియు† వినెదరుగాక! కళ్యాణకర దానవిశిష్టుఁడును త్వష్టయు
నుపద్రవములను నివారించు దేవపత్నులతో సుశరణప్రదు లగుదురు ॥ 333

(23) సీ॥ పర్వతపంక్తి మా పరమధనంబును నంచితరీతిఁ బాలించుఁగాక!
దేవపత్నులు దాన దీప్తితోఁగూడి తా మెసఁగు నా ధనము రక్షింత్రుగాక!
నోషధీతతు లెల్ల నుచితరీతిని బూని కరము దానిని భద్రపరచుఁగాక!
ద్యోలోకమును దాని ద్యుతి వెలింగెడున ట్లమేయ సంతుష్టితోఁ జేయుఁగాక!

గీ॥ నల వనస్పతి సహితమౌ నంతరిక్ష
భాగమును నా ధనంబుఁ గాపాడుఁగాక!
దివియు భూమియు మా కిల దివ్యరక్ష
నొసఁగుదురుగాక! సంతతోత్సాహ మొంది॥ 334

---

† వరుణాని = వరుణపత్ని.

(24) గద్యము॥

మేము ధారుణీ ధనమున కాధారుల మగుదుము. విస్తీర్ణ ద్యావాభూములు దాని ననుమో
దించునుగాక! దీప్తికి నాధారభూతుం డగు నింద్రుఁడు, సఖుఁ డగు వరుణుఁడు, దాని
ననుమోదింతురుగాక! ఎవరు పరాజయమును గావింతురో! యా మరుత్తు
లనుమోదింతురుగాక! ॥ 335

(25) గద్యము॥

ఇంద్రుఁడు, వరుఁణుడు, మిత్రుఁడు, నగ్ని, నీరు, నోషధులు, వృక్షగణము, మా నిమిత్త
మీ స్తోత్రముల సేవింతురుగాక! మరుద్గణముల సమీపముననుండి మేము సుఖముగ
నుండెదము. మీరు సర్వదా మమ్ము స్తుతిద్వారా పరిపాలింపుఁడు! ॥ 336

## సూక్తమ్—35

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్, 19—త్రిపదా విరాట్, 20—ద్విపదా విరాట్

(1) శం న[1] ఇన్ద్రాగ్నీ భవతామవోభిః శం న ఇన్ద్రావరుణా రాతహవ్యా ।
శమిన్ద్రాసోమా సువితాయ శం యోః శం న ఇన్ద్రాపూషణా వాజసాతౌ ॥ 332

(2) శం నో భగః శము నః శంసో[2] అస్తు శం నః పురంధిః శము సన్తు రాయః ।
శం నః సత్యస్య సుయమస్య శంసః శం నో అర్యమా పురుజాతో అస్తు ॥ 333

1. శం నఽఇన్ద్రా, 2. శంసోఽఅస్తు. [వా.ప్ర.]

(3) శం నో ధాతా శము ధర్తా నో[1] అస్తు శం న ఉరూచీ భవతు స్వధాభిః ।
శం రోదసీ బృహతీ శం నో[2] అద్రిః శం నో దేవానాం సుహవాని సన్తు ॥ 334

(4) శం నో అగ్నిర్జ్యోతిరనీకో[3] అస్తు శం నో మిత్రావరుణావశ్వినా[4] శమ్ ।
శం నః సుకృతాం సుకృతాని సన్తు శం న[5] ఇషిరో అభి వాతు వాతః ॥ 335

(5) శం నో ద్యావాపృథివీ పూర్వహూతౌ శమన్తరిక్షం దృశయే నో[6] అస్తు ।
శం న[7] ఓషధీర్వనినో భవన్తు శం నో రజసస్పతిరస్తు జిష్ణుః ॥ 336

(6) శం న ఇన్ద్రో వసుభిర్దేవో అస్తు శమాదిత్యేభిర్వరుణః సుశంసః ।
శం నో రుద్రో రుద్రేభిర్జలాషః శం నస్త్వష్టా గ్నాభిరిహ శృణోతు ॥ 337

(7) శం నః సోమో భవతు బ్రహ్మ శం నః శం నో గ్రావాణః శము సన్తు యజ్ఞాః ।
శం నః స్వరూణాం మితయో భవన్తు శం నః ప్రస్వః శమ్వస్తు వేదిః ॥ 338

---

1. ధర్తా నో॒ఽఅస్తు శం న॒ఽఉరూచీ, 2. శంనో॒ఽఅద్రిః, 3. రనీకో॒ఽఅస్తు, 4. విశ్వనాశమ్,
5. శం న॒ఽఇషిరో, 6. నో॒ఽఅస్తు. 7. శం న॒ఽఓషధీ. [వా.ప్ర.]

(8) శం నః సూర్య[1] ఉరుచక్షా ఉదేతు శం నశ్చతస్రః ప్రదిశో భవన్తు ।
శం నః పర్వతా ధ్రువయో భవన్తు శం నః సిన్ధవః శము సన్త్వాపః ॥ 339

(9) శం నో అదితిర్భవతు వ్రతేభిః శం నో భవన్తు [2]మరుతః స్వర్కాః ।
శం నో విష్ణుః శము [3]పూషా నో అస్తు శం నో భవిత్రం శమ్వస్తు వాయుః ॥ 340

(10) శం నో దేవః సవితా త్రాయమాణః శం నో భవన్తూషసో విభాతీః ।
శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః శం నః క్షేత్రస్య పతిరస్తు శంభుః ॥ 341

(11) శం నో దేవా విశ్వదేవా భవన్తు శం సరస్వతీ సహ ధీభిరస్తు ।
శమభిషాచః శము రాతిషాచః శం నో దివ్యాః పార్థివాః శం నో [4]అప్యాః ॥ 342

(12) శం నః సత్యస్య పతయో భవన్తు శం నో[5] అర్వన్తః శము సన్తు గావః ।
శం న[6] ఋభవః సుకృతః సుహస్తాః శం నో భవన్తు పితరో హవేషు ॥ 343

---

1. సూర్యఽఉరుచక్షాఽఉదేతు, 2. మరుతాః, 3. పుషా నోఽఅస్తు, 4. శం నోఽఅప్యాః,
5. శం నోఽఅర్వన్తః, 6. శం నఽఋభవః. [వ్రా.ప్ర.]



(13) శం నో1 అజ ఏకపాద్ దేవో అస్తు శం నో ఽహిర్బుధ్న్యః2 శం సముద్రః ।
శం నో3 అపాం నపాత్ పేరురస్తు శం నః పృశ్నిర్భవతు దేవగోపా ॥ 344

(14) ఆదిత్యా రుద్రా వసవో జుషన్తేదం బ్రహ్మ4 క్రియమాణం నవీయః ।
శృణ్వన్తు నో దివ్యాః పార్థివాసో గోజాతా5 ఉత యే యజ్ఞియాసః ॥ 345

(15) యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానాం మనోర్యజత్రా6 అమృతా ఋతజ్ఞాః ।
తే నో 7రాసన్తాముురుగాయమద్య యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 346

*(16) శంవతీః పారయన్త్యేతే శం పృచ్ఛన్తి వచో యుజా ।
అఖ్యారం తం యమాకేతుం య ఏవేదమితి బ్రువన్ ॥ 347

*(17) భాసాకేతుం పరిస్రుతం భారతీర్బ్రహ్మవర్ధనీః ।
సంజానానా మహీ మాతా య ఏవేదమితి బ్రవత్ ॥ 348

---

1. శం నోఽఅజఽఏకపాద్దేవోఽఅస్తు, 2. బుధ్న్యఃశం, 3. శం నోఽఅపాం, 4. బ్రహ్మ క్రియమాణం, 5. గోజాతాఽఉతయే, 6. యజత్రాఽఅమృతాఽఋతజ్ఞాః, 7. సన్తోమురుగా. [వ్రా.ప్ర.]

* 16వ ఋక్కు మొదలు 21వ ఋక్కు వరకుఁ గల మంత్రములు పరిశిష్టములుగాఁ గొన్ని వ్రాఁత ప్రతులలోఁ గలవు. ఇవి "ఖిల" మంత్రములని కొందరు భావించిరి.

*(18) ఇంద్రస్త్వం కిం విధుం ప్రధుం భానునేయం సరస్వతీం ।

యేన సూర్యమరోచయద్వ్యేనేమే రోదసీ ఉభే ॥ 349

*(19) జుషస్వాగ్నే అంగిరః కాణ్వం మేధ్యాతిథిమ్ ।

మా త్వా సోమస్య బర్బృహత్ సుతస్య మధుమత్తమః ॥ 350

*(20) త్వమగ్నే అంగిరః శోచస్వ దేవవీతమః ।

ఆ శంతమ శంతమాభిరభిష్టిభిః శాంతిః స్వస్తిమకుర్వత ॥ 351

*(21) శం నః కనిక్రదద్ దేవః పర్జన్యో అభి వర్షతు ।

శం నో ద్యావాపృథివీ శం ప్రజాభ్యః శం న ఏధి ద్విపదే శం చతుష్పదే ॥ 352

ఇతి

పంచమోఽష్టకే తృతీయోఽధ్యాయ

స్సమాప్తః

---

* ఇవి పరిశిష్ట మంత్రములుగాఁ గొన్ని వ్రాతప్రతులలోఁ గలవు. ఇవి "ఖిల" మంత్రములని కొందరు భావించిరి. కొన్ని వ్రాఁ ప్రతులలో 16_17_18_19 ఋక్కులుమాత్రమే యుండఁగా మరికొన్ని వ్రాతప్రతులలో 20_21 ఋక్కు అధికముగాఁ గలవు.

## సూక్తము—35

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—విశ్వే దేవగణము

(1) గద్యము॥

ఓ యింద్రాగ్నులారా! రక్షాద్వారా! మాకు శాంతి ప్రదులు కండు! ఓ యింద్రావరుణులారా! యజమానుఁడు హవ్యము నిచ్చుచున్నాఁడు. మీరు మాకు శాంతిని గళ్యాణమును నొసంగుఁడు! ఇంద్రుఁడు పూషణుఁడు మాకు శాంతిని సుఖమును నొసంగుత! ॥ 337

(2) గద్యము॥

భగుఁడు మాకు శాంతిప్రదుఁ డగును. నరాశంసుఁడు మాకు శాంతిప్రదుఁడగును. ధనమంతయు మాకు శాంతి నిచ్చును. ఉత్తమ యమసహిత సత్యవచనము మాకు శాంతిప్రద మగును. పెక్కుమారులు ప్రాదుర్భూతుం డగు నర్యముఁడు శాంతిప్రదుఁ డగును ॥ 338

(3) గద్యము ॥

ధాత మాకు శాంతిప్రదుఁ డగును. భరించెడి వరుణుఁడు మాకు శాంతిప్రదుఁ డగును. †ధివర్తగమనముగల పృథివి యన్నముతోఁగూడ మాకు శాంతిప్రద యగును. గొప్పవి యగు ద్యావాభూములు మాకు శాంతిప్రద లగును. పర్వతములు, దేవతాగణము, నుత్కృష్టస్తుతులు, మాకు శాంతి నిచ్చును ॥ 339

(4) గద్యము॥

జ్యోతిర్ముఖుం డగు నగ్నియు, మిత్రావరుణులు, నశ్విద్వయము, మాకు శాంతి నిచ్చెదరు. పుణ్యకారులయొక్క పుణ్యకర్మయు గమనశీలుం డగు వాయువు మానిమిత్తము శాంతిని వహించుట కుండెదరుగాక! ॥ 340

---

† ధివర్తగమనము = వివర్తగమనము

(5) గద్యము.

మొదటఁ బిలిచినతోడనే ద్యావాభూములు శాంతిప్రద లగుఁగాక! అంతరిక్షము దర్శనార్థమై మాకు శాంతిప్రద మగుఁగాక! ఓషధులు, వృక్షములు, మాకు శాంతిప్రద లగును. జయశీలుం డగు లోకపతి మాకు శాంతిప్రదుఁ డగును॥ 341

(6) గద్యము॥

దేవుండగు నింద్రుండు వసుగణముతో మాకు శాంతి నొసంగును. శోభనస్తుతి సహితుం డగు వరుణుం డాదిత్యగణముతోఁగూడ మాకు శాంతి నొసంగును. రుద్రదేవుఁడు రుద్రగణముతోఁగూడ మాకు శాంతి నొసఁగును. దేవ పత్నులతోఁగూడ త్వష్ట మాకు శాంతి నొసఁగును. యజ్ఞమందు వీరెల్లరును మా స్తోత్రముల నాలకించెదరుగాక! ॥ 342

(7) గద్యము॥

సోమము మాకు శాంతి నొసఁగుఁగాక! స్తోత్రము శాంతిప్రద మగును. ప్రస్తరగణము, యజ్ఞము, యూపపరిమాణము, మాకు శాంతిప్రదము లగును. ఓషధిగణము, వేదియు శాంతిప్రదము లగును ॥ 343

(8) గద్యము॥

విస్తీర్ణ తేజస్కుం డగు సూర్యుఁడు మాకు శాంతి కలుఁగుటకై యుదయించును. నాలుగు మహాదిక్కులు, స్థిరపర్వతములు మాకు శాంతి నొసంగును. నదీసమూహము, జలము, మా శాంతికై యుండును ॥ 344

(9) గద్యము॥

అదితి కర్మద్వారా మాకు శాంతి నొసంగును. శోభనస్తుతిసహితులగు మరుత్తులు మాకు శాంతిప్రదు లగుదురు. విష్ణువు శాంతిప్రదుఁ డగుఁగాక! పూషణుఁడు మాకు శాంతి ప్రదుఁ డగును. అంతరిక్షము, వాయువును, మాకు శాంతిప్రదలు ॥ 345

(10) గద్యము॥

సవితృదేవుఁడు రక్షఁ గొనర్చుచు మాకు శాంతిప్రదుఁ డగును. తమో నివారక మగు నుషస్సమూహము మాకు శాంతిని బ్రసాదించును. పర్జన్యుఁడు ప్రజలకై శాంతిప్రదుఁడై యుండును! క్షేత్రపతి యగు శంభువు మాకు శాంతిప్రదుఁ డగును॥ 346

(11) గద్యము॥

వ్రతమంత మగు విశ్వేదేవగణము మాకు శాంతిప్రద మగును. సరస్వతి కర్మసహితయై మాకు శాంతిప్రద యగును. యజ్ఞసేవకులు దానదక్షులు మాకు శాంతిప్రదు లగుదురు. భూలోకము, ద్యులోకము, నంతరిక్షలోకము, వీనియందుఁ బుట్టిన వన్నియు మాకు శాంతిప్రదము లగును॥ 347

(12) గద్యము

సత్యమును బరిపాలించెడి దేవతలు మాకు శాంతి నొసంగెదరు. అశ్వములు, గోవులు, మాకు సుఖము నొసంగును. సుకర్మకరులు, సుహస్తులు నగు ఋభువులు శాంతిప్రదు లగుదురు. స్తుతించినచో మా పితృగణము మాకు శాంతి నొసంగెదరు॥ 348

(13) గద్యము॥

అజయు, నేకపాదయు నగు దేవత మాకు శాంతిప్రద యగును. అహిర్బుధ్న్యదేవత మాకు శాంతిప్రద యగును. సముద్రుఁడు మాకు శాంతిప్రదుఁ డగును. ఉపద్రవములఁ బోఁగొట్టెడి యపాంనపాత్తు మాకు శాంతిప్రదుఁ డగును. దేవపాలిక యగు పృశ్ని మాకు శాంతిప్రద యగును॥ 349

(14) గద్యము॥

నే నీ నూతనస్తోత్రమును జేయుచుంటిని. ఓ యాదిత్యగణమా! రుద్రగణమా! వాయుగణమా! మీరు దీనిని సేవింపుఁడు! ద్యులోకభవము, పార్థివము, పృశ్నిజాతమును యజ్ఞార్హులగు వారందరును మా యాహ్వానమును నాలకింతురు॥ 350

(15) గద్యము॥

యాజ్ఞార్హులగు దేవతలకు సైతము యజనీయులును, మనువునకు, నజునికినిగూడ యజనీయులై మరణరహితు లగు నే దేవతలు గలరో! వార లిపుడు మాకు బహుకీర్తి వంతులగు పుత్రులను నిచ్చెదరుగాక! వారు మమ్ము స్వస్తి ద్వారా పరిపాలింతురుగాక! ॥ 351

(16)† క॥ పారము ముట్టిన శంవతి
వారక పృచ్ఛించె నొకట భ్రాజితమౌ న
భ్యారంభము పగిది యముని
ధీరత నాయుఃపరిమితి తెఁజరిల రహిన్ ॥ 352

(17)† గీ॥ బ్రహ్మవర్ధిని యైనట్టి భారతి తన
భాసమానకేతనములపగిది వేద
మీ సమస్త సృష్టిని వెల్గి యాడిత మగు
మహితశక్తిని బ్రవృద్ధ మగునుగాక! ॥ 353

(18)† గీ॥ ఇంద్రవిభులైన భానుఁడు నిష్టపూర్ణ
హా సరస్వతి రోదసి నందుచుండి
సూర్యుఁ దేఁజరిల్లఁగఁజేయ వాక్య పిప్తి
వంతమై వెల్గుఁగాపుతఁ బ్రథిత మహాసు ॥ 354

(19)† గీ॥ అంగిరుఁడు కాణ్వుఁడును మేధ్య యదితి యైన
సోమసుతుఁడైన మఘమత్తు శోభితాగ్ని
తముఁడు నగ్నిదేవుండు ప్రతాపతుఁడును
గాక శుచియౌచు వెల్గుతఁ గ్రాలు దీప్తి ॥ 355

† ఇవి పరిశిష్టమంత్రములుగాఁ గొందఱును, "ఖిల"మంత్రములుగాఁ గొందఱును భావించిన ఋక్కుల కనువాదములు. వీనిని శ్రీ సేమాని వా రాంధ్రీకరింపలేదు.

† రచయిత :— వాఙ్మయ మహోపాధ్యాయ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా–ప్రపూర్ణ"

(20) † క॥ ఆశాంత మాభివృద్ధిని
నా శాంతియు స్వస్తియుగుత నఖిల జగత్తున్
వా శంకపగతి సాగర
మాశాంతముగా సకలము నారాధ్య మగున్ ॥ 356

(21) † క॥ వర్షముఁడౌ పర్జన్యుఁడు
వర్షమ్మును గురియ సకలప్రజలును బ్రాఁబల్
కర్షకుల గతిని నా దుర్
ధర్షములును శూన్య మగుచుఁ దనరుత! జగతిన్ ॥ 357

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమునఁ దృతీయాధ్యాయము
సంపూర్ణము

---

† ఇవి పరిశిష్ట మంత్రములుగాఁ గొందరును “ఖిల” మంత్రములుగాఁ గొందరును భావించిన ఋక్కుల కనువాదములు. వీనిని శ్రీనేమానివా రాంధ్రీకరింప లేదు.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళాప్రపూర్ణ”



# సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## సప్తమం మండలమ్

### పంచమోఽష్టకః—చతుర్థోఽధ్యాయః

### సూక్తమ్—36

ఋషిః — మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా — విశ్వే దేవాః

ఛందః — త్రిష్టుప్

(1) ప్ర బ్రహ్మైతు సదనాదృతస్య వి రశ్మిభిః ససృజే సూర్యో గాః ।

వి సానునా పృథివీ సస్ర[1] ఉర్వీ పృథు ప్రతీకమధ్యేధే[2] అగ్నిః ॥ 353

(2) ఇమాం[3] వాం మిత్రావరుణా సువృక్తిమిషం న కృణ్వే[4] అసురా నవీయః ।

ఇనో వామన్యః పదవీరదబ్ధో జనం చ మిత్రో యతతి బ్రువాణః ॥ 354

---

1. సంస్రఽఉర్వీ, 2. ధేఽఅగ్నిః, 3. ఇమాం వా మిత్రా, 4. కృణ్వేఽఅసురా. [వ్రా.ప్ర.]

(3) ఆ వాతస్య ధ్రజతో రన్త[1] ఇత్యా అపీపయన్త ధేనవో న సూదాః ।
మహో దివః సదనే జాయమానో[2] ఽచిక్రదద్ వృషభః [3]సస్మిన్నూధన్ ॥ 355

(4) గిరా [4]య ఏతా యునజద్ధరీ త[5] ఇన్ద్ర ప్రియా సురథా శూర ధాయూ ।
ప్ర యో మన్యుం రిరిక్షతో మినాత్యా సుక్రతుమర్యమణం వవృత్యామ్ ॥ 356

(5) యజన్తే[6] అస్య సఖ్యం వయశ్చ నమస్వినః స్వ[7] ఋతస్య ధామన్ ।
వి పృక్షో బాబధే నృభిః స్తవాన[8] ఇదం నమో రుద్రాయ ప్రేష్ఠమ్ ॥ 357

(6) ఆ యత్ సాకం యశసో వావశానాః సరస్వతీ సప్తథీ సిన్ధుమాతా ।
యాః సుష్వయన్త సుదుఘాః సుధారా[9] అభి స్వేన పయసా పీప్యానాః ॥ 358

(7) ఉత త్యే నో మరుతో మన్దసానా ధియం తోకం చ వాజినో[10]ఽవన్తు ।
మా నః పరి ఖ్యదక్షరా చరన్త్యవీవృధన్ యుజ్యం తే రయిం నః ॥ 359

---

1. రన్తేఽఇత్యాఽఅపీ, 2. మానో చిక్ర, 3. సస్మిన్నూధన్, 4. యఽఏతా, 5. తఽఇన్ద్ర, 6. యజన్తేఽఅస్య, 7. స్వఽఋతస్య, 8. స్తవానఽఇదం, 9. సుధారాఽఅభి, 10. వాజినోవన్తు. [వా.ప్రా.]

(8) ప్ర వో మహీమరమతిం కృణుధ్వం ప్ర

పూషణం విదథ్యం౧ న వీరమ్ ।

భగం ధియోఽవితారం [1]నో అస్యాః

సాతౌ వాజం రాతిషాచం పురంధిమ్ ॥ 360

(9) అచ్ఛాయం వో మరుతః శ్లోక[2] ఏత్వచ్ఛా

విష్ణుం నిషిక్తపామవోభిః ।

ఉత ప్రజాయై గృణతే వయో ధుర్యూయం

పాత స్వస్తిభిః సదా నః ॥ 361

---

1. నోఽఅస్యాః, 2. శ్లోకఽఏత్వచ్ఛా. (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము_చతుర్థాధ్యాయము

### సూక్తము—36

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—విశ్వే దేవతలు

(1) గద్యము॥

యజ్ఞసదనమునుండి స్తోత్రము లుత్కృష్టరూపమున వెడలుఁగాక! సూర్యుఁడు
కిరణసమూహములచే వృష్టిజలమును సృష్టిఁజేసెను. పృథివి సాను
సమూహమును విస్తీర్ణముగాఁజేసి వ్యాపించియుండెను. అగ్ని
పృథ్వియొక్క విస్తృతావయవముపైఁ బ్రజ్వలిల్లుచున్నది ॥ 358

(2) గద్యము॥

అసురులగు మిత్రావరుణులారా! మి మ్ముద్దేశించి యన్నమువలె నూతన స్తుతిని జేయు
చున్నాను. మీలో నన్యతరప్రభు వగు వరుణుఁ డీ స్థానమును బుట్టించువాఁడు.
మిత్రుఁడు స్తూయమానుఁడై ప్రాణులను దిప్పుచుండును ॥ 359

(3) గద్యము॥

గమనశీలుండగు వాయువుయొక్క గతి నాలుగుదిక్కులయందుఁ బ్రకాశించును.
క్షీరముల నొసంగెడు ధేనువులు వృద్ధిని బొందుచున్నవి. ద్యోతమానుం డగు
నాదిత్యుని స్థానమం దుత్పన్నుఁడును, వర్షణశీలుండును నగు పర్జన్యుఁ
డంతరిక్షమున నాక్రందనముఁ జేయుచుండును ॥ 360

(4) గద్యము॥

ఓ శూరేంద్రుఁడా! నీకుఁ బ్రియులును, సుందరగతిగలవారును, ధారకులును, నగు
నీ యశ్వద్వయము లోకమందు స్తుతిద్వారా రథమునకుఁ గూర్పఁబడును. అర్యముఁడు
హింసాకరమగు కోపమును నశింపఁజేయును. శోభనకర్మయుతుండగు
నా యర్యముని నావర్తితునిగా నొనర్చెదను ॥ 361

(5) గద్యము॥

యజ్ఞపరాయణు లన్న విశిష్టులై యజ్ఞస్థానములయందుండెడి వారి సఖ్యమును గోరుచుంటిని.
నేతలచే స్తుతింపఁబడి రుద్రుఁ డన్నదానమును జేయును. నేను రుద్రునకుఁ
బ్రియం బగు నమస్కారముఁ జేయుచున్నాను ॥ 362

(6) గద్యము॥

ఏ నదీగణమధ్యమందు సింధునది, సరస్వతి, సప్తమస్థానీయులో! కామదుఘలు సుదారలు
నగు నా నదులు ప్రవహించుచున్నవి. స్వీయజలమున వృద్ధిఁ బొందునవియు, నన్న
యుతములైనవియు నగు నదు లొక్కమారు వచ్చుఁగాక! ॥ 363

(7) గద్యము॥

హృష్టులు వేగవంతులు నగు మరుత్తులు మా యజ్ఞకర్మలను బుత్రులను రక్షించెడుఁగాక!
వ్యాప్తయు, విచరణశీలయు నగు వాగ్దేవత మాకుఁ ద్యాగమునుజేసి యన్యులను
జూడదు. మరుత్తు, వాక్కు, మాకు ధనము నియతమైనచో దానిని వృద్ధిఁ
బొందింతురుగాక! ॥ 364

(8) గద్యము॥

నీవు శేషరహితయు మహతియు నగు భూమిని బిలువుము! యజ్ఞార్హుఁడును, వీరుఁడు నగు
పూషణుని బిలువుము! మాయొక్క కర్మరక్షకుఁడగు భగుని నాహ్వానింపుము! దానదక్షులు
పురాణులు నగు ఋభువులలో నొకఁడైన వాజదేవుఁడు యజ్ఞమందుఁ
బిలవఁబడుఁగాక! ॥ 365

(9) గద్యము:

ఓ మరుద్గణమా! యీ మా శ్లోకము† నీ కభిముఖముగ వచ్చుఁగాక! ఆశ్రయగాతయు గర్భ పాలకుఁడు నగు విష్ణువు నికటమునకు వచ్చుఁగాక! వారు స్తుతికారులకుఁ బుత్రులను నన్నమును నిచ్చెదరుగాక! మీరు సర్వదా స్తుతులచే మమ్ము రక్షింపుఁడు! ॥ 366

## సూక్తమ్—37

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ఆ వో వాహిష్ఠో వహతు స్తవధ్యై రథో వాజా[1] ఋభుక్షణో అమృక్తః ।
అభి త్రిపృష్ఠైః సవనేషు సోమైర్మదే సుశిప్రా మహభిః పృణధ్వమ్ ॥ 362

(2) యూయం హ రత్నం మఘవత్సు ధత్థ [2]స్వర్దృశ ఋభుక్షణో అమృక్తమ్ ।
సం యజ్ఞేషు స్వధావన్తః పిబధ్వం వి నో రాధాంసి మతిభిర్దయధ్వమ్ ॥ 363

† ఇక్కడ శ్లోక శబ్దము కలదు-ఇది కీర్తికిని సంస్కృత పద్యమునకును బర్యాయ పదముగా నిపుడు వాడఁబడు చున్నది. వేద మంత్రములుకాక సంస్కృత భాషలో ఛందస్సు రామాయణకాలముననాఁడే పుట్టినది యనియు, నదియే యాదికావ్యమనియుఁ బెద్దలు చెప్పెదరు. రామాయణ మాదికావ్య మని రామాయణస్థ సర్గాంతగద్యలే ప్రమాణములు. ఛందస్సు వేదకాలమున నుండుటఁబట్టి వేదము లన్నియు ఛందోనిబద్ధములే. కావున ఛందస్సు వేదకాలమునకుఁ బూర్వమే కలదనుటకు వేదఋక్కులే ప్రబలసాక్ష్యములు ఋక్కులలో ఛందో నిర్ణయము కలదు. యజుర్వేదమున నక్కడక్కడ గద్యములుకూడఁ గలవు. ఒక ప్రసిద్ధకథాంశమును బురస్కరించుకొని వ్రాసిన మహాకావ్యములలో మొదటి కావ్యము రామాయణమై యుండుటచే నది యాది కావ్య మని నిర్ణయించియుండి రని యూహ.— (నే.వేం.న.శా.)

1. వాజాఽ ఋభుక్షణోఽఅమృక్తః, 2. స్వర్దృశఽఋభుక్షణోఽఅమృక్తమ్. [వ్రా.ప్ర.]

(3) ఉవోచిథ హి మఘవన్ దేష్ణం[1] మహో అర్భస్య వసునో విభాగే ।

ఉభా తే పూర్ణా వసునా గభస్తీ న సూనృతా ని యమతే వసవ్యా ॥ 364

(4) త్వమిన్ద్ర స్వయశా[2] ఋభుక్షా వాజో న సాధురస్తమేష్యృక్వా[3] ।

వయం ను తే [4]దాశ్వాంసః స్యామ బ్రహ్మ కృణ్వన్తో హరివో వసిష్ఠాః ॥ 365

(5) సనితాసి ప్రవతో దాశుషే చిద్ యాభిర్వివేషో హర్యశ్వ ధీభిః ।

వవన్మా ను తే యుజ్యాభిరూతీ [5]కదా న ఇన్ద్ర రాయ ఆ దశస్యేః ॥ 366

(6) వాసయసీవ వేధసస్త్వం[6] నః కదా న ఇన్ద్ర వచసో బుబోధః ।

అస్తం తాత్యా ధియా రయిం సువీరం పృక్షో నో[7] అర్వా న్యుహీత వాజీ ॥ 367

(7) అభి యం దేవీ నిరృతిశ్చిదీశే నక్షన్త[8] ఇన్ద్రం శరదః సుపృక్షః ।

ఉప త్రిబన్ధుర్జరదష్టిమేత్యస్వవేశం యం కృణవన్త మర్తాః ॥ 368

---

1. దేష్ణం మహోఽఅర్భస్య, 2. స్వయశాఽఋభుక్షా, 3. మేష్యృక్వా, 4. దాశ్వాగ్ంసః, 5. వదా నఽఇన్ద్ర, 6. వేధసత్వం నః కదా నఽఇన్ద్ర, 7. పృక్షో నోఽఅర్వా, 8. నక్షన్తఽఇన్ద్రం శరాదః. [ద్రా.ప్ర.]

(8) ఆ నో రాధాంసి సవితః స్తవధ్యా[1] ఆ రాయో యన్తు పర్వతస్య రాతౌ ॥
సదా నో దివ్యః పాయుః సిషక్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 369

## సూక్తము—37

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—విశ్వేదేవతలు

(1) గద్యము॥

ఓ ఋభుక్షవాజగణమా! వహనశీలము, ప్రశంసాయోగ్యము, హింసారహితము నగు రథము మిమ్ము వహించుఁగాక! సుందర హను విశిష్టులగు ఋభుగణమా! యజ్ఞమందు నానందార్థ త్రిపృష్ఠమహంత మగు సోమరసముద్వారా మీ యుదరమును నిండింపుఁడు! ॥ 367

(2) గద్యము॥

స్వర్గదర్శ ఋభుక్షగణమా! హవ్యసహితు లగు లోకులనిమిత్తము హింసారహితరత్నములను ధరింపుము! అనంతరబలవంతులై యజ్ఞమందుఁ ద్రావుము! అనుగ్రహముంచి విశేషముగా ధనమిమ్ము! 368

(3) గద్యము॥

ఓమఘవానుఁడా! యింద్రుఁడా! మహాధనమునకు నల్పధనమునకు సేవఁజేయుము! మీ రుభయులు బహుధనపూర్ణులు. మీ వాక్యము ధనలాభమునకై ప్రతిబంధకము చేయదు॥ 369

1. స్తవధ్యాఽఆ రాయో. [వ్రా.ప్ర.]

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వసాధారణుఁడవు! కీర్తిమంతుఁడవు! ఋభుక్షులారా! సాధువులారా! మీ రన్యులవలె స్తోతల గృహమునకు రండు! హరివంతుఁడా! యిపుడు మేము (అనఁగా వసిష్ఠగణము) మీ విషయమై హవ్యము నొసంగి స్తోత్రము చేయుచుండెదము ॥ 370

(5) గద్యము॥

దానదక్షులు భజనశీలురు నగు యజమానులు పరస్పరము కలిసికొని ద్యో భూలోకములయందు సవృతుని పరిచర్యఁ జేయుదురు. అహిర్బుధ్న్యుఁడు సవిత పరిచర్యఁ జేయును. అహిర్బుధ్న్యుఁడు మా స్తోత్రముల నాలకించునుగాక! వాగ్దేవి మా కభిముఖముగ వచ్చి దేవతలద్వారా మమ్ముఁ బాలించుఁగాక! 371

(6) గద్యము॥

ప్రజ్ఞాపాలకుఁ డగు సవిత మా ప్రార్థనానుసారముగ వాని రమణీయధనమును మేము పొందుట కామోదించుఁగాక! ఓజస్వి యగు స్తోత మమ్ము రక్షించుటకై భగుఁ డను దేవతను మాటిమాటికిఁ బిలుచుచున్నాఁడు. అసమర్థుఁడగు స్తోత రత్నముల నడుగుచున్నాఁడు ॥ 372

(7) గద్యము॥

యజ్ఞకాలమందు స్తోత్రపరిమితము, పథవిశిష్టము, సుందరాన్నయుక్తమగు వాజినామక దేవగణము మాకు సుఖప్రద మగును. ఈ దేవగణ మదాతృహస్తులగు రాక్షసులను హింసించుచుఁ బురాతనరోగము లన్నింటిని మానుండి వేరుపరచుఁగాక! ॥ 373

(8) గద్యము॥

ఓ వాజిగణమా! మీరు మేధావులు, మరణరహితులు, సత్యజ్ఞులునై ధననిమిత్తమై దుగ్ధము నిచ్చి మమ్ముఁ బరిపాలింపుఁడు! ఈ సోమమును ద్రావుఁడు! ప్రమత్తు లగుఁడు! పరమందుఁ దృప్తులై దేవమానపథమందు వెడలుఁడు! ॥ 374

# సూక్తమ్—38

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—1-6-సవితా, 6-ఉత్తరార్ధస్య భగో వా, 7-8-వాజినః

ఛందః—త్రిష్టుప్

(1) ఉదు ష్య దేవః సవితా యయామ హిరణ్యయీమమతిం యామశిశ్రేత్ ।

నూనం భగో హవ్యో మానుషేభిర్వి యో రత్నా పురూవసుర్దధాతి ॥ 370

(2) ఉదు తిష్ఠ సవితః శ్రుధ్యస్య హిరణ్యపాణే ప్రభృతావృతస్య ।

వ్యుర్వీం పృథ్వీమమతిం సృజాన[1] ఆ నృభ్యో మర్తభోజనం సువానః ॥ 371

(3) అపి ష్టుతః సవితా దేవో[2] అస్తు యమా చిద్ విశ్వే వసవో గృణన్తి ।

స నః స్తోమాన్ నమస్యశ్చనో ధాద్ విశ్వేభిః పాతు పాయుభిర్ని సూరీన్ ॥ 372

(4) అభి యం దేవ్యదితిర్గృణాతి సవం దేవస్య సవితుర్జుషాణా ।

అభి సమ్రాజో వరుణో గృణన్త్యభి మిత్రాసో[3] అర్యమా సజోషాః ॥ 373

---

1. సృజానఽఆ నృభ్యో మర్త్త భోజనం, 2. దేవోఽఅస్తు, 3. మిత్రాసోఽఅర్యమా. (ప్రా.ప్ర.)

(5) అభి యే మిథో వనుషః సపన్తే రాతిం దివో రాతిషాచః పృథివ్యాః ।

అహిర్బుధ్న్య[1] ఉత నః శృణోతు [2]వరూత్ర్యేకధేనుభిర్ని పాతు ॥ 374

(6) అను తన్నో జాస్పతిర్మంసీష్ట రత్నం దేవస్య సవితురియానః ।

భగముగ్రోఽవసే[3] జోహవీతి భగమనుగ్రో[4] అధ యాతి రత్నమ్ ॥ 375

(7) శం నో భవన్తు[5] వాజినో హవేషు దేవతాతా మితద్రవః స్వర్కాః ।

జమ్భయన్తోఽహిం[6] వృకం రక్షాంసి సనేమ్యస్మద్ యుయవన్నమీవాః ॥ 376

(8) వాజేవాజేఽవత[7] వాజినో నో ధనేషు విప్రా[8] అమృతా ఋతజ్ఞాః ।

అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభిర్దేవయానైః ॥ 377

---

1. అహిర్బుధ్న్యయ, 2. వరుత్ర్యేక, 3. ముగ్రోవసే, 4. మనుగ్రోఽఅధ, 5. భవంతి వాజినో,

6. జమ్భయన్తోహిం, 7. వాజేవాజేవత, 8. విప్రాఽఅమృతాఽఋతజ్ఞాః. (వ్రా.ప్ర.)

## సూక్తము—38*

ఋషి—మైత్రావరుణి యగు వసిష్ఠుఁడు

దేవత—1-6-సవిత, 6వ ఋక్కు- ఉత్తరార్థమునకు భగుఁడు లేక సవిత, 7-8-వాజినులు

(1) † చ ॥ బహుళము లౌచు వ్యాప్తమగు భద్ర సుతేజము వాసరమ్ముగా
సహజములై యహింసితపు శక్తిని వెల్గు ఋభూగణమ్ములున్
వహనము లౌచు జన్నముల వారిరి తేరును నెక్కి-వచ్చి తా
మహితముగాఁగ సోమమును మాన్యముగాఁగను ద్రాగి వెల్గుతన్! ॥ 375

(2) † గీ ॥ ఋభువులార! మీరు రూక్షమ్ము కానట్టి
దివిని గాంచి హింసఁ దిమరకుండ
జార చోర పీడ సాధ్యమ్ము కాకుండ
రత్నధాము లగుఁడు! రాణ కెక్కి- ॥ 376

† గీ॥ అధికబలయుతు లైనట్టి యమల ఋభువు
లార! మీరలు బహువిధ యజ్ఞములను
మాకు దండిగ సోమము మనుచుఁ ద్రావ
ధనపతులు నౌచు వేగమె తరలి రండు! ॥ 377

(3) † గీ ॥ ఓ మఘవ! యింద్ర! ధనవంత! యుభయపూత
వంశ దేవ గభస్తిత్రాపాథవమయి
సత్యవాక్కు-తోడ వెలింగి నిత్యమైన
ధనము నొందఁజేసి వరలు! ధనదఘనత ॥ 378

---

* ఏడవ మండలములోని యీ 38వ సూక్తమును శ్రీ నేమాని వా రాంధ్రీకరింపలేదు.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4) † గీ ॥ ఇంద్ర! నీ మహత్త్వమెయిని ఋభువులెల్ల
సర్వసామాన్యమును గాని సకలవసువు
జాలమును మా గృహాళిని సత్యనిత్య
నిధిగ వెల్గుత! విధిగాఁగఁ బ్రథితగతిని ॥ 379

(5) † గీ ॥ ఓయి!హర్యశ్వ! దీధితు లొనరునట్టి
చిన్మయ నుతుల స్తుతులను జెలఁగుచుండి
మాకు ధనముల నొసఁగుచు మహితమైన
యుచిత రక్షల నొసఁగుచు హృదయ మిమ్మ! ॥ 380

(6) † గీ ॥ సర్వకాలములను శక్ర! నీవు వినుచు
మా నుతులను స్తుతుల వీను లలర
యధికవేగ మొప్ప నశ్వరాజములను
శక్తిపుత్రుతోడ జయము గనుత! ॥ 381

(7) † గీ ॥ ఎల్ల లోకములను నింద్రాణి వెల్గును
సర్వకాల ముండు శరద మట్లు
యఖిలదేవులైన యా యింద్రదేవుండు
నమరమైన శక్తి నలరుచుండు! ॥ 382

(8) † గీ ॥ సర్వప్రేరకుఁ డగు సవిత యీ భువియందు
నలర నిత్య సత్య మట్లు నభము
నీతి మేరువుగతిఁ బ్రాతి యొౌచు నలర
దివ్య వివిధనుతులఁ దేజరిల్లు ॥ 383

---

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష,డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—39

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ఊర్ధ్వో[1] అగ్నిః సుమతిం వస్వో[2] అశ్రేత్ ప్రతీచీ జూర్ణిర్దేవతాతిమేతి ।
భేజాతే[3] అద్రీ రథ్యేవ పన్థామృతం హోతా న[4] ఇషితో యజాతి ॥ 378

(2) ప్ర వావృజే సుప్రయా బర్హిరేషామా విశ్పతీవ బీరిట[5] ఇయాతే ।
విశామక్తోరుషసః పూర్వహూతౌ[6] వాయుః పూషా స్వస్తయే నియుత్వాన్ ॥ 379

(3) జ్మయా[7] అత్ర వసవో రన్త దేవా[8] ఉరావన్తరిక్షే మర్జయన్త శుభ్రాః ।
అర్వాక్ పథ[9] ఉరుజ్రయః కృణుధ్వం శ్రోతా దూతస్య జగ్ముషో నో[10] అస్య ॥ 380

(4) తే హి యజ్ఞేషు యజ్ఞియాస[11] ఊమాః సధస్థం విశ్వే[12] అభి సన్తి దేవాః ।
తాగ్ం[13] అధ్వర ఉశతో యక్ష్యగ్నే శ్రుష్టీ భగం నాసత్యా పురంధిమ్ ॥ 381

---

1. ఊర్ధ్వఽఅగ్నిః, 2. వస్వోఽఅశ్రేత్, 3. భేజాతేఽఅద్రీ, 4. హోతానఽఇషితో, 5. బీరిటఽఇయాతే,
6. పూర్వహూతౌ, 7. జ్మయాఽఅత్ర, 8. దేవాఽఉరావన్త, 9. పథఽఉరుజ్రాయః,
10. నోఽఅస్య, 11. యాసఽఊమాః, 12. విశ్వేఽఅభి, 13. తాగ్ంఽఅధ్వరఽఉశతే. (వ్రా.ప్ర.)

(5) [1]ఆగ్నే గిరో దివ [2]ఆ పృథివ్యా మిత్రం వహ వరుణమిన్ద్రమగ్నిమ్ ।
[3]ఆర్యమణమదితిం విష్ణుమేషాం సరస్వతీ మరుతో మాదయన్తామ్ ॥ 382

(6) రరే హవ్యం మతిభిర్యజ్ఞియానాం నక్షత్ కామం మర్త్యానామసిన్వన్ ।
ధాతా రయిమవిదస్యం సదాసాం సక్షీమహి యుజ్యేభిర్ను దేవైః ॥ 383

(7) నూ రోదసీ[4] అభిష్టుతే వసిష్ఠైరృతావానో వరుణో మిత్రో అగ్నిః ।
యచ్ఛన్తు చన్ద్రా[5] ఉపమం నో అర్కం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 384

## సూక్తము—39

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—విశ్వే దేవతలు

(1) గద్యము॥

అగ్ని యున్ముక్తుఁడై స్తోతయొక్క సుస్తుతి సేవఁ జేయునుగాక! సకలమునకు జరాదాత్రి
యగు నుషోదేవత యభిముఖియై యజ్ఞమున కేతెంచును. సాదర యగు పత్నియు
యజమానుఁడును రథి వ్యయమువలె యజ్ఞమార్గ సేవ సేయుచున్నారు.
మా హోతలు సంప్రేరితులై యజ్ఞములను జేయుచున్నారు ॥ 384

---

1. అగ్నే, 2. దివఽఆ పృథివ్యా, 3. అర్యమణ, 4. రోదసీఽఅభి,

5. చన్ద్రాఽఉపమం నోఽఅర్కం. (వ్రా.ప్ర.)

(2) గద్యము॥

వీరి శోభనాన్నయుతమగు బర్హి స్సున్నది. ఇపుడు ప్రజాపాలక నియుక్త వాయువు,
పూషణుఁడు ప్రజల మంగళము నీకై రాత్రి యాసాద్య మగుటకు మొదటి పిలుపును
విని యంతరిక్షమునకు వచ్చును ॥ 385

(3) గద్యము॥

వసునామక దేవగణ మీ యజ్ఞమందుఁ బృథ్వియందుఁ గల సర్వజనులను నానందితులుగ
నొనర్చెదరుగాక! విస్తీర్ణాంతరిక్షస్థితులు, దీప్యమానులు నగు మరుత్తుల సేవఁజేయుదురు.
ప్రభూతగాములగు వసువులారా! మత్తులారా! మీ పథమును మా
కభిముఖముగఁ జేయుఁడు! మా దూత మీచెంతకు వచ్చుచుండును.
మీరు వీరి యాహ్వానమును వినుఁడు! ॥ 386

(4) గద్యము॥

ప్రసిద్ధయజ్ఞార్హులు, యజ్ఞకరులు, నగు విశ్వదేవులు యజ్ఞస్థానమునకు వచ్చెదరు. ఓ యగ్నీ!
మా యజ్ఞమం దభిలాషతోఁగూడిన దేవతల విషయమై యాగము కావింపుము!
భగుని యశ్విద్వయమును, నింద్రుని, శీఘ్రముగఁ బూజింపుము! ॥ 387

(5) గద్యము॥

ఓ యగ్నీ! నీవు ద్యోలోకమునుండి స్తుతియోగ్యులగు మిత్రుని, వరుణుని, నింద్రుని,
నగ్నిని, నర్యమను, విష్ణువును, మా యజ్ఞమునకుఁ బిలువుము! భూలోకమునుండి
పిలువుము! సరస్వతీ మరుత్తులు హృష్ట లగుదురు. ॥ 388

(6) గద్యము॥

యజ్ఞార్హు లగు దేవతల నుద్దేశించి స్తుతిసహిత హవ్యము నిచ్చెదను. అగ్ని మా
యభిలాషకుఁ బ్రతిబంధకుఁడుకాక యజ్ఞవ్యాప్తుఁ డగును. ఓ దేవతలారా! మీ
రనుక్షేపణీయమును, సర్వదా సంభజనీయమును, నగు ధనము నీయుఁడు!
ఇపుడు మేము సహాయభూతు లగు దేవగణములతోఁ గలిసికొనెదము ॥ 389

(7) గద్యము॥

ఇపుడు ద్యావాపృథువులు వసిష్ఠగణములద్వారా సంస్తుత లగుదురు. యజ్ఞవిశిష్టు లగు వరుణేంద్రులు, నగ్నియు, స్తుతు లగుదురు. ఆహ్లాదకరు లగు దేవతలు మా కర్చనీయము సర్వోత్కృష్టము నగు నన్నము నిచ్చెదరుగాక! మీరు మమ్ము స్తుతిద్వారా పాలింతురుగాక! ॥ 390

## సూక్తమ్—40

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ఓ శ్రుష్టిర్విదథ్యా౩ సమేతు ప్రతి స్తోమం దధీమహి తురాణామ్ ।
యదద్య దేవః సవితా సువాతి స్యామాస్య రత్నినో విభాగే ॥ 385

(2) మిత్రస్తన్నో వరుణో రోదసీ చ ద్యుభక్తమిన్ద్రో[1] అర్యమా దదాతు ।
దిదేష్టు దేవ్యదితీ రేక్ణో వాయుశ్చ యన్నియువైతే భగశ్చ ॥ 386

(3) సేదుగ్రో[2] అస్తు మరుతః స శుష్మీ యం మర్త్యం పృషదశ్వా[3] అవాథ ।
[4]ఉతేమగ్నిః సరస్వతీ జునన్తి న తస్య రాయః పర్యేతాస్తి ॥ 387

---

1. భక్తమిన్ద్రో౨అర్యమా, 2. సేదుగ్రో౨అస్తు, 3. దశ్వా౨అవాథ, 4. ఉతేమగ్నిః. (ప్రా.ప్ర.)

(4) అయం హి నేతా వరుణ[1] ఋతస్య మిత్రోఽ రాజానో[2] అర్యమాపో ధుః ।
సుహవా దేవ్యదితిరనర్వా తే నో[3] అంహో అతి పర్షన్నరిష్టాన్ ॥ 388

(5) అస్య దేవస్య మీళ్హుషో[4] వయా విష్ణోరేషస్య ప్రభృథే హవిర్భిః ।
విదే హి రుద్రోఽ రుద్రియం మహిత్వం యాసిష్టం వర్తిరశ్వినావిరావత్ ॥ 389

(6) మాత్ర పూషన్నాఘృణ[5] ఇరస్యో వరూత్రీఽ యద్ రాతిషాచశ్చ రాసన్ ।
మయోభువో నో[6] అర్వన్తో ని పాన్తు వృష్టిం పరిజ్మా వాతో దదాతు ॥ 390

(7) నూ రోదసీ[7] అభిష్టుతే వసిష్ఠైరృతావానో వరుణో మిత్రోఽ[8] అగ్నిః ।
యచ్ఛన్తు చన్ద్రాఽ[9] ఉపమం నో అర్కం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 391

---

1. వరుణ ఋతస్య, 2. నో అర్య, 3. తే నో అంహో, 4. మీహ్ళుషో, 5. ఘృణ ఇరస్యోవరుత్రీ,
6. నో అర్వన్తో, 7. రోదసీ అభి, 8. మిత్రో అగ్నిః 9. చన్ద్రాఽ ఉపమంనో అర్కం. (వ్రా.ప్ర.)

## సూక్తము—40

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—విశ్వే దేవతలు

(1) గద్యము॥

ఓ దేవగణమా! మీ చిత్తముద్వారా సంపాదనీయ మగు సుఖము మా చెంతకు వచ్చునుగాక!
మేము వేగవంతులగు దేవగణముల నుద్దేశించి స్తోత్రములఁ జేసెదము. ఈ క్షణమందు
ధనప్రేరకుఁడు, రత్నవిశిష్టుఁడును నగు సవితవలన ధనమును
గ్రహించెదను ॥ 391

(2) గద్యము॥

మిత్రుఁడు, వరుణుఁడు, ద్యావాభూములు, మా కా ధనము నొసంగుదురుగాక! ఇంద్రుఁడు,
నర్యముఁడు మాకు ద్యుతిమంతు లగు స్తోతలతోఁగూడ ధనము నిచ్చెదరుగాక!
మాకు ధనమునుగూర్చెడు వాయువు, భగుఁడు, దేవి యగు నదితి,
ధనదానమున కాజ్ఞాపింతురుగాక! ॥ 392

(3) గద్యము॥

ఓ పృషదశ్వమరుద్గణమా! మర్త్యులను ధనమును రక్షింపుఁడు! అగ్నిసరస్వతీప్రముఖ
దేవతలు యజమానులను బ్రవర్తితులుగాఁ జేయుదురు. యజమాన ధనమునకు
వినాశము లేదు ॥ 393

(4) గద్యము॥

అన్యదేవతలు యజ్ఞమందు హవ్యముద్వారా ప్రాపనీయుఁడు, నభీష్టవర్షియు నగు విష్ణువునకు
శాఖారూపము. రుద్రుఁడు రుద్రీయమహిమ నొసంగుదురుగాక! ఓ యశ్విద్వయమా!
మీరు హవ్యయుక్త మగు మా గృహమునకు రండు! ॥ 394

(5) గద్యము:

సకలవరణీయ యగు సరస్వతియు దానదక్ష లగు దేవపత్నులు మాకు ధనదాన మొసంగెదరు. దీప్తియుక్తుఁడగు పూషణుఁడా! యీ దానమునకు బాధ కలుఁగకుండ సుఖప్రదలును గమనశీలురు నగు దేవతలు మమ్ముఁ బాలించుదురుగాక! సర్వగామి యగు వాయువు వృష్టిజలము నొసంగునుగాక! ॥ 395

(6) † గీ॥ ప్రాప్తదీప్తుఁడైన పరమపురుషుఁడు స
రస్వతియును సర్వరమణ యౌచు
దానమున విశేష తపనశక్తిని మించు
రవియువోలె మిగులఁ గ్రాంతి మించు ॥ 396

(7) గద్యము॥

ఇపుడు ద్యావాపృథువులు, దేవగణములద్వారా సర్వవిధముల సంస్తుతు లగును. ఆహ్లాదకరమగు దేవగణములు మా కర్చనీయము సర్వోత్కృష్టము నగు ధన మిచ్చునుగాక! మీరు సర్వదా మమ్ముఁ బాలింతురుగాక! ॥ 397

## సూక్తమ్—41

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1-అగ్నీన్ద్రమిత్రావరుణాశ్విభగపూషబ్రహ్మణస్పతిసోమరుద్రాః,
2-6-భగః, 7-ఉషసః
ఛందః—త్రిష్టుప్, 1-జగతీ

(1) ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే ప్రాతర్మిత్రావరుణా ప్రాతరశ్వినా ।
ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం ప్రాతః సోమముత రుద్రం హువేమ ॥ 392

† ఈ 40వ సూక్తములోని 6వ ఋక్కును బొరపాటున శ్రీ నేమానివా రనువదింపక విడిచిపెట్టిరి.
† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(2) ప్రాతర్జితం భగముగ్రం హువేమ వయం [1]పుత్రమదితేర్యో విధర్తా ।
ఆధ్రశ్చిద్ యం మన్యమానస్తురశ్చిద్ రాజా చిద్ యం భగం భక్షీత్యాహ 393

(3) భగ ప్రణేతర్భగ సత్యరాధో భగేమాం[2] ధియముదవా దదన్నః ।
భగ ప్ర ణో జనయ గోభిరశ్వైర్భగ ప్ర నృభిర్నృవన్తః స్యామ ॥ 394

(4) ఉతేదానీం భగవన్తః స్యామోత ప్రపిత్వ[3] ఉత మధ్యే అహ్నామ్ ।
ఉతోదితా మఘవన్ త్సూర్యస్య వయం దేవానాం సుమతౌ స్యామ ॥ 395

(5) భగ[4] ఏవ భగవాగ్ం అస్తు దేవాస్తేన[5] వయం భగవన్తః స్యామ ।
తం[6] త్వా భగ సర్వ ఇజ్జోహవీతి స నో భగ పురఏతా[7] భవేహ ॥ 396

(6) సమధ్వరాయోషసో[8] నమన్త దధిక్రావేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసువిదం[9] భగం నో రథమివాశ్వా వాజిన[10] ఆ వహన్తు ॥ 397

---

1. పుత్రామదితే, 2. భగోమాం, 3. ప్రపిత్వఽఉత, 4. భగఽఏవ భగవాం అస్తు, 5. స్తేన వయం,
6. తత్వా భగసంర్వఽఇజ్జోహవీతి, 7. పురఽఏతా, 8. యోషసే, 9. వసువింద్ర,
10. వాజినఽఆ వహన్తు. (వ్రా.ప్ర.)

(7) అశ్వావతీర్గోమతీర్న[1] ఉషాసో వీరవతీః సదముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహానా విశ్వతః[2] ప్రపీతా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 398

## *సూక్తము—41

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ప్రథమ ఋక్కునకు ఇంద్రాది దేవతలు, 2,3,4,5,6-భగుఁడు, 7-ఉషస్సు*

(1) గద్యము॥

నేను ప్రాతఃకాలమున నగ్ని నాహ్వానింతును. ప్రాతఃకాలమున మిత్రావరుణుల నాహ్వానింతును. ప్రాతఃకాలమున నశ్వద్వయమును స్తుతించెదను. ప్రాతఃకాలమున భగుని బూషణుని బ్రహ్మణస్పతిని స్తుతించెదను. ప్రాతఃకాలమున సోమరుద్రులను స్తుతించెదను ॥ 398

(2) గద్యము॥

ఎవఁడు జగద్ధారకుఁడో!, జయశీలో(గ్రాదితిపుత్రుఁడో! యట్టి భగుదేవుని ప్రాతఃకాలమున నాహ్వానింతును. అరీంద్రుఁ డగు స్తోతయు ధనశాలి యగు రాజును నీ యుభయులును భగదేవుని స్తుతించుచు "మాకు భజనీయ ధనము నొసంగుఁ"డని యాచించెదరు. ॥ 399

(3) గద్యము॥

ఓ భగుఁడా! నీవు ప్రకృష్టనేతవు! ఓ భగుఁడా! నీవు సత్యధనుఁడవు! నీవు మేము కోరెడు వస్తువుల నొసంగుచు మా స్తుతిని సఫలముగాఁ జేయుము! ఓ భగుఁడా! నీవు గోవులతోను, నశ్వములతోను, మమ్ము వృద్ధిఁ బొందింపుము! ఓ భగుఁడా! నేతృగణముతో మనుష్యవంతుఁడ నయ్యెదను ॥ 400

---

1. గోమతీర్నఽఉషాసో, 2. విశ్వతం ప్రపీతా. (వ్రా.ప్ర.)

* ఈ సూక్తమును భగ సూక్తమనెదరు. (నే.వేం.న.శా.)

* ఈ సూక్త దేవతల విషయమై శ్రీ నేమానివారు వ్రాతప్రతిలో (7వ సంపుటము 129వ పుట) "ప్రథమ ఋక్కునకు ఇంద్రాదిదేవతలు, 2మొదలు పంచఋక్కులకు భగుఁడు, 7ఉషస్సు" అని వ్రాసి 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "నానావిధ దేవతలు, భగుఁడు, ఉషస్సు" అని వ్రాసిరి.

(4) గద్యము॥

నే నిపుడు భగవంతుఁడ నయ్యెదను. దివసప్రారంభమున, దివసమధ్యంబున, భగవంతుఁడ
నయ్యెదను. ఓ మఘవానుఁడా! సూర్యోదయమందు మే మింద్రాదుల
యనుగ్రహమును సంపాదింపఁగలము ॥ 401

(5) గద్యము॥

ఓ దేవగణమా! భగుఁడే భగవంతుఁ డగును. నేను భగుని యనుగ్రహమువలననే భగువంతుఁడ
నయ్యెద. ఓ భగుఁడా! యందఱును నిన్ను నూటిమాటికిఁ బిలిచెదరు.
ఓ భగుఁడా! నీ వీ యజ్ఞమందు మా కగ్రగామివి కమ్ము! ॥ 402

(6) గద్యము॥

శుద్ధస్నానము నుద్దేశించి దధిక్రావర్ణునివలె నుషోదేవత మా యజ్ఞమునకు వచ్చుఁగాక!
వేగవంత మగు రథమువలె నుషోదేవత ధనప్రదుఁ డగు భగుని మా కభిముఖముగఁ
దెచ్చుఁగాక! 403

(7) గద్యము॥

సర్వగుణములచేఁ బ్రవృద్ధమును, భజనీయమును, నగు నుషోదేవతాగణ మశ్వవిశిష్టము,
గోవిశిష్టమునై సర్వదా మా నైశ తమో నాశనమును జేయునుగాక! మీరు సర్వదా
స్తుతిద్వారా మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 404

## సూక్తమ్—42

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర బ్రహ్మాణో[1] అంగిరసో నక్షన్త ప్ర క్రన్దనుర్నభన్యస్య వేతు ।
ప్ర ధేనవ[2] ఉదప్రుతో నవన్త యుజ్యాతామద్రీ[3] అధ్వరస్య పేశః ॥ 399

(2) సుగస్తే[4] అగ్నే సనవిత్తో[5] అధ్వా యుక్ష్వా సుతే హరితో రోహితశ్చ ।
యే వా సద్మన్నరుషా వీరవాహో హువే దేవానాం జనిమాని సత్తః ॥ 400

(3) సము వో యజ్ఞం మహయన్ నమోభిః ప్ర హోతా మన్ద్రో రిరిచ[6] ఉపాకే ।
యజస్వ సు పుర్వణీక దేవానా యజ్ఞియామరమతిం వవృత్యాః ॥ 401

(4) యదా వీరస్య రేవతో దురోణే[7] స్యోనశీరతిథిరాచికేతత్ ।
సుప్రీతో[8] అగ్నిః సుధితో దమ[9] ఆ స విశే దాతి [10]వార్యమియత్యై ॥ 402

1. బ్రహ్మాణోఽఅంగిరసో, 2. ధేనవఽఉద, 3. మద్రీఽఅధ్వ, 4. సుగస్తేఽఅగ్నే, 5. విత్తోఽఅధ్వా, 6. రిరిచఽఉపాకే, 7. దురోణే స్యోన, 8. సుప్రీతోఽఅగ్నిః 9. దమఽఆ, 10. వార్యామియత్యై. (ప్రా.ప్ర.)

(5) ఇమం నో[1] అగ్నే అధ్వరం జుషస్వ మరుత్స్విన్ద్రే యశసం కృధీ నః ।
ఆ నక్తా బర్హిః సదతాముషాసోశన్తా మిత్రావరుణా యజేహ ॥ 403

(6) ఏవాగ్నిం సహస్యం[2] వసిష్ఠో రాయస్కామో విశ్వప్స్న్యస్య[3] స్తౌత్ ।
ఇషం రయిం [4]పప్రథద్ వాజమస్మే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 404

## సూక్తము—42

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—విశ్వే దేవగణము

(1) గద్యము॥

స్తోతలగు నంగిరస్సులు, సర్వత్రా వ్యాప్యు లగుదురు. పర్జన్యుఁడు విశేషముగ నిచ్ఛగించుఁగాక! ప్రీతిదాయిను లగు నదులు జలసేచనముఁ జేయుచుఁ బ్రవహించుఁగాక! సాదరలగు పత్నులు, యజమానులు, యజ్ఞరూపమును గూర్తురుగాక! ॥ 405

(2) గద్యము॥

ఓ యగ్నీ! మీకుఁ జిరకాల లబ్ధ మగు పథము సుగమ మగును. ఏ హరిత్తులు, రోహితగణము, యజ్ఞగృహములందు. నీవలె వీరుని వహించుచు శోభింతురో! వారిని రథమునకు యోజనముఁ జేయుము! నే నుపనిష్టుఁడనై దేవతలను బిలిచెదను ॥ 406

---

1. నోఽఅగ్నే, 2. సహస్యం వసిష్ఠో, 3. విశ్వప్స్న్యస్య, 4. ప్రపథద్. (వా.ప్ర.)

(3) గద్యము॥

ఓ దేవగణమా! నమస్కరించుచున్న యీ స్తోతృగణము నీ యజ్ఞమును బూజించును. మా సమీపమున నున్నట్టియు, స్తుతిశీలుఁడయినట్టియు, హోత సర్వాపేక్షచే నుత్తముఁడు. ఓ యజమానుఁడా! దేవతలకు యజ్ఞ మొనర్చుము! ఓ బహుతేజస్కుఁడా! నీవు యజ్ఞార్థము భూమి నావర్తితముగా నొనర్పుము! ॥ 407

(4) గద్యము॥

అందరికి నతిథి యగ్ని. వీరుఁడు ధనవంతుని గృహమునందు సుఖముగ శయనించి పుష్టుఁ డగును. అగ్ని గృహమందు సునిహితుఁడై ప్రీతుఁ డగును. అందుచేత వానికి నికటగాములగు ప్రజలు వరణీయధనమును దాన మిచ్చెదరు ॥ 408

(5) గద్యము॥

అగ్ని మా యీ యజ్ఞమును సేవించును. ఇంద్రుఁడు మరుత్తుల మధ్యను మమ్ముఁ బూజితులుగా నొనర్చును. రాత్రియందును నుషఃకాలమందును బర్హిస్సున నుపవేశించును. యజ్ఞాభిలాషులగు మిత్రావరుణులను నీ యజ్ఞమందుఁ బూజింతురు ॥ 409

(6) గద్యము॥

వసిష్ఠుఁడు ధనాభిలాషియై యీ ప్రకారము బలపుత్రుండగు నగ్నిని బూజ్య ధనలాభమునకై స్తుతి నొనర్చెను. అగ్ని మాకు నన్నమును, బలమును, ధనమును నిచ్చుఁగాక! మీరు సర్వదా స్తుతిద్వారా మమ్ముఁ బాలింపుఁడు! ॥ 410

# సూక్తమ్—43

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర వో యజ్ఞేషు దేవయన్తో[1] అర్చన్ ద్యావా నమోభిః పృథివీ ఇషధ్యై ।
యేషాం [2]బ్రహ్మాణ్యసమాని విప్రా విష్వగ్వియన్తి వనినో న [3]శాఖాః ॥ 405

(2) ప్ర యజ్ఞ ఏతు హేత్వో న సప్తిరుద్యచ్ఛధ్వం సమనసో ఘృతాచీః ।
స్తృణీత బర్హిరధ్వరాయ సాధూర్ధ్వా శోచీంషి దేవయూన్యస్థుః ॥ 406

(3) ఆ పుత్రాసో న మాతరం విభృత్రాః సానౌ దేవాసో బర్హిషః సదన్తు ।
ఆ విశ్వాచీ విదథ్యామనక్త్వగ్నే మా నో దేవతాతా మృధస్కః ॥ 407

(4) తే సీషపన్త జోషమా యజత్రా[4] ఋతస్య ధారాః సుదుఘా దుహానాః ।
జ్యేష్ఠం వో[5] అద్య మహ ఆ వసూనామా గన్తన సమనసో యతి ష్ఠ ॥ 408

---

1. యన్తోఽఅర్చన్, 2. బ్రహ్మాణ్య, 3. శాఖః, 4. యజత్రాఽఋతస్య, 5. వోఽఅద్యమహఽఆ. (వా.ప్ర.)

(5) ఏవా నో అగ్నే విక్ష్వ దశస్య త్వయా వయం సహసావన్నాస్కాః ।
రాయా యుజా సధమాదో[1] అరిష్టా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 409

## సూక్తము—43

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—విశ్వే దేవతలు

(1) గద్యము॥

వృక్షశాఖలవలె మేధావుల స్తోత్రములు విశేషముగ నలుదిక్కులఁ జెదరును. ఆ మేధావులు యజ్ఞమందు నమస్కారముద్వారా మిమ్ములం బొందుటకు విశేషముగ స్తవ మొనర్చెదరు. ద్యావాభూములను స్తుతించెదరు ॥ 411

(2) గద్యము॥

శీఘ్రగామియగు నశ్వమురీతి నీ యజ్ఞమునకు వచ్చెదరుగాక! నీ వేకమనస్సుతో ద్రుతక్షర కారణి యగు ఋక్కు నుత్తోలన మొనర్చుము! అధ్వరమునకై మృదుబర్హిస్సును బరుపుము! ఓ యగ్నీ! దేవాభిలాషులగు నీ కిరణము లూర్ధ్వముఖములై వసించుఁగాక! ॥ 412

(3) గద్యము॥

విశేషరూపమునఁ బ్రతిపాలనీయులగు పుత్రులు మాతృక్రోడముల నాక్రమించునటుల దేవతలు యజ్ఞముయొక్క యున్నతప్రదేశము నధిరోహింతురుగాక! ఓ యగ్నీ! జుహువు యాగయోగ్య మగు నీ జ్వాలను దడుపునుగాక! నీవు యుద్ధమందు మా శత్రువులకు సహాయమును జేయకుము ॥ 413

---

1. మాదో౽అరిష్టా. (బ్రా.ప్ర.)

(4) గద్యము॥

యజనీయులగు దేవతలకు దోహనయోగ్య మగు ధారను వర్షించుచుఁ బర్యాప్తముగ మా
పరిచర్యను స్వీకరింతురుగాక! ఓ దేవతలారా! యిప్పుడు ధన మధ్యమున
నే పూజనీయ ధనమున్నదో! యది వచ్చునుగాక! మీర లంద రేకమనస్సు
గలవారై రండు! ॥ 414

(5) గద్యము॥

ఓ యగ్నీ! నీ వీ ప్రకారము ప్రజల మధ్యమున మాకు ధనము నిమ్ము! ఓ బలవంతుఁడా!
నేను నీచేఁ బరిత్యజింపఁబడకుండ నిత్యయుక్త ధనసహితుఁడనై మత్తుఁడను
నహింసితుఁడను నయ్యెదను. నీవు సర్వదా మమ్ముఁ బరిపాలింపుము! ॥ 415

## సూక్తమ్—44

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—దధిక్రాః, 1-దధిక్రాశ్వ్యుషోఽగ్నిభగేన్ద్రవిష్ణుపూష
బ్రహ్మణస్పత్యాదిత్యద్యావాపృథివ్యాపః
ఛందః—త్రిష్టుప్, 1-జగతీ

(1) దధిక్రాం[1] వః ప్రథమమశ్వినోషసమగ్నిం సమిద్ధం భగమూతయే హువే ।
ఇన్ద్రం విష్ణుం పూషణం బ్రహ్మణస్పతిమాదిత్యాన్ ద్యావాపృథివీ[2] అపః స్వః ॥ 410

(2) దధిక్రాము నమసా బోధయన్త ఉదీరాణా[3] యజ్ఞముపప్రయన్తః ।
ఇళాం దేవీం బర్హిషి సాదయన్తోఽశ్వినా విప్రా సుహవా హువేమ ॥ 411

---

1. దధిక్రావః, 2. పృథివీఽఆప స్వః, 3. ఉదీరణా. (వ్రా.ప్ర.)

(3) దధిక్రావాణం బుబుధానో[1] అగ్నిముప బ్రువ ఉషసం సూర్యం గామ్ ।
బ్రధ్నం[2] మంశ్చతోర్వరుణస్య బభ్రుం తే విశ్వాస్మద్[3] దురితా యావయన్తు ॥ 412

(4) దధిక్రావా ప్రథమో వాజ్యర్వా[4] ఽగ్రే రథానాం భవతి ప్రజానన్ ।
సంవిదాన ఉషసా [5]సూర్యేణాఽఽదిత్యేభిర్వసుభిరంగిరోభిః ॥ 413

(5) ఆ నో దధిక్రాః పథ్యామనక్త్వృతస్య పన్థామన్వేతవా[6] ఉ ।
శృణోతు నో దైవ్యం శర్ధో[7] అగ్నిః శృణ్వన్తు విశ్వే మహిషా అమూరాః ॥ 414

## సూక్తము—44

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—దధిక్రులు, 1-దధిక్రాదులు

(1) గద్యము॥

మీ రక్షార్థమై దధిక్రను బిలిచెదను. తదనంతర మశ్విద్వయమును, నుషస్సును, ప్రసిద్ధాగ్నిని మరియు భగుని నాహ్వానింతును. ఇంద్రుని, విష్ణువును, పూషుని బ్రహ్మణస్పతిని నాదిత్యగణమును ద్యావాభూములను, జలదేవతను, సూర్యుని నాహ్వానింతును ॥ 416

---

1. ధానోఽఅగ్నిముపబ్రువఽఉషసం, 2. బ్రధ్నంమాంశ్చతో. [వ్రా.ప్ర.] బ్రధ్నంమగ్ంశ్చతో (సా).
3. విశ్వాదురితా, 4. వాజ్యర్వాగ్నే, 5. సూర్యేణాదిత్యే, 6. తవాఽఉ, 7. శర్ధోఽఅగ్నిః. [వ్రా.ప్ర.]

(2) గద్యము॥

స్తోత్రములచే దధిక్రను ప్రబోధితునిగాను, ప్రవర్తితునిగాను జేయుచు యజ్ఞ ముపక్రమించునపుడు
కుశలపై నిలాదేవిని స్థాపించుచు శోభనాహ్వానయుతులు మేధావులు నగు
నశ్విద్వయమును బిలిచెదను ॥ 417

(3) గద్యము॥

నేను దధిక్రను ప్రబోధించుచు, నగ్నిని, నుషస్సును, సూర్యుని, భూమిని స్తుతించెదను. నేను
శత్రువినాశకారియగు వరుణునిపింగళవర్ణాశ్వమును నుతించెదను. ఈ దేవతలు సర్వ
పాపములను మానుండి వేరుపరచెదరుగాక! 418

(4) గద్యము॥

అశ్వముఖ్యుఁడు, శీఘ్రగామి, గమనశీలుఁడు నగు దధిక్రయు, బాగుగ జ్ఞాతవ్యమును దెలిసికొని
యుషస్సుతోను, సూర్యునితోను, నాదిత్యగణముతోను, వసువులతోను,
నంగిరస్సులతోను నేకమతముగలవారలై రథాగ్రమం దుందురు ॥ 419

(5)† గీ॥ అశ్విదేవతలార! మీ రశ్వయుక్త
సూర్యమార్గము నిష్కంటకశోభఁ దేలి
యనుగమింపుఁడు! జనులను నాదరమున
బ్రోచి రక్షింపుఁ డెంతయుఁ బూర్ణదయను ॥ 420

---

† ఈ44వ సూక్తమున 5 ఋక్కులుండఁగా శ్రీనేమానివారు 4 ఋక్కులను మాత్రమే యనువదించి 5వ ఋక్కును
పొరపాటున నాంధ్రీకరింపక విడిచిపెట్టిరి.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—45

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—సవితా
ఛందః—త్రిష్టుప్

(1) ఆ దేవో యాతు సవితా సురత్నో ఽన్తరిక్షప్రా వహమానో[1] అశ్వైః ।
హస్తే దధానో నర్యా పురూణి నివేశయంచ ప్రసువంచ భూమ ॥ 415

(2) ఉదస్య బాహూ శిథిరా బృహన్తా హిరణ్యయా దివో[2] అన్తాగ్ం అనష్టామ్ ।
నూనం సో అస్య మహిమా పనిష్ట సూరశ్చిదస్మా[3] అను దాదపస్యామ్ ॥ 416

(3) స ఘా నో దేవః సవితా సహావా[4] ఽఽ సావిషద్ వసుపతిర్వసూని ।
విశ్రయమాణో[5] అమతిమురూచీం మర్తభోజనమధ రాసతే నః ॥ 417

(4) ఇమా గిరః సవితారం సుజిహ్వం పూర్ణగభస్తిమీళతే సుపాణిమ్ ।
చిత్రం వయో బృహదస్మే దధాతు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 418

---

1. మానో౾అశ్వైః, 2. దివో౾అన్తా౾అనష్టాం, 3. దస్మా౾అను, 4. సహావాసావిషద్,
5. మాణో౾అమతీ. (వ్రా.ప్ర.)

## సూక్తము—45

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—సవిత

(1) గద్యము॥

రత్నవిశిష్టుఁడు నంతరిక్షపూరకుఁడు నశ్వములచే నూహ్యమానుండు నగు సవితృదేవుఁడు మనుష్యహితకరంబగు ధనమును ధరించుచు, భూతగణములను స్వస్థానమున ధరించుచు,స్వకార్యములయందుఁ బ్రేరేపించుచు వచ్చునుగాక! 421

(2) గద్యము॥

శిథిలములు బృహద్హిరణ్మయములు నగు బాహువులద్వారా యంతరిక్షాంతసమూహమును వ్యాప్తించుఁగాక! నే నిపుడు సవితయొక్క యా మహిమను నుతించెదను. సూర్యుఁడు సవితకుఁ గర్మేచ్ఛ నొసంగుఁగాక! 422

(3) గద్యము॥

తేజోయుతుఁడు,వసుపతి,యగు సవిత మాకు ధనము నిచ్చుఁగాక! వాఁడు బహువిస్తీర్ణ రూపమున ధరించుచు మనుష్యులకు భోగయోగ్య మగు ధనమును మా కొసంగుఁగాక! ॥ 423

(4) గద్యము॥

ఈ స్తుతిసమూహ ముత్తమజిహ్వుఁడు ధనపూర్ణుఁడు నగు సవితను స్తుతించును. వాఁడు మాకు విచిత్రమగు ధనము నిచ్చుఁగాక! మీరు సర్వదా స్తుతిద్వారా మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 424

## సూక్తమ్—46

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—రుద్రః
ఛందః—జగతీ, 4-త్రిష్టుప్

(1) ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః క్షిప్రేషవే దేవాయ స్వధావ్నే ।
అషాళ్హాయ[1] సహమానాయ వేధసే తిగ్మాయుధాయ భరతా శృణోతు[2] నః ॥ 419

(2) స హి[3] క్షయేణ క్షమ్యస్య జన్మనః సామ్రాజ్యేన దివ్యస్య చేతతి ।
అవన్నవన్తీరుప నో దురశ్చరాఽనమీవో రుద్ర జాసు నో భవ ॥ 420

(3) యా తే దిద్యుదవసృష్టా దివస్పరి క్ష్మయా చరతి పరి సా వృణక్తు నః ।
సహస్రం తే స్వపివాత భేషజా మా నస్తోకేషు తనయేషు రీరిషః ॥ 421

(4) మా నో వధీ రుద్ర మా పరా దా మా తే భూమ ప్రసితౌ హీళితస్య ।
ఆ నో భజ బర్హిషి జీవశంసే[4] యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 422

---

1. అషాహ్యా, 2. శృణేతు నః, 3. స హి క్షయేవ క్షభ్యస్య, 4. జీవశంసో. (ప్రా.ప్ర.)

## సూక్తము—46

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—రుద్రుఁడు

(1) గద్యము॥

స్థిరకార్ముకుఁడు, శీఘ్రగామి, బాణయుతుఁడు, నన్నవంతుఁడు నెవ్వరిచేతను దిరస్కరింపఁబడనివాఁడును, నందరికి నభిభవమును గూర్చువాఁడును, దీక్ష్ణాస్త్ర విధానకారియగు రుద్రునికి స్తుతి నొనర్చెదను ॥ 425

(2) గద్యము॥

పృథివీస్థులు, స్వర్గస్థులు నగు జనులయొక్క యైశ్వర్యమువలన వారిని రుద్రుఁడు దెలిసికొనఁగలఁడు. ఓ రుద్రుఁడా! నీ స్తవము నొనర్చెడు ప్రజలను బాలించుచు మా గృహమునకు రమ్ము! మాకు రోగములను బుట్టింపకుము ॥ 426

(3) గద్యము॥

అంతరిక్షమునుండి విముక్తమగు నీ విద్యుత్తు క్షితిపైఁ దిరుగును. అది మమ్ముఁ ద్యజించునుగాక! స్వపివాతుఁడా! నీకు సహస్రభేషజములు గలవు. మాకును, మా పుత్ర పౌత్రులకును హింసను గల్గింపకుము 427

(4) గద్యము॥

ఓ రుద్రుఁడా! మాకు హింసఁ జేయకుము. మమ్ము విడిచిపెట్టకుము. నీవు కృద్ధుఁడవై మమ్ము బంధింపకుము. జీవములయొక్క ప్రశంసాయోగ్యము లగు యజ్ఞములందు మాకు భాగ ముండునటుల నొనర్చుము! నీవు మమ్ము స్వస్తివలనఁ బరిపాలింపుము! ॥ 428

## సూక్తమ్—47

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఆపః

ఛందః—త్రిష్టుప్

(1) ఆపో యం వః ప్రథమం దేవయన్త[1] ఇన్ద్రపానమూర్మిమకృణ్వతేళః ।
తం వో వయం శుచిమరిప్రమద్య ఘృతప్రుషం మధుమన్తం వనేమ ॥ 423

(2) తమూర్మిమాపో మధుమత్తమం వో ఽపాం నపాదవత్వాశుహేమా ।
యస్మిన్నిన్ద్రో వసుభిర్మాదయాతే తమశ్యామ దేవయన్తో వో[2] అద్య ॥ 424

(3) శతపవిత్రాః స్వధయా మదన్తీర్దేవీర్దేవానామపి యన్తి పాథః ।
తా ఇన్ద్రస్య న మినన్తి వ్రతాని సిన్ధుభ్యో హవ్యం ఘృతవజ్జుహోత ॥ 425

(4) యాః సూర్యో రశ్మిభిరాతతాన యాభ్య[3] ఇన్ద్రో అరదద్ గాతుమూర్మిమ్ ।
తే సిన్ధవో వరివో ధాతనా నో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 426

---

1. దేవయన్తఽఇన్ద్ర, 2. వోఽఅద్య, 3. యాభ్యఽఇన్ద్రోఽఅరదద్. (వా.ప్ర.)

## సూక్తము—47

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—అప్పు (నీరు)

(1) గద్యము॥

ఓ యబ్దేవతా! దేవాభిలాషు లింద్రునకుఁ బాతవ్యము, భూమిసంభూతము నగు నే సోమరసము సంస్కృతమయినదో! శుచియుఁ బాపరహితము వృష్టిజలసేకి మధుర రసయుక్తము నగు నా సోమరసమును నేను సేవించెదను॥ 429

(2) గద్యము॥

ఓ యబ్దేవతా! శీఘ్రగతి గల "అపాం నపాత్తు" అనుదేవత నీయొక్క మధుమత్తమ ప్రసిద్ధోర్మ్మలను బాలించుఁగాక! ఇంద్రుఁడు వానివలన వసుగణములతోఁగూడ మత్తుఁడగును. నేను దేవాభిలాషినై యిపుడు నీ యా యూర్మ్మలను బొందఁగలను॥ 430

(3) గద్యము॥

బహువిచిత్రరూపములు గల యశ్వములవలన లోకములకు హర్షోత్పాదకమును ద్యోతమానమును నగు జలము దేవతాస్థానమందుఁ బ్రవేశించును. వార లింద్రుని కర్మలకు హింస సేయకుందురు. మీరు సింధువులకు ఘృతయుక్త మగు హవ్యమును హోమమును సమర్పింతురు॥ 431

(4) గద్యము॥

సూర్యుఁడు రశ్మిలవలన నే యప్సమూహమును విస్తీర్ణముగఁ జేయునో! దానికయి, యింద్రుఁడు గమనయోగ్య మగు మార్గమును విస్తీర్ణముగఁ జేయుచున్నాఁడు. ఓ సింధుగణమా! నీవు మాకు ధనము నొసంగుము! సర్వదా స్తుతులవలన మమ్ము రక్షించుము!॥ 432

## సూక్తమ్—48

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఋభవః, 4-విశ్వే దేవా వా
ఛందః—త్రిష్టుప్

(1) ఋభుక్షణో వాజా మాదయధ్వమస్మే నరో మఘవానః సుతస్య ।

ఆ వోఽర్వాచః క్రతవో న యాతాం విభ్వో రథం నర్యం వర్తయన్తు ॥ 427

(2) ఋభుర్ఋభుభిరభి వః స్యామ విభ్వో విభుభిః శవసా శవాంసి ।

వాజో అస్మాగ్ం[1] అవతు వాజసాతావిన్ద్రేణ యుజా తరుషేమ వృత్రమ్ ॥ 428

(3) తే చిద్ధి పూర్వీరభి సన్తి శాసా విశ్వాగ్ం[2] అర్య ఉపరతాతి వన్వన్ ।

ఇన్ద్రో విభ్వాగ్ం[3] ఋభుక్షా వాజో అర్యః శత్రోర్మిథత్యా కృణవన్ వి నృమ్ణమ్ ॥ 429

(4) నూ దేవాసో వరివః కర్తనా నో భూత నో విశ్వేఽవసే సజోషాః ।

సమస్మే[4] ఇషం వసవో దదీరన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 430

---

1. అస్మాగ్ంఽఅవతు, 2. విశ్వాగ్ంఽఅర్యఽఉప, 3. విభ్వాఽఋభుక్షా రాజోఽఅర్యః,

4. సమస్మేఽఇషం. (ప్రా.ప్ర.)

## సూక్తము—48

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఋభువులు, 4-విశ్వే దేవతలు లేక ఋభువులు

(1) గద్యము॥

నేతలు, ధనవంతులు నగు ఋభువులారా! మీరు మా సోమపానమువలనఁ బ్రమత్తులరు కండు! కర్మనేతృసమర్థములు నగు నశ్వములు మా కభిముఖములై మనుజులకు హితకరం బగు రథమును మరలించుఁగాక! ॥ 433

(2) గద్యము॥

ఓ ఋభుగణమా! మేము మీవలనఁ బ్రసిద్ధిని బొందెదము. మీరు సమర్థులరు. మీ సాహాయ్యమువలన సమర్థులమై మీబలమువలన శత్రుబలమును దిరస్కరించెదము. "వాజుఁడు" యుద్ధమందు మమ్ములను రక్షించునుగాక! ఇంద్రుని సాహాయ్యమును బడసి కఠినుల హస్తములనుండి విడివడుదుము ॥ 434

(3) గద్యము॥

ఇంద్రుఁడు ఋభువులు మా బహుతర శత్రుసేనలను జయింతురు. యుద్ధము జరుగునపుడు సమస్త శత్రుసేనలను హింసింతురు. విద్య, ఋభుక్షాణుఁడు, వాజుఁడు, నింద్రుఁడు నార్యులై శత్రుసేనలను వధింతురు ॥ 435

(4) గద్యము॥

ద్యోతమానులగు ఋభువులారా! మీ రిపుడు మాకు ధనము నీయుఁడు! మీరు ప్రీతులరై మాకు రక్ష నొసంగుఁడు! వసువులు, ఋభువులు, మాకు నన్నము నొసంగుదురుగాక! ॥ 436

# సూక్తమ్—49

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఆపః
ఛందః—త్రిష్టుప్

(1) సముద్రజ్యేష్ఠాః సలిలస్య మధ్యాత్ పునానా యన్త్యనివిశమానాః ।
ఇన్ద్రో యా వజ్రీ వృషభో రరాద తా[1] ఆపో దేవీరిహ[2] మామవన్తు ॥ 431

(2) యా[3] ఆపో దివ్యా ఉత వా స్రవన్తి ఖనిత్రిమా[4] ఉత వా యాః స్వయంజాః ।
సముద్రార్థా యాః శుచయః పావకాస్తా[5] ఆపో దేవీరిహ[2] మామవన్తు ॥ 432

(3) యాసాం రాజా వరుణో యాతి మధ్యే[6] సత్యానృతే అవపశ్యంజనానామ్ ।
మధుశ్చుతః శుచయో యాః పావకాస్తా[5] ఆపో దేవీరిహ[2] మామవన్తు ॥ 433

(4) యాసు రాజా వరుణో యాసు సోమో విశ్వే దేవా యాసూర్జం మదన్తి ।
వైశ్వానరో [7]యాస్వగ్నిః ప్రవిష్టస్తా[8] ఆపో దేవీరిహ[2] మామవన్తు ॥ 434

---

1. రరాదతాఽఆపో, 2. ఽహి మామవన్తు, 3. యాఽఆపోదివ్యాఽఉత, 4. త్రిమాఽఉత, 5. కాస్తాఽఆపో, 6. మధ్యేఽసత్యేన్నృతేఽఅవపశ్యం, 7. యాఽస్వగ్నిః, 8. స్తాఽఆపో. (ప్రా.ప్ర.)

## సూక్తము—49

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అప్పు (నీరు)

(1) గద్యము॥

సముద్రుఁ డే యప్సమూహమునకు జ్యేష్ఠుఁడు, సర్వదా గమనశీలుఁడు, శోధయిత
యగుచున్నాఁడో! యట్టి యప్సమూహ మంతరిక్షమధ్యమమునుండి వచ్చుచున్నది.
వజ్రధారియు, యభీష్టవర్షియు నగు నింద్రుఁ డే యప్సమూహమును ద్యజించెనో!
యయ్యది యిచ్చటనున్న మమ్ములను రక్షించునుగాక!॥ 437

(2) గద్యము॥

ఏ యప్సమూహ మంతరిక్షమం దుత్పన్న మగునో! యేది ప్రవహించుచు ఖననమువలన
లాభము సమకూర్చునో! యెయ్యది స్వయముగ నుత్పన్నమై సముద్రాభిముఖముగఁ
బ్రవహించునో! దీప్తియుతము పవిత్రకరము నగు నా యబ్దేవీ సమూహము
మమ్ముల రక్షించుఁగాక! 438

(3) గద్యము॥

ఏ యప్సమూహమునకు స్వామి యగు వరుణుఁడు జలమధ్యమున సత్యుఁడై మిథ్యాసాక్షియై
మధ్యమలోకమును బ్రవేశించునో! మధుక్షారిణీదీప్తియుతము శోధించునదియు నగు
నా యబ్దేవీసమూహము నమ్ముల రక్షించుఁగాక! ॥ 439

(4) గద్యము॥

దేనియందు రా జగు వరుణుఁడు నివసించునో! దేనియందు సోముఁ డుండునో! దేనియందు
విశ్వే దేవత లన్నమును దిని మదించిరో! వైశ్వానరాగ్ని దేనియందుఁ బ్రకాశించునో!
ద్యుతిమంత మగు నా యప్సమూహము మమ్ముల రక్షించుఁగాక! ॥ 440

## సూక్తమ్—50

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1-మిత్రావరుణౌ, 2-అగ్నిః, 3—విశ్వే దేవాః, 4—నద్యః
ఛందః—జగతీ, 3—అతిజగతీ శక్వరీ వా

(1) ఆ మాం మిత్రావరుణేహ రక్షతం కులాయయద్ విశ్వయన్మా న[1] ఆ గన్ ।
అజకావం దుర్దృశీకం తిరో దధే మా మాం పద్యేన రపసా విదత్ త్సరుః ॥ 435

(2) యద్ విజామన్ పరుషి[2] వన్దనం భువదష్ఠీవన్తౌ పరి కుల్ఫౌ చ దేహత్ ।
అగ్నిష్టచ్ఛోచన్నప బాధతామితో మా మాం పద్యేన రపసా విదత్ త్సరుః ॥ 436

(3) యచ్ఛల్మలౌ భవతి యన్నదీషు యదోషధీభ్యః పరి జాయతే విషమ్ ।
విశ్వే దేవా నిరితస్తత్ సువన్తు మా మాం పద్యేన రపసా విదత్ త్సరుః ॥ 437

(4) యాః ప్రవతో నివత ఉద్వత ఉదన్వతీరనుదకాశ్చ యాః ।
తా అస్మభ్యం పయసా పిన్వమానాః శివా దేవీరశిపదా భవన్తు సర్వా[4] నద్యో అశిమిదా భవన్తు ॥ 438

---

1. యన్మానఽఆగన్, 2. పరుషిం వదనం, 3. ప్రవతో నివతఽఉద్వతఽఉద, 4. సర్వానుద్యోఽఅశి. (వా.ప్ర.)

## సూక్తము—50

ఋషి —మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—1-మిత్రావరుణులు, 2-అగ్ని, 3-†విశ్వే దేవతలు, 4-నదులు

(1) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! మీ రిచట మమ్ము రక్షింపుఁడు! కులాయకారియు సర్వదా వర్ధమానము నగు విషము మా కభిముఖముగ రాకూడదు. అజకా నామక రోగ విశిష్టము, దుర్దర్శనము నగు విషము నశించును. ఛద్మగామి యగు సర్పము పదశబ్దమువలన మమ్మెల గుర్తెఱుంగలేదు ॥ 441

(2) గద్యము॥

వందన నామక మగు నే విషము నానావృక్షముల పూర్వస్థానములం దుద్భూత మగునో! యే విషము జానువులను గుల్ఫములను విస్ఫీతములుగఁ జేయునో! దీప్తిమంతుఁడగు నగ్ని యా వ్యక్తికడనుండి యా విషమును దూరీకృతముగాఁ జేయుఁగాక! ఛద్మగామి యగు సర్పము పదశబ్దములవలన మమ్మెల గుర్తెఱుంగలేదు ॥ 442

(3) గద్యము॥

ఏ విషము శాల్మలీవృక్షమునందుఁ బుట్టునో! యెయ్యది నదీజలమం దోషధులవలన నుత్పన్నమగునో! విశ్వే దేవగణ మావిషమును మా చెంతనుండి దూరముగఁ జేయును. ఛద్మగామి యగు సర్పము పదశబ్దములవలన మమ్మెల గుర్తెఱుంగలేదు ॥ 443

(4) గద్యము॥

ఏ నదులు ప్రబలదేశములందుఁ బ్రవహించునో! యేవి నిమ్నదేశములకుఁ బోవునో! యేవి యుదకోచ్ఛిష్టములో! యేవి యబాదకజలమువలన జగత్తు నాప్యాయతముగ నొనర్చునో! ద్యుతిమంత మగు నే నదీగణము మా శ్లీపదరోగమును నివారించి కల్యాణము నొనర్చునో! యా నదీగణ మంతయు మా కహింసాప్రద మగును ॥ 444

---

† వ్రాతప్రతిలో 3వ ఋక్కునకు దేవత వైశ్వానరుఁడని యున్నది గాని యది పొరపాటు. 15b సంఖ్యగల గ్రంథములోని ఋషిదేవతల పట్టికలోను నాంధ్రానువాదములోను విశ్వేదేవత లనియే కలదు.

## సూక్తమ్—51

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఆదిత్యాః
ఛందః—త్రిష్టుప్

(1) ఆదిత్యానామవసా నూతనేన
సక్షీమహి శర్మణా శంతమేన ।
అనాగాస్త్వే[1] అదితిత్వే తురాస ఇమం
యజ్ఞం దధతు శ్రోషమాణాః ॥ 439

(2) ఆదిత్యాసో[2] అదితిర్మాదయన్తాం
మిత్రో[3] అర్యమా వరుణో రజిష్ఠాః ।
అస్మాకం సన్తు భువనస్య గోపాః
పిబన్తు సోమమవసే నో అద్య ॥ 440

(3) ఆదిత్యా విశ్వే మరుతశ్చ విశ్వే
దేవాశ్చ విశ్వే[4] ఋభవశ్చ విశ్వే ।
ఇన్ద్రో[5] అగ్నిరశ్వినా తుష్టువానా
యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 441

---

1. అనాగాస్త్వేఽఅదితిత్వేతురాసఽఇమం, 2. ఆదిత్యాసోఽఅదితి, 3. మిత్రోఽఅర్య, 4. విశ్వేఽఋభవశ్చ,
5. ఇన్ద్రోఽఅగ్నిరశ్వినా. (ప్రా.ప్ర.)

## సూక్తము—51

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—ఆదిత్యులు

(1) గద్యము॥

నే నాదిత్యదేవుని నాశ్రయించి నూతనము, సుఖకరము నగు గృహమును బొందెదను. త్వరాన్వితులగు నాదిత్యులు మా స్తోత్రము లన్నిటిని నాలించి యీ యజ్ఞకరుల ననపరాధులుగను, నదీనులుగను నొనర్చును ॥ 445

(2) గద్యము॥

ఆదిత్యగణము, నదితి, యతిశయ ఋజుస్వభావములు గల మిత్రావరుణులు, నర్యముఁడును ప్రమత్తు లగుదురు. భువనరక్షకం బగు దేవగణము మాదే యగుఁగాక! ఇపుడు మమ్ము రక్షించుటకై సోమమును బానమును జేయుదురుగాక! ॥ 446

(3) గద్యము॥

మేము స్తవముచేసిన యీ సమస్తాదిత్యగణము, సమస్త మరుద్గణము, సమస్త దేవగణము, సమస్త ఋభుగణము, నింద్రుఁడు, నగ్ని, నశ్విద్వయమును గంరో! యీ దేవతలు సర్వదా స్వస్తిమూలమున మమ్ము సంరక్షింతురుగాక! ॥ 447

## సూక్తమ్—52

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా— ఆదిత్యాః
ఛందః—త్రిష్టుప్

(1) ఆదిత్యాసో[1] అదితయః స్యామ
పూర్దేవత్రా వసవో మర్త్యత్రా ।
సనేమ మిత్రావరుణా సనన్తో
భవేమ ద్యావాపృథివీ భవన్తః ॥ 442

(2) మిత్రస్తన్నో వరుణో మామహన్త
శర్మ తోకాయ తనయాయ గోపాః ।
మా వో భుజేమాన్యజాతమేనో మా
తత్ కర్మ వసవో యచ్చయధ్వే ॥ 443

(3) తురణ్యవోఽంగిరసో[2] నక్షన్త
రత్నం దేవస్య సవితురియానాః ।
పితా చ తన్నో మహాన్ యజత్రో
విశ్వే దేవాః సమనసో జుషన్త ॥ 444

---

1. ఆదిత్యాసోఽఅదిత, 2. తురణ్యవోఽంగిరసో. (బ్రా.ప్ర.)

## సూక్తము—52

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—ఆదిత్యులు

(1) గద్యము॥

మే మాదిత్యులము. మే మదితులమునుగూడ నయ్యెదము. దేవతామధ్యమున నో వసుగణమా! మీరు మనుష్యులను బాలింపుఁడు! ఓ మిత్రావరుణులారా! మిమ్ముల భజించుచు ధనము భోగించెదము. ఓ ద్యావాభూములారా! మేము భూతి విశిష్టుల మయ్యెదము ॥ 448

(2) గద్యము॥

మిత్రుఁడు వరుణ ప్రముఖు లగు నాదిత్యులారా! మా పుత్రపౌత్రులకు సుఖ మొసంగుదురుగాక! అన్యకృత పాపము మే మనుభవింపము. మీ రే కర్మ నశింపఁజేయుదురో! మే మా కర్మ నాచరింపము ॥ 449

(3) గద్యము॥

త్వరావంతులగు నంగిరస్సులు సవిత సమీపమును యాచించుచు వారి రమణీయంబగు నే ధనమును వ్యాప్తమగునట్టుచేసిరో! యాగశీలుఁడు మహాత్ముఁడు నగు పిత, సమస్త దేవగణములును, నేకమనస్సుతో నా ధనమును మా కిచ్చెదరుగాక! ॥ 450

## సూక్తమ్—53

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ద్యావాపృథివీ

ఛందః—త్రిష్టుప్

(1) ప్ర ద్యావా యజ్ఞైః పృథివీ నమోభిః
సబాధ ఈళే బృహతీ యజత్రే ।
తే చిద్ధి పూర్వే కవయో గృణన్తః
పురో మహీ దధిరే [1]దేవపుత్రే ॥ 445

(2) ప్ర పూర్వజే పితరా నవ్యసీభిర్గీర్భిః
కృణుధ్వం సదనే[2] ఋతస్య ।
ఆ నో ద్యావాపృథివీ దైవ్యేన జనేన
యాతం మహి వాం వరూథమ్ ॥ 446

(3) ఉతో హి వాం రత్నధేయాని సన్తి
పురూణి ద్యావాపృథివీ సుదాసే ।
అస్మే ధత్తం యదసదస్కృధోయు
యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 447

---

1. దేవపుత్రే, 2. సదనేఽఋతస్య. (ప్రా.ప్ర.)

## సూక్తము—53

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ద్యావాభూములు*

(1) గద్యము॥

మహాత్ములు, దేవగణమును బుట్టించువారు నగు నే ద్యావాభూములను దన పూర్వస్తోతలు స్తుతులఁ బఠించుచుఁ బురోభాగమందు స్థాపించినారలో! యజనీయు లగు నా ద్యావాభూములను నేను ఋషిగణ సంవాదయుక్తుఁడనై యజ్ఞ నమస్కార సహితుఁడనై స్తుతించెదను ॥ 451

(2) గద్యము॥

ఓ స్తోతృగణమా! మీరు నూతన స్తుతులవలనఁ బూర్వప్రజాతలు విశ్వమునకుఁ బితృభూతలు నగు ద్యావాపృథువులను యజ్ఞస్థలముయొక్క పురోభాగమందు స్థాపింపుము! ఓ ద్యావాభూములారా! రమణీయ మగు మీ ధనమును దాన మొసంగుటకు దేవతలతో మా కిడకు రండు! ॥ 452

(3) గద్యము॥

ఓ ద్యావాపృథువులారా! మీ దాసులకు దేయధనము కలదు. అం దేది యక్షయమో! యది మా కొసంగుము! ఓ ద్యావాభూములారా! మీరలు సర్వదా మాకుఁ గళ్యాణముల నొసంగుచు మమ్ములను బాలింపుఁడు! ॥ 453

---

* 1Fb సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ 53వ సూక్తమునకు దేవత "భూమ్యాకాశములు"గా శ్రీ నేమానివారు వ్రాసిరి.

## సూక్తమ్—54

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వాస్తోష్పతిః
ఛందః—త్రిష్టుప్

(1) వాస్తోష్పతే ప్రతి[1] జానీహ్యస్మాన్
త్స్వావేశో[2] అనమీవో భవా నః ।
యత్ త్వేమహే ప్రతి తన్నో జుషస్వ
శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥ 448

(2) వాస్తోష్పతే ప్రతరణో[3] న ఏధి
గయస్ఫానో గోభిరశ్వేభిరిన్దో ।
అజరాసస్తే సఖ్యే స్యామ పితేవ
పుత్రాన్ ప్రతి నో జుషస్వ ॥ 449

(3) వాస్తోష్పతే శగ్మయా సంసదా
తే సక్షీమహి రణ్వయా గాతుమత్యా ।
పాహి క్షేమ[4] ఉత యోగే వరం నో
యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 450

---

1. ప్రతి జనీ, 2. వేశో౾అనమీకో, 3. ప్రతరణే నఽఏధి, 4. క్షేమఽఉత. (ప్రా.ప్ర.)

## సూక్తము—54

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—వాస్తోష్పతి

(1) గద్యము॥

ఓ వాస్తోష్పతీ! నీవు మమ్ములఁ బ్రబోధింపుము! మా నివాసమును †నీరోగముగలదిగాఁ జేయుము! నేను యాచించిన ధనము నొసంగుము! మా పుత్రపౌత్రాదు లగు ద్విపద జనంబులకు గవాశ్వాది చతుష్పదవర్గమునకు సుఖమును గలుఁగఁజేయుము! ॥ 454

(2) గద్యము॥

ఓ వాస్తోష్పతీ! నీవు మమ్ములను, మా ధనమును, వృద్ధిఁ బొందింపుము! నీవు మాకు సఖుఁడ వైనచో మేము గవాశ్వాదియుక్తులము జరారహితులము నగుదుము. పిత పుత్రాదులను బరిపాలించునట్లు నీవు మమ్ముఁ బరిపాలింపుము! ॥ 455

(3) గద్యము॥

ఓ వాస్తోష్పతీ! మేము నీకు సుఖకరులము. సుందరము ధనవంతమును నగు స్థానమును బొందఁగలము! మాయొక్క ప్రాప్తాప్రాప్తము వరణీయము నగు ధనమును రక్షింపుము! మాకుఁ గళ్యాణము నిచ్చి పరిపాలింపుము! ॥ 456

† నిర్ + రోగము = నీరోగము. రోగము లేకుండుట అని అర్థము. ఈ సంధిరూపము ఆంధ్రభాషకు అసహజ రూపముగాఁ దోచి "నీ యొక్క రోగము" అను నర్థమును సామాన్యులలో స్ఫురింపఁజేయును. "నిర్రోగము" అనురూపము తెలుగులో నపార్థము నీయక స్పష్టార్థక మగును.
చూ. "వ్యావహారికభాషా వ్యాకరణం". (సంధిపరిచ్ఛేదం—118వ సూత్రం — 66-67 పుటలు)

## సూక్తమ్—55

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వాస్తోష్పతిః, 2-8-ఇన్ద్రః, (ప్రస్వాపినీ ఉపనిషద్), 9-20-సర్వాః
ఛందః—1- గాయత్రి, 2-4-ఉపరిష్టాద్బృహతీ, 5-13, 16-19, అనుష్టుప్, 14, 15, 20-బృహతీ

(1) అమీవహా వాస్తోష్పతే [1]విశ్వా రూపాణ్యావిశన్ ।
సఖా సుశేవ[2] ఏధి నః ॥ 451

(2) యదర్జున సారమేయ దతః పిశంగ యచ్ఛసే ।
వీవ భ్రాజన్త[3] ఋష్టయ ఉప స్రక్వేషు బప్సతో ని షు స్వప ॥ 452

(3) స్తేనం రాయ సారమేయ తస్కరం వా పునఃసర ।
స్తోతౄనిన్ద్రస్య రాయసి కిమస్మాన్ దుచ్ఛునాయసే ని షు స్వప ॥ 453

(4) త్వం సూకరస్య దర్దృహి తవ దర్దర్తు సూకరః ।
స్తోతౄనిన్ద్రస్య రాయసి కిమస్మాన్ దుచ్ఛునాయసే ని షు స్వప ॥ 454

---

1. విశ్వ రూపాణ్యా, 2. సుశేవఽఏధి నః, 3. భ్రాజన్తఽఋష్టయఽఉప. [వా.ప్ర.]

(5) సస్తు మాతా సస్తు పితా సస్తు శ్వా సస్తు విశ్పతిః ।
ససన్తు సర్వే జ్ఞాతయః సస్త్వయమభితో జనః ॥ 455

(6) య ఆస్తే యశ్చ చరతి యశ్చ పశ్యతి నో జనః ।
తేషాం సం హన్మో[1] అక్షాణి యథేదం హర్మ్యం తథా ॥ 456

(7) సహస్రశృంగో వృషభో యః సముద్రాదుదాచరత్ ।
తేనా సహస్యేనా వయం ని జనాన్ త్స్వాపయామసి ॥ 457

(8) ప్రోష్ఠేశయా వహ్యేశయా నారీర్యాస్తల్పశీవరీః ।
స్త్రియో యాః పుణ్యగన్ధాస్తాః సర్వాః స్వాపయామసి ॥ 458

† (9) స్వప్న స్వప్నాభికరణే సర్వం ని ష్వాపయా జనమ్ ।
ఆసూర్యమన్యాన్ త్స్వాపయావ్యుషం జాగ్రియామహమ్ ॥ 459

---

1. హన్మోఽఅక్షాణి. [వ్రా.ప్ర.]

† ఈ 55వ సూక్తములో 9వ ఋక్కు మొదలు 20వ ఋక్కు వరకునుగల 12 ఋక్కులు కొన్ని ముద్రిత ప్రతులలో లేవు. ఈ ఋక్కులు పరిశిష్ట పాఠములుగాఁ గొన్ని వ్రాతప్రతులలో వ్రాయఁబడినవి. వీనిని "ఖిల" మంత్రములని కొందరు భావించిరి.

† (10) అజగరో నామ సర్పః సర్పిరవిషో మహాన్ ।

తస్మిన్ హి సర్పః సుధితస్తేన త్వా స్వాపయామసి ॥ 460

†(11) సర్పః సర్పో అజగరః సర్పిరవిషో మహాన్ ।

తస్య సర్పాత్ సిన్ధవస్తస్య గాధమశీమహి ॥ 461

†(12) కాళికో నామ సర్పో నవనాగసహస్రబలః ।

యమునహ్రదే హ సో జాతో యో నారాయణవాహనః ॥ 462

†(13) యది కాళికదూతస్య యది కాఃకాళికాద్భయాత్ ।

జన్మభూమిమతిక్రాన్తో నిర్విషో యాతి కాళికః ॥ 463

†(14) ఆ యాహీన్ద్ర పథిభిరీళితేభిర్యజ్ఞమిమం నో భాగధేయం జుషస్వ ।

తృప్తాం జహుర్మాతులస్యేవ యోషా భాగస్తే పైతృష్వసేయీ వపామివ ॥ 464

---

† ఈ ఋక్కులు కొన్ని ముద్రిత ప్రతులలో లేవు. పరిశిష్ట పాఠములుగాఁ గొన్ని వ్రాతప్రతులలో వ్రాయఁబడినవి. వీనిని "ఖిల" మంత్రములని కొందరు భావించిరి.

†(15) యశస్కరం బలవన్తం ప్రభుత్వం తమేవ రాజాధిపతిర్బభూవ ।
సంకీర్ణనాగాశ్వపతిర్నరాణాం సుమంగల్యం సతతం దీర్ఘమాయుః ॥ 465

†(16) కర్కోటకో నామ సర్పో యో దృష్టివిష ఉచ్యతే ।
తస్య సర్పస్య సర్పత్వం తస్మై సర్ప నమోఽస్తు తే ॥ 466

†(17) యేఽదో రోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు ।
యేషామప్సు సదస్కృతం తేభ్యః సర్పేభ్యో నమః ॥ 467

†(18) యా ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీనను ।
యే వావటేషు శేరతే తేభ్యః సర్పేభ్యో నమః ॥ 468

†(19) నమో అస్తు సర్పేభ్యో యే కే చ పృథివీమను ।
యే అన్తరిక్షే యే దివి తేభ్యః సర్పేభ్యో నమః ॥ 469

† ఈ ఋక్కులు కొన్ని ముద్రిత ప్రతులలో లేవు. ఇవి పరిశిష్ట పాఠములుగాఁ గొన్ని వ్రాతప్రతులలో వ్రాయఁబడినవి. వీనిని "ఖిల" మంత్రములని కొందరు భావించిరి.

†(20) ఉగ్రాయుధాః ప్రమతినః ప్రవీరా మాయావినో బలినో మిచ్ఛమానాః ।
యే దేవానసురాః పరాభవన్ తాంస్త్వం వజ్రేణ మఘవన్ నివారయ ॥ 470

## సూక్తము—55

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—1-వాస్తోష్పతి, 2-8-ఇంద్రుఁడు, 9-20-సర్పములు

(1) గీ॥ ఓయి! వాస్తోష్పతి! నీ వమేయ రోగ
ములను నశియింపఁజేయుచు లలితపరచు
మధ్యమును బొందుచుం గడు మాకు సఖుఁడ
వగుచు సుఖకరుఁడవుకూడ నగుము! ప్రీతి ॥ 457

(2) గద్యము॥

ఓ శ్వేతవర్ణుఁడా! కొన్నికొన్ని భాగములఁ బిశంగవర్ణముగల సరమాపుత్రుఁడా! నీవు దంత ప్రకాశమును జేయుము! అది మా సమీపమందు నాహారసమయసృక్కిణీప్రదేశమందు నాయుధమువలె విశేషముగా శోభించును. సుఖముగా నిద్రపొమ్ము! ॥ 458

(3) గద్యము॥

ఓ సారమేయమా! నీ వే స్థానమునుండి బయలువెడలెదవో! మరల నా స్థానమునే చేరుము! నీవు చోరులకడకు హంతకులకడకుఁ జనుము! ఇంద్రస్తోతల సమీపమున కేల పోయెదవు? మమ్మేల బాధించెదవు? సుఖముగా నిద్రపొమ్ము ॥ 459

---

† ఈ 20వ ఋక్కు కొన్ని ముద్రిత ప్రతులలో లేదు. ఈ ఋక్కు పరిశిష్ట పాఠముగాఁ గొన్ని వ్రాత ప్రతులలో వ్రాయఁబడినది. దీనిని "ఖిల" మంత్రమని కొందరు భావించిరి.

(4) గద్యము॥

నీవు సూకరమును జీల్చుము! సూకరము నీకొఱకుఁ జీల్చఁబడుఁగాక! ఇంద్రస్తోతలకడకేల
పోయెదవు? మ మ్మేల బాధించెదవు? సుఖముగా నిద్రపొమ్ము! ॥ 460

(5) గద్యము॥

నీ తలిదండ్రులు నిద్రపోయిరి. కుక్కురము, గృహస్వామి, బంధుగణము, నిద్రించిరి.
చతుర్ దిగ్వర్తులగు జనులు నిద్రించిరి ॥ 461

(6) గద్యము॥

ఏ వ్యక్తి యీ స్థానమం దున్నదో! యేది చరించుచున్నదో! యేది మమ్ములఁ జూచుచున్నదో!
దాని చక్షుస్సులను నశింపఁ జేసెదను. ఈ హర్మ్యమెట్టులో! యవికూడ
నట్టులే యగును 462

(7) గద్యము॥

సహస్ర శృంగములుగల వృషభము సముద్రమునుండియు ద్గత మైనది. అది యభిభవకారుల
సహాయమున మా జనులను నిద్రితులుగాఁ జేయును ॥ 463

(8) గద్యము॥

ఏ స్త్రీగణము ప్రాంగణమందు శయనించునో! యేది వాహనమందు నిద్రించునో! యేది
తల్పమందుఁ బండుకొనునో! యేది పుణ్యగంధము గలదో! దాని నంతయు
నిద్రితముగాఁ జేసెదను ॥ 464

(9) †గీ॥ సూర్యు పగిదిని నధికరణ్యార్య మైన
స్వప్నములవలె యజ్ఞములు సాగుఁగాక!
లోక విస్మృతమైనట్టి వీక నొప్పు
సర్వశక్తులు సృష్టిని సాకుఁగాక! ॥ 465

---

† ఈ పద్యము సంస్కృత ఋగ్వేద వ్రాతప్రతులలోఁ బరిశిష్టముగాను, "ఖిల" మంత్రముగాను నున్న
9వ ఋక్కున కనువాదము.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(10)†క॥ అజగరుఁడను సర్పము* మరి
విజయము లేకయె కడంకఁ బ్రీతిని వెల్గన్
ప్రజ లెరిఁగిన దుశ్శక్తిగ
నజ పజ లేకుండ నేల నమరుత! మైత్రిన్ ॥ 466

(11)†క॥ ఋషులే వాహకు లనఁగ "న
హుషుఁ" డొకఁ డజగర మైనటు ఋషి శాపమునన్
విషరహితుఁడై మహామా
నుష సింధుగతము మహితము నూతన మగుతన్! ॥ 467

(12)†క॥ నవనాగులలో బలయుత
మవితథ సాహస్రిక బల మంతయు యమునన్
అవనిని గాళింది మడుఁగు
నవ నాగుల కాళికపద నారాయణిగన్ ॥ 468

† ఈ పద్యములు సంస్కృత ఋగ్వేద వ్రాతప్రతులలోఁ బరిశిష్టముగాను, "ఖిల" మంత్రములుగాను నున్న యా యా సంఖ్యలు గల ఋక్కుల కనువాదములు.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

* కశ్యపునకుఁ గద్రువయందుఁ గల్గిన నాగములు సహస్రములు కలవు. వానిలో ననంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు, ననునవి అష్టనాగములుగఁ బ్రసిద్ధి. వీనికి ఐరావతమును గలపినచో నవనాగు లగును. సహస్రనాగములలో శేష, వాసుకి, తక్షక, ఐరావత, మహాపద్మ, కంబళ, అశ్వతర, శంఖ, కర్కోటక, ధనంజయ, మహానీల, ఐలాపత్ర, మహాకర్ణ, ధృతరాష్ట్ర, బలాహక, కుహర, పుష్పదంష్ట్ర, దుర్ముఖ, సుముఖ, శంఖపాల, కపిల, నహుష, మణి, శంఖరోమాదులు ప్రసిద్ధములు. నాగవంశీకులలో గోటిశ, మానస, పూర్ణశల, పాల, హలీమక, పిచ్ఛిల, కౌణప, చక్ర, కాలవేగ, ప్రకాలన, హిరణ్యబాహు, శరణ, కక్షక, కాలదంతకాదు లయిన వాసుకి కులసంభవులును, బుచ్ఛాండక, మండలక, పిండసేక్తృ, రభేణ, కోచ్ఛిఖ, శరభ, భంగ. బిల్వతేజో విరోహణ, శిలి, శలకర, మూక, సుకుమార, ప్రవేపన, ముద్గర, శిశురోమ, సురోమ, మహాహన్వాదు లయిన తక్షక కులసంభవులును, బారావత, పారిజాత, పాండర, హరిణ, కృశ, విహంగ, శరభ, మోద, ప్రమోద, సంహతాపనాదు లయిన యైరావత కుల సంభవులును, నేరక, కుండల, వేణి, వేణీస్కంధ, కుమారక, బాహుక, శృంగబేర, ధూర్తక, ప్రాతరాతకాదు లయిన కౌరవ్యకులసంభవులును, శంకుకర్ణ, పిఠరక, కుఠార, సుఖసేచక, పూర్ణాంగద, పూర్ణముఖ, ప్రహాస, శకుని, దర్యమాహత, కామఠక, సుషేణ, మాన, సావ్యయ, భైలపముండ, వేదాంగ, పిశంగ, చోద్రపారక, వృషభ, వేగవత్పిండారక, మహాహనురక్తాంగ, సర్వసారంగ, సమృద్ధ, పఠ, వాసక, వరాహక, వీరణక, సుచిత్ర, చిత్ర, వేగిక. పరాశర, తరుణక, మణిస్కంధారుణ్యాదు లయిన ధృతరాష్ట్ర కుల సంభవములు నిత్యాదిగాఁ బెక్కులు కలవు.

(13) †క॥ కాళీదూతగ జననపు
వేళగల పుడమిని వీడి విష విరహితమై
కాలపుఁ గాళిగఁ దాఁ గం
కాలము నిలుచుతఁ బ్రవిమల కాల సహితమై ॥ 469

(14) †గీ॥ యజ్ఞసాహస్ర కృతమౌచు, దక్ జ్ఞుఁ డెలమి
నింద్రపదవి నధివసించి యెనయ గర్వ
మల్ల సప్తర్షిగణము పల్యంకికను ద్వా
రితగతి నడవ శప్తుఁడై పతితుఁడాయె ॥ 470

(15) †గీ॥ యజ్ఞసాహస్రకృత మౌచుఁ దక్ జ్ఞుఁ డెలమిఁ
గీర్తివంతము స్వారాజ్యమూర్తి యయ్యెఁ
నరుల నాగాశ్వపతియౌచుఁ బరమదీర్ఘ
మాయుపు నిక సుమాంగల్య మలపునట్లు ॥ 471

(16) †గీ॥ విషపు దృష్టులు కలుగుచు వేద్యమైన
యల్ల కర్కోటకమను నాగాధిపతికి
మా నమస్సులు హృద్యమై మసలుఁగాక!
సర్వసర్వస్వశక్తులు శరణ మగుత! ॥ 472

(17) క†॥ సూర్యోదయాస్తమయములఁ
బర్యాప్తిని నర్ఘ్యము ఫణి ఫణములఁ బట్టున్
సూర్య సురశర్మల సంస్తుతి
నార్యతిఁ దన్నుతులను నతు లొనరుతు భక్తిన్ ॥ 473

---

† ఈ పద్యములు సంస్కృత ఋగ్వేద వ్రాతప్రతులలోఁ బరిశిష్టములుగాను, "ఖిల" మంత్రములుగాను నున్న యా యా ఋక్కుల కనువాదములు.

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(18)†గీ॥ యాతుధానుల శ్రేష్ఠము నమల పూచు
నల వనస్పతులను వటముల నలరుచు
రాజభోగ చిహ్నిత మహా రాజ ఫణుల
హృది నమస్కరించెద భక్తి నెంతయేని ॥ 474

(19)†గీ॥ పృథివిని దివిని సకలాంతరిక్షమునను
నితరలోకాలు వెల్గులై యెనయునట్టి
యా మహారాజఫణులకు నమృత హృదిని
వందనమ్ముల నొనరింతుఁ బ్రాంజలు లిడి ॥ 475

(20)†క॥ ఉగ్రాయుధులును బ్రబలులు
నుగ్రంపశ్యాత్మపరులు నొగి మాయావుల్
వ్యగ్రప్రవీర మిచ్చులు
దుగ్రాసురవరులు ప్రమతు లుండిరి జగతిన్ ॥ 476

† మంజరీ ద్విపద॥
దివ్య దేవావళిం దెగడి తంత్రించి,
యపకృత్యములు మీర నవమానపరచు
నఘము రూపముదాల్చు నా యసురాళి,
మఘవ! నీ వజ్రాన భ్రమించెంచుమోయి! ॥ 477

---

† ఈ పద్యములు సంస్కృత ఋగ్వేద వ్రాతప్రతులలోఁ బరిశిష్టములుగాను, "ఖిల" మంత్రములుగాను నున్న యా యా ఋక్కుల కనువాదములు.

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## అనువాకః—4, సూక్తమ్—56

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మరుతః
ఛందః—త్రిష్టుప్, 1-11-ద్విపదా విరాట్

(1) క ఈం వ్యక్తా నరః సనీళా రుద్రస్య
మర్యా[1] అధా స్వశ్వాః ॥ 471

(2) నకిర్హ్యేషాం జనూంషి వేద తే[2] అంగ
విద్రే మిథో [3]జనిత్రమ్ ॥ 472

(3) అభి స్వపూభిర్మిథో[4] వపన్త
వాతస్వనసః శ్యేనా అస్పృధ్రన్ ॥ 473

(4) ఏతాని ధీరో నిణ్యా చికేత
పృశ్నిర్యదూధో మహీ జభార ॥ 474

---

1. మర్యాఽఅధా స్వశ్వాః, 2. వేద తేఽఅంగ, 3. జనిత్రః, 4. పూభిర్మిథో. (వ్రా.ప్ర.)

(5) సా [1]విట్ సువీరా మరుద్భిరస్తు సనాత్

సహన్తీ పుష్యన్తీ నృమ్ణమ్ ॥ 475

(6) యామం యేష్ఠాః శుభా శోభిష్ఠాః

శ్రియా సంమిశ్లా[2] ఓజోభిరుగ్రాః ॥ 476

(7) ఉగ్రం వ ఓజః స్థిరా శవాంస్యధా

మరుద్భిర్గణస్తువిష్మాన్[3] ॥ 477

(8) శుభ్రో వః శుష్మః క్రుధ్మీ మనాంసి

ధునిర్మునిరివ శర్ధస్య ధృష్ణోః ॥ 478

(9) సనేమ్యస్మద్ యుయోత దిద్యుం

మా వో దుర్మతిరిహ ప్రణంనః ॥ 479

---

1. సవిట్సువీరా, 2. మిశ్లా ఓజో, 3. మరుద్భిర్గణాస్తు. (వా౧.ప౧.)

(10) ప్రియా వో నామ హువే తురాణామా యత్

తృపన్మరుతో వావశానాః ॥ 480

(11) స్వాయుధాస[1] ఇష్మిణః సునిష్కా ఉత

స్వయం తన్వః[2] శుమ్భమానాః ॥ 481

(12) శుచీ[3] వో హవ్యా మరుతః శుచీనాం శుచిం[4] హినోమ్యధ్వరం శుచిభ్యః ।

ఋతేన సత్యమృతసాప[5] ఆయంఛుచిజన్మానః శుచయః పావకాః ॥ 482

(13) అంసేష్వా మరుతః ఖాదయో వో వక్షఃసు రుక్మా[6] ఉపశిశ్రియాణాః ।

వి విద్యుతో న వృష్టిభీ రుచానా[7] అను స్వధామాయుధైర్యచ్ఛమానాః ॥ 483

(14) ప్ర బుధ్న్యా వ[8] ఈరతే మహాంసి ప్ర నామాని ప్రయజ్యవస్తిరధ్వమ్ ।

సహస్రియం దమ్యం భాగమేతం గృహమేధీయం మరుతో జుషధ్వమ్ ॥ 484

---

1. స్వాయుధాసఽఇష్మిణఃసునిష్కాఽఉత, 2. తన్వఃశుమ్భమానాః, 3. యుచికో, 4. శుచిం నో,
5. సాపఽఆయం, 6. రుక్మాఽఉప, 7. రుచానాఽఅను, 8. వఽఈరతే. (వ్రా.ప్ర.)

(15) యది స్తుతస్య మరుతో అధీథేత్థా విప్రస్య వాజినో హవీమన్ ।
మక్షూ రాయః సువీర్యస్య దాత నూ చిద్ యమన్య ఆదభదరావా ॥ 485

(16) అత్యాసో న యే మరుతః స్వంచో యక్షదృశో న శుభయన్త మర్యాః ।
తే హర్మ్యేష్ఠాః శిశవో న శుభ్రా వత్సాసో న ప్రక్రీళినః పయోధాః ॥ 486

(17) దశస్యన్తో నో మరుతో మృళన్తు వరివస్యన్తో రోదసీ సుమేకే ।
ఆరే గోహా నృహా వధో వో[1] అస్తు సుమ్నేభిరస్మే వసవో నమధ్వమ్ ॥ 487

(18) ఆ వో హోతా జోహవీతి సత్తః సత్రాచీం రాతిం మరుతో గృణానః ।
య[2] ఈవతో వృషణో[3] అస్తి గోపాః సో[4]అద్వయావీ హవతే వ[5] ఉక్థైః ॥ 488

(19) ఇమే తురం మరుతో రామయన్తీమే సహః సహస[6] ఆ నమన్తి ।
ఇమే శంసం వనుష్యతో ని పాన్తి గురు ద్వేషో[7] అరరుషే దధన్తి ॥ 489

---

1. వోఽఅస్తు, 2. యఽఈవతో, 3. వృషణోఽఅస్తి, 4. సోఽఅద్వ, 5. వఽఉక్థై,
6. సహసఽఆ నమన్తి, 7. ద్వేషోఽఅరరుషే. [వ్రి.ప్రి.]

(20) ఇమే రధ్రం చిన్మరుతో జునన్తి భృమిం చిద్ యథా వసవో జుషన్త ।
అప బాధధ్వం వృషణస్తమాంసి ధత్త విశ్వం తనయం తోకమస్మే ॥ 490

(21) మా వో దాత్రాన్మరుతో నిరరామ మా పశ్చాద్ దఘ్మ రథ్యో విభాగే ।
ఆ నః స్పార్హే భజతనా వసవ్యే యదీం సుజాతం వృషణో వో[1] అస్తి ॥ 491

(22) సం యద్ధనన్త మన్యుభిర్జనాసః శూరా యహ్వీష్వోషధీషు విక్షు ।
అధ స్మా నో మరుతో రుద్రియాసస్త్రాతారో[2] భూత పృతనాస్వర్యః । 492

(23) భూరి చక్ర మరుతః పిత్ర్యాణ్యుక్థాని యా వః శస్యన్తే పురా చిత్ ।
మరుద్భిరుగ్రః పృతనాసు సాళ్హా[3] మరుద్భిరిత్ సనితా వాజమర్వా ॥ 493

(24) అస్మే వీరో మరుతః శుష్మ్యస్తు జనానాం యో అసురో విధర్తా ।
అపో యేన సుక్షితయే తరేమాऽధ స్వమోకో[4] అభి వః స్యామ ॥ 494

---

1. వృషణో వోఽఅస్తి, 2. త్రాతారో భూత, 3. సాళ్హా, 4. స్వమోకోఽఅభి వః. [వ్రా.ప్ర.]

(25) తన్న[1] ఇన్ద్రో వరుణో మిత్రో[2] అగ్నిరాప ఓషధీర్వనినో జుషన్త ।
శర్మన్ త్స్యామ మరుతాముపస్థే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 495

## అనువాకము—4, సూక్తము—56

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—మరుత్తులు

(1) గద్యము।

వ్యక్తరూప నేతలు సమానస్థానవాసులు, మనుష్యహితకరులు, సుందరాశ్వవిశిష్టులు నగు
నీ రుద్రపుత్రు లిచ్చట నెవ్వరో! ॥ 478

(2) గద్యము॥

అన్యు లెవ్వరును వారి జన్మప్రకారము నెరుంగరు. తమ జన్మక్రమమును వారిలో
వా రెరుంగుదురు ॥ 479

(3) గద్యము॥

తాము సంచరించుచుఁ బరస్పరము కలిసికొనెదరు. వాయువువలె వేగగామి యగు
శ్యేనపక్షులవలెఁ బరస్పరము స్పర్థ నొందెదరు ॥ 480

(4) గద్యము॥

ధీమంత మగు వ్యక్తి శ్వేతవర్ణముగల భూతములను దెలియును. మహతి యగు పృశ్ని
వీని నంతరిక్షమందు ధరించును ॥ 481

1. తన్న ఇన్ద్రో, 2. మిత్రో అగ్నిరాప ఓషధీ. (పా.ప.)

(5) గద్యము॥

ఈ ప్రజలు మరుద్గణముయొక్క యనుగ్రహమువలనఁ జిరకాలము శత్రువులను దిరస్కరించు వారలును ధనము నిచ్చువారలును వీరపుత్ర విశిష్టులును నయ్యెదరు ॥ 482

(6) గద్యము॥

మరుద్గణము సర్వాపేక్షచే నధికపరిమాణముగల గంతవ్యస్థానమునకుఁ బోవును. అలంకారములచే నందరికంటె నెక్కుడుగా శోభించును. అది శ్రీసమన్వితము నుగ్రమునై యుండును ॥ 483

(7) గద్యము॥

మీ తేజ స్సుగ్ర మైనది. మీ బలము స్థిరము. మరుద్గణము బుద్ధిమంత మగును ॥ 484

(8) గద్యము॥

మీ బల మంతటను వెలుఁగును. మీ చిత్తము క్రోధశీలము ఘర్షణయోగ్యము బలయుక్త మునగు మరుద్గణముయొక్క వేగవంతము. స్తోతవలె వివిధశబ్దకారి ॥ 485

(9) గద్యము॥

ఓ మరుద్గణమా! పురాణాయుధములు మా కడకు రాకుండఁ జేయుము! మీ క్రూర బుద్ధిని మాపైఁ బ్రసరింపఁజేయకుము! ॥ 486

(10) గద్యము॥

మీరు వేగవంతులు. మీ ప్రియనామముల మిమ్ముఁ బిలిచెదను. అభిలాషవంతు లగు మరుత్తులిందువలనఁ దృప్తిఁ బొందెదరు ॥ 487

(11) గద్యము॥

మరుద్గణము సుందరాయుధ విశిష్టము, గమనశీలము, సుందరాలంకారయుక్తము.
అది మా శరీరము నలంకరించును ॥ 488

(12) గద్యము॥

ఓ మరుద్గణమా! మీరు శుచి గలవారు. శుచిహవ్యము మీకే యగును. శుచిప్రకాశమానులైన
మిమ్ముల నుద్దేశించి శుచియజ్ఞమును బ్రేరేపించెదను. ఉదకస్పర్శి యగు మరుద్గణమా!
సత్యముచే సత్యమును బొందుచున్నారు. మీరు శుచి గలవారు. మీ జన్మము
శుచి యైనది. మీ రన్యుల శుచివంతులుగాఁ జేయుదురు ॥ 489

(13) గద్యము॥

ఓ మరుద్గణమా! మీ స్కంధములందు ఖాద్యములు గలవు. ఉత్తమ రుక్మము మీ వక్షస్థలము
నాక్రమించుకొనియున్నది. వృష్టిసహిత మగు విద్యుత్తులు శోభించునో! యటులనే
జలప్రదాన సమయమున స్వీయాయుధములద్వారా పరిశోభించును ॥ 490

(14) గద్యము॥

అంతరిక్షోద్భవ మగు మీ తేజస్సు విశేషముగాఁ బరుగిడును. విశేషముగా యష్టవ్య మగు
మరద్గణమా! మీరు జలమును వృద్ధిని బొందింపుఁడు! మరుద్గణమా! మీరు
సహస్ర సంఖ్యావిశిష్టము లగు గృహములయందుఁ బుట్టిన గృహమేధు
లిచ్చిన భాగములను సేవింపుఁడు! ॥ 491

(15) గద్యము॥

ఓ మరుద్గణమా! మీ రన్నవిశిష్టు లగు మేధావుల హవ్యయుక్తస్తోత్రములను దెలిసికొని
యుండిరి. అందువలన శోభనపుత్ర విశిష్ట మగు ధనమును శీఘ్రముగ నిమ్ము!
ఆ ధనమును శత్రువులు కొట్టలేరు ॥ 492

(16) గద్యము॥

సతతగాములగు నశ్వములవలె సుందరగమన విశిష్టులు, నుత్సవదర్శులునగు మనుష్యులవలె నలంకారధారులు, గృహస్థితశిశువులవలెఁ బరిశుభ్రులు నగు మరుత్తులు క్రీడాపరాయణు లగు వత్సలువలెఁ బయోదాత లగుదురు ॥ 493

(17) గద్యము॥

మరుద్గణము మాకు ధనము నొసఁగుచు సుందరరూపవంతములగు ద్యావాభూములను బూర్ణములుగా నొనర్చుచు సుఖవంతముగా నొనర్చుఁగాక! ఓ వాసప్రదగణమా! మేఘభేదకు లగు మనుష్యులను మీ యాయుధములు మా చెంతనుండి తొలఁగు నట్లు చేయుఁగాక! మీరు సుఖముతో మా కభిముఖు లగుఁడు! ॥ 494

(18) గద్యము॥

నిషణ్ణహోత, సర్వత్రగామియు నగు మా ధనకామ్యమును బ్రశంసించుచు మిమ్ములను మాటిమాటికిఁ బిలుచుచు సుఖవంతముగాఁ జేయుఁగాక! ఓ కామవర్షగణమా! యజమానరక్షక మగు హోత కపటత లేని స్తోత్రములచే మిమ్ము స్తుతించును ॥ 495

(19) గద్యము॥

ఈ మరుద్గణము యజ్ఞమందుఁ ద్వరాన్వితయజమానుని ప్రీతునిగా నొనర్చును. వీరు బలమున బలవంత మగు లోకము నా నిమిత్తముగా నొనర్తురు. వీరు స్తోతలను హింసకగణముల హస్తములనుండి సంరక్షించుదురు. హవ్యము నీయనివారికి నప్రియ సాధన మొనర్తురు ॥ 496

(20) గద్యము॥

వీరు సమృద్ధలోకము నుత్తేజితముగా నొనర్తురు. దరిద్రు నుత్తేజితునిగా నొనర్తురు. బంధువు లెట్టులు కోరెదరో! యట్టులు యో కామవర్షిగణమా! తమోవినాశనము నొనర్చుఁడు! మాకు బహుళపుత్రులను, బౌత్రులను నొసంగుఁడు! ॥ 497

(21) గద్యము॥

ఓ మరుద్గణమా! మీ దానమునుండి మేము తప్పిపోకూడదు. ధనదానకాలమందు మాకు మీ వెనుకభాగమును జూపకుఁడు! స్పృహణీయ మగు ధనమున మాకు గోవులను గలుఁగఁ జేయుము! ఓ కామవర్షులారా! మీకు సుజాతధన మేది కలదో! దానివలన గోవులను గలుఁగఁజేయుఁడు! ॥ 498

(22) గద్యము॥

విక్రాంతజను లే కారణమున బహుతరౌషధుల నిమిత్తము మనుష్యుల నిమిత్తము కోపపూర్ణు లయ్యెదరో! యా కారణమున రుద్రపుత్రులగు మరుద్గణమా! యుద్ధముల శత్రువులనుండి సంరక్షింపుఁడు! ॥ 499

(23) గద్యము॥

ఓ మరుద్గణమా! మీరు మా పూర్వపూరుషులకు ననేకకార్యము లాచరించితిరి! మీ పూర్వకాలీన కార్యము లన్నియుఁ బ్రశంసింపఁబడినవి. ఓజస్వి యగు వ్యక్తులు యుద్ధమున మరుద్గణ సాహాయ్యముచే శత్రువులను దిరస్కరించిరి. మీ సాహాయ్యమున స్తోత్రకారు లన్నమును బొందెదరు ॥ 500

(24) గద్యము॥

ఓ మరుద్గణమా! మా విషయమై వీరులును, బలవంతులును గండు! ఆ మరుద్గణ. మాసురమును లోకవిధాయకము నగును. నివాసమునిముత్తము శత్రువుల సంహరించెదను. నేను మీస్థానమందు నివసించెదను ॥ 501

(25) గద్యము॥

ఇంద్రుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు, నప్పు, నోషధులు, వృక్షములు, మా స్తోత్రములను సేవించునుగాక! మరుద్గణముల క్రోడములందు మేము సుఖముగ నుండెదము. మీరు మమ్ము సర్వదా స్వసి ద్వారా పాలింపుఁడు! ॥ 502

## సూక్తమ్—57

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మరుతః
ఛందః—త్రిష్టుప్

(1) మధ్వో వో నామ మారుతం యజత్రాః ప్ర యజ్ఞేషు శవసా మదన్తి ।
యే రేజయన్తి రోదసీ చిదుర్వీ పిన్వన్త్యుత్సం యదయాసురుగ్రాః ॥ 496

(2) నిచేతారో హి మరుతో గృణన్తం ప్రణేతారో యజమానస్య మన్మ ।
అస్మాకమద్య విదథేషు బర్హిరా వీతయే సదత పిప్రియాణాః ॥ 497

(3) నైతావదన్యే మరుతో యథేమే భ్రాజన్తే రుక్మైరాయుధైస్తనూభిః ।
ఆ రోదసీ విశ్వపిశః పిశానాః సమానమఞ్జ్యఞ్జతే శుభే కమ్ ॥ 498

(4) ఋధక్ సా వో మరుతో దిద్యుదస్తు యద్ వ[1] ఆగః పురుషతా కరామ ।
మా వస్తస్యామపి భూమా యజత్రా[2] అస్మే వో అస్తు సుమతిశ్చనిష్ఠా ॥ 499

---

1. యద్వఽఆగః. 2. యజత్రాఽఅస్మే. (వ్రా.ప్ర.)

(5) కృతే చిదత్ర మరుతో [1]రణన్తాఽనవద్యాసః శుచయః పావకాః ।
ప్ర ణోఽవత[2] సుమతిభిర్యజత్రాః ప్ర వాజేభిస్తిరత పుష్యసే నః ॥ 500

(6) ఉత స్తుతాసో మరుతో వ్యన్తు విశ్వేభిర్నామభిర్నరో హవీంషి ।
దదాత నో[3] అమృతస్య ప్రజాయై జిగృత రాయః సూనృతా మఘాని ॥ 501

(7) ఆ స్తుతాసో మరుతో విశ్వ[4] ఊతీ అచ్ఛా సూరీన్ త్సర్వతాతా జిగాత ।
యే నస్త్మనా శతినో వర్ధయన్తి యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 502

## సూక్తము—57

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—మరుద్గణము

(1) గద్యము॥

ఓ యజనీయమరుద్గణమా! మాదయిత యగు స్తోత్రగణము యజ్ఞకాలమున బలముతో మీ నామములతో స్తుతించును. మరుద్గణము విస్తీర్ణద్యావాభూములను గంపింపఁ జేయును. మేఘమును వర్షింపఁజేయును. ఉగ్రమై యంతటను సంచరించును ।. 503

---

1. రణన్తా సవద్యాసః. 2. ప్రణోఽవత. 3. నోఽఅమృత. 4. విశ్వఽఊతీఽఅచ్ఛా. (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

మరుద్గణము స్తుతికారులను నన్వేషించును. యజమానుల యభీష్టములను దీర్చును. మీరు ప్రీతులై మా యజ్ఞమందు సోమపానార్థమై యమర్పఁబడిన దర్భలపై వసింపుఁడు! ॥ 504

(3) గద్యము॥

ఈ మరుద్గణ మెంత దానముఁ జేయుదురో! యంత దానమును మఱె యెవ్వరును జేయలేరు. వీరి రుక్మాయుధములు శరీరశోభను గలుఁగఁజేయును. ద్యావాభూములు, ప్రకాశకారులు, వ్యాప్తశీలులు నగు మరుత్తుల యాభరణములను శోభించుటకు వ్యక్తములుగా నొనర్చును ॥ 505

(4) గద్యము॥

మీ ప్రసిద్ధాయుధములు మానుంచి వే రగును. మనుష్యుల మని మీయెడల నపరాధము నొనర్చినయెడల నో యజనీయగణమా! మీ యాయుధములు మాపైని బడఁగూడదు. అన్నిటికంటె నన్నప్రద మగు మీ బుద్ధి మాపైఁ బ్రవర్తించును ॥ 506

(5) గద్యము॥

మా యజ్ఞకర్మవలన మరుద్గణము తృప్తి నొందుఁగాక! వారే యనిందిత ప్రీతియుక్తులు, శోధకులు. ఓ యజనీయమరుద్గణమా! యనుగ్రహించి యుత్తమప్రీతియుక్తుల మగు మమ్ము విశేషముగఁ బరిపాలింపుము! అన్నముచే మమ్ముఁ బోషింపుము! ॥ 507

(6) గద్యము॥

మరుద్గణము స్తుతమై హవిస్సును స్వీకరించునుగాక! వారు నేతలు, సర్వజల సహితులై యుండువారలు. ఓ మరుద్గణమా! మా సంతతికై యుదకము, నొసంగుము! హవ్యదాయులకు సత్యమును బ్రియ మగు ధనమును నొసంగుము ॥ 508

(7) గద్యము॥

మరుద్గణము సంస్తుతమై సకలరక్షాసహిత యజ్ఞమున స్తోతల కభిముఖముగ వచ్చును. వీరు
తమ భక్తులను శతసంఖ్యా విశిష్టులుగా నొనర్చి వృద్ధిఁ బొందించెదరు.
సర్వదా మమ్ములను స్తుతులవలనఁ బరిపాలింతురు ॥ 509

## సూక్తమ్—58

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా— మరుతః
ఛందః—త్రిష్టుప్

(1) ప్రసాకముక్షే[1] అర్చతా గణాయ యో దైవ్యస్య ధామ్నస్తువిష్మాన్ ।
ఉత క్షోదన్తి రోదసీ మహిత్వా నక్షన్తే నాకం నిరృతేరవంశాత్[2] ॥ 503

(2) జనూశ్చిద్ వో మరుతస్త్వేష్యేణ భీమాసస్తువిమన్యవోఽయాసః ।
ప్ర యే మహోభిరోజసోత సన్తి విశ్వో వో యామన్ భయతే స్వర్దృక్ ॥ 504

(3) [3]బృహద్ వయో మఘవద్భ్యో దధాత [4]జుజోషన్నిన్మరుతః సుష్టుతిం నః ।
గతో నాధ్వా వి తిరాతి జన్తుం ప్ర ణః స్పార్హాభిరూతిభిస్తిరేత ॥ 505

---

1. ముక్షేఽఅర్చ. 2. నవంశాత్. 3. వ్యూహద్వయో 4. జుజోషిన్నిన్మరుతః. (ప్రా.ప్ర.)

(4) యుష్మోతో విప్రో మరుతః శతస్వీ యుష్మోతో[1] అర్వా సహురిః సహస్రీ ।

యుష్మోతః సమ్రాళుత హన్తి వృత్రం ప్ర తద్ వో[2] అస్తు ధూతయో [3]దేష్ణమ్ ॥ 506

(5) తాగ్ం[4] ఆ రుద్రస్య మీళ్హుషో వివాసే కువిన్నంసన్తే మరుతః పునర్నః ।

యత్ సస్వర్తా జిహీళిరే యదావిరవ తదేన[5] ఈమహే తురాణామ్ ॥ 507

(6) ప్ర సా వాచి సుష్టుతిర్మఘోనామిదం సూక్తం మరుతో జుషన్త ।

ఆరాచ్చిద్ ద్వేషో వృషణో యుయోత యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 508

## సూక్తము—58

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—మరుత్తులు

(1) గద్యము॥

మీరు సతతవర్షణకారులగు మరుత్సంఘము నర్చింపుఁడు! వీరలు దేవతాస్థానములయందు నందఱికంటెఁ బ్రవృద్ధులు. వీరు మహిమవలన ద్యావాభూములను భగ్నములు కావింతురు. భూమ్యంతరిక్షములనుండి స్వర్గమును వ్యాప్తిగలదానినిగాఁ జేయుదురు ॥ 510

1. యుష్మోతోఽఅర్వా, 2. తద్వోఽఅస్తు, 3. దేష్ణామ్, 4. తాగ్ంఽఆ రుద్రస్య మీఢ్హుషో, 5. తదేనఽఈమహే. (వ్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ భీమమా! ప్రవృద్ధమతీ! గమనశీల మగు మరుద్గణమా! మీ జన్మము దీప్తసముద్రములవలన నయినది. మీరు తేజోబలంబులవలనఁ బ్రబలు లగుచున్నారు. మీ గమనంబువలన సూర్యద్రష్ట యగు సర్వజీవగణము భీత మగును ॥ 511

(3) గద్యము॥

మీరు హవ్యవిశిష్టుల కన్నదానము నీయుఁడు! మా సుందరస్తోత్రములను సేవింపుఁడు! మరుద్గణ మే పథమునఁ బ్రాప్తమయినను నది ప్రాణులను నశింపఁజేయదు. అది స్పృహణీయరక్షద్వారా మమ్ము వృద్ధిఁ బొందించుఁగాక! ॥ 512

(4) గద్యము॥

ఓ మరుద్గణమా! స్తోతలు మీచే రక్షితులై శతసంఖ్యాక ధనవంతు లగుదురు. మీచే రక్షితులై స్తోతలు, నాక్రమణకారులు నభిభవితలు నగు సహస్రధనవంతు లగుదురు. మీ పరిరక్షవలన వారు సమ్రాజయుక్తు లయ్యెదరు. ఓ కంపనకారిగణమా! మీ రాసంగు ధన మధిక మగును ॥ 513

(5) గద్యము॥

కామవర్షులగు రుద్రపుత్రగణమునకు నేఁ బరిచర్యఁ జేసెదను. వారు బహువారము మరల ననేక పర్యాయములు మా కభిముఖు లయ్యెదరు. ప్రకాశితాప్రకాశిత మగు నే పాప ప్రయుక్తులవలన మరుద్గణము క్రుద్ధు లయ్యెదరో! మరుద్గణ సంబంధ మగు నా పాపమును బోఁగొట్టుకొనెదను ॥ 514

(6) గద్యము॥

ధనవంతు లగు మరుత్తుల సుస్తుతి మే ముచ్చరించెదము. మరుత్తులారా! సూక్తమును సేవింతురుగాక! ఓ యభీష్టవర్షిగణమా! మీరు దూరమునుండి శత్రువులను బారఁద్రోలుఁడు! మీరు సర్వదా స్తుతులవలన మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 515

## సూక్తమ్—59

ఋషిః— మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1-11-మరుతః, 12-రుద్రః (మృత్యువిమోచనీ ఋక్)
ఛందః—1-6-విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః),
7-8 త్రిష్టుప్; 9-11 గాయత్రీ; 12-అనుష్టుప్

(1) యం త్రాయధ్వ[1] ఇదమిదం దేవాసో యం చ నయథ ।
తస్మా[2] అగ్నే వరుణ మిత్రార్యమన్ మరుతః శర్మ యచ్ఛత ॥ 509

(2) యుష్మాకం దేవా[3] అవసాహని ప్రియ ఈజానస్తరతి ద్విషః ।
ప్ర స క్షయం తిరతే వి మహీరిషో యో వో వరాయ దాశతి ॥ 510

(3) నహి వశ్చరమం చన వసిష్ఠః పరిమంసతే ।
అస్మాకమద్య[4] మరుతః సుతే సచా విశ్వే పిబత కామినః ॥ 511

(4) నహి వ[5] ఊతిః పృతనాసు మర్ధతి యస్మా[6] అరాధ్వం నరః ।
అభి వ[7] ఆవర్త్ సుమతిర్నవీయసీ తూయం యాత పిపీషవః ॥ 512

---

1. యధ్వఽఇద, 2. తస్మాఽఅగ్నే, 3. దేవాఽఅవవాహని ప్రియఽఈజాన, 4. అస్మాకమద్యా
5. నహి వఽఊతిః, 6. యస్మాఽఅరాధ్వం, 7. అభి వఽఆవర్త్. (వ్రా.ప్ర.)

(5) ఓ[1] షు ఘృష్విరాధసో యాతనాన్ధాంసి పీతయే ।
ఇమా వో హవ్యా మరుతో రరే హి[2] కం మో ష్వన్యత్ర గన్తన ॥ 513

(6) ఆ చ నో బర్హిః సదతావితా చ నః స్పార్హాణి దాతవే వసు ।
అస్రేధన్తో మరుతః సోమ్యే మధౌ స్వాహేహ మాదయాధ్వై ॥ 514

(7) సస్వశ్చిద్ధి తన్వః శుమ్భమానా[3] ఆ హంసాసో నీలపృష్ఠా[4] అపప్తన్ ।
విశ్వం శర్ధో[5] అభితో మా ని షేద నరో న రణ్వాః సవనే మదన్తః ॥ 515

(8) యో నో మరుతో[6] అభి దుర్హృణాయుస్తిరశ్చిత్తాని వసవో జిఘాంసతి[7] ।
ద్రుహః పాశాన్ ప్రతి స ముచీష్ట తపిష్ఠేన హన్మనా[8] హన్తనా తమ్ ॥ 516

(9) సాంతపనా[9] ఇదం హవిర్మరుతస్తజ్జుజుష్టన ।
యుష్మాకోతీ రిశాదసః ॥ 517

---

1. ఓషు, 2. రరేహివం, 3. శుమ్భమానాఽఆ, 4. పృష్ఠాఽఅపప్తన్, 5. శర్ధోఽఅభితో,
6. మరుతోఽఅభి, 7. జిఘాంసతి, 8. హన్మనాంహన్త, 9. పనాఽఇదం. [వ్రా.ప్ర.]

(10) గృహమేధాస[1] ఆ గత మరుతో మాప భూతన ।

యుష్మాకోతీ సుదానవః ॥ 518

(11) ఇహేహ వః స్వతవసః కవయః సూర్యత్వచః ।

యజ్ఞం మరుత[2] ఆ వృణే ॥ 519

(12) త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।

ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥ 520

ఇతి
పంచమోఽష్టకే చతుర్థోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—59

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—1-11 మరుత్తులు, 12-రుద్రుఁడు

(1) గద్యము॥

ఓ దేవగణమా! యీహావలన స్తోతలను రక్షింపుము! ఓ యగ్ని! వరుణుఁడా! మిత్రుఁడా! యర్యముఁడా! మరుద్గణమా! మీ రెవ్వరిని వినీతులఁ గావింతురో! వారిని సుఖవంతులుగ నొనర్చుఁడు! 516

1. మేధాసఽఆ గత 2. మరుతఽఆ వృణే (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ దేవతలారా! మీ యాశ్రయమందు మీకుఁ బ్రియమగు దినమందు నెవ్వరు యాగము నొనర్చెదరో! యెవ్వరు శత్రువుల నాక్రమించెదరో! యెవ్వరు మీ రితరత్ర పోవకుండుటకుఁ బ్రచురహవ్యము నొసంగెదరో! వారు మీ నివాసస్థానమును వృద్ధిఁ బొందింతురు ॥ 517

(3) గద్యము॥

వసిష్ఠుఁడు మీలో హీనవ్యక్తిని బరిత్యజించి స్తవమును జేయఁడు. ఓ మరుద్గణమా! యిపుడు సోమాభిలాషులైన మీరు గలిసి మా సోమ మభిషుతమైనచోఁ ద్రావుఁడు! ॥ 518

(4) గద్యము॥

ఓ నేతృగణమా! యెవరి కభిలషితదాన మిచ్చెదరో! మీ రక్ష వారిని యుద్ధమందు హింసింపదు. మీ నూతనానుగ్రహబుద్ధి మా కభిముఖముగ వచ్చుఁగాక! ఓ సోమపానాభిలాషులారా! మీరు శీఘ్రముగ రండు! ॥ 519

(5) గద్యము॥

ఓ మరుద్గణమా! మీ ధనము పరస్పరము సంహిత మైనది. మీరు సోమపానమున కుత్తమ రూపమున రండు! నేను మీకు హవ్యము నిచ్చుచుండుటచే మీ రన్యత్ర చనకూడదు ॥ 520

(6) గద్యము॥

ఓ మరుత్తులారా! మీరు మా దర్భపై విశ్రమింపుఁడు! స్పృహణీయ ధన మొసంగుటకు మా సమీపమునకు రండు! మీరు హింసారహితులై యీ యజ్ఞమందు మదకర సోమాత్మకహవ్యమును "స్వాహా" యని ప్రమత్తు లగుఁడు! ॥ 521

(7) గద్యము॥

అంతర్హిత మరుద్గణము సకలాలంకృతులై నీలపృష్ఠ మగు హంసగణమువలె వచ్చునుగాక!
మా యజ్ఞమం దానందితులును, రమణీయులును నగు మనుష్యులవలె విశ్వవ్యాప్తమగు
మరుద్గణము మాకు నాల్గుదిక్కుల నుండెదరుగాక! 522

(8) గద్యము॥

ఓ వసు మరుద్గణమా! యన్యాయ క్రోధమును వహించి యే తిరస్కృత వ్యక్తి
మా చిత్త వినాశన మొనర్చునో! యా వ్యక్తిని బాపద్రోహి యగు వరుణునిపాశము
బంధించును. మీరు వారిని నత్యంత తాపప్రదములగు
నాయుధములద్వారా నశింపజేయుడు! ॥ 523

(9) గీ॥ శత్రుతాపకులార! యో సన్మరుత్తు
లార! హవ్యము మీ కిదె! యమరియుండె
మీరు రక్షావశంబున మిగుల దీనిఁ
బ్రీతి సేవింపుడీ! శత్రుజాతిఁ గొట్టి ॥ 524

(10) గద్యము॥

ఓ మరుద్గణమా! మీరు గృహమధ్యమున దానశీలురు. మీరు రక్షాసహితులై రండు!
రాకుండనుండకుడు! ॥ 525

(11) గద్యము॥

ఓ స్వాయత్త బల విశిష్టకారులారా! సూర్యవర్ణ మరుత్తులారా! నేను యజ్ఞ కల్పనను
జేయుచున్నాను ॥ 526

(12) గద్యము॥

సుగంధి, పుష్టివర్ధకము నగు త్ర్యంబక యజ్ఞమును జేసెదను. ఉర్వారుకఫలమువలె నేను మృత్యుబంధనమునుండి ముక్తుఁడ నయ్యెదను ॥† 527

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమునఁ జతుర్థాధ్యాయము
సంపూర్ణము

---

† అమృతః ఇతే యేఞ నాహ ఇ—(మూలముతో సరిపోల్చవలయును.) (నే.వేం.న.శా.)*

* ఈ 59వ సూక్తములోని 12వ ఋగనువాదము ఋగ్వేదము 7వ మండలములో మృత్యువిమోచనీ ఋక్కులుగాఁ బ్రసిద్ధిచెందిన మంత్రాలలో సుప్రసిద్ధమైన ఋక్కగు "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్, ఉర్వారుకమివ బన్ధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్" అనుదాని కనువాదము. కాని తెలుఁగు అనువాదములోని యీ 12వ ఋగనువాదముచివర "అమృతం ఇతే యేన్ నాహ ఇ" (చూడు. తెలుఁగు వ్రాతప్రతి. 7వ సంపుటము. 163 పుట) అనునది మూల మంత్రముగాఁ బేర్కొనఁబడినది. ఇది "అమృతహ" అని "హ" కారయుక్తముగా సైతము వ్రాయుట చూడఁగా నిది పొరపాటున వ్రాసినట్లున్నది. "మూలముతో సరిపోల్చవలయును" అని యిచ్చిన యీ "అమృతః" ఇత్యాది ఋక్కు ఋగ్వేదములోఁగల 10 మండలములలోను నెచ్చటను లేదు. పరిశిష్ట మంత్రములందును "ఖిల" మంత్రములందునుగూడ లేదు.



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## సప్తమం మండలమ్

### పంచమోఽష్టకః—పంచమోఽధ్యాయః

### సూక్తమ్—60

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—1-సూర్యః, 2-12-మిత్రావరుణౌ

ఛందః—త్రిష్టుప్

(1) యదద్య సూర్య బ్రవోఽనాగా[1] ఉద్యన్ మిత్రాయ వరుణాయ సత్యమ్ ।
వయం దేవత్రాదితే స్యామ తవ ప్రియాసో[2] అర్యమన్ గృణన్తః ॥ 521

(2) ఏష స్య మిత్రావరుణా నృచక్షా[3] ఉభే ఉదేతి సూర్యో అభి జ్మన్ ।
విశ్వస్య స్థాతుర్జగతశ్చ గోపా ఋజు మర్తేషు వృజినా చ పశ్యన్ ॥ 522

---

1. నాగాఽఉద్యన్, 2. ప్రియాసోఽఅర్యమన్, 3. నృచక్షాఽఉభేఽఉదేతి సూర్యోఽఅభి. (వ్రా.ప్రి.)

(3) అయుక్త సప్త హరితః సధస్థాద్ యా[1] ఈం వహన్తి సూర్యం ఘృతాచీః ।
ధామాని మిత్రావరుణా యువాకుః సం యో[2] యూథేవ జనిమాని చష్టే ॥ 523

(4) ఉద్ వాం పృక్షాసో మధుమన్తో[3] అస్థురా సూర్యో అరుహచ్ఛుక్రమర్ణః ।
యస్మా[4] ఆదిత్యా అధ్వనో రదన్తి మిత్రో[5] అర్యమా వరుణః సజోషాః ॥ 524

(5) ఇమే చేతారో[6] అనృతస్య భూరేర్మిత్రో అర్యమా వరుణో హి సన్తి ।
ఇమ[7] ఋతస్య వావృధుర్దురోణే శగ్మాసః పుత్రా[8] అదితేరదబ్ధాః ॥ 525

(6) ఇమే మిత్రో వరుణో దూళభాసో ఽచేతసం చిచ్చితయన్తి దక్షైః ।
అపి క్రతుం సుచేతసం వతన్తస్తిరశ్చిదంహః సుపథా నయన్తి ॥ 526

(7) ఇమే దివో[9] అనిమిషా పృథివ్యాశ్చికిత్వాంసో[10] అచేతసం నయన్తి ।
ప్రవ్రాజే చిన్నద్యో గాధమస్తి పారం నో[11] అస్య విష్పితస్య పర్షన్ ॥ 527

---

1. స్థాద్యాఽఈం వహన్తి సూర్యా, 2. సం యో యుథేవ, 3. మన్తోఽఅస్థురా సూర్యోఽఅరు,
4. యస్మాఽఆదిత్యాఽఅధ్వనో, 5. మిత్రోఽఅర్యమా, 6. చేతారోఽఅనృతస్య, 7. ఇమఽఋతస్య,
8. పుత్రాఽఆదితేరదద్వాః, 9. దివోఽఅనిమిషా, 10. కిత్వాంసోఽఅచే, 11. నోఽఅస్య. (వ్రా.ప్ర.)

(8) యద్ గోపావదదితిః శర్మ భద్రం మిత్రో యచ్ఛన్తి వరుణః సుదాసే ।
అస్మిన్నా తోకం తనయం దధానా మా కర్మ దేవహేళనం తురాసః ॥ 528

(9) అవ వేదిం హోత్రాభిర్యజేత రిపః కాశ్చిద్ వరుణధ్రుతః సః ।
పరి ద్వేషోభిరర్యమా వృణక్తూరుం సుదాసే వృషణా[1] ఉ లోకమ్ ॥ 529

(10) [2]సస్వశ్చిద్ధి సమృతిస్త్వేష్యేషామపీచ్యేన సహసా సహన్తే ।
యుష్మద్ భియా వృషణో రేజమానా దక్షస్య చిన్మహినా మృళతా నః ॥ 530

(11) యో బ్రహ్మణే సుమతిమాయజాతే వాజస్య సాతౌ పరమస్య రాయః ।
సీక్షన్త మన్యుం మఘవానో[3] అర్య ఉరు క్షయాయ చక్రిరే సుధాతు ॥ 531

(12) ఇయం దేవ పురోహితిర్యువభ్యాం యజ్ఞేషు మిత్రావరుణావకారి ।
విశ్వాని దుర్గా పిపృతం తిరో నో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 532

---

1. వృషణాఽఉ లోకమ్, 2. సఖశ్చిద్ధి, 3. మఘవానోఽఅర్యఽఉరు క్షయాయ. (వ్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము—పంచమాధ్యాయము

### సూక్తము—60

ఋషి —మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—మిత్రావరుణులు, 1-సూర్యుఁడు

(1) గద్యము॥

ఓ సూర్యుఁడా! నీ వుదయించి మమ్ముల౯ బాపశూన్యు లని యనుము! ఓ యదితి! దేవతాగణ మధ్యమున మిత్రావరుణుల సమీపమున సత్యవంతుఁడ నయ్యేదను. ఓ యర్యముఁడా! నిన్ను స్తుతించి నీకుఁ బ్రియుఁడ నయ్యేదను ॥ 528

(2) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! యా యీ మనుష్యులకు సాక్షిభూతుండగు సూర్యుఁ డంతరిక్షమందు సంచరించుచు ద్యావాభూముల కభిముఖముగ నుదయించుచున్నాఁడు. వాఁడు సమస్త స్థావరజంగమపాలకుఁడు. మనుష్యమధ్యస్థిత మగు సుకృత దుష్కృతములను దర్శింపఁడు ॥ 529

(3) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! వాఁ డంతరిక్షమున సప్తహరిత్తులను గూర్చుచున్నాఁడు. అయ్యవి జలమం దార్ద్రములై యీ సూర్యుని వహించుచున్నవి. గోపాలుఁడు గోయూథమును జూచునట్లు సూర్యుఁడు ప్రాణులను దర్శించును. మీ యభిలాషను దీర్చును ॥ 530

(4) గద్యము॥

మీ యుభయులనిమిత్త మన్నము, మధురపదార్థము లున్నవి. సూర్యుఁడు
దీప్తాంతరిక్షమును నారోహించుచున్నాఁడు. సమాన ప్రీతియుక్తుఁడగు
మిత్రుఁడు నర్యముఁడు వరుణప్రభృత్యాదిత్యగణము సూర్యునికొఱకు
మార్గము నేర్పరచును 531

(5) గద్యము॥

మిత్రార్యమవరుణప్రభృతులు పాపహంతలు. సుఖకరులు. హింసారహితులు. అదితిపుత్రులు.
వీరు యజ్ఞ గృహమందు వర్థితు లగుదురు ॥ 532

(6) గద్యము॥

మిత్రావరుణులు ననభిభవనీయులు, సామర్థ్యముద్వారా చైతన్య శూన్యులకుఁ జైతన్యమును
బుట్టింతురు. వీరు సుతేజస్కులై యనుష్ఠానపరాయణు లగు వ్యక్తుల కభిముఖముగ
వెడలుచుఁ బాపనాశనమును జేయుటకు సుపథమందుఁ బోవుదురు ॥ 533

(7) గద్యము॥

వీరు నిమేషరహితులై స్వర్గభూములయందుఁగల చైతన్యరహితవ్యక్తులను నెరుఁగుచు
సుమార్గమందుఁ బోవుదురు. వీరి ప్రభావమువల్లనే నదీజల మత్యంతనిమ్నప్రదేశ
మందుండును వీరు మమ్ముల నీకర్మయందుఁ గృతార్థులుగా నొనర్చెదరు ॥ 534

(8) గద్యము॥

అదితి, మిత్రావరుణులు ద్యావాభూములకు, రక్షావిశిష్టము, ప్రశంసాయోగ్యము నగు
నే సుఖము నొసఁగెదరో! యా సుఖమును బుత్రపౌత్రాదుల కిచ్చెదరుగాక! మేము
త్వరాప్రయుక్త దేవగణములకుఁ గోపకరకార్యములఁ జేయము ॥ 535

(9) గద్యము॥

మా ద్వేషకారులు, స్తుతిసహిత వేదీత్యాగ మొనర్చినచో వరుణహింసితులై యేదో విధమున నశింతురు. అర్యముఁ డాద్వేషులనుండి మమ్ము విడిపించుఁగాక! కామవర్షు లగు మిత్రావరుణులారా! దాతలకు విస్తీర్ణస్థానము నొసంగుఁడు! ॥ 536

(10) గద్యము॥

వీరి సంహతి నిగూఢ మైనది. దీప్త మైనది. నిగూఢబలముచే మా ద్వేషులను వీరు తిరస్కరింతురు. ఓ కామవర్షులారా! మీ భయమువలన లోకము కంపించును. మీ బలమహిమవలన మమ్ము సుఖవంతులుగా నొనర్పుఁడు! ॥ 537

(11) గద్యము॥

అన్నముకొఱకు నుత్కృష్టధనముకొఱకు మీ స్తోత్రములయం దే వ్యక్తి మతిని స్థిరముగా నొనర్చునో! యా స్తోతలయొక్క స్తోత్రములను మఘవగణము సేవించును. వారు విస్తీర్ణనివాసముకొఱ కుత్తమస్థానమును నుత్తమముగాఁ జేయుదురు ॥ 538

(12) గద్యము॥

దేవతలగు నో మిత్రావరుణులారా! మీ యజ్ఞమునం దీ స్తుతి చేయఁబడును. మిరు సమస్త దుర్గ మాపదలను దూరముగాఁ బోఁద్రోలి మమ్ములఁ గృతార్థులనుగాఁ జేయుఁడు! స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 539

# సూక్తమ్—61

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మిత్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఉద్ వాం చక్షుర్వరుణ సుప్రతీకం దేవయోరేతి [1]సూర్యస్తతన్వాన్ ।
అభి యో విశ్వా భువనాని చష్టే స మన్యుం మర్త్యేష్వా చికేత ॥ 533

(2) ప్ర వాం స మిత్రావరుణావృతావా విప్రో మన్మాని దీర్ఘశ్రుదియర్తి ।
యస్య బ్రహ్మాణి సుక్రతూ[2] అవాథ ఆ యత్ క్రత్వా న శరదః పృణైథే ॥ 534

(3) ప్రోరోర్మిత్రావరుణా పృథివ్యాః ప్ర[3] దివ ఋష్వాద్ బృహతః [4]సుదానూ ।
స్పశో దధాథే[5] ఓషధీషు విక్ష్వృధగ్యతో[6] అనిమిషం రక్షమాణా ॥ 535

(4) శంసా మిత్రస్య వరుణస్య ధామ శుష్మో రోదసీ బద్బధే మహిత్వా ।
అయన్[7] మాసా అయజ్వనామవీరాః ప్ర యజ్ఞమన్మా వృజనం తిరాతే ॥ 536

---

1. సూర్యస్తన్వాన్, 2. సుక్రతూఽఅవాథఽఆ యత్, 3. ప్ర దివ ఽఋష్వాద్, 4. సుదాన్, 5. దధాథే ఽఓషధీ, 6. విధగ్యతోఽఅనిమిషం, 7. ఆయన్మాసాఽఅయజ్వ. [వా.ప్ర.]

(5) అమూరా విశ్వా వృషణావిమా వాం న యాసు చిత్రం దదృశే న యక్షమ్ ।

ద్రుహః సచన్తే[1] అనృతా జనానాం న వాం నిణ్యాన్యచితే[2] అభూవన్ ॥ 537

(6) సము వాం యజ్ఞం మహయం నమోభిర్హువే వాం మిత్రావరుణా సబాధః ।

ప్ర వాం మన్మాన్యృచసే నవాని కృతాని బ్రహ్మ జుజుషన్నిమాని ॥ 538

(7) ఇయం దేవ పురోహితిర్యువభ్యాం యజ్ఞేషు మిత్రావరుణావకారి ।

విశ్వాని దుర్గా పిపృతం తిరో నో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 539

## సూక్తము—61

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—మిత్రావరుణులు

(1) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! మీరు దేవతలు. మీ చక్షుస్స్వరూప శోభనరూపవిశిష్టుఁడగు సూర్యుఁడు తేజస్సును విస్తరింపఁజేయుచు నుదయించును. వాఁడు సమస్తభువనములను జూచును. వాఁడు మర్త్యులలోఁ బ్రవృత్తస్తోత్రములను నాలించును॥ 540

1. సచన్తేఽఅనృతా, 2. చితేఽఅభూవన్. (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! యజ్ఞవంతుఁడు, దీర్ఘశ్రోత, విప్రుఁడు, నగు వశిష్ఠుఁడు మీ మనోహర స్తోత్రమును ప్రేరేపించును. మీరు సుకర్మవంతులు. మీ రీ స్తోత్రములను రక్షించితిరి. మీరు బహువత్సరములు వ్యాపించి యీ కర్మను బూర్ణముగాఁ జేసిరి॥ 541

(3) గద్యము॥

ఓమిత్రావరుణులారా! మీరు విస్తీర్ణపృథివిని నతిక్రమించితిరి. దర్శనీయము మహాంతము నగు ద్యోలోకమును నతిక్రమించితిరి. మీ దానము మనోహర మైనది. మీ రోషధులకొఱకు ప్రజలకొఱకు రూపమును దాల్చుఁడు! మీరు నిమేషరహితభావములో సత్యమార్గగాములను బరిపాలింపుచుండుఁడు! ॥ 542

(4) గద్యము।

మిత్రావరుణులయొక్క తేజస్సును స్తుతింపుఁడు! వారిబలము ద్యావాపృథువులను దన మహిమవలన వేరుగా స్థాపించుచున్నది. యజ్ఞరహితగణముయొక్క మాసము లన్నియుఁ బుత్రరహిత భావమున వెడలుఁగాక! యజ్ఞస్థిరమతి యగు వ్యక్తి బలమును వృద్ధి పొందించుఁగాక!॥ 543

(5) గద్యము॥

ఓ యమూఢులారా! యో వ్యాప్తులారా! కామవర్షిద్వయమా! యీ మీ స్తుతియందు విస్మయకర మైనదికాని పూజార్హ మైనదికాని యేదియును లేదు. మనుష్యగణముయొక్క మిథ్యాస్తుతి ద్రోహకారులు సేవింతురు. మీ రహస్యము తెలియనిదికాదు ॥ 544

(6) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! మీ యజ్ఞమందు నమస్కారముద్వారా పూజఁ గావించుచున్నాను. నేను బాధాసహితుఁడనై మిమ్ముఁ బిలుచుచున్నాను. మీ సేవకొఱకు నూతనస్తుతు లన్నియు రచించుచున్నాను. మత్కృతంబగు నీ స్తోత్రము మిమ్ముఁ బ్రీతులుగఁ జేయునుగాక! ॥ 545

(7) గద్యము॥

దేవతలగు మిత్రావరుణులారా! మీ యజ్ఞమునందే స్తుతి చేయఁబడుచున్నది. మీరు సమస్త దుర్గమాపదలను బారఁద్రోలుచు మమ్ముఁ బారము నొందింపుఁడు! మీరు సర్వదా స్వస్తి నొసంగుచు మమ్ముఁ బాలింపుఁడు! ॥ 546

## సూక్తమ్—62

ఋషిః —మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1-3-సూర్యః, 4-6-మిత్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఉత్[1] సూర్యో బృహదర్చీంష్యశ్రేత్ పురు విశ్వా జనిమ మానుషాణామ్ ।
సమో దివా దదృశే రోచమానః[2] క్రత్వా కృతః సుకృతః కర్తృభిర్భూత్ ॥ 540

(2) స సూర్య ప్రతి పురో న[3] ఉద్ గా ఏభిః స్తోమేభిరేతశేభిరేవైః ।
ప్ర నో మిత్రాయ వరుణాయ వోచో[4] ఽనాగసో అర్యమ్ణే అగ్నయే చ ॥ 541

(3) వి నః సహస్రం శురుధో రదన్త్వృతావానో వరుణో మిత్రో[5] అగ్నిః ।
యచ్ఛన్తు చన్ద్రా[6] ఉపమం నో అర్కమా నః కామం పూపురన్తు స్తవానాః ॥ 542

---

1. ఉసూర్యో, 2. కృత్వాకృతః, 3. పురో నఽఉద్గాఽఏభిః, 4. వోచోనాగసోఽఅర్యమ్ణేఽఅగ్న, 5. మిత్రోఽఅగ్నిః, 6. చన్ద్రాఽఉపమం నోఽఅర్క. (ప్రా.ప్ర.)

(4) ద్యావాభూమీ[1] అదితే త్రాసీథాం నో యే వాం జజ్ఞుః సుజనిమాన ఋష్వే ।
మా హేళే భూమ వరుణస్య వాయోర్మా మిత్రస్య ప్రియతమస్య నృణామ్ ॥ 543

(5) ప్ర బాహవా సిసృతం జీవసే న[2] ఆ నో గవ్యూతిముక్షతం ఘృతేన ।
ఆ నో జనే శ్రవయతం యువానా శ్రుతం మే మిత్రావరుణా హవేమా ॥ 544

(6) నూ మిత్రో వరుణో[3] అర్యమా నస్త్మనే తోకాయ వరివో దధన్తు ।
సుగా నో విశ్వా సుపథాని సన్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 545

## సూక్తము—62

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—1-3-సూర్యుఁడు, 4-6-మిత్రావరుణులు*

(1) గద్యము॥

సూర్యుఁ డూర్ధ్వముఖముగ మహాబహుతేజస్సు నాశ్రయించును. సమస్తమనుష్యులనుగూడ నాశ్రయించును. వాఁడు దివసమందు ద్యోతమానుఁడై యేకరూపమున గోచరుం డగును. వాఁడు కర్తయుఁ గృతమునునై కిర్తృద్వారా సుకృతుఁ డగుచున్నాఁడు ॥ 547



1. భూమీ౽అదితే, 2. న౽ఆ నో, 3. వరుణో౽అర్యమా. (వ్రా.ప్ర.)

*వ్రాతప్రతిలో నీ సూక్తమునకు (8వ. సంపుటము. 169వ పుట) సూర్యదైవత్యమును శ్రీనేమానివారు వ్రాయలేదు. కాని ఋషిదేవతల పట్టికలు గల 15b సంఖ్య గల సంపుటములో వ్రాసిరి.

(2) గద్యము॥

ఓ సూర్యుఁడా! నీవు ప్రత్యేకవ్యక్తియొక్క సమ్ముఖమున నీ స్తోత్రమును
బ్రయోగించుచున్నావు! శ్వేతవర్ణములు, గమనశీలములు నగు నశ్వముల
మూలమున నూర్ధ్వముఖముగాఁ బోవుము! నీవు మిత్రావరుణార్యమాగ్నుల
సమీపమున మమ్ము నిరపరాధులుగాఁబలుకుము! ॥ 548

(3) గద్యము॥

దుఃఖప్రతిరోధకుఁడు, సత్యవంతుఁడు నగు వరుణమిత్రులు నగ్ని మాకు సహస్రధన
మొసంగుదురుగాక! వా రాహ్లాదకరులు. మాచే స్తూయమానులై మా యభిలాషను
బూరింతురుగాక! ॥ 549

(4) గద్యము॥

ఓ ద్యావాభూములారా! యో యదితి! యో సుదర్శనుఁడా! మమ్ము రక్షింపుఁడు! మేము
సుజన్ములము. మేము మి మ్మెరుంగుదుము. వరుణవాయువులయొక్కయు,
స్తుతికారులయొక్కయుఁ, బ్రియతమ మిత్రునియొక్కయుఁ, గ్రోధమునకుఁ
బాల్గాము ॥ 550

(5) గద్యము॥

ఓ మిత్రావరుణులారా ! బాహువులను బ్రసరింపఁజేయుఁడు! మా జీవనమునిమిత్తము
గోప్రచరణ స్థానమును జలముచేఁ దడుపుఁడు! మనుష్యులలో మమ్ము విఖ్యాతులుగా
నొనర్పుఁడు! మీరు నిత్య తరుణులు. మీ రీ యాహ్వానము నాలకింపుఁడు! ॥ 551

(6) గద్యము॥

ఓ మిత్రావరుణార్యములారా! మా నిజపుత్త్రులకు ధనము ప్రసాదింతురుగాక! సమస్తము
మాకు సుగమము, సుపథమును నగుఁగాక! మీరు సర్వదా స్తుతిచే మమ్ముఁ బాలింపుఁడు! ॥ 552

## సూక్తమ్63

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా— 1-4-సూర్యః, 5-సూర్య మిత్రావరుణాః, 6-మిత్రావరుణౌ అర్యమా చ
ఛందః—త్రిష్టుప్

(1) ఉద్వేతి సుభగో విశ్వచక్షాః సాధారణః సూర్యో మానుషాణామ్ ।
చక్షుర్మిత్రస్య వరుణస్య దేవశ్చర్మేవ యః సమవివ్యక్ తమాంసి ॥ 546

(2) ఉద్వేతి ప్రసవీతా జనానాం మహాన్ కేతురర్ణవః సూర్యస్య ।
సమానం చక్రం పర్యావివృత్సన్ యదేతశో వహతి ధూర్షు యుక్తః ॥ 547

(3) విభ్రాజమాన[1] ఉషసాముపస్థాద్ రేభైరుదేత్యనుమద్యమానః ।
ఏష మే దేవః సవితా చచ్ఛన్ద యః సమానం న ప్రమినాతి ధామ ॥ 548

(4) దివో రుక్మ[2] ఉరుచక్షా ఉదేతి దూరేఅర్థస్తరణిర్భ్రాజమానః ।
నూనం జనాః సూర్యేణ ప్రసూతా[3] అయన్నర్థాని కృణవన్నపాంసి ॥ 549

---

1. మానఽఉషసా, 2. రుక్మఽఉరుచక్షాఽఉదేతి దూరేఽఅర్థస్త, 3. ప్రసుతాఽఅయన్న. (ప్రా.ప్ర.)

(5) యత్రా చక్రురమృతా గాతుమస్మై శ్యేనో న దీయన్నన్వేతి పాథః ।
ప్రతి వాం సూర[1] ఉదితే విధేమ నమోభిర్మిత్రావరుణోత హవ్యైః ॥ 550

(6) నూ మిత్రో వరుణో[2] అర్యమా నస్త్మనే తోకాయ వరివో దధన్తు ।
సుగా నో విశ్వా సుపథాని సన్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 551

## సూక్తము—63

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—1-4—సూర్యుఁడు, 5—సూర్య మిత్రావరుణులు, 6-మిత్రావరుణార్యములు†

(1) గద్యము॥

సుభఁగుడు, సర్వదర్శి, మనుష్యసాధారణుఁడు, మిత్రావరుణులకుఁ జక్షుస్స్వరూపుఁడు, ద్యుతిమంతుఁడు నగు సూర్యుఁ డుదయించుచున్నాఁడు. వాఁడు చర్మమువలెఁ దమోరాశిని సంవేష్టితము చేయుచున్నాఁడు ॥ 553

(2) గద్యము॥

మనుష్య ప్రసవిత, మహాత్ముఁడు, పదార్థ ప్రకాశకుఁడు, జలప్రదుఁడు నగు నీ సూర్యుఁ డేకమాత్ర చక్రమును ద్రిప్పుటకు నిచ్ఛగలవాఁడై యుదయించుచుండును. రథ భావమున నియుక్తములగు హరితవర్ణాశ్వములు వానిని వహించుచున్నవి ॥ 554

---

1. సూర౽ఉదితే, 2. వరుణో౽అర్యమా. (వ్రా.ప్ర.)

†వ్రాత ప్రతిలో నీ సూక్తగతమైన ఋక్కులకు (8వ సంపుటము—171 పుట) దేవతలను "మొదటి నాల్గింటికి 5వ ఋక్కు ప్రథమార్థమునకు, అవశిష్టమునకు, మిత్రావరుణులు"గా శ్రీనేమానివారు వ్రాసి, 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "సూర్యుఁడు, మిత్రావరుణులు"గా వ్రాసిరి.

(3) గద్యము॥

అత్యంత దీప్తిమంతుఁ డగు సూర్యుఁడు స్తోతల స్తోత్రశ్రవణమువలనఁ బ్రమత్తుఁడై
యుషస్సమూహముమధ్య నుదయించును. వాఁడు మేము కోరినది యొసంగును.
అతఁడు సర్వసమానుఁడు. నిజ తేజస్సును సంకుచితముగాఁ జేయఁడు 555

(4) గద్యము॥

దూరగామి, త్రాణకర్త, దీప్తిమంతుఁడు నగు సూర్యుఁడు శోభమానుఁడు. ప్రభూత తేజో
విశిష్టుఁడునై యంతరిక్షమునుండి యుదయించును. ప్రాణులు నిశ్చయముగాఁ
బ్రసూతులై యనుష్ఠానకర్మ నాచరించుచుందురు ॥ 556

(5) గద్యము॥

మరణరహిత దేవగణ మెచ్చట సూర్యునికొఱకు మార్గమును జేసినదో! గమనశీల మగు
గృధ్రమువలె నా మార్గ మంతరిక్షమునకుఁ బోవును. ఓ మిత్రావరుణులారా ! సూర్యుఁ
డుదయించినచో! నమస్కార హవ్యములద్వారా మీ పరిచర్యఁ జేసెదను ॥ 557

(6) గద్యము॥

మిత్రావరుణులు, నర్యముఁడు, మా నిజపుత్రులకు ధనము నిచ్చెదరుగాక!
మాకు సర్వము సుగమము, సుపథము నగును. మీరు సర్వదా స్తుతిచే
మమ్ముఁ బరిపాలింపుఁడు!। 558

## సూక్తమ్—64

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మిత్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) దివి క్షయన్తా రజసః పృథివ్యాం ప్ర వాం ఘృతస్య నిర్ణిజో దదీరన్ ।
హవ్యం నో మిత్రో[1] అర్యమా సుజాతో రాజా సుక్షత్రో వరుణో జుషన్త ।  552

(2) ఆ రాజానా మహ[2] ఋతస్య గోపా సిన్ధుపతీ క్షత్రియా యాతమర్వాక్ ।
ఇళాం[3] నో మిత్రావరుణోత వృష్టిమవ దివ[4] ఇన్వతం జీరదానూ ॥  553

(3) మిత్రస్తన్నో వరుణో దేవో[5] అర్యః ప్ర సాధిష్ఠేభిః పథిభిర్నయన్తు ।
బ్రవద్ యథా న[6] ఆదరిః సుదాస ఇషా మదేమ సహ దేవగోపాః ॥  554

(4) యో వాం గర్తం మనసా[7] తక్షదేతమూర్ధ్వాం ధీతిం కృణవద్ ధారయచ్చ ।
ఉక్షేథాం మిత్రావరుణా ఘృతేన తా రాజానా సుక్షితీస్తర్పయేథామ్ ॥  555

---

1. మిత్రో ఽ అర్యమా, మహ ఽ ఋతస్య, 3. ఇళం నో, 4. దివ ఽ ఇన్వతం, 5. దేవో ఽ అర్యః,
6. న ఽ ఆదరిః సుదాస ఽ ఇషా, 7. మనసా దక్ష. (వ్రి.ప్రి.)

(5) ఏష స్తోమో వరుణ మిత్ర తుభ్యం సోమః శుక్రో న వాయవేఽయామి ।
అవిష్టం ధియో జిగృతం పురంధీర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 556

## సూక్తము—64

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—మిత్రావరుణులు

(1) గద్యము॥

ఓ మిత్రావరుణులారా ! ద్యోలోకమందుఁ బృథ్వియందు మీరు జలస్వాములు. మీచేఁ ప్రేరిత మగు మేఘము జలమును రూపము కలదిగా నొనర్చును. మిత్రుఁడా ! సుజాతార్యముఁడా ! రాజు, బలవంతుఁడు నగు వరుణుఁడు మా హవ్యసేవను జేయునుగాక ! ॥ 559

(2) గద్యము॥

మీరు రాజులు. మహాయజ్ఞ రక్షకులు. సింధుగతి గలవారలు. క్షత్రియులు. మీరు మా కభిముఖముగ రండు! క్షిప్రదానశీలురగు మిత్రావరుణులారా ! యంతరిక్షమునుండి మా కన్నమును, వృష్టిని నొసంగుఁడు! ॥ 560

(3) గద్యము॥

మిత్రావరుణులు, నర్యముఁడు దేవతోత్కృష్టపథమున మమ్ముఁబెట్టుదురు. అర్యముఁడు సుందరదానశీల మగు లోకముముందఱ మా ప్రసంగము నెత్తును. మేము మీచే రక్షింపఁబడినవారమై యన్నముచేఁ బుత్ర పౌత్రాది ప్రమత్తుల మయ్యెదము ॥ 561

(4) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! యెవ్వరు మనస్సుచే మీ యీ రథమును నిర్మించిరో! యెవ్వ రస్తుత
కర్మ నాచరింతురో! యెవ్వరు యజ్ఞమందు మిమ్ము ధరింతురో! వారికి మీరు రాజులు.
మీరు వారిని జలమునఁ దడుపుఁడు! వారికి సుక్షితి నొసంగి తృప్తులుగాఁ జేయుడు! ॥ 562

(5) గద్యము॥

ఓ మిత్రావరుణులారా! మీ నిమిత్తము, వాయువు నిమిత్తము,దీప్త సోమమువలె నీ సోమము
జేయఁబడినది. మా కర్మయందుఁ బ్రవేశింపుఁడు! స్తుతి నాలింపుఁడు! మీరు
స్తోత్రములద్వారా మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 563

## సూక్తమ్—65

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మిత్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) ప్రతి వాం సూర[1] ఉదితే సూక్తైర్మిత్రం హువే వరుణం పూతదక్షమ్ ।
యయోరసుర్యమక్షితం జ్యేష్ఠం విశ్వస్య యామన్నాచితా జిగత్ను ॥ 557

(2) తా హి దేవానామసురా తావర్యా[4] తా నః క్షితీః కరతమూర్జయన్తీః ।
అశ్యామ మిత్రావరుణా వయం వాం ద్యావా చ యత్ర పీపయన్నహా చ ॥ 558

---

1. సూర ఉదితే, 2. సూర్యమ, 3. జిగాత్ను, 4. తావర్య తా నః [వ్రా.ప్ర.]

(3) తా భూరిపాశావనృతస్య సేతూ దురత్యేతూ రిపవే మర్త్యాయ ।
ఋతస్య మిత్రావరుణా పథా వామపో న నావా దురితా తరేమ ॥ 559

(4) ఆ నో మిత్రావరుణా హవ్యజుష్టిం ఘృతైర్గవ్యూతిముక్షతమిళాభిః ।
ప్రతి వామత్ర వరమా జనాయ పృణీతముద్నో[1] దివ్యస్య చారోః ॥ 560

(5) ఏష స్తోమో వరుణ మిత్ర తుభ్యం సోమః శుక్రో న వాయవేఽయామి ।
అవిష్టం ధియో జిగృతం పురంధీర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 561

## సూక్తము—65

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—మిత్రావరుణులు

(1) గద్యము॥

సూర్యుఁ డుదయించినపిదప మిత్రుని శుద్ధబలముగల వరుణుని సూక్తమున నాహ్వానింతును. వారి యుభయులబలము నక్షీణము. ప్రభూతము. సంగ్రామము తటస్థించినయెడల వారు జయము నందెదరు ॥ 564

1. తముద్రో. (వా.ప.)

(2) గద్యము॥

వారు దేవతామధ్యమమున నసురులు. వా రార్యులు. వారు మా పూజను వృద్ధి నొందింతురు. ఓ మిత్రావరుణులారా! మేము మిమ్ముఁ బొందెదము. మీ వ్యాప్తివలన ద్యావాభూములు మమ్ము దివారాత్ర మాప్యాయితలుగా నొనర్చును ॥ 565

(3) గద్యము॥

వారి పాశము ప్రభూత మైనది. వార *లనృత సేతువులు. శత్రుజనులకు దురతిక్రములు. ఓ మిత్రావరుణులారా! నౌకచే జలమెట్లు దాటఁబడునో! యటులు మీ యజ్ఞమార్గమందు దురితమును దాఁటుదుము ॥ 566

(4) గద్యము॥

మిత్రావరుణులు మా హవ్యమును సేవించుటకు వచ్చెదరుగాక! అన్నసహిత మగు జలముచే మా గోప్రచారణస్థానమును సిక్తము గావింపుఁడు! మిమ్ములఁగూర్చి యీ లోకమం దుత్కృష్టహవ్యము నెవ్వ రొసంగెదరు ? మీరు లోకమునకు స్వర్గీయరమణీయజలము నొసంగుఁడు! ॥ 567

(5) గద్యము॥

ఓమిత్రావరుణులారా! మీ నిమిత్తము, వాయువునిమిత్తము, దీప్తసోమమువలె నీ సోమము చేయఁబడినది. మా కర్మయందుఁ బ్రవేశింపుఁడు! స్తుతి నాలింపుఁడు! సర్వదా మీరు మమ్ము స్తోత్రములఁ బరిపాలింపుఁడు! ॥ 568

---

* అబద్ధపుసేతువువంటివారు.

## సూక్తమ్—66

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మిత్రావరుణౌ, 4-13-ఆదిత్యాః, 14-16-సూర్యః
ఛందః—గాయత్రీ, 10-15— సమా బృహతీ, విషమా సతోబృహతీ (ప్రగాథః),
16-పురఉష్ణిక్

(1) ప్ర మిత్రయోర్వరుణయోః స్తోమో న[1] ఏతు శూష్యః ।
నమస్వాన్ [2]తువిజాతయోః ॥ 562

(2) యా ధారయన్త దేవాః సుదక్షా దక్షపితరా ।
అసుర్యాయ [3]ప్రమహసా ॥ 563

(3) తా నః స్తిపా తనూపా వరుణ [4]జరితౄణామ్ ।
మిత్ర సాధయతం ధియః ॥ 564

(4) యదద్య సూర[5] ఉదితే ఽనాగా మిత్రో అర్యమా ।
సువాతి సవితా భగః ॥ 565

1. స్తోమో నఽఏతు, 2. తువిజయాతయోః, 3. ప్రమహసాః, 4. జరితృణామ్,

5. సూరఽఉదితే నాగా మిత్రోఽఅర్యమా. (వ్రా. ప్ర.)

(5) సుప్రావీరస్తు స క్షయః ప్ర ను యామన్ త్సుదానవః ।

యే నో[1] అంహోఽతిపిప్రతి ॥ 566

(6) ఉత స్వరాజో[2] అదితిరదబ్ధస్య వ్రతస్య యే ।

మహో రాజాన[3] ఈశతే ॥ 567

(7) ప్రతి వాం సూర[4] ఉదితే మిత్రం గృణీషే వరుణమ్ ।

అర్యమణం రిశాదసమ్ ॥ 568

(8) రాయా హిరణ్యయా మతిరియమవృకాయ శవసే ।

ఇయం విప్రా మేధసాతయే ॥ 569

(9) తే స్యామ దేవ వరుణ తే మిత్ర సూరిభిః సహ ।

ఇషం స్వశ్చ ధీమహి ॥ 570

---

1. యే నోఽఅంహోతి, 2. రాజోఽఅదితి, 3. రాజానఽఈశతే, 4. సూరఽఅదితే. [ప్రా.ప్ర.]

(10) బహవః సూరచక్షసో ఽగ్నిజిహ్వా[1] ఋతావృధః ।
త్రీణి యే యేముర్విదథాని ధీతిభిర్విశ్వాని పరిభూతిభిః ॥ 571

(11) వి యే దధుః శరదం మాసమాదహర్యజ్ఞమక్తుం చాదృచమ్ ।
అనాప్యం వరుణో మిత్రో[2] అర్యమా క్షత్రం రాజాన[3] ఆశత ॥ 572

(12) తద్ వో[4] అద్య మనామహే సూక్తైః సూర ఉదితే ।
యదోహతే వరుణో మిత్రో[5] అర్యమా యూయమృతస్య రథ్యః ॥ 573

(13) ఋతావాన[6] ఋతజాతా ఋతావృధో ఘోరాసో[7] అనృతద్విషః ।
తేషాం వః సుమ్నే సుచ్ఛర్దిష్టమే నరః స్యామ యే చ సూరయః ॥ 574

(14) ఉదు త్యద్ దర్శతం వపుర్దివ[8] ఏతి ప్రతిహ్వరే ।
యదీమాశుర్వహతి దేవ[9] ఏతశో విశ్వస్మై చక్షసే[10] అరమ్ ॥ 575

---

1. జిహ్వాఽఋతా, 2. మిత్రోఽఅర్యమా, 3. రాజానఽఆశత, 4. తద్వోఽఅద్య, 5. మిత్రోఽఅర్యమా,
6. ఋతావానఽఋతజాతాఽఋతా, 7. సోఽఅనృత, 8. దివఽఏతి, 9. దేవఽఏత,
10. చక్షసేఽఅరమ్. [వ్రా.ప్ర.]

(15) శీర్ష్ణఃశీర్ష్ణో జగతస్తస్థుషస్పతిం సమయా విశ్వమా రజః ।

సప్త స్వసారః సువితాయ సూర్యం వహన్తి హరితో రథే ॥ 576

(16) తచ్చక్షుర్దేవహితం శుక్రముచ్చరత్ ।

పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతమ్ ॥ 577

(17) కావ్యేభిరదాభ్యా[1]ఽఽ యాతం వరుణ ద్యుమత్ ।

మిత్రశ్చ సోమపీతయే ॥ 578

(18) దివో ధామభిర్వరుణ మిత్రశ్చా యాతమద్రుహా ।

పిబతం సోమమాతుజీ ॥ 579

(19) ఆ యాతం మిత్రావరుణా జుషాణావాహుతిం నరా ।

పాతం సోమమృతావృధా ॥ 580

---

1. రదాభాయాతం. (వ్రా.ప్ర.)

## సూక్తము—66

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—4-13-ఆదిత్యులు, 14-16-సూర్యుఁడు, 1-3, 17-19-మిత్రావరుణులు

(1) గద్యము॥

మాటిమాటి కావిర్భూతులగు మిత్రావరుణులకు సుఖకరమగు స్తోమము చెల్లింపఁబడుఁగాక! 569

(2) గద్యము॥

శోభనబలవిశిష్టము బలపాలకము ప్రకృతతేజోవిశిష్టమునగు మిత్రావరుణద్వయమును
బలముకొఱకై దేవతలు ధరించిరి ॥ 570

(3) గద్యము॥

ఆ మిత్రావరుణులు గృహపాలకులు శరీరపాలకు లయ్యెదరు. ఓ మిత్రావరుణులారా!
మీరు స్తోతలకర్మల సాధింపుఁడు ! 571

(4) గద్యము॥

ఇపుడు సూర్యుఁ డుదయింపఁగనే పాపహంతయగు మిత్రుఁడు, సవిత, యర్యముఁడు,
భగుఁడు నే ధనమును మాకు నపేక్షించిరో! దానిని ప్రేరేపింతురుగాక! 572

(5) గద్యము॥

శోభనదానశీలులారా! మీరు మా పాపమును హరింపుఁడు! మీరు వచ్చినచో
మా యాగగృహము సురక్షిత మగును ॥ 573

(6) గద్యము॥

మిత్రాదులు, నదితి, హింసారహితవ్రతములకు నీశ్వరులు. మహాధనమున కీశ్వరులు ॥ 574

(13) గద్యము॥

మీరు యజ్ఞవంతులు. యజ్ఞార్థము పుట్టినవారు. యజ్ఞ వర్ధకులు. భయానకులు.
అనృతద్వేషులు. యజ్ఞవిద్వేషశీలులను ద్వేషించువారు. మీయొక్క సుకృతమ
ధనమునకు కూట లెవ్వరుగలరో! వారు మాకు నాయకు లయ్యెదరు ॥ 581

(14) గద్యము॥

ఆ యా దర్శనీయ వపుస్సులు సంతరిక్ష సమీపమందు నుదిత లగుదురు. శీఘ్రగాములు,
హరితవర్ణములునగు నశ్వములు సర్వమును దర్శనార్థమై వీటిని ధరించుచున్నవి ॥ 582

(15) గద్యము॥

మస్తకమునకు మస్తకము, స్థావర జంగములకుఁ బతియు నగు రథస్థసూర్యుని,
గళ్యాణమునకౌఅకు సప్త సంఖ్యాకములు, గమనశీలములునగు హరిత గణము
సర్వజన సమక్షమున వహించును ॥ 583

(16) గద్యము॥

చక్షుస్స్వరూపము, దేవ హితకరము, నిర్మలమునగు సూర్యమండల ముదయ మగును.
మేము దానిని *శతవత్సరములు చూచుచునుండెదము ॥ 584

(17) గద్యము॥

ఓ వరుణుడా ! నీవును, మిత్రుఁడును నహింసనీయులు. ద్యుతిమంతులు. మీరు స్తోత్ర
ప్రయుక్తమగు సోమమును ద్రాగుటకు రండు! ॥ 585

(18) గద్యము॥

ఓ మిత్రుఁడా ! నీవును, వరుణుఁడు, ద్రోహరహితులు. మీరు ద్యులోక స్థానమునుండి రండు!
శత్రువులను హింసించుచు సోమపానము నొనర్పుఁడు! ॥ 586

---

* శరదుత్తులు

(19) గద్యము॥

నేతలగు నో మిత్రావరుణులారా! నాహుతిని సేవింపుఁడు! ఓ యజ్ఞ వర్ధకులారా! మీరు
సోమపానమును జేయుఁడు! ॥ 587

## సూక్తమ్—67

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) ప్రతి వాం రథం నృపతీ జరధ్యై హవిష్మతా మనసా యజ్ఞియేన ।
యో వాం దూతో న[1]ధిష్ణ్యావజీగరచ్ఛా సూనుర్న పితరా వివక్మి[2] ॥ 581

(2) అశోచ్యగ్నిః సమిధానో[3] అస్మే ఉపో అదృశ్రన్ తమసశ్చిదన్తాః ।
అచేతి కేతురుషసః పురస్తాచ్ఛ్రియే దివో దుహితుర్జాయమానః ॥ 582

(3) అభి వాం నూనమశ్వినా సుహోతా స్తోమైః సిషక్తి నాసత్యా వివక్వాన్ ।
పూర్వీభిర్యాతం[4] పథ్యాభిరర్వాక్ స్వర్విదా వసుమతా రథేన ॥ 583

1. న ధిష్ణయా, 2. వివక్మ, 3. సమిధానోఽఅస్మేఽఉపోఽఅదృశ్రన్, 4. పూర్వాభి. (బ్రా.ప్ర.)

(4) అవోర్వాం నూనమశ్వినా యువాకుర్హువే యద్ వాం సుతే మాధ్వీ వసూయుః ।

ఆ వాం వహన్తు స్థవిరాసో[1] అశ్వాః పిబాథో అస్మే సుషుతా మధూని ॥ 584

(5) ప్రాచీము దేవాశ్వినా ధియం మే[2] ఽమృధ్రాం సాతయే కృతం [3]వసూయుమ్ ।

విశ్వా[4] అవిష్టం వాజ ఆ పురంధీస్తా నః శక్తం శచీపతీ శచీభిః ॥ 585

(6) అవిష్టం ధీష్వశ్వినా న[5] ఆసు ప్రజావద్ రేతో[6] అహ్రయం నో అస్తు ।

ఆ వాం తోకే తనయే తూతుజానాః సురత్నాసో దేవవీతిం గమేమ ॥ 586

(7) ఏష స్య వాం పూర్వగత్వేవ సఖ్యే నిధిర్హితో మాధ్వీ రాతో[7] అస్మే ।

అహేళతా మనసా యాతమర్వాగశ్నన్తా హవ్యం మానుషీషు విక్షు ॥ 587

(8) ఏకస్మిన్ యోగే భురణా సమానే పరి[8] వాం సప్త స్రవతో రథో గాత్ ।

న వాయన్తి సుభ్వో దేవయుక్తా యే వాం ధూర్షు తరణయో వహన్తి ॥ 588

1. స్థవిరాసోఽఅశ్వాః పిబాథోఽఅస్మే, 2. మేమృధ్రాం, 3. వసూయుః, 4. విశ్వాఽఅవిష్టం వాజఽఆ,
5. నఽఆసు, 6. రేతోఽఅహ్రయం నోఽఅస్తు, 7. రాతోఽఅస్మే, 8. పరి మాం. (వ్రా.ప్ర.)

(9) అనశ్వన్తా మఘవద్భ్యో హి భూతం యే రాయా మఘదేయం జునన్తి ।
ప్ర యే బన్ధుం సూనృతాభిస్తిరన్తే గవ్యా పృఞ్చన్తో[1] అశ్వ్యా మఘాని ॥ 589

(10) నూ మే హవమా శృణుతం యువానా యాసిష్టం వర్తిరశ్వినావిరావత్ ।
ధత్తం రత్నాని జరతం చ సూరీన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 590

## సూక్తము—67

ఋషి—మైత్రావరుణి యగు వసిష్ఠుఁడు

దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

ఓ నృపతిద్వయమా ! మేము హవ్యయుక్త స్తోత్రములచే రథమును స్తుతించుటకుఁ బోవుచున్నాము. ఓ స్తోత్రార్హద్వయమా! పుత్రుఁ డేరీతి జనకుని జాగరితునిగా నొనర్చునో! యటుల నీ రథము నీ దూతవలె లోకమును జాగరితముగ నొనర్చును. ఆ రథము మా కభిముఖముగ వచ్చుటకు సిద్ధముగ నున్నది ॥ 588

(2) గద్యము॥

మాచే సమిద్ధుఁడై యగ్ని దీప్తుఁ డగుచున్నాఁడు. అంధకారాంతరప్రదేశము దృష్ట మగుచున్నది. ప్రజ్ఞాపకసూర్యుఁడు ద్యులోక దుహితయొక్క పూర్వ దిక్కున శోభార్థమై పుట్టుచున్నాఁడు ॥ 589

---

1. పృఞ్చన్తోఽశ్వా మఘాని. (పా.స.)

(8) గద్యము॥

ఓ భర్తృద్వయమా ! మీ రుభయులుఁ గలసినచో! మీ రథము గమనశీలములగు సప్త నదులను నతిక్రమించిపోవును. సుజాతము, దేవయుక్తమునగు నశ్వగణము రథభారమును దరణీ స్వరూపమున మిమ్ముల వహించును. అవి యలసిపోవు ॥ 595

(9) గద్యము॥

మీ రెచ్చట నాసక్తు లగుదురో! తెలియదు. ఏ ధనవంతుల ధనమునిమిత్తమై దాతవ్య హవిస్సును బ్రేరేపింతురో! యెవ్వరు బంధువులను సూనృత వాక్యములచేఁ బ్రవర్ధితులుగాఁ జేయుదురో! యెవ్వరు గోవులను, నశ్వములను, ధనమును, నిచ్చెదరో! వారి నిమిత్తమై మీ రుపయోగపడుచున్నారు । 596

(10) గద్యము॥

మీ రిపుడు మా యాహ్వానమును నాలింపుఁడు! హవ్య విశిష్టగృహమునకు రండు! నిత్య యౌవనముగల యశ్విద్వయమా ! స్తోతలను వృద్ధిపొందింపుఁడు! మీరు సర్వదా స్తుతులచే మమ్ముఁ రక్షింపుఁడు! ॥ 597

## సూక్తమ్—68

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—అశ్వినౌ

ఛందః—విరాట్, 8-9-త్రిష్టుప్

(1) ఆ శుభ్రా యాతమశ్వినా స్వశ్వా గిరో దస్రా జుజుషాణా యువాకోః ।

హవ్యాని చ ప్రతిభృతా వీతం నః ॥ 591

(2) ప్ర వామన్ధాంసి మద్యాన్యస్థురరం గన్తం హవిషో వీతయే[1] మే ।
తిరో[2] అర్యో హవనాని శ్రుతం నః ॥ 592

(3) ప్ర వాం రథో మనోజవా[3] ఇయర్తి తిరో రజాంస్యశ్వినా శతోతిః ।
అస్మభ్యం సూర్యావసూ[4] ఇయానః ॥ 593

(4) అయం హ యద్ వాం దేవయా[5] ఉ అద్రిరూర్ధ్వో వివక్తి సోమసుద్ యువభ్యామ్ ।
ఆ వల్గూ విప్రో వవృతీత హవ్యైః ॥ 594

(5) చిత్రం హ యద్ వాం భోజనం న్వస్తి న్యత్రయే మహిష్వన్తం యుయోతమ్ ।
యో వామోమానం దధతే ప్రియః సన్ ॥ 595

(6) ఉత త్యద్ వాం జురతే[6] అశ్వినా భూచ్చ్యవానాయ ప్రతీత్యం హవిర్దే ।
అధి యద్ వర్ప[7] ఇతఊతి ధత్థః ॥ 596

---

1. వితయే మే, 2. తిరోఽఅర్యో, 3. జవాఽఇయర్తి, 4. వసూఽఇయానః, 5. దేవయాఽఉఽఅద్రి,
6. జురతేఽఅశ్వినా, 7. వర్పఽఇతఽఊతి. (వ్రా.ప్ర.)

(7) ఉత త్యం భుజ్యుమశ్వినా సఖాయో మధ్యే జహుర్దురేవాసః సముద్రే ।
నిరీం పర్షదరావా యో యువాకుః ॥ 597

(8) వృకాయ చిజ్జసమానాయ శక్తముత శ్రుతం శయవే హూయమానా ।
[1]యావఘ్న్యామపిన్వతమపో న స్తర్యం చిచ్ఛక్త్యశ్వినా శచీభిః ॥ 598

(9) ఏష స్య కారుర్జరతే సూక్తైరగ్రే బుధాన[2] ఉషసాం సుమన్మా ।
ఇషా తం వర్ధదఘ్న్యా పయోభిర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 599

## సూక్తము—68

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

దీప్తము సుందరాశ్వ విశిష్టమునగు నశ్విద్వియమా! రండు! మీరు శత్రు నాశకులు. ఎవ్వఁరు మిమ్ముఁ గోరెదరో! వారి స్తుతిని సేవింపుఁడు! మేము సంపాదించిన హవ్యమును భక్షింపుఁడు! ॥ 598

1. యావఘ్న్యాశఘ్న్యామపి, 2. బుధానఉషసాం. (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీ నిమిత్తము మదకరాన్నము గలదు. మీరు మా హవిర్భక్షణార్థము శీఘ్రముగ దయచేయుఁడు! శత్రువుల పిలుపు నాలింపక మా యాహ్వానమునే వినుఁడు! ॥ 599

(3) గద్యము॥

మీరు సూర్యసహితమగు రథమందు నివసింపుఁడు! వేగశీలము నపరిమిత రక్షావిశిష్టము నగు మీ రథము మా నిమిత్తము ప్రార్థింపఁబడినదియై లోకముల నతిక్రమించి వచ్చుచున్నది ॥ 600

(4) గద్యము॥

మిమ్ములను దేవతలుగా నొనర్చుటకు నభిలషించుచున్నాను. మీ నిమిత్తమై సోమాభిషవకారి యగు నీప్రస్తర మున్నత మైనదియై శబ్దమును జేయుటవలన నో సుందరాశ్విద్వయమా ! విప్రుఁడు హవ్యముచే మిమ్ముల నావర్తితులుగాఁజేయును ॥ 601

(5) గద్యము॥

మీ కే చిత్రధనము గలదో! దానిని మా కొసంగుఁడు! ఎవఁడు ప్రియుఁడై మీ రిచ్చిన సుఖము నభిలషించునో! యట్టి యత్రివలన మహిష్వత్తుని (ఋవీశుని) వేరుగా నొనర్పుము! ॥ 602

(6) గద్యము॥

ఓ యశ్విద్వయమా ! మిమ్ము స్తుతించువాఁడును, జీర్ణ హవ్యదాయియు నగు చ్యవనుని నిమిత్త మేది కొనితెచ్చి దాన మిచ్చితిరో! యది వానినిగూర్చి ప్రతిగమనించును! ॥ 603

(7) గద్యము॥

ఇంకను దుష్టబుద్ధిగల సఖు లేభుజ్యుని సముద్రమధ్యమున విడిచిరో! వానిని మీరు పైకిఁ దేసితిరి. వాఁడు మమ్ములను గోరును. విరుద్ధము నాచరింపఁడు! ॥ 604

(8) గద్యము॥

వృకము క్షీణించిపోవుచున్నది. ఓ యశ్విద్వయమా! మీరు కర్మచేతను, సామర్థ్యముచేతను దానికి ధన మిచ్చితిరి. ఆహూయమానులై శయుని మొర నాలించితిరి. నది జలముచే నిండునట్లు నివృత్తప్రసవులగు గోవులను దుగ్ధముచేఁ బరిపూర్ణములు గావించితిరి ॥ 605

(9) గద్యము॥

ఈ స్తోత సుమనస్కుఁడై యుషఃకాలమునకుఁ బూర్వము జాగరితుఁడై సూక్తములచే స్తుతించుచున్నాఁడు. వీనిని నన్నముతోడను దుగ్ధముతోడను వృద్ధిఁ బొందింపుఁడు! మరియు వీని గోవులను వృద్ధిఁ బొందింపుఁడు! మీరు సర్వదా స్తుతులచేఁ బాలింపుఁడు! ॥ 606

## సూక్తమ్—69

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఆ వాం రథో రోదసీ బద్బధానో హిరణ్యయో వృషభిర్యాత్వశ్వైః ।
ఘృతవర్తనిః పవిభీ రుచాన[1] ఇషాం వోఢా నృపతిర్వాజినీవాన్ ॥ 600

(2) స ప్రథానో[2] అభి పంచ భూమా త్రివన్ధురో మనసా యాతు యుక్తః ।
విశో యేన గచ్ఛథో దేవయన్తీః కుత్రా చిద్ యామమశ్వినా దధానా ॥ 601

---

1. రుచానఽఇషాం వోఢా, 2. ప్రథానోఽఅభి. (బ్రా. ప్ర.)

(3) స్వశ్వా యశసా యాతమర్వాగ్ దస్రా నిధిం[1] మధుమన్తం పిబాథః ।

వి వాం రథో వధ్వాః యాదమానో[2] ఽన్తాన్ దివో బాధతే వర్తనిభ్యామ్ ॥ 602

(4) యువోః శ్రియం పరి యోషావృణీత సూరో దుహితా పరితక్మ్యాయామ్ ।

యద్ దేవయన్తమవథః శచీభిః పరి [3]ఘ్రంసమోమనా వాం వయో గాత్ ॥ 603

(5) యో హ స్య వాం రథిరా వస్త[4] ఉస్రా రథో యుజానః పరియాతి వర్తిః ।

తేన నః శం యోరుషసో వ్యుష్టౌ న్యశ్వినా వహతం యజ్ఞే అస్మిన్ ॥ 604

(6) నరా గౌరేవ విద్యుతం తృషాణా[5] ఽస్మాకమద్య సవనోప యాతమ్ ।

పురుత్రా హి వాం మతిభిర్హవన్తే[6] మా వామన్యే ని యమన్ దేవయన్తః ॥ 605

(7) యువం భుజ్యుమవవిద్ధం సముద్ర[7] ఉదూహథురర్ణసో [8]అస్రిధానైః ।

పతత్రిభిరశ్రమైరవ్యథిభిర్దంసనాభిరశ్వినా పారయన్తా ॥ 606

---

1. నిధం, 2. యాదమానో ఽన్తాన్ దివో, 3. ఘ్రంసమోమనా, 4. వస్త ఉస్రా, 5. తృషాణాస్మాక, 6. మతిభిర్హవన్తే, 7. సముద్ర ఉదూహ, 8. ణో ఽ అస్రిధానైః. (వ్రా. ప్ర.)

(౯) నూ మే హవమా శృణుతం యువానా యాసిష్టం వర్తిరశ్వినావిరావత్ ।
ధత్తం రత్నాని జరతం చ సూరీన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 607

## సూక్తము—69

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

మీ రథము తరుణాశ్వయుక్తమై వచ్చుఁగాక! అది ద్యావాభూములకు బాధను గలిఁగించుచుండుఁగాక! అయ్యది హిరణ్మయము. దానిచక్రమందు జలము కలదు. అది రథనేమిద్వారా దీప్తిమంతము. అన్నవాహకము. నృపతి. అన్నవంతము. ॥ 607

(2) గద్యము॥

అవి పంచభూతములయందుఁ బ్రసిద్ధము. బంధురకాష్ఠవిశిష్టము. స్తుతి సహితము. అది వచ్చుఁగాక! ఓ యశ్విద్వయమా! మీ రెచ్చటికైనఁ బోవ నుద్యోగించుచు నీ రథమందు దేవాభిలాషులగు ప్రజలకడకు వెడలుఁడు! ॥ 608

(3) గద్యము॥

మీరు సుందరాశ్వాన్నయుక్తుల మగు మాకడకు రండు! ఓ దస్రద్వయమా! మీరు మధుమంతమగు సోమనిధిని పానముఁ జేయుఁడు! మీ రథము మధువుతోఁ బోవుచుఁ జక్రముద్వారా వ్యోమలోకపర్యంతముగల ప్రదేశములకు బాధను గల్పించును ॥ 609

(4) గద్యము।

రాత్రియందు యోషిత్తగు సూర్యదుహిత మీ రథము పరివర్తించును. మీరు దేవాభిలాషులను గర్మచే రక్షించుటంబట్టి దీప్తాన్నరక్ష నిమిత్తము మిమ్ముఁ బరిగమనించును 610

(5) గద్యము॥

ఓ రథిద్వయమా! యా రథము తేజస్సమూహము నాచ్ఛాదించును. అశ్వసహితమై మార్గమందుఁ బోవును. ఓ యశ్విద్వయమా! యుషస్సు ప్రకాశించినచో మా యజ్ఞమందు నా రథముపైని బాపశాంతికొఱకు సుఖము కలుఁగటకొఱకు రండు! ॥ 611

(6) గద్యము॥

ఓ నేతృద్వయమా! మృగివలె విశేషముగ దీప్యమానసోమమును దీసికొనిరా నిచ్ఛగలవారై మార్గమును బట్టుఁడు! బహుయజ్ఞములందు స్తుతులచే మిమ్ముఁ బిలిచెదరు ॥ 612

(7) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు విక్షిప్తసముద్రమధ్యను మునింగిన భుజ్యుని, నక్షతము, శ్రమరహితము, శీఘ్రగామియు నగు నశ్వముద్వారా కర్మచేతను జలమునుండి తీసి తీరము నొందించితిరి 613

(8) గద్యము॥

మీ రిపుడు మా యాహ్వానము నాలింపుఁడు! నిత్యయౌవనముగల యశ్విద్వయమా!హవ్యయుత గృహమునకు రండు! మీరు సర్వదా మమ్ము స్తుతులచే సంరక్షింపుఁడు! ॥ 614

## సూక్తమ్—70

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఆ విశ్వవారాశ్వినా గతం నః ప్ర తత్ స్థానమవాచి వాం పృథివ్యామ్ ।
అశ్వో న వాజీ శునపృష్ఠో[1] అస్థాదా యత్ సేదథుర్ధ్రువసే న యోనిమ్ ॥ 608

(2) సిషక్తి సా వాం సుమతిశ్చనిష్ఠా[2] ఽతాపి ఘర్మో మనుషో దురోణే ।
యో వాం సముద్రాన్ త్సరితః పిపర్త్యేతగ్వా చిన్న సుయుజా యుజానః ॥ 609

(3) యాని స్థానాన్యశ్వినా దధాథే దివో యహ్వీష్వోషధీషు విక్షు ।
ని పర్వతస్య మూర్ధని సదన్తేషం జనాయ దాశుషే వహన్తా ॥ 610

(4) చనిష్టం దేవా[3] ఓషధీష్వప్సు యద్ యోగ్యా[4] అశ్నవైథే ఋషీణామ్ ।
పురూణి రత్నా దధతౌ న్యస్మే అను పూర్వాణి చఖ్యథుర్యుగాని ॥ 611

---

1. పృష్ఠోఽఅస్థాదా, 2. నిష్ఠాఽతాపి, 3. దేవాఽఓషధీ, 4. యోగ్యాఽఅశ్నవైథేఽఋషీణామ్. (ప్రా.ప్ర.)

(5) శుశ్రువాంసా చిదశ్వినా పురూణ్యభి బ్రహ్మాణి చక్షాథే ఋషీణామ్ ।

ప్రతి ప్ర యాతం వరమా జనాయాఽస్మే వామస్తు సుమతిశ్చనిష్ఠా ॥ 612

(6) యో వాం యజ్ఞో నాసత్యా హవిష్మాన్ కృతబ్రహ్మా సమర్యో౩ భవాతి ।

ఉప ప్ర యాతం వరమా వసిష్ఠమిమా బ్రహ్మాణ్యృచ్యన్తే యువభ్యామ్ ॥ 613

(7) ఇయం మనీషా ఇయమశ్వినా గీరిమాం సువృక్తిం వృషణా జుషేథామ్ ।

ఇమా బ్రహ్మాణి యువయూన్యగ్మన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 614

## సూక్తము—70

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

సకలవరణీయాశ్విద్వయమా! మా వేదిపై వసింపుఁడు! భూమియందు విశ్రమింపుఁడు!

ఏ యశ్వములు మిమ్ముఁ బ్రవేశింపఁజేయునో! సుఖకరములుఁ బృష్ఠవిశిష్టములునగునట్టి

యశ్వములు మీ సమీపమం దుండుఁగాక! ॥ 615

(2) గద్యము॥

అతిశయాన్నముగల యీ సుస్తుతి మిమ్ము సేవించును. మనుష్యగృహమందు ఘర్మతప్త మగును. ఇది మీకుఁ బ్రాప్త మగును. సరిత్తులు సముద్రమును నిండించునట్టులు నశ్వము రథమునకుఁ గూర్చునటులు మిమ్ము యజ్ఞములందుఁ గూర్తురు ॥ 616

(3) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు ద్యులోకమునుండి వచ్చి గొప్ప యోషధులయందు, మనుష్యుల మధ్యమందు నెట్టి స్థానమును గల్పింతురో! మీరు పర్వతమస్తకమునఁ బ్రవేశించుచు నన్నదాత కా స్థానమును గల్పింపుఁడు! ॥ 617

(4) గద్యము॥

ఓ దేవద్వయమా! మీరు విని ఋషుల బహుకర్మను దర్శించుచుండుఁడు! కాఁబట్టి యజమాన యజ్ఞమునుగూర్చి రండు! మమ్ములఁగురించి యన్నయుక్తముగ ననుగ్రహముండును ॥ 618

(5)† గద్యము॥

ఓ యశ్విద్వయమా! జ్ఞానపూర్ణ మగు మా స్తోత్రములను వినుచు ననేకబ్రహ్మకర్మలతోఁ గూడిన మా ఋషుల ఋక్కులను వినుచు మాకు మోదమును గల్పింపుఁడు! ఋషులకు రాజర్షులకు ధనలాభమును శత్రుజయమును ననుగ్రహింపుఁడు! ॥ 619

(6) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! యే యజమానుఁడు హవ్యవంతులు, కృతస్తోత్రులు నగు మనుష్యులను గలియుదురో! యట్టి వరణీయవసిష్ఠుని సన్నిధికి మీరు దయసేయుఁడు! ఈ మంత్రము లన్నియు మీ నిమిత్త ముచ్చరింపఁబడును ॥ 620

---

† ఈ 7వ సూక్తమునందలి 5వ ఋక్కును పొరపాటున శ్రీ నేమానివా రనుపదింపక విడిచిపెట్టిరి. (చూ. వార్తాపత్రిక—8వ సంపుటము. 186 పుట.)

† రచయిత : వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7) గద్యము॥

ఓ యశ్విద్వయమా! ఏ నిమిత్తమై యీ స్తుతి, యీ వాక్యము, ప్రవర్తిల్లుచున్నవి. ఓ కామవర్షిద్వయమా! యీ శోభనస్తుతిని సేవింపుఁడు! ఈ కర్మయంతయు మిమ్ముఁ గోరుచు సంగత మగును. మీరు సర్వదా మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 621

## అనువాకః—5, సూక్తమ్—71

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) అప స్వసురుషసో నగ్జిహీతే రిణక్తి కృష్ణీరరుషాయ [1]పన్థామ్ ।
అశ్వామఘా గోమఘా వాం హువేమ దివా నక్తం శరుమస్మద్ యుయోతమ్ ॥ 615

(2) ఉపాయాతం దాశుషే మర్త్యాయ రథేన వామమశ్వినా వహన్తా ।
యుయుతమస్మదనిరామమీవాం దివా నక్తం మాధ్వీ త్రాసీథాం నః ॥ 616

(3) ఆ వాం రథమవమస్యాం వ్యుష్టౌ సుమ్నాయవో వృషణో వర్తయన్తు ।
స్యూమగభస్తిమృతయుగ్భిరశ్వైరాశ్వినా వసుమన్తం వహేథామ్ ॥ 617

1. పన్థా. (ప్రా.ప్ర.)

(4) యో వాం రథో నృపతీ[1] అస్తి వోఢ్హా త్రివన్ధురో వసుమాగ్ం[2] ఉస్రయామా ।

ఆ న[3] ఏనా నాసత్యోప యాతమభి యద్ వాం విశ్వప్స్న్యో జిగాతి ॥ 618

(5) యువం చ్యవానం జరసో௨ముముక్తం[4] ని పేదవ[5] ఊహథురాశుమశ్వమ్ ।

నిరంహసస్తమసః స్పర్తమత్రిం ని జాహుషం శిథిరే ధాతమన్తః ॥ 619

(6) ఇయం మనీషా ఇయమశ్వినా గీరిమాం సువృక్తిం వృషణా జుషేథామ్ ।

ఇమా బ్రహ్మాణి యువయూన్యగ్మన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 620

## అనువాకము—5, సూక్తము—71

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

భగిని యగు నుషస్సు సమీపమునుండి రాత్రి యపగత మగును. కృష్ణవర్ణ రాత్రి సూర్యాశ్వములగు నరుషులకు మార్గమును జూపెట్టును. కాఁబట్టి యోయశ్వధనమా! గో ధనాశ్వద్వయమా! మిమ్ముఁ బిలుచుచున్నాను. మీరు దివారాత్రులయందు హింసకులను సమీపమునుండి తొలగింపుఁడు! ॥ 622

1. నృపతీ௨అస్తి వోహ్యా, 2. వసుమాగ్ం௨ఉస్ర, 3. ఆ న௨ఏనా, 4. జరసో௨ముముక్త,

5. పేదవ௨ఊహ. (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

ఓ యశ్విద్వయమా! హవ్యదాయినిమిత్తము రథముపై రమణీయపదార్థములను వహించుచు
మీరు రండు! అన్నదారిద్ర్యమును రోగములను మా చెంతకు రాకుండఁజేయుఁడు!
మధువిశిష్టాశ్వద్వయమా! మీరు దివారాత్రములయందు మమ్ము
రక్షింపుచుండుఁడు! ॥ 623

(3) గద్యము॥

ఈ యాసన్నప్రాతఃకాలమున మీ రథమునకు సుఖముగఁ గూర్చిన యశ్వములు మిమ్ముఁ
గొనితెచ్చునుగాక! ఓ యశ్విద్వయమా! శుభకరము, రశ్మివిశిష్టము, ధనయుక్తమునగు
రథమును మీ యుదకప్రదాశ్వములు వహించును 624

(4) గద్యము॥

ఓ నృపతిద్వయమా! మీ యే రథము, వహనసమర్థము, బంధురత్రయవంతము,
ధనవంతము, దివసప్రీతిగామియునగునో! యే రథము వ్యక్తరూపమునఁ
బరుగిడునో! యట్టి మీ రథమునఁ గూర్చుండి మా చెంతకు రండు! 625

(5) గద్యము॥

ముదిమినుండి చ్యవనుని దప్పించితిరి. వేదుని నిమిత్తము శీఘ్రగామి యగు నశ్వమును
యుద్ధమునఁ బ్రేరేపించితిరి. అత్రిని పాపమునుండి, యంధకారమునుండి తప్పించితిరి.
యాహుసుని భ్రష్టరాజ్యమందు మరల స్థాపించితిరి ॥ 626

(6) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యీ వాక్యములు నీ స్తుతులు మీ నిమిత్తమే. ఓ యభీష్టవర్షిద్వయమా!
శోభనస్తుతిని సేవింపుఁడు! ఈ కర్మయంతయు మిమ్ముఁ గోరుచున్నది. మీరు
సర్వదా స్తుతులచే మమ్ము సంరక్షింపుఁడు! ॥ 627

## సూక్తమ్—72

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఆ గోమతా నాసత్యా రథేనాఽశ్వావతా పురుశ్చన్ద్రేణ యాతమ్ ।
అభి వాం విశ్వా నియుతః సచన్తే స్పార్హయా శ్రియా తన్వా శుభానా ॥ 621

(2) ఆ నో దేవేభిరుప యాతమర్వాక్ సజోషసా నాసత్యా రథేన ।
యువోర్హి నః సఖ్యా పిత్ర్యాణి సమానో బన్ధురుత తస్య విత్తమ్ ॥ 622

(3) ఉదు స్తోమాసో[1] అశ్వినోరబుధ్రంజామి బ్రహ్మాణ్యుషసశ్చ దేవీః ।
ఆవివాసన్ రోదసీ ధిష్ణ్యేమే[2] అచ్ఛా విప్రో నాసత్యా వివక్తి ॥ 623

(4) వి చేదుచ్ఛన్త్యశ్వినా[3] ఉషాసః ప్ర వాం బ్రహ్మాణి కారవో భరన్తే ।
ఊర్ధ్వం భానుం సవితా దేవో[4] అశ్రేద్ బృహదగ్నయః సమిధా జరన్తే ॥ 624

---

1. స్తోమాసోఽఅశ్వినో, 2. ధిష్ణ్యేమేఽఅచ్ఛా, 3. యశ్వినాఽఉషాసః, 4. దేవోఽఅశ్రేద్. (వా.ప.)

(5) ఆ పశ్చాతాన్నాసత్యా పురస్తాదాశ్వినా యాతమధరాదుదక్తాత్ ।

ఆ విశ్వతః పాంచజన్యేన రాయా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 625

## సూక్తము—72

ఋషి-—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! మీరు గవాశ్వధనములతో నింఁడిన రథముపై రండు! పెక్కు నియుత్తులు మిమ్ముల సేవించును. స్పృహణీయ శోభా శరీరములచే దీప్యమాను లగుఁడు! ॥ 628

(2) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! మీరు దేవగణములతో సమానప్రీతియుక్తులై రథము నధిరోహించి మా సమీపమున నుపస్థితుఁ లగుఁడు. మీకు మాకుఁగల బంధుత్వము పితృక్రమాగత మైనది. మన కుభయులకును బంధువు, పితామహుఁడు, నొక్కఁడే యని తెలియ నగును. మన ధన మొక్కటియే ॥ 629

(3) గద్యము॥

స్తుతిసమూహము నశ్విద్వయమును సుందరరూపమున జాగరితముగఁ జేయుచున్నది. మేధావి యగు వసిష్ఠుఁడు స్తోత్రార్హములగు ద్యావాభూములఁ బరిచర్యఁ జేయుచు నాసత్యుల కభిముఖముగనుండి స్తుతించుచున్నాఁడు ॥ 630

(4) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యుషస్సు సకల తమస్సును గొట్టినయెడల స్తోతలు విశేషముగ మిమ్ము వినుతింతురు. సవిత కూర్ధ్వమునఁ దేజస్సు నాశ్రయించును. అగ్ని దేవుఁడు విశేషముగ స్తవ మొనర్చును ॥ 631

(5) గద్యము॥

నాసత్యద్వయమా! పశ్చాద్దేశమునుండి, సమ్ముఖమునుండియు రండు! దక్షిణదిక్కునుండియు నుత్తరపుదిక్కునుండియు రండు! పంచశ్రేణులగు లోకులకు హితము సమకూర్చెడి యన్ని దిక్కులనుండియు దయసేయుఁడు! మీరు సర్వదా మమ్ము స్తుతులవలన సంరక్షింపుఁడు! ॥ 632

## సూక్తమ్—73

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) అతారిష్మ తమసస్పారమస్య ప్రతి స్తోమం దేవయన్తో దధానాః ।
పురుదంసా పురుతమా పురాజా[1] ఒమర్త్యా హవతే అశ్వినా గీః ॥ 626

(2) న్యు ప్రియో మనుషః సాది హోతా నాసత్యా యో యజతే వన్దతే చ ।
అశ్నీతం మధ్వో[2] అశ్వినా ఉపాక ఆ వాం వోచే విదథేషు ప్రయస్వాన్ ॥ 627

---

1. పురాజామర్త్యా హవతేఽఅశ్వినా, 2. మధ్వోఽఅశ్వినాఽఉపాకఽఆ వాం. (వ్రా.ప్ర.)

(3) అహేమ యజ్ఞం పథామురాణా[1] ఇమాం సువృక్తిం వృషణా జుషేథామ్ ।
శ్రుష్టీవేవ ప్రేషితో వామబోధి ప్రతి స్తోమైర్జరమాణో వసిష్ఠః ॥ 628

(4) ఉప త్యా వహ్నీ గమతో విశం నో రక్షోహణా సంభృతా వీళుపాణీ ।
సమన్ధాంస్యగ్మత మత్సరాణి మా నో మర్ధిష్టమా గతం శివేన ॥ 629

(5) ఆ పశ్చాతాన్నాసత్యా పురస్తాదాశ్వినా యాతమధరాదుదక్తాత్ ।
ఆ విశ్వతః పాంచజన్యేన రాయా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 630

## సూక్తము—73

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

మేము దేవాభిలాషులమై స్తుతించుచు నజ్ఞానమును బోఁగొట్టుకొనెదము. బహుకర్ములు ప్రభూత
తములు, పూర్వజాతులు నగు నశ్వులారా! స్తోతలు మిమ్ముఁ బిలుచుచున్నారు ॥ 633

1. రాణాఽఇమాం. (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

మీకుఁ బ్రియ భూతుం డగు మనుష్యుఁడు హోతగ నిచట నుపవిష్టుఁ డగుచున్నాఁడు.
ఓ నాసత్యద్వయమా! యాగ మొనర్చువారు, నమస్కరించువారు గలరు.
ఓ యశ్విద్వయమా! యట్టి వారి మధురసోమరసమును విక్రమించి
ద్రావుఁడు! యజ్ఞమందు నన్నవంతుఁడై మిమ్ముఁ బిలుచును ॥ 634

(3) గద్యము॥

మేము గొప్ప స్తోత్రకారులము. ఆగమనశీలు రగు దేవతలనిమిత్తము యజ్ఞ మభివృద్ధిచేయఁ
బడుచున్నది. అభీష్టవర్షిద్వయమా! యీ స్తుతిని సేవింపుఁడు! నేను వసిష్ఠుఁడను.
ద్రుతగామి యగు దూతవలె మీ సమీపమునఁ బ్రేరేపింపఁబడితిని.
స్తోత్రముద్వారా స్తుతించుచుఁ బ్రబోధితుఁడ నైతిని ॥ 635

(4) గద్యము॥

హవ్యవాహిద్వయము, రాక్షసఘాతిపుష్టాంగము, ధృఢపాణులు. వారు మా ప్రజలచెంత
కుపస్థితు లగుదురు. మీరు మదకరాన్నముతోఁ గూడుకొనుఁడు! మమ్ము
హింసింపకుఁడు! మంగళముతో రండు! ॥ 636

(5) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! పశ్చాద్దేశమునుండి సమ్ముఖమునుండి రండు! దక్షిణదిక్కునుండి
యుత్తరదిక్కునుండి దయ సేయుఁడు! పంచశ్రేణు లగు లోకులకు హితము
సమకూర్చెదు నన్ని దిక్కులనుండి విచ్చేయుఁడు! మీరు సర్వదా
మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 637

## సూక్తమ్—74

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—అశ్వినౌ

ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ఇమా[1] ఉ వాం దివిష్టయ[2] ఉస్రా హవన్తే అశ్వినా ।

అయం వామహ్వేఽవసే[3] శచీవసూ విశంవిశం హి గచ్ఛథః ॥ 631

(2) యువం చిత్రం దదథుర్భోజనం నరా చోదేథాం సూనృతావతే ।

అర్వాగ్రథం సమనసా ని యచ్ఛతం పిబతం సోమ్యం మధు ॥ 632

(3) ఆ యాతముప భూషతం మధ్వః పిబతమశ్వినా ।

దుగ్ధం పయో వృషణా జేన్యావసూ మా నో మర్ధిష్టమా గతమ్ ॥ 633

(4) అశ్వాసో యే వాముప దాశుషో గృహం యువాం దీయన్తి బిభ్రతః ।

మక్షూయుభిర్నరా హయేభిరశ్వినా ఽఽ దేవా యాతమస్మయూ ॥ 634

---

1. ఇమాఽఉ వాం, 2. దివిష్టయఽఉస్రా హవన్తేఽఅశ్వినా, 3. వామహ్వేవసే. (వా్రి.వ్రి.)

(5) అధా హ యన్తో[1] అశ్వినా పృక్షః సచన్త సూరయః ।
తా యంసతో మఘవద్భ్యో ధ్రువం యశశ్ఛర్దిరస్మభ్యం నాసత్యా ॥ 635

(6) ప్ర యే యయురవృకాసో రథా[2] ఇవ నృపాతారో జనానామ్ ।
ఉత స్వేన శవసా శూశువుర్నర[3] ఉత క్షియన్తి సుక్షితిమ్ ॥ 636

## సూక్తము—74

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

నివాసప్రదులగు నశ్విద్వయమా! యీ స్వర్గేచ్ఛుగణము మిమ్ముఁ బిలుచుచున్నారు.
ఓ కర్మధన ద్వయమా! రక్షణనిమిత్తమై నేను మిమ్ముఁ బిలుచుచుండుటను
మీరు ప్రజల సన్నిధికి వచ్చుచుండుఁడు! ॥ 638

(2) గద్యము॥

ఓయశ్విద్వయమా! మీకే చిత్రధనముగలదో! దానిని స్తుతివంత మగు వ్యక్తి సమీపమునకుఁ
బ్రేరేపింపుఁడు! మీ రేక మనస్సుగలవారలై మి రథమును మా కభిముఖముగఁ
ద్రోలుఁడు! సోమరస సంబంధ మగు మధువును ద్రావుఁడు! ॥ 639

1. యన్తో౽అశ్వినో, 2. రథా౽ఇవ, 3. శూశువుర్నర౽ఉత. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు దయ సేయుఁడు! సమీపమున విశ్రమింపుఁడు! అభీష్టవర్షి యగు ధనంజయద్వయమా! మీరు పయోదోహమును జేయుఁడు! మాకు హింసలను గల్పింపకరండు! ॥ 640

(4) గద్యము॥

మీ యశ్వములు హవ్యదాతృగృహమందు మిమ్ము ధరించుచుఁ బోవును. నృ నేత లగు నో యశ్విద్వయమా! మమ్ముఁ గామించి శీఘ్రగాము లగు నశ్వసాహాయ్యమున రండు! ॥ 641

(5) గద్యము॥

ఓ యశ్విద్వయమా! గమనకారి యగు స్తోతృగణము ప్రభూతాన్నమును సేవించును. మీరు మాకు నవిచలితయశస్సును, గృహమును, నొసంగుఁడు! ఓ నాసత్యద్వయమా! మేము ధనవంతులము ॥ 642

(6) గద్యము॥

ఎవరు పరకీయధనమును గ్రహింప మనుష్యులమధ్యను మనుష్యరక్షకులై మీ సన్నిధికి రథమువలె వచ్చెదరో! వారి నిజబలము వర్ధిత మగును. వారు సునివాస స్థానమునకుఁ జనెదరు ॥ 643

## సూక్తమ్—75

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) వ్యుషా¹ ఆవో దివిజా ఋతేనాఽఽవిష్కృణ్వానా మహిమానమాగాత్ ।
అప² ద్రుహస్తమ ఆవరజుష్టమంగిరస్తమా పథ్యా³ అజీగః ॥ 637

(2) మహే నో⁴ అద్య సువితాయ బోధ్యుషో మహే సౌభగాయ ప్ర యన్ధి ।
చిత్రం రయిం యశసం ధేహ్యస్మే దేవి మర్తేషు మానుషి శ్రవస్యుమ్ ॥ 638

(3) ఏతే⁵ త్యే భానవో దర్శతాయాశ్చిత్రా⁶ ఉషసో అమృతాస ఆగుః ।
జనయన్తో దైవ్యాని వ్రతాన్యాపృణన్తో⁷ అన్తరిక్షా వ్యస్థుః ॥ 639

(4) ఏషా స్యా యుజానా పరాకాత్ పంచ క్షితీః పరి సద్యో జిగాతి ।
అభిపశ్యన్తీ వయునా జనానాం దివో దుహితా భువనస్య పత్నీ ॥ 640

---

1. షాఽఆవోదివిజాఽఋతేనా, 2. ఉపద్రుహస్తమఽఆవర, 3. పథ్యాఽఅజీగః, 4. నోఽఅద్య, 5. ఏతే స్యే, 6. చిత్రాఽఉషసోఽఅమృతాసఽఅగుః, 7. పృణన్తోఽఅన్తరిక్షా. (ప్రా.ప్ర.)

(5) వాజినీవతీ సూర్యస్య యోషా చిత్రామఘా రాయ[1] ఈశే వసూనామ్ ।
ఋషిష్టుతా జరయన్తీ మఘోన్యుషా[2] ఉచ్ఛతి వహ్నిభిర్గృణానా ॥ 641

(6) ప్రతి ద్యుతానామరుషాసో[3] అశ్వాశ్చిత్రా అదృశ్రన్నుషసం వహన్తః ।
యాతి శుభ్రా విశ్వపిశా రథేన దధాతి రత్నం విధతే జనాయ ॥ 642

(7) సత్యా సత్యేభిర్మహతీ మహద్భిర్దేవీ దేవేభిర్యజతా యజత్రైః ।
రుజద్ [4]దృళ్హాని దదదుస్రియాణాం ప్రతి గావ[5] ఉషసం వావశన్త ॥ 643

(8) నూ నో గోమద్ వీరవద్ ధేహి రత్నముషో[6] అశ్వావత్ పురుభోజో[7] అస్మే ।
మా నో బర్హిః పురుషతా నిదే కర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 644

---

1. రాయఽఈశే, 2. న్యుషాఽఉచ్ఛతి 3. మరుషాసోఽఅశ్వాశ్చిత్రాఽఅదృశ్రన్ను, 4. దృహ్ళాని,
5. గావఽఉషసం, 6. రత్నముషోఽఅశ్వావత్, 7. భోజోఽఅస్మే. (వ్రా.ప్ర.)

## సూక్తము—75

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఉషస్సు

(1) గద్యము॥

ఉష స్సంతరిక్షమందుఁ బ్రాదుర్భవించి ప్రకాశమును బుట్టించుచున్నది. అది తేజోబలమువలనఁ దమ మహిమ నావిష్కృతముగ నొనర్చుచు వచ్చును. అప్రియమును, శత్రువును నగు నంధకారమును దూరీకృతము చేయును. గంతవ్య మార్గమును విశేషముగాఁ బ్రకాశింపఁజేయును ॥ 644

(2) గద్యము॥

ఇపుడు మాకు సుఖము కలుఁగుటకై ప్రబుద్ధ మగుము. ఓ యుషస్సా! మహాసౌభాగ్యము నిమ్ము! విచిత్రయశోయుక్త మగు ధనమును మా నిమిత్తము ధరింపుము! మనుష్యులకు హితముఁ గూర్చెడు నో దేవీ! మనుష్యులకు ధనవంతు లగు పుత్రుల నొసంగుము ॥ 645

(3) గద్యము॥

దర్శనీయ మగు నుషస్సుయొక్క ప్రవృద్ధములు, విచిత్రములు, నశ్వరములు నగు రశ్మలు దేవతలకు వ్రతోత్పాదనమును జేయుచు నంతరిక్షము నంతయు నింపుచు వచ్చును. మరియు వివిధవిధముల నేతెంచును ॥ 646

(4) గద్యము॥

ద్యో లోకదుహితయు, భువనపాలయిత్రియు నగు నుషస్సు ప్రాణుల ప్రజ్ఞాన సమూహమును నభిదర్శించి దూరమునుండి యుద్యోగించుచుఁ బంచశ్రేణుల నికటమునకు వచ్చును ॥ 647

(5) గద్యము॥

అన్నవతియు,-సూర్యగృహిణియు, విచిత్రధనవతియునైన యుషస్సు ధనవసువులకు నీశ్వరి యగుచున్నది. ఋషులను స్తుతించునదియును, ముదిమిని గలుఁగఁ జేయునదియు, ధనవతియు నగు నుషస్సు యజమానులచే నుతియింపఁబడి ప్రభాతమును గలుఁగఁజేయుచున్నది. 648

(6) గద్యము॥

దీప్తిమతి యగు నుషస్సును నేవి వహించునో! యట్టి యుజ్జ్వల విచిత్రాశ్వసమూహము చూడఁబడుచుండును. ఆ యుషస్సు దీప్తి గలదియై బహురూప రథముపైఁ బోవుచుండును. బహువిచిత్రకారి యగు మనుష్యులకు రత్నముల నొసంగును॥ 649

(7) గద్యము॥

సత్యయు, మహతియు, యజనీయయు నగు నుషోదేవి సత్యరూపులు, మహాత్ములు, యజనీయులు నగు దేవతలతోఁగూడి యత్యంతము స్థిర మగు నంధకారమును భేదించును. గోవు లన్నియు సంచరించుటకు లోకము నొసంగును. గోవు లన్నియు నుషస్సును గోరుచుండును॥ 650

(8) గద్యము॥

ఓ యుషస్సా! గో విశిష్టము, వీర విశిష్టము, నశ్వ విశిష్టమునగు ధనమును మా కిమ్ము! బహ్వన్నమును బ్రసాదింపుము! పురుషులలో మా యజ్ఞమును నిందింపకుము! నీవు సర్వదా మమ్ముల స్తుతులచేఁ బరిపాలింపుము!॥ 651

## సూక్తమ్—76

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) ఉదు జ్యోతిరమృతం విశ్వజన్యం విశ్వానరః సవితా దేవో[1] అశ్రేత్ ।
క్రత్వా[2] దేవానామజనిష్ట చక్షురావిరకర్భువనం విశ్వముషాః ॥ 645

(2) ప్ర మే పన్థా దేవయానా[3] అదృశ్రన్నమర్ధన్తో వసుభిరిష్కృతాసః ।
అభూదు కేతురుషసః పురస్తాత్ ప్రతీచ్యాగాదధి హర్మ్యేభ్యః ॥ 646

(3) తానీదహాని బహులాన్యాసన్ యా ప్రాచీనముదితా సూర్యస్య ।
యతః పరి జారః[4] ఇవాచరన్త్యుషో దదృక్షే న పునర్యతీవ ॥ 647

(4) త[5] ఇద్ దేవానాం సధమాద[6] ఆసన్నృతావానః కవయః పూర్వ్యాసః ।
[7]గూళ్హం జ్యోతిః పితరో[8] అన్వవిన్దన్ త్సత్యమన్త్రా[9] అజనయన్నుషాసమ్ ॥ 648

---

1. దేవోఽఅశ్రేత్, 2. ఋత్వా దేవానా, 3. దేవయానాఽఅదృశ్రి, 4. జారఽఇవా, 5. తఽఇద్,
6. మాదఽఆసన్నృ 7. గూహ్యం, 8. పితరోఽఅన్వ, 9. మన్త్రాఽఅజన. (ప్రా.ప్ర.)

(5) సమాన[1] ఊర్వే అధి సంగతాసః సం జానతే న యతన్తే మిథస్తే ।
తే దేవానాం న మినన్తి వ్రతాన్యమర్ధన్తో వసుభిర్యాదమానాః ॥ 649

(6) ప్రతి త్వా స్తోమైరీళతే వసిష్ఠా[2] ఉషర్బుధః సుభగే తుష్టువాంసః ।
గవాం నేత్రీ వాజపత్నీ న[3] ఉచ్ఛోషః సుజాతే ప్రథమా జరస్వ ॥ 650

(7) ఏషా నేత్రీ రాధసః సూనృతానాముషా[4] ఉచ్ఛన్తీ రిభ్యతే వసిష్ఠైః ।
దీర్ఘశ్రుతం రయిమస్మే దధానా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 651

## సూక్తము—76

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఉషస్సు

(1) గద్యము॥

సకలనేత యగు సవిత యూర్ధ్వదేశమందు నాశనములేనిది,సర్వజన హితకరమైనదియు నగు జ్యోతిస్సును నాశ్రయించును. వాఁడు దేవతాకర్మనిమిత్తము ప్రాదుర్భూతుఁ డగును. ఉషస్సు చక్షుస్స్వరూపమై సమస్త భువనములను నావిష్కృతములుగాఁ జేయును ॥ 652

1. సమానఽఊర్వేఽఅధి, 2. వసిష్ఠాఽఉష, 3. నఽఉచ్ఛోషః, 4. ముషాఽఉచ్ఛన్తీ (ప్రా.ప్ర.)

(2) గద్యము॥

నేను హింసాశూన్య మగు తేజస్సుద్వారా సంస్కృత మగు దేవయాన మార్గమును దర్శించితిని. ఉషఃకేతువు పూర్వదిక్కునందుఁ గలదు. ఉషస్సు మా కభిముఖమై యున్నత ప్రదేశమునుండి యేతెంచును ॥ 653

(3) గద్యము॥

ఓ యుషస్సా! యే తేజస్సు సూర్యోదయమునకు ముం దుదయమగునో! యెవరి గుణము వలన నీవు కులటవలెఁగాక పతిసమీపగామిని యగు రమణివలెఁ జూడఁబడుదువో! నీ యా తేజస్సు ప్రభూత మైనది ॥ 654

(4) గద్యము॥

ఏ యంగిరోగణము సత్యవంతులు,కవులు, పూర్వకాలీనపితలు నగుచుండిరో! యెవరు గూఢ జ్యోతిస్సును గలుఁగఁజేయుదురో! యట్టివారు వ్యర్థములుగాని మంత్రములచే నుషస్సులను ప్రాదుర్భవింపఁజేయుదురు. వారలే దేవతలతో నెల్లచోటులను నప్రమత్తు లగుదురు ॥ 655

(5) గద్యము॥

అవి సాధారణ గోసమూహమునిమిత్తము సంగతములై యేకబుద్ధి గలవి యగుచున్నవి. అయ్యవి పరస్పరయత్నములను జేయలేదా? అవి దేవకర్మలను హింసింపలేదు. ఆయ్యవి హింసారహితములు, వాసప్రదములు నగు కిరణములద్వారా పోవును ॥ 656

(6) గద్యము॥

ఓ శుభగోషస్సా! నిన్నుఁ బ్రాతఃకాలమందు జాగరిత స్తుతికారు లగు వశిష్ఠులు స్తోత్రములచే నుతింతురు. నీవు గోవుల నందఁజేయుదువు. అన్నము నిచ్చెదవు. మా నిమిత్తము ప్రాతఃకాలముఁ జేయుము! ఓ సుజాతోషస్సా! నీవు మొట్టమొదట స్తుతింపఁబడుము! 657

(7) గద్యము॥

ఈ యుషస్సు స్తోతృసూనృతవాక్యములకు నేత్రియై తమోవిదారణమును గావించుచు నంతటఁ ప్రసిద్ధధనమును మా కొసంగి వశిష్ఠులచే స్తుతింపఁబడుచున్నది. మీరు సర్వదా స్తుతులచే మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 658

## సూక్తమ్—77

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) ఉపో రురుచే యువతిర్న యోషా విశ్వం జీవం ప్రసువన్తీ చరాయై ।
అభూదగ్నిః సమిధే మానుషాణామకర్జ్యోతిర్బాధమానా తమాంసి ॥ 652

(2) విశ్వం ప్రతీచీ సప్రథా[1] ఉదస్థాద్ రుశద్ వాసో బిభ్రతీ శుక్రమశ్వైత్ ।
హిరణ్యవర్ణా సుదృశీకసందృగ్ గవాం మాతా నేత్ర్యహ్నామరోచి ॥ 653

(3) దేవానాం చక్షుః సుభగా వహన్తీ శ్వేతం నయన్తీ సుదృశీకమశ్వమ్ ।
ఉషా[2] అదర్శి రశ్మిభిర్వ్యక్తా చిత్రామఘా విశ్వమను ప్రభూతా ॥ 654

---

1. సప్రథాఽఉదస్థాద్, 2. ఉషాఽఅదర్శి. (ప్రా.ప్ర.)

(4) అన్తి వామా దూరే[1] అమిత్రముచ్ఛోర్వీం గవ్యూతిమభయం కృధీ నః ।
యావయ ద్వేష[2] ఆ భరా వసూని చోదయ రాధో గృణతే మఘోని ॥ 655

(5) అస్మే శ్రేష్ఠేభిర్భానుభిర్వి భాహ్యుషో దేవి [3]ప్రతిరన్తీ న ఆయుః ।
ఇషం చ నో దధతీ విశ్వవారే గోమదశ్వావద్ రథవచ్చ రాధః ॥ 656

(6) యాం త్వా దివో దుహితర్వర్ధయన్త్యుషః సుజాతే మతిభిర్వసిష్ఠాః ।
సాస్మాసు ధా రయిమృష్వం బృహన్తం యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 657

## సూక్తము—77

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఉషస్సు

(1) గద్యము॥

యువతియగు యోషవలె నుషస్సు సమస్త జీవములను సంచరణార్థము ప్రేరేపించుచు సూర్యసమీపమున దీప్త యగుచుండును. అగ్ని మనుష్యులనిమిత్త మింధన యోగ్య మగును. అంధకారనాశక మగు జ్యోతిస్సును గలుఁగఁజేయుచుండును ॥ 659

1. దూరేఽఅమిత్రముచ్ఛోర్వీం, 2. ద్వేషఽఆ భరా, 3. ప్రతరన్తీ నఽఆయుః. (వ్రా.ప్ర.)

(2) గద్యము॥

సమస్తజగదభిముఖియు, సర్వత్ర ప్రథితము నగు నుషస్సు పుట్టుచుండును. తేజోమయ వసనమును ధరించుచు వర్ధిత య్యగును. హిరణ్యవర్ణయు, దర్శనీయయుఁ, దేజో విశిష్టయు నగు మాతయు, దివసములకు నేత్రియు నగు నుషస్సు శోభించుచుండును ॥ 660

(3) గద్యము॥

దేవతల చక్షుర్దర్శనీయతేజస్సును వహించుచు, సుభగము లగు స్వకీయకిరణముల వెల్గించుచు విచిత్ర ధన విశిష్టయై జగత్సంబంధమునఁ బ్రభూత యగు నుషస్సు సుదర్శనాశ్వములను శ్వేతవర్ణములుగాఁ జేయుచుఁ జూపట్టును ॥ 661

(4) గద్యము।

ఓ యుషస్సా! నీవు సమీపమున విచిత్ర ధనము గలదానవై యమిత్రులను వెడలఁగొట్టుచుఁ బ్రభాత మగుము! మా విస్తీర్ణ గోప్రచరణ భూములను భయశూన్యములుగా నొనర్పుము! శత్రువుల ధనమును హరించి తెమ్ము! ఓ ధనవతీ! స్తుతికారులకడకు ధనమును బ్రేరేపింపుము! ॥ 662

(5) గద్యము॥

ఓ యుషోదేవీ! మా యాయువును వృద్ధిఁ బొందించుచు శ్రేష్ఠరశ్మిసహితవై శ్రేష్ఠరశ్ములతో మా నిమిత్తమగు ప్రభాత మగుము! ॥ 663

(6) గద్యము॥

ద్యో లోక దుహిత యగు నోనుషస్సా!సుజాతా! వసిష్ఠగణము మిమ్ము వృద్ధిఁ బొందించును. నీవు మాకు రమణీయధనము నిమ్ము! నీవు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుము! ॥ 664

## సూక్తమ్—78

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) ప్రతి కేతవః ప్రథమా[1] అదృశ్రన్నూర్ధ్వా అస్యా అంజయో వి శ్రయన్తే ।
ఉషో[2] అర్వాచా బృహతా రథేన జ్యోతిష్మతా వామమస్మభ్యం వక్షి ॥ 658

(2) ప్రతి షీమగ్నిర్జరతే సమిద్ధః ప్రతి విప్రాసో మతిభిర్గృణన్తః ।
ఉషా యాతి జ్యోతిషా బాధమానా విశ్వా తమాంసి దురితాప దేవీ ॥ 659

(3) ఏతా[3] ఉ త్యాః ప్రత్యదృశ్రన్[4] పురస్తాజ్జ్యోతిర్యచ్ఛన్తీరుషసో విభాతీః ।
అజీజనన్ త్సూర్యం యజ్ఞమగ్నిమపాచీనం తమో[5] అగాదజుష్టమ్ ॥ 660

(4) అచేతి[6] దివో దుహితా మఘోనీ విశ్వే పశ్యన్త్యుషసం విభాతీమ్ ।
[7]ఆస్థాద్ రథం స్వధయా యుజ్యమానమా యమశ్వాసః సుయుజో వహన్తి ॥ 661

---

1. ప్రథమాఽఅదృశ్రన్నూర్ధ్వాఽఅస్యా, 2. ఉషోఽఅర్వాచా, 3. ఏతాఽఉ, 4. దృశన్పుర, 5. తమోఽఅగా, 6. ఉచేతి, 7. అస్థాద్. (ప్రా.ప్ర.)

(5) ప్రతి త్వాద్య సుమనసో బుధన్తాఽస్మాకాసో మఘవానో వయం చ ।
తిల్విలాయధ్వముషసో [1]విభాతీర్యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 662

## సూక్తము—78

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఉషస్సు

(1) గద్యము॥

ప్రథమ కేతు వందఱిచేతను జూడఁబడును. ఏతద్వ్యంజ రశ్మి లన్నియు నూర్ధ్వముఖముగ నంతట నాశ్రయించుచున్నవి. ఓ యుషోదేవీ! మా కభిముఖముగ వచ్చునదియు, బృహత్తును, జ్యోతిష్మంతము నగు రథముద్వారా మాకొఱకు వరణీయ ధనమును గొనితెమ్ము! ॥ 665

(2) గద్యము॥

అగ్ని సమిద్ధుఁడై సర్వత్ర వృద్ధి బొందుచున్నాఁడు. మేధావులు స్తుతులచే నుషస్సును స్తుతించుచు నభివృద్ధిఁ బొందుచున్నారు. ఉషోదేవి జ్యోతిస్సుచే నంధకారమును బటాపంచలు గావించుచు దురితమును బోఁగొట్టుచుఁ బోవుచుండును ॥ 666

(3) గద్యము॥

ప్రభాతములను జేయునవియు, జ్యోతిఃప్రదాయిను లగునవియు నగు నుషస్సు లంతటను గోచర మగును. అయ్యవి సూర్యుని, నగ్నిని, యజ్ఞమును, గలుగఁజేయును. వానివలన నీచగామి యగు నంధస్సు పోవుచుండును ॥ 667

---

1. విభాతిర్యూయం. (వ్రా.ప్ర.)

(4) గద్యము॥

ద్యో లోక దుహితయు ధనవతియు నగు నుష స్సుదయించును. ప్రభాతకారిణి యగు నుషస్సు నందఱుఁ గనుచుందురు. అది యన్నయుక్త మగు రథము నధిరోహించును.
సుయుక్తము లగు నశ్వము లీ రథమును లాగును ॥ 668

(5) గద్యము॥

ఓ యుషస్సా! మీకు మాకు సుమనస్సులు, ధనవంతములు నగు సకలలోకము లిపుడు మిమ్ముఁ బ్రతిబోధించుచున్నవి. ఓ యుషోగణమా! మీరు ప్రభాతకారులై జగత్తులను స్నిగ్ధములుగా నొనర్పుఁడు! మీరు సర్వదా మమ్ము స్తుతి ద్వారా పరిపాలింపుఁడు! ॥ 669

## సూక్తమ్—79

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) వ్యు॒ఽగా॑[1] ఆవః ప॒థ్యా॒ జనా॑నాం పంచ క్షి॒తీర్మాను॑షీర్బో॒ధయ॑న్తీ ।
సు॒సం॒దృగ్భి॑రు॒క్షభి॑ర్భా॒నుమ॑శ్రేద్[2] వి సూర్యో॒ రోద॑సీ॒ చక్ష॑సావః ॥ 663

(2) వ్యం॑జతే ది॒వో[3] అ॒న్తే॑ష్వ॒క్తూన్ విశో॒ న యు॒క్తా[4] ఉ॒షసో॑ యతన్తే ।
సం తే॒ గావ॒స్తమ॒[5] ఆ వ॑ర్తయ॒న్తి జ్యోతి॑ర్యచ్ఛన్తి సవి॒తేవ॑ బా॒హూ ॥ 664

---

1. ఽగా॑ఽఆవః, 2. దృగ్భిరుక్ష, 3. ది॒వో॑ఽఅ॒న్తే, 4. యు॒క్తా॑ఽఉ॒షసో, 5. త॒మ॒ఽఆ వ॑ర్త. (వాక్య.పద్య.)

(3) అభూదుషా[1] ఇన్ద్రతమా మఘోన్యజీజనత్ సువితాయ శ్రవాంసి ।

వి దివో దేవీ దుహితా దధాత్యంగిరస్తమా సుకృతే వసూని ॥ 665

(4) తావదుషో రాధో[2] అస్మభ్యం రాస్వ యావత్ స్తోతృభ్యో[3] అరదో గృణానా ।

యాం త్వా జజ్ఞుర్వృషభస్యా రవేణ వి దృళ్హస్య దురో[4] అద్రేరౌర్ణోః ॥ 666

(5) దేవందేవం రాధసే చోదయన్త్యస్మద్ర్యక్ సూనృతా[5] ఈరయన్తీ ।

వ్యుచ్ఛన్తీ నః సనయే ధియో ధా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 667

## సూక్తము—79

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఉషస్సు

(1) గద్యము॥

మనుష్యులకు హితకర మగు నుషస్సు తమోనాశన మొనర్చును. ఉత్తమతేజో విశిష్ట మగు కిరణ సమూహముచే సూర్యు నాశ్రయించును. సూర్యుఁడు తేజస్సుచే **ద్యావాభూముల నావరించుచున్నాఁడు** ॥ 670

---

1. దుషా॰ఇన్ద్ర, 2. రాధో॰అస్మ, 3. స్తోతృభ్యో॰అరదో, 4. దురో॰అద్రేరౌర్ణోః,

5. సూనృతా॰ఈరయన్తీ. (వ్రా.ప్ర.)

(2) గద్యము॥

ఉషోగణ మంతరిక్షప్రాంతమందుఁ దేజస్సును వ్యక్తపరచును. పరస్పరము మిళితు లగు
ప్రజలవలెఁ బ్రవర్తించుచుండును. వాని రశ్మి లంధకారమును బారద్రోలును.
సూర్యుఁడు బాహుద్వయము వలె జ్యోతిస్సు నొసంగును ॥ 671

(3) గద్యము॥

సర్వాపేక్షచే నీశ్వరియు, ధనవతియు నగు నుషస్సు ప్రాదుర్భవించును. కళ్యాణము నిమిత్త
మన్న ముత్పాదించును. స్వర్గదుహితయు సర్వాపేక్షచే నుత్కృష్టాంగిరస్సును
నగు నుషోదేవి సుకర్మకారులకై ధనమును ధరించును ॥ 672

(4) గద్యము॥

ఓ యుషస్సా! పూర్వపు స్తోతల కెంత ధన మొసంగితివో! మాకును నంత ధన మీయుము!
ఉషస్సు వృషభమువలె వరముద్వారా ప్రాణిగణములను దెలియుటకు సమర్థము.
దృఢాద్రిద్వారములను వివృతముగా నొనర్చును ॥ 673

(5) గద్యము॥

నీవు సర్వస్తోతలను ధనార్థము ప్రేరేపించుచు మా కభిముఖముగ సూనృత వాక్యములను
బ్రేరేపించుచుఁ దమో వినాశినివై మాకు దాన మొసంగుటకు బుద్ధిని స్థిరముగాఁ
జేయుము! నీవు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుము! ॥ 674

## సూక్తమ్—80

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఉషసః
ఛందః—త్రిష్టుప్

(1) ప్రతి స్తోమేభిరుషసం వసిష్ఠా గీర్భిర్విప్రాసః[1] ప్రథమా అబుధ్రన్ ।
వివర్తయన్తీం రజసీ సమన్తే[2] ఆవిష్కృణ్వతీం భువనాని విశ్వా ॥ 668

(2) ఏషా స్యా నవ్యమాయుర్దధానా గూఢ్వీ తమో జ్యోతిషోషా[3] అబోధి ।
అగ్ర[4] ఏతి యువతిరహ్రయాణా ప్రాచికితత్ సూర్యం యజ్ఞమగ్నిమ్ ॥ 669

(3) అశ్వావతీర్గోమతీర్న[5] ఉషాసో వీరవతీః సదముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 670

ఇతి
పంచమోఽష్టకే పంచమోఽధ్యాయ
స్సమాప్తః

---

1. ప్రాసఃఽప్రథమాఽఅబుధ్రన్, 2. సమన్తేఽఆవిష్కృణ్వతీం, 3. జ్యోతిషోషాఽఅబోధి,
4. అగ్రఽఏతి, 5. గోమతీర్నఽఉషాసో. (వ్రా.ప్ర.)

## సూక్తము—80

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఉషస్సు

(1) గద్యము॥

విప్రవసిష్ఠగణ మందఱికంటె ముందు స్తోమములచేతను, స్తవములచేతను, నుషోదేవిని వృద్ధిఁ బొందించును. ఉషస్సు సమానప్రీతి యుక్తము లగు ద్యావాభూములను వ్యవర్తితములుగా నొనర్చును. సమస్త భూతజాతములను బ్రకాశితములుగాఁ జేయును ॥ 675

(2) గద్యము॥

ఈ యుషస్సు నవస్త్రీయౌవనమును ధరించుచు జ్యోతిస్సుచే గూఢ తమస్సును నంతరింపఁ జేయుచు జాగరిత మగును. లజ్జాహీన యగు యువతివలె నది సూర్యున కభిముఖముగఁ బోవును. సూర్యుని యజ్ఞమును నగ్నిని జ్ఞాపితములుగాఁ జేయును ॥ 676

(3) గద్యము॥

బహ్వశ్వములు, బహుగోవిశిష్టములు, స్తుతియోగ్యములు నగు నుషస్సులు సర్వ తమో వినాశన మొనర్చునుగాక! అవి జల దోహనమును జేయును. సర్వత్ర ప్రవృద్ధము లగును మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 677

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమునఁ బంచమాధ్యాయము
సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## సప్తమం మండలమ్
### పంచమోఽష్టకః—షష్ఠోఽధ్యాయః

### సూక్తమ్—81

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—ఉషసః

ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ప్రత్యు[1] అదర్శ్యాయత్యు౧చ్ఛన్తీ దుహితా దివః ।
అపో మహి వ్యయతి చక్షసే తమో జ్యోతిష్కృణోతి సూనరీ ॥ 671

(2) ఉదుస్రియాః సృజతే సూర్యః సచాగ్ం[2] ఉద్యన్నక్షత్రమర్చివత్ ।
తవేదుషో వ్యుషి సూర్యస్య చ సం భక్తేన గమేమహి ॥ 672

---

1. ప్రత్యుఽఅదర్శ్యాయ, 2. సచాగ్ంఽఉద్యన్న. [వ్రా.ప్ర.]

(3) ప్రతి త్వా దుహితర్దివ[1] ఉషో జీరా అభుత్స్మహి ।
యా వహసి పురు స్పార్హం వనన్వతి రత్నం న దాశుషే మయః ॥ 673

(4) ఉచ్ఛన్తీ యా కృణోషి మంహనా మహి ప్రఖ్యై దేవి స్వర్దృశే ।
తస్యాస్తే రత్నభాజ[2] ఈమహే వయం స్యామ మాతుర్న సూనవః ॥ 674

(5) తచ్చిత్రం రాధ[3] ఆ భరోషో యద్ ధీర్ఘశ్రుత్తమమ్ ।
యత్ తే దివో దుహితర్మర్తభోజనం తద్ రాస్వ భునజామహై ॥ 675

(6) [4]శ్రవః సూరిభ్యో అమృతం వసుత్వనం వాజాగ్ం[5] అస్మభ్యం గోమతః ।
చోదయిత్రీ మఘోనః సూనృతావత్యుషా[6] ఉచ్ఛదప స్రిధః ॥ 676

---

1. దివ‿ఉషో జీరా‿అభు, 2. భాజ‿ఈమహే, 3. రాధ‿ఆ, 4. శ్రవం సూరిభ్యో‿అమృతం, 5. వాజాగ్ం‿అస్మభ్యం, 6, వత్యుషా‿ఉచ్ఛ. (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము—షష్ఠాధ్యాయము

### సూక్తము—81

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు

దేవత—ఉషస్సు

(1) గద్యము॥

తమోనివారిణియు, ద్యో లోక దుహితయు నగు నుషోదేవి వచ్చును. చూడఁబడును. అయ్యది దర్శనార్థము తమస్సు నపావృతము గావించును. మనుష్యులకు నేత్రియై జ్యోతిస్సును వికసింపఁజేయును ॥ 678

(2) గద్యము॥

సూర్యుఁడు రశ్మిసమూహము నొక్కమా రుద్గతము గావించును. ఓ యుషస్సా! నీయొక్కయు సూర్యునియొక్కయుఁ బ్రకాశము కలిఁగినచో నన్న మందఁగలము ॥ 679

(3) గద్యము॥

ద్యో లోక దుహితయగు నో యుషస్సా! మేము క్షిప్రకారులమై మిమ్మలను బ్రతిబుద్ధులుగాఁ జేయుదుము. ఓ ధనవతీ! స్పృహణీయం బగు బహుధనమును వహింపుము! ఈ జనులకు రత్నములను, సుఖమును, నొసంగుము! ॥ 680

(4) గద్యము॥

ఓ మహాదేవీ! నీవు తమో నివారిణివి. మహిమ యుతవు. నీవు ప్రబోధనార్థము దర్శనార్థము సర్వ జగంబులను ప్రేరేపింపుము! నీవు రత్న భాక్కు-వు. కాన నిన్ను యాచించుచున్నాము. పుత్రులు తల్లికిఁ బ్రియు లగునట్లు మేము నీకుఁ బ్రియుల మగుదుము ॥ 681

(5) గద్యము॥

ఓ యుషస్సా! యే ధనము దూర స్థానమందుఁ బ్రశస్తమో! యట్టి విచిత్రధనమును దెమ్ము! ఓ ద్యో లోక దుహితా! మనుష్య భోగయోగ్య మగు నే యన్నము నీకుఁ గలదో! దానిని నిమ్ము! అది మే మనుభవింతుము ॥ 682

(6) గద్యము॥

ఓ యుషస్సా! స్తోతలకు మరణరహితము, వాసప్రదము, నగు ప్రశస్తయశస్సును బ్రసాదింపుము! బహు గో విశిష్టమగు నన్నమును మా కొసంగుము! యాజమాన ప్రేరయిత్రియు సూనృతవాక్య విశిష్టయు నగు నుషస్సు శత్రువులను బారఁద్రోలుఁగాక! ॥ 683

## సూక్తము—82

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రావరుణౌ
ఛందః—జగతీ

(1) ఇన్ద్రావరుణా యువమధ్వరాయ నో విశే జనాయ మహి శర్మ యచ్ఛతమ్ ।
దీర్ఘప్రయజ్యుమతి యో వనుష్యతి వయం జయేమ పృతనాసు దూఢ్యః ॥ 677

(2) సమ్రాళన్యః స్వరాళన్య[1] ఉచ్యతే వాం మహాన్తావిన్ద్రావరుణా మహావసూ ।
విశ్వే దేవాసః పరమే వ్యోమని[2] సం వామోజో వృషణా సం బలం దధుః ॥ 678

(3) అన్వపాం[3] ఖాన్యతృన్తమోజసా సూర్యమైరయతం దివి ప్రభుమ్ ।
ఇన్ద్రావరుణా మదే[4] అస్య మాయినో ఽపిన్వతమపితః పిన్వతం ధియః ॥ 679

(4) యువామిద్ యుత్సు పృతనాసు వహ్నయో యువాం క్షేమస్య ప్రసవే మితజ్ఞవః ।
ఈశానా వస్వ[5] ఉభయస్య కారవ ఇన్ద్రావరుణా సుహవా హవామహే ॥ 680

(5) ఇన్ద్రావరుణా యదిమాని చక్రథుర్విశ్వా జాతాని భువనస్య మజ్మనా ।
క్షేమేణ మిత్రో వరుణం దువస్యతి మరుద్భిరుగ్రః శుభమన్య[6] ఈయతే ॥ 681

(6) మహే శుల్కాయ వరుణస్య ను త్విష[7] ఓజో మిమాతే ధ్రువమస్య యత్ స్వమ్ ।
అజామిమన్యః శ్నథయన్తమాతిరద్ దభ్రేభిరన్యః ప్ర వృణోతి భూయసః ॥ 682

---

1. స్వరాళస్య౨ఉచ్యతే, 2. వ్యోమాని, 3. అన్వపాఖాం, 4. మదే౨అస్య,
5. వస్వ౨ఉభయస్య కారవ౨ఇన్ద్రా, 6. మన్య౨ఈయతే, 7. త్విష౨ఓజో. (ప్రా.ప్ర.)

(7) న తమంహో న దురితాని [1]మర్త్యమిన్ద్రావరుణా న తపః కుతశ్చన ।
యస్య దేవా గచ్ఛథో వీథో[2] అధ్వరం న తం మర్తస్య నశతే పరిహ్వృతిః ॥ 683

(8) అర్వాఙ్నరా దైవ్యేనావసా గతం శృణుతం హవం[3] యది మే జుజోషథః ।
యువోర్హి సఖ్యముత వా యదాప్యం మార్డీకమిన్ద్రావరుణా ని యచ్ఛతమ్ ॥ 684

(9) అస్మాకమిన్ద్రావరుణా భరేభరే పురోయోధా భవతం కృష్ట్యోజసా ।
యద్[4] వాం హవన్త ఉభయే[5] అధ స్పృధి నరస్తోకస్య తనయస్య సాతిషు ॥ 685

(10) అస్మే[6] ఇన్ద్రో వరుణో మిత్రో[7] అర్యమా ద్యుమ్నం యచ్ఛన్తు మహి శర్మ సప్రథః ।
అవధ్రం జ్యోతిరదితేరృతావృధో దేవస్య శ్లోకం సవితుర్మనామహే ॥ 686

---

1. మర్త్యం, 2. వీథో౽అధ్వరం, 3. హవం యాది మే, 4. యద్వాగ్ం, 5. ఉభయే౽అధ,
6. అస్మే౽ఇన్ద్రో, 7. మిత్రో౽అర్యమా. (ప్రా.ప్ర.)

## సూక్తము—82

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—ఇంద్రావరుణులు

(1) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మీరు మా పరిచారకజనములకు యజ్ఞ మొనర్చుటకై మహాగృహముల నొసంగుఁడు! ఎవ్వరు యజ్ఞకారులను హింసించెదరో! దురభిసంధి విశిష్ఠు లగునట్టి శత్రువులను యుద్ధమందు మేము జయింతుము ॥ 684

(2) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మీరు మహాత్ములు. మహాధనయుతులు. మీలో నొకఁడు సమ్రాట్టు. వే రొకఁడు స్వరాట్టు. అభీష్టవర్షిద్వయమా! యుత్కృష్టాకాశమందు విశ్వే దేవులు తేజస్సు నొసంగిరి. బలము నిచ్చిరి ॥ 685

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! వరుణుఁడా! మీరు బలమువలన జల ద్వారములను దీసితిరి. ప్రభు వగు సూర్యుని నాకాశమందుఁ జలింపఁజేసితిరి. ఈ ప్రజ్ఞాకర మగు సోమపానమందానందము పుట్టినచో మీరు జల రహిత నదులను నిండింపుఁడు! కర్మలను బూర్తి గావింపుఁడు! ॥ 686

(4) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! స్తోత్రధారు లగు వ్యక్తులు యుద్ధమున శత్రుసేనమధ్యమందు రక్షకొఱకై సంకుచిత జానువులుగల యంగిరోగణము మంగళోత్పాదనకై మిమ్ముఁ బిలిచెదరు. మీ రుభయవిధములకు నీశ్వరులు. సుఖాహ్వాన యోగ్యులు. స్తోతల మగు మేము మిమ్ముఁ బిలిచెదము ॥ 687

(5) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మీరు భువనమందు సమస్తప్రాణులను మీ బలముచే నిర్మింతురు. మీలో నొకనికి మిత్రుఁడు మంగళమునకై పరిచర్య చేయును. రెండవ వ్యక్తి మరుద్గణముతోఁగూడ నుగ్రమై యలంకారములను బొందును ॥ 688

(6) గద్యము॥

మహాధనలాభార్థము వరుణేంద్రుల దీప్తికొఱకై యచిరముగా బలముత్పన్న మగును. వీరల బలము నిత్యము. సత్యాన్నాదిభూతము. ఒకఁడబంధువై హింసాకారులకు బాధ కల్పించును. వేరొకఁడల్పముచే బహుతర శత్రువులను బాధించును ॥ 689

(7) గద్యము॥

ఓ యింద్రావరుణదేవద్వయమా! మీ రెవని యజ్ఞమునకు వెడలెదరో! యెవరిని గోరెదరో! వారికి బాధ కలుఁగకుండుఁగాక! వారు పాపమును బొందరు. వారికి దురితము కలుఁగదు. సంతాపము కలుఁగదు. ఆ మనుష్యుల చెంగట కెట్టి బాధలును బోఁజాలవు॥ 690

(8) గద్యము॥

నేత లగు నో యింద్రావరుణులారా! మీరు మాయెడల ప్రసన్నుల రైనచో దైవరక్షతో మా సమ్ముఖమునకు రండు! స్తోత్రముల వినుఁడు! మీ సఖిత్వము, మీ బంధుత, సుఖ సాధకములుగ మాకుఁ గలుఁగఁజేయుఁడు ! ॥ 691

(9) గద్యము॥

శత్రుకర్షకులు తేజోవిశిష్టులు నగు నో యింద్రావరుణులారా! ప్రతియుద్ధమందును మా కగ్ర గాము లగు యోద్ధ లగుఁడు! మిమ్ముల నుభయప్రకారనేతలు యుద్ధమునఁ బుత్ర పౌత్ర లాభార్థమై పిలిచెదరు ॥ 692

(10) గద్యము॥

ఇంద్రావరుణులు మిత్రార్యమలు మాకు ద్యోతమాన ధనంబును మహావిస్తీర్ణ గృహంబును నొసంగుదురుగాక! యజ్ఞవర్షిత యగు నదితియొక్క తేజస్సు మా కహింసకమగును. మేము సవితృదేవుని స్తుతించెదము॥ 693

## సూక్తమ్—83

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రావరుణౌ
ఛందః—జగతీ

(1) యువాం నరా పశ్యమానాస[1] ఆప్యం ప్రాచా గవ్యన్తః పృథుపర్శవో[2] యయుః ।
దాసా చ వృత్రా హతమార్యాణి చ సుదాసమిన్ద్రావరుణావసావతమ్ ॥ 687

(2) యత్రా నరః సమయన్తే కృతధ్వజో యస్మిన్నాజా భవతి కిం చన ప్రియమ్ ।
యత్రా భయన్తే భువనా స్వర్దృశస్తత్రా న[3] ఇన్ద్రావరుణాధి వోచతమ్ ॥ 688

(3) సం భూమ్యా[4] అన్తా ధ్వసిరా అదృక్షతేన్ద్రావరుణా దివి ఘోష[5] ఆరుహత్ ।
అస్థుర్జనానాముప[6] మామరాతయో ఽర్వాగవసా హవనశ్రుతా గతమ్ ॥ 689

---

1. మానాసఽఆప్యం, (వ్రా.ప్ర.). 2. పర్శవో (సా.మా.). 3. నఽఇన్ద్రా, 4. భూమ్యాఽఅన్తాధ్వసిరాఽఅదృ,
5. ఘోషఽఆరుహత్, 6. ముపమామతయోర్వాగ. (వ్రా.ప్ర.)

(4) ఇన్ద్రావరుణా వధనాభిరప్రతి భేదం వన్వన్తా ప్ర సుదాసమావతమ్ ।

బ్రహ్మాణ్యేషాం[1] శృణుతం హవీమని సత్యా తృత్సూనామభవత్ పురోహితిః ॥ 690

(5) ఇన్ద్రావరుణావభ్యా తపన్తి మాఘాన్యర్యో వనుషామరాతయః ।

యువం హి వస్వ[2] ఉభయస్య రాజథో ఽధ స్మా నో ఽవతం పార్యే దివి ॥ 691

(6) యువాం హవన్త[3] ఉభయాస ఆజిష్విన్ద్రం చ వస్వో వరుణం చ సాతయే ।

యత్ర రాజభిర్దశభిర్నిబాధితం ప్ర సుదాసమావతం తృత్సుభిః సహ ॥ 692

(7) దశ రాజానః సమితా[4] అయజ్యవః సుదాసమిన్ద్రావరుణా న యుయుధుః ।

సత్యా నృణామద్మసదాముపస్తుతిర్దేవా[5] ఏషామభవన్ దేవహూతిషు ॥ 693

(8) దాశరాజ్ఞే పరియత్తాయ విశ్వతః సుదాస[6] ఇన్ద్రావరుణావశిక్షతమ్ ।

శ్విత్యంచో యత్ర నమసా కపర్దినో ధియా ధీవన్తో[7] అసపన్త తృత్సవః ॥ 694

---

1. బ్రహ్మాణ్యే, 2. వస్వఽఉభయస్య, 3. హవన్తఽఉభయాసఽఆజిష్వ, 4. సమితాఽఅయ, 5. దేవాఽఏషా,
6. సుదాసఽఇన్ద్రా, 7. ధీవన్తోఽఅసపస. (వ్రా.ప్ర.)

(9) వృత్రాణ్యన్యః సమిథేషు జిఘ్నతే వ్రతాన్యన్యో[1] అభి రక్షతే సదా ।
హవామహే వాం వృషణా సువృక్తిభిరస్మే ఇన్ద్రావరుణా శర్మ యచ్ఛతమ్ ॥ 695

(10) అస్మే ఇన్ద్రో వరుణో మిత్రో[2] అర్యమా ద్యుమ్నం యచ్ఛన్తు మహి శర్మ సప్రథః ।
అవధ్రం జ్యోతిరదితేర్ఋతావృధో దేవస్య శ్లోకం సవితుర్మనామహే ॥ 696

## సూక్తము—83

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రావరుణులు

(1) గద్యము॥

నేత లగు నింద్రావరుణులారా! మీ బంధుత్వమును జూచి గో లాభేచ్ఛకొఱకుఁ బృథువిశిష్ట మగు యజమానగణము పూర్వదిగ్భాగమునకుఁ బోయెను. మీరు దాసవృత్రుని నార్య గణమును జంపితిరి. మీరు సుదాసరాజును రక్షించుటకై రండు! ॥ 694

(2) గద్యము॥

ఎచట మనుష్యగణము ధ్వజోత్తోళనముఁ జేయుచు మిళితు లగుదురో! యెచట యుద్ధమం దేమాత్రమును ననుకూలురు కారో! దేనివలన దూతలు స్వర్గమును దర్శింతురో! భయ పడుదురో! యా యుద్ధమందు నింద్రావరుణులారా! మా పక్ష మవలంబించి ప్రసంగింపుఁడు! ॥ 695

---

1. వ్రతాన్యన్యోఽఅభి, 2. మిత్రోఽఅర్యమా. (వ్రా.ప్ర.)

(3) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! భూమియొక్క యంత మంతయు ధ్వంస మొందు నని పలికి పరిదృష్టు లగుదురు. కోలాహలము ద్యో లోకము నారోహించును. సైన్యశత్రువులు మాకడ నుండెదరు. హవనశ్రవణకారు లగు నింద్రావరుణులారా! రక్షాసహితులై మాకడకు రండు! ॥ 696

(4) గద్యము॥

ఇంద్రావరుణులారా! యాయుధములచే నప్రాప్తుఁడగు భేదుని హింసించుచు సుదాసుని సంరక్షించితిరి. తృత్సుదుని స్తోత్రమును వింటిరి. యుద్ధకాలమునఁ దృత్సుదుని పౌరోహిత్యమును సఫలము గావించితిరి ॥ 697

(5) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! శత్రువుల యాయుధములు నాలుగుదిక్కులయందు మాకు బాధను జేయుచున్నవి. హింసకులలో శత్రువులు బాధించుచున్నారు. మీరు రెండు విధము లగు ధనములకు నీశ్వరులు. కాన యుద్ధదినమున మమ్ము రక్షింపుఁడు!॥ 698

(6) గద్యము॥

యుద్ధకాలమున నుభయ విధ లోకములయందును ధనముకొఱకై యింద్రావరుణులఁ బిలిచెదము. ఈ యుద్ధమున దశజనరాజుచే హింసింపఁబడిన సుదాసుని దృత్సుగణముతో మీరు కాపాడితిరి ॥ 699

(7) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! దశజన యజ్ఞరహిత రాజు† మిపతుఁడై సుదాసుని సంహరించుటకై శక్తుఁడు కాకయుండెను. హవ్యయుత యజ్ఞమందు నేతల స్తోత్రములు సఫలము లైనవి. వీని యజ్ఞమందు సకలదేవతలు నావిర్భూతు లగుదురు ॥ 700

---

† దశజన యజ్ఞరహిత రాజు—పారసీకార్యులు పలాయితులై వేర్వేరు దేశములలో నివాస మేర్పరచుకొని తా మీ యార్యావర్తసౌఖ్యములను గుర్తెరింగినవారకావున మరలమరల నీ యార్యావర్తమునకు వచ్చి పదిమందిరాజులు కలిసి (పారసీకులు) యార్యావర్తమున నానాడు రాజ్యము చేయుచున్న సుదాసునిమీదికి దాడి వచ్చిరి. వీరినే వేదములో "రాజరాజ్ఞసమిధ" మనుచున్నారు. త్రిత్సుదేశపాలకుఁ డగు సుదాసుని పురోహితుఁడగు వశిష్ఠుఁ డింద్రుని సహాయమును యాచించెను. ఆ పదిమందిలో నొకఁడగు తుర్యాషారాజుచే సైన్యములు నడిపింపఁబడెను. (తుర్యాషారాజు తురేనియన్ సంతతివాఁడేమో యని తోచుచున్నది.) తుర్యాషా అనువాఁడు పారసీకరాజులతో కలిసి పరూష్ణి నది యొడ్డున నిలువఁబడెను. సుదాసుని సైన్యము లీవలియొడ్డున నిలువఁబడినవి. వీరి యుభయ సైన్యములమధ్య నది యగాధముగా నున్నది. తుర్యాషాసైన్యము నదినిదాటలేక నదిలో మునిగిపోయెను.

వేదభూమి. పు. 107. (నే.వేం.న.శా.)

* శ్రీమదాంధ్రఋగ్వేదసంహిత 7వ.మండలము 83వసూక్తములోని 7వ.ఋక్కునకు (వ్రాతప్రతి. 8వ సంపుటము 208_209పుటల కెడమప్రక్క గల పుటలలో)శ్రీ నేమానివారు స్వహస్తముతో నీపై నుదాహరించిన ఫుట్‌నోట్ వ్రాసిరి. శ్రీ నేమానివా రుదాహరించిన వేదభూమిలోని యీ విషయము 1930 లో ప్రకటితమైన తొలిముద్రణ ప్రతిలోనిది. కాని 1950లో ప్రకటితమైన ద్వితీయ ముద్రణ వేదభూమిలోఁ దొలి ముద్రణలోని విషయ మీ క్రింది విధముగాఁ గొంతమార్పులతో "దాశరాజసమిధము"అను నుపశీర్షికతోఁ బ్రచురింపఁబడినది. వ.గో.కృ

దాశరాజ సమిధము

"ఇట్లు పలాయితులై వేర్వేరు దేశములలో నివాస మేర్పరుచుకొన్నట్టి పారసీకార్యులు కొంతకాలమైన తరువాత తామీ యార్యావర్త సౌఖ్యముల గుర్తెఱింగినవారు గాన రుచి మఱగినట్టి యీ దేశమునందాస వీడజాలక పారసీకరాజులు పదిమంది కలిసి తమ సైన్యములను కలుపుకొని యార్యావర్తములందానాటికి రాజ్యము సేయుచున్న సుదాసుని మీది కొక్కుమ్మడి దాడి వచ్చిరి. దీనినే వేదములో "దాశరాజ్ఞసమిధ" మనుచున్నారు. త్రిత్సు దేశభాగపరిపాలకు డైన సుదాసుని వంశపురోహితుఁ డగు వశిష్ఠుఁ డింద్రుని సహాయము యాచించెను. పదిమంది రాజులలో నొకఁడగు తుర్యాషారాజుచేత సైన్యములన్నియు నడిపించఁబడెను. కొందఱు పండితు లీ దాశరాజ సమిధము చదివి దాశరాజులందరు ననార్యులని వ్రాసియున్నారు. కాని యెచ్చటనుగూడ వీ రనార్యులని ప్రకటింపఁబడియుండలేదు. వేదములోసైతము (దశరాజానః సమితా అయజ్వానః ఋగ్వే॥_83_7)వీరిని 'అయజ్వానః' అనిరేకాని అనార్యాః" అనలేదు. "అయజ్వ"యనగా" యజ్ఞముచేయని జాతి" యని అర్థము.అనగా యజ్ఞద్వేష లగు పారసీకార్యులే కావలెనని కొందఱు తలంచుచున్నారు. కాని తుర్యాషా అనుపదమువల్ల వీరు టురేనియన్ జాతివారేమో యని మాకు సందేహము వొడముచున్నది.ఏది యెట్లున్నను, పారసీకార్యులు టురేనియనులతో కలిసి దాడెత్తిరికాబోలు. తుదకు తుర్యాషా సైన్యములు పరూష్ణినది కావలియొడ్డున నిల్పఁబడినవి. సుదాసుని సైన్యము లీవలియొడ్డున నిల్చినవి,నడుమ పురూష్ణినది యగాధమైనది. కావున తుర్యాషా సైన్యము నదిని దాటలేక నీటిలో మునిగిపోయెను."

వేదభూమి, 105 పుట. (ద్వితీయముద్రణము)

గ్రంథకర్త. అచ్యుతుని వెంకటాచలపతిరావు.

(8) గద్యము॥

ఏ ప్రదేశమందు నిర్మలగామియు, జటా విశిష్టమును గర్మయుక్తము నగు తృత్సుగణ మన్న స్తుతులతోఁ గూడుకొని పరిచర్యఁ జేయుదురో! యా ప్రదేశమున దశజనరాజ పరివేష్టితుఁడగు సుదాసునకు నింద్రావరుణులారా! బలము నొసంగితిరి ॥ 701

(9) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మీలో నొకఁడు యుద్ధమున వృత్రగణమును జంపెను. ఒకఁడు వ్రతరక్షను జేసెను. ఓ యభీష్టవర్షిద్వయమా! మే సుప్రవృత్తస్తుతిచే మిమ్ములను బిలుచుచున్నాము. మీరు మాకు సుఖము నొసంగుఁడు! ॥ 702

(10) గద్యము॥

ఇంద్రావరుణులు, మిత్రార్యములు మాకు ద్యోతమాన ధనంబును, మహావిస్తీర్ణ గృహంబును, నిచ్చెదరుగాక! యజ్ఞవర్షి యగు నదితితేజస్సు మమ్ము హింసింపకుండును. మేము సవితృదేవతను స్తుతించెదము ॥ 703

## సూక్తమ్—84

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఆ వాం రాజానావధ్వరే వవృత్యాం హవ్యేభిరిన్ద్రావరుణా నమోభిః ।
ప్ర వాం ఘృతాచీ బాహ్వోర్దధానా పరి త్మనా విషురూపా జిగాతి ॥ 697

(2) యువో రాష్ట్రం బృహదిన్వతి ద్యౌర్యౌ సేతృభిరరజ్జుభిః సినీథః ।
పరి నో హేళో వరుణస్య వృజ్యా[1] ఉరుం న ఇన్ద్రః కృణవదు లోకమ్ ॥ 698

(3) కృతం నో యజ్ఞం విదథేషు చారుం కృతం బ్రహ్మాణి సూరిషు ప్రశస్తా ।
ఉపో రయిర్దేవజూతో న[2] ఏతు ప్ర ణః స్పార్హాభిరూతిభిస్తిరేతమ్ ॥ 699

(4) అస్మే[3] ఇన్ద్రావరుణా విశ్వవారం రయిం ధత్తం వసుమన్తం [4]పురుక్షుమ్ ।
ప్ర య[5] ఆదిత్యో అనృతా మినాత్యమితా శూరో దయతే వసూని ॥ 700

(5) ఇయమిన్ద్రం వరుణమష్ట మే గీః ప్రావత్ తోకే తనయే తూతుజానా ।
సురత్నాసో దేవవీతిం గమేమ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 701

---

1. వృజ్యాః ఉరుం నః ఇన్ద్రః, 2. జూతో నః ఏతు, 3. అస్మేః ఇన్ద్రా, 4. పరుక్షమ్,

5. ప్ర యః ఆదిత్యోః అనృతా. [ప్రా.ప్ర.]

## సూక్తము—84

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—ఇంద్రావరుణులు

(1) గద్యము॥

రా జగు నింద్రుఁడా! వరుణుఁడా! యీ యజ్ఞమందు హవ్యస్తుతులచే మి మ్మావర్తితులుగ నొనర్చిరి. బాహుద్వయములచేఁ బట్టువడిన నానారూప విశిష్ట జుహువు మీ కభిముఖముగ వెడలును ॥ 704

(2) గద్యము॥

ఓ యింద్రావరుణులారా ! మీరు స్వర్గరూప బృహద్రాష్ట్రములను వృష్టిదానమునఁ బ్రీతములుగాఁ జేయుదురు. మీరు రజ్జురహిత బాధాప్రదోపాయమునఁ బాపాత్ములను బంధింపుఁడు! వరుణుని కోపము మమ్ము రక్షించుచు వెడలుఁగాక! ఇంద్రుఁ డీ స్థానమును విస్తీర్ణముగాఁ జేయుఁగాక ! ॥ 705

(3) గద్యము॥

ఓ యింద్రావరుణులారా ! మా గృహయజ్ఞముల మనోహరములుగాఁ జేయుఁడు! దేవతాప్రేరిత మగు ధనము మాకడకు వచ్చునుగాక! స్పృహణీయరక్షలవలన వారు మమ్ము వృద్ధిని బొందింతురుగాక! ॥ 706

(4) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మాకు సకల వరణీయ నివాసస్థానమును, బహ్వన్నవిశిష్ట ధనమును, దాన మీయుఁడు! ఏ యాదిత్యుఁ డనృత వినాశమును జేయునో! యా శూరుఁ డపరిమిత ధనము నొసంగుఁగాక! ॥ 707

(5) గద్యము॥

మా యీ స్తుతి యింద్రావరుణులను జెందునుగాక! మేము పఠించిన యీ స్తుతి పుత్ర పౌత్రుల విషయమై మమ్ము రక్షించుఁగాక! ఓ సర్వదేవతలారా! సుందర రత్నవిశిష్టమై యజ్ఞమును బొందుఁడు! మీరు సర్వదా స్తుతులచే మమ్ము రక్షింపుఁడు!॥ 708

## సూక్తమ్—85

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్

(1) పునీషే వామరక్షసం మనీషాం సోమమిన్ద్రాయ వరుణాయ జుహ్వత్ ।
ఘృతప్రతీకాముషసం న దేవీం తా నో యామన్నురుష్యతామభీకే ॥ 702

(2) స్పర్ధన్తే వా[1] ఉ దేవహూయే అత్ర యేషు ధ్వజేషు దిద్యవః పతన్తి ।
యువం తాగ్ం ఇన్ద్రావరుణావమిత్రాన్ హతం పరాచః శర్వా విషూచః ॥ 703

(3) ఆపశ్చిద్ధి స్వయశసః సదఃసు దేవీరిన్ద్రం వరుణం దేవతా ధుః ।
కృష్టీరన్యో ధారయతి ప్రవిక్తా వృత్రాణ్యన్యో[2] అప్రతీని హన్తి ॥ 704

1. వాఽఉ దేవహూయేఽఅత్ర, 2. న్యోఽఅప్రతీని. (ప్రా.ప్ర.)

(4) స సుక్రతుర్ఋతచిదస్తు హోతా య[1] ఆదిత్య శవసా వాం నమస్వాన్ ।
ఆవవర్తదవసే వాం[2] హవిష్మానసదిత్ స సువితాయ ప్రయస్వాన్ ॥ 705

(5) ఇయమిన్ద్రం వరుణమష్ట మే గీః ప్రావత్ తోకే తనయే తూతుజానా ।
సురత్నాసో దేవవీతిం గమేమ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 706

## సూక్తము—85

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రావరుణులు

(1) గద్యము॥

ఓ యింద్రావరుణులారా! మీ నిమిత్తమై యగ్ని యందు సోమమును బోయుచు దీప్తిమతి యగు నుషస్సు వలె దీప్తావయవము, రాక్షసరహితము నగు స్తుతిని శోధనఁ జేయుచున్నాము. అది యుపస్థిత యుద్ధమందు, యాత్రాకాలమున, మమ్ము రక్షించుఁగాక! ॥ 709

(2) గద్యము॥

పరస్పరము స్పర్ధ గల సంగ్రామములయందు మేము శత్రువుతో స్పర్ధించెదము. ఏయుద్ధమున ధ్వజములనిమిత్త మాయుధము లన్నియుఁ బడునో! యట్టి సంగ్రామమందు నింద్రావరుణులారా! మీ రాయుధములవలనఁ బరాఙ్ముఖులును వివిధ గతి గలవారును నగు శత్రువులను వినాశముఁ జేయుఁడు ! ॥ 710

1. హోతా య ఆదిత్య, 2. వా హవిష్మాన్. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

సోమమంతయు స్వాయత్తమైనదియు, యశోవంతమైనదియు, ద్యుతిగలదియు నై సదనమం దుభయ దేవతలను ధరించును. వీరిలో నొకఁడు ప్రజలను వేరుపరచి ధరించును. ఇం కొకఁ డప్రతిగత శత్రువులను నశింపఁజేయును ॥ 711

(4) గద్యము॥

ఓ యాదిత్యద్వయమా! మీరు బలశాలురు. నమస్కరించుచు మీకుఁ బరిచర్యఁ జేయువాఁడు శోభన కర్మగల హోత ఋత్విజ్ఞుఁడు నగును. ఏ వ్యక్తి హవ్యము గలిఁగి తృప్తికై మి మ్మావర్తితులుగా నొనర్చునో! వాఁ డన్నవంతుఁడై యేకాంతఫలము నొందును ॥ 712

(5) గద్యము॥

మా యీ స్తుతి యింద్రావరుణులను బొందుఁగాక! మే ముచ్చరించిన స్తుతి పుత్రపౌత్రుల విషయమున మమ్ము రక్షించుఁగాక! మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 713

## సూక్తమ్—86

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః

దేవతా—వరుణః

ఛందః—త్రిష్టుప్

(1) ధీరా త్వస్య మహినా జనూంషి వి యస్తస్తమ్భ రోదసీ చిదుర్వీ ।
ప్ర నాకమృష్వం నునుదే బృహన్తం ద్వితా నక్షత్రం పప్రథచ్చ భూమ ॥ 707

(2) ఉత స్వయా తన్వా౩ సం వదే తత్ కదా న్వ౧ంతర్వరుణే భువాని ।
కిం మే హవ్యమహృణానో జుషేత కదా మృళీకం సుమనా[1] అభి ఖ్యమ్ ॥ 708

(3) పృచ్ఛే తదేనో వరుణ దిదృక్షూపో[2] ఏమి చికితుషో విపృచ్ఛమ్ ।
సమానమిన్మే కవయశ్చిదాహురయం హ తుభ్యం వరుణో హృణీతే ॥ 709

(4) కిమాగ[3] ఆస వరుణ జ్యేష్ఠం యత్ స్తోతారం జిఘాంససి సఖాయమ్ ।
ప్ర తన్మే వోచో దూళభ స్వధావో ఽవ త్వానేనా నమసా తుర[4] ఇయామ్ ॥ 710

(5) అవ ద్రుగ్ధాని పిత్ర్యా సృజా నో ఽవ యా వయం చకృమా తనూభిః ।
అవ రాజన్ పశుతృపం న తాయుం సృజా వత్సం న దామ్నో వసిష్ఠమ్ ॥ 711

(6) న స[5] స్వో దక్షో వరుణ ధ్రుతిః సా సురా మన్యుర్విభీదకో[6] అచిత్తిః ।
అస్తి జ్యాయాన్ కనీయస[7] ఉపారే స్వప్నశ్చనేదనృతస్య ప్రయోతా ॥ 712

---

1. సుమనాఽఅభి, 2. క్షూపోఽఏమి, 3. కిమాగఽఆస, 4. తురఽఇయామ్, 5. న సః స్వో, 6. దకోఽఅచిత్తః, 7. కనీయసఽఉపారే. (ప్రా.ప్ర.)

(7) అరం దాసో న [1]మీళ్హుషే కరాణ్యహం దేవాయ భూర్ణయేఽనాగాః ।
అచేతయదచితో దేవో[2] అర్యో గృత్సం రాయే కవితరో జునాతి ॥ 713

(8) అయం సు తుభ్యం వరుణ స్వధావో హృది స్తోమ[3] ఉపశ్రితశ్చిదస్తు ।
శం నః క్షేమే శము యోగే నో[4] అస్తు యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 714

## సూక్తము—86

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—వరుణుఁడు

(1) గద్యము॥

ఈ వరుణుని జన్మ మహిమయు కస్థిర మైనది. ఇది విస్తీర్ణ ద్యావాభూములను స్తంభితములుగాఁ జేయును. ఇది బృహదాకాశమును, దర్శనీయ నక్షత్రములను రెండువిధములఁ బ్రేరేపించుచు. ఇది భూమిని విస్తీర్ణముగా నొనర్చును ॥ 714

(2) గద్యము॥

నేను స్వీయ శరీరముతోఁగాని వరుణునితోఁగాని స్తుతిఁ జేయుదునా ? వరుణ సమీపమున నుండెదనా? వరుణుఁడు క్రోధరహితుఁడై మా హవ్యమును సేవించునా ? నేను సుమనస్కుఁడనై సుఖప్రద వరుణు నెక్కడ వీక్షింపఁగలను ? ॥ 715

---

1. మీహ్ళుషే, 2. దేవోఽఅర్యో, 3. స్తోమఽఉపశ్రిత, 4. యోగే నోఽఅస్తు. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

ఓ వరుణుఁడా! నేను దిదృక్షువునై యీ పాపప్రసంగము నడుగుచున్నాను. నేను వివిధ ప్రశ్నలకై విద్వాంసుల కడకుఁ బోయెదను. "ఈ వరుణుఁడు మీ యెడలఁ గ్రుద్ధుఁడు" అని కవు లందఱును మా కొక రూపునఁ జెప్పిరి ॥ 716

(4) గద్యము॥

ఓ వరుణుఁడా! మిత్రభూతుఁడ నగు స్తోతను జంపుట కిచ్ఛగించితివి. నే నేమి యొనర్చితిని? ఓ దుర్ధర్షుఁడా! తేజస్వీ! దేనివలన నేను ద్వరావంతుఁడనై నమస్కరించుచు మీకడకు రాఁగలనో! యట్టి యుపాయము నుపదేశింపుము!॥ 717

(5) గద్యము॥

ఓ వరుణుఁడ! మా పితృక్రమాగత మగు ద్రోహమును విశ్లిష్టము కావింపుము! మేము నిజశరీరముతో నే మొనర్చెదమో! దానిని శిథిలముగఁ జేయుము! ఓ రాజా! పశుఖాదకుఁ డగు చోరుని మాఁటిక రజ్జు బద్ధ గోవత్సము వలె మమ్ముఁ బాపములనుండి తప్పింపుము! ॥ 718

(6) గద్యము॥

ఓ వరుణుఁడా! యీ పాపము నిజదోషమువలనఁ గలిఁగినది కాదు. ఇది భ్రమవల్లనో! ఘూరత్వమువల్లనో! కోపమువల్లనో! ద్యూతక్రీడవల్లనో! యవివేక వశముననో! సంఘటించినది. కనిష్ఠుని జ్యేష్ఠుఁడు విపథమందుఁ బ్రవేశపెట్టును. స్వప్నమందుఁ బాప ముత్పన్న మగును ॥ 719

(7) గద్యము॥

అభీష్టవర్షియుఁ బోషకుఁడు నగు వరుణుని యుద్దేశమై నేను దాసుని వలెఁ బర్యాప్తముగాఁ బరిచర్యఁ జేసెదను. మే మజ్ఞానులము. అర్యమదేవుఁడు మాకు జ్ఞానము నొసంగునుగాక! ప్రాజ్ఞతరదేవుఁడు స్తోతలను ధనార్థము ప్రేరేపించునుగాక!॥ 720

(8) గద్యము॥

అన్నవంతుఁ డగు నోవరుణుఁడా! నీనిమిత్తమై రచింపఁబడిన స్తోత్రము నీ హృదయమందు నాటుకొనునుగాక! లాభము మాకు మంగళ మగును. స్తోమము మాకు మంగళ మగును. మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 721

## సూక్తమ్—87

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వరుణః
ఛందః—త్రిష్టుప్

(1) రదత్ పథో వరుణః సూర్యాయ ప్రార్ణాంసి సముద్రియా నదీనామ్ ।
సర్గో న సృష్టో[1] అర్వతీరృతాయంచకార మహీరవనీరహభ్యః ॥ 715

(2) ఆత్మా తే వాతో రజ[2] ఆ నవీనోత్ పశుర్న భూర్ణిర్యవసే ససవాన్ ।
అన్తర్మహీ బృహతీ రోదసీమే విశ్వా తే ధామ వరుణ ప్రియాణి ॥ 716

(3) పరి స్పశో వరుణస్య స్మదిష్టా[3] ఉభే పశ్యన్తి రోదసీ సుమేకే ।
ఋతావానః కవయో యజ్ఞధీరాః ప్రచేతసో య[4] ఇషయన్త మన్మ ॥ 717

---

1. సృష్టోఽఅర్వతీ, 2. రజఽఆ, 3. స్మదిష్టాఽఉభే, 4. యఽఇషయన్త. (వ్రా.ప్ర.)

(4) ఉవాచ మే వరుణో మేధిరాయ త్రిః సప్త నామాఘ్న్యా బిభర్తి ।
విద్వాన్ పదస్య గుహ్యా న వోచద్ యుగాయ విప్ర[1] ఉపరాయ శిక్షన్ ॥ 718

(5) తిస్రో ద్యావో నిహితా[2] అన్తరస్మిన్ తిస్రో భూమీరుపరాః షడ్విధానాః ।
గృత్సో రాజా వరుణశ్చక్ర[3] ఏతం దివి ప్రేంఖం హిరణ్యయం శుభే కమ్ ॥ 719

(6) అవ సిన్ధుం వరుణో ద్యౌరివ స్థాద్ ద్రప్సో న శ్వేతో మృగస్తువిష్మాన్ ।
గమ్భీరశంసో రజసో విమానః సుపారక్షత్రః సతో అస్య రాజా ॥ 720

(7) యో మృళయాతి చక్రుషే చిదాగో వయం స్యామ వరుణే[4] అనాగాః ।
అను వ్రతాన్యదితేర్ఋధన్తో యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 721

---

1. విప్రఽఉప, 2. నిహితాఽఅన్తర, 3. చక్రఽఏతం, 4. వరుణేఽఅనాగాః (వా.ప్ర.)

## సూక్తము—87

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—వరుణుఁడు

(1) గద్యము॥

ఈ వరుణదేవుఁడు సూర్యునకు మార్గమును గలుఁగఁజేయుచుండును. నదు లన్నియు
నంతరిక్షభవ మగు జలమును నొసంగుచున్నవి. పురుషాశ్వము బడబఁగూర్చి
పరుగిడు నట్లు శీఘ్రము వెడలుట కిచ్ఛగించి వాఁడు మహారజనీ సమూహమును
దివసమునుండి వేరుచేయుచుండును ॥ 722

(2) గద్యము॥

ఓ వరుణుఁడా ! నీ ప్రేర్యమాణమైన వాయువు, జగత్తున కాత్మ. అది జలమును ప్రేరేపించును.
ఘాస మొసంగినచోఁ బశువు నన్నవంత మగునట్టు భర్తయగు వాయువన్నవంత
మగును. మహాబృహద్ద్యావాభూముల మధ్య స్థలమునఁ గల సమస్తస్థానము
లోకమునకుఁ బ్రియమైనది ॥ 723

(3) గద్యము॥

వరుణుని చర సకలగతులును ప్రశస్తము లైనవి. అవి సుందరరూపములు గల ద్యావా
భూములను సందర్శించును. కర్మవంతులు, యజ్ఞధీరులు, ప్రాజ్ఞులు నగు
కవు లేస్తోత్రములను వినెదరో ! యా స్తోత్రములు నాల్గు దిక్కులను
సందర్శించును ॥ 724

(4) గద్యము॥

నేను మేధావంతుఁడను. "గోవులు 'ఏకవింశతి'† నామములను ధరించును" అని వరుణుఁడు
చెప్పెను. విద్వాంసుఁడు, మేధావియు నగు వరుణుఁ డుపయుక్తాంతేవాసి
కుపదేశించి యుత్కృష్ట మగు స్థానమందు నీ సకలగుహ్యకథను
బ్రతిపాదించెను ॥ 725

† త్రిసప్త = ఏకశటి = ఏకవింశతి

(10) గద్యము॥

ఈ వరుణునిలోపలనిఁ త్రివిధంబు లగు ద్యులోకములు నిహితము లైనవి. మూఁడువిధము లగు భూములును షడవస్థలును వీనియం దంతర్భూతములై యున్నవి. స్తుతియోగ్యుం డగు రాజైన వరుణుఁ డంతరిక్షమున హిరణ్మయ డోల వలె సూర్యుని దీప్తికై నిర్మించెను ॥ 726

(6) గద్యము॥

సూర్యుని వలె దీప్త వరుణుఁడు సముద్రమును స్థాపించెను. వాఁడు జలబిందువు వలె శ్వేత వర్ణుఁడు. గౌరమృగము వలె బలవంతుఁడు. గభీరస్తోత్ర విశిష్టుఁడు. ఉదకనిర్మాత. అపార క్షమ బల యుతుఁడు. సమస్త సత్పదార్థములకును రాజు ॥ 727

(7) గద్యము॥

అపరాధ మొనర్చినను వరుణదేవుఁడు క్షమించును. అదీనుఁ డగు వరుణుని వ్రతము యథాక్రమముగ సమృద్ధిని జేయుచు వానికడను నే ననపరాధి నగుదును. మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 728

## సూక్తమ్—88

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వరుణః, 7- పాశవిమోచనీ
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర శున్ధ్యువం వరుణాయ ప్రేష్ఠాం మతిం వసిష్ఠ [1]మీళ్హుషే భరస్వ ।
య ఈమర్వాంచం కరతే యజత్ర సహస్రామఘం వృషణం బృహన్తమ్ 722

1. మీహ్ళుషే, (ప్రా.ప్ర.)

(2) అధా న్వస్య సందృశం జగన్వానగ్నేరనీకం వరుణస్య మంసి ।
స్వ౧ర్యదశ్మన్నధిపా[1] ఉ అన్ధోఽభి మా వపుర్దృశయే నినీయాత్ ॥ 723

(3) ఆ యద్ రుహావ వరుణశ్చ నావం ప్ర యత్ సముద్రమీరయావ మధ్యమ్ ।
అధి యదపాం స్నుభిశ్చరావ ప్ర ప్రేంఖ[2] ఈంఖయావహై శుభే కమ్ ॥ 724

(4) వసిష్ఠం హ వరుణో నావ్యాధాదృషిం చకార స్వపా మహోభిః ।
స్తోతారం విప్రః సుదినత్వే[3] అహ్నాం యాన్ను ద్యావస్తతనన్ యాదుషాసః ॥ 725

(5) క్వ౧ త్యాని నౌ సఖ్యా బభూవుః సచావహే యదవృకం పురా చిత్ ।
బృహన్తం మానం వరుణ స్వధావః సహస్రద్వారం జగమా గృహం తే ॥ 726

(6) య[4] ఆపిర్నిత్యో వరుణ ప్రియః సన్ త్వామాగాంసి కృణవత్ సఖా తే ।
మా త[5] ఏనస్వన్తో యక్షిన్ భుజేమ యన్ధి ష్మా విప్రః స్తువతే వరూథమ్ ॥ 727

---

1. న్నధిపాఽఉఽఅన్ధో, 2. ప్రేంఖఽఈంఖ, 3. సుదినత్వేఽఅహ్నాం, 4. యఽఆపిర్నిత్యో,
5. మా తఽఏనస్వన్తో. (ప్రా. ప్ర.)

(7) ధ్రువాసు త్వాసు క్షితిషు క్షియన్తో వ్యస్మత్ పాశం వరుణో ముమోచత్ ।
అవో వన్వానా[1] అదితేరుపస్థాద్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 728

## సూక్తము—88

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—వరుణుఁడు

(1) గద్యము॥

ఓ వసిష్ఠుఁడా! యభీష్టవర్షియగు వరుణు నుద్దేశించి స్వతస్సిద్ధప్రియతమ స్తుతిని జేయుము! వాఁడు యజనీయుఁడు. సహస్ర ధనవంతుడు. అభీష్టవర్షి. గొప్పవాఁడు. ఈ దేవతను మా కభిముఖముగా నొనర్పుము! ॥ 729

(2) గద్యము॥

ఇపుడు నేను వరుణుని సందర్శించి యగ్నిజ్వాలాసమూహమును స్తుతించెదను. వరుణుఁడు సుఖకరపాషాణమందున్న సోమమును బానము చేయుటవలన దర్శనార్థమై మాకుఁ బ్రశస్తరూపము నొసంగును ॥ 730

(3) గద్యము॥

నేను, వరుణుఁడును, నౌక నెక్కఁగలము. సముద్రమధ్యమున నౌకను సొగసుగాఁ బ్రేరేపింతుము. జలముపైఁ బోవు నౌకపై నుండెదము. అందుచే శోభార్థము నౌకారూప డోలపై సుఖముగఁ గ్రీడింతుము ॥ 731

---

1. వన్వానాఽఅదితేరు పస్థాద్. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

మేధావి యగు వరుణుఁడు గమనశీలము లగు దినరాత్రులను విస్తరింపఁజేయుచు దినములలో నొక సుదినమందు నౌకపై వసిష్ఠ నెక్కించెను. వానికి రక్షద్వారా సుకర్మఁ జేయించెను ॥ 732

(5) గద్యము॥

ఓ వరుణుఁడా! యట్టి మన సఖ్య మెక్కడ యంతరించెనో? పూర్వకాలీన మగు హింసారహిత సఖ్యమును సేవించెదను. అన్నవంతుఁడ వగు నో వరుణుఁడా! గొప్పదియు, భూత గణవిచ్ఛేదకారియు సహస్ర ద్వార* విశిష్టము నగు నీ గృహమునకుఁ బోయెదను ॥ 733

(6) గద్యము॥

ఓ వరుణుఁడా! యే వసిష్ఠుఁడు నిత్యబుద్ధుఁడో!, యెవ్వఁడు పూర్వమందుఁ బ్రియుఁడై నీ కపరాధ మొనర్చెనో! వాఁడు నీకు సఖుఁడు. యజనీయ వరుణుఁడా! మేము నీ కాత్మీయులము. మేము పాపాత్ములమై భోగము ననుభవింపము. నీవు మేధావంతుఁడవు. నీవు స్తుతికారకులకు వరణీయ గృహంబుల నొసంగుము! ॥ 734

(7) గద్యము॥

ఈ సకల నిత్య భూమియందు నివసించుచు మేము నిన్ను స్తుతించెదము. వరుణుఁడు మా బంధనములను విడిచిపుచ్చునుగాక! మే మఖండనీయ పృథివీ సమీప స్థానమునుండి వరుణునిరక్ష ననుభవింప సమర్థులము ॥ 735

* సహస్రద్వార విశిష్టమగు గృహము—ఆ నాఁడు అసంఖ్యాక ద్వారములుగల గృహరాజము లుండినట్లు సూచన—(వే.వెం.న.శా.)

## సూక్తమ్—89

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వరుణః
ఛందః—గాయత్రీ, 5-జగతీ

(1) మో షు వరుణ మృన్మయం గృహం రాజన్నహం గమమ్ ।
మృళా సుక్షత్ర మృళయ ॥ 729

(2) యదేమి ప్రస్ఫురన్నివ దృతిర్న ధ్మాతో[1] అద్రివః ।
మృళా సుక్షత్ర మృళయ ॥ 730

(3) క్రత్వః సమహ దీనతా ప్రతీపం జగమా శుచే ।
మృళా సుక్షత్ర మృళయ ॥ 731

(4) అపాం మధ్యే తస్థివాంసం తృష్ణావిదజ్జరితారమ్ ।
మృళా సుక్షత్ర మృళయ ॥ 732

---

1. ధ్మాతోఽఅద్రివః. (వా.ప్ర.)

(5) యత్ కిం చేదం వరుణ దైవ్యే జనే ఒభిద్రోహం మనుష్యాశ్చరామసి।
అచిత్తీ యత్ తవ ధర్మా యుయోపిమ మా నస్తస్మాదేనసో దేవ రీరిషః॥ 733

## సూక్తము—89

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—వరుణుఁడు

(1) గద్యము॥

ఓ రాజా! వరుణుఁడా! మృణ్మయ† గృహములు నా కక్కఱ కాదు. ఓ సుక్షత్రుఁడా! దయ నుంచుము! దయనుంచుము! ॥ 736

(2) గద్యము॥

ఆయుధవంతుఁడ వగు నో వరుణుఁడా! నేను గంపాన్విత కళేబరమందు వాయు చాలిత మేఘమువలె గమనించెదను. ఓ సుక్షత్రుఁడా! దయ నుంచుము! దయ నుంచుము! ॥ 737

(3) గద్యము॥

ధనవంతుఁడ వగు నిర్మల వరుణుఁడా! యశక్తిప్రయుక్త మగు కర్మకుఁ బ్రాతికూల్యము కలుఁగుచున్నది. ఓ సుక్షత్రుఁడా! దయ నుంచుము! దయ నుంచుము! ॥ 738

(4) గద్యము॥

జలమధ్యమందు వాసము చేసినను నీ స్తోతలకుఁ దృష్ణ వదలకున్నది. ఓ సుక్షత్రుఁడా! దయ నుంచుము! దయ నుంచుము! ॥ 739

---

† మృణ్మయ గృహములు—ఆర్యులు వాస్తుశాస్త్రి మెఱింగిన వా రగుటచే మంటితో గృహములు నిర్మించుచున్నట్టును, నవి యక్కఱకు రాకుండుటచే నంతకంటె నెక్కువగు గృహముల నిమ్మనియు వరుణుని బ్రార్థించినట్లును గ్రహింపవలయును. (నే.వెం.న.శా.)

(5) గద్యము॥

ఓ వరుణుఁడా! మేము మనుష్యులము. దేవతా సంబంధమైన మే మేదియేని విరుద్ధాచరణము కావించితిమేని, నీ కేకర్మలనైన నజ్ఞానమువలన నవధానమువలనఁ జేసితిమేని నవి యన్నియుఁ బాపప్రయుక్తుల మగు మమ్ము హింసింపకుండుఁగాక! ॥ 740

## అనువాకః—6, సూక్తమ్—90

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వాయుః, 5-7-ఇన్ద్రవాయూ
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర వీరయా శుచయో దద్రిరే వామధ్వర్యుభిర్మధుమన్తః సుతాసః ।
వహ వాయో నియుతో యాహ్యచ్ఛా పిబా సుతస్యాన్ధసో మదాయ ॥ 734

(2) ఈశానాయ ప్రహుతిం యస్త[1] ఆనట్ శుచిం సోమం శుచిపాస్తుభ్యం వాయో ।
కృణోషి తం మర్త్యేషు ప్రశస్తం[2] జాతోజాతో జాయతే వాజ్యస్య ॥ 735

(3) రాయే ను యం జజ్ఞతూ[3] రోదసీమే రాయే దేవీ ధిషణా ధాతి దేవమ్ ।
అధ వాయుం నియుతః సశ్చత స్వా[4] ఉత శ్వేతం వసుధితిం నిరేకే ॥ 736

1. యస్తఽఆనట్ శుచిం, 2. ప్రశస్తం, 3. జజ్ఞతు, 4. స్వాఽఉత. (వ్రా. ప్ర.)

(4) ఉచ్ఛన్నుషసః సుదినా అరిప్రా[1] ఉరు జ్యోతిర్వివిదుర్దీధ్యానాః ।
గవ్యం చిదూర్వముశిజో వి వవ్రుస్తేషామను ప్రదివః సస్రురాపః ॥ 737

(5) తే సత్యేన మనసా దీధ్యానాః స్వేన యుక్తాసః క్రతునా వహన్తి ।
ఇన్ద్రవాయూ వీరవాహం రథం వామీశానయోరభి పృక్షః సచన్తే ॥ 738

(6) ఈశానాసో యే దధతే స్వర్ణో గోభిరశ్వేభిర్వసుభిర్హిరణ్యైః[2] ।
ఇన్ద్రవాయూ సూరయో విశ్వమాయురర్వద్భిర్వీరైః పృతనాసు [3]సహ్యుః ॥ 739

(7) అర్వన్తో న శ్రవసో భిక్షమాణా[4] ఇన్ద్రవాయూ సుష్టుతిభిర్వసిష్ఠాః[5] ।
వాజయన్తః స్వవసే హువేమ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 740

---

1. అరిప్రాఽఉరు, 2. వసుభిర్హిరణ్యైః, 3. సుహ్యుః, 4. మాణాఽఇన్ద్ర, 5. సుష్టుతిభిర్వాసిష్ఠాః (ప్రా.ప్ర.)

## అనువాకము—6, సూక్తము—90

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత— వాయువు, 5-7-ఇంద్రవాయువులు †

(1) గద్యము॥

ఓ వాయువా! నీవు వీరుఁడవు. శుద్ధము, నభిషుతము, మాధుర్యయుతము నగు సోమమును నధ్వర్యుగణము నీ నిమిత్తము ప్రేరేపించును. నీవు నియుద్ గణమును రథమునకుఁ గూర్పుము! అభిముఖముగ రమ్ము! ఆనందమునకై యభిషుత సోమమును ద్రావుము! ॥ 741

(2) గద్యము॥

ఓ వాయువా! నీవుగదా! యీశ్వరుఁడవు! ఎవఁడు నీ నిమిత్తమై యుత్తమాహుతిని జేయునో! యో సోమపాయీ! యెవ్వఁడు నీకొఱకు శుచి సోమము నొసంగునో! మనుష్యులలో నీవు వానికే శుభపరంపర నిమ్ము! వాఁడే సర్వత్ర ప్రాదుర్భూతుఁడై ప్రాప్తవ్య ధనమును బొందును ॥ 742

(3) గద్యము॥

ఈ ద్యావా భూము లే వాయువును ధనము నిమిత్తము పుట్టించినవో! ద్యుతిమతిని ధరించుటకు నే వాయువు దేవతలను ధరించునో! యిప్పుడు స్వకీయ నియుతగణ మా వాయువును సేవించును. వాయువు దరిద్రునకు శ్వేతవర్ణ ధనము నొసంగును ॥ 743

(4) గద్యము॥

పాపరహిత మగు నుషస్సు సర్వ సుదినములకు హేతువై తమో నాశనమును జేయును. దీప్యమానుఁడై విస్తీర్ణ జ్యోతిస్సును గలిగించును. ఉసిజగణము గోరూప ధనమును బుట్టించును. పురాణ జలము వానినే యనుసరించెను ॥ 744

---

† ఈ సూక్తమునందలి 5-7 ఋక్కులకు "నింద్రవాయువు" లకుమారుగాఁ బొరపాటున "నింద్రావరుణులు" దేవతలుగా శ్రీనేమానివారు 156సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో వ్రాసిరి.

(5) గద్యము॥

ఓ యింద్రవాయువులారా! వారు యదార్థ మననీయస్తోత్రముద్వారా దీప్యమానులై తమ కర్మ ద్వారా వీరగణ వహనీయరథమును వహించిరి. మీ రీశానులు. సమస్తాన్నము మిమ్మే సేవించును ॥ 745

(6) గద్యము॥

ఓ యింద్రవాయువులారా! క్షమశాలు లగు నే వ్యక్తులు మాకు, గోవులను, నశ్వములను, నివాసప్రద ధనమును, హిరణ్యరహిత సుఖమును నొసంగుదురో! యట్టి దాతృగణము సంగ్రామములయందు నశ్వములను వీరగణ సాహాయ్యమున వ్యాప్తాయువును గలిగించును ॥ 746

(7) గద్యము॥

అశ్వమువలె హవ్యవాహియు, నన్నార్థియు, బలేచ్ఛియు నగు వసిష్ఠగణ మైన మే ముత్తమ ప్రకార రక్ష నిమత్త ముత్తమ స్తుతులచే నో యింద్రవాయువులారా! మిమ్ములఁ బిలుచుచున్నాము. మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 747

## సూక్తమ్—91

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1,3-వాయుః; 2,4-7-ఇన్ద్రవాయూ
ఛందః—త్రిష్టుప్

(1) కువిదంగ నమసా యే వృధాసః పురా దేవా[1] అనవద్యాస ఆసన్ ।
తే వాయవే మనవే[2] బాధితాయాఽవాసయన్నుషసం సూర్యేణ ॥ 741

1. దేవాఽఅనవద్యాసఽఆసన్, 2. బాధితాయవాస. (వ్యా.ప్ర.)

(4) గద్యము॥

ఎంతకాలము మీ శరీరమందు వేగ ముండునో! యెంతకాలము బల ముండునో! యెంతకాలము
నేతలు జ్ఞానబలమున దీప్యమాను లగుదురో! యంతకాల మో విశుద్ధసోమపాయు లగు
నింద్రవాయువులారా! మీ విశుద్ధ మగు నా సోమరసమును ద్రావుఁడు! ఈ
బర్హిస్సుపై విశ్రమింపుఁడు! ॥ 751

(5) గద్యము॥

ఇంద్రవాయువులారా! మీరు స్పృహణీయస్తోతృవిశిష్టు లగు నియుద్గణము నొక్క-రథమునకు
సమకూర్పుఁడు! మీ రభిముఖముగ రండు! ఈ మధురసోమాగ్రము మీ నిమిత్తము
కొనిరాఁబడును. అనంతము మీరు ప్రీతులై మమ్ము విముక్తులుగాఁ జేయుఁడు! ॥ 752

(6) గద్యము॥

ఓ యింద్రవాయువులారా! యే నియుద్గణము శత సంఖ్యాకమై మిమ్ము సేవించునో! సకల
వరణీయ మగు నే మరుద్గణము సహస్రసంఖ్యాకమై సేవించునో! శోభన ధనయుత మగు
నా నియుద్గణముతో నభిముఖముగ విచ్చేయుఁడు! ఓ నేతృద్వయమా! యుత్తర
వేదికిఁ దేఁబడిన సోమమును ద్రావుఁడు! ॥ 753

(7) గద్యము॥

అశ్వమువలె హవ్యవాహియు, నన్నార్థియుఁ, బలేచ్ఛియు నగు వసిష్ఠగణ మైన మే ముత్తమ
రక్షకై యో యింద్రవాయువులారా! యుత్తమస్తుతులచే మిమ్ముల నాహ్వానించుచున్నాము.
మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 754

# సూక్తమ్—92

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—వాయుః, 2,4-ఇన్ద్రవాయూ
ఛందః—త్రిష్టుప్

(1) ఆ వాయో భూష శుచిపా[1] ఉప నః సహస్రం తే నియుతో విశ్వవార ।
ఉపో తే[2] అన్ధో మద్యమయామి యస్య దేవ దధిషే పూర్వపేయమ్ ॥ 748

(2) ప్ర సోతా జీరో[3] అధ్వరేష్వస్థాత్ సోమమిన్ద్రాయ వాయవే పిబధ్యై ।
ప్ర యద్ వాం మధ్వో[4] అగ్రియం భరన్త్యధ్వర్యవో దేవయన్తః శచీభిః ॥ 749

(3) ప్ర యాభిర్యాసి దాశ్వాంసమచ్ఛా నియుద్భిర్వాయవిష్టయే దురోణే ।
ని నో రయిం సుభోజసం యువస్వ ని వీరం గవ్యమశ్వ్యం చ రాధః । 750

(4) యే వాయవ[5] ఇన్ద్రమాదనాస[6] ఆదేవాసో నితోశనాసో[7] అర్యః ॥
ఘ్నన్తో వృత్రాణి సూరిభిః ష్యామ సాసహ్వాంసో యుధా నృభిరమిత్రాన్ ॥ 751

---

1. శుచిపాఽఉప నః, 2. ఉపో తేఽఅన్ధో, 3. జీరోఽఅధ్వ, 4. మధ్వోఽఅగ్రియం,
5. వాయవఽఇన్ద్ర, 6. నాస ఽఆదేవాసో, 7. నాసోఽఅర్యః. (వ్రా.ప్ర.)

(5) ఆ నో నియుద్భిః శతినీభిరధ్వరం సహస్రిణీభిరుప యాహి యజ్ఞమ్ ।
వాయో[1] అస్మిన్ త్సవనే మాదయస్వ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 752

## సూక్తము—92

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—వాయువు, 2, 4–ఇంద్రవాయువులు*

(1) గద్యము॥

శుచి సోమమును ద్రావెడు వాయువా! మా సమీపమునకు రమ్ము! సకల వరణీయుఁడా! నీ నియుద్గణము సహస్ర సంఖ్యాకము. ఓ వాయువా! నీ వే సోమమును ద్రావుటకు మొదటి యధికారివో! యా మదకర సోమము పాత్రయందుఁ గలదు ॥ 755

(2) గద్యము॥

క్షిప్రహస్తులు, నభిషవకారులు నగు నింద్రవాయువులు ద్రావుటకు యజ్ఞమందు సోమ ముంచఁబడినది. ఇంద్ర వాయువులారా! దేవాభిలాషి యగు నధ్వర్యుగణము కర్మముచే మీనిమిత్త మీ యజ్ఞమందు సోమాగ్రభాగమును సంపాదించినది ॥ 756

(3) గద్యము॥

ఓ వాయువా! గృహస్థితహవ్యదాయి కభిముఖముగ యజ్ఞముకొఱకు నే నియుద్గణముతో వెడలెదరో! యా నియుద్గణముతో రండు! మాకు సుందరాన్నసహిత మగు ధన మొసంగుఁడు! ॥ 757

---

1. వాయోఽఅస్మిన్. (వ్రా. ప్ర.)

* ఈ సూక్తమునకు దేవతవిషయమై వ్రాతప్రతిలో (8వ సంపుటము. 224పుట) వాయువుగాను, 15b సంఖ్యగల సంపుటములోనున్న ఋషిదేవతల పట్టికలో "వాయువు, ఇంద్రావరుణులు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గద్యము॥

ఎవ్వ రింద్రవాయువులకుఁ దృప్తిఁ జేయుదురో! వారు దేవయుక్తులు. కాఁబట్టి శత్రువులను జంపుదురు. ఆ స్తోతల సాహాయ్యమున నేను శత్రువుల సంహరింప సమర్థుఁడ నగుదును. మా లోకమున యుద్ధమం దమిత్రగణమునకుఁ బరాభవము కల్పింప సమర్థుఁడను ॥ 758

(5) గద్యము॥

ఓ వాయువా! శతసంఖ్యలు, సహస్ర సంఖ్యలు గల నియుద్గణముతో హింసారహిత యజ్ఞ సమీపమునకు రండు! ఈ యజ్ఞమందుఁ బ్రమత్తు లగుఁడు! మీరు మమ్ము సర్వదా స్తుతులచేఁ బాలింపుఁడు! ॥ 759

## సూక్తమ్—93

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రాగ్నీ
ఛందః—త్రిష్టుప్

(1) శుచిం ను స్తోమం నవజాతమద్యేన్ద్రాగ్నీ[1] వృత్రహణా జుషేథామ్ ।
ఉభా హి వాం సుహవా జోహవీమి తా వాజం సద్య[2] ఉశతే ధేష్ఠా ॥ 753

(2) తా సానసీ శవసానా హి భూతం సాకంవృధా శవసా శూశువాంసా ।
క్షయన్తౌ రాయో యవసస్య భూరేః పృంక్తం వాజస్య [3]స్థవిరస్య ఘృష్వేః ॥

1. మద్యేన్ద్రాగ్నీ, 2. సద్య౨ఉశతే, 3. స్థవీరస్య. (వా.ప్ర.)

(3) ఉపో హ యద్ విదథం వాజినో గూర్ధీభిర్విప్రాః ప్రమతిమిచ్ఛమానాః ।
అర్వన్తో న కాష్ఠాం నక్షమాణా[1] ఇన్ద్రాగ్నీ జోహువతో నరస్తే ॥ 755

(4) గీర్భిర్విప్రః ప్రమతిమిచ్ఛమాన[2] ఈట్టే రయిం యశసం పూర్వభాజమ్ ।
ఇన్ద్రాగ్నీ వృత్రహణా సువజ్రా[3] ప్ర నో నవ్యేభిస్తిరతం దేష్ణైః ॥ 756

(5) సం యన్మహీ మిథతీ స్పర్ధమానే[4] తనూరుచా శూరసాతా యతైతే ।
అదేవయుం విదథే దేవయుభిః సత్రా[5] హతం సోమసుతా జనేన ॥ 757

(6) ఇమాము షు సోమసుతిముప న[6] ఏన్ద్రాగ్నీ సౌమనసాయ యాతమ్ ।
నూ చిద్ధి పరిమమ్నాథే[7] అస్మానా వాం శశ్వద్భిర్వవృతీయ వాజైః ॥ 758

(7) సో[8] అగ్న ఏనా నమసా సమిద్ధో ఽచ్ఛా మిత్రం వరుణమిన్ద్రం వోచేః ।
యత్ సీమాగశ్చకృమా తత్ సు మృళ తదర్యమాదితిః శిశ్రథన్తు ॥ 759

---

1. మాణాఽఇన్ద్రాగ్నీ, **2.** **మా**నఽఈట్టే, 3. సువజ్రాపనో **4.** **మానో**, **5.** సత్రా హతం,
6. ముపనఽఏన్ద్రాగ్నీ, 7. థేఽఅస్మానా, 8. సోఽఅగ్నఽఏనా. (ప్రా.ప్ర.)

(8) ఏతా[1] అగ్న ఆశుషాణాస ఇష్టీర్యువోః సచాభ్యశ్యామ వాజాన్ ।
మేన్ద్రో నో విష్ణుర్మరుతః పరి ఖ్యన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 760

## సూక్తము—93

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రాగ్నులు

(1) గద్యము॥

వృత్రహంతవగు నింద్రుఁడా! యగ్నీ! మీరు శుద్ధము నవజాతము నగు సోమమును సేవింపుఁడు! మీరు సుఖాహ్వాన యోగ్యులు. మీ యుభయుల జనకుని బునః పునః పిలిచెదను. యజమానులు కోరుచున్నారు. తత్క్షణమే వారి కన్న మొసంగుఁడు! ॥ 760

(2) గద్యము॥

ఓ యింద్రాగ్నులారా! మేము సంభజనీయులము. మీరు బలమువలె నాచరింపుఁడు! మీరు యుగపత్ బలముచే వర్ధమానులు. బహుధనమునకు నన్నమునకు నధీశ్వరులు. మీరు స్థూల శత్రు వినాశకాన్నమును గూర్చుఁడు! ॥ 761

(3) గద్యము॥

హవిష్మంతము, ననుగ్రహాభిలాషియు నగు విప్రగణము కర్మముచే యజ్ఞప్రాప్త మగును. ఆ నేత లశ్వము యుద్ధభూమి నెట్లు వ్యాపించునో! యటులనే యగ్నిని గర్మ వ్యాప్తునిగాఁ జేసి మాటిమాటికిఁ బిలిచెదరు ! ॥ 762

---

1. ఏతాఽఅగ్నఽఆశుషాణాసఽఇష్టీ. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

ఓ యింద్రాగ్నులారా! యనుగ్రహార్థ లగు విప్రులు యశోయోగ్యము, ప్రథమోపభోగ్యము నగు ధనము నుద్దేశించి స్తుతులచే మిమ్ము నుతించుచున్నారు. వృత్రఘాతి, సుందరాయుధ సహిత మగు నో యింద్రాగ్ని ద్వయమా! నవతరము దాతవ్యము నగు ధనమున మమ్ము వృద్ధిఁ బొందింపుము! ॥ 763

(5) గద్యము॥

గొప్పది, పరస్పర క్రోధకారియుఁ, బరస్పరము స్పర్ధాకారియు, సంగ్రామముల యత్నముఁ జేయునదియు నగు సేనాద్వయము తన తేజస్సున సతతముఁ బాపుల నశింపఁజేయును. సోమాభిషవకారి, దేవాభిలాషియు నగు జనుని సాహాయ్యమున యజ్ఞమందు నదేవ కామవ్యక్తిని నశింపఁజేయును ॥ 764

(6) గద్యము॥

ఇంద్రాగ్నులారా! సౌమనస్యమునకై మా యీ సోమాభిషవ క్రయమునకు రండు! మీరు మమ్ముఁ బరిత్యజించి యన్యులను దయతోఁ జూడకుఁడు! మిమ్ములను నన్నముచే నావర్తితులఁ జేయుదును ॥ 765

(7) గద్యము॥

ఓ యగ్నీ! నీ వీ యన్నమునఁ బ్రసిద్ధుఁడవై మిత్రేంద్రులకు వరుణునకు మే మపరాధ మొనర్చియున్నచో దానినుండి మమ్ము రక్షింపుము! అర్యముఁడు నదితియు దానిని బారఁద్రోలుఁగాక! ॥ 766

(8) గద్యము॥

ఓ యగ్నీ! శీఘ్రముగ నీ యజ్ఞమును భజించుచు మా యన్నము నొక్కమారు పొందెదము. ఇంద్రావిష్ణువులు, మరుద్గణమును మమ్ముఁ బరిత్యజించి యితరులను జూడరు. మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 767

## సూక్తమ్—94

ఋషిః —మైత్రావరుణిర్వసిష్ఠః
**దేవతా—ఇన్ద్రాగ్నీ**
ఛందః—గాయత్రీ; 12-అనుష్టుప్

(1) ఇయం వామస్య మన్మన ఇన్ద్రాగ్నీ పూర్వ్యస్తుతిః ।
అభ్రాద్ వృష్టిరివాజని ॥ 761

(2) శృణుతం జరితుర్హవమిన్ద్రాగ్నీ వనతం గిరః ।
ఈశానా పిప్యతం ధియః ॥ 762

(3) మా పాపత్వాయ నో నరేన్ద్రాగ్నీ మాభిశస్తయే ।
మా నో రీరధతం నిదే ॥ 763

(4) ఇన్ద్రే[1] అగ్నా నమో బృహత్ సువృక్తిమేరయామహే ।
ధియా ధేనా[2] అవస్యవః ॥ 764

---

1. ఇన్ద్రేఽఅగ్నా, 2. ధేనాఽఅవస్యవః. (ప్రా.ప్ర.)

(5) తా హి శశ్వన్త[1] ఈళత ఇత్థా విప్రాస ఊతయే ।

సబాధో వాజసాతయే ॥ 765

(6) తా వాం గీర్భిర్విపన్యవః ప్రయస్వన్తో హవామహే ।

మేధసాతా సనిష్యవః ॥ 766

(7) ఇన్ద్రాగ్నీ[2] అవసా గతమస్మభ్యం చర్షణీసహా ।

మా నో దుఃశంస[3] ఈశత ॥ 767

(8) మా కస్య నో[4] అరరుషో ధూర్తిః ప్రణఙ్మర్త్యస్య ।

ఇన్ద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్ ॥ 768

(9) గోమద్ధిరణ్యవద్ వసు యద్ వామశ్వావదీమహే ।

ఇన్ద్రాగ్నీ తద్ వనేమహి ॥ 769

---

1. శశ్వన్త ఈళత ఇత్థా విప్రాస ఊతయే, 2. ఇన్ద్రాగ్నీ అవసా, 3. శంస ఈశత,

4. కస్య నో అరరుషో. (ప్రా. ప్ర.)

(10) యత్ సోమ[1] ఆ సుతే నర ఇన్ద్రాగ్నీ అజోహవుః ।
సప్తీవన్తా సపర్యవః ॥ 770

(11) ఉక్థేభిర్వృత్రహన్తమా యా మన్దానా చిదా గిరా ।
ఆంగూషైరావివాసతః ॥ 771

(12) తావిద్ దుఃశంసం మర్త్యం దుర్విద్వాంసం రక్షస్వినమ్ ।
ఆభోగం హన్మనా హతముదధిం హన్మనా హతమ్ ॥ 772

## సూక్తము—94

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రాగ్నులు

(1) గీ ॥ వారిద సమూహమునుండి వర్షమువలె
నింద్రుఁడా! యగ్నిదేవుఁడ! యెసఁగు స్తోతృ
పుంగవునినుండి శస్తమౌ పూర్ణ వినుతి
యుద్భవించుచునుండెఁ దా నుచితరీతి ॥* 768

1. సోమఽఆ సుతే నరఽఇన్ద్రాగ్నీఽఅజోహవుః. (ప్రా.ప్ర.)

(1) గద్యము—ఇంద్రాగ్నులారా! మేఘమునుండి వృష్టివలె నీ స్తోతనుండి యీ ప్రధాన స్తోత్ర ముత్పన్న మగుచున్నది. (తొలిపాఠము)

(2) గద్యము॥

ఇంద్రాగ్నులారా! స్తోతల యాహ్వానము నాలింపుఁడు! వారి స్తుతిని భజింపుఁడు! మీ రీశ్వరులు గాన ననుష్ఠిత కర్మను బూర్తి నొందింపుఁడు ॥ 769

(3) గద్యము॥

నేత లగు నింద్రాగ్నులారా! హీనభావముకొఱకుఁ, బరాభవముకొఱకు, నిందకొఱకు మమ్ముఁ బరవశులుగా నొనర్పకుఁడు! ॥ 770

(4) గద్యము॥

మేము రక్షాభిలాషులమై హవ్యమును, సుస్తుతిని, గర్మయుక్త వాక్యమును నింద్రాగ్నుల సమీపమునకుఁ బ్రేరేపింతుము ॥ 771

(5) గద్యము॥

ఆ యుభయులను బహుజన రక్షార్థముగ నీ విధమున స్తుతించెదము. పరస్పర బాధా ప్రాప్తలోకమునం దన్నమునకై స్తవ మొనర్చెదము ॥ 772

(6) గద్యము ॥

స్తోత్రేచ్ఛువులము నన్నహితులము ధనేచ్ఛులము నయి మేము యజ్ఞము నిమిత్తము మీ యుభయులను స్తుతిచేఁ బిలిచెదము ॥ 773

(7) గద్యము॥

ఓ యింద్రాగ్నులారా! మీరు మనుష్యుల కభిభవమును గల్పింపుఁడు! మీరు మా నిమిత్త మన్నమును దెండు! పరుషవాది యగు జనుఁడు మాకుఁ బ్రభువు కాకూడదు॥ 774

(8) గద్యము॥

ఇంద్రాగ్నులారా! యే శత్రువువల్లను మాకు హింస కలుఁగకుండునుగాక! మాకు సుఖము నిండు! ॥ 775

(9) గద్యము॥

ఇంద్రాగ్నులారా! మీ చెంతను గోవిశిష్టము, హిరణ్యవిశిష్టము, నశ్వవిశిష్టము నగు ధనమును యాచించుచున్నాను. దాని ననుభవించుటకు సమర్థుఁడను ॥ 776

(10) గద్యము॥

సోమ మభిషుత మైనచోఁ గర్మనేత లెవ్విధమునఁ బరిచరణాభిలాషులై యుత్తమాశ్వములు గల యింద్రాగ్నులను బిలుతురో! యట్లే మేమును వారం వార మింద్రాగ్నులనే పిలిచెదము ॥ 777

(11) గద్యము॥

సర్వాపేక్షచే వృత్రహంతయు, నత్యంతానందితుఁడు నగు నింద్రుని, నగ్నికి మే ముక్థ ఘోషణీయ స్తవములచేతను, స్తుతులచేతను బరిచర్యఁ జేసెదము ॥ 778

(12) గద్యము॥

ఇంద్రాగ్నులారా! దుష్టాభిసంధియుతులు, దుష్టజ్ఞానయుతులు, బలవంతులు, నవహరణ కారులును నగు మనుష్యులను నాయుధములవలనఁ గుత్సుని రీతిఁ జంపుఁడు! ॥ 779

## సూక్తమ్—95

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—సరస్వతీ; 3-సరస్వాన్
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర క్షోదసా ధాయసా సస్ర[1] ఏషా సరస్వతీ ధరుణమాయసీ పూః ।
ప్రబాబధానా రథ్యేవ యాతి విశ్వా[2] అపో మహినా సిన్ధురన్యాః ॥ 773

(2) ఏకాచేతత్ సరస్వతీ నదీనాం శుచిర్యతీ గిరిభ్య[3] ఆ సముద్రాద్ ।
రాయశ్చేతన్తీ భువనస్య భూరేర్ఘృతం పయో దుదుహే నాహుషాయ ॥ 774

(3) స వావృధే నర్యో యోషణాసు[4] వృషా శిశుర్వృషభో యజ్ఞియాసు ।
స వాజినం మఘవద్భ్యో[5] దధాతి వి సాతయే తన్వం మామృజీత ॥ 775

(4) ఉత స్యా నః సరస్వతీ జుషాణోప శ్రవత్ సుభగా యజ్ఞే[6] అస్మిన్ ।
మితజ్ఞుభిర్నమస్యైరియానా రాయా యుజా చిదుత్తరా సఖిభ్యః ॥ 776

---

1. సస్రాऽఏషా, 2. విశ్వాऽఅపో, 3. గిరిభ్యऽఆ సముద్రాత్, 4. యోషాసు వృషా,
5. మఘవద్భ్యోధ, 6. యజ్ఞేऽఅస్మిన్. (ప్రా.ప్ర.)

(5) ఇమా జుహ్వానా యుష్మదా నమోభిః ప్రతి స్తోమం సరస్వతి జుషస్వ ।
తవ శర్మన్ ప్రియతమే దధానా[1] ఉప స్థేయామ శరణం న వృక్షమ్ ॥ 777

(6) అయము తే సరస్వతి వసిష్ఠో ద్వారావృతస్య సుభగే వ్యావః ।
వర్ధ శుభ్రే స్తువతే రాసి వాజాన్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 778

## సూక్తము—95

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—సరస్వతి, 4-సరస్వానుఁడు*

(1) గద్యము॥

ఈ సరస్వతి †యయోనిర్మితపురి వలె ధారయిత్రి యయి ధారకోదకముతోఁ బరుగిడుచుండును. అది యన్య స్యందన శీల జలమునకు మహిమచే బాధను గల్పించుచు మార్గము వలెఁ బోవును ॥ 780

(2) గద్యము॥

నదులలోఁ బరిశుద్ధమైనది, గిరి మొదలు సముద్ర పర్యంతము గమనశీలయు నగు నొక్క ‡సరస్వతీ నది తెలియఁబడుచున్నది. భువనస్థ ధనము నొసంగుచు నది నహుషునికై ఘృతమును, దుగ్ధమును, దోహనము చేయుచున్నది ॥ 781

---

1. దధానాऽఉప. (వ్రా.ప్ర.)

* వ్రాత ప్రతిలో (8వ సంపుటము. 229 పుట) నీ సూక్తమునకు దేవత సరస్వతిగాను 15వ సంపుటములోని ఋషిదేవతల పట్టికలో సరస్వతి, సరస్వానుఁడు దేవతలుగాను శ్రీ నేమాని వారు వ్రాసిరి.

† ఆర్యుల కాలమున నయోమయపురములు గల వనుటకు నిదర్శన మిది. ఆర్యులకు లోహముల వాడుక తెలియదను పాశ్చాత్యపండితులు దీనినెట్లు సమర్థింతురో చూడవలయును. (నే.వెం.న.శా.)

‡ ఈ ఋక్కువల్ల సరస్వతీ నది గిరిమొదలు సముద్ర పర్యంతము పారుచుండినట్లు తెలియవచ్చుచున్నది. కాని ప్రస్తుతము భూమి ప్రకృతి మారుటవలన రాజపుతానా యెడారిలో నింకిపోవుచున్నది. ఆ మార్పును జూచియే కాబోలును సరస్వతీ నది యంతర్వాహిని యని యనుచున్నారు. (నే.వెం.న.శా.)

(3) గద్యము॥

మనుష్యులకు హిత మొనర్చునది, సేచన సమర్థము నగు శిశువు, నభీష్టవర్షిణులు యజ్ఞార్హలు నగు యోషిత్తుల మధ్యమున వృద్ధిఁబొందును. అది హవిష్మంతులగు యజమానులకు బలవంతులగు పుత్రుల నొసంగును. లాభమునకు వారి శరీరమును సంస్కరించును ॥ 782

(4) గద్యము॥

సుభగ యగు సరస్వతి ప్రీతయై మా యజ్ఞమందు స్తుతుల నాలించునుగాక! అర్చనీయ దేవగణములు నతజానులై దాని చెంతకుఁ బోయెదరు. అది నిత్య ధనవతి. సఖుల విషయమై యత్యంత దయావతి ॥ 783

(5) గద్యము॥

ఓ సరస్వతీ! మే మీ హవ్యమును హోమమును జేయుచు నమస్కారముల నీచెంతను ధనము నందెదము. మా స్తోమమును సేవింపుము! మేము నీ కతిప్రియ మగు గృహమందు వసించుచు నాశ్రయభూత మగు వృక్షము వలె మిమ్ములఁ గలియుదుము ॥ 784

(6) గద్యము॥

ఓ సుభగా! సరస్వతీ! యీ వసిష్ఠుఁడు నీ నిమిత్తము యజ్ఞ ద్వారములను దెరచెను. శుభ్రవర్ణయగు దేవి! వృద్ధిఁబొందుము! స్తుతికారుల కన్న మొసంగుము! నీవు సర్వదా మమ్ము మా స్తుతులచేఁ బరిపాలింపుము! ॥ 785

## సూక్తమ్—96

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—సరస్వతీ, 4-7-సరస్వాన్
ఛందః— 1-బృహతీ, 2-సతో బృహతీ (ప్రగాథః)
3-ప్రస్తారపంక్తిః, 4-6-గాయత్రీ, 7-త్రిష్టుప్

(1) బృహదు గాయిషే వచో[1] ఽసుర్యా నదీనామ్ ।
సరస్వతీమిన్మహయా సువృక్తిభిః స్తోమైర్వసిష్ఠ రోదసీ ॥ 779

(2) ఉభే యత్ తే మహినా శుభ్రే[2] అన్ధసీ అధిక్షియన్తి పూరవః ।
సా నో బోధ్యవిత్రీ మరుత్సఖా చోద రాధో మఘోనామ్ ॥ 780

(3) భద్రమిద్ భద్రా కృణవత్ సరస్వత్యకవారీ చేతతి వాజినీవతీ ।
గృణానా జమదగ్నివత్ స్తువానా చ వసిష్ఠవత్ ॥ 781

(4) జనీయన్తో న్వగ్రవః పుత్రీయన్తః సుదానవః ।
సరస్వన్తం హవామహే ॥ 782

---

1. వచో ఽసుర్యా, 2. శుభ్రేఽఅన్ధసీఽఅధిక్షియన్తి. (ప్రా.ప్ర.)

(5) యే తే సరస్వ[1] ఊర్మయో మధుమన్తో ఘృతశ్చుతః ।
తేభిర్నోఽవితా భవ ॥ 783

(6) పీపివాంసం సరస్వతః స్తనం యో విశ్వదర్శతః ।
భక్షీమహి ప్రజామిషమ్ ॥ 784

†(7) యస్య వ్రతం పశవో యన్తి సర్వే యస్య వ్రతముపతిష్ఠన్త ఆపః ।
యస్య వ్రతే పుష్టిపతిర్నివిష్టస్తం సరస్వన్తమవసే హువేమ ॥ 785

## సూక్తము—96

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—1-3 సరస్వతి, 4-7-సరస్వానుఁడు

(1) గద్యము॥

ఓ వసిష్ఠా! నదులలో బలవంతురాలగు సరస్వతీ నది నుద్దేశించి బృహత్‌స్తోత్రములను గానము చేయుము! ద్యావాభూములయందుఁగల సరస్వతిని దోషవర్జితము లగు స్తోత్రములద్వారా పూజింపుము! ॥ 786

1. సరస్వఽఊర్మయో. (వ్రా.ప్ర.)

† సప్తమ మండలములోని యీ 96వ సూక్తములో ముద్రిత ప్రతులలో మొత్తము 6 ఋక్కులు మాత్రమేకలవు. ఈ 7వ ఋక్కు అధిక పాఠముగాఁ గొన్ని వ్రాతప్రతులలోను, ఖిల మంత్రముగా మరికొన్ని వ్రాతప్రతులలోను గలదు.

(2) గద్యము॥

శుభ్రవర్ణా! సరస్వతీ! నీ మహిమచే మనుష్యుల యుభయవిధాన్నము పొందఁబడును. నీవు రక్షాకారిణివై మమ్ము గుర్తెరుంగుము! మరుత్తులకు సఖివై నీవు హవిష్మంతులకు ధనమును బ్రేరేపింపుము! 787

(3) గద్యము॥

కళ్యాణి యగు సరస్వతి కేవల కళ్యాణమును జేయునుగాక! సుందరాన్నము గలిఁగి యన్నవతియై మాకుఁ బ్రజ్ఞను బుట్టించుఁగాక! నేను జమదగ్నివలె నుతించినయెడల నీవు వశిష్ఠున కుపయుక్తమగు స్తవము నొనర్పుము! ॥ 788

(4) గద్యము॥

మేము జయాభిలాషులము. పుత్రాభిలాషులము. సుందరాన్నవంతుల మగు స్తోతలము. మేము సరస్వద్దేవతను వినుతించెదము ॥ 789

(5) గద్యము॥

ఓ సరస్వంతుఁడా! యే మీ జలసమూహము రసవంతము ఘృతక్షారియు నగునో! యా జలము సంధ్యచే మాకు రక్షక మగును ॥ 790

(6) గద్యము॥

ప్రవృద్ధ సరస్వద్దేవతయొక్క స్తవమును మే మొనర్చెదము. వాఁడు మేఘములకు దర్శనీయుఁడు. మేము ప్రజాన్నములను బొందెదము! ॥ 791

†(7) గీ॥ పశువు లే దేవతా వ్రత ప్రతతి వెల్గు ?
జలము లే దేవ వ్రతమునఁ జలన మొందుఁ ?
ఋష్టి నాథుఁ డే దేవ నివిష్టుఁ డగును ?
నా సరస్వంతు నహరహ మభినుతింతు ॥ 792

## సూక్తమ్—97

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—1-ఇన్ద్రః; 2,4-8-బృహస్పతిః; 3,9-ఇన్ద్రాబ్రహ్మణస్పతీ;
10-ఇన్ద్రాబృహస్పతీ
**ఛందః—త్రిష్టుప్**

(1) యజ్ఞే దివో నృషదనే పృథివ్యా నరో యత్ర దేవయవో మదన్తి ।
ఇన్ద్రాయ యత్ర సవనాని సున్వే గమన్మదాయ ప్రథమం వయశ్చ ॥ 786

(2) ఆ దైవ్యా వృణీమహేఽవాంసి బృహస్పతిర్నో మహ[1] ఆ సఖాయః ।
యథా భవేమ మీళ్హుషే[2] అనాగా యో నో దాతా పరావతః పితేవ ॥ 787

(3) తము జ్యేష్ఠం నమసా హవిర్భిః సుశేవం బ్రహ్మణస్పతిం గృణీషే ।
ఇన్ద్రం శ్లోకో మహి దైవ్యః సిషక్తు యో బ్రహ్మణో దేవకృతస్య రాజా ॥ 788

† ఇది సంస్కృత మూలము 96వ సూక్తములోని యధిక పాఠ మనియు "ఖిల" మంత్ర మనియు భావింపఁబడిన 7 వ ఋక్కున కనువాదము. దీనిని సేమానివా రనువదింపలేదు.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. మహఽఆసఖాయః, 2. మీళ్హుషేఽఅనాగా. (ప్రా. ప్ర.)

(4) స[1] ఆ నో యోనిం సదతు ప్రేష్ఠో బృహస్పతిర్విశ్వవారో యో[2] అస్తి ।
కామో రాయః సువీర్యస్య తం దాత్ పర్షన్నో[3] అతి సశ్చతో అరిష్టాన్ ॥ 789

(5) తమా నో[4] అర్కమమృతాయ జుష్టమిమే ధాసురమృతాసః పురాజాః ।
శుచిక్రన్దం యజతం పస్త్యానాం బృహస్పతిమనర్వాణం హువేమ ॥ 790

(6) తం శగ్మాసో[5] అరుషాసో అశ్వా బృహస్పతిం సహవాహో వహన్తి ।
సహశ్చిద్ యస్య నీలవత్ సధస్థం నభో న రూపమరుషం వసానాః ॥ 791

(7) స హి శుచిః శతపత్రః స శున్ధ్యుర్హిరణ్యవాశీరిషిరః స్వర్షాః ।
బృహస్పతిః స స్వావేశ[6] ఋష్వః పురూ సఖిభ్య[7] ఆసుతిం కరిష్ఠః ॥ 792

(8) దేవీ దేవస్య రోదసీ జనిత్రీ బృహస్పతిం వావృధతుర్మహిత్వా ।
దక్షాయ్యాయ దక్షతా సఖాయః కరద్ బ్రహ్మణే సుతరా సుగాధా ॥ 793

---

1. సః–ఆ నో యోని, 2. యోః–అస్తి, 3. పర్షన్నోః–అతి సశ్చతోః–అరిష్టాన్, 4. నోః–అర్కం, 5. శగ్మాసోః–అరుషాసోః–అశ్వా, 6. స్వావేశః–ఋష్వః, 7. సఖిభ్యః–ఆసుతిం. (వ్రా. ప్ర.)

(9) ఇయం వాం బ్రహ్మణస్పతే సువృక్తిర్బ్రహ్మేన్ద్రాయ వజ్రిణే[1] అకారి ।
అవిష్టం ధియో జిగృతం పురంధీర్జజస్తమర్యో వనుషామరాతీః ॥ 794

(10) బృహస్పతే యువమిన్ద్రశ్చ వస్వో దివ్యస్యేశాథే[2] ఉత పార్థివస్య ।
ధత్తం రయిం స్తువతే కీరయే చిద్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 795

## సూక్తము—97

ఋషి—మైత్రావరుణియగు వశిష్ఠుఁడు
దేవత—1- ఇంద్రుఁడు, 2, 4-8-బృహస్పతి,
3, 9-ఇంద్ర బ్రహ్మణస్పతులు, 10-ఇంద్రబృహస్పతులు*

(1) గద్యము॥

ఏ యజ్ఞమునందు దేవాభిలాషులగు నేతలు మరుత్తు లగుదురో! యే యజ్ఞమునందు సవన సమూహ మింద్రునకై యభిషుత మగునో! యింద్రుఁడు హృష్టుఁడగుటకు ద్యోలోకమునుండి పృథివిలోఁ గల నేతృ గణ మా యజ్ఞమునకుఁ దొలుత వచ్చెదరుగాక! ఇటులే గమనశీలము లగు నశ్వములు వచ్చుఁగాక! ॥ 793

(2) గద్యము॥

ఓ సఖిగణమా! మేము దైవ రక్షను బ్రార్థించెదము. బృహస్పతి మా హవ్యమును స్వీకరించునుగాక! పిత దూర దేశమునుండి ధనమును దెచ్చి పుత్రున కొసంగు నట్లు వాఁడు దాన మిచ్చును. మేము కామవర్షి యగు బృహస్పతి కడ ననపరాధుల మగునటు లొనర్పుఁడు! ॥ 794

1. వజ్రిణేఽఅకారి, 2. శాథేఽఉత. (వ్రా. ప్ర.)

* ఈ 97వసూక్తమునకు శ్రీనేమానివారు వ్రాతప్రతిలో( 8వసంపుటము.232పుట) 1—ఇంద్రుఁడు,3,9— ఇంద్రుఁడు బ్రహ్మణస్పతి, 10—ఇంద్రుఁడు, బృహస్పతి మిగిలినవానికి బృహస్పతి దేవఁలుగా వ్రాసి,15b సంపుటములోని ఋషిదేవతలపట్టికలో ఇంద్రుఁడు, బృహస్పతి, ఇంద్ర బృహస్పతులు దేవతలుగా వ్రాసిరి.

(3) గద్యము॥

జ్యేష్ఠుఁడు, సుసుఖవిశిష్టుఁడు నగు బ్రహ్మణస్పతికి నమస్కరించి హవ్యముద్వారా స్తుతించెదను. ఎవఁడు దేవకృత మంత్రములకు రాజో! దేవార్హశ్లోక మా మహేంద్రుని సేవించుఁగాక! ॥ 795

(4) గద్యము॥

ఆ ప్రియతముఁడు బ్రహ్మణస్పతి మా స్థానమునందుండుఁగాక! వాఁడు సకలవరణీయుఁ డగుచున్నాఁడు. ధనమునందు, సువీర్యమునందు మాకుఁ గల యభిలాషను వాఁడు దాన మొసంగునుగాక! మే ముపద్రవము గలవారము. వాఁడు మమ్ము హింసింపకుండుఁగాక! ॥ 796

(5) గద్యము॥

ఈ పురోజాతమగు నమరగణము మాకు నమరముఁ బర్యాప్తమును నర్చనాసాధనమునగు నన్నము నిచ్చుఁగాక! శుద్ధ స్తోత్రవిశిష్టుఁడు గృహములకు యాగయోగ్యుఁడు నగు నప్రతిగత బృహస్పతిని మే మాహ్వానింతుము ॥ 797

(6) గద్యము॥

సుఖకరుఁడు, నుజ్జ్వలుఁడు, వహనశీలుఁడు నగు నాదిత్యునిమాడ్కి జ్యోతిఃపూర్ణములగు నశ్వములు బృహస్పతిని వహించుఁగాక! వానికి బలము నివాసప్రదగృహమును గలదు ॥ 798

(7) గద్యము॥

బృహస్పతి శుచి గలవాఁడు. వాని వాహనము లనేకములు. వాఁడు సకల శోధయిత. హితుఁడు. వరణీయ యుక్తుఁడు. గమనశీలుఁడు. స్వర్గభోగకరుఁడు. దర్శనీయో త్తమ నివాసప్రదుఁడు. వాఁడు స్తోతలకు సర్వాపేక్షచే నధికాన్నము నొసంగును ॥ 799

(8) గద్యము॥

బృహస్పతి దేవునకు జనను లగు ద్యావాభూములను దేవీద్వయముయొక్క మహిమ బలములు బృహస్పతిని వృద్ధిఁ బరచునుగాక! ఓ సఖిగణమా! వర్ధనీయ బృహస్పతికి వృద్ధి నొసంగుము! వాఁడు ప్రభూతాన్నమునిమిత్తము జలమును దరళముగను, నవగాహన యోగ్యముగను జేయును ॥ 800

(9) గద్యము॥

ఓ బ్రహ్మణస్పతీ! వజ్రయుక్తుఁడగు నింద్రుని మంత్రరూపమున స్తుతించితిమి. మీరు కర్మలను రక్షింపుఁడు! బహుశ్రుతులను వినుఁడు! మీ ప్రసాదభోజులము. మ మ్మాక్రమించిన శత్రుసేనను వినాశము సేయుము! ॥ 801

(10) గద్యము॥

ఓ బృహస్పతీ! నీవు నింద్రుఁడు నుభయులుఁ బార్థివ స్వర్గీయ ధనంబులకు నీశ్వరులు. మీ రిరువురును స్తుతికారు లగు స్తోతలకు ధన మొసంగుఁడు! మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 802

## సూక్తమ్ — 98

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—ఇన్ద్రః, 7-ఇన్ద్రాబృహస్పతీ
ఛందః—త్రిష్టుప్

(1) అధ్వర్యవో ఽరుణం దుగ్ధమంశుం జుహోతన వృషభాయ క్షితీనామ్ ।
గౌరాద్ వేదీయాగ్ం[1] అవపానమిన్ద్రో విశ్వాహేద్ యాతి సుతసోమమిచ్ఛన్ ॥ 796

---

1. వేదీయాగ్ంఽఅవపాన. (ప్రా.ప్ర.)

(2) యద్ దధిషే ప్రదివి చార్వన్నం దివేదివే[1] పీతిమిదస్య వక్షి ।

ఉత హృదోత మనసా జుషాణ[2] ఉశన్నిన్ద్ర ప్రస్థితాన్ పాహి సోమాన్ ॥ 797

(3) జజ్ఞానః సోమం సహసే పపాథ ప్ర తే మాతా మహిమానమువాచ ।

ఏన్ద్ర పప్రాథోర్వన్తరిక్షం యుధా దేవేభ్యో వరివశ్చకర్థ ॥ 798

(4) యద్ యోధయా మహతో మన్యమానాన్ త్సాక్షామ తాన్ బాహుభిః శాశదానాన్ ।

యద్ వా నృభిర్వృత[3] ఇన్ద్రాభియుధ్యాస్తం త్వయాజిం సౌశ్రవసం జయేమ ॥ 799

(5) ప్రేన్ద్రస్య వోచం ప్రథమా కృతాని ప్ర నూతనా మఘవా యా చకార ।

యదేదదేవీరసహిష్ట మాయా[4] అథాభవత్ కేవలః సోమో[5] అస్య ॥ 800

(6) తవేదం విశ్వమభితః పశవ్యం యత్ పశ్యసి చక్షసా సూర్యస్య ।

గవామసి గోపతిరేక[6] ఇన్ద్ర భక్షీమహి తే ప్రయతస్య వస్వః ॥ 801

---

1. దివోదివే పీత, 2. జుషాణఽఉశన్నిన్ద్ర, 3. నృభిర్వృతఽఇన్ద్రా, 4. మాయాఽఅథా, 5. సోమోఽఅస్య,

6. రేకఽఇన్ద్ర. (వ్రా. ప్ర.)

(7) బృహస్పతే యువమిన్ద్రశ్చ వస్వో దివ్యస్యేశాథే[1] ఉత పార్థివస్య ।
ధత్తం రయిం స్తువతే కీరయే చిద్ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 802

## సూక్తము—98

†ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—ఇంద్రుఁడు, 7-ఇంద్రాబృహస్పతులు

(1) గద్యము॥

ఓ యధ్వర్యుగణమా! మనుష్యులలో శ్రేష్ఠుండగు నింద్రునికై దీప్తిమంతమును, నభిషుతమును నగు సోమమును ద్రావుము! ఇంద్రుఁడు గౌరవమృగాపేక్షచే శీఘ్రచారస్థితపాతవ్య సోమమును దెలిసికొని సోమాభిలాషి యగు యజమాను నన్వేషించుచు సర్వదా వచ్చును ॥ 803

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! పూర్వకాలముననే సుందరాన్నములను ధరించితివి. ఎటులనో ప్రత్యహ మా సోమపానమును గోరుము! ॥ 804

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు జన్మమెత్తి బలమునకై సోమమును ద్రావితివి. మాత నీ మహిమను దెల్పెను. నీవు విస్తీర్ణాంతరిక్షమును బూర్ణము గావించితివి. దుగ్ధమునిమిత్తము ధనోత్పాదనముఁ జేసితివి ॥ 805

---

1 శాథేఽఉత. (వ్రా.ప్ర.)

† ఇక్కడ వ్రాతప్రతిలో (8వసంపుటము. 235పుట) ఋషికి మారుగా దేవత అని పొరపాటున వ్రాయఁబడినది.

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! ప్రభూతాభిమాన విశిష్ట శత్రువులతో యుద్ధము తటస్థించినపుడు హింసక గణములను హస్తములఁ దిరస్కరించెదము. నీవు మరుద్గణముతో యుద్ధ మొనర్చినచో సుందరాన్నమునకు హేతుభూత మగు నా సంగ్రామమందు నీ సాహాయ్యమున జయమును బొందెదము ॥ 806

(5) గద్యము॥

ఇంద్రుని పురాతన కర్మ నంతయుఁ గీర్తించెదము. అందుకుఁ గారణ మేమనఁగా వాఁడు దేవి కాని మాయను దిరస్కరించెను. కాఁబట్టి సోమము కేవల మింద్రునిదియే! । 807

(6) గద్యము॥

ఓ యింద్రుఁడా! పశుహితకర మగు నే విశ్వము నాల్గుదిక్కుల నుండెనో! సూర్యుని తేజస్సు నేది చూచుచున్నదో! యీ సమసమును నీయదియే. నీ వేకాకివై సమస్త సోమమునకుఁ బతి వగుదువు ॥ 808

(7) గద్యము॥

ఓ బృహస్పతీ! నీవు నింద్రుఁడు పార్థివ స్వర్గ గణములకు నీశ్వరులు. మీ రిరువురును స్తుతికారి యగు స్తోతకు ధనము నొసంగుఁడు! మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బరిపాలింపుఁడు! ॥ 809

## సూక్తమ్—99

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విష్ణుః, 4-6-ఇన్ద్రావిష్ణూ
ఛందః—త్రిష్టుప్

(1) పరో మాత్రయా తన్వా వృధాన న తే మహిత్వమన్వశ్నువన్తి ।
ఉభే తే విద్మ రజసీ పృథివ్యా విష్ణో దేవ త్వం పరమస్య విత్సే ॥ 803

(2) న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమన్తమాప ।
ఉదస్తభ్నా[1] నాకమృష్వం బృహన్తం దాధర్థ ప్రాచీం కకుభం పృథివ్యాః ॥ 804

(3) ఇరావతీ ధేనుమతీ హి భూతం సూయవసినీ మనుషే దశస్యా ।
వ్యస్తభ్నా రోదసీ విష్ణవేతే దాధర్థ పృథివీమభితో మయూఖైః ॥ 805

(4) ఉరుం యజ్ఞాయ చక్రథురు లోకం జనయన్తా సూర్యముషాసమగ్నిమ్ ।
దాసస్య చిద్ వృషశిప్రస్య మాయా జఘ్నథుర్నరా పృతనాజ్యేషు ॥ 806

---

1. ఉదస్త. (బ్రా.ప్ర.)

(5) ఇన్ద్రావిష్ణూ దృంహితాః శమ్బరస్య నవ పురో నవతిం చ శ్నథిష్టమ్ ।
శతం వర్చినః సహస్రం చ సాకం హథో1 అప్రత్యసురస్య వీరాన్ ॥ 807

(6) ఇయం మనీషా బృహతీ బృహన్తోరుక్రమా తవసా వర్ధయన్తీ ।
ररే వాం స్తోమం విదథేషు విష్ణో పిన్వతమిషో వృజనేష్విన్ద్ర ॥ 808

(7) వషట్ తే విష్ణవాస2 ఆ కృణోమి తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధన్తు త్వా సుష్టుతయో గిరో మే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 809

## సూక్తము—99

ఋషి—మైత్రావరుణి యగు వసిష్ఠుఁడు

దేవత—విష్ణువు,4-6-ఇంద్రావిష్ణువులు*

(1) గద్యము॥

ఓ విష్ణువా! నీవు మాతృ శరీరము నతిక్రమించియున్నయెడల నీ మహిమను నెవ్వరును దెలిసికొనలేరు. పృథివి మొదలు రెండు లోకములను మే మెఱుంగుదుము. కాని నీవు కేవలుఁడవు. ఓ దేవా! పరమలోక మవగత మైనది ॥ 810

1. హథోఽఅప్రతను, 2. వాసఽఆ కృణోమి. (వ్రా.ప్ర.)

* ఈ సూక్తమునకు వ్రాతప్రతిలో (8వ సంపుటము. 237పుట.) 1—6 ఋక్కులవరకు నింద్రావిష్ణువులు మిగిలిన వానికి విష్ణువు దేవతగా శ్రీనేమానివారు వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతలపట్టికలో ఋక్సంఖ్యా విరహితముగా "విష్ణువు నింద్రావిష్ణువులు" దేవతలుగా వ్రాసిరి.

(2) గద్యము॥

ఓ దేవవిష్ణూ! యెవ్వరు జన్మించిరో! యెవ్వరు జన్మింపఁగలరో! వా రెవ్వరును నీ మహిమను దెలిసికొన సమర్థులు కాఁజాలరు. దర్శనీయ బృహన్నాకమును నూర్ధ్వముగా నీవు ధరించుచున్నావు. నీవు పృథివీ పూర్వదిక్కును ధరించుచున్నావు ॥ 811

(3) గద్యము॥

ఓ ద్యావాభూములారా! మీరు స్తుతి కారణులగు మనుష్యులకు దాన మొసంగుటకు నిచ్ఛఁ బూని యన్నవతులు, ధేనుమతులు, సుందరయవ విశిష్టలు నగుచున్నారు. ఓ విష్ణువా! యీ ద్యావాభూములను నీవు మూఁడు విధముల ధరించుచున్నావు. సర్వత్రస్థిత మయూఖముద్వారా యీ పృథివిని ధరించుచున్నావు ॥ 812

(4) గద్యము॥

ఓ యింద్రావిష్ణువులారా! సూర్యాగ్నులను నుషస్సును బుట్టించి మీరు యజమానులకు విస్తీర్ణ లోకమును సృజించితిరి. *వృషశిప్రుఁడను దాసుని మాయను నో నేతృద్వయమా! సంగ్రామమందు నశింపఁజేసితిరి ॥ 813

(5) గద్యము॥

ఓ యింద్రావిష్ణువులారా! శంబరుని నవనవతి దృఢపురములను నేలఁ గల్పితిరి. మీరు వర్చినామకాసురుని శతసహస్ర వీరులను గదలకుండ వారు మరి శత్రువులు కాకుండఁ గావించితిరి ॥ 814

(6) గద్యము॥

ఈ మహాస్తుతి, బృహత్తులు, విస్తీర్ణులు, విక్రమయుక్తులు, బలవంతులు నగు నింద్రావిష్ణువులను వృద్ధిఁ బొందించును. ఓ యింద్రావిష్ణువులారా! మీకు యజ్ఞస్థలమందు స్తోమ మిచ్చుచున్నారు. మీరు మాకు యుద్ధమందు నన్నమును వృద్ధిఁ బొందింపుఁడు! ॥ 815

---

* వృషప్రభుఁడనుదాసుని—అని శ్రీనేమానివారి పాఠము. చూ-వ్రాతప్రతి. 8వ సంపుటము. 238 పుట.

(7) గద్యము॥

ఓ విష్ణువా! ని న్నుద్దేశించి ముఖమునుండి వషట్కారము బయలువెడలుచున్నది. మా యీ హవ్యమును సేవింపుము! మా సుస్తుతి, వాక్యములు, నిన్ను వృద్ధిఁ బొందించుఁగాక! మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బాలింపుఁడు ! ॥ 816

## సూక్తమ్—100

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—విష్ణుః
ఛందః—త్రిష్టుప్

(1) నూ మర్తో దయతే సనిష్యన్ యో విష్ణవ[1] ఉరుగాయాయ దాశత్ ।
ప్ర యః సత్రాచా మనసా యజాత[2] ఏతావన్తం నర్యమావివాసాత్ ॥ 810

(2) త్వం విష్ణో సుమతిం విశ్వజన్యామప్రయుతామేవయావో మతిం దాః ।
పర్చో యథా నః సువితస్య భూరేరశ్వావతః పురుశ్చన్ద్రస్య రాయః ॥ 811

(3) త్రిర్దేవః పృథివీమేష[3] ఏతాం వి చక్రమే శతర్చసం మహిత్వా ।
ప్ర విష్ణురస్తు తవసస్తవీయాన్ త్వేషం హ్యస్య స్థవిరస్య నామ ॥ 812

---

1. విష్ణావ౽ఉరుగాయాయ, 2. యజాత౽ఏతా, 3. మేష౽ఏతాం. (వ్రా. ప్ర.)

(4) వి చక్రమే వృథివీమేష[1] ఏతాం క్షేత్రాయ విష్ణుర్మనుషే దశస్యన్ ।
ధ్రువాసో[2] అస్య కీరయో జనాస[3] ఉరుక్షితిం సుజనిమా చకార ॥ 813

(5) ప్ర తత్ తే[4] అద్య శిపివిష్ట నామాఽర్యః శంసామి వయునాని విద్వాన్ ।
తం త్వా గృణామి తవసమతవ్యాన్ క్షయన్తమస్య రజసః రాకే ॥ 814

(6) కిమిత్ తే విష్ణో పరిచక్ష్యం భూత్ ప్ర యద్ వవక్షే శిపివిష్టో[5] అస్మి ।
మా వర్పో[6] అస్మదప గూహ ఏతద్ యదన్యరూపః సమిథే బభూథ ॥ 815

(7) వషట్ తే విష్ణవాస[7] ఆ కృణోమి తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్ ।
వర్ధన్తు త్వా సుష్టుతయో గిరో మే యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 816

ఇతి
పంచమోఽష్టకే షష్ఠోఽధ్యాయ
స్సమాప్తః

---

1. మేషఽఏషాం, 2. ధ్రువాసోఽఅద్య, 3. జనాసఽఉరుక్షితిం, 4. తేఽఉద్య, 5. శిపివిష్టోఽఅస్మి, 6. వర్పోఽఅస్మదప గూహఽఏతద్, 7. వాసఽఆ కృణోమి. (ప్రా.ప్ర.)

## సూక్తము—100

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు

దేవత—విష్ణువు

(1) గద్యము॥

ఎవ్వఁడు బహులోక విస్తీర్ణుఁడగు విష్ణువున కా హవ్యదాన మొసంగునో! యెవ్వఁడు యుగప దుచ్చరిత స్తోత్రములచేఁ బూజలఁ గావించునో! యెవ్వఁడు మనుష్య గణములకు హితకరుఁ డగు విష్ణువునకుఁ బరిచర్య గావించునో! యా మర్త్యుఁడు శీఘ్రముగ ధనేచ్ఛను బూర్తి గావించుకొనును ॥ 817

(2) గద్యము॥

అభిలాషప్రదుఁడ వగు విష్ణువా! సర్వజన హితకరమును. దోషరహితము నగు నను గ్రహమును మాపైఁ జూపుము! దేనివల్ల సుప్రాప్తము, నశ్వవంతము, బహులోక ప్రీతికరము నగు ధనము లభించునో! దానిని గావింపుము ! ॥ 818

(3) గద్యము॥

ఈ దేవత శతసంఖ్యాక కిరణ విశిష్ట యగు భూమియందు స్వీయ మహిమవలన మూఁడు మారులు ప్రదక్షిణము కావించును. వృద్ధునికంటె వృద్ధతముఁ డగు విష్ణువు మాకు స్వామి. ప్రవృద్ధ విష్ణువురూపము ప్రీతియుతము ॥ 819

(4) గద్యము॥

ఈ విష్ణు వీ పృథివిపై నివసించుటకు మనుష్యుల కీయ నిచ్ఛగించి ప్రదక్షిణఁ జేసెను. ఈ విష్ణువు స్తోతలు నిశ్చలులు. సుజన్మ గల విష్ణువు విస్తీర్ణ నివాస స్థానమును నిర్మించెను ॥ 820

(5) గద్యము॥

ఓ శిపివిష్టుఁడా! యిపుడు మా స్తుతిస్వామి జ్ఞాతవ్యము నెఱింగి ప్రసిద్ధము విఖ్యాతము నగు నీ నామమును గీర్తింతును. నీవు ప్రబుద్ధుఁడవు. నేను బ్రబుద్ధుఁడ నైనచో నీ స్తుతిఁ జేసెదను. నీవు రజోలోకపరమం దుండుటయే దానికిఁ గారణము ॥ 821

(6) గద్యము॥

ఓ విష్ణువా! "నేను శిపివిష్టుఁడను" అని నామమును బ్రఖ్యాపనముఁ జేయుట నీ కుచితముగా నున్నదా? నీవు సంగ్రామమం దన్యరూపమును ధరించెదవు. మా సమీపమున నీ శరీరము కనఁబడునట్లు చేసెదవా? లేదా? ॥ 822

(7) గద్యము॥

ఓ విష్ణువా! నీగురించి ముఖమునుండి వషట్కారము బయలువెడలుచున్నది. కాఁబట్టి యో శిపివిష్టుఁడా! యీ హవ్యమును సేవింపుము! మా స్తుతులు, వాక్యములు, నిన్ను వృద్ధిఁ బొందించునుగాక! మీరు సర్వదా మమ్ము స్తుతులచేఁ బాలించుఁడు! ॥ 823

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమున షష్ఠాధ్యాయము
సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## సప్తమం మండలమ్

### పంచమోఽష్టకః—సప్తమోఽధ్యాయః

### సూక్తమ్—101*

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః (వృష్టికామః), కుమార ఆగ్నేయో వా
దేవతా—పర్జన్యః
ఛందః—త్రిష్టుప్

(1) తిస్రో వాచః ప్ర వద జ్యోతిరగ్రా యా[1] ఏతద్ దుహ్రే మధుదోఘమూధః ।
స వత్సం కృణ్వన్ గర్భమోషధీనాం సద్యో జాతో వృషభో రోరవీతి ॥



---

* ఈ సప్తమమండలములోని 101, 102 సూక్తములు పర్జీకరణ సూక్తములు. ఉపవాసముండి జలమధ్యమునఁ గంఠముకూడ నీటిలో మునుగునట్లు తూర్పునకుఁ దిరిగి సూర్యున కభిముఖముగా నిలిచి యీ రెండు సూక్తములను ముమ్మారు జపింపఁగా నైదురాత్రుల పిదప వర్షము తప్పక కురియునని ఋగ్విధాన గ్రంథములో శౌనక మహర్షి చెప్పెను. శౌనకుఁడు చెప్పిన యా శ్లోకము లివి.

ఆస్యదఘ్నం విగాహ్యాపః ప్రాఙ్ముఖః ప్రయత శ్శుచిః
సూక్తాభ్యాం తిస్ర ఆదిభ్యాంముపతిష్ఠేత భాస్కరమ్ ॥
అనశ్నతైతజ్జప్తవ్యం వృష్టికామేన యత్నతః
పంచరాత్రేఽప్యతిక్రాంతే మహతీం వృష్టిమాప్నుయాత్ ॥

ఋగ్విధానమ్_2_326_27

1. యాఽఏఽద్. (ప్రా.ప్ర.)

(2) యో వర్ధన[1] ఓషధీనాం యో అపాం యో విశ్వస్య జగతో దేవ[2] ఈశే ।

స త్రిధాతు శరణం శర్మ యంసత్ త్రివర్తు జ్యోతిః స్వభిష్ట్యస్మే ॥ 818

(3) స్తరీరు త్వద్ భవతి సూత[3] ఉ త్వద్ యథావశం తన్వం చక్ర[4] ఏషః ।

పితుః పయః ప్రతి గృభ్ణాతి మాతా తేన పితా వర్ధతే తేన పుత్రః ॥ 819

(4) యస్మిన్ విశ్వాని భువనాని తస్థుస్తిస్రో ద్యావస్త్రేధా సస్రురాపః ।

త్రయః కోశాస[5] ఉపసేచనాసో మధ్వః శ్చోతన్త్యభితో విరప్శమ్ ॥ 820

(5) ఇదం వచః పర్జన్యాయ స్వరాజే హృదో[6] అస్త్వన్తరం తజ్జుజోషత్[7] ।

మయోభువో వృష్టయః సన్త్వస్మే సుపిప్పలా[8] ఓషధీర్దేవగోపాః ॥ 821

(6) స రేతోధా వృషభః శశ్వతీనాం తస్మిన్నాత్మా జగతస్తస్థుషశ్చ ।

తన్మ[9] ఋతం పాతు శతశారదాయ యూయం పాత స్వస్తిభిః సదా నః । 822

---

1. వర్ధనఽఓషధీనాం యోఽఅపాం, 2. దేవఽఈశే, 3. సూతఽఉత్వద్, 4. చక్రఽఏషః, 5. కోశాసఽఉప.
6. హృదోఽఅస్త్వ, 7. జోషతీ, 8. సుపిప్పలాఽఓషధీ, 9. తన్మఽఋతం. (వ్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## సప్తమ మండలము

### పంచమాష్టకము—సప్తమాధ్యాయము

### సూక్తము—101

ఋషి— మైత్రావరుణియగు వసిష్ఠుఁడు (వృష్టికాముఁడు) లేక
అగ్నిపుత్ర కుమారుఁడు
దేవత—పర్జన్యుఁడు

(ఉపవాసము నొనర్చి జలమధ్యమునఁ బ్రవేశించుచు నీ సూక్తమును, దీని తరువాత నున్న సూక్తమును, శౌనకుఁడు పఠించెను. పంచరాత్రులైన పిదప నిశ్చయముగా వర్షము కురిసెను.)*

(1) గద్యము॥

అగ్రభాగమున జ్యోతిర్విశిష్టమగు నే మూఁడు వాక్యములు జలోత్పాదక మేఘమును దోహనము చేసెనో! యా వాక్యముల నుచ్చరింపుము! వాఁడు సహవాసి యగు విద్యుదగ్నిని ప్రాదుర్భవింపఁజేయుచు నోషధులకు గర్భోత్పాదన మొనర్చుచుఁ దత్‌క్షణమే పుట్టి వృషభము వలెనే శబ్దము చేయును ॥ 824

(2) గద్యము.

ఎవఁ డోషధి సమూహములకు జలమునకు వృద్ధి కలిగించునో! యెవఁడు దేవతల సర్వలోకములకు నీశ్వరుఁడో! వాఁడు మూఁడు విధము లగు భూమిసహిత గృహములను సుఖమును నిచ్చుఁగాక! నాకు మూఁడు విధముల వర్తమాన సుగతియుత మగు జ్యోతిస్సును నొసంగునుగాక! ॥ 825

---

* చూ. 381వపుటలోనున్న ఫుట్‌నోటు

(౩) గద్యము॥

వీనియొక్క రూపము నివృత్తప్రసవ గోవులను రెండవ రూపము జలమును బ్రసవించును.
వీఁ డిచ్ఛానుసారముగఁ దన రూపమును నిర్మించును. పితృ మాతల సమీపమునఁ
బయస్సును గ్రహించును. అందుచేఁ బితృ పుత్రు లుభయులు వర్ధితు లగుదురు ॥ 826

(4) గద్యము॥

సమస్త భువనములు నెవరివలన నున్నవో! యెవరివలన ద్యోలోక ప్రభృతి లోకములు నిలిచి
యున్నవో! యెవరివలనఁ బాప మంతయు మూఁడు విధముల నశియించునో! యుపసేచనకర
మగు నా త్రిప్రకారక మేఘము మహాత్ముఁ డగు పర్జన్యునకు నాల్గు దిక్కులను
మధూదకమును వర్షించును ॥ 827

(5) గద్యము॥

స్వాయత్త దీప్తి గల పర్జన్యు నుద్దేశించి యీ స్తోత్రము గావింపఁబడినది. వాఁడు దీనిని
గ్రహించుఁగాక! ఇది వాని హృదయమును గ్రహించును. మా నిమిత్తము సుఖకర మగు
వర్షము పడును. పర్జన్యుఁ డెవ్వని రక్షకుఁడో! యా యోషధి సమూహము
సుఫలప్రద మగును ॥ 828

(6) గద్యము॥

ఈ పర్జన్యుఁడు వృషభమువలె బహుతరౌషధి సమూహమునుగూర్చి రేతస్సు నొసంగును.
స్థావర జంగమములయొక్క యాత్మ వానివల్లనే వసించును. తత్ప్రదత్తజలము శతవత్సర
వ్యాపి యగు జీవనముకొరకు మమ్ము రక్షించుఁగాక! మీరు సర్వదా స్తుతులచే
మమ్ముఁ బరిపాలింపుఁడు! ॥ 829

## సూక్తమ్—102

ఋషిః —మైత్రావరుణిర్వసిష్ఠః (వృష్టికామః), కుమార ఆగ్నేయో వా
దేవతా—పర్జన్యః
ఛందః—గాయత్రీ, 2-పాదనిచృత్

(1) పర్జన్యాయ ప్ర గాయత దివస్పుత్రాయ [1]మీఢుషే ।
స నో యవసమిచ్ఛతు ॥ 823

(2) యో గర్భమోషధీనాం గవాం కృణోత్యర్వతామ్ ।
పర్జన్యః పురుషీణామ్ ॥ 824

(3) తస్మా[2] ఇదాస్యే హవిర్జుహోతా మధుమత్తమమ్ ।
ఇళాం నః సంయతం కరత్ ॥ 825

## సూక్తము—102

ఋషి—అగ్నిపుత్రకుమారుఁడు (వృష్టికాముఁడు) లేక
మైత్రావరుణియగు వసిష్ఠుఁడు*
దేవత—పర్జన్యుఁడు

(1) గద్యము॥

అంతరిక్షపుత్రుఁడు, సేచన సమర్థుఁడు, నగు పర్జన్యు నుద్దేశించి స్తోత్రములను బఠింపుము!
వాఁడు మా యన్నమును గోరునుగాక! ॥ 830

1. మీహ్ళుషే, 2. తస్మాఉఇదాస్యే. (వ్రా.ప్ర.)

*వ్రాతప్రతిలో 8వ సంపుటములోను (244 వ పుట) ఋషిదేవతల పట్టికలు గల 15b సంపుటములోను నీ సూక్తమునకు ఋషి వశిష్ఠుఁడుగా శ్రీ నేమానివారు వ్రాసిరి.

(2) గద్యము॥

పర్జన్య దేవుఁ డోషధి సమూహమునకు, గో సమూహమునకు నశ్వసమూహమునకు, నార్య సమూహమునకు గర్భోత్పాదనము గావించును॥ 831

(3) గద్యము॥

వాని నుద్దేశించి దేవతల కార్యభూతుఁడగు నగ్నియందు నతిశయ రసవంత మగు హవ్యమును హోమము చేయుదుము! వాఁడు మాకు నిశ్చయముగా నన్నము నొసఁగును॥ 832

## సూక్తమ్—103

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—మణ్డూకాః (పర్జన్యః)
ఛందః—త్రిష్టుప్, 1-అనుష్టుప్

(1) సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః ।
వాచం పర్జన్యజిన్వితాం ప్ర మణ్డూకా[1] అవాదిషుః ॥ 826

(2) దివ్యా[2] ఆపో అభి యదేనమాయన్ దృతిం న శుష్కం సరసీ శయానమ్ ।
గవామహ న మాయుర్వత్సినీనాం మణ్డూకానాం వగ్నురత్రా సమేతి ॥ 827

---

1. మణ్డూకాఽఅవాదిషుః, 2. దివ్యాఽఆపోఽఅభి (వ్రా.ప్ర.)

(3) యదీమేనాగ్ం[1] ఉశతో అభ్యవర్షీత్ తృష్యావతః ప్రావృష్యాగతాయామ్ ।
అక్ఖలీకృత్యా పితరం న పుత్రో[2] అన్యో అన్యముప వదన్తమేతి ॥ 828

(4) అన్యో[3] అన్యమను గృభ్ణాత్యేనోరపాం ప్రసర్గే యదమన్దిషాతామ్ ।
మణ్డూకో యదభివృష్టః కనిష్కన్ పృశ్నిః సంపృంక్తే[4] హరితేన వాచమ్ ॥ 829

(5) యదేషామన్యో[5] అన్యస్య వాచం శాక్తస్యేవ వదతి శిక్షమాణః ।
సర్వం తదేషాం సమృధేవ పర్వ యత్ సువాచో వదథనాధ్యప్సు[6] ॥ 830

(6) గోమాయురేకో[7] అజమాయురేకః పృశ్నిరేకో హరిత[8] ఏక ఏషామ్ ।
సమానం నామ బిభ్రతో విరూపాః పురుత్రా వాచం పిపిశుర్వదన్తః ॥ 831

(7) బ్రాహ్మణాసో[9] అతిరాత్రే న సోమే సరో న పూర్ణమభితో వదన్తః ।
సంవత్సరస్య తదహః పరి ష్ఠ యన్మణ్డూకాః ప్రావృషీణం[10] బభూవ ॥ 832

1. యదీమేనాగ్ంఽఉశతోఽఅభ్య, 2. పుత్రోఽఅన్యోఽఅన్య, 3. అన్యోఽఅన్య 4. సంపృక్తే, 5. మన్యోఽఅన్య, 6. దథనాధ్యప్సు, 7. రేకోఽఅజమా, 8. హరితఽఏకఽఏషామ్, 9. బ్రాహ్మణాసోఽఅతిరాత్రే న, 10. ప్రావృషీణాం. (వా.ప్ర.)

(8) బ్రాహ్మణాసః[1] సోమినో వాచమక్రత బ్రహ్మ[2] కృణ్వన్తః పరివత్సరీణమ్ ।
అధ్వర్యవో ఘర్మిణః సిష్విదానా[3] ఆవిర్భవన్తి గుహ్యా న కే చిత్ ॥ 833

(9) దేవహితిం[4] జుగుపుర్ద్వాదశస్య[5] ఋతుం నరో న ప్ర మినన్త్యేతే ।
సంవత్సరే ప్రావృష్యాగతాయాం తప్తా ఘర్మా[6] అశ్నువతే విసర్గమ్ ॥ 834

(10) గోమాయురదాదజమాయురదాత్ పృశ్నిరదాద్వరితో నో వసూని ।
గవాం మణ్డూకా దదతః శతాని సహస్రసావే ప్ర తిరన్త[7] ఆయుః ॥ 835

† (11) ఉపప్లవత మండూకి వర్షమా వద తాదురి ।
మధ్యే హ్రదస్య ప్లవస్వ నిగృహ్య చతురః పదః ॥ 836

---

1. బ్రాహ్మణాసః, 2. బ్రహ్మ కృణ్వన్తః, 3. దానా-ఆవిర్భ, 4. దేవహితం, 5. దశస్య-ఋతుం,
6. ధర్మా-అశ్ను, 7. తిరన్త-ఆయుః. (వ్రా.ప్ర.)

† ఈ ఋక్కు "ఖిల" మంత్రముగా గొన్ని వ్రాతప్రతులలోను బరిశిష్టముగా గొన్ని వ్రాతప్రతులలోను నున్నది.

## సూక్తము—103

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—మండూకుఁడు

(వృష్టికారుఁడగువాఁ డీసూక్తమును జపించును. వసిష్ఠుఁడు వర్షమును గోరినవాఁడై పర్జన్యుని స్తుతించెను. దాని కంతకు మండూకుఁ డనుమోదించెను. వాఁడు మండూక గణమును స్తుతించెను.)

(1) గద్యము॥

సంవత్సర వ్రతచారి యగు స్తోతృవర్గము న్యాయమున సంవత్సరము శయనించి మండూకగణము పర్జన్యునకుఁ బ్రీతికర మగు వాక్యముల నుచ్చరించెను ॥ 833

(2) గద్యము॥

శుష్కచర్మమును బోలి సరోవరమందున్న మండూక గణము చెంతను సర్గీయ జల మెప్పుడు వచ్చునో! యప్పుడు వత్సయుక్త ధేనుశబ్దమువలె మండూకగణమునకు శబ్దము కలుఁగును॥ 834

(3) గద్యము॥

వర్షాకాల మేతెంచిన పిదపఁ బర్జన్యుఁడు కామనావంతము, తృష్ణావంతము, నగు మండూక గణము జలముచే సిక్త మగును. అపుడు పుత్రుఁడు నస్కృలశీశబ్దమును జేయుచుఁ దండ్రి నికటమునకుఁ జనునట్లుగ నొక మండూక మిం కొక మండూకముచెంతకుఁ బోవును ॥ 835

(4) గద్యము॥

వర్షము కురిసిన పిదప నెప్పుడు మండూక ద్వయము సంహృష్ట మగునో! యెప్పుడు పర్జన్యునిచేఁ దడుపఁబడినదియై యత్యంతము లంఘించుచు ధూమ్రవర్ణ మండూకము హరిద్వర్ణ మండూకముతోఁ గలిసి యొకచోట శబ్దము నొనర్చునో! యపు డొక మండూకము వేఱొక మండూకముపైని దయను జూపును ॥ 836

(5) గద్యము॥

గురుశిష్యన్యాయము ననుసరించి యీ మండూకము లన్నింటి మధ్యను నొక మండూక మన్య మండూకము ననుసరించును. ఎపుడు సుందరశబ్దము గలదానవై యో మండూకమా! జలముపై లంఘించుచు శబ్దించెదవో ! యపుడు నీ శరీర మంతయు సమృద్ధ మగును ॥ 837

(6) గద్యము॥

వీనిలో నొకదాని శబ్దము, గౌరు న్యాయమును వేఱొకదాని శబ్దము ఛాగల న్యాయమును, ననుసరించును. ఒకటి ధూమ్రవర్ణము. ఇం కొకటి హరిద్వర్ణము. వీని కన్నిటికి నామ మొక్కటియే. కాని వీని రూపములు వివిధములు. ఇయ్యవి నానా దేశములందు శబ్దమును జేయుచుఁ బ్రాదుర్భవించును ॥ 838

(7) గద్యము॥

ఓ మండూకగణమా! యతిరాత్రనామక మగు సోమయాగమందు స్తోతలు వలె నిపుడు మీరు పూర్ణ సరోవరమునకు నాల్గుదిశలను శబ్దమును జేయుచుఁ బ్రావృట్టు సంచరించునపుడు నంతటఁ జెలరేగుఁడు ! ॥ 839

(8) గద్యము॥

సోమయుతులును సాంవత్సరిక స్తుతికారులు నగు స్తోతలవలె నీ మండూకగణము శబ్దమును జేయును. ప్రవర్గచారి యగు నధ్వర్యు గణమును బోలి ఘర్మాక్తకళేబరము గలదియుఁ దిరుగుచున్నదియు నగు నొకొక్క మండూకము తత్క్షణము వృష్టివలన నావిర్భవించును ॥ 840

(9) గద్యము॥

నేత లగు మండూకములు దేవకృత విధాన రక్షఁ జేయును. ఇయ్యవి ద్వాదశ మాసములను ఋతువులను హింసింపవు. సంవత్సరము పూర్ణమై వర్షము కురిసినచో గ్రీష్మతాప పీడిత మగు మండూకగణము గర్తములన్ను విడిచిపెట్టును ॥ 841

(10) గద్యము॥

ధేనువుమాటికి- శబ్దముఁ జేయు మండూకములు మాకు ధనమును నిచ్చునుగాక! అజము మాటికి- శబ్దించు మండూకములు మాకు ధనము నొసంగుఁగాక! ధూమ్రవర్ణ మండూకములు మాకు ధనమును గలుఁగఁజేయునుగాక! హరిద్వర్ణ మండూకములు మాకు ధనమును బ్రసాదించుఁగాక! *సహస్రౌషధులను బుట్టించెడు వర్షఋతువునందు మండూకము లపరిమిత గోవులను బ్రసాదించుఁగాక! మాకు నాయువును వృద్ధిపరచుఁగాక! ॥ 842

†(11) గీ॥ చక్కఁగా నుపప్లవమం దొక్క-రీతిఁ
గప్ప యుండియు రాతిలో నప్పునుండి
హ్రదము మధ్యను బ్లవగత మ్మొకచు నుండి
చతురపర మౌచు వర్షముఁ జాలువార్చు ॥ 843

## సూక్తమ్ —104

ఋషిః—మైత్రావరుణిర్వసిష్ఠః
దేవతా—(రాక్షోఘ్నం) ఇన్ద్రాసోమౌ, 8,16,19-22, 24-ఇన్ద్రః,
9,12-13-సోమః, 10, 14-అగ్నిః, 11-దేవాః, 17-గ్రావాణః,
18-మరుతః, 23-(పూర్వార్ధస్య) వసిష్ఠాశీః, (ఉత్తరార్ధస్య) పృథివ్యన్తరిక్షే
ఛందః—త్రిష్టుప్, 1-6,18,21,23-జగతీ, 7-జగతీ త్రిష్టుబ్వా, 25-అనుష్టుప్

(1) ఇన్ద్రాసోమా తపతం రక్ష[1] ఉబ్జతం న్యర్పయతం వృషణా తమోవృధః ।
పరా శృణీతమచితో న్యోషతం హతం నుదేథాం ని శిశీతమత్రిణః ॥ 837

---

* సహస్రోషధులు (వా.ప్ర.పా.)

† ఇది ఖిల మంత్రానువాదము. దీనిని శ్రీనేమానివా రాంధ్రీకరింపలేదు.

† రచయిత :— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. రక్షఉఉబ్జతంన్యర్పయంత. (వా.ప్ర.)

(2) ఇన్ద్రాసోమా సమఘశంసమభ్యఘం తపుర్యయస్తు చరురగ్నివాగ్ం[1] ఇవ ।
బ్రహ్మద్విషే క్రవ్యాదే ఘోరచక్షసే ద్వేషో ధత్తమనవాయం కిమీదినే ॥ 838

(3) ఇన్ద్రాసోమా దుష్కృతో వవ్రే[2] అన్తరనారమ్భణే తమసి ప్ర విధ్యతమ్ ।
యథా నాతః [3]పునరేకశ్చనోదయత్ తద్ వామస్తు సహసే మన్యుమచ్ఛవః ॥ 839

(4) ఇన్ద్రాసోమా[4] వర్తయతం దివో వధం సం పృథివ్యా[5] అఘశంసాయ తర్హణమ్ ।
ఉత్ తక్షతం స్వర్యంం పర్వతేభ్యో యేన రక్షో వావృధానం నిజూర్వథః ॥ 840

(5) ఇన్ద్రాసోమా వర్తయతం దివస్పర్యగ్నితప్తేభిర్యువమశ్మహన్మభిః ।
[6]తపుర్వధేభిరజరేభిరత్రిణో ని పర్శానే విధ్యతం యన్తు నిస్వరమ్ ॥ 841

(6) [7]ఇన్ద్రాసోమా పరి వాం భూతు విశ్వత[8] ఇయం మతిః కక్ష్యాశ్వేవ వాజినా ।
యాం వాం హోత్రాం పరిహినోమి మేధయేమా బ్రహ్మాణి నృపతీవ జిన్వతమ్ ॥ 842

1. వాగ్ంఽఇవ. 2. వవ్రేఽఅన్తర, 3. పునరేవశ్చ, 4. ఇన్ద్రాసోమావర్తయంతం, 5. పృథివ్యాఽఅఘశంసయా, 6. తపుర్వధే, 7. ఇన్ద్రాసోమా, 8. విశ్వతఽఇయం. (వ్రా.ప్ర.)

(7) ప్రతి స్మరేథాం తుజయద్భిరేవైర్హతం ద్రుహో రక్షసో భంగురావతః ।
ఇన్ద్రాసోమా దుష్కృతే మా సుగం భూద్ యో నః కదా చిదభిదాసతి ద్రుహా ॥ 843

(8) యో మా పాకేన మనసా చరన్తమభిచష్టే[1] అనృతేభిర్వచోభిః ।
ఆప[2] ఇవ కాశినా సంగృభీతా[3] అసన్నస్త్వాసత[4] ఇన్ద్ర వక్తా ॥ 844

(9) యే పాకశంసం విహరన్త[5] ఏవైర్యే వా భద్రం దూషయన్తి స్వధాభిః ।
అహయే వా తాన్ ప్రదదాతు సోమ[6] ఆ వా దధాతు నిరృతేరుపస్థే ॥ 845

(10) యో నో రసం దిప్సతి పిత్వో[7] అగ్నే యో అశ్వానాం యో గవాం యస్తనూనామ్ ।
రిపుః స్తేనః స్తేయకృద్ దభ్రమేతు ని ష హీయతాం తన్వా౩ తనా చ ॥ 846

(11) పరః సో[8] అస్తు తన్వా౩ తనా చ తిస్రః పృథివీరధో[9] అస్తు విశ్వాః ।
ప్రతి శుష్యతు యశో[10] అస్య దేవా యో నో దివా దిప్సతి యశ్చ నక్తమ్ ॥ 847

---

1. చష్టే౽అనృతే, 2. ఆప౽ఇవ, 3. భీతా౽అసన్న, 4. సత౽ఇన్ద్ర, 5. విహరన్త౽ఏవైర్యా,
6. సోమ౽ఆ వా, 7. పిత్వో౽అగ్నే యో౽అశ్వానాం, 8. సో౽అస్తు, 9. రధో౽అస్తు,
10. యశో౽అస్య. (ప్రా.ప్ర.)

(12) సువిజ్ఞానం చికితుషే జనాయ[1] సచ్చాసచ్చ వచసీ పస్పృధాతే ।

తయోర్యత్ సత్యం యతరదృజీయ స్తదిత్ సోమోఽవతి హన్త్యాసత్ ॥ 848

(13) న వా ఉ సోమో వృజినం హినోతి న క్షత్రియం మిథుయా ధారయన్తమ్ ।

హన్తి రక్షో హన్త్యాసద్ వదన్తముభావిన్ద్రస్య ప్రసితౌ శయాతే ॥ 849

(14) యది వాహమనృతదేవ[2] ఆస మోఘం వా దేవాగ్ం[3] అప్యూహే అగ్నే ।

కిమస్మభ్యం జాతవేదో హృణీషే ద్రోఘవాచస్తే నిరృథం సచన్తామ్ ॥ 850

(15) అద్యా మురీయ యది యాతుధానో[4] అస్మి యది వాయు స్తతప పూరుషస్య ।

అధా స వీరైర్దశభిర్వి యూయా యో మా మోఘం యాతుధానేత్యాహ ॥ 851

(16) యో మాయాతుం యాతుధానేత్యాహ యో వా రక్షాః శుచిరస్మీత్యాహ ।

ఇన్ద్రస్తం హన్తు మహతా వధేన విశ్వస్య జన్తోరధమస్పదీష్ట ॥ 852

---

1. జనాయసచ్చవచసీ, 2. దేవఽఆస, 3. దేవాగ్ంఽఅప్యూహేఽఅగ్నే, 4. ధానోఽఅస్మి. (వ్రా.ప్ర.)

(17) ప్ర యా జిగాతి ఖర్గలేవ నక్తమప ద్రుహా తన్వం౧ గూహమానా ।
వవ్రాగం౦[1] అనన్తాగం౦ అవ సా పదీష్ట గ్రావాణో ఘ్నన్తు రక్షస[2] ఉపబ్దైః ॥ 853

(18) వి తిష్ఠధ్వం మరుతో విక్ష్విచ్ఛత గృభాయత రక్షసః సం పినష్టన ।
వయో యే భూత్వీ పతయన్తి నక్తభిర్యే వా రిపో దధిరే దేవే[3] అధ్వరే ॥ 854

(19) ప్ర వర్తయ దివో[4] అశ్మానమిన్ద్ర సోమశితం మఘవన్ త్సం శిశాధి ।
ప్రాక్తాదపాక్తాదధరాదుదక్తాదభి జహి[5] రక్షసః పర్వతేన ॥ 855

(20) ఏత[6] ఉ త్యే పతయన్తి శ్వయాతవ[7] ఇన్ద్రం దిప్సన్తి దిప్సవోఽదాభ్యమ్ ।
శిశీతే శక్రః పిశునేభ్యో వధం నూనం సృజదశనిం యాతుమద్భ్యః ॥ 856

(21) ఇన్ద్రో యాతూనామభవత్ పరాశరో హవిర్మథీనామభ్యావివాసతామ్ ।
అభీదు శక్రః పరశుర్యథా వనం పాత్రేవ భిన్దన్ త్సత[8] ఏతి రక్షసః ॥ 857

---

1. వవ్రాగం౦ఽఅనన్తాగం౦ఽఅవ, 2. రక్షసఽ ఉపబ్దైః, 3. దేవేఽఅధ్వరే, 4. దివోఽఅశ్మాన,
5. జహిరక్షసః, 6. ఏతఽఉ త్యే, 7. తవఽఇన్ద్రం, 8. త్సతఽఏతి. (వా.ప్ర.)

(22) ఉలూకయాతుం శుశులూకయాతుం జహి శ్వయాతుముత కోకయాతుమ్ ।
సుపర్ణయాతుముత గృధ్రయాతుం దృషదేవ ప్ర మృణ రక్ష[1] ఇన్ద్ర ॥ 858

(23) మా నో రక్షో[2] అభి నడ్యాతుమావతామపోచ్ఛతు మిథునా[3] యా కిమీదినా ।
పృథివీ నః పార్థివాత్ పాత్వంహసో ఽన్తరిక్షం దివ్యాత్ పాత్వస్మాన్ ॥ 859

(24) ఇన్ద్ర జహి పుమాంసం యాతుధానముత స్త్రియం మాయయా శాశదానామ్ ।
విగ్రీవాసో మూరదేవా[4] ఋదన్తు మా తే దృశన్ త్సూర్యముచ్చరన్తమ్ ॥ 860

(25) ప్రతి చక్ష్వ వి చక్ష్వేన్ద్రశ్చ సోమ జాగృతమ్ ।
రక్షోభ్యో వధమస్యతమశనిం యాతుమద్భ్యః ॥ 861

ఇతి
సప్తమం మణ్డలం
సమాప్తమ్

---

1. రక్షఽఇన్ద్ర, 2. రక్షోఽఅభి, 3. మిథునా య, 4. దేవాఽ ఋదన్తు. (ప్రా. ప్ర.)

## సూక్తము—104†

ఋషి—మైత్రావరుణియగు వసిష్ఠుఁడు
దేవత—1-7, 15-ఇంద్రసోములు,
8,16,19-22,24-ఇంద్రుఁడు, 9,12-13-సోముఁడు, 10,14-అగ్ని, 11-దేవతలు,
17-గ్రావలు‡, 18-మరుత్తులు, 23-వశిష్ఠుని ప్రార్థనము (పూర్వార్థమునకు),
పృథివ్యంతరిక్షములు (ఉత్తరార్థమునకు)*

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! సోముఁడా! మీరు రాక్షసులకు సంతాపమును గలుఁగఁజేయుఁడు! హింసను బుట్టింపుఁడు! కామవర్షిద్వయమా! మీ రంధకారముచే వర్ధమాను లగు రాక్షసులను నీచులుగా నొనర్పుఁడు! జ్ఞానరహిత రాక్షసులను బరాఙ్ముఖులఁ గావించి హింసింపుఁడు! దగ్ధులుగాఁ జేయుఁడు!, చంపుఁడు!, దూరముగాఁ ద్రోలుఁడు! భక్షకరాక్షసులను నెండింపఁ జేయుఁడు! ॥ 844

† మన పూర్వులు యాగప్రియులు. అనార్యులు (పారసికాసురులు) యాగవిధ్వంసకులు. కావున వీరుభయులకుఁ బరస్పర కలహము లంకురించినవి. ఎప్పు డార్యులు యాగము చేయఁదలఁచిరో యప్పటి కప్పుడే యసురులు వెన్నంటివచ్చి రక్త వర్షమును, మనుష్య మాంసమును, నగ్నిగుండములందు రాల్చుచు నుద్గాతృహోత్రాది ఋత్విగ్వర్గమును జీకాకుపెట్టి హింసపరచుచు, నల్లరులు సాగించుచుండిరి. ఇట్టి యల్లరులకు యాగద్వేషమే కారణముగాని వేరొండుకాదు. అనార్యు లార్యుల యాగమును ధ్వంసమును జేయుచున్నట్లుగ నైతరేయ బ్రాహ్మణమునఁ గలదు. (2-11)

"దేవతలు యజ్ఞమును జేయుటకు సర్వసన్నద్ధులై యుండిరి. యజ్ఞముఁ జేయ మొదలిడిన వెంటనే యసురులందరును వారిని ముట్టడించిరి. యాగ మేవిధముగనైనఁ గాకుండఁ జేయుటకు విఘ్నములను గల్పించు చుండిరి...................దేవతలు మేలు కాంచి యాగపరిత్రాణార్థము యాగాగ్నిపరిత్రాణార్థము త్రైతాగ్ని తేజోమయమగు నొక యావరణమును యజ్ఞ హోమగుండమునకుఁ జుట్టును నిర్మించిరి. అసురులు జ్వాలాజాజ్వల్యమానమగు నావరణను జూచి జంకి పలాయితులైరి". అనార్యులిట్టి బాధలను బెట్టిరి. ఆర్యులు శత్రువులపైఁ దమకుఁగల యాగ్రహమును నీ సూక్తము మూలమున వెల్లడించినట్లు తోచుచున్నది.

అవ్రతు లని దూషింపఁబడిన పారసీకార్యు లైందవార్యులై ద్వేషము వహించి వారిని దూషించినట్లు "గాథా ఉపైన్వతి" అను గ్రంథమున జరదూష్ట్రా పాట పాడెను.

"ఓ దేవతలారా! మీరు దుష్టపిశాచములకుఁ బుట్టియున్నారు. ఈ సోమరసమును ద్రావి మదించియున్న మిమ్ము లను భూతము లావరించియున్నవి. సోమము మీకు ననేక మాయలను బుట్టించుచున్నది. మానవ జాతి నంతను విధ్వంసము చేయుచున్నది. ఈ మాయయందు మీ రారితేరి యున్నారు. .... ... .... .... మొదలగునవి కలవు. (నే.వేం.న.శా.)

‡ గ్రావలు = సోమము దంచునట్టి పాషాణములు.

* వ్రాతప్రతి 8వ సంపుటములో (248వ పుట) నీ సూక్తమునకు దేవతలుగా సోమాదులను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టీకలో సంఖ్యావిరహితముగా నాయా దేవతలను శ్రీ నేమానివారు వ్రాసిరి.

(2) గద్యము॥

ఓ యింద్రసోములారా! యనర్థవాదులు, నాక్రమణకారులు నగు రాక్షసుల కొక పర్యాయమే యభిభవమును జేయుఁడు! తాపప్రాప్త రాక్షసులను నగ్నియందు వేల్వఁబడిన చరువు వలె శోషింపఁజేయుఁడు!. బ్రహ్మద్వేషులు, క్రవ్యాదులు, ఘోరదర్శనులు నగు క్రూరబుద్ధులఁ బారఁద్రోలుఁడు! ॥ 845

(3) గద్యము॥

ఓ యింద్ర సోములారా! దుష్కర్మకారుల నావరింపుఁడు! అవలంబనరహితాంధకారముమధ్యను బెట్టి వారిని గొట్టుఁడు! వారిలో నొక్కఁడును నా యంధకారమునుండి తిరిగి రాఁజాలఁడు! ప్రసిద్ధ క్రోధసహిత మగు నీ బల మభిభవసమర్థ మగును ॥ 846

(4) గద్యము॥

ఓ యింద్రసోములారా! యంతరిక్షము నాల్గుప్రక్కలనుండియు నాయుధములను బ్రేరేపింపుఁడు! అనర్థోత్పాదనము భూమినుండి నశింపఁజేయు నాయుధములను బుట్టింపుఁడు! మేఘమునుండి యుపతాపప్రదమగు నశనిని బుట్టింపుఁడు! దానిచేఁ బ్రవృద్ధ రాక్షసులను నశింపఁజేయుఁడు! 847

(5) గద్యము॥

ఇంద్రసోములారా! యంతరిక్షము నాల్గుప్రక్కలనుండియు నాయుధములను బ్రేరేపింపుఁడు! మీ రగ్నిచే సంతప్తములు, తాపప్రదములు, ప్రహారయుతములు, జరారహితములు, ప్రస్తర వికారభూతములు నగు నస్త్రములఁ బూని రాక్షసుల పార్శ్వమందునఁ గొట్టుఁడు! వారు నిశ్శబ్దముగా వెడలుదురు ॥ 848

(6) గద్యము ॥

ఇంద్రసోములారా! కక్షబంధనరజ్జు వెటు లశ్వమును వేష్టించునో! యటు లీ మనోహరస్తుతి మిమ్ముఁ బొందును. మీరు బలవంతులరు. మేము మేధాబలముచే స్తోత్రముల నుచ్చరించుచున్నాము. రాజులవలె మీర లీ స్తోత్రములను ఫలయుక్తముగా నొనర్పుఁడు! ॥ 849

(7) గద్యము॥

ఇంద్రసోములారా! త్వరితములగు నశ్వసహాయమున మీరలు రండు! ద్రోహశీలులు, భంజనకారులు నగు రాక్షసులను సంహరింపుఁడు! దానివలన రాక్షసులకు సుఖ ముండదు. వారు ద్రోహులై యెక్కడను మమ్ము సంహరింపలేరు ॥ 850

(8) గద్యము॥

నేను బరిశుద్ధమనస్సుతో వ్రతము నాచరించెదను. అనృతవాక్యమువలన నెవ్వ రపరాధమును గావింతురో! ముష్టిచే గృహీతజలము భంగి నా యసత్యవాది యస్తిత్వశూన్యుఁ డగును ॥ 851

(9) గద్యము॥

నేను గల్యాణ వృత్తి గలవాఁడను. పరిపక్వవాక్యములు గలవాఁడను. ఎవ్వరు తమ నిమిత్తమై మాకుఁ బరివాదమును జేయుదురో! యెవ్వరు బలయుతులై మాకు దోషములను గల్పింతురో! వారిని సోముఁడు సర్పములపైఁ ద్రోయునుగాక! లేక నిర్‌ఋతి యుత్సంగముపై నుంచుఁగాక! 352

(10) గద్యము॥

ఓ యగ్నీ! యెవ్వరు మా యన్నసారమును నష్టపెట్టుట కిచ్ఛగింతురో! యెవ్వ రశ్వములకు, గోవులకు, సంతానములకు, నష్టమును గల్పింపఁ గోరెదరో! శత్రువులు, చోరులు, ధనాపహారులు నగు నా వ్యక్తులు హింసలను బొందెదరు. అట్టి వారి శరీరములు తనయులతోఁగూడ నిహతము లగును ॥ 853

(11) గద్యము॥

వారి తనువులు తనయులతో వియోగము నొందును. వ్యాప్తములయిన పృథివీత్రయముయొక్క యధోదేశమునకుఁ బోవునుగాక! ఎవ్వరు రాత్రిందివములు మమ్ము హింసించుటకు సంకల్పింతురో! యో దేవతలారా! వారి యశస్సు పరిశుష్క మగును ॥ 854

(12) గద్యము॥

విద్వాంసులకుఁ దెలియును. సత్యాసత్యవాక్యద్వయము పరస్పరము స్పర్థించును. వానిమధ్యను నేది సత్యమో! యేది ఋజుతమమో! సోముఁడు దానినే పరిపాలించును. అసత్యమును హింసించును ॥ 855

(13) గద్యము॥

సోముఁడు పాపాత్ములను బ్రవర్తితులుగా నొనర్పఁడు. బలయుతులు మిథ్యావాదులు నగు పురుషులను బ్రవర్తితులుగాఁ జేయఁడు. వాఁడు రాక్షసులను జంపును. అసత్యవాదులను హింసించును. రాక్షసులు హతులై యింద్ర బంధమునం దుండెదరు ॥ 856

(14) గద్యము॥

మమ్ములఁగూర్చి దేవతాగణ మసత్యస్వరూప మైన పక్షమునను లేక నేను వ్యర్థముగ దేవతాసమీపమునకుఁ జనినను జాతవేదుం డగు నో యగ్నీ! యేల మాయెడఁ గృద్ధుఁడ వయ్యెదవు? మిథ్యావాదులు మీకు విశేషరూపమున హింసాలాభమును జేయుదురుగాక! 857

(15) గద్యము॥

నేను యాతుధానుఁడ నైనచో! లేక పురుషుని యాయుస్సును నష్టపెట్టినచో! నశించిపోవుదును. లేక యెవఁడు మమ్ము రాక్షసు లని సంబోధించునో! వాని దశవీరపుత్రులు నశింతురు ॥ 858

(16) గద్యము॥

నేను రాక్షసుఁడను. ఎవఁడు మమ్ము యాతుధానులని పిలుచునో! యెవఁడు "నేను రాక్షసుఁడను. శుచి గలవాఁడను." అని పలుకునో! వానిని నింద్రుఁ డాయుధములచే వినాశముఁ జేయునుగాక! వా రందఱును జంతువులలో నధము లగుదురుగాక! ॥ 859

(17) గద్యము॥

ఏ రాక్షసీరాత్రికాలమందు ద్రోహయుక్తయయి యులీకివలెఁ దన శరీరమును ద్రిప్పుచు వెడలునో! యది యవాఙ్ముఖయై యనంతగర్తములలోఁ బడును. ప్రస్తరము లన్నియు నభిషవణ శబ్దముచే రాక్షసులను నష్టపెట్టుఁగాక! ॥ 860

(18) గద్యము॥

ఓ మరుద్గణమా! మీరు ప్రజలమధ్యను వివిధములుగ వసింపుఁడు! ఎవ్వరు రాత్రులయందుఁ బక్షుల మాట్కిఁ వత్తురో! లేక యెవ్వరు దీప్త యజ్ఞములందు హింసలను గల్పింతురో! యా రాక్షసులను గోరుము! గ్రహింపుము! చూర్ణములుగాఁ జేయుము! ॥ 861

(19) గద్యము॥

ఓ యింద్రుఁడా! యంతరిక్షమునుండి యశనిని బ్రవర్తింపఁజేయుము! ఓ మఘవానుఁడా! సోమముచేఁ దీక్షకృతయజమానుని సంస్కృతునిగాఁ జేయుము! పర్వములు గల వజ్రముచేఁ బూర్వదిక్కునుండి, పశ్చిమదిక్కునుండి, దక్షిణదిక్కునుండి, యుత్తరదిక్కునుండి రాక్షసులను, నశింపఁజేయుము! 862

(20) గద్యము॥

వారలు కుక్కురముల వలె హింసఁజేయుచు వచ్చెదరు. ఎవ్వరు జిఘాంసులై యహింసనీ యేంద్రుని హింసించుటకుఁ గోరుదురో! యా కపటులను హింసించుటకు నింద్రుఁ డశనిని దీక్ష్ణముగాఁ జేయును. వాఁడు శీఘ్రముగ యాతుధానునిపైకి నశనిని బంపునుగాక! 863

(21) గద్యము॥

ఇంద్రుఁడు హింసకులఁ, బరాశరపశువు వనమును ఖండించునటులు, ముద్గరము పాత్ర సమూహమును భేదించునటులు హవ్య మంథనకారు లభిముఖముగ వచ్చు వారి నిమిత్తము రాక్షసుల నశింపఁజేయుచు వచ్చుచుందురు ॥ 864

(22) గద్యము॥

ఇంద్రుఁడా! యెవ్వ రులూకరూపమున హింసఁ జేయుదురో! వారిని నశింపఁజేయుము!
ఎవ్వరు క్షుద్రోలూకరూపమున హింసింతురో! వారిని నష్టపెట్టుము! ఎవ్వరు
కుక్కుర స్వరూపమున, నెవ్వరు చక్రవాకరూపమున, నెవ్వరు శ్యేన పక్షి
రూపమున, నెవ్వరు గృధ్రపక్షిరూపమున, నాశనము గావింతురో!
పాషాణము వంటి వజ్రమున నా రాక్షసులను సంహరింపుము! ॥ 865

(23) గద్యము॥

మమ్ము వ్యాపింపకుండునటుల యంత్రణదాయు లగు రాక్షసుల మిథునము లపగతము
లగును. రాక్షసులు "ఇది యేమిటి? ఇది యేమిటి?" అని పలుకుదురు. పృథివి
మ మ్మంతరిక్షభవపాపమునుండి రక్షించుఁగాక! అంతరిక్షము మా స్వర్గీయ
పాపమునుండి రక్షించుఁగాక! 866

(24) గద్యము॥

ఓ యింద్రుఁడా! రాక్షసులను హింసింపుము! యే రాక్షస స్త్రీ వంచనచే హింసించునో! దానిని
బాధింపుము! ఎవరి క్రీడ లాఘాత మొనర్చునో! యా రాక్షసుల ఛిన్నగ్రీవులుగా
నొనర్పుము! వా రుదయించు సూర్యుని జూడఁజాలరు ॥ 867

(25) గద్యము॥

సోముఁడా! నీవును నింద్రుఁడును ప్రత్యేకదర్శనముఁ జేయుఁడు! వివిధరీతుల దర్శింపుఁడు!
జాగరితు లగుఁడు! యాతుధాను లగు రాక్షసులపై నశనిరూపాయుధములను విసరుఁడు! ॥ 868

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
సప్తమ మండలము
సంపూర్ణము



# సమూహాల

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### అనువాకః—1, సూక్తమ్—1

ఋషిః—1-2 ప్రగాథో (ఘౌరః,) కాణ్వః 3-29-మేధాతిథి మేధ్యాతిథీ కాణ్వౌ,

30-33-ప్లాయోగిరాసఙ్గః, 24-ఆఙ్గీరసీ శశ్వతీ ఋషికా

దేవతా—ఇన్ద్రః, 30-34-ఆసఙ్గః

ఛందః—1-4-విషమా బృహతీ, సమా సతోబృహతీ, (ప్రగాథః)

5-32-బృహతీ, 33-34-త్రిష్టుప్

(1) మా చిదన్యద్వి శంసత సఖాయో మా రిషణ్యత ।

ఇన్ద్రమిత్స్తోతా వృషణం సచా సుతే ముహురుక్థా చ శంసత ॥ 1

(2) అవక్రక్షిణం వృషభం యథాజురం గాం న చర్షణీసహమ్ ।

విద్వేషణం సంవననోభయంకరం మంహిష్ఠముభయావినమ్ ॥ 2

(3) యచ్చిద్ధి త్వా జనా[1] ఇమే నానా హవన్త[2] ఊతయే ।
అస్మాకం బ్రహ్మేదమిన్ద్ర భూతు తే ఽహా విశ్వా చ వర్ధనమ్ ॥ 3

(4) వి తర్తూర్యన్తే మఘవన్విపశ్చితో ఽర్యో విపో జనానామ్ ।
ఉప క్రమస్వ పురురూపమా భర వాజం నేదిష్ఠమూతయే ॥ 4

(5) మహే చన త్వామద్రివః పరా శుల్కాయ దేయామ్ ।
న సహస్రాయ నాయుతాయ వజ్రివో న శతాయ శతామఘ ॥ 5

(6) వస్యాగ్ం[3] ఇన్ద్రాసి మే పితురుత భ్రాతురభుఞ్జతః ।
మాతా చ మే ఛదయథః సమా వసో వసుత్వనాయ రాధసే ॥ 6

(7) క్వేయథ క్వేదసి పురుత్రా చిద్ధి తే మనః ।
అలర్షి యుధ్మ ఖజకృత్పురందర ప్ర గాయత్రా[4] అగాసిషుః ॥ 7

---

1. జనాఽఇమే, 2. హవన్తఽఊతయే, 3. వస్యాగ్ంఽఇన్ద్రాసి, 4. గాయత్రాఽఅగాసిషుః. (ప్రా.ప్ర.)

(8) పాా౨్రస్మై గాయత్రమర్చత వావాతుర్యః పురందరః ।
యాభిః కాణ్వస్యోప బర్హిరాసదం యాసద్వజ్రీ భినత్పురః ॥ 8

(9) యే తే సన్తి దశగ్విన శ్శతినో యే సహస్రిణః ।
అశ్వాసో యే తే వృషణో రఘుద్రువస్తేభిర్నస్తూయమా గహి ॥ 9

(10) ఆ త్వ౧ద్య సబర్దుఘాం హువే గాయత్రవేపసమ్ ।
ఇన్ద్రం ధేనుః సుదుఘామన్యామిషమురుధారామరంకృతమ్ ॥ 10

(11) యత్తుదత్సూర[1] ఏతశం వఙ్కూ వాతస్య పర్ణినా ।
వహత్కుత్సమార్జునేయం శతక్రతుః[2] త్సరద్గన్ధర్వమస్తృతమ్ ॥ 11

(12) య[3] ఋతే చిదభిశ్రిషః పురా జత్రుభ్య[4] ఆతృదః ।
సంధాతా సంధిం మఘవా పురూవసురిష్కర్తా విహ్రుతం పునః ॥ 12

---

1. దత్సూర౽ఏతశం, 2. క్రతుత్సరద్గన్ధర్వ, 3. య౽ఋతే, 4. జత్రుభ్య౽ఆతృదః. (ప్రా.ప్ర.)

(13) మా భూమ నిష్ట్యా[1] ఇవేన్ద్ర త్వదరణా[2] ఇవ ।
వనాని న ప్రజహితాన్యద్రివో దురోషాసో[3] అమన్మహి ॥ 13

(14) అమన్మహీదనాశవో ఽనుగ్రాసశ్చ వృత్రహన్ ।
సకృత్సు తే మహతా శూర రాధసాఽను స్తోమం ముదీమహి ॥ 14

(15) యది స్తోమం మమ శ్రవదస్మాకమిన్ద్రమిన్దవః ।
తిరః పవిత్రం ససృవాంస[4] ఆశవో మన్దన్తు తుగ్ర్యావృధః ॥ 15

(16) ఆ త్వ౽ంద్య సధస్తుతిం వావాతుః సఖ్యురా గహి ।
ఉపస్తుతిర్మఘోనాం ప్ర త్వావత్వధా తే వశ్మి సుష్టుతిమ్ ॥ 16

(17) సోతా హి సోమమద్రిభిరేమేనమప్సు ధావత ।
గవ్యా వస్త్రేవ వాసయన్త[5] ఇన్నరో నిర్ధుక్షన్వక్షణాభ్యః ॥ 17

---

1. నిష్ట్యాఽఇవేన్ద్ర, 2. త్వదరణాఽఇవ, 3. దురోషాసోఽఅమన్మహి, 4. వాంసఽఆశవో,
5. వాసయన్తఽఇన్నరో. (వ్రా.ప్ర.)

(18) అధ జ్మో[1] అధ వా దివో బృహతో రోచనాదధి ।
అయా[2] వర్ధస్వ తన్వా గిరా మమా ఽఽ జాతా సుక్రతో పృణ ॥ 18

(19) ఇన్ద్రాయ సు మదిన్తమం సోమం సోతా వరేణ్యమ్ ।
శక్ర[3] ఏణం పీపయద్విశ్వయా ధియా హిన్వానం న వాజయుమ్ ॥ 19

(20) మా త్వా సోమస్య గల్దయా సదా యాచన్నహం గిరా ।
భూర్ణిం మృగం న సవనేషు చుక్రుధం క[4] ఈశానం న యాచిషత్ ॥ 20

(21) మదేనేషితం మదముగ్రముగ్రేణ శవసా ।
విశ్వేషాం తరుతారం మదచ్యుతం మదే హి ష్మా దదాతి నః ॥ 21

(22) శేవారే వార్యా పురు దేవో మర్తాయ దాశుషే ।
స సున్వతే చ స్తువతే చ రాసతే విశ్వగూర్తో అరిష్టుతః ॥ 22

---

1. అధ జ్మోఽఅధ, 2. అయావర్ధస్వ, 3. శక్రఏణం, 4. కఽఈశానం. (ప్రా.ప్ర.)

(23) ఏన్ద్ర యాహి మత్స్వ చిత్రేణ దేవ రాధసా ।
సరో న ప్రాస్యుదరం సపీతిభిరా సోమేభిరురు స్ఫిరమ్ ॥ 23

(24) ఆ త్వా సహస్రమా శతం యుక్తా రథే హిరణ్యయే ।
బ్రహ్మయుజో హరయ[1] ఇన్ద్ర కేశినో వహన్తు సోమపీతయే ॥ 24

(25) ఆ త్వా రథే హిరణ్యయే హరీ మయూరశేప్యా ।
శితిపృష్ఠా వహతాం మధ్వో[2] అన్ధసో వివక్షణస్య పీతయే ॥ 25

(26) పిబా త్వస్య గిర్వణః సుతస్య పూర్వపా[3] ఇవ ।
పరిష్కృతస్య రసిన[4] ఇయమాసుతిశ్చారుర్మదాయ పత్యతే ॥ 26

(27) య[5] ఏకో అస్తి దంసనా మహాఁ[6] ఉగ్రో అభి వ్రతైః ।
గమత్స శిప్రీ న స యోషదా గమద్ధవం న పరి వర్జతి ॥ 27

1. హరయఽఇన్ద్ర, 2. మధ్వోఽఅన్ధసో, 3. పూర్వపాఽఇవ, 4. రసినఽఇయమా, 5. యఽఏకోఽఅస్తి,
6. మహాగ్ంఽఉగ్రోఽఅభి. (ప్రా.ప్ర.)

(28) త్వం పురం చరిష్ణ్వం వధైః [1]శుష్ణస్య సం పిణక్ ।
త్వం భా[2] అను చరో అధ ద్వితా యదిన్ద్ర హవ్యో భువః ॥ 28

(29) మమ త్వా సూర[3] ఉదితే మమ మధ్యందినే దివః ।
మమ ప్రపిత్వే[4] అపిశర్వరే వసవా స్తోమాసో[5] అవృత్సత ॥ 29

(30) స్తుహి స్తుహీదేతే ఘా తే మంహిష్ఠాసో మఘోనామ్ ।
నిన్దితాశ్వః ప్రపథీ పరమజ్యా మఘస్య మేధ్యాతిథే ॥ 30

(31) ఆ యదశ్వాన్వనన్వతః శ్రద్ధయాహం రథే రుహమ్ ।
ఉత వామస్య వసునశ్చికేతతి యో[6] అస్తి యాద్వః పశుః ॥ 31

---

1. శష్ణస్య, 2. భాఽఅను చరోఽఅధ, 3. సూరఽఉదితే, 4. ప్రపిత్వేఽఅపి, 5. స్తోమాసోఽఅవృత్సత, 6. యోఽఅస్తి, (ప్రా.ప్ర.)

(32) య[1] ఋజ్రా మహ్యం మామహే సహ త్వచా హిరణ్యయా ।
ఏష విశ్వాన్యభ్యస్తు సౌభగా[2] ఽఽ సంగస్య స్వనద్రథః ॥ 32

(33) అధ ప్లాయోగిరతి దాసదన్యానాసఙ్గో[3] అగ్నే దశభిః సహస్రైః ।
అధోక్షణో దశ మహ్యం రుశన్తో నళా[4] ఇవ సరసో నిరతిష్ఠన్ ॥ 33

(34) అన్వస్య స్థూరం దదృశే పురస్తాదనస్థ[5] ఊరురవరమ్బమాణః ।
శశ్వతీ నార్యభిచక్ష్యాహ సుభద్రమర్య భోజనం బిభర్షి ॥ 34

1. యఽఋజ్రా. 2. సౌభగాస, 3. సఙ్గోఽఅగ్నే, 4. నళాఽఇవ, 5. దనస్థఽఊరురవ. (వా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### అనువాకము—1, సూక్తము—1

*ఋషి—1-2- కాణ్వుఁడైన ప్రగాథుఁడు (ఘౌరుఁడు), 3-29-కాణ్వులైన
మేధాతిథి మేధ్యాతిథులు, 30-33-ఆంగిరసుఁడైన ప్లాయోగి,
34-ఆంగిరసుని శశ్వతీ ఋషిక
*దేవత—ఇంద్రుఁడు, 30-34-ఆసంగుఁడు

(1) గద్యము॥

ఓ సఖులారా! మీర లన్య స్తోత్రముల నుచ్చరింపకుఁడు! హింసింపఁబడకుఁడు! సోమ
మభిషుత మైనచో నింద్రుని నుతింపుఁడు! మాటిమాటికి నుక్థముల నుచ్చరింపుఁడు! ॥ 1

(2) గద్యము॥

వృషభము వలె శత్రువుల హింసించువాఁడు, జరారహితుఁడు, వృషభమువలె మనుష్యులకుఁ
బరాభవమును గల్పించువాఁడు, శత్రు విద్వేషి, స్తోత్ర భజనీయుఁడు, రెండు విధములగు
ధనము గలవాఁడును, దాతృతముఁడు నగు నింద్రుని నుతింపుము! ॥ 2

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! యీ జనులు రక్షకై మాటిమాటికి నిన్ను స్తుతించినను నీ మా స్తోత్రము
సర్వకాలములయందు మీకు వర్ధక మగునుగాక! ॥ 3

---

* వ్రాతప్రతి 8వ సంపుటములో (265 పుట) నీ సూక్తమునకు మేధాతిథి ఋషిగాను ఇంద్రుఁడు దేవతగాను, ఋషి దేవతల పట్టికలు గల 15b సంపుటములోఁ బ్రగాథుఁడు. కణ్వుఁడు 3-29-మేధాతిథి, మేధ్యాతిథి 30-32-సంగుఁడు, 34-సస్వతి ఋషులుగాను, ఇంద్రుఁడు, అసంగుని దానములు, అసంగుఁడు దేవతలుగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గద్యము॥

మఘవానుఁడ వగు నింద్రుఁడా! నీ పండిత స్తోతలు శత్రువులకుఁ గంపనమును బుట్టించుచు సర్వదా యాపదలనుండి తప్పుకొనుచుందురు. మా కడకు రండు! తృప్తికై బహురూపయుతము, నికట స్థితము, నగు నన్నమును మాకు నిచ్చుఁగాక! ॥ 4

(5) గద్యము॥

వజ్రవంతుఁడ వగు నింద్రుఁడా ! నీవు మహామూల్యమునకు విక్రయింపఁబడవు. ఓ వజ్రహస్తుఁడా! యయుత సంఖ్యాక ధనమునకై నిన్ను వినియోగింపలేరు. ఓ బహుధనుఁడా! యపరిమిత ధనమునకై నిన్నొసంగలేరు ॥ 5

(6) గద్యము॥

ఓయి యింద్రుఁడా ! నీవు మా పితకంటె నధిక ధనవంతుఁడవు! అపాలకారియగు భ్రాతకంటె నధిక ధనవంతుఁడవు! ఓ వసువా ! మా మాతయు నీవును సమానులరై వ్యాప్తి సహిత ధనమునకు మమ్ముఁ బూజితులుగాఁ నొనర్పుము! ॥ 6

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వెక్కడికిఁ బోయితివి! ఎచట నుంటివి! నీ మనస్సు నానాదిక్కుల నుండును! యుద్ధ కుశలుఁడా! పురందరుఁడా! రమ్ము! గాయత్రగణము నీ స్తవము చేయుచున్నది ॥ 7

(8) గద్యము॥

ఈ యింద్రునకై గాయత్రమా! గానముఁ జేయుము! పురందరుం డగు నింద్రుఁడు భజనీయుఁడు. ఏ ఋక్కులచేఁ గణ్వపుత్రుని యజ్ఞస్థలమునకు వజ్రహస్తుఁడై వెడలెనో! వేనివలనఁ బురములను భేదించెనో! యా ఋక్కులను గాయత్రము గానముఁ జేయును ॥ 8

(9) గద్యము॥

ఓ యింద్రుఁడా ! దశయోజనగాములు, శత సహస్ర సంఖ్యాకములు నగు నశ్వము లెవ్వి గలవో! యవి సేచన సమర్థములు. శీఘ్రగాములు. ఆ యశ్వముల సాహాయ్యమున రమ్ము!॥ 9

(10) గద్యము॥

దుగ్ధముల నిచ్చునవియుఁ, బ్రశంసనీయములు, వేగయుతములు, సుఖదోహన సమర్థములునగు ధేనువులను స్తుతించెదను ॥ 10

(11) గద్యము॥

సూర్యుఁ డెపు డేతశునకుఁ బీడఁ గల్పించెనో! యపుడు వక్రగామియు, వాయు సదృశ గమనశీలమును గల యశ్వద్వయ మర్జున పుత్రుం డగు కుత్సుఁ డను ఋషిని వహించెను. శతక్రతు వగు గంధర్వుఁ డహింసిత సూర్యుని ఛద్మవేషమున నాక్రమించుటకు వెడలెను ॥ 11

(12) గద్యము॥

ఏ యింద్రుఁడు సంధానద్రవ్య వ్యతిరేకముగ గ్రీవనుండి రుధిరము రాకపూర్వము సంధి సమకూర్చెనో! క్షమావంతుఁడు బహుధనుఁడు నగు నా యింద్రుఁడు విచ్ఛిన్నుని మునః సంస్కరించెను ॥ 12

(13) గద్యము॥

ఇంద్రుఁడా ! నీ యనుగ్రహమువలన మే మెటులు నీచులము కామో! దుఃఖుల మెటులు కామో! యక్షీణ బలము వలెఁ బుత్ర పౌత్రాది వియుక్తుల మెటులు కామో! వజ్రి యగు నింద్రుఁడా! యటు లొనర్పుము! ఇతరు లెవ్వరును మమ్ము దహింపలేరు. గృహమందు నివసించుచు నిన్ను వినుతించెదము ॥ 13

(14) గద్యము॥

ఓ వృత్రహనుఁడా! సత్వరులము, నుగ్రతా శూన్యులము, నగు మేము మెల్లమెల్లఁగా నీ స్తుతి నొనర్చెదము. ఓ శూరుఁడా! నీ నిమిత్త మొకమాటు సుందరస్తోత్రముల ననుమోదించెదము॥ 14

(15) గద్యము॥

ఇంద్రుఁడు మా స్తోత్రము నాలించినయెడల తత్క్షణమే మా సోమ మంతయు వానిని హర్షితునిగాఁ జేయుటకు సమర్థ మగును. ఇది తిర్యగ్భావమున నున్న పవిత్రముతో సంపర్కమును బొందుచున్నది. వసతీవరీ ప్రభృతి జలముతో వర్ధమానమై శీఘ్రముగ మద జనక మగును ॥ 15

(16) గద్యము॥

ఇంద్రుఁడా! నీ సేవకు లొనర్చెడు స్తుతి కభిముఖముగ నిపుడె శీఘ్రముగఁ జనుము! అన్య హవిష్మంతుల స్తోత్రములు నీ నికటమునకు వచ్చుఁగాక! ఇపుడు నేను నీ స్తుతిఁ జేయఁగోరెదను ॥ 16

(17) గద్యము॥

మీరు ప్రస్తరములచే సోమాభిషవముఁ జేయుఁడు! దీనిని జలముతో సంశోధింపుఁడు! గో చర్మమువలె మేఘమున శరీరమును నాచ్ఛాదించుకొని మరుద్గణము నదులకై జలదోహన మొనర్చును ॥ 17

(18) గద్యము॥

ఓ యింద్రుఁడా! పృథ్వినుండి, యంతరిక్షమునుండి, లేక దీప్తప్రదేశమునుండి వచ్చుచు మా విస్తృతస్తుతివలన వృద్ధిఁబొందుము! ఓ సుక్రతువా! మా యుత్పన్నలోకములను నభిలషితఫలపూర్ణములుగాఁ గావించుము! ॥ 18

(19) గద్యము॥

మీ రింద్రునకై యన్నిటికంటె మదమును బుట్టించు వరణీయ సోమము నభిషవముగా నొనర్పుఁడు! క్రియాద్వారా ప్రీతిని బుట్టించువాఁడు, నన్నాభిలాషియు, నగు యజమానుని శత్రువులు వృద్ధిఁ బొందింతురు ॥ 19

(20) గద్యము॥

ఓ యింద్రుఁడా! సవనసమూహమందు సోమశ్రావణుఁడును స్తుతియుతుఁడను నై సర్వదా ప్రార్థించుచు నేను నిన్నుఁ గోపింపను. నీవు భర్తవు. సింహమువలె భయంకరుండవు! ని న్నెవ్వరు యాచింపరు? ॥ 20

(21) గద్యము॥

ఉగ్రబలయుతుఁ డగు నింద్రుఁడు మదోత్పాదకము, స్తోతృప్రేరితము. మదకరము నగు సోమమును ద్రావునుగాక! సోమజనిత హర్షము పుట్టినయెడల వాఁడు మా శత్రువులను జయించువాఁడును వారి గర్వము నడంచెడు పుత్రుల నొసంగు వాఁడును నగును ॥ 21

(22) గద్యము॥

ఇంద్రదేవుఁడు సుఖోత్పాదకయజ్ఞమందు హవ్య మొసంగు యజమాను నుద్దేశించి బహుధనము నొసంగును. వాఁడే సోమాభిషవకారి. స్తోతలకు ధన మొసంగును. వాఁడు సర్వకార్యోద్యోగి. భక్తప్రశంసనీయుఁడు! ॥ 22

(23) గద్యము॥

ఇంద్రుఁడా! రమ్ము! ఓ దేవా! నీవు విచిత్ర ధనమున సంహృష్టుఁడ వగుము! ఒకచోటఁ ద్రావిన సోమరసమున నీ విస్తీర్ణవృద్ధోదరమును సరోవరమును వలె నిండింపుము! ॥ 23

(24) గద్యము॥

శతసహస్రసంఖ్యాకములైన యశ్వములు హిరణ్మయ రథమునందు ని న్నునిచి సోమపానము నిమిత్తమై తెచ్చునుగాక! అవి ప్రభుయుతములు. కేసర సహితములు ॥ 24

(25) గద్యము॥

శ్వేతవర్ణములు, మయూరవర్ణరూప విశిష్టములు నగు నశ్వములు మధురము, స్తుతియోగ్యము నగు సోమమును ద్రావుటకు హిరణ్మయ రథమందు ని న్నునిచి తెచ్చునుగాక! 25

(26) గద్యము॥

ఓ స్తుతియోగ్యుఁడా! శీఘ్రముగ నీ సోమమును ప్రథమసోమపాయి వలెఁ బానముఁ జేయుము! ఇది పరిష్కృతము. రసవిశిష్టము. ఈ యాసవనము మదకరము. చరువు. ఇయ్యది మదమును గలిఁగించును ॥ 26

(27) గద్యము॥

ఏ యింద్రుఁడు తన కర్మచే సకలమునకుఁ బరాభవమును గల్పించునో! యెవఁడు కర్మచే మహాత్ముఁడో! యుగ్రుఁడును శిరస్త్రాణయుతుఁడు నగు నా యింద్రుఁడు వచ్చునుగాక! వాఁడు వేరు కాఁడు.మా స్తోత్రముల కభిముఖముగ వచ్చునుగాక! వాఁడు మమ్ము విడవకుండునుగాక! ॥ 27

†(28) గీ॥ ఇంద్ర! శుష్ణుని వసతిని నెసఁగు వజ్ర
ధారచేఁ జూర్ణముగఁ జేసి తనిసినావు
నీవె యష్టకు స్తోతకు నిఖిల జగము
నందు నాహ్వాన యోగ్యుఁడ వగుదుసుమ్ము! ॥ 28

---

† గద్యము॥ ఓ యింద్రుఁడా! నీవు శుష్ణుని సంచరణశీల మగు వాసస్థానమును వజ్రముచేఁ జూర్ణము గావించితివి! నీవు స్తోతకు, యష్టకు నాహ్వాన యోగ్యుఁడవు! నీవు దీప్తిమంతుఁడవై వారి ననుసరించితివి!
(తొలిపాఠము- చూ. వ్రాతప్రతి-శివ సంపుటము. 261-262 పుటలు.)

గీ॥ దీప్తమంతుఁ డీవు దివ్యదింద్ర!
యట్టి యష్టను మరియును నట్టి స్తోతృ
వరుని సంప్రీతితోడుతఁ బరగుచుండి
యనుసరించినవాఁడవు! ఘనత మెరయ ॥ 29

(29) గద్యము॥

సూర్యుఁ డుదయించినపిదప మా స్తోత్రముల నన్నిటిని నావర్తితములుగా నొనర్పుము!
మధ్యాహ్నమున మా స్తుతుల నావర్తితములుగాఁ జేయుము! దినావసానమందు
మా స్తుతుల నావర్తితములుగా నొనర్పుము! శర్వరీ సమయమున మా
స్తోత్రముల నన్నిటిని నావర్తితములుగా నొనర్పుము! ॥ 30

(30) గద్యము॥

ఓ మేధ్యాతిథీ! మాటిమాటికి మమ్ము నుతింపుము! మమ్ముఁ బ్రశంసింపుము! మేము ధనవంతుల
మధ్యను నిన్నుఁగూర్చి యన్నివిధముల నధిక ధనదాతలము. మా వీర్యమున నన్యుని
యశ్వములు నిర్మింపఁబడును. మా మార్గ ముత్కృష్టము. మా యాయుధము
లుత్కృష్టములు॥ 31

(31) గద్యము॥

నేను శ్రద్ధగలవాఁడనై యాహారాంతమందు నశ్వములను రథమునకుఁ గూర్చితిని. నేను
మనోహర ధనము నొసంగుట యెరుంగుదును. నేను యదువంశోత్పన్నుఁడను.
పశుమంతుఁడను ॥ 32

(32) గద్యము॥

ఎవ్వఁడు గమనశీల ధనమును హిరణ్మయ చర్మాస్తరణముతో దాన మొసంగెనో! వాఁడు
శబ్దాయమానుఁడు రథయుఁతుఁడునై శత్రువుల ధనమునంతయు నాశనముఁ జేయుఁగాక! ॥ 33

(33) గద్యము॥

ఓ యగ్నీ! ప్లషోగ పుత్రుఁడగు నాసంగుఁడు దశసహస్ర గోవుల దానమున దాతల నతిక్రమించి దాన మొసంగెను. అనంతరము సేచన సమర్థములు, దీప్తిమంతములు, నగు పశువులు సరోవరమునుండి నలునివలె నిర్గతము లయ్యెను ॥ 34

(34) గద్యము॥

వీని సమ్ముఖమునందు స్థూలము గానఁబడుచున్నది. ఇది యస్థి రహితము, విస్తీర్ణము. నిమ్న ముఖమందు లంబమానము. శశ్వరి యను నారి యిది చూచి "ఆర్య! యుభయ భోగసాధన వస్తువులను ధరింపుము!" అనెను ॥ 35

## సూక్తమ్—2

ఋషిః—1-40-మేధాతిథిః కాణ్వః, ఆఙ్గిరసః ప్రియమేధశ్చ,
41-42- మేధాతిథిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 41-42-విభిన్దుః
ఛందః—గాయత్రీ, 28-అనుష్టుప్

(1) ఇదం వసో సుతమన్ధః పిబా సుపూర్ణముదరమ్ ।
అనాభయిన్రరిమా తే ॥ 35

(2) నృభిర్ధూతః సుతో[1] అశ్నైరవ్యో వారైః పరిపూతః ।
అశ్వో న నిక్తో నదీషు ॥ 36

1. సుతోఽఅశ్నైరవ్యో. (ప్రా.ప్ర.)

(3) తం తే యవం యథా గోభిః స్వాదుమకర్మ శ్రీణన్తః ।

ఇన్ద్ర త్వాస్మిన్త్సధమాదే ॥ 37

(4) ఇన్ద్ర[1] ఇత్సోమపా ఏక ఇన్ద్రః సుతపా విశ్వాయుః ।

అన్తర్దేవాన్మర్త్యాంశ్చ ॥ 38

(5) న యం శుక్రో న దురాశీర్న తృప్రా[2] ఉరువ్యచసమ్ ।

అపస్పృణ్వతే సుహార్దమ్ ॥ 39

(6) గోభిర్యదీమన్యే[3] అస్మన్మృగం న వ్రా మృగయన్తే ।

అభిత్సరన్తి ధేనుభిః ॥ 40

(7) త్రయ[4] ఇన్ద్రస్య సోమాః సుతాసః సన్తు దేవస్య ।

స్వే క్షయే సుతపావ్నః ॥ 41

---

1. ఇన్ద్రఽ ఇత్సోమపాఽ ఏకఽ ఇన్ద్రః, 2. తృప్రాఽ ఉరువ్యచ, 3. మన్యేఽ అస్మ,

4. త్రయఽ ఇన్ద్రస్య. (ప్రా.ప్ర.)

(8) త్రయః[1] కోశాసః శ్చోతన్తి తిస్రశ్చమ్వః సుపూర్ణాః ।

సమానే[2] అధి భార్మన్ ॥ 42

(9) శుచిరసి పురునిఃష్ఠాః క్షీరైర్మధ్యత[3] ఆశీర్తః ।

దధ్నా మన్దిష్ఠః శూరస్య ॥ 43

(10) ఇమే త[4] ఇన్ద్ర సోమాస్తీవ్రా[5] అస్మే సుతాసః ।

శుక్రా[6] ఆశిరం యాచన్తే ॥ 44

(11) తాగ్ం[7] ఆశిరం పురోళాశమిన్ద్రేమం సోమం శ్రీణీహి ।

రేవన్తం హి త్వా శృణోమి ॥ 45

(12) హృత్సు పీతాసో యుధ్యన్తే దుర్మదాసో న సురాయామ్ ।

ఊధర్న నగ్నా జరన్తే ॥ 46

---

1. త్రయఃఽకోశాసః, 2. సమానేఽఅధి, 3. మధ్యతఽఆశీర్తః, 4. తఽఇన్ద్ర, 5. త్రీవాఽఅస్మే, 6. శుక్రాఽఆశిరం, 7. తాగ్ంఽఆశిరం. (వ్రా. ప్ర.)

(13) రేవాగ్ం[1] ఇద్రేవతః స్తోతా స్యాత్త్వావతో మఘోనః ।

ప్రేదు హరివః శ్రుతస్య ॥ 47

(14) ఉక్థం చన శస్యమానమగోరరిరా చికేత ।

న గాయత్రం గీయమానమ్ ॥ 48

(15) మా న[2] ఇన్ద్ర పీయత్నవే మా శర్ధతే పరా దాః ।

శిక్షా శచీవః శచీభిః ॥ 49

(16) వయము త్వా తదిదర్థా[3] ఇన్ద్ర త్వాయన్తః సఖాయః ।

కణ్వా[4] ఉక్థేభిర్జరన్తే ॥ 50

(17) న ఘేమన్యదా పపన వజ్రిన్నపసో నవిష్టౌ ।

తవేదు స్తోమం చికేత ॥ 51

---

1. రేవాగ్ంఽఇద్రేవతః, 2, మా నఽఇన్ద్ర, 3. దర్థాఽఇన్ద్ర, 4. కణ్వాఽఉక్థే. (ప్రా. ప్ర.)

(18) ఇచ్ఛన్తి దేవాః సున్వన్తం న స్వప్నాయ స్పృహయన్తి ।

యన్తి ప్రమాదమతన్ద్రాః ॥ 52

(19) ఓ షు ప్ర యాహి వాజేభిర్మా హృణీథా[1] అభ్యస్మాన్ ।

మహాఁగ్ం[2] ఇవ యువజానిః ॥ 53

(20) మో ష్వద్య దుర్హణావాన్త్సాయం కరదారే[3] అస్మత్ ।

అశ్రీర[4] ఇవ జామాతా ॥ 54

(21) విద్మా హ్యస్య వీరస్య భూరిదావరీం సుమతిమ్ ।

త్రిషు జాతస్య మనాంసి ॥ 55

(22) ఆ తూ షిఞ్చ కణ్వమన్తం న ఘా విద్మ శవసానాత్ ।

యశస్తరం శతమూతేః ॥ 56

---

1. హృణీథాఽఅభ్య. 2. మహాంగ్ఽఇవ. 3. దారేఽఅస్మత్. 4. అశ్రీరఽఇవ. (ప్రా.ప్ర.)

(23) జ్యేష్ఠేన సోతరిన్ద్రాయ సోమం వీరాయ శక్రాయ ।

భరా పిబన్నర్యాయ ॥ 57

(24) యో వేదిష్ఠో[1] అవ్యథిష్వశ్వావన్తం జరితృభ్యః ।

వాజం స్తోతృభ్యో గోమన్తమ్ ॥ 58

(25) పన్యంపన్యమిత్సోతార[2] ఆ ధావత మద్యాయ ।

సోమం వీరాయ శూరాయ ॥ 59

(26) పాతా వృత్రహా సుతమా ఘా గమన్నారే[3] అస్మత్ ।

ని యమతే శతమూతిః ॥ 60

(27) ఏహ హరీ బ్రహ్మయుజా శగ్మా వక్షతః సఖాయమ్ ।

గీర్భిః శ్రుతం గిర్వణసమ్ ॥ 61

---

1. వేదిష్ఠోఽఅవ్యథి, 2. త్సోతారఽఆ, 3. గమన్నారేఽఅస్మత్. (ప్రా. ప్ర.)

(28) స్వాదవః సోమా[1] ఆ యాహి శ్రీతాః సోమా[1] ఆ యాహి ।
శిప్రిన్నృషీవః శచీవో నాయమచ్ఛా సధమాదమ్ ॥ 62

(29) స్తుతశ్చ యాస్త్వా వర్ధన్తి మహే రాధసే నృమ్ణాయ ।
ఇన్ద్ర కారిణం వృధన్తః ॥ 63

(30) గిరశ్చ యాస్తే గిర్వాహ[2] ఉక్థా చ తుభ్యం తాని ।
సత్రా దధిరే శవాంసి ॥ 64

(31) ఏవేదేష తువికూర్మిర్వాజాగ్ం[3] ఏకో వజ్రహస్తః ।
సనాదమృక్తో దయతే ॥ 65

(32) హన్తా వృత్రం దక్షిణేనేన్ద్రః పురూ పురుహూతః ।
మహాన్మహీభిః శచీభిః ॥ 66

---

1. సోమాఽఆ యాహి, 2. గిర్వాహఽఉక్థా, 3. జాగ్ంఽఏకో. (వ్రా.ప్ర.)

(33) యస్మిన్విశ్వాశ్చర్షణయ[1] ఉత చ్యౌత్నా జ్రయాంసి చ ।

అను ఘేన్మన్దీ మఘోనః ॥ 67

(34) ఏష[2] ఏతాని చకారేన్ద్రో విశ్వా యోఽతి శృణ్వే ।

వాజదావా మఘోనామ్ ॥ 68

(35) ప్రభర్తా రథం గవ్యన్తమపాకాచ్చిద్యమవతి ।

ఇనో వసు స హి వోళ్హా ॥ 69

(36) సనితా విప్రో[4] అర్వద్భిర్హన్తా వృత్రం నృభిః శూరః ।

సత్యోఽవితా విధన్తమ్ ॥ 70

(37) యజధ్వైనం ప్రియమేధా[5] ఇన్ద్రం సత్రాచా మనసా ।

యో భూత్సోమైః సత్యమద్వా ॥ 71

---

1. చర్షణయఽఉత, 2. ఏషఽఏతాని, 3. వోళహా, 4. విప్రోఽఅర్వద్, 5. మేధాఽఇన్ద్రం. (వ్రా. ప్ర.)

(38) గాథశ్రవసం సత్పతిం శ్రవస్కామం పురుత్మానమ్ ।
కణ్వాసో గాత వాజినమ్ ॥ 72

(39) య[1] ఋతే చిద్గాస్పదేభ్యో దాత్సఖా నృభ్యః శచీవాన్ ।
యే[2] అస్మిన్కామమశ్రియన్ ॥ 73

(40) ఇత్థా ధీవన్తమద్రివః కాణ్వం మేధ్యాతిథిమ్ ।
మేషో భూతోఽభి యన్నయః ॥ 74

(41) శిక్షా విభిన్దో[3] అస్మై చత్వార్యయుతా దదత్ ।
అష్టా పరః సహస్రా ॥ 75

(42) ఉత సు త్యే పయోవృధా మాకీ రణస్య నప్త్యా ।
జనిత్వనాయ మామహే ॥ 76

---

1. యఽఋతే, 2. యేఽఅస్మిన్, 3. విభిన్దోఽఅస్మై. (బ్రా.ప్ర.)

## సూక్తము—2

ఋషి—1-40-కణ్వ గోత్రీయుఁడగు మేధాతిథి
అంగిరో గోత్రుఁడగు ప్రియమేధస్సు, 41-42-కణ్వగోత్రీయుఁడగు మేధాతిథి
దేవత—ఇంద్రుఁడు, 41-42-విభిందువు*

(1) గద్యము॥

వసు వగు నో యింద్రుఁడా! యీ యభిషుత సోమమును ద్రావుము! కుక్షిని నింపుకొనుము! అకుతోభయేంద్రుఁడా! నీకు దాన మిచ్చెదను ॥ 36

(2) గద్యము॥

నేతృగణములవల్లను వస్త్రములవల్లను నభిషుతమును, మేషలోమములవల్లఁ బరిపూరితము నగు సోమము నదిలో స్నానము చేసిన యశ్వము వలె శోభించుచుండెను ॥ 37

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! యవలు వలె నుక్త సోమము నీనిమిత్తము గవ్యముతోఁ గలిసి యాస్వాదన యోగ్యముగఁ జేయఁబడినది. కాఁబట్టి యో యింద్రుఁడా! యీ పావన స్థలమునకు రమ్ము! ॥ 38

(4) గద్యము॥

దేవతా మనుష్యులలో నింద్రుఁడే సర్వ సోమమును ద్రావుటకు సమర్థుఁడు. అభిషుత సోమమును ద్రావు నింద్రుఁడే సర్వవిధములను నన్నవంతుఁడు ॥ 39

* 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "విభిందువు దానములు" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(5) గద్యము॥

దూరవ్యాపియు, సుహృత్తును నగు నే యింద్రుని సోమ మప్రీతునిగాఁ జేయదో! దుర్లభ మిశ్రణద్రవ్యము గల సోమ మెవ్వని ప్రీతునిగాఁ జేయదో! తృప్తికర చరు పురోడాశాదిక మెవ్వని నప్రీతునిగాఁ జేయదో! మే మా యింద్రుని స్తుతించెదము ॥ 40

(6) గద్యము॥

వ్యాధుఁడు మృగము నన్వేషించు నటుల నన్యు లెవ్వరును గవ్య సంస్కృత సోమమున నింద్రుని నన్వేషింతురో! వాక్యములతోఁ గుత్సిత రూపమున వాని సమీపమునకుఁ జనెదరో! వారు వానిని దెలిసికొనలేరు ॥ 41

(7) గద్యము॥

అభిషుత సోమపాయి యగు నింద్ర దేవునకు మూఁడు విధముల సోమము యజ్ఞ గృహమం దభిషుత మగుచుండెను ॥ 42

(8) గద్యము॥

ఏకమాత్ర ఋత్విక్కులచే భరణీయ మగు యజ్ఞమందు మూఁడు కోశములతో సోమము స్రవించుచున్నది. మూఁడు చమసములును నిండియున్నవి ॥ 43

(9) గద్యము॥

ఓ సోమమా! నీవు శుచి కలదానవు! బహుపాత్రలయం దుండుదానవు! మధ్యమందు క్షీరములచేతను, దధిచేతను గూడుకొనినదానవు! నీ వింద్రున కన్నిటికంటె నధికముగ మదమును బుట్టింపుము! ॥ 44

(10) గద్యము॥

ఓ యింద్రా! యీ నీ సోమ మతి తీవ్ర మైనది. అభిషుతము, దీప్త మిశ్రణ ద్రవ్యము మి మ్మాకాంక్షించుచున్నది ॥ 45

(11) గద్యము॥

ఇంద్రుఁడా! యుక్త సోమమును సకల మిశ్రణ ద్రవ్యములతో మిశ్రితము కావింపుము! నిన్ను ధనవంతునిగాఁ జెప్పుచుండుటయే యందుకుఁ గారణము ॥ 46

(12) గద్యము॥

సుర త్రాగినయెడలఁ గుత్సిత మదము సురాపాయికి మత్తత గలిఁగించుట కెటుల యుద్ధము చేయఁబడునో! యట్టి విధమున నో యింద్రుఁడా! త్రాగిన సోమ మంతయు హృదయ మధ్యమందు యుద్ధముఁ జేయును. దుగ్ధ పూర్ణోధస్సును లోక మెట్లు పాలించునో! నీవు సోమపూర్ణ స్తోతలను నట్టులే పాలింతువు! ॥ 47

(13) గద్యము॥

ఓ హర్యశ్వుఁడా! నీవు ధనవంతుఁడవు! నీ స్తోతలు ధనవంతు లగుదురు. నీ వలె ధనవంతులు ప్రసిద్ధులు నగు లోకములోఁ గల స్తోతలు ప్రభువు లయ్యెదరు ॥ 48

(14) గద్యము॥

ఇంద్రుఁడు స్తుతి శూన్యు లగు జనులకు శత్రువు. ఉచ్చార్యమాణము లగు సూక్తములను దెలియును. గాయత్రమును గానము చేయఁగలఁడు ॥ 49

(15) గద్యము॥

ఓ యింద్రుఁడా నీవు వధించెడి శత్రువుల హస్తమందు మమ్ము విడువకుము! తిరస్కరించెడి వారి చేతులలో మమ్ముఁ బెట్టకుము! శక్తిమంతుఁడ వగు నో యింద్రుఁడా! నీవు స్వీయ కర్మబలముచే మాకు ధనము నొసంగుము! ॥ 50

(16) గద్యము॥

ఓ యింద్రుఁడా! మేము నీకు సఖులము. నిన్నుఁ గోరుచున్నాము. నీ స్తోత్రమే మాకుఁ బ్రయోజనము. మేము నిన్ను నుతించెదము. కణ్వ గోత్రోత్పన్ను లుక్థములచే నిన్ను స్తుతించుచున్నారు ॥ 51

(17) గీ॥ వజ్రి! నీవు కర్మ వర్థితుండవు నూత్న
యజ్ఞమందు నన్య విజ్ఞు నేను
సన్నుతింపకుండ నిన్నె సన్నుతులతో
వేడఁగలుఁగువాఁడ వివిధ గతుల ॥ 52

పాఠాంతరము

గద్యము॥

వజ్రము గల యో యింద్రుఁడా! నీవు కర్మ గలవాఁడవు! నీ నూతన యజ్ఞమందు నన్యులను
నేను నుతించను. కేవలము నీ స్తోత్రమునే నే నెరుంగుదును ॥ 53

(18) గద్యము॥

దేవతలు సోమాభిషవకారులనే సర్వదా యెరుంగుదురు. వారు స్వప్నావస్థ నిచ్ఛగింపరు. వా
రనలసులై యత్యంత మదకర సోమమును ద్రాగెదరు ॥ 54

(19) గద్యము॥

ఓ యింద్రుఁడా! యన్న సహితులై మా కభిముఖముగాఁ బ్రకృష్ట రూపములతో రమ్మ!
యువతి జాయ యైనచో గుణవంతుఁ డగు వ్యక్తి దాని యెడల నెట్లు కృద్ధుఁడు గాఁడో!
యటులే మా యెడఁ గృద్ధుఁడవు గాకుము ॥ 55

(20) గద్యము॥

దుస్సహనీయుఁడగు నింద్రుఁడు మా కడకు వచ్చుఁగాక! కుత్సిత జామాతవలె సంధ్యను
జేయకుండును ॥ 56

(21) గద్యము॥

మేము వీరుఁ డగు నీ యింద్రుని బహుధన ధాత్రి కళ్యాణినియు నగు ననుగ్రహబుద్ధి నెరుంగుదుము.
మూఁడు లోకములయందును బ్రాదుర్భవించు నింద్రునిహృదయము నెరుంగుదుము ॥ 57

(22) గద్యము॥

కణ్వమంతుఁడగు నింద్రు నుద్దేశించి శీఘ్రముగ సోమమును జల్లుఁడు! అతి బల సంపన్నుఁడును ప్రభూత రక్షాకారియు నగు నింద్రునికంటె నధిక యశస్విని మే మెరుంగము ॥ 58

(23) గద్యము॥

అభిషవణకారీ! నీవు వీరుఁడవు! శక్తిమంతుఁడవు! నరులకు హిత మొనర్చువాఁడవు! ఇంద్రు నుద్దేశించి ముఖ్యముగా సోమము నిమ్ము! వాఁడు పానమును జేయుఁగాక! ॥ 59

(24) గద్యము॥

ఎవ్వఁడు సుఖకర స్తోతలను నెరుంగునో! యట్టి యింద్రుఁడు, హోతలకు స్తోతలకు నశ్వములను గోవులను నన్నమును నిచ్చుఁగాక! ॥ 60

(25) గద్యము॥

ఓ యభిషవణకారిగణమా! మీరు మాదయితవ్యుఁడు, వీరుఁడు, శూరుఁడు నగు నింద్రు నుద్దేశించి స్తుతియోగ్య సోమమును దానము చేయుఁడు! ॥ 61

(26) గద్యము॥

సోమపానశీలుఁడు వృత్రహంతయు నగు నింద్రుఁడు వచ్చుఁగాక! వాఁడు మాకు దూరముగా నుండకుండుఁగాక! బహువిధముల రక్షకుఁడగు నింద్రుఁడు శత్రువులను నియమించుఁగాక! ॥ 62

(27) గద్యము॥

స్తోత్రయుక్తము, సుఖకరము నగు నశ్విద్వయము నీ యజ్ఞమందు స్తుతి ద్వారా ప్రసిద్ధము. భజనీయ సఖుం డగు నింద్రుని దెచ్చునుగాక! ॥ 63

(28) గద్యము॥

శిరస్త్రాణ విశిష్టుఁడవు, ఋషియుతుఁడవు, శక్తిమంతుఁడ వగు నో యింద్రుఁడా! యీ సోమము స్వాదు వైనది. నీవు రమ్ము! సోమ మంతయు మిశ్రణ ద్రవ్యములచేఁ గూడుకొన్నది. రమ్ము! నీవు హర్యప్రియుడవు! స్తోత నీ కభిముఖముగా స్తుతిఁజేయుచున్నాఁడు ॥ 64

(29) గద్యము॥

ఓ యింద్రుఁడా! వర్ధనశీలురగు స్తోతలు స్తుతి సమూహము మహా ధన లాభమునకై నిన్ను వృద్ధిపరచును ॥ 65

(30) గద్యము॥

స్తుతిచే హవనీయుఁడ వగు నో యింద్రుఁడా! నీ నిమిత్తము స్తుతులు సుక్తులు నేవి గలవో! యవి యన్నియు మిళితములై నీకు బలమును గలుఁగఁజేయుచున్నవి ॥ 66

(31) గద్యము॥

ఇంద్రుఁడు బహు కర్మ కలవాఁడు. వాఁ డొక్కఁడే వజ్రహస్తుఁడు. చిరకాలమునుండి శత్రువులవలన ననభిభూతుఁడు. వాఁడు స్తోతలకు బలము నొసంగును ॥ 67

(32) గద్యము॥

ఇంద్రుఁడు దక్షిణహస్తముచే వృత్రుని సంహరించెను. అనేక స్థానములకుఁ బెక్కు మారులు పిలువఁబడెడు వాఁడు. నానావిధములగు క్రియలచే గొప్పవాఁడు ॥ 68

(33) గద్యము॥

సమస్తప్రజలును నే యింద్రునకు స్వాధీనులో! యచ్యుతబలము తిరస్కారము నే యింద్రునియందుఁ గలవో! యా యింద్రుని యజమాను లనుమోదింతురు ॥ 69

(34) గద్యము॥

ఇంద్రుఁ డీ సమస్త కార్యములను జేయుచున్నాఁడు. సర్వత్ర విశ్రుతుఁడు. హవిష్మంతులకు నన్నదాత ॥ 70

(35) గద్యము॥

ప్రహరణ స్వభావము గల యింద్రుఁడు గమనశీలుఁడు, గవాభిలాషి యగు స్తోతను నపక్వ ప్రజ్ఞ గల శత్రువుల హస్తమునుండి రక్షించును. ఆ యింద్రుఁడే స్తోతయై ప్రభువయి బహుధనమును దాన మొసంగును 71

(36) గద్యము॥

మేధావి యగు నింద్రుఁ డశ్వ సాహాయ్యమున గంతవ్య స్థానమునకుఁ జనును. వాఁడు శూరుఁడు. నేత లగు మరుత్తుల సాహాయ్యమున వృత్రుని జంపును. వాఁడు పరిచర్యాకారు లగు యజమానులకు రక్షకుఁడు. మరియు సత్యస్వరూపుఁడు ॥ 72

(37) గద్యము॥

ప్రియమేధస్సు గలవాఁడా! యీ యింద్రునిగూర్చి యాసత్తమంత మగు యజ్ఞమును జేయుము! ఇంద్రుఁడు సోమమును బొందినచో సంతుష్టుఁ డగును. వాని హర్షము నిష్ఫలము కాదు ॥ 73

(38) గద్యము॥

ఓ కణ్వులారా! మీరు సాధులోక పాలకులు! అన్నాభిలాషులు! బహుదేశగాములు! వేగవంతులు! జ్ఞేయ యశస్సంపన్నుఁ డగు నింద్రుని స్తుతింపుఁడు! ॥ 74

(39) గద్యము॥

పదచిహ్నములను జూడకయే సుకర్మ గల యింద్రుఁడు, నేతయై దేవతలకు గోవులను మరల నొసంగెను. దేవగణ మింద్రునివల్ల నభిలషిత పదార్థములను బొందెను ॥ 75

(40) గద్యము॥

వజ్రవంతుఁడ వగు నో యింద్రుఁడా! నీవు మేషరూపమున నభిగమన మొనర్చుచు నీ ప్రకారము
స్తుతి నొనర్చుచున్న కణ్వపుత్రుఁ డగు మేధ్యాతిథిని బొందితివి! ॥ 76

(41) గద్యము॥

ఓ విభిందూ! నీవు దాతవు! నీవు మాకు నాలు గ్గితముల ధనము నిచ్చితివి! పిమ్మట
నష్ట సహస్ర సంఖ్యాకములను దాన మొసంగితివి! ॥ 77

(42) గద్యము॥

ప్రసిద్ధుఁడు, జలవర్ధకుఁడును భూత నిర్మాతయు నగు స్తోతనుగూర్చి యనుగ్రహము గల
ద్యావా పృథువులను ధనోత్పత్తి విషయమై స్తవమును జేయుచున్నాను ॥ 78

## సూక్తమ్—3

ఋషిః—మేధ్యాతిథిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 21-24-కౌరయాణః పాకస్థామా
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ, (ప్రగాథః)
21-అనుష్టుప్, 22-23-గాయత్రీ, 24-బృహతీ

(1) పిబా సుతస్య రసినో మత్స్వా న[1] ఇన్ద్ర గోమతః ।
[2]ఆపిర్నో బోధి సధమాద్యో వృధే[3] ఽస్మాగ్ం[3] అవన్తు తే ధియః ॥ 77

1. నఽఇన్ద్ర. 2. ఆపర్నో. 3.స్మాగ్ంఽఅవన్తు. (వా. ప్ర.)

(2) భూయామ తే సుమతౌ వాజినో వయం మా నః స్తరభిమాతయే ।
అస్మాఞ్చిత్రాభిరవతాదభిష్టిభిరా నః సుమ్నేషు యామయ ॥ 78

(3) ఇమా[1] ఉ త్వా పురూవసో గిరో వర్ధన్తు యా మమ ।
పావకవర్ణాః శుచయో విపశ్చితో ఽభి స్తోమైరనూషత ॥ 79

(4) అయం సహస్రమృషిభిః సహస్కృతః సముద్ర[2] ఇవ పప్రథే ।
సత్యః సో[3] అస్య మహిమా గృణే శవో యజ్ఞేషు విప్రరాజ్యే ॥ 80

(5) ఇన్ద్రమిద్దేవతాతయ[4] ఇన్ద్రం ప్రయత్యధ్వరే ।
ఇన్ద్రం సమీకే వనినో హవామహ[5] ఇన్ద్రం ధనస్య సాతయే ॥ 81

(6) ఇన్ద్రో మహ్నా రోదసీ పప్రథచ్ఛవ[6] ఇన్ద్రః సూర్యమరోచయత్ ।
ఇన్ద్రే హ విశ్వా భువనాని యేమిర[7] ఇన్ద్రే సువానాస[8] ఇన్దవః ॥ 82

---

1, ఇమాఽఉ, 2. సముద్రఽఇవ, 3. సోఽఅస్య, 4. తాతయఽఇన్ద్రం, 5. మహఽఇన్ద్రం,
6. ప్రథచ్ఛవఽఇన్ద్రః, 7. యేమిరఽఇన్ద్రే, 8. నాసఽఇన్దవః. (ప్రా.ప్ర.)

(7) అభి త్వా పూర్వపీతయ[1] ఇన్ద్ర స్తోమేభిరాయవః ।
సమీచీనాస[2] ఋభవః సమస్వరన్రుద్రా గృణన్త పూర్వ్యమ్ ॥ 83

(8) అస్యేదిన్ద్రో వావృధే వృష్ణ్యం శవో మదే సుతస్య విష్ణవి ।
అద్యా తమస్య మహిమానమాయవో ఽను ష్టువన్తి పూర్వథా ॥ 84

(9) తత్త్వా యామి సువీర్యం తద్బ్రహ్మ పూర్వచిత్తయే ।
యేనా యతిభ్యో భృగవే ధనే హితే యేన ప్రస్కణ్వమావిథ ॥ 85

(10) యేనా సముద్రమసృజో మహీరపస్తదిన్ద్ర వృష్ణి తే శవః ।
సద్యః సో[3] అస్య మహిమా న సంనశే యం క్షోణీరనుచక్రదే ॥ 86

(11) శగ్ధీ న[4] ఇన్ద్ర యత్త్వా రయిం యామి సువీర్యమ్ ।
శగ్ధి వాజాయ ప్రథమం సిషాసతే శగ్ధి స్తోమాయ పూర్వ్య ॥ 87

---

1. పీతయఽఇన్ద్ర, 2. సమీచీనాసఽఋభవః, 3. సోఽఅస్య, 4. నఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(12) శగ్ధీ నో[1] అస్య యద్ధ పౌరమావిథ ధియ[2] ఇన్ద్ర సిషాసతః ।
శగ్ధి యథా రుశమం శ్యావకం కృపమిన్ద్ర ప్రావః స్వర్ణరమ ॥ 88

(13) కన్న వ్యో[3] అతసీనాం తురో గృణీత మర్త్యః ।
నహీ న్వస్య మహిమానమిన్ద్రియం స్వర్గృణన్త[4] ఆనశుః ॥ 89

(14) కదు స్తువన్త[5] ఋతయన్త దేవత ఋషిః కో విప్ర ఓహతే ।
కదా హవం మఘవన్నిన్ద్ర సున్వతః కదు స్తువత[6] ఆ గమః ॥ 90

(15) ఉదు త్యే మధుమత్తమా గిరః స్తోమాస[7] ఈరతే ।
సత్రాజితో ధనసా[8] అక్షితోతయో వాజయన్తో రథా[9] ఇవ ॥ 91

(16) కణ్వా[10] ఇవ భృగవః సూర్యా[11] ఇవ విశ్వమిద్ధీతమానశుః ।
ఇన్ద్రం స్తోమేభిర్మహయన్త[12] ఆయవః ప్రియమేధాసో[13] అస్వరన్ ॥ 92

---

1. నోఽఅస్య, 2. ధియఽఇన్ద్ర, 3. కన్నవ్యోఽఅతసీనాం, 4. గృణన్తఽఆనశుః,
5. స్తువన్తఽఋతయన్త దేవతఽఋషిఃకోవిప్రఽఓహతే, 6. స్తువతఽఆగమః, 7. స్తోమాసఽఈరతే,
8. ధనసాఽఅక్షితో, 9. రథాఽఇవ, 10. కణ్వాఽఇవ, 11. సూర్యాఽఇవ, 12. యన్తఽఆయవః,
13. మేధాసోఽఅస్వరన్. (ప్రా. ప్ర.)

(17) యుక్ష్వా హి వృత్రహన్తమ హరీ[1] ఇన్ద్ర పరావతః ।
అర్వాచీనో మఘవన్త్సోమపీతయ[2] ఉగ్ర ఋష్వేభిరా గహి ॥ 93

(18) ఇమే హి తే కారవో వావశుర్ధియా విప్రాసో మేధసాతయే ।
స త్వం నో మఘవన్నిన్ద్ర గిర్వణో వేనో న శృణుధీ హవమ్ ॥ 94

(19) నిరిన్ద్ర బృహతీభ్యో వృత్రం ధనుభ్యో[3] అస్ఫురః ।
నిరర్బుదస్య మృగయస్య మాయినో నిః పర్వతస్య గా[4] ఆజః ॥ 95

(20) నిరగ్నయో రురుచుర్నిరు సూర్యో నిః సోమ[5] ఇన్ద్రియో రసః ।
నిరన్తరిక్షాదధమో [6]మహామహిం కృషే తదిన్ద్ర పౌంస్యమ్ ॥ 96

(21) యం మే దురిన్ద్రో మరుతః పాకస్థామా కౌరయాణః ।
విశ్వేషాం త్మనా శోభిష్ఠముపేవ దివి ధావమానమ్ ॥ 97

---

1. హరీ–ఇన్ద్ర, 2. పీతయ–ఉగ్ర ఋష్వే, 3. ధనుభ్యో–అస్ఫురః, 4. గా–ఆజః,
5. సోమ–ఇన్ద్రియో, 6. మహామహిం. (వ్రా. ప్ర.)

(22) రోహితం మే పాకస్థామా[1] సుధురం కక్ష్యప్రామ్ ।
అదాద్రాయో విబోధనమ్ ॥ 98

(23) యస్మా[2] అన్యే దశ ప్రతి ధురం వహన్తి వహ్నయః ।
అస్తం వయో న తుగ్య్రమ్ ॥ 99

(24) ఆత్మా పితుస్తనూర్వాస[3] ఓజోదా అభ్యఞ్జనమ్ ।
తురీయమిద్రోహితస్య పాకస్థామానం భోజం దాతారమబ్రవమ్ ॥ 100

## సూక్తము—3

ఋషి— కణ్వగోత్రీయుఁడగు మేధ్యాతిథి
దేవత—ఇంద్రుఁడు, † 21,22,23,24-కుర్వానపుత్రుఁడై
*పాకస్థముఁ డగు రాజుయొక్క దాన స్తుతి

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! రసవంతము, గవ్యయుతము, నభిషుతము నగు సోమమును ద్రావి సంతృప్తుఁడ వగుము! నీవు మా వలె మత్తుఁడ వగుటకు యోగ్యుఁడవు! నీవు మాకు బంధువై మాకు వృద్ధిఁ గలిఁగించుటకుఁ బ్రబుద్ధుఁడ వగుము! నీ బుద్ధి మాకు రక్షక మగుఁగాక! ॥ 79

1. సుధరం, 2. యస్మాఽఅన్యే, 3. ర్వాసఽఓజోదాఽఅభ్యఞ్జనమ్. (వ్రా. ప్ర.)

†—19,22,23,24- (వ్రా.ప్ర.పా. 8వ సంపుటము. 270 పుట.) * "పాకశ్యాముఁడు" గా వ్రాతప్రతి 8వ సంపుటము 270వ పుటలో వ్రాసి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో మాత్రమే "పాకస్థాముని దానములు" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) గద్యము॥

మేము హవిష్మంతులము. మేము నీ యనుగ్రహమును బడసెదము. శత్రువుల నిమిత్తము
మమ్ము హింసింపకుము! మమ్ముఁ బెక్కు విధముల రక్షింపుము! మాకు సుఖము
కలుఁగునటుల నియమింపుము! ॥ 80

(3) గద్యము॥

బహు ధనము గల యింద్రుఁడా! మా యీ వాక్యములు నిన్ను వృద్ధిఁ బొందించునుగాక!
అగ్నితుల్యులు, తేజస్వులు, శుచులు, నగు విద్వాంసులు స్తోత్రముల నిన్ను స్తుతింతురు! ॥ 81

(4) గద్యము॥

వాఁడు సహస్ర ఋషులవలన బలమును బొంది విస్తీర్ణుఁ డగుచున్నాఁడు. అవితథము,
ప్రసిద్ధము నగు వీని మహిమ, బలము, విపుల రాజ్ఞత్వమందు సంస్తుత మగును 82

(5) గద్యము॥

మేము యజ్ఞార్థ మింద్రు నాహ్వానించుచున్నాము. యజ్ఞ మారంభ మైనచో నింద్రుని
బిలిచెదము. యజ్ఞము సంపన్న మైనయెడల నింద్రుని నాహ్వానింతుము. మేము
భజమానులమై ధనము నిమిత్త మింద్రుని బిలిచెదము ॥ 83

(6) గద్యము॥

ఇంద్రుఁడు తన మహిమవలన ద్యావా భూములను విస్తారితములుగా నొనర్చెను. ఇంద్రుఁడు
సూర్యుని దీప్తునిగా నొనర్చెను. సమస్త భువనములు నింద్రునియందు నియమితము
లయ్యెను. అభిషుత సోమ మింద్రునియం దంతర్భూత మయ్యెను ॥ 84

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! ప్రథమ పానమునకు మనుష్యులు స్తోత్రములచే నిన్ను వినుతించుచున్నారు. సమీచీన ఋషిగణము లెస్సగా మిమ్ముల స్తుతించిరి. నీకుఁ బురాతను లగు రుద్రులు నిన్నే స్తుతించుచున్నారు ॥ 85

(8) గద్యము॥

అభిషుత సోమపానమువలన వ్యాప్తిని జెందిన మత్తత జనించిన పక్షమున నింద్రుఁడు యజమానుని వీర్యమును, బలమును వృద్ధిఁ జేసెను. మనుష్యులు పూర్వము వలె నింద్రుని దయాగుణమును వినుతించిరి ॥ 86

(9) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు త్తమ వీర్యవంతుఁడవు. నేను నీకడ ప్రకృష్టాన్నమును యాచించుచున్నాను. దేనివలనఁ గర్మశూన్య లోకము చెంగట హితకరాన్నమును యాచించిరో! దేనివలనఁ బ్రస్కణ్వుని రక్షించెనో! నేను దానిని నడుగుచున్నాను ॥ 87

(10) గద్యము॥

ఏ బలము సముద్రము నిమిత్తము జలమును బ్రేరేపించెనో! యో యింద్రా! నీయొక్క యట్టి బల మభీష్టఫలప్రదము. ఇంద్రుని యా యా మహిమ, ప్రాప్తియోగ్యము కాదు. ఆ బలమును బుడమి యనుగమించును ॥ 88

(11) గద్యము॥

ఓ యింద్రుఁడా! శోభనవీర్యయుత మగు నే ధనమును నీకడ యాచించున్నానో! యట్టి ధనము నిమ్ము! భజనాభిలాషియు, హవిష్మంతుఁడు నగు యజమాను నుద్దేశించి మొదట ధనము నొసఁగుము! ఓ పురాతనుఁడా! తదనంతరము స్తోత లిడుము! ॥ 89

(12) గద్యము॥

ఓ యింద్రుఁడా! కర్మసంభజనకారియుఁ గురుపుత్రుని రక్షించినదియు నగు ధనమును మా యీ యజమానున కొసంగుము! దశముని, *శ్యావకుని, గృపకుని నెటుల రక్షించితివో! యటులు సకల హవిర్నేత లగు యజమానులను రక్షింపుము! 90

(13) గద్యము॥

సర్వత్రగామి యగు స్తుతికర్తయు, నభినవమనుష్యుఁడు నగు, నెవ్వఁ డింద్రుని స్తుతింపఁగలఁడు? సుఖలభ్యుఁ డగు నింద్రుని స్తుతించువాఁడు వాని యింద్రియములను మహత్వమును వ్యాప్తములుగా నొనర్చుటకు సమర్థుఁడు కాఁడు ॥ 91

(14) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు దేవతవు. స్తుతికారి యగు నే జనుఁడు నిన్నుద్దేశించి యజ్ఞమును జేయ నిచ్ఛగొనును? ఏ ఋషి యే విప్రుఁడు నిన్ను వినుతింపఁగలఁడు? ఇంద్రుఁడా? నీ వే స్తుతి కారుల యాహ్వానమును విని రాఁగలవు? ఏ స్తోతల సమీపమునకు వెడలఁగలవు? ॥ 92

(15) గద్యము॥

ప్రసిద్ధములు, నతిమధుతములు నగు వాక్యములు స్తోత్రములు శత్రువిజయియు, ధనభాక్కు, నక్షయము, రక్షకము, నన్నాభిలాషి యగు రథము వలెఁ బలుకఁబడును ॥ 93

(16) గద్యము॥

కణ్వగణమువలె భృగుగణము సూర్యరశ్మల వలె ధ్యానాస్పదీభూతుఁ డగు నింద్రుని వ్యాప్తునిగాఁ జేసెను. ప్రియమేధస్సు లగు మనుష్యులు పూజఁ జేయుచు స్తోత్రములచే వానినే పూజించిరి ॥ 94

---

* శ్యావకుని (ప్రా.ప్ర.పా. 8వ సంపుటము. 273 పుట.)

(17) గద్యము॥

వృత్రహననుఁడా! శ్రేష్ఠుఁడా! హరిద్వయమును రథమునకుఁ గట్టుము! ఓ ధనవంతుఁడా! నీ వుగ్రుఁడవు! సోమము ద్రావుటకు మా కభిముఖముగా దూర దేశమునుండి దర్శనీయు లగు మరుత్తులతో రమ్ము! ॥ 95

(18) గద్యము॥

ఓ యింద్రుఁడా! కర్మకర్తలు మేధావులు నగు నీయజమానులు యజ్ఞమును భజించుటకు నిన్నే కొనియాడుచున్నారు. ఓ మఘవానుఁడా! స్తుతిభాక్కగు నో యింద్రుఁడా! నీవు కాముక పురుషుని వలె మా యాహ్వానము నాలింపుము! ॥ 96

(19) గద్యము॥

ఓ యింద్రుఁడా! మహాధనుస్సుచే నీవు వృత్రుని హత మార్చితివి! మాయావులగు నర్బుదుని, మృగయుని నష్ట పరచితివి! పర్వతమునుండి గోవులను విడిపించితివి! ॥ 97

(20) గద్యము॥

ఓ యిందుర్రుఁడా! నీ వెప్పు డంతరిక్షమునుండి మహాత్ముఁడు, హవన శీలుఁడు నగు వృతుర్రిని వెడలించితివో! యప్పుడు బలమును బ్రకటించితివి. అగ్ను లన్నియు దీపించినవి. సూర్యుఁడు వెలింగెను. ఇంద్రసేవ్య మగు సోమరసము ప్రకాశించెను ॥ 98

(21) గద్యము॥

ఇంద్రుఁడు, మరుత్తులు, దేనిని మా కొసంగిరో! కురుయాన పుత్రుఁడగు పాకస్థాముఁడు దానిని మా కొసంగెను. అది సమస్తధనమధ్యమందు స్వర్గమందుఁ బరుగిడువాఁడును బ్రభాయుక్తుఁడు నగు సూర్యుని వలె శోభించెను ॥ 99

(22)గద్యము॥

పాకస్థాముఁడు మాకు లోహితవర్ణము, సుందరవహనయుతము, బంధనరజ్జు పరిపూరకము, బహుధనప్రాపకము నగు ధనము నిడెను ॥ 100

(23) గద్యము॥

దశసంఖ్యాకాశ్వములు దీనికిఁ బ్రతినిధులై మమ్ము వహించును. అశ్వము లిట్లు తుగ్య పుత్రుని వహించెను ॥ 101

(24) గద్యము॥

పాకస్థాముఁడు స్వయముగా వాని తండ్రికిఁ దగిన దనయుఁడు. వాసప్రదుఁడు. పరిపుష్ట భావమున బలము నొసంగువాఁడు. శత్రుహింసకారి. భోజయుత లోహితవర్ణము గల యశ్వముల నిచ్చు పాకస్థాముని నుతించెదను ॥ 102

## సూక్తమ్—4

ఋషిః—దేవాతిథిః కాణ్వః

దేవతా—ఇన్ద్రః,15-18-ఇన్ద్రః, పూషా వా,19-21-కురుఙ్గః

ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః) 21-పుర ఉష్ణిక్

(1) యదిన్ద్ర ప్రాగపాగుదఙ్ న్యగ్వా హూయసే నృభిః।

సిమా పురూ నృషూతో[1] అస్యానవే ఽసి ప్రశర్ధ తుర్వశే ॥ 101

1. నృషూతోఽఅస్య. (వా.ప్ర.)

(2) యద్వా రుమే రుశమే శ్యావకే కృప1 ఇన్ద్ర మాదయసే సచా ।
కణ్వాసస్త్వా బ్రహ్మభిః స్తోమవాహస2 ఇన్ద్ర యచ్ఛన్త్యా గహి ॥ 102

(3) యథా గౌరో3 అపా కృతం తృష్యన్నేత్యవేరిణమ్ ।
ఆపిత్వే నః ప్రపిత్వే తూయమా గహి కణ్వేషు సు సచా పిబ ॥ 103

(4) మన్దన్తు త్వా మఘవన్నిన్ద్రేన్దవో రాధోదేయాయ సున్వతే ।
ఆముష్యా సోమమపిబశ్చమూ సుతం జ్యేష్ఠం తద్దధిషే సహః ॥ 104

(5) ప్ర చక్రే సహసా సహో బభఞ్జ మన్యుమోజసా ।
విశ్వే త4 ఇన్ద్ర పృతనాయవో యహో ని వృక్షా5 ఇవ యేమిరే ॥ 105

(6) సహస్రేణేవ సచతే యవీయుధా యస్త6 ఆనళుపస్తుతిమ్ ।
పుత్రం ప్రావర్గం కృణుతే సువీర్యే దాశ్నోతి 7నమఉక్తిభిః ॥ 106

---

1. కృపఽఇన్ద్ర. 2. వాహసఽఇన్ద్ర, 3. గౌరోఽఅపా. 4. తఽఇన్ద్ర, 5. వృక్షాఽఇవ,
6. యస్తఽఆనళ. 7. నమఽఉక్తిభిః. (ప్రా.ప్ర.)

(7) మా భేమ మా శ్రమిష్మోగ్రస్య సఖ్యే తవ ।
మహత్తే వృష్ణో[1] అభిచక్ష్యం కృతం పశ్యేమ తుర్వశం యదుమ్ ॥ 107

(8) సవ్యామను స్ఫిగ్యం వావసే వృషా న దానో[2] అస్య రోషతి ।
మధ్వా సంపృక్తాః సారఘేణ ధేనవస్తూయమేహి ద్రవా పిబ ॥ 108

(9) అశ్వీ రథీ సురూప[3] ఇద్గోమాగ్ం ఇదిన్ద్ర తే సఖా ।
శ్వాత్రభాజా వయసా సచతే సదా చన్ద్రో యాతి సభాముప ॥ 109

(10) ఋశ్యో న తృష్యన్నవపానమా గహి పిబా సోమం వశాగ్ం[4] అను ।
నిమేఘమానో మఘవన్దివేదివ[5] ఓజిష్ఠం దధిషే సహః ॥ 110

(11) అధ్వర్యో ద్రావయా త్వం సోమమిన్ద్రః పిపాసతి ।
ఉప నూనం యుయుజే వృషణా హరీ[6] ఆ చ జగామ వృత్రహా ॥ 111

---

1. వృష్ణోఽఅభి, 2. దానోఽఅస్య, 3. సురూపఽఇద్గోమాగ్ంఽఇదిన్ద్ర, 4. వశాగ్ంఽఅను,
5. దివఽఓజిష్ఠం, 6. హరీఽఆ చ. (వా.ప్ర.)

(12) స్వయం చిత్ సమన్యతే దాశురిర్జనో యత్రా సోమస్య తృమ్పసి ।
ఇదం తే[1] అన్నం యుజ్యం సముక్షితం తస్యేహి ప్ర ద్రవా పిబ ॥ 112

(13) రథేష్ఠాయాధ్వర్యవః సోమమిన్ద్రాయ సోతన ।
అధి బ్రధ్నస్యాద్రయో వి చక్షతే సున్వన్తో దాశ్వధ్వరమ్ ॥ 113

(14) ఉప బ్రధ్నం వావాతా వృషణా హరీ[2] ఇన్ద్రమపసు వక్షతః ।
అర్వాఞ్చం త్వా సప్తయోఽధ్వరశ్రియో వహన్తు సవనేదుప ॥ 114

(15) ప్ర పూషణం వృణీమహే యుజ్యాయ పురూవసుమ్ ।
స శక్ర శిక్ష పురుహూత నో ధియా తుజే రాయే విమోచన ॥ 115

(16) సం నః శిశీహి భురిజోరివ క్షురం రాస్వ రాయో విమోచన ।
త్వే తన్నః సువేదముస్రియం వసు యం త్వం హినోషి మర్త్యమ్ ॥ 116

---

1. తేఽఅన్నం. 2. హరీఽఇన్ద్రి. (ప్రా.ప్ర.)

(17) వేమ త్వా పూషన్నృఞ్జసే వేమ స్తోతవ[1] ఆఘృణే ।
న తస్య [2]వేమ్యరణం హి తద్వసో స్తుషే పజ్రాయ సామ్నే ॥ 117

(18) పరా గావో యవసం కచ్చిదాఘృణే నిత్యం రేక్ణో[3] అమర్త్య ।
అస్మాకం పూషన్నవితా శివో భవ మంహిష్ఠో వాజసాతయే ॥ 118

(19) స్థూరం రాధః శతాశ్వం కురుఙ్గస్య దివిష్టిషు ।
రాజ్ఞస్త్వేషస్య సుభగస్య రాతిషు తుర్వశేష్వమన్మహి ॥ 119

(20) ధీభిః సాతాని కాణ్వస్య వాజినః ప్రియమేధైరభిద్యుభిః
షష్టిం సహస్రాను నిర్మజామజే నిర్యూథాని గవామృషిః ॥ 120

(21) వృక్షాశ్చిన్మే[4] అభిపిత్వే అరారణుః ।
గాం భజన్త మేహనా ఒశ్వం భజన్త మేహనా ॥ 121

ఇతి
పంచమోఽష్టకే సప్తమోఽధ్యాయ
స్సమాప్తః

---

1. స్తోతవఽఆఘృణే, 2. వేభ్యరణం, 3. రేక్ణోఽఅమర్త్య, 4. చిన్మేఽఅభిపిత్వేఽఅరారణుః. (ప్రా.ప్ర.)

## సూక్తము—4

ఋషి—కాణ్వుఁడైన దేవాతిథి

దేవత—ఇంద్రుఁడు, 15,16,17,18-ఇంద్రుఁడు లేక పూషణుఁడు,

19-21-కురుంగుఁడు*

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! పూర్వపశ్చిమోత్తరదక్షిణదేశములందుఁ గల నరులచేఁ బిలువఁబడుచున్నను
నో శ్రేష్ఠుఁడా! యసూరపుత్రుని చెంతకు స్తోతలచేఁ బ్రేరింపఁబడుము!
తుర్వశుని కడకు స్తోత్రప్రేరితుఁడ వగుము! ॥ 103

(2) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు, రుముఁడు, రుమశుఁడు, శ్యావకుఁడు, కృపుఁడు, నను వారితోఁ
గూడుకొని సంతుష్టుఁడ వగుము! స్తోత్రములు చేయు కణ్వులు నిన్ను
వినుతించుచున్నారు. నీవు రమ్ము! 104

(3) గద్యము॥

గౌర మృగము తృషితమై జలపూర్ణము, తృణశూన్యము నగు స్థానము నెట్లు తెలిసికొనఁ
గల్గునో! యటులనే యో యింద్రా! నీవు బంధుత్వము గుర్తెరింగినచో మా కభిముఖముగ
రమ్ము! మేము కణ్వపుత్రులము. మాతోఁగలిసి యొకచోట సోమమును
ద్రావుము! ॥ 105

(4) గద్యము॥

ఓ మఘవానుఁడా! యింద్రుఁడా! సోమ మంతయు నభిషవ కారులకు ధన మిచ్చుటకు నిన్నుఁ
బ్రమత్తునిగాఁ జేయుఁగాక! నీవు సోమపానమును జేసితివి! ఈ సోమమభిషవన ఫలక
ద్వారా యభిషుత మయ్యెను. అందుచేత నత్యంతప్రశంసాయోగ్యము. ఇందుకొరకే
నీవు మహాబలమును ధరించితివి! ॥ 106

* ఈ సందర్భమున శ్రీనేమానివారు వ్రాతప్రతిలో (8వ సంపుటము. 275వ పుట) "కురంగదానదేవత" అనియు 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "కురంగుని దానములు" గాను దేవతగా వ్రాసిరి.

(5) గద్యము॥

ఇంద్రుఁడు వీరకర్మచే శత్రువుల కభిభవము నొనర్చెను. బలముచేఁ బరుల క్రోధమును నష్టపరచెను. మహాత్ముఁడ వగు నో యింద్రుఁడా! యుద్ధకాములగు సమస్త శత్రువులను నీవు వృక్షముల వలె నిశ్చలులుగా నొనర్చుచున్నావు ॥ 107

(6) గద్యము॥

ఇంద్రుఁడా! యెవ్వరు మిమ్ము వినుతింతురో! వారు సహస్ర సంఖ్యాక వజ్రాయుధ వీరులను బొందెదరు. ఎవ్వరు నమస్కారముతో హవ్యము నొసఁగెదరో! వారు సువీర్యవంతులు, శత్రు నిధనకారులు నగు పుత్రులను బడసెదరు ॥ 108

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వుగ్రుఁడవు! నీ చెలిమిని బొంది మేము భయపడము. శ్రాంతులము కాము. నీ వభీష్టవర్షివి! నీ మహాకర్మ నంతయుఁ బ్రకాశింపఁజేయుట యుచితమైన కార్యము. మేము తుర్వశుని యదువును జూచినారము ॥ 109

(8) గద్యము॥

అభీష్టవర్షి యగు నింద్రుఁడు వామ కటిప్రదేశముచే సమస్తభూతజాతమును గప్పుచుండెను. హవ్యదాత యింద్రునకుఁ గ్రోధము కలుఁగఁజేయకుండును. ఓ యింద్రా! మధుమక్షికాజాత మధువుచే సంపృక్తము ప్రీతి జనకము నగు సోమమున కభిముఖముగా రమ్ము! దాని సమీపమునకు వెడలుము! దానిని ద్రావుము! ॥ 110

(9) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ సఖు లశ్వవంతులు. రథవంతులు. గోమంతులు. రూపవంతులు. వారు ధనమును శీఘ్రముగాఁ బొందెదరు. సకలాహ్లాదకరులై సభకుఁ జనెదరు ॥ 111

(10) గద్యము॥

పిపాసు వగు ఋశ్యనామక మృగము వలె నీవు పాత్రముద్వారా తేఁబడిన సోమమున క
ముఖముగా రమ్ము! అభిలాషానురూపముగాఁ ద్రాగుము! ఓ మఘవానుఁడా! నీవు ప్రతి
దినమును నిమ్ము ముఖముగా వర్షించుచు నత్యంతౌజోబలమును ధరింపుము!॥ 112

(11) గద్యము॥

అధ్వర్యూ! యింద్రుఁడు సోమము త్రావుటకు నిశ్చయించెను. నీవు సోమాభిషవమును
నొనర్పుము! తరుణవయస్సు గల యశ్వద్వయ మిపుడు సమకూర్పఁబడెను.
వృత్రహననుఁడు వచ్చుచుండెను ॥ 113

(12) గద్యము॥

ఇంద్రుఁడా! యెవని సోమమువలన నీవు తృప్తి నొందెదవో!యట్టి హవ్యదాయి యగువ్యక్తి
యది యెరుంగును. నీకు యోగ్య మగు నన్నమును బాత్రయందుఁ జల్లెను. నీవు
సమీపమునకు వచ్చి త్రాగుము! ॥ 114

(13) గద్యము॥

ఓ యధ్వర్యుగణమా! రథమం దింద్రుఁడు గూర్చొనియున్నాఁడు.వానికై సోమమును దీయుము!
మూలప్రస్తరముపైనున్న ప్రస్తరము సకలయజమానులకును యాగనిష్పాదకమగు
సోమమును బుట్టించుచుఁ బ్రకాసించుచుండెను ॥ 115

(14) గద్యము॥

మా కర్మకై యంతరిక్ష విహారియు సేచనసంవర్ధము నగు హరిద్వయ మింద్రుని దెచ్చుఁగాక!
ఇంద్రుఁడా! యజ్ఞసేవులు, గమనశీలులు నగు నశ్వములు నిన్ను సవనాభిముఖముగాఁ
దీసికొనిపోవుఁగాక! ॥ 116

(15) గద్యము॥

మేము చెలిమికొరకు బహుధనవంతుఁ డగు పూషుని వరించెదము. శక్రుఁడు, పురుహూతుఁడు, పాపవిమోచకుఁడవు నగు నో పూషుఁడా! మాకు నీ బుద్ధిచే ధనము నొసంగి శత్రువులను నశింపఁజేయు సామర్థ్యమును నొసంగుము! ॥ 117

(16) గద్యము॥

ఓ పూషుఁడా! మాకు బాహుస్థిత మగు క్షురము (ఖడ్గము)వలెఁ దీక్ష్ణబుద్ధి నొసంగుము! పాప విమోచనకారీ! మాకు ధనమును దాన మీయుము! నీ గో ధనము మాకు సులభము. నీవు మర్త్యుల కా ధనమును బ్రేరేపించియుండుము! ॥ 118

(17) గద్యము॥

ఓ పూషుఁడా! నిన్నుఁ బ్రసాదితునిగాఁ జేయుటకుఁ గోరెదను. దీప్తియుతుఁడా! నీ స్తుతిని జేయ నిచ్ఛగింతును. వారి స్తోత్రములను గోరను. అందుకుఁ గారణము వార లసుఖ కరు లగుటయె. ఓ నివాసప్రదుఁడా! ప్రీతికరుఁడు సామయుతుఁడు నగు వజ్రునకు నభిలషిత ధనము నొసంగుము! ॥ 119

(18) గద్యము॥

దీప్తియుతుఁడా! యమరపూషుఁడా! యే కాలమందును మా గోవు లన్నియుఁ దృణభక్షణము నుండి మరలకూడదు. గో రూపధనము నిత్యమును మా కుండును. నీవు మాకు రక్షకుఁడవు, మంగళకరుఁడవు నగుము! అన్న దానమునకై మహాత్ముఁడ వగుము! ॥ 120

(19) గద్యము॥

కురుంగనామకుఁడును, దీప్తియుతుఁడును, సౌభాగ్యవంతుఁడు నగు రాజునకు స్వర్గప్రాప్తి హేతు వగు యజ్ఞమందును, దానమందును, మనుష్యులలో మే మశ్వములను ధనమును దెలిసికొన సమర్థులము! ॥ 121

(20) గద్యము॥

కణ్వపుత్రుఁడును, హవిష్మంతుఁడు, స్తోతృభజనీయుఁడును దీప్తిప్రాప్తుఁడు నగు ప్రియమేధస్సును ఋషిగణముచే సేవింపఁబడిన పవిత్రషష్టిగోసహస్రములను, నేను (దేవాతిథి) శేషభాగమందుఁ బొందితిని ॥ 122

(21) గద్యము॥

నేను ధనమును బొందితిని. వృక్షములు శబ్దము చేసినవి. ఇవి ప్రశంసనీయ గోవులను, నశ్వములను బొందినవి ॥ 123

ఇయ్యది

శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర

సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక

నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో

శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ

బంచమాష్టకమున సప్తమాధ్యాయము

సంపూర్ణము



# సమూల

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### పంచమోఽష్టకః—అష్టమోఽధ్యాయః

### సూక్తమ్—5

ఋషిః—బ్రహ్మాతిథిః కాణ్వః

దేవతా—అశ్వినౌ, 37-(ఉత్తరార్ధస్య)-39-చైద్యః కశుః

ఛందః—గాయత్రీ, 37-38-బృహతీ, 39-అనుష్టుప్

(1) దూరాదిహేవ యత్ సత్యరుణప్సురశిశ్వితత్ ।

వి భానుం విశ్వధాఽతనత్ ॥ 122

(2) నృవద్దస్రా మనోయుజా రథేన పృథుపాజసా ।

సచేథే[1] అశ్వినోషసమ్ ॥ 123

---

1. సచేథేఽఅశ్వినో. (వ్రా.ప్ర.)

(3) యువాభ్యాం వాజినీవసూ ప్రతి స్తోమా[1] అదృక్షత ।
వాచం దూతో యథోహిషే ॥ 124

(4) పురుప్రియా ణ[2] ఊతయే పురుమన్ద్రా పురూవసూ ।
స్తుషే కణ్వాసో[3] అశ్వినా ॥ 125

(5) మంహిష్ఠా వాజసాతమేషయన్తా శుభస్పతీ ।
గన్తారా దాశుషో గృహమ్ ॥ 126

(6) తా సుదేవాయ దాశుషే సుమేధామవితారిణీమ్ ।
ఘృతైర్గవ్యూతిముక్షతమ్ ॥ 127

(7) ఆ నః స్తోమముప ద్రవత్ తూయం శ్యేనేభిరాశుభిః ।
యాతమశ్వేభిరశ్వినా ॥ 128

---

1. స్తోమాఽఅదృశత్, 2. ణఽఊతయే, 3. కణ్వాసోఽఅశ్వినా. (ప్రా.ప్ర.)

(8) యేభిస్తిస్రః పరావతో దివో విశ్వాని రోచనా ।

త్రీగం[1]రక్తూన్ పరిదీయథః ॥ 129

(9) ఉత నో గోమతీరిష[2] ఉత సాతీరహర్విదా ।

వి పథః సాతయే సితమ్ ॥ 130

(10) ఆ నో గోమన్తమశ్వినా సువీరం సురథం రయిమ్ ।

[3]వోళ్హమశ్వావతీరిషః ॥ 131

(11) వావృధానా శుభస్పతీ దస్రా హిరణ్యవర్తనీ ।

పిబతం సోమ్యం మధు ॥ 132

(12) అస్మభ్యం వాజినీవసూ మఘవద్భ్యశ్చ సప్రథః ।

ఛర్దిర్యన్తమదాభ్యమ్ ॥ 133

---

1. త్రీగంఽరక్తూన్ (వ్రా.ప్ర.) త్రీఁరగంక్తూన్ (సా.), 2. రిషఽఉత, 3. వోళహ. (వ్రా.ప్ర.)

(13) ని షు బ్రహ్మ జనానాం యావిష్టం తూయమా గతమ్ ।
మో ష్వంన్యాగ్ం[1] ఉపారతమ్ ॥ 134

(14) అస్య పిబతమశ్వినా యువం మదస్య చారుణః ।
మధ్వో రాతస్య ధిష్ణ్యా ॥ 135

(15) అస్మే[2] ఆ వహతం రయిం శతవన్తం సహస్రిణమ్ ।
పురుక్షుం విశ్వధాయసమ్ ॥ 136

(16) పురుత్రా చిద్ధి వాం నరా విహ్వయన్తే మనీషిణః ।
వాఘద్భిరశ్వినా గతమ్ ॥ 137

(17) జనాసో వృక్తబర్హిషో హవిష్మన్తో[3] అరంకృతః ।
యువాం హవన్తే[4] అశ్వినా ॥ 138

---

1. న్యాగ్ంఽఉపారతమ్, 2. అస్మేఽఆవహతం, 3. హవిష్మన్తోఽఅరంకృతః, 4. హవన్తేఽఅశ్వినా. (వా ప్ర.)

(18) అస్మాకమద్య వామయం స్తోమో వాహిష్ఠో[1] అన్తమః ।

యువాభ్యాం భూత్వశ్వినా ॥ 139

(19) యో హ వాం మధునో దృతిరాహితో రథచర్షణే ।

తతః పిబతమశ్వినా ॥ 140

(20) తేన నో వాజినీవసూ పశ్వే తోకాయ శం గవే ।

వహతం పీవరీరిషః ॥ 141

(21) ఉత నో దివ్యా[2] ఇష ఉత సిన్ధూగ్ంరహర్విదా[3] ।

అప ద్వారేవ వర్షథః ॥ 142

(22) కదా వాం తౌగ్ర్యో విధత్సముద్రే జహితో నరా ।

యద్వాం రథో విభిష్పతాత్ ॥ 143

---

1. వాహిష్ఠోఽఅన్తమః, 2. దివ్యాఽఇషఽఉత, 3. సిన్ధూగ్ంఽరహర్విదా. (ప్రా.ప్ర.)

(23) యువం కణ్వాయ నాసత్యా[1] ఽపిరిప్తాయ హర్మ్యే ।

శశ్వదూతీర్దశస్యథః ॥ 144

(24) తాభిరా యాతమూతిభిర్నవ్యసీభిః సుశస్తిభిః ।

యద్వాం వృషణ్వసూ హువే ॥ 145

(25) యథా చిత్కణ్వమావతం ప్రియమేధముపస్తుతమ్ ।

అత్రిం శిఞ్జారమశ్వినా ॥ 146

(26) యథోత కృత్వ్యే [2]ధనేఽంశుం గోష్వగస్త్యమ్ ।

యథా వాజేషు సోభరిమ్ ॥ 147

(27) ఏతావద్వాం వృషణ్వసూ[3] అతో వా భూయో[4] అశ్వినా ।

గృణన్తః సుమ్నమీమహే ॥ 148

---

1. నాసత్యాపి, 2. ధనేఽంశుం, 3. వసూఽఅతో, 4. భూయోఽఅశ్వినా. (వా.ప్ర.)

(28) రథం హిరణ్యవన్ధురం హిరణ్యాభీశుమశ్వినా ।

ఆ హి స్థాథో దివిస్పృశమ్ ॥ 149

(29) హిరణ్యయీ వాం రభిరీషా[1] అక్షో హిరణ్యయః ।

ఉభా చక్రా హిరణ్యయా ॥ 150

(30) తేన నో వాజినీవసూ పరావతశ్చిదా గతమ్ ।

ఉపేమాం సుష్టుతిం మమ ॥ 151

(31) ఆ వహేథే పరాకాత్పూర్వీరశ్నన్తావశ్వినా ।

ఇషో దాసీరమర్త్యా ॥ 152

(32) ఆ నో ద్యుమ్నైరా శ్రవోభిరా రాయా యాతమశ్వినా ।

పురుశ్చన్ద్రా నాసత్యా ॥ 153

---

1. రభిరీషాఽఅక్షో. (బ్రా.ప్ర.)

(33) ఏహ వాం ప్రుషితప్సవో వయో వహన్తు పర్ణినః ।

అచ్ఛా స్వధ్వరం జనమ్ ॥ 154

(34) రథం వామనుగాయసం య[1] ఇషా వర్తతే సహ ।

న చక్రమభి బాధతే ॥ 155

(35) హిరణ్యయేన రథేన ద్రవత్పాణిభిరశ్వైః ।

ధీజవనా నాసత్యా ॥ 156

(36) యువం మృగం జాగృవాంసం స్వదథో వా వృషణ్వసూ ।

తా నః పృఙ్క్తమిషా రయిమ్ ॥ 157

---

1. యఽఇషా. (వ్రా.ప్ర.)

(37) తా మే[1] అశ్వినా సనీనాం విద్యాతం నవానామ్ ।
యథా చిచ్చైద్యః కశుః శతముష్ట్రానాం దదత్సహస్రా దశ గోనామ్ ॥ 158

(38) యో మే హిరణ్యసందృశో దశ రాజ్ఞో[2] అమంహత ।
అధస్పదా[3] ఇచ్చైద్యస్య కృష్టయశ్చర్మమ్నా[4] అభితో జనాః ॥ 159

(39) మాకిరేనా పథా గాద్యేనేమే యన్తి చేదయః ।
అన్యో నేత్సూరిరోహతే భూరిదావత్తరో జనః ॥ 160

---

1. తా మేఽఅశ్వినా, 2. రాజ్ఞోఽఅమం, 3. స్పదాఽఇచ్చై, 4. ర్మమ్నాఽఅభితో. (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### పంచమాష్టకము—అష్టమాధ్యాయము

### సూక్తము—౫

ఋషి—కాణ్వుఁడైన బ్రహ్మాతిథి*

దేవత—అశ్విద్వయము, 37-(ఉత్తరార్ధము), 38-39-చైద్యుఁడైన కశు నామకరాజు*

(1) గద్యము॥

దూరమందున్నను దగ్గఱ నుండునట్లు దీప్తరూపముగల యుషస్సు సమస్త వస్తువులను శ్వేతవర్ణములు గలవిగాఁ జేయుటఁబట్టి దీప్తిని బహుప్రకారము విస్తారముగఁ జేయును॥ 124

(2) గద్యము॥

ఓ దర్శనీయాశ్విద్వయమా! మీరు నేతల వంటివారు. ఇచ్ఛామాత్రమున సమకూర్పఁబడిన యన్నముగల రథమందు మీ రుషస్సులతోఁ గలిసికొనుఁడు! ॥ 125

(3) గద్యము॥

అన్నయుతులు, ధనయుతులు నగు నశ్విద్వయమా! మిమ్ములను నుద్దేశించి రచింపఁబడిన స్తోత్రముల నన్నిటిని నాలింపుఁడు! దూత ప్రభువు వాక్యమును బ్రార్థించు పగిది మేము మీ వాక్యములను బ్రార్థించుచున్నాము ॥ 126

---

* ఈ సూక్తమునకు "కణ్వనామక వమ్మాతిథి" ఋషిగా వ్రాతప్రతిలో (8వ సంపుటము, 282 పుట) వ్రాసి బ్రహ్మాతిథి గా 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో శ్రీనేమానివారు వ్రాసిరి. అశ్విద్వయము, కశునామక రాజు" దేవతలుగా వ్రాతప్రతిలో (8వ సంపుటము. 282 పుట.) వ్రాసి "అశ్వులు, కాసుని దానములు" దేవతలుగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గద్యము॥

మీ రనేకులకుఁ బ్రియులు. ఆనందప్రదులు. మీరు బహుధనయుతులు. మేము కణ్వ గణోత్పన్నులము. మమ్ము రక్షింపు మని యశ్విద్వయమును వేఁడుచున్నాము ॥ 127

(5) గద్యము॥

మీరు పూజనీయులు. అందరికంటె నధికులు. అధికాన్నప్రభులు. ధనవంతులు. మంగళప్రదు లగు హవ్యదాయులకై వెడలువారు ॥ 128

(6) గద్యము॥

ఎవ్వరు హవ్యదాతలో! సుందరదేవతావంతులో! వారి నిమిత్తము మీ రుత్తమ యజ్ఞవంతము, నపాయరహితము, నగు గో సంచరణభూమిని జలముచేఁ దడుపుఁడు! ॥ 129

(7) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యశ్వముల నారోహించి యతి శీఘ్రముగ మా స్తోత్రముల చెంతకు రండు! ఈ యశ్వముల గతి ప్రశంసనీయము ॥ 130

(8) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మూఁడు దినములు, మూఁడు రాత్రులు, సమస్తదీప్తివిశిష్టస్థానలయం దీ యశ్వముల సాహాయ్యమున రండు! ॥ 131

(9) గద్యము॥

మీరు దివస ప్రాపకులు. మా నిమిత్తము గోవులను నన్నమును సంభోగయోగ్య ధనమును మాకు దాన మీయుఁడు! ఈ సర్వమును భోగించుటకు మార్గమును జూపుఁడు! ॥ 132

(10) గద్యము॥

అశ్విద్వయమా! గోవులను, ఋత్రులను, సుందర రథములను నశ్వములను మా
కొసంగుము! ॥ 133

(11) గద్యము॥

శోభనపదార్థముల కధిపతులు, దర్శనీయులు, హిరణ్మయులు, మార్గయుక్తులు నగు
నశ్విద్వయమా! ప్రవృద్ధులై సోమమయ మధువును బానముఁ జేయుఁడు! ॥ 134

(12) గద్యము॥

అన్నవంతులు, ధనవంతులు నగు నశ్విద్వయమా! ధనవంతములు, మాకు సర్వతో
విస్తీర్ణములు, నహింసనీయములు నగు గృహముల నొసఁగుఁడు! ॥ 135

(13) గద్యము॥

మీరు మనుష్యస్తోత్రములను రక్షింపుఁడు! మీరు వేగముగ రండు! మనోహర మధురాంశమును
ద్రావుఁడు! ॥ 136

(14) గద్యము॥

స్తుతియోగ్యాశ్విద్వయమా! మీరు మా కిచ్చిన మధుకర మనోహర మధువుయొక్క-
యంశమును ద్రావుఁడు! ॥ 137

(15) గద్యము॥

మా నిమిత్తము శతసహస్రసంఖ్యలచే నొప్పునదియు, బహు నివాసప్రదమును,
సకలధారణక్షమము నగు ధనమును దెండు! ॥ 138

(16) గద్యము॥

నేతృద్వయమా! మనీషులు నానాదేశములందు నిన్నే పిలిచెదరు. అశ్విదయమా! వాహకాశ్వముల సాహాయ్యమున విచ్చేయుఁడు! ॥ 139

(17)† గీ॥ కడు సమర్థ కార్యకారులు బహు హవ్య
యుతులు జనులు ప్రీతియుక్తు లగుచు
వరలు భక్తితోడఁ బర్హిస్సుఁ ద్రుంచుచు
మిమ్ముఁ బలువఁగలరు నెమ్మితోడ ॥ 140

(18) గద్యము॥

అశ్విద్వయమా! మా యీ స్తోమము మీకంటె నధికవాహకమై మీకడనే యుండును ॥ 141

(19) గద్యము॥

అశ్విద్వయమా! యేది మధుపూర్ణ చర్మపాత్ర మధ్యదేశమందు స్థాపిత మైనదో! యా మధువును ద్రావుము! ॥ 142

(20) గద్యము।

అన్నయుతము, ధనవంతము నగు నశ్విద్వయమా! మాకుఁ బహు పుత్ర గోవుల నిమిత్తము ప్రవృద్ధాన్నమును రథముపైఁ దెమ్ము! ॥ 143

(21) గద్యము॥

దివస ప్రాపకు లగు నశ్విద్వయమా! స్వర్గీయము వాంఛనీయము నగు జలము మా నిమిత్తము సేచన మొనర్చుఁడు! ॥ 144

---

† (17) గద్యము ॥ హవ్యయుతులుఁ బర్యాప్త కార్యకారులు నగు జనులు బర్హిస్సును ద్రుంచుచు మిమ్ముఁ బిలిచెదరు. (తొలిపాఠము.)

(22) గద్యము॥

నేత లగు నశ్విద్వయమా! తుగ్రపుత్రుఁడు సముద్రమందుఁ ద్రోయఁబడి, స్తుతిచే మిమ్మేల వినుతించెను? మీ రథ మశ్వములతో వచ్చెను ॥ 145

(23) గద్యము॥

నాసత్యద్వయమా! మీ హర్మ్యతలమందు బద్ధుఁ డగు కణ్వమునిని బెక్కురీతుల రక్షించితిరి ॥ 146

(24) గద్యము॥

వర్షణశీలము, ధనయుతము నగు నశ్విద్వయమా! యెప్పుడు మిమ్ముఁ బిలిచెదమో! యప్పుడు ప్రశంసనీయ రక్ష నొసంగుటకు రండు! ॥ 147

(25) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీ రెట్లు కణ్వుని, ప్రియ మేధస్సును, సుపస్తుతుని, నత్రిని, రక్షించితిరో! యటులనే మమ్ము రక్షింపుఁడు! ॥ 148

(26) గద్యము॥

ధనమునకు నంశునట్లు, గోవులనిమిత్తమై యగస్త్యునట్లు, నవనమునకై సౌభారునట్లు, మమ్ముఁ గూడ సంరక్షింపుఁడు! ॥ 149

(27) గద్యము॥

వర్షణశీలము, ధనయుతము నగు నశ్విద్వయమా! మేము స్తుతించుచు నీ పరిమాణము గల ధనమునైన నింతకంటె నధికధనమునైన యాచించెదము ॥ 150

(28) గద్యము॥

అశ్విద్వయమా! హిరణ్మయసారథిస్థానమును గలిఁగి హిరణ్మయవల్గాయుత మగు రథమును నధివసింపుఁడు! ॥ 151

(29) గద్యము॥

అశ్విద్వయమా! త్వదాలంబనీయ రథముయొక్క పూజు(ఇష)హిరణ్మయము. అక్షములు హిరణ్మయములు. రెండు చక్రములును హిరణ్మయములు ॥ 152

(30) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యీ రథముపై దూరదేశమునుండి రండు! ॥ 153

(31)† గీ॥ మరణరహితాశ్వి యుగ్మమా! మరువ కీరు
దాసుల పురంబులను నెల్ల దగ్ధపరచు
చుండి దూరప్రదేశమునుండి మాకు
నన్నమును భవ్య మగు దాని నంది తెండు! ॥ 154

(32) గద్యము॥

బహుప్రియు లగు నశ్విద్వయమా! యన్నముతో మా సమీపమునకు రండు! యశస్సును, ధనమును గలిఁగి రండు! ॥ 155

(33) గద్యము॥

ఓ యశ్విద్వయమా! స్నిగ్ధరూపములు గలిఁగి పక్షయుతములైన యశ్వగణము మిమ్ము యజ్ఞకర్తలకు జనుల చెంతకుఁ దెచ్చిపెట్టును ॥ 156

---

† (31) గద్యము॥ మరణరహితాశ్విద్వయమా! మీరు దాసుల బహు సంఖ్యాక పురములను భగ్నములు కావించుచు దూరదేశములనుండి యన్నమును గొనితెండు! ॥ (తొలిపాఠము)

(34) గద్యము॥

ఏ రథ మశ్వములతోఁ గూడుకొనినదో! ప్రశంసనీయ లగు మి మ్మా రథము సేనా సమూహమును బాధింపదు ॥ 157

(35) గద్యము॥

మనస్సు వలె వేగము గల నాసత్యద్వయమా! క్షిప్రపదయుతము, నశ్వసహితము నగు హిరణ్మయ రథముపై నెక్కి రండు! ॥ 158

(36) గద్యము॥

వర్షణశీలము, ధనయుతము నగు నశ్విద్వయమా! మీరు సర్వదా జాగరూక మగు నన్వేషణీయ సోమమును త్రావుఁడు! మీ రన్నదానము నొసంగుఁడు! 159

(37) గద్యము॥

అశ్విద్వయమా! మీ రభినవము, భజనీయము నగు ధనము నెఱుంగుదురు. చేది వంశీయుం డగు కశురాజు శతోష్ట్రములను, దశ సహస్ర గోవులను, దాన మిచ్చుటను నెరుంగుదురు ॥ 160

(38) గద్యము॥

ఏ కశువు మా పరిచర్యార్థము హిరణ్యసదృశ దశజనరాజును దాన మొసంగెనో! చేది వంశీయుం డగు నా కశురాజు పాదముయొక్క నిమ్నదేశమునందుఁ బ్రజ లుండిరి ॥ 161

(39) గద్యము॥

ఏ మార్గమును బట్టి చేదిరాజు పోయెనో! యా మార్గమును బట్టి మ రెవ్వరును బోఁజాలరు. అతనికంటె నధికతరదానశీలుఁడు విద్వాంసుఁడు నగు వ్యక్తి స్తోతలకు దాన మొసంగలేదు ॥ 162

## అనువాకః—2, సూక్తమ్—6

ఋషిః—వత్సః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 46-48-తిరిన్దిరః పార్శవ్యః
ఛందః—గాయత్రీ

(1) మహాఁ[1] ఇన్ద్రో య ఓజసా పర్జన్యో వృష్టిమాఁ[2] ఇవ ।
స్తోమైర్వత్సస్య వావృధే ॥ 161

(2) ప్రజామృతస్య పిప్రతః ప్ర యద్ భరన్త వహ్నయః ।
విప్రా[3] ఋతస్య వాహసా ॥ 162

(3) కణ్వా[4] ఇన్ద్రం యదక్రత స్తోమైర్యజ్ఞస్య సాధనమ్ ।
జామి బ్రువత[5] ఆయుధమ్ ॥ 163

(4) సమస్య మన్యవే విశో విశ్వా నమన్త కృష్టయః ।
సముద్రాయేవ సిన్ధవః ॥ 164

---

1. మహాఁ౨ఇన్ద్రో యః౨ఓజసా, 2. మాఁ౨ఇవ, 3. విప్రాః౨ఋతస్య,
4. కణ్వాః౨ఇన్ద్రం, 5. బ్రువత౨ఆయుధమ్. (ప్రా.ప్ర.)

(5) ఓజస్తదస్య తిత్విష[1] ఉభే యత్సమవర్తయత్ ।
ఇన్ద్రశ్చర్మేవ రోదసీ ॥ 165

(6) వి చిద్వృత్రస్య దోధతో వజ్రేణ శతపర్వణా ।
శిరో బిభేద వృష్ణినా ॥ 166

(7) ఇమా[2] అభి ప్ర ణోనుమో విపామగ్రేషు ధీతయః ।
అగ్నేః శోచిర్న దిద్యుతః ॥ 167

(8) గుహా సతీరుప త్మనా ప్ర యచ్ఛోచన్త ధీతయః ।
కణ్వా[3] ఋతస్య ధారయా ॥ 168

(9) ప్ర తమిన్ద్ర నశీమహి రయిం గోమన్తమశ్వినమ్ ।
ప్ర బ్రహ్మ పూర్వచిత్తయే ॥ 169

---

1. తిత్విషఽఉభే, 2. ఇమాఽఅభి, 3. కణ్వాఽఋతస్య. (ప్రా.ప్ర.)

(10) అహమిద్ధి పితుష్పరి మేధామృతస్య జగ్రభ ।

అహం సూర్య[1] ఇవాజని ॥ 170

(11) అహం ప్రత్నేన మన్మనా గిరః శుమ్భామి కణ్వవత్ ।

యేనేన్ద్రః శుష్మమిద్దధే ॥ 171

(12) యే త్వామిన్ద్ర న తుష్టువురృషయో యే చ తుష్టువుః ।

మమేద్వర్ధస్వ సుష్టుతః ॥ 172

(13) యదస్య మన్యురధ్వనీద్వి వృత్రం పర్వశో రుజన్ ।

అపః సముద్రమైరయత్ ॥ 173

(14) ని శుష్ణ[2] ఇన్ద్ర ధర్ణసిం వజ్రం జఘన్థ దస్యవి ।

వృషా హ్యుగ్ర శృణ్విషే ॥ 174

---

1. సూర్యఽఇవాజని, 2. శుష్ణఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(15) న ద్యావ[1] ఇన్ద్ర మోజసా నా న్తరిక్షాణి వ జ్రిణమ్ ।
న వివ్యచన్త భూమయః ॥ 175

(16) యస్త[2] ఇన్ద్ర మహీరపః స్తభూయమాన[3] ఆశయత్ ।
ని తం పద్యాసు శిశ్నథః ॥ 176

(17) య[4] ఇమే రోదసీ మహీ సమీచీ సమజగ్రభీత్ ।
తమోభిరిన్ద్ర తం గుహః ॥ 177

(18) య[5] ఇన్ద్ర యతయస్త్వా భృగవో యే చ తుష్టువుః ।
మమేదుగ్ర శ్రుధీ హవమ్ ॥ 178

(19) ఇమాస్త[6] ఇన్ద్ర పృశ్నయో ఘృతం దుహత[7] ఆశిరమ్ ।
ఏనామృతస్య పిప్యుషీః ॥ 179

1. ద్యావఽఇన్ద్ర, 2. యస్తఽఇన్ద్ర, 3. మానఽఆశయత్, 4. యఽఇమే, 5. యఽఇన్ద్ర,
6, ఇమాస్తఽఇన్ద్ర, 7. దుహతఽఆశిరమ్. (వ్రా. ప్ర.)

(20) యా[1] ఇన్ద్ర ప్రస్వస్త్వా ఽఽసా గర్భమచక్రిరన్ ।

పరి ధర్మేవ సూర్యమ్ ॥ 180

(21) త్వామిచ్ఛవసస్పతే కణ్వా[2] ఉక్థేన వావృధుః ।

త్వాం సుతాస[3] ఇన్దవః ॥ 181

(22) తవేదిన్ద్ర ప్రణీతిషూత ప్రశస్తిరద్రివః ।

యజ్ఞో వితన్తసాయ్యః ॥ 182

(23) ఆ న[4] ఇన్ద్ర మహీమిషం పురం దర్షి గోమతీమ్ ।

ఉత ప్రజాం సువీర్యమ్ ॥ 183

(24) ఉత త్యదాశ్వశ్వ్యం యదిన్ద్ర నాహుషీష్వా ।

అగ్రే విక్షు ప్రదీదయత్ ॥ 184

---

1. యాఽఇన్ద్ర, 2. కణ్వాఽఉక్థేన, 3. సుతాసఽఇన్దవః, 4. ఆ నఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(25) అభి వ్రజం న తత్నిషే సూర[1] ఉపాకచక్షసమ్ ।
యదిన్ద్ర మృళయాసి నః ॥ 185

(26) యదఙ్గ తవిషీయస[2] ఇన్ద్ర ప్రరాజసి క్షితీః ।
మహాగ్ం[3] అపార ఓజసా ॥ 186

(27) తం త్వా హవిష్మతీర్విశ[4] ఉప బ్రువత ఊతయే ।
ఉరుజ్రయసమిన్దుభిః ॥ 187

(28) ఉపహ్వరే గిరీణాం సంగథే చ నదీనామ్ ।
ధియా విప్రో[5] అజాయత ॥ 188

(29) అతః సముద్రముద్వతశ్చికిత్వాగ్ం[6] అవ పశ్యతి ।
యతో విపాన[7] ఏజతి ॥ 189

---

1. సూరఽఉపాక, 2. యసఽఇన్ద్ర, 3. మహాగ్ంఽఅపారఽఓజసా, 4. విశఽఉప బ్రువతఽఊతయే,
5. విప్రోఽఅజాయత, 6. త్వాగ్ంఽఅవ, 7. విపానఽఏజతి. (వ్రా.ప్ర.)

(30) ఆదిత్ప్రత్నస్య రేతసో జ్యోతిష్పశ్యన్తి వాసరమ్ ।
పరో యదిధ్యతే దివా ॥ 190

(31) కణ్వాస[1] ఇన్ద్ర తే మతిం విశ్వే వర్ధన్తి పౌంస్యమ్ ।
ఉతో శవిష్ఠ వృష్ణ్యమ్ ॥ 191

(32) ఇమాం మ[2] ఇన్ద్ర సుష్టుతిం జుషస్వ ప్ర సు మామవ ।
ఉత ప్ర వర్ధయా మతిమ్ ॥ 192

(33) ఉత బ్రహ్మణ్యా వయం తుభ్యం ప్రవృద్ధ వజ్రివః ।
విప్రా[3] అతక్ష్మ జీవసే ॥ 193

(34) అభి కణ్వా[4] అనూషతాఽఽపో న ప్రవతా యతీః ।
ఇన్ద్రం వనన్వతీ మతిః ॥ 194

---

1. కణ్వాసఽఇన్ద్ర. 2. మఽఇన్ద్ర. 3. విప్రాఽఉతక్ష. 4.కణ్వాఽఅనూషతాపో. (ప్రా.ప్ర.)

(35) ఇన్ద్రముక్థాని వావృధుః సముద్రమివ సిన్ధవః ।
అనుత్తమన్యుమజరమ్ ॥ 195

(36) ఆ నో యాహి పరావతో హరిభ్యాం హర్యతాభ్యామ్ ।
ఇమమిన్ద్ర సుతం పిబ ॥ 196

(37) త్వామిద్వృత్రహన్తమ జనాసో వృక్తబర్హిషః ।
హవన్తే వాజసాతయే ॥ 197

(38) అను త్వా రోదసీ[1] ఉభే చక్రం న వర్త్యేతశమ్ ।
అను సువానాస[2] ఇన్దవః ॥ 198

(39) మన్దస్వా సు స్వర్ణర[3] ఉతేన్ద్ర శర్యణావతి ।
మత్స్వా వివస్వతో మతీ ॥ 199

---

1. రోదసీఽఉభే, 2. నాసఽఇన్దవః, 3. స్వర్ణరఽఉతేన్ద్ర. (ప్రా.ప్ర.)

(40) వావృధాన[1] ఉప ద్యవి వృషా వజ్ర్యరోరవీత్ ।

వృత్రహా సోమపాతమః ॥ 200

(41) ఋషిర్హి పూర్వజా[2] అస్యేక ఈశాన ఓజసా ।

ఇన్ద్ర చోష్కూయసే వసు ॥ 201

(42) అస్మాకం త్వా సుతాగ్ం[3] ఉప వీతపృష్ఠా అభి ప్రయః ।

శతం వహన్తు హరయః ॥ 202

(43) ఇమాం సు పూర్వ్యాం ధియం మధోర్ఘృతస్య పిప్యుషీమ్ ।

కణ్వా[4] ఉక్థేన వావృధుః ॥ 203

(44) ఇన్ద్రమిద్విమహీనాం మేధే వృణీత మర్త్యః ।

ఇన్ద్రం సనిష్యరూతయే ॥ 204

---

1. ధానఽఉప, 2. పూర్వజాఽఅస్యేకఽఈశానఽఓజసా, 3. సుతాగ్ంఽఉప వీతపృష్ఠాఽఅభిః

4. కణ్వాఽఉక్థేన. (వ్రా. ప్ర.)

(45) అర్వాఞ్చం త్వా పురుష్టుత ప్రియమేధస్తుతా హరీ ।

సోమపేయాయ వక్షతః ॥ 205

(46) శతమహం తిరిన్దిరే సహస్రం పర్శావా దదే ।

రాధాంసి యాద్వానామ్ ॥ 206

(47) త్రీణి శతాన్యర్వతాం సహస్రా దశ గోనామ్ ।

దదుష్పజ్రాయ సామ్నే ॥ 207

(48) ఉదానట్కకుహో దివముష్ట్రాఞ్చతుర్యుజో దదత్ ।

శ్రవసా యాద్వం జనమ్ ॥ 208

## అనువాకము—2, సూక్తము—6

ఋషి—కాణ్వుఁడైన వత్సుఁడు
దేవత—ఇందు్రిఁడు, పార్శవ్యుఁడగు తిరిందిరుఁడు*

(1) గద్యము॥

వృష్టిమంతుఁ డగు పర్జన్యుఁడు వలె నెవఁడు బలవంతుఁడో! వాఁడు వత్సుని స్తోమముద్వారా వర్ధితుఁ డగును ॥ 163

(2) గద్యము॥

నభోదేశమును నిండించెడు నశ్వములు యజ్ఞమునకుఁ బ్రజ యగు నింద్రుని వహించునపుడు విద్వాంసులు యజ్ఞప్రాపకస్తుతులచే నుతింతురు ॥ 164

(3) గద్యము॥

కణ్వగణము స్తోమముచే నింద్రుని యజ్ఞసాధకునిగా నొనర్చిరి. కాఁబట్టి లోకమందు నాయుధ మింద్రునిది యని చెప్పఁబడును ॥ 165

(4) గద్యము॥

సింధువులు సముద్రమును జేరునటుల సమస్త ప్రజాగణములును వీని క్రోధభయమువలన వీనికి నమస్కరింతురు ॥ 166

(5) గద్యము॥

ఏ బలమున నింద్రుఁడు ద్యావాభూములను జర్మము వలె సంవర్తితులుగా నొనర్చునో! వాని యా బలము సందీప్త మగును ॥ 167

---

* ఈ సూక్తమునకు వ్రాతప్రతిలో (8వ సంపుటము-288 పుట) "ఇంద్రుఁడు, దానప్రశంస"లు దేవతగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ఇంద్రుఁడు, తిరిందురుని దానములు" దేవతగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

(6) గద్యము॥

వాఁడు కంపకవృత్రుని మస్తముకమును, శతపర్వమును వీర్యశాలియు నగు వజ్రముచే ఛేదించెను 168

(7) గద్యము॥

మేము స్తోతల సమీపమున నగ్నిదీప్తి వలెఁ బ్రకాశించు స్తోత్రసమూహమును బునఃపునః ఉచ్చరింతుము ॥ 169

(8) గద్యము॥

గుహలోనుండు స్తుతి సమూహము స్వయముగా నేతెంచి దీప్తి నొందును. కణ్వులు దాని నుదకధారాయుక్తముగాఁ జేయుదురుగాక! ॥ 170

(9) గద్యము॥

ఓ యింద్రుఁడా! మే మశ్వములను నన్నమును ధనమును బొందెదము. ఇతరులకుఁ బూర్వజ్ఞానమునకై యన్నము లభించును ॥ 171

(10) గద్యము॥

నేను, బితయు, స్తుత్యుఁడు నగు నింద్రుని యనుగ్రహమును బడసెదను. నేను సూర్యుని వలె బ్రాదుర్భూతుఁడ నయ్యెదను ॥ 172

(11) గద్యము॥

నేను గణ్వుని వలె స్తోత్రములచే వాక్యసమూహము నలంకరించెదను. వీనిచే నింద్రుఁడు బలమును ధరించును ॥ 173

(12) గద్యము॥

ఓ యింద్రుఁడా! యెవ్వరు నిన్ను నుతి చేయకుందురో! యే ఋషులు నీకు నుతి చేయుదురో! వారల మధ్యను మా స్తోత్రములు చక్కఁగా స్తుతములై వృద్ధి పొందును ॥ 174

(13) గద్యము॥

ఎప్పుడు వీని క్రోధము వృత్రుని పర్వమందు విభాగించుచు శబ్దము చేయునో! యప్పుడు వాఁడు సముద్రాభిముఖముగా జలమును ప్రేరేపించును ॥ 175

(14) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వుపక్షపయిత యగు శుష్ణునిగూర్చి వజ్రాఘాతమును గలిఁగించితివి! ఓ యుగ్రుఁడా! నీ వభీష్టవర్షి వన్న మాట విదితము॥ 176

(15) గద్యము॥

ద్యో లోక సమూహ మింద్రుని బలముచే వ్యాపించును ॥ 177

(16) గద్యము॥

ఏ వృత్రుఁడు నీ మహాజలమును స్తంభించుచుఁ బరివ్యాప్తముగాఁ జేసెనో! వానిని గమనశీల మగు జలమందు వధించితివి! ॥ 178

(17) గద్యము॥

ఎవ్వఁడు గొప్పవియును సంగతలును నగు ద్యావాపృథువులను నావరించెనో! యో యింద్రుఁడా! వానిని దమస్సమూహముచేఁ గప్పితివి! ॥ 179

(18) గద్యము॥

ఉగ్రేంద్రుఁడా! యే యతులు నిన్ను వినుతింతురో! యే ఋషులు నీకు స్తుతు లొనరింతురో!
వారి మధ్యమున మా యాహ్వానము నాలకింపుము! ॥ 180

(19) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీయొక్క సత్యమును వృద్ధి బొందించెడు గోవులు ఘృతమును
బుట్టించును ॥ 181

(20) గద్యము॥

ఓ యింద్రుఁడా! ప్రసవకారిణు లగు గోవు లాస్యములచే నీ విచ్చిన యన్నమును భక్షించి
సూర్యునికి నలుదిక్కులు జలము వలె గర్భధారణ మొనర్చును ॥ 182

(21) గద్యము॥

వజ్రము గల యింద్రుఁడా! కణ్వు లుక్థములచే నిన్ను వర్ధితునిగాఁ జేయుదురు. అభిషుత
సోమసమూహము నీకొరకు వృద్ధి పొందింపఁబడెను ॥ 183

(22) గద్యము॥

ఓ బలపతీ! యింద్రుఁడా! నీవు పథప్రదర్శకుఁడ వయినచో నుత్తమస్తుతులు, ప్రవృద్ధ
యజ్ఞములును జేయఁబడును ॥ 184

(23) గద్యము॥

ఓ యింద్రుఁడా! మా నిమిత్తము గొప్పదియు గోవులు గలదియు, నగు నన్నమును
రక్షించుటకును, వీర్యవంత మగు పుత్రాది ధాన మొసంగుటకును, నిశ్చయింపుము! 185

(24) గద్యము॥

ఓ యింద్రుఁడా! నహుషరాజుయొక్క ప్రజలకు సమ్ముఖముగ శీఘ్రగాము లగు
నశ్వములతో నే బల మొసంగితివో! మాకుఁగూడ నా బలమునే యొసంగుము! ॥ 186

(25) గద్యము॥

ఇంద్రుఁడా! నీవు ప్రాజ్ఞుఁడవు! నీ విపుడు సమీపమునుండి దర్శనీయ గోష్ఠములను
విస్తారముగా నొనర్చుము! మమ్ము సుఖవంతులుగాఁ జేయుము! ॥ 187

(26) గద్యము॥

ఇంద్రుఁడా! నీవు బలము వలె నాచరింపుము! మనుష్యులకు రాజు వగుము! నీవు బలముచే
గొప్పవాఁడవు! అనభిభవనీయుఁడవు! ॥ 188

(27) గద్యము॥

ఇంద్రుఁడా! నీవు విస్తీర్ణవ్యాపివి! హవ్యవంతు లగు జనులు సోమముచే నీకుఁ దృప్తి
కలిఁగించుటకై నీ కడకు వచ్చి నుతింతురు ॥ 189

(28)† గీ॥ పర్వత ప్రాంతములయందుఁ బరమనదులు
సంగమించు స్థలంబుల సవనములను
జేయుచో మేధ గల్గిన శ్రీమహేంద్రుఁ
డాత్ర జన్మము గాంచుఁ దా నాదారమున ॥ 190

† (28) గద్యము॥ పర్వతప్రాంతములందు నదులు సంగమించు స్థలముల యజ్ఞక్రియ లొనర్చినచో మేధావి
యగు నింద్రుఁడు జన్మము నొందును. (తొలి పాఠము)

(29) గద్యము॥

సర్వవ్యాపి యగు నిందుఁడే లోకమందు విహరించునో! యట్టి యూర్ధ్వలోకమునుండి
విద్వాంసుఁ డగు నింద్రుఁడు నిమ్నముఖముగా సముద్రమును దర్శించును ॥ 191

(30) గద్యము॥

ద్యోలోకము మీఁద నింద్రుఁ డెపుడు దీపించునో! యపుడు పురాతనజలప్రదుఁ డగు నింద్రుని
నివాసప్రద జ్యోతిస్సు లోకమం దగపడును ॥ 192

(31) గద్యము॥

ఇంద్రుఁడా! సమస్త కణ్వులు నీ బుద్ధిని, నీ బలమును, వృద్ధిపరచుచున్నారు.
ఓ బలవత్తమా! నీ వీరకర్మను గూడ నభివృద్ధి పరచుచున్నారు ॥ 193

(32)† గీ॥ ఇంద్రుఁడా! నీవు మా స్తుతి నెల్ల వినుచు
మముఁ బ్రసన్నులుగాఁ జేసి మముల మిగులఁ
గాచి మా బుద్ధి నెలమిఁ బ్రకామ వర్ధి
తముగఁ జేయుము! మా కిలఁ దనివి కలుఁగ ॥ 194

(33) గద్యము॥

ప్రవృద్ధుఁడవు, వజ్రివి యగు నో యింద్రుఁడా! మేము మేధావులము. మేము జీవించుటకు
నిన్ను వినుతించుచున్నాము ॥ 195

† (32) గద్యము॥ఓ యిందుఁడా! నీవు మా యీ స్తుతి సేవింపుము! మమ్ముఁ బ్రసన్నులుగాఁజేసి రక్షింపుము!
మా బుద్ధిని బ్రవర్ధితముగాఁ జేయుము! ॥ (తొలి పాఠము)

(34) గద్యము॥

కణ్వుల మగు మేము స్తుతించుచున్నాము. నిమ్నాభిముఖముగాఁ బోవు జలరాశి వలె వరణీయ
స్తుతి యింద్రుని సేవకొఱ కుపయుక్త మగును ॥ 196

(35) గద్యము॥

నద గణము సముద్రమును వర్ధితముగఁ జేయునటుల నుక్థము లన్నియు నింద్రుని వృద్ధిఁ
బొందించుచుండెను. ఇంద్రుఁడు జరా రహితుఁడు. వాని క్రోధము నెవ్వరును
నివారింపలేరు ॥ 197

(36) గద్యము॥

ఓ యింద్రుఁడా! దూర దేశమునుండి కమనీయాశ్వముల నధిరోహించుచు మాకడకు రమ్ము!
అభిషుత సోమమును ద్రావుము! ॥ 198

(37) గద్యము॥

శత్రు నాశకుఁడ వగు నింద్రుఁడా! బర్హిస్సును ఛేదించు వా రన్న లాభము నొందుటకు
నిన్నుఁ బిలిచెదరు ॥ 199

(38) గద్యము॥

ఓ యింద్రుఁడా! చక్ర మశ్వము ననువర్తించునటుల ద్యావాభూములు రెండును నిన్ను
ననువర్తించును. అభిషుత సోమ మంతయు ని న్ననువర్తించును ॥ 200

(39) గద్యము॥

ఓ యింద్రుఁడా! శర్యణాదేశమునఁ బుష్కరిణీతీరమున ఋత్విక్కు లారంభించిన
యజ్ఞమందుఁ దృప్తుఁడ వగుము! ॥ 201

(40) గద్యము॥

ప్రవృద్ధుఁడు, నభీష్టవర్షియు, వజ్రియు, నతిశయ సోమపాయియు, వృత్రహంతయు నగు నింద్రుఁడు ద్యోలోక సమీపమున శబ్దముఁ జేయును ॥ 202

(41) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు పూర్వజాత ఋషివి! నీ వద్వితీయ బలమున సకలమునకు నధిపతి వగుచున్నావు. నీవు మాటిమాటికి ధనము నొసంగుము! ॥ 203

(42) గద్యము॥

ప్రశస్త పృష్ఠములు గలవియు, శత సంఖ్యాకములు నగు నశ్వములు మా సోమాన్నముల నుద్దేశించి నిన్నుఁ దెచ్చునుగాక! ॥ 204

(43) గద్యము॥

కణ్వుల యుక్థులచేఁ బూర్వకృతమును, మధుకటల వర్ధయిత్రియు, నగు యాగ క్రియ వృద్ధిఁ బొందింపఁబడుఁగాక! ॥ 205

(44) గద్యము॥

దేవతలు మిక్కిలి గొప్పవారు. వారి మధ్య నింద్రునే మనుష్యులు ధనాభిలాషులై రక్షణముకొఱకు వరింతురు! ॥ 206

(45) గద్యము॥

బహుస్తుతుఁడ వగు నో యింద్రుఁడా! బహు ప్రియములును ఋత్విక్ స్తుతములు నగు నశ్వద్వయము సోమ పానార్థము మిమ్ముల మా కడకుఁ దెచ్చునుగాక! ॥ 207

(46) గద్యము॥

యదువులలోఁ బశుపుత్రుం డగు "తిరిందిరు"ని సమీపమున శత సహస్ర ధనమును గ్రహించితిని ॥ 208

(47) గద్యము॥

వారు పర్శునకు, సామునకు, శతత్రయాశ్వములను దశ శత గోవులను నొసంగిరి ॥ 209

(48) గద్యము॥

వాఁ డున్నతుఁడై ఘన స్వర్ణ భారములు గల నాలు గుష్ట్రములను నొసంగుచు, యదువులకు దాస రూపము నిచ్చుచుఁ, గీర్తిచే స్వర్గమును వ్యాపించెను ॥ 210

## సూక్తమ్—7

ఋషిః—పునర్వత్సః కాణ్వః
దేవతా—మరుతః
ఛందః—గాయత్రీ

(1) ప్ర యద్వస్త్రిష్టుభమిషం మరుతో విప్రో[1] అక్షరత్ ।
వి పర్వతేషు రాజథ ॥ 209

(2) యదఙ్గ తవిషీయవో యామం శుభ్రా[2] అచిధ్వమ్ ।
ని పర్వతా[3] అహాసత ॥ 210

---

1. విప్రోఽఅక్షరత్, 2. శుభ్రాఽఅచి, 3. పర్వతాఽఅహాసత. (బ్రా.ప్ర.)

(3) ఉదీరయన్త వాయుభిర్వాశ్రాసః పృశ్నిమాతరః ।

ధుక్షన్త పిప్యుషీమిషమ్ ॥ 211

(4) వపన్తి మరుతో మిహం ప్ర వేపయన్తి పర్వతాన్ ।

యద్యామం యాన్తి వాయుభిః ॥ 212

(5) ని యద్యామాయ వో గిరిర్ని సిన్ధవో విధర్మణే ।

మహే శుష్మాయ యేమిరే ॥ 213

(6) యుష్మాగ్ం[1] ఉ నక్తమూతయే యుష్మాన్దివా హవామహే ।

యుష్మాన్ప్రయత్యధ్వరే । 214

(7) ఉదు త్యే[2] అరుణప్సవశ్చిత్రా యామేభిరీరతే ।

వాశ్రా[3] అధి ష్ణునా దివః ॥ 215

---

1. యుష్మాగ్ం౽ఉ, 2. ఉదు త్యే౽అరుణ, 3. వాశ్రా౽అధి. (వా.ప్ర.)

(8) సృజన్తి రశ్మిమోజసా పన్థాం సూర్యాయ యాతవే ।

తే భానుభిర్వి తస్థిరే ॥ 216

(9) ఇమాం మే మరుతో గిరమిమం స్తోమమృభుక్షణః ।

ఇమం మే వనతా హవమ్ ॥ 217

(10) త్రీణి సరాంసి పృశ్నయో దుదుహ్రే వజ్రిణే మధు ।

ఉత్సం కవన్ధముద్రిణమ్ ॥ 218

(11) మరుతో యద్ధ వో దివః సుమ్నాయన్తో హవామహే ।

ఆ తూ న[1] ఉప గన్తన ॥ 219

(12) యూయం హి ష్ఠా సుదానవో రుద్రా[2] ఋభుక్షణో దమే ।

ఉత ప్రచేతసో మదే ॥ 220

---

1. నఽఉప, 2. రుద్రాఽఋభుక్షణో. (వ్రా.ప్ర.)

(13) ఆ నో రయిం మదచ్యుతం పురుక్షుం విశ్వధాయసమ్ ।
ఇయర్తా మరుతో దివః ॥ 221

(14) అధీవ యద్గిరీణాం యామం శుభ్రా[1] అచిధ్వమ్ ।
సువానైర్మన్దధ్వ[2] ఇన్దుభిః ॥ 222

(15) ఏతావతశ్చిదేషాం సుమ్నం భిక్షేత మర్త్యః ।
అదాభ్యస్య మన్మభిః ॥ 223

(16) యే ద్రప్సా[3] ఇవ రోదసీ ధమన్త్యను వృష్టిభిః ।
ఉత్సం దుహన్తో[4] అక్షితమ్ ॥ 224

(17) ఉదు స్వానేభిరీరత[5] ఉద్రథైరుదు వాయుభిః ।
ఉత్స్తోమైః పృశ్నిమాతరః ॥ 225

---

1. శుభ్రాఽఅచిధ్వమ్, 2. మన్దధ్వఽఇన్దుభిః, 3. ద్రప్సాఽఇవ, 4. దుహన్తోఽఅక్షితమ్,

5. ఈరతఽఉద్. (ప్రా.ప్ర.)

(18) యేనావ తుర్వశం యదుం యేన కణ్వం ధనస్పృతమ్ ।
రాయే సు తస్య ధీమహి ॥ 226

(19) ఇమా[1] ఉ వః సుదానవో ఘృతం న పిప్యుషీరిషః ।
వర్ధాన్కాణ్వస్య మన్మభిః ॥ 227

(20) క్వ నూనం సుదానవో మదథా వృక్తబర్హిషః ।
బ్రహ్మా కో వః సపర్యతి ॥ 228

(21) నహి ష్మ యద్ధ వః పురా స్తోమేభిర్వృక్తబర్హిషః ।
శర్ధాగ్ం[2] ఋతస్య జిన్వథ ॥ 229

(22) సము త్యే మహతీరపః సం క్షోణీ సము సూర్యమ్ ।
సం వజ్రం పర్వశో దధుః ॥ 230

1. ఇమా౨ఉ వః, 2. శర్ధాగ్ం౨ఋతస్య. (బ్రా.ప్ర)

(23) వి వృత్రం పర్వశో యయుర్వి పర్వతాగ్ం[1] అరాజినః ।
చక్రాణా వృష్ణి పౌంస్యమ్ ॥ 231

(24) అను త్రితస్య యుధ్యతః శుష్మమావన్నుత క్రతుమ్ ।
అన్విన్ద్రం వృత్రతూర్యే ॥ 232

(25) విద్యుద్ధస్తా[2] అభిద్యవః శిప్రాః శీర్షన్హిరణ్యయీః ।
శుభ్రా వ్యఞ్జత శ్రియే ॥ 233

(26) ఉశనా యత్పరావత[3] ఉక్ష్ణో రన్ధ్రమయాతన ।
ద్యౌర్న చక్రదద్భియా ॥ 234

(27) ఆ నో మఖస్య దావనే ఽశ్వైర్హిరణ్యపాణిభిః ।
దేవాస[4] ఉప గన్తన ॥ 235

---

1. పర్వతాగ్ంఽఅరాజినః, 2. విద్యుద్ధస్తాఽఅభిద్యవః, 3. పరావతఽఉక్ష్ణో, 4. దేవాసఽఉప. (వా.ప్ర.)

(28) యదేషాం పృషతీ రథే ప్రష్టిర్వహతి రోహితః ।
యాన్తి శుభ్రా రిణన్నపః ॥ 236

(29) సుషోమే శర్యణావత్యార్జీకే పస్త్యావతి ।
యయుర్నిచక్రియా నరః ॥ 237

(30) కదా గచ్ఛాథ మరుత[1] ఇత్థా విప్రం హవమానమ్ ।
మార్డీకేభిర్నాధమానమ్ ॥ 238

(31) కద్ధ నూనం కధప్రియో యదిన్ద్రమజహాతన ।
కో వః సఖిత్వ[2] ఓహతే ॥ 239

(32) సహో షు ణో వజ్రహస్తైః కణ్వాసో[3] అగ్నిం మరుద్భిః ।
స్తుషే హిరణ్యవాశీభిః ॥ 240

1. మరుతఃఽఇత్థా, 2. సఖిత్వఽఓహతే, 3. కణ్వాసోఽఅగ్నిం. (వా.ప్ర.)

(33) ఓ షు వృష్ణః ప్రయజ్యూనా నవ్యసే సువితాయ ।

పవవృత్యాం చిత్రవాజాన్ ॥ 241

(34) గిరయశ్చిన్ని జిహతే పర్శానాసో మన్యమానాః ।

పర్వతాశ్చిన్ని యేమిరే ॥ 242

(35) అక్షయావానో వహన్త్య న్తరిక్షేణ పతతః ।

ధాతారః స్తువతే వయః ॥ 243

(36) అగ్నిర్హి జాని పూర్వ్యశ్ఛన్దో న సూరో[1] అర్చిషా ।

తే భానుభిర్వి తస్థిరే ॥ 244

---

1. సూరోఽఅర్చిషా. (వా.ప్ర.)

## సూక్తము—7

ఋషి—కణ్వగోత్రుఁ డగు పునర్వత్సుఁడు*

దేవత—మరుద్గణము

(1) గద్యము॥

ఓ మరుద్గణమా! యెపుడు విద్యుఁ డగు వ్యక్తి సవనత్రయమందుఁ బ్రశస్తాన్నము
నొసంగునో! యపుడు మీరు పర్వతముల మీఁద దీపింపుఁడు! ॥ 211

(2) గద్యము॥

జలాభిలాషులు, శోభమానులు నగు మరుత్తులారా! మీరు రథమునకు నశ్వములఁ బూన్చు
నపుడు పర్వతములు చలించును ॥ 212

(3) గద్యము॥

శబ్దకారులు, పృశ్ని తనయులు నగు మరుత్తులు వాయువులచే మేఘములు పుట్టునటులఁ
జేయును. వృద్ధిని నొసంగు నన్నము నిచ్చును ॥ 213

(4) గద్యము॥

ఎపుడు మరుత్తులు వాయువుతోఁ గూడి రథము పైఁ బోవునో! యప్పుడు వృష్టి కలుఁగును.
పర్వతములు కంపించును ॥ 214

(5) గద్యము॥

మీ రథములకై పర్వతములు నియతము లగును. సింధువులు మహాబలముకొఱకు
నియతములు ॥ 215

---

* ఈ సూక్తమునకు వ్రాతప్రతిలో (8వ సంపుటము. 293 పుట.) "పునర్వత్సుఁడు" ఋషిగాను, 15b సంస్కృతములోని ఋషిదేవతల పట్టికలో "పునర్వస్తుఁడు" ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(6) గద్యము॥

మేము మిమ్ములను రాత్రి రక్షించుటకుఁ బిలిచెదము. దివాభాగమందు మి మ్మాహ్వానింతుము.
యజ్ఞ మారంభమైనయెడల మిమ్ముఁ బిలిచెదము ॥ 216

(7) గద్యము॥

అరుణరూపులు, విచిత్రులు, శబ్దకారులు నగు మరుత్తులు రథ యోగమున ద్యోలోకమునకు
మీఁద నుండు సాను ప్రదేశములను జేరును ॥ 217

(8) గద్యము॥

ఏ మరుత్తులు సూర్య గమనార్థము రశ్మియుత మార్గమును సృజింతురో! వారు
తేజస్సులచే వెలుఁగుదురు 218

(9) గద్యము॥

మరుత్తులారా! మా వాక్యములను సేవింపుఁడు! మహా మరుత్తులారా! యీ స్తోమమును
భజింపుఁడు! మా యాహ్వానమును మీరు సేవింపుఁడు! 219

(10) గద్యము॥

పృశ్నిగణము వ్రజికై యుత్సము, కదంబకము, నుద్రి యను నీ మూఁడు సరోవరములనుండి
మధుదోహనమును జేసెను ॥ 220

(11) గద్యము॥

ఓ మరుత్తులారా! సుఖమును గోరి మేము స్వర్గమునుండి మిమ్ములను బిలిచిన యపుడు
శీఘ్రముగ మా కడకు రండు! ॥ 221

(12) గద్యము॥

సుందర దానశీలులు, మహా తేజస్సులు నగు రుద్రపుత్రులారా! మీరు గృహములయందు
నానందసమయములఁ బ్రకృష్ట జ్ఞాన సంపన్నులరు కండు! ॥ 222

(13) గద్యము॥

ఓ మరుద్గణమా! స్వర్గమునుండి మద్రశావియు, బహు నివాసప్రదమును, సకల భరణ
సమర్థము నగు ధనమును దెచ్చి యిమ్ముఁడు! ॥ 223

(14) గద్యము॥

శుభ్ర మరుత్తులారా! పర్వతోపరిభాగమునకు మీ యరదము పోవునపు డభిషుత సోమబలము
మిమ్ముఁ బ్రమత్తులుగాఁ జేయును ॥ 224

(15) గద్యము

స్తోత, స్తుతులకు నహింసనీయ మరుత్తుల కడను సుఖమును యాచించును ॥ 225

(16) గద్యము॥

మరుద్గణ మక్షీణమేఘమును దోహన మొనర్చుచు జల బిందువు వలె వృష్టిచే ద్యావా
భూములను సంపూర్ణముగా వ్యాపించును ॥ 226

(17) గద్యము॥

పృశ్ని పుత్రులు శబ్దమును జేయుచు నూర్ధ్వముగాఁ బోవుదురు. రథములపైని,
వాయువులవలన స్తోమముల ద్వారా యూర్ధ్వముగాఁ బోయెదరు ॥ 227

(18) గద్యము॥

వేటివలనఁ దుర్వసుఁడు, యదువు, రక్షింపఁబడిరో! వేనివలన ధన కాముఁ డగు కణ్వుఁడు రక్షింపఁబడెనో! ధనమునకై వానినే ధ్యానించుచున్నాము ॥ 228

(19) గద్యము॥

ఉత్తమ దానశీలు రగు నో మరుత్తులారా! ఘృతము వలెఁ బుష్టికర మగు నీ యన్నము కణ్వ గోత్రోత్పన్నుల స్తోత్రములతో వృద్ధిఁ బొందింపుఁడు! ॥ 229

(20) గద్యము॥

మీరు దానశీలురు! మీ నిమిత్తము బర్హిస్సు ఛేదింపఁబడుచున్నది. మీ రిపు డెచ్చట మదించి యున్నవారలు? ఏ స్తోత మీకుఁ బరిచర్య చేయుచున్నాఁడు? ॥ 230

(21) గద్యము॥

వృత్త బర్హిస్సు గల మరుత్తులారా! మీరు పూర్వకృత స్తోత్రములవలన యజ్ఞ బలము సంతోషము కలుఁగఁజేయుటలేదు 231

(22) గద్యము॥

ఆ మరుత్తు లోషదులచే ననేక జలములను గలుపుచున్నవి. ద్యావాభూములు తమ తమ స్థానములయం దుండునటులు చేసెను. సూర్యుని స్థాపించెను. అవి ప్రతి పర్వమందును వజ్రమును ధరించును । 232

(23) గద్యము॥

రాజమాన్యము, బలకారకము, నగు మరుద్గణము పర్వతము వలె వృత్రుని బ్రతి పర్వమునందును నశింపఁజేసెను 233

(24) గద్యము॥

మరుద్గణము యుద్ధమును జేయు త్రితునిబలమును సంరక్షించెను. వాని క్రతువులను బరిపాలించెను. వృత్రుని వధించుటకై యింద్రుని రక్షించెను ॥ 234

(25) గద్యము॥

ఆయుధ హస్తులు, దీప్తిమంతులు, శుభ్ర వర్ణములు గల మరుత్తులు శోభార్థమై మస్తకమునందు హిరణ్మయ శిరస్త్రాణమును బ్రకాశింపఁజేసికొనిరి ॥ 235

(26) గద్యము॥

ఓ మరుద్గణమా! మీరు కామించి యభీష్టవర్షి యగు రథముమధ్యస్థలమున వసించి దూరమునుండి వచ్చిరి. ద్యోలోకమున నుండు జన సమూహము వలె భూతము లన్నింటిని బంపించిరి ॥ 236

(27) గద్యము॥

దేవతలారా! మా యజ్ఞ దానార్థము స్వర్ణమయము పాదయుతము నగు నశ్వము నెక్కుచు వచ్చెదరుగాక! ॥ 237

(28) గద్యము॥

ఈ మరుత్తులయొక్క రథము బిందు చిహ్నితము శీఘ్రగామియు నగు రోహితద్వయము వహించునపుడు శోభమాన మరుత్తులు వెడలుదురు. జలము ప్రవహించును ॥ 238

(29) గద్యము॥

నేతలు శోభన సోమయుతము, యజ్ఞగృహోపేతము, ఋజీకదేశసంబంధమునగు శర్యణావతినామకసరోవరమందు రథ చక్రములను నిమ్నముఖముగా నొనర్చి వెడలును ॥ 239

(30) గద్యము॥

ఓ మరుత్తులారా! మీ రెపు డిటులు పిలుచుచున్న యాచమాన విప్రుని సుఖమునకు
హేతుభూత మగు ధనముతో వెడలెదరు?॥ 240

(31) గద్యము॥

మీరు స్తుతులద్వారా ప్రీతులై యుండుఁడు! మీ రే యింద్రుఁ బరిత్యజించిరో! యా
యింద్రుఁ డెచ్చట నున్నాఁడు? ॥ 241

(32) గద్యము॥

ఓ కణ్వగణమా! యగ్నిని వజ్రహస్తులు స్వర్ణమయవాశలు నగు మరుత్తులతో
స్తుతిఁ జేయుఁడు! ॥ 242

(33) గద్యము॥

నేను, వర్షణస్వభావము, యజ్ఞనీయము, విచిత్రబలవిశిష్టము, నగు మరుద్గణమును
నవతరము సుఖలభ్యము నగు ధనము నావర్తితముగాఁ జేసెద ॥ 243

(34) గద్యము॥

గిరు లన్నియుఁ బీడ్యమానములై బాధను బొందినచో స్వస్థానము భ్రష్టము కాదు.
పర్వతములు నియమితము లగును ॥ 244

(35) గద్యము॥

బహుదూరవ్యాపి, గమన స్వభావము గలదియు నగు నశ్వగణ మాకాశమునఁ బోవుచు
మరుత్తులను దెచ్చును. అవి స్తోతల కన్న మిచ్చును ॥ 245

(36) గద్యము॥

అగ్ని తేజోబలములు స్తుతియోగ్యసూర్యుని భంగి నన్నిటికిని ముఖ్య మైనవియై పుట్టును. మరుత్తులు దీప్తి బలములను నానాస్థానములయం దుండునటు లొనర్చును ॥ 246

## సూక్తమ్—8

ఋషిః—సధ్వంసః కాణ్వః
దేవతా—అశ్వినౌ
ఛందః—అనుష్టుప్

(1) ఆ నో విశ్వాభిరూతిభిరశ్వినా గచ్ఛతం యువమ్ ।
దస్రా హిరణ్యవర్తనీ పిబతం సోమ్యం మధు ॥ 245

(2) ఆ నూనం యాతమశ్వినా రథేన సూర్యత్వచా ।
భుజీ హిరణ్యపేశసా కవీ గమ్భీరచేతసా ॥ 246

(3) ఆ యాతం నహుషస్పర్యా[1]ఽఽ న్తరిక్షాత్సువృక్తిభిః ।
పిబాథో[2] అశ్వినా మధు కణ్వానాం సవనే సుతమ్ ॥ 247

---

1. స్పర్యాన్తరిక్షా, 2. పిబాథోఽఅశ్వినా. (వ్రా.ప్ర.)

(4) ఆ నో యాతం దివస్పర్యా ఽన్తరిక్షాదధప్రియా ।

పుత్రః కణ్వస్య వామిహ సుషావ సోమ్యం మధు ॥ 248

(5) ఆ నో యాతముపశ్రుత్యశ్వినా సోమపీతయే ।

స్వాహా స్తోమస్య వర్ధనా ప్ర కవీ ధీతిభిర్నరా ॥ 249

(6) యచ్చిద్ధి వాం పుర[1] ఋషయో జుహూరేఽవసే నరా ।

ఆ యాతమశ్వినా గతముపేమాం సుష్టుతిం మమ ॥ 250

(7) దివశ్చిద్ రోచనాదధ్యా నో గన్తం స్వర్విదా ।

ధీభిర్వత్సప్రచేతసా స్తోమేభిర్హవనశ్రుతా ॥ 251

(8) కిమన్యే పర్యాసతే ఽస్మత్ స్తోమేభిరశ్వినా ।

పుత్రః కణ్వస్య వామృషిర్గీర్భిర్వత్సో[2] అవీవృధత్ ॥ 252

---

1. పురఽఋషయో, 2. భిర్వత్సోఽఅవీవృధత్. (వ్రా.ప్ర.)

(9) ఆ వాం విప్ర[1] ఇహావసేఽహ్వత్ స్తోమేభిరశ్వినా ।
అరిప్రా వృత్రహన్తమా తా నో భూతం మయోభువా ॥ 253

(10) ఆ యద్ వాం యోషణా రథమతిష్ఠద్ వాజినీవసూ ।
విశ్వాన్యశ్వినా యువం ప్ర ధీతాన్యగచ్ఛతమ్ ॥ 254

(11) అతః సహస్రనిర్ణిజా రథేనా యాతమశ్వినా ।
వత్సో వాం మధుమద్వచోఽశంసీత్ కావ్యః కవిః ॥ 255

(12) పురుమన్ద్రా పురూవసూ మనోతరా రయీణామ్ ।
స్తోమం మే[2] అశ్వినావిమమభి వహ్నీ[3] అనూషాతామ్ ॥ 256

(13) ఆ నో విశ్వాన్యశ్వినా ధత్తం రాధాంస్యహ్రయా ।
కృతం న [4]ఋత్వియావతో మా నో రీరధతం నిదే ॥ 257

---

1. విప్రఽఇహ, 2. మేఽఅశ్వినా. 3. వహ్నీఽఅనూషాతామ్, 4. ఋత్వియం. (ప్రా.ప్ర.)

(14) యన్నాసత్యా పరావతి యద్వా స్థో[1] అధ్యమ్బరే ।

అతః సహస్రనిర్ణిజా రథేనా యాతమశ్వినా ॥ 258

(15) యో వాం నాసత్యావృషిర్గీర్భిర్వత్సో[2] అవీవృధత్ ।

తస్మై సహస్రనిర్ణిజమిషం ధత్తం ఘృతశ్చుతమ్ ॥ 259

(16) ప్రాస్మా[3] ఊర్జం ఘృతశ్చుతమశ్వినా యచ్ఛతం యువమ్ ।

యో వాం సుమ్నాయ తుష్టవద్వసూయాద్దానునస్పతీ ॥ 260

(17) ఆ నో గన్తం రిశాదసేమం స్తోమం పురుభుజా ।

కృతం నః సుశ్రియో నరేమా దాతమభిష్టయే ॥ 261

(18) ఆ వాం విశ్వాభిరూతిభిః ప్రియమేధా[4] అహూషత ।

రాజన్తావధ్వరాణామశ్వినా యామహూతిషు ॥ 262

---

1. స్థోఽఅధ్యమ్బరే, 2. వత్సోఽఅవీవృధత్, 3. ప్రాస్మాఽఊర్జం, 4. మేధాఽఅహూషత. (వా.ప్ర.)

(19) ఆ నో గన్తం మయోభువా ఽశ్వినా శంభువా యువమ్ ।
యో వాం విపన్యూ ధీతిభిర్గీర్భిర్వత్సో[1] అవీవృధత్ ॥ 263

(20) యాభిః కణ్వం మేధాతిథిం యాభిర్వశం దశవ్రజమ్ ।
యాభిర్గోశర్యమావతం తాభిర్నోఽవతం నరా ॥ 264

(21) యాభిర్నరా త్రసదస్యుమావతం కృత్వ్యే ధనే ।
తాభిః ష్వస్మాగ్ం[2] అశ్వినా ప్రావతం వాజసాతయే ॥ 265

(22) ప్ర వాం స్తోమాః సువృక్తయో గిరో వర్ధన్త్వశ్వినా ।
పురుత్రా వృత్రహన్తమా తా నో భూతం పురుస్పృహా ॥ 266

(23) త్రీణి పదాన్యశ్వినోరావిః సాన్తి గుహా పరః ।
కవీ[3] ఋతస్య పత్మభిరర్వాగ్జీవేభ్యస్పరి ॥ 267

---

1. వత్సోఽఅవీవృధత్, 2. స్మాగ్ంఽఅశ్వినా, 3. కవీఽఋతస్య. (ప్రా.ప్ర.)

## సూక్తము—8

ఋషి—కణ్వగోత్రోత్పన్నుఁడు సధ్వంసాఖ్యుఁడు*

దేవత —అశ్విద్వయము*

(1) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు దర్శనీయులు. మీ రథము హిరణ్మయము. మీరు సర్వవిధ రక్షలతో విచ్చేయుఁడు! సోమరస మధువును ద్రావుఁడు! ॥ 247

(2) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు భోక్తలు. హిరణ్మయశరీరము గలవారు. కవులు. గంభీరచిత్తులు. మీరు సూర్యుని వలె సముజ్జ్వల రథముపై నవశ్యము మా నికటమునకు రండు! ॥ 248

(3) గద్యము॥

ఓ యశ్విద్వయమా! దోషవర్జితము, స్తుతిప్రయుతము నగు నంతరిక్షమునుండి మనుష్య లోకాభిముఖముగ రండు! కణ్వుల యజ్ఞమం దభిషుత సోమమును ద్రావుఁడు! ॥ 249

(4) గద్యము॥

కణ్వపుత్రు లీ యజ్ఞమునందు మీ నిమిత్తము సోమమయమధువును సిద్ధము చేయుచున్నారు. కాఁబట్టి యో యశ్విద్వయమా! యధోలోకమునకుఁ బ్రీతిగలవారలై ద్యోలోకమునుండి యంతరిక్షమునుండి రండు!॥ 250

---

*15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "సుధన్వసుఁడు" ఋషిగాను, వ్రాతప్రతి (8వ-సంపుటము, 298 పుట)లో "అశ్వియము" దేవతగాను, 15b-సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "అశ్వలు" దేవతగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(5) గద్యము॥

ఓ యశ్విద్వయమా! సోమపానమునకై మా స్తుతులతోఁగూడిన యీ యజ్ఞమునకు విచ్చేయుఁడు! ఓ కవులారా! నేతృద్వయమా! మీరు స్తుతులు చేయు కర్మకరులకు వృద్ధి నొసంగుఁడు! ॥ 251

(6) గద్యము॥

ఓ నేతృద్వయమా! పూర్వకాలమున ఋషిగణ మెక్కడ రక్షకొఱకు మిమ్ముఁ బిలిచినారో! యశ్విద్వయమా! మీ రక్కడకు వచ్చినారు. మా యీ సుస్తుతి సమీపమునకు విచ్చేయుఁడు! ॥ 252

(7) గద్యము॥

స్వర్గవిదశ్విద్వయమా! మీరు ద్యోలోకమునుండి యంతరిక్షమునుండి మాకడకు రండు! వత్సునిగూర్చి ప్రకృష్టజ్ఞానముగల్గిన యశ్విద్వయమా! మీరు బుద్ధిగలవారై దయసేయుఁడు! పిలుపుల నాలించు నశ్విద్వయమా! మీరు స్తోత్రములతో విచ్చేయుఁడు! ॥ 253

(8) గద్యము॥

నాకంటె నన్యుఁడు స్తోమములచే నశ్విద్వయమును నుపాసింపసమర్థుఁడు నగు నా కణ్వపుత్రుఁడైన వత్సఋషి స్తుతులచే మిమ్ము వృద్ధిపరచుచున్నాఁడు ॥ 254

(9) గద్యము॥

ఓ యశ్విద్వయమా! స్తోతృరక్షార్థమై స్తుతులచే మిమ్ముఁ బిలుచుచున్నాము. పాపశూన్యులు శత్రువినాశకశ్రేష్ఠులు నగు నశ్విద్వయమా! మీరు మాకు సుఖప్రదులుగానుండుఁడు! ॥ 255

(10) గద్యము॥

అన్నమును ధనమును గలుఁగు నశ్విద్వయమా! యోషిత్తులు మీ రథము నెక్కిరి.
అశ్విద్వయమా! మీరు సమస్తము నొసఁగుటకు రండు!॥ 256

(11) గద్యము॥

అశ్విద్వయమా! మీ రథముపై నెక్కి మీ రెచ్చట నుండిరో! యా స్థానమునుండి రండు!
కవి పుత్రుఁ డగు కవి వత్సుఁడు మధువాక్యముల నుచ్చరించుచున్నాఁడు ॥ 257

(12) గద్యము॥

బహు మదయుతులు, బహు ధనయుతులు, ధనప్రద మగు జగత్తును ధరించువారు నగు
నశ్విద్వయమా! మా స్తుతిని ప్రశంసింపుఁడు! ॥ 258

(13) గద్యము॥

అశ్విద్వయమా! మాకు నలజ్జాకరమగు ధనము నొసంగుము! ప్రజోత్పాదన రూపకర్మ
గలవారినిగా నొనర్పుము! నిందకులకు మమ్ము వశులుగాఁ జేయకుము! ॥ 259

(14) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! దూరదేశమునందున్నను సమీప దేశమందున్నను, నే దేశమందున్నను,
సహస్రరూపములతోఁ గూడిన రథముపైఁ గూర్చొని విచ్చేయుఁడు! ॥ 260

(15) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! యే వత్సఋషి స్తుతులచే మిమ్ము వృద్ధిపరచెనో! వానికొరకు సహస్ర
రూపసహితము ఘృతరక్షణ స్వభావము నగు నన్నము నిమ్ము! ॥ 261

(16) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు వీరికి ఘృతధారతోఁ గూడిన బలకరాన్నము నొసంగుఁడు! దానాధిపతిద్వయమా! వీఁడు తన సుఖముకొఱకు స్తుతిఁ జేయుచున్నాఁడు. తనకు ధనమును గోరుచున్నాఁడు ॥ 262

(17) గద్యము॥

శత్రు భక్షకులు, బహుభోజులు, నేతలు, నగు నశ్విద్వయమా! యీ స్తుతిక్రమమున విచ్చేయుఁడు! మాకు సుశ్రీని గలిఁగింపుఁడు! పార్థివపదార్థముల నొసఁగుఁడు! ॥ 263

(18) గద్యము॥

ప్రియ మేఘనామక ఋషిగణము దేవతలఁ బిలుచునపుడు మీరు రక్షసును గూడి పిలుతురు. మా యజ్ఞమందు శోభ కలుఁగును ॥ 264

(19) గద్యము॥

సుఖప్రదులు, నారోగ్యప్రదులు, స్తుతియోగ్యులు, నగు నశ్విద్వయమా! యే వత్సుఁడు స్తుతులచే మిమ్ము వృద్ధిపరచెనో! వాని కభిముఖముగ మీరు రండు! ॥ 265

(20) గద్యము॥

ఏ యుపాయమునఁ గణ్వుని, మేధాతిథిని, దేనిచేత దశవ్రజుని, దేనిచే గోశర్యుని, రక్షించితిరో! నేతృద్వయమా! దానిచే మమ్ము రక్షింపుఁడు! ॥ 266

(21) గద్యము ॥

నేత లగు నో యశ్విద్వయమా! దేనివలనఁ బ్రాప్తవ్యధనమునకు నే త్రసదస్యుని రక్షించితిరో! దానివలన మా కన్నము కలుఁగుట కుత్తమరూపమున రక్షింపుము! ॥ 267

(22) గద్యము॥

బహునేతలు, శత్రునాశకశ్రేష్ఠులు, నగు నశ్విద్వయమా! దోషశూన్యస్తోమము, వాక్యములు
మిమ్ము వృద్ధిఁ బొందించుఁగాక! మీరు మాకు వివిధవిధముల నభీప్సితముల నిడుఁడు! 268

(23) గద్యము॥

అశ్విద్వయము పదత్రయగుహలో నున్న పిదప నావిర్భూత మగుచున్నది. కవు లగు
నశ్విద్వయము యజ్ఞమునకు హేతుభూత మగు నీ పదసాహాయ్యమున జీవ
లోకమునందు శ్రేష్ఠ మగుచున్నది ॥ 269

## సూక్తమ్—9

ఋషిః—శశకర్ణః కాణ్వః

దేవతా—అశ్వినౌ

ఛందః—అనుష్టుప్, 1,4,6,14-15-బృహతీ, 2,3,20,21-గాయత్రీ,

5-కకుప్,10-త్రిష్టుప్,11-విరాట్,12-జగతీ

(1) ఆ నూనమశ్వినా యువం వత్సస్య గన్తమవసే ।

ప్రాస్మై యచ్ఛతమవృకం పృథు చ్ఛర్దిర్యుయుతం యా[1] అరాతయః ॥ 268

(2) యదన్తరిక్షే యద్దివి యత్ పఞ్చ మానుషాఁ[2] అను ।

నృమ్ణం [3]తద్ధత్తమశ్వినా ॥ 269

---

1. యాఽఅరాతయః, 2. మానుషాఁఽఅను. 3. తద్ధతమశ్వినా. (వా.ప్ర.)

(3) యే వాం దంసాంస్యశ్వినా విప్రాసః పరిమామృశుః ।
ఏవేత్కాణ్వస్య బోధతమ్ ॥ 270

(4) అయం వాం ఘర్మో[1] అశ్వినా స్తోమేన పరి షిచ్యతే ।
అయం సోమో మధుమాన్వాజినీవసూ యేన వృత్రం చికేతథః ॥ 271

(5) యదప్సు యద్వనస్పతౌ యదోషధీషు పురుదంససా కృతమ్ ।
తేన మావిష్టమశ్వినా ॥ 272

(6) యన్నాసత్యా భురణ్యథో యద్వా దేవ భిషజ్యథః ।
అయం వాం వత్సో మతిభిర్న విన్ధతే హవిష్మన్తం హి గచ్ఛథః ॥ 273

(7) ఆ నూనమశ్వినోరృషిః స్తోమం చికేత వామయా ।
ఆ సోమం మధుమత్తమం ఘర్మం సిఞ్చాదథర్వణి ॥ 274

---

1. ఘర్మోఽఅశ్వినా. (వ్రా,ప్ర.)

(8) ఆ నూనం రఘువర్తనిం రథం తిష్ఠాథో[1] అశ్వినా ।
ఆ వాం స్తోమా[2] ఇమే మమ నభో న చుచ్యవీరత ॥ 275

(9) యదద్య వాం నాసత్యోక్థైరాచుచ్యువీమహి ।
యద్ వా వాణీభిరశ్వినేవేత్ కాణ్వస్య బోధతమ్ ॥ 276

(10) యద్వాం కక్షీవాగ్ం[3] ఉత యద్వ్యశ్వ ఋషిర్యద్వాం దీర్ఘతమా జుహావ ।
పృథీ యద్వాం వైన్యః సాదనేష్వేవేదతో[4] అశ్వినా చేతయేథామ్ ॥ 277

(11) యాతం ఛర్దిష్పా[5] ఉత నః పరస్పా భూతం జగత్పా[6] ఉత నస్తనూపా ।
వర్తిస్తోకాయ తనయాయ యాతమ్ ॥ 278

(12) యదిన్ద్రేణ సరథం యాథో[7] అశ్వినా యద్వా వాయునా భవథః సమోకసా ।
యదాదిత్యేభిరృభుభిః సజోషసా యద్వా విష్ణోర్విక్రమణేషు తిష్ఠథః ॥ 279

---

1. తిష్ఠాథో౽అశ్వినా, 2. స్తోమా౽ఇమే, 3. వాగ్ం౽ఉత యద్వ్యశ్వ౽ఋషి, 4. వేదతో౽అశ్వినా,
5. ఛర్దిష్పా౽ఉత, 6. జగత్పా౽ఉత, 7. యాథో౽అశ్వినా. (వ్రా.ప్ర.)

(13) యదద్యాశ్వినావహం హువేయ వాజసాతయే ।
యత్పృత్సు తుర్వణే సహస్తచ్ఛ్రేష్ఠమశ్వినోరవః ॥ 280

(14) ఆ నూనం యాతమశ్వినేమా హవ్యాని వాం హితా ।
ఇమే సోమాసో[1] అధి తుర్వశే యదావిమే కణ్వేషు వామథ ॥ 281

(15) యన్నాసత్యా పరాకే[2] అర్వాకే అస్తి భేషజమ్ ।
తేన నూనం విమదాయ ప్రచేతసా ఛర్దిర్వత్సాయ యచ్ఛతమ్ ॥ 282

(16) అభుత్స్యు ప్ర దేవ్యా సాకం వాచాహమశ్వినోః ।
వ్యావర్దేవ్యా మతిం వి రాతిం మర్త్యేభ్యః ॥ 283

(17) ప్ర బోధయోషో[3] అశ్వినా ప్ర దేవి సూనృతే మహి ।
ప్ర యజ్ఞహోతరానుషక్ప్ర మదాయ శ్రవో బృహత్ ॥ 284

---

1. సోమాసోఽఅధి. 2. పరాకేఽఅర్వాకేఽఅస్తి. 3. బోధయోషోఽఅశ్వినా. (ప్రా.ప్ర.)

(18) యదుషో యాసి భానునా సం సూర్యేణ రోచసే ।

ఆ హాయమశ్వినో రథో వర్తిర్యాతి నృపాయ్యమ్ ॥ 285

(19) యదాపీతాసో[1] అంశవో గావో న దుహ్ర[2] ఊధభిః ।

యద్వా వాణీరనూషత ప్ర దేవయన్తో[3] అశ్వినా ॥ 286

(20) ప్ర ద్యుమ్నాయ ప్ర శవసే ప్ర నృషాహ్యాయ శర్మణే ।

ప్ర దక్షాయ ప్రచేతసా ॥ 287

(21) యన్నూనం ధీభిరశ్వినా పితుర్యోనా నిషీదథః ।

యద్వా సుమ్నేభిరుక్థ్యా ॥ 288

---

1. పీతాసోఽఅంశవో, 2. దుహ్రఽఊధభిః, 3. దేవయన్తోఽఅశ్వినా. (వ్రా.ప్ర.)

## సూక్తము—9

ఋషి—కాణ్వుఁడైన శశకర్ణుఁడు*
దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు వత్సుని రక్షించుటకు నిశ్చయముగా వెడలితిరి. ఈ ఋషికి బాధారహితము, విస్తీర్ణము నగు గృహము నిమ్ము! వీని శత్రువులను దూరముగాఁ బారఁద్రోలుము! ॥ 270

(2) † ఉ॥ ఏ ధన మంతరిక్షమున నెక్కు-వగా వెలుఁగొందుచుండెనో!
యే ధన మెల్ల స్వర్గమున హెచ్చుగ నుండునో! యన్నివేళలం
దే ధన మైదు శ్రేణులను నెంతయుఁ బ్రీతి వసించుచుండునో !
యా ధన మెల్ల మా కిడరె! యశ్వులు! మీరలు సంతసంబుతోన్ ॥ 271

(3) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యే విప్రగణము మీ కర్మను బునఃపునః యనుష్ఠించునో! వారిని మీ రెరుంగుదురు. కాఁబట్టి కణ్వపుత్రునికర్మ మీకుఁ దెలిసియుండును ॥ 272

(4) గద్యము॥

అశ్విద్వయమా! మీ సంబంధ మగు ధర్మము స్తోత్రములచేఁ బరిషిక్త మగుచుండును. అన్నవిశిష్టము, ధనయుతము, నగు నశ్విద్వయమా! యే సోమముచే మీరు వృత్రుని దెలియఁగల్గితిరో! యట్టి మధుమంత మగు సోమ మిది ॥ 273

---

*వ్రాఁతప్రతిలో (8వ సంపుటము. 302 పుట) "శశకర్ణుఁడు" ఋషిగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "శాసకర్ణుఁడు" ఋషిగాను, శ్రీ నేమాని వ్రాసిరి.

† గద్యము॥ ఓ యశ్విద్వయమా: యే ధనమంతరిక్షమునందుఁ గలదో: యే ధనము స్వర్గమునందుఁ బ్రకాశించు చున్నదో: యేది పంచశ్రేణుల మధ్యను బ్రవేశించినదో: యా ధనమును దాన మిండు: (తొలి పాఠము.)

(5) గద్యము॥

బహుకర్మగల యశ్విద్వయమా! జలమందు, వనస్పతులందు, నోషధులయందు నేది
నిలిపితిరో! దానివలన మాకు రక్షల నొసంగుము! ॥ 274

(6) గద్యము॥

ఓ దేవనాసత్యద్వయమా! మీరు జగత్పోషణమును జేయుచున్నారు. అందఱి నారోగ్యము
గలవారిగా నొనర్చుచున్నారు. వత్సుఁడు మిమ్ముల స్తుతులచే విడువలేదు.
మీరు హవిష్మంతుల చెంగటకు వెడలుఁడు! ॥ 275

(7) గద్యము॥

ఋషి యుత్కృష్టబుద్ధిచే నశ్విద్వయముయొక్క స్తోత్రము నవశ్య మెరుంగును.
అతిశయమధుర సోమమును ఘర్మము, నఖర్వాగ్నియందు నిక్షేపించుచున్నావు ॥ 276

(8) గద్యము॥

అశ్విద్వయమా! మీరు శీఘ్రగామి యగు రథము నెక్కుఁడు! మా యీ స్తోత్రము
సూర్యునికి వలె నీ కభిముఖముగ వెళ్లుచున్నది ॥ 277

(9) గద్యము॥

అశ్విద్వయమా! యిపు డుక్థములచే నెటు మిమ్ముఁ దెచ్చితిరో! యే విధమున వాణిచేఁ
దెచ్చితిరో! యా ప్రకారము కణ్వపుత్రుని స్తోత్రమును దెలిసికొనుఁడు! ॥ 278

(10) గద్యము॥

ఓ యశ్విద్వయమా! కక్షీవంతుఁడగు ఋషి యేరూపమున మిమ్ములఁ బిలిచెనో! యే విధమున
వ్యశ్వుఁడు, దీర్ఘతమస్సు, వేనపుత్రుఁడగు పృథి యజ్ఞమందుఁ బిలిచిరో! యా రూపున నేను
నిన్ను స్తుతించుచున్నాను. మా స్తోత్రములను మదులఁ బెట్టుఁడు! ॥ 279

(11) గద్యము॥

అశ్విద్వయమా! మీరు గృహపాలకు లై రండు! మీ రతిశయపాలకులు. జగత్పాలకులు. శరీరపాలకులు కండు! పుత్రపౌత్రుల గృహములకు విచ్చేయుఁడు! ॥ 280

(12) గద్యము॥

అశ్విద్వయమా! మీ రింద్రునితో నొక రథముపై వెడలినయెడల వాయువుతో నేకస్థాన వాసులైన పక్షమున, నదితిపుత్రు లగు ఋతువులతో సమానప్రీతియుతు లైనచో విష్ణుపాదక్షేపమున నుండిన పక్షమున రండు! ॥ 281

(13) గద్యము॥

సంగ్రామార్థము నే నశ్విద్వయము నెపుడు పిలుతునో! యపుడు వారు వచ్చెదరుగాక! యుద్ధమున శత్రువుల హింసించుటకై యశ్విగణముయొక్క యే రక్ష గలదో! యదియే శ్రేష్ఠ మైనది ॥ 282

(14) గద్యము॥

ఓ యశ్విద్వయమా! యీ హవ్య మంతయు మీ నిమిత్తమే విహిత మైనది. మీరు రండు! ఈ సోమము తుర్వసునియందును యదువునందునుఁ గలదు. ఇది మీ నిమిత్తము సంస్కృత మైనది. కణ్వపుత్రుల కీయఁబడినది ॥ 283

(15) గద్యము॥

ఓ నాసత్యద్వయమా! దూరమందుఁగాని సమీపమునందుఁగాని భేషజ మేది గలదో! ప్రచేతోద్వయమా! దానితో విమదుని వలె వత్సునకు గృహము నొసంగుము! ॥ 284

(16) గద్యము॥

అశ్విసంబంధము, ద్యుతిమత్తును, నగు స్తోత్రముతో నేను ప్రబుద్ధుఁడ నైతిని. ద్యుతిమతి యగు నుషస్సా! మా స్తుతి ప్రయుక్త మగు తమస్సులను నివారింపుము! మర్త్యులకు ధనము నొసంగుము! ॥ 285

(17) గద్యము॥

ఓ యుషస్సా! దేవీ! సూనృతా! మహతీ! యశ్విద్వయమును మేలుకొల్పుము! మేలుకొల్పుము! దేవాహ్వానమును జేయుదానా! యనవరతమును బ్రబోధితులుగా నొనర్పుము! వీరి యానందమునకై బృహదన్నమును సిద్ధపరపుము! ॥ 286

(18) గద్యము॥

ఓ యుషస్సా! దీప్తితో నీ వెపుడు వెడలెదవో! యపుడు సూర్యునితో సమానశోభను బొందెదవు. ఆసమయమునందే యశ్విద్వయముయొక్క యీ రథము మనుష్యపాలనీయ మగు యజ్ఞగృహమునకు వచ్చును ॥ 287

(19) గద్యము॥

పీతవర్ణములుగల సోమలతను గోవుల యూధప్రదేశముల వలె నెపుడు దోహదమును జేయుదురో! యెపుడు దేవాభిలాషులు స్తుతుల నుచ్చరింతురో! యో యశ్విద్వయమా! యపుడు రక్షింపుఁడు! ॥ 288

(20) గద్యము॥

ప్రచేతోద్వయమా! మీరు ధనమునకై మమ్ము రక్షింపుఁడు! బలమునకై, మనుష్యోపభోగ యోగ్యుల సుఖముకొరకు, సమృద్ధికొరకు, మాకు రక్ష నొసంగుఁడు! ॥ 289

(21) గద్యము॥

ఓ యశ్విద్వయమా! మీరు పితృభూత యగు ద్యోలోకముయొక్క క్రోడమందుఁ గర్మ సహితులై ప్రవేశించినచో! లేక ప్రశంసనీయులై సుఖముగా నున్నచో! మా చెంతకు రండు! 290

## సూక్తమ్—10

ఋషిః—ప్రగాథః(ఘౌరః)కాణ్వః

దేవతా—అశ్వినౌ

ఛందః—1-బృహతీ, 2-మధ్యేజ్యోతిః, 3-అనుష్టుప్, శంకుమతీ-(పింగళమతేన), 4-ఆస్తారపంక్తిః, 5-బృహతీ, 6-సతోబృహతీ (5,6-ప్రగాథమతేన)

(1) యత్ స్థో దీర్ఘప్రసద్మని యద్వాదో రోచనే దివః ।
యద్వా సముద్రే[1] అధ్యాకృతే గృహే[2] ఉత ఆ యాతమశ్వినా ॥ 289

(2) యద్వా యజ్ఞం మనవే సంమిమిక్షథురేవేత్కాణ్వస్య బోధతమ్ ।
బృహస్పతిం విశ్వాన్దేవాగ్ం[3] అహం హువ ఇన్ద్రావిష్ణూ[4] అశ్వినావాశుహేషసా ॥ 290

(3) త్యా న్వశ్వినా హువే సుదంససా గృభే కృతా ।
యయోరస్తి ప్ర ణః సఖ్యం దేవేష్వధ్యాప్యమ్ ॥ 291

(4) యయోరధి ప్ర యజ్ఞా[5] అసూరే సన్తి సూరయః ।
తా యజ్ఞస్యాధ్వరస్య ప్రచేతసా స్వధాభిర్యా పిబతః సోమ్యం మధు ॥ 292

---

1. సముద్రేఽఅధ్యాకృతే, 2. గృహేఽఉతఽఆ. 3. దేవాగ్ంఽఅహం, 4. విష్ణూఽఅశ్వినా, 5. యజ్ఞాఽఅసూరే. (ప్రా.ప్ర.)

(5) యదద్యాశ్వినావపాగ్ యత్ప్రాక్స్థో వాజినీవసూ ।

యద్ద్రుహ్యవ్యనవి తుర్వశే యదౌ హువే వామథ మా గతమ్ ॥ 293

(6) యదన్తరిక్షే పతథః పురుభుజా యద్వేమే రోదసీ[1] అను ।

యద్వా స్వధాభిరధితిష్ఠథో రథమత[2] ఆ యాతమశ్వినా ॥ 294

## సూక్తము—10

ఋషి—కణ్వపుత్రుఁడు ప్రగాథుఁడు

దేవత—అశ్విద్వయము

(1) గద్యము॥

ఓ యశ్విద్వియమా! యే లోకమందుఁ బ్రశస్త యజ్ఞ గృహము గలదో! యచ్చట మీ రుండినను, ద్యోలోకముయొక్క దీప్తిమంత మగు ప్రదేశమం దుండినను, నంతరిక్షమందు నిర్మించిన గృహమం దుండినను, నీ యన్ని స్థానములనుండియు మా కడకు రండు! ॥ 291

(2) గద్యము॥

అశ్వియుగ్మమా! మీ రెటులు మనువునకై యజ్ఞమును దడిపితిరో! యటులు కణ్వ యజ్ఞమును దెలిసికొనుఁడు! బృహస్పతిని, సమస్త దేవతలను, నింద్రుని, విష్ణువును, ద్రుతగామి యగు నశ్విద్వయమును నేను బిలిచెదను ।. 292

---

1, రోదసీఽఅను. 2, రథమతఽఆ. (ప్రా.ప్ర.)

(3) గద్యము॥

అశ్విద్వయము సుకర్మగలదానిని గ్రహించుటకుఁ బ్రాదుర్భవించును. నేను వారిని బిలిచెదను. వారితో సఖ్యము దేవతలలో నుత్కృష్ట మైనది. సహజ లభ్యము ॥ 293

(4) గద్యము॥

యజ్ఞము లన్నియు నెవరికిఁ బ్రభువులో! స్తుతి శూన్యుల మధ్యమమున నెవ్వరి స్తోతలు నిలుతురో! వారు హింసారహిత యజ్ఞమునకుఁ బ్రచేతసులు. వారు స్వధాసహిత సోమమయ మధువును బానముఁ జేయుదురు ॥ 294

(5) గద్యము॥

అన్న ధనములు గల యశ్విద్వయమా! యిపుడు మీరు పశ్చిమ దిక్కునందుఁగాని పూర్వదిక్కునందుఁగాని వసతిని జేయుఁడు! మీరు తృభువు, ననువు, తుర్వసుఁడు, యదువు, నను వారలకు సన్నిహితు లయినను మిమ్ములనే పిలుచుచున్నాము. మా సమీపమునకు రండు! ॥ 295

(6) గద్యము॥

బహుభోజి వగు నశ్విద్వయమా! యంతరిక్షాభిముఖముగా వెడలినను, ద్యావాభూముల కభిముఖముగాఁ బోయినను, దేజోబలములచే రథమందున్నను, సకల స్థానముల నుండియు రండు! ॥ 296

# సూక్తమ్—11

ఋషిః—వత్సః కాణ్వః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ, 1-ప్రతిష్ఠా, 2-వర్ధమానా, 10-త్రిష్టుప్

(1) త్వమగ్నే వ్రతపా[1] అసి దేవ ఆ మర్త్యేష్వా ।
త్వం యజ్ఞేష్వీడ్యః ॥ 295

(2) త్వమసి ప్రశస్యో విదథేషు సహన్త్య ।
అగ్నే రథీరధ్వరాణామ్ ॥ 296

(3) స త్వమస్మదప ద్విషో యుయోధి జాతవేదః ।
[2]అదేవీరగ్నే అరాతీః ॥ 297

(4) అన్తి చిత్సన్తమహ యజ్ఞం మర్తస్య రిపోః ।
నోప వేషి జాతవేదః ॥ 298

---

1. వ్రతపాఽఅసి దేవఽఆ. 2. అదేవిరగ్నేఽఅరాతీః (వ్రా.ప్ర.)

(5) మర్తా[1] అమర్త్యస్య తే భూరి నామ మనామహే ।

విప్రాసో జాతవేదసః ॥ 299

(6) విప్రం విప్రాసోఽవసే దేవం మర్తాస[2] ఊతయే ।

అగ్నిం గీర్భిర్హవామహే ॥ 300

(7) ఆ తే వత్సో మనో యమత్పరమాచ్చిత్సధస్థాత్ ।

అగ్నే త్వాంకామయా గిరా ॥ 301

(8) పురుత్రా హి సదృఙ్ఙసి విశో విశ్వా[3] అను ప్రభుః ।

సమత్సు త్వా హవామహే ॥ 302

(9) సమత్స్వగ్నిమవసే వాజయన్తో హవామహే ।

వాజేషు చిత్రరాధసమ్ ॥ 303

---

1. మర్తాఽఅమర్త్యస్య, 2. మర్తాసఽఊఽయే, 3. విశ్వాఽఅను. (ప్రా.ప్ర.)

(10) ప్రతో్న హి కమీడ్యో<sup></sup>[1] అధ్వరేషు సనాచ్చ హోతా నవ్యశ్చ సత్సి ।
స్వాం చాగ్నే తన్వం పిప్రయస్వాఽస్మభ్యం చ సౌభగమా యజస్వ ॥ 304

ఇతి
పంచమోఽష్టకే అష్టమోఽధ్యాయ
స్సమాప్తః
పంచమోఽష్టక స్సమాప్తః

## సూక్తము—11

ఋషి—కాణ్వుఁడైన వత్సుఁడు
దేవత—అగ్ని

(1) †గీ॥ అగ్నిదేవ! నీవ యమల కర్మల నెల్లఁ
గాచువాఁడ వౌట నేచి సర్వ
యజ్ఞ కర్మలందు నఖిలాధ్వరములకు
నేత వౌచు నుందు! నేర్పు మెఱయ ॥ 297

(2) గద్యము॥
శత్రుపరాజయకారీ! నీవు యజ్ఞమందుఁ బ్రశంసా యోగ్యుఁడవు. అధ్వరములకు నేతవు! ॥ 298

1, కమీడ్యోఽఅధ్వరేషు. (ప్రా.ప్ర.)

(1) †గద్యము॥ ఓ యగ్నిదేవా! నీవు మనుష్యులలోఁ గర్మల రక్షించువాఁడవు. కాఁబట్టి యజ్ఞమందు స్తుతియోగ్యుఁడవు. ॥ (తొలిపాఠము)

(3) †గీ॥ జాతవేదుఁడ! మమ్ముల శత్రుచయము
చెంత నుంచక వేరుగఁ జేర్పుమయ్య!
దేవవిద్వేషులైనట్టి తీవ్ర శత్రు
గణముఁ ద్రోలుము! నీ వగ్ని! గణన కెక్క ॥ 299

(4) గద్యము॥

ఓ జాతవేదుఁడా! సమీపమం దున్నను, శత్రువుల యజ్ఞముల నే విధముననైనను గోరకుము ॥ 300

(5) గద్యము॥

మేము విప్రులము. నీవు మరణరహితుఁడవు. జాతవేదుఁడవు. మేము నీ విస్తృత నామ మెరుంగుదుము ॥ 301

(6) గద్యము॥

మేము విప్రులము. మర్త్యులము. మేము విప్రుఁడు దేవుఁడు నగు నగ్నిని హవ్యముచేఁ దృప్తి నొందించుటకు, మమ్మ రక్షించుటకు, స్తుతులచే మిమ్ముఁ బిలిచెదము ॥ 302

(7) గద్యము॥

ఓ యగ్నీ! వత్సఋషి యుత్కృష్ట స్థానమునుండి మీ మనస్సు నాకర్షించును. వాని స్తుతి మి మ్మభిలషించుచున్నది ॥ 303

(8) గద్యము॥

మీరు బహు దేశములను సమాన రూపముతోఁ జూడుఁడు! కాఁబట్టి సమస్త ప్రజలకు మీ రీశ్వరులరు. యుద్ధమందు మేము మిమ్ముఁ బిలిచెదము ॥ 304

---

†(3) గద్యము॥ ఓ జాతవేదుఁడా! నీవు మమ్ముల శత్రువులనుండి వేరుపరచుము! ఓ యగ్నీ! దేవద్వేషులగు నరాతులను బారఁద్రోలుము! ॥ (తొలి పాఠము)

(9) గద్యము॥

మే మన్నమును గోరి యుద్ధమందు రక్షించుటకై యగ్నిని బిలిచెదము. వాఁడు సంగ్రామమందు విచిత్ర ధనము గలవాఁడు ॥ 305

(10) గద్యము॥

ఓ యగ్నీ! నీవు యజ్ఞమందుఁ బూజనీయుఁడవు! పురాతనుఁడవు! సనాతన హోతవు! స్తుతి యోగ్యుఁడవు! నీవు యజ్ఞమందుఁ గూర్చుండుము! నీవు నీ శరీరమును వ్యాపింపఁజేయుము! మాకు సౌభాగ్యము నొసంగుము! ॥ 306

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బంచమాష్టకమున నష్టమాధ్యాయము
**సంపూర్ణము**
పంచమాష్టకము సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### షష్ఠోఽష్టకః—ప్రథమోఽధ్యాయః

### సూక్తమ్—12

ఋషిః—పర్వతః కాణ్వః

దేవతా—ఇన్ద్రః

ఛందః—ఉష్ణిక్; 13-శంకుమతీ (పింగళమతేన)

(1) య[1] ఇన్ద్ర సోమపాతమో మదః శవిష్ఠ చేతతి ।
యేనా హంసి న్యఽత్రిణం తమీమహే ॥ 305

(2) యేనా దశగ్వమధ్రిగుం వేపయన్తం స్వర్ణరమ్ ।
యేనా సముద్రమావిథా తమీమహే ॥ 306

---

1. యఽఇన్ద్ర, (ప్రా.ప్ర.)

(3) యేన సిన్ధుం మహీరపో రథాగ్ం[1] ఇవ ప్రచోదయః ।
పన్థామృతస్య యాతవే తమీమహే ॥ 307

(4) ఇమం స్తోమమభిష్టయే ఘృతం న పూతమద్రివః ।
యేనా ను సద్య[2] ఓజసా వవక్షిథ ॥ 308

(5) ఇమం జుషస్వ గిర్వణః సముద్ర ఇవ పిన్వతే ।
ఇన్ద్ర విశ్వాభిరూతిభిర్వవక్షిథ ॥ 309

(6) యో నో దేవః పరావతః సఖిత్వనాయ మామహే ।
దివో న వృష్టిం ప్రథయన్వవక్షిథ ॥ 310

(7) వవక్షురస్య కేతవ[3] ఉత వజ్రో గభస్త్యోః ।
యత్సూర్యో న రోదసీ[4] అవర్ధయత్ ॥ 311

(8) యది ప్రవృద్ధ సత్పతే సహస్రం మహిషాగ్ం[5] అఘః ।
ఆదిత్త[6] ఇన్ద్రియం మహి ప్ర వావృధే ॥ 312

1. రథాగ్ంఽఇవ, 2. సద్యఽఓజసా, 3. కేతవఽఉత, 4. రోదసీఽఅవర్ధయత్, 5. మహిషాగ్ంఽఅఘః,
6. ఆదిత్తఽఇన్ద్రియం. (ప్రా ప్ర.)

(9) ఇన్ద్రః సూర్యస్య రశ్మిభిర్న్యర్శసానమోషతి ।
అగ్నిర్వనేవ సాసహిః ప్ర వావృధే ॥ 313

(10) ఇయం త[1] ఋత్వియావతీ ధీతిరేతి నవీయసి ।
సపర్యన్తీ పురుప్రియా మిమీత[2] ఇత్ ॥ 314

(11) గర్భో యజ్ఞస్య దేవయుః క్రతుం పునీత[3] ఆనుషక్ ।
స్తోమైరిన్ద్రస్య వావృధే మిమీత[2] ఇత్ ॥ 315

(12) సనిర్మిత్రస్య పప్రథ[4] ఇన్ద్రః సోమస్య పీతయే ।
ప్రాచీ వాశీవ సున్వతే మిమీత[2] ఇత్ ॥ 316

(13) యం విప్రా[5] ఉక్థవాహసో ఽభిప్రమన్దురాయవః ।
ఘృతం న పిప్య[6] ఆసన్యృతస్య యత్ ॥ 317

(14) ఉత స్వరాజే[7] అదితిః స్తోమమిన్ద్రాయ జీజనత్ ।
పురుప్రశస్తమూతయ[8] ఋతస్య యత్ 318

---

1. తఽఋత్వియా, 2. మిమీతఽఇత్, 3. పునీతఽఆనుషక్, 4. పప్రథఽఇన్ద్రః, 5. విప్రాఽఉక్థ,
6. పిప్యఽఆసన్యృతస్య, 7. స్వరాజేఽఅదితిః 8. మూతయఽఋతస్య. (ప్రా.ప్ర.)

(15) అభి వహ్నాయ[1] ఊతయే ఽనూషత ప్రశస్తయే ।

న దేవ వివ్రతా హరీ[2] ఋతస్య యత్ ॥ 319

(16) యత్సోమమిన్ద్ర విష్ణవి యద్వా ఘ త్రిత[3] ఆప్త్యే ।

యద్వా మరుత్సు మన్దసే సమిన్దుభిః ॥ 320

(17) యద్వా శక్ర పరావతి సముద్రే[4] అధి మన్దసే ।

అస్మాకమిత్సుతే రణా సమిన్దుభిః ॥ 321

(18) యద్వాసి సున్వతో వృధో యజమానస్య సత్పతే ।

ఉక్థే వా యస్య రణ్యసి సమిన్దుభిః ॥ 322

(19) దేవందేవం వోఽవస[5] ఇన్ద్రమిన్ద్రం గృణీషణి ।

అధా యజ్ఞాయ తుర్వణే వ్యానశుః ॥ 323

(20) యజ్ఞేభిర్యజ్ఞవాహసం సోమేభిః సోమపాతమమ్ ।

హోత్రాభిరిన్ద్రం వావృధుర్వ్యానశుః ॥ 324

1. వహ్నాయఽఊతయే, 2. హరీఽఋతస్య, 3. త్రితఽఆప్త్యే, 4, సముద్రేఽఅధి, 5. వసఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(21) మహీరస్య ప్రణీతయః పూర్వీరుత ప్రశస్తయః ।

విశ్వా వసూని దాశుషే వ్యానశుః ॥ 325

(22) ఇన్ద్రం వృత్రాయ హన్తవే దేవాసో దధిరే పురః ।

ఇన్ద్రం వాణీరనూషతా సమోజసే ॥ 326

(23) మహాన్తం మహినా వయం స్తోమేభిర్హవనశ్రుతమ్ ।

అర్కైరభి ప్ర ణోనుమః సమోజసే ॥ 327

(24) న యం వివిక్తో రోదసీ నాన్తరిక్షాణి వజ్రిణమ్ ।

అమాదిదస్య తిత్విషే సమోజసః ॥ 328

(25) యదిన్ద్ర పృతనాజ్యే దేవాస్త్వా దధిరే పురః ।

ఆదిత్తే హర్యతా హరీ వవక్షతుః ॥ 329

(26) యదా వృత్రం నదీవృతం శవసా వజ్రిన్నవధీః ।

ఆదిత్తే హర్యతా హరీ వవక్షతుః ॥ 330

(27) యదా తే విష్ణురోజసా త్రీణి పదా [1]విచక్రమే ।
ఆదిత్తే హర్యతా హరీ వవక్షతుః ॥ 331

(28) యదా తే హర్యతా హరీ వావృధాతే దివేదివే ।
ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే ॥ 332

(29) యదా తే మారుతీర్విశస్తుభ్యమిన్ద్ర నియేమిరే ।
ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే ॥ 333

(30) యదా సూర్యమముం దివి శుక్రం జ్యోతిరధారయః ।
ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే ॥ 334

(31) ఇమాం త[2] ఇన్ద్ర సుష్టుతిం విప్ర[3] ఇయర్తి ధీతిభిః ।
జామిం పదేవ పిప్రతీం ప్రాధ్వరే ॥ 335

(32) యదస్య ధామని ప్రియే సమీచీనాసో[4] అస్వరన్ ।
నాభా యజ్ఞస్య దోహనా ప్రాధ్వరే ॥ 336

1. చక్రతే, 2. ఇమాం తఽఇన్ద్ర, 3. విప్రఽఇయర్తి, 4. నాసోఽఅస్వరన్. (వ్రా.ప్ర.)

(33) సువీర్యం స్వశ్వ్యం సుగవ్యమిన్ద్ర దద్ధి నః ।
హోతేవ పూర్వచిత్తయే ప్రాధ్వరే ॥ 337



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—ప్రథమాధ్యాయము

### సూక్తము—12

ఋషి—కణ్వగోత్రీయుఁడు పర్వతుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ అతిశయ సోమపాయివయి యత్యధికంబగు శక్తిచేత సం
తతమతి హర్ష మొందెడు విధంబున వెల్గుచునుందు వింద్ర! యే
వితమున మత్తతం గలిఁగి విశ్రుత రాక్షస హర్త వైతి వా
వితమున మత్తతన్ విధిగ వెల్గిన నీవు, నుతింపమే! నినున్ ॥ 307

(2,3) సీ॥ అంగిరో గోత్రజుఁ డయిన [1]యద్రిండుని బరమ సంతుష్టిఁ గాపాడినట్టు
లతి దయావశుఁడవై యత్యంత దీప్తితో నబ్ధిని బ్రోవంగ నరుగునట్టు
లఖిలంబునకు నేతయౌ తమోహరు సూర్యు బలమున రక్షింపఁ గలుఁగునట్టు
లరదంబు చందాన నంబుపూరంబుల సింధుముఖంబుగాఁ జేర్చునట్లు
గీ॥ నీవు మదమును బొందుచు నిరతిశయము, మోదవారాశి మధ్యను మునిఁగి యున్న
యజ్ఞమార్గము మే మెల్ల ననవరతము, నిన్ను యాచించెదము కాదె! నిర్మలేంద్ర! ॥ 308

1. "అద్రిగుని" అని వాడుటకు మారు ప్రత్యేకముగా శ్రీనేమానివారి విశిష్ట ప్రయోగము చేయుట జరిగినది.

(4) గీ॥ స్తోమమున సంస్తుతుండవై భీమవజ్ర
ధారకా! తత్క్షణంబునఁ దగిన శక్తిఁ
బూని మా కోర్కెలం దీర్చి పూత ఘృతము
వలెఁ బవిత్ర మహా స్తోమముల గ్రహింపు! ॥ 309

(5) గీ॥ స్తుత్యుఁడా! యింద్రదేవ! యీ స్తోమ మబ్ధిఁ
బోలి వర్ధితమౌ, నిది పుచ్చుకొనవె!
యఖిల రక్షణ మూలాన నభిలషితము
దాన మొసఁగుచు నుండుము! ధర్మనిష్ఠ ॥ 310

(6) గీ॥ దూరదేశమునుండి యో వీర! యస్మ
దీయ సఖ్యంబునకు ధన మిచ్చి తీవు
గగనముననుండి వర్షము కలుఁగునట్లు
ధన మొసంగుచుఁ గాంక్షిత దాన మిడుము! 311

(7) గీ॥ దివిని భూమిని నింద్రుఁడు తేజరిల్లు
నట్లొనర్చెడు వేళల నతని హస్త
సంస్థితం బగు వజ్రము తనివిదీర
నభిలషితముల నెల్లఁ దా నందఁజేయు ॥ 312

(8) గీ॥ రహి సహస్రసంఖ్య మహిషంబులం గొట్టు
నపుడు నీదు వీర్య మంత మిగుల
వృద్ధిఁ బొంద లేదె! వీర్య ప్రవృద్ధుఁడా!
సాధునాయకుండ! శక్ర! నీవు ॥ 313

(9) క॥ అనలుం డే రూపంబున
వనముల దహియించుచుండు వాసవుఁడు లసత్
ఘన సూర్యరశ్మి శాత్రవ
జనముల దహియించి వృద్ధిఁ జను నక్షతుఁడై ॥ 314

(10) గీ॥ యజ్ఞకర్మ విశిష్ట మత్యంత నూత
నంబు బహువిధ సంప్రీతిదంబు మరియు
నల వసంతాది కాలములందుఁ జేయఁ
బడెడు సంస్తుతి వేవేగ నడచుచుండు ॥ 315

(11) గద్యము॥

ఇంద్రుఁడు దేవాభిలాషి యగు యజ్ఞమును జేయువాఁడు. అవిచ్ఛిన్నముగ సోమమును
బవిత్రముగఁ జేయుచున్నాఁడు. స్తోమము స్తోత్రములచే నింద్రు నభివృద్ధిఁ
బరచుచున్నది. స్తుతులచే నింద్రుని యియత్త ప్రకటింపఁబడుచున్నది ॥ 316

(12) గద్యము॥

"స్తోతలకు ధన మిచ్చు నింద్రుఁడు గుణకీర్తనము చేయువాఁడు. అతఁడు సోమాభిషవము
నొనర్చు వాని వాక్యము వలె ధనదానార్థము ప్రవృద్ధశరీరుఁ డగుచున్నాఁడు". అను
నీ వాక్యము లింద్రుని యియత్తను వెల్లడిచేయుచున్నవి ॥ 317

(13) గీ॥ స్తోత్రవాహక మనుజులు తుష్టి నింద్రు
హృష్టునిగఁ జేసియుండిన యెల్ల వారి
ముఖములకు సద్ఘృతంబును బోలి ప్రీతి
హవ్య మందించుచుండుఁ దా నమరవరుఁడు ॥ 318

(14) గీ॥ అదితి, శోభమానుఁడైన మహేంద్రున
కఖిల విధుల రక్ష నందఁజేయ
యజ్ఞకరులచేత నతిసుశంసితనుతి
నుచ్చరింపఁబడుచు నుండుఁగాదె! ॥ 319

(15) గీ॥ కడుఁ బ్రశంసఁగోరి కడు రక్షణముఁ గోరి
వినుతిఁ జేయుచుంద్రు వేల్పు! ఘనులు
కర్మవంత మౌచుఁ గ్రాలు హరిద్వయ
మింద్రు మోయుచుండు నిష్టి కౌఱకు ॥ 320

(16) గీ॥ విష్ణు వింకఁ దిత్రితుఁడు వెలయు మరుత్తులు
వచ్చియున్న పిదప వాసవుండ!
దేని ద్రావి నీవు పూనితిహా! మద
మట్టి సోమ మాని యరుగఁదెమ్ము! ॥ 321

(17) గీ॥ దూరదేశమునం దీవు వారి రాశి
వలెఁ బ్రకాశించు సోమమువలనఁ దుష్టి
నందితివిగాదె! యా సోమ మమరి యున్న
దానిచేఁ బ్రీతుఁడవు కమ్ము! తఱచు శక్ర! ॥ 322

(18) గీ॥ సోమమున్ సిద్ధముగఁ జేయ సోమయాజి
గణము వృద్ధిని బరచెడు ఘనుఁడ వీవు
సత్పతీ! యుక్థములవల్ల సంతసంబు
నొందినట్టులు సోమాన నొందు! ప్రీతి ॥ 323

(19) గీ॥ మిమ్ము రక్షింప నే యింద్రు మీరు నుతుల
వేఁడుచుందురో! యా యింద్రుఁ బెద్ద యస్మ
దీయ నుతు లెల్ల శీఘ్రమే యిష్టికొఱకు
సేవఁ జేయుటకై కూడఁ జేరుఁగాక! ॥ 324

(20) గీ॥ స్తుతితతులచేత హవ్య సంతతులచేత
సోమగమ్యుని వెండియు సోమపాన
కారియును నైన యింద్రుని జేరి నుతుల
వర్ధితునిగ నొనర్తును బండితాళి ॥ 325

(21) గీ॥ ఇంద్రదేవుని ధనదాన మెల్ల నధిక
మతని కీర్తియు విస్తార మగునుగాదె!
హవ్య మొసఁగెడు పురుషున కతఁడు సర్వ
ధనము వ్యాపింపఁజేయును దత్పరమతి ॥ 326

(22) గీ॥ వృత్ర హననార్థమై దేవ వితతి యింద్రుఁ
దాల్చుచుండెను దనతన తనవిదీర
సంస్తుతులు[1] బలము గోరుచు శక్రదేవు
వినుతిఁ జేయుచు నున్నవి విస్తృతముగ ॥ 327

(23) గీ॥ పిలుపు నెల్లను వినువాఁడు పెద్దవాఁడు
మహిమచేత మహాత్ముఁడౌ మహాతు నింద్రు
నర్చనామంత్రముల బల మందఁగోరి
మాటిమాటికి వినుతింప మరువఁగలమె! ॥ 328

(24) గీ॥ అంతరిక్షము, దివియును, నవనితలము
నింద్రు వేరుగఁ జేయంగ నెరుఁగలేవు
హాని బలమున బలమును బడయఁగోరి
జగము సందీప్త మగుఁగాదె! చాతురిమను ॥ 329

(25) క॥ ఎప్పుడు దేవ గణంబులు
తప్పక జన్మముల నిన్ను ధరియించునొ! తా
నప్పుడె హరిద్వయము నినుఁ
జప్పున ధరియించుఁగాదె! శక్ర మహాత్మా! ॥ 330

(26) క॥ జలము హరించెడు వృత్రుఁడు
బలమున హననంబు చేయఁబడినప్పుడు ని
న్నల సుందర హరియుగ్మము
ఫలమున ధరియింపలేదె! శక్రుఁడ! తలఁపన్ ॥ 331

(27) క॥ నీవలన విష్ణు వెప్పుడు
వావిరిఁ బాదత్రయంబువలనఁ దిరిగెనో!
తావక హరిద్వయము నిను
నో వరద! వహింపలేదె! యోపిక నపుడే! ॥ 332

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(28) క॥ హరి! నీదు హయల యుగ్మము
నిరతం బభివృద్ధిగాంచి నెగడెడు నపుడే
స్థిరముగ నీ భువనంబులు
తరచు నియమితంబు లగును దత్పరమందే ॥ 333

(29) క॥ హరి! నీవు మరుత్తులఁ గడు
వెరవున నియమించియుండ విశ్వమునందున్
స్థిరముగ నీ భువనంబులు
తరచు నియమితంబు లగును దత్‌క్షణమందే ॥ 334

(30) † క॥ ఖ్యాత మయి నిర్మలం బగు
జ్యోతిస్సున సూర్యు నునుప ద్యో లోకమునన్
ప్రీతి మెయిన్ భువనంబులు
చాతురిమను నియమితములు చయ్యనఁ గావే! ॥ 335

(31) ఉ॥ ఎట్టులో! లోకమందుఁ గల నెల్లరు, బంధువు *నుత్తమోత్తమం
బట్టి తలాన నుంచెదరో! యత్యధికంబగు ప్రీతితోడఁ దా
నట్టులె మోదకారక మహాస్తుతి నిష్ఠులయందుఁ బండితుం
డెట్టులో! భక్తి ని న్నునిచి యింద్ర! భవత్ పరిచర్యఁ జేసెడున్ ॥ 336

(32) గద్యము ॥

స్తోత్రము సంతసించినచో యజ్ఞమం దీ యింద్రుని సమవేత స్తోత లుత్కృష్ట రూపమున నుతించెదరు. అపుడు నాభి స్వరూప మగు యజ్ఞముయొక్క యభిషవ స్థానమున ధనము నునుచుము! ॥ 337

---

† "ఓ పరమేశ్వర! ద్యోతనాత్మకుఁడ వగు నీయం దనంత మగు సామర్థ్యము అనగాఁ ప్రకాశమయ మగు జ్యోతిస్సున్నది. దానిచే నీవు సూర్యాదిలోకములను ధరించితివి. ఏమ్మట సమస్త భువనములు సూర్యాది లోకములు కర్షణ నియమమున స్థిరము లగుచున్నవి, ఎట్లు సూర్యాకర్షణ నియమమున స్థిరము లగుచున్నవో! యటులే పరమేశ్వరుని యాకర్షణమున సూర్యాదులు సర్వలోకములు నియమము చేయుచున్నవి" అని దయానందసరస్వతి యభిప్రాయముగా వ్రాసినా రీ ఋక్కునకు. (నే.వేం.న.శా.) * నుత్తమోత్తమై, సట్టి. (వ్రా.ప్ర.పా.)

(33) గద్యము॥

ఓ యింద్రుఁడా! యుత్తమ వీర్యయుతము, నుత్తమ గోయుతము, నుత్తమాశ్వయుతము నగు ధనమును నీవు మా కిమ్ము! నేను మొదట జ్ఞాన లాభమునకై హోత వలె యజ్ఞమందు నిన్ను స్తుతించెదను ॥ 337

## అనువాకః—3, సూక్తమ్—13

ఋషిః—నారదః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—ఉష్ణిక్

(1) ఇన్ద్రః సుతేషు సోమేషు క్రతుం పునీత[1] ఉక్థ్యమ్ ।
విదే వృధస్య దక్షసో మహాన్హి షః ॥ 338

(2) స ప్రథమే వ్యోమని దేవానాం సదనే వృధః ।
సుపారః [2]సుశ్రవస్తమః సమప్సుజిత్ ॥ 339

(3) తమహ్వే వాజసాతయ[3] ఇన్ద్రం భరాయ శుష్మిణమ్ ।
భవా నః సుమ్నే[4] అన్తమః సఖా వృధే ॥ 340

(4) ఇయం త[5] ఇన్ద్ర గిర్వణో రాతిః క్షరతి సున్వతః ।
మన్దానో[6] అస్య బర్హిషో వి రాజసి ॥ 341

---

1. పునీతఽఉక్థ్యమ్, 2. సుశ్రవస్తమః, 3. వాజసాతయఽఇన్ద్రం, 4. సుమ్నేఽఅన్తమః,
5. ఇయం తఽఇన్ద్ర, 6. మన్దానోఽఅస్య. (బ్రా.ప్ర.)

(5) నూనం ఽదిన్ద్ర దద్ధి నో యత్త్వా సున్వన్త[1] ఈమహే ।
రయిం నశ్చిత్రమా భరా స్వర్విదమ్ ॥ 342

(6) స్తోతా యత్తే విచర్షణిరతిప్రశర్ధయద్గిరః ।
వయా[2] ఇవాను రోహతే జుషన్త యత్ ॥ 343

(7) ప్రత్నవజ్జనయా గిరః శృణుధీ జరితుర్హవమ్ ।
మదేమదే వవక్షిథా సుకృత్వనే ॥ 344

(8) క్రీళన్త్యస్య సూనృతా[3] ఆపో న ప్రవతా యతీః ।
అయా ధియా య[4] ఉచ్యతే పతిర్దివః ॥ 345

(9) ఉతో పతిర్య[5] ఉచ్యతే కృష్టీనామేక[6] ఇద్వశీ ।
నమోవృధైరవస్యుభిః సుతే రణ ॥ 346

(10) స్తుహి శ్రుతం విపశ్చితం హరీ యస్య ప్రసక్షిణా ।
గన్తారా దాశుషో[7] గృహం నమస్వినః ॥ 347

---

1. సున్వన్త౽ఈమహే, 2. వయా౽ఇవాను, 3. సూనృతా౽ఆపో, 4. ధియా య౽ఉచ్యతే,
5. పతిర్య౽ఉచ్యతే, 6. నామేక౽ఇద్వశీ, 7. దాశుషే. (వ్రా.ప్ర.)

(11) తూతుజానో మహేమతే ఽశ్వేభిః ప్రుషితప్సుభిః ।
ఆ యాహి యజ్ఞమాశుభిః శమిద్ధి తే ॥ 348

(12) ఇన్ద్ర శవిష్ఠ సత్పతే రయిం గృణత్సు ధారయ ।
శ్రవః సూరిభ్యో[1] అమృతం వసుత్వనమ్ ॥ 349

(13) హవే త్వా సూర[2] ఉదితే హవే మధ్యందినే దివః ।
జుషాణ[3] ఇన్ద్ర సప్తిభిర్న[4] ఆ గహి ॥ 350

(14) ఆ తూ గహి ప్ర తు ద్రవ మత్స్వా సుతస్య గోమతః ।
తన్తుం తనుష్వ పూర్వ్యం యథా విదే ॥ 351

(15) యచ్ఛక్రాసి పరావతి యదర్వావతి వృత్రహన్ ।
యద్వా సముద్రే[5] అన్ధసో ఽవితేదసి ॥ 352

(16) ఇన్ద్రం వర్ధన్తు నో గిర[6] ఇన్ద్రం సుతాస ఇన్దవః ।
ఇన్ద్రే హవిష్మతీర్విశో[7] అరాణిషుః ॥ 353

---

1. సూరిభ్యో ఽఅమృతం, 2. సూర ఽఉదితే, 3. జుషాణ ఽఇన్ద్ర, 4. భిర్న ఽఆ గహి,

5. సముద్రే ఽఅన్ధసో, 6. గిర ఽఇన్ద్రం సుతాస ఽఇన్ద్రవః, 7. విశో ఽఅరాణిషుః. (బ్రా. ప్ర.)

(17) తమిద్విప్రా[1] అవస్యవః ప్రవత్వతీభిరూతిభిః ।
[2]ఇన్ద్రం క్షోణీరవర్ధయన్వయా[3] ఇవ ॥ 354

(18) త్రికద్రుకేషు చేతనం దేవాసో యజ్ఞమత్నత ।
తమిద్వర్ధన్తు నో గిరః సదావృధమ్ ॥ 355

(19) స్తోతా యత్తే[4] అనువ్రత ఉక్థాన్యృతుథా దధే ।
శుచిః పావక[5] ఉచ్యతే సో అద్భుతః ॥ 356

(20) తదిద్రుద్రస్య చేతతి యహ్వం ప్రత్నేషు ధామసు ।
మనో యత్రా వి తద్దధుర్విచేతసః ॥ 357

(21) యది మే సఖ్యమావర[6] ఇమస్య పాహ్యన్ధసః ।
యేన విశ్వా[7] అతి ద్విషో అతారిమ ॥ 358

(22) కదా త[8] ఇన్ద్ర గిర్వణః స్తోతా భవాతి శంతమః ।
కదా నో గవ్యే[9] అశ్వ్యే వసౌ దధః ॥ 359

---

1. విప్రాఽఅవస్యవః, 2. ఇన్ద్రక్షోణీర, 3. వయాఽఇవ, 4, యత్తేఽఅనువ్రతఽఉక్థా,
5, పావకఽఉచ్యతే సోఽఅద్భుతః, 6. వరఽఇమస్య, 7, విశ్వాఽఅతి ద్విషోఽఅతారిమ.
8. తఽఇన్ద్ర, 9. గవ్యేఽఅశ్వ్యే. (బ్రా.ప్ర.)

(23) ఉత తే సుష్టుతా హరీ వృషణా వహతో రథమ్ ।
అజుర్యస్య మదిన్తమం యమీమహే ॥ 360

(24) తమీమహే పురుష్టుతం యహ్వం ప్రత్నాభిరూతిభిః ।
ని బర్హిషి ప్రియే సదదధ ద్వితా ॥ 361

(25) వర్ధస్వాసు పురుష్టుత[1] ఋషిష్టుతాభిరూతిభిః ।
ధుక్షస్వ పిప్యుషీమిషమవా చ నః ॥ 362

(26) ఇన్ద్ర త్వమవితేదసీత్థా స్తువతో[2] అద్రివః ।
ఋతాదియర్మి తే ధియం మనోయుజమ్ ॥ 363

(27) ఇహ త్యా సధమాద్యా యుజానః సోమపీతయే ।
హరీ[3] ఇన్ద్ర ప్రతద్వసూ అభి స్వర ॥ 364

(28) అభి స్వరన్తు యే తవ రుద్రాసః సక్షత శ్రియమ్ ।
ఉతో మరుత్వతీర్విశో[4] అభి ప్రయః ॥ 365

---

1. పురుష్టుతఽఋషి, 2 స్తువతోఽఅద్రివః, 3 హరీఽఇన్ద్ర ప్రతద్వసూఽఅభి. 4. విశోఽఅభి. (ప్రా.ప్ర.).

(29) ఇమా[1] అస్య ప్రతూర్తయః పదం జుషన్త యద్ దివి ।

నాభా యజ్ఞస్య సం దధుర్యథా విదే ॥ 366

(30) అయం దీర్ఘాయ చక్షసే ప్రాచి[2] ప్రయత్యధ్వరే ।

మిమీతే యజ్ఞమానుషగ్విచక్ష్య ॥ 367

(31) వృషాయమిన్ద్ర తే రథ[3] ఉతో తే వృషణా హరీ ।

వృషా త్వం శతక్రతో వృషా హవః ॥ 368

(32) వృషా గ్రావా వృషా మదో వృషా సోమో[4] అయం సుతః ।

వృషా యజ్ఞో యమిన్వసి వృషా హవః ॥ 369

(33) వృషా త్వా వృషణం హువే వజ్రిఞ్చిత్రాభిరూతిభిః ।

వావన్థ హి ప్రతిష్టుతిం వృషా హవః ॥ 370

1. ఇమాఽఅస్య, 2. ప్రయస్యధ్వరే, 3. రథఽఉతో, 4. సోమోఽఅయం. (వా.ప్ర.)

## సూక్తము—13

ఋషి—కణ్వగోత్రీయుఁడగు నారదుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ అభిషుతంబైనచో నా సోమ మింద్రుఁడు కలుఁగు భక్తులఁ బవిత్రులుగఁ జేయు
నభిషుతంబైనచో నా సోమ మింద్రుఁడు వృద్ధి బలంబులఁ గలిఁగి వెలయు
నభిషుతంబైనచో నా సోమ మింద్రుఁడు కార్యసమాప్తిని గలుఁగఁజేయు
నభిషుతంబైనచో నా సోమ మింద్రుఁడు జయకీర్తులం గోరి జయము గాంచు
గీ॥ నతఁడు దేవప్రదేశమునందుఁ గ్రాలు, నతఁడు వ్యోమ ప్రదేశమునందు వెలయు
సకల యజమానగణములు సన్నుతించ,నటుల నభివృద్ధిఁబరచు నత్యాదరమున ॥ 339

(3) క॥ బలవంతుఁడ వగు నిన్నున్
బలమును గలిఁగించునట్టి ప్రథనములందున్
ఓలిచెదరుకాన నింద్రుఁడ!
చెలికాఁడవు కమ్ము! మాకు శ్రీ సోమమునన్ ॥ 340

(4) క॥ స్తుతి భాక్క—! యింద్ర! నీకయి
యతి సోమాభిషవకారి యజమానుఁడు స
న్మతి నాహుతి నిడుచుండిన
నతి తుష్టిని నీవు రమ్ము! యజ్ఞంబునకున్ ॥ 341

(5) క॥ నీవలన నింద్రదేవుఁడ!
కావలసిన ధనము నెట్లు కాంక్షింత్రు జనుల్
వావిరి న ట్లా ధనమును
నీ విమ్మది జనుల నాక నిలయముఁ జేగొన్ ॥ 342

(6) ఉ॥ వైరులఁ జంపు మంచుఁ గడు భక్తులు ప్రీతి విశేష యుక్తులై
చేరుచు నిన్ను వేఁడెదరు శ్రీకరవాక్కులతోడ, నిన్ను వే
మారు నుతింప సత్సఖులమాటిక్ సమస్త గుణ ప్రపంచ మే
తీరునా సిద్ధ మౌనుగద! దేవపతీ! యది నుగ్గడింపమే! ॥ 343

(7) ఉ॥ తొల్లిటిమాటిక్ సన్నుతులఁ దుష్టిని బుట్టఁగఁజేసి యింద్రుఁడా!
సల్లలిత స్తవంబులను జాలఁగఁ బ్రీతిని నాలకించి నీ
యుల్లముఁ జల్లఁజేసెడు మహోన్నత సోమ మదంబు గల్గి నీ
వెల్ల బుధాళి కార్యముల నెల్ల విధంబులఁ జేయుచుండుమా! ॥ 344

(8) గీ॥ స్తుత్యుఁడైన యింద్రు సూనృత వాక్యము
నిమ్నగామి యైన నీరుఁ బోలి
పరిచరించు నాకపతి యగు నింద్రుఁడు
పొగడఁబడునుగాదె! పూర్ణ నుతుల ॥ 345

(9) క॥ వశి యగు నింద్రుఁడె మనుజుల
వశులుగ నొనరించు ననెడు వాక్కుండె నుతి
ప్రశమనకారులతోడన్
నశియింపనియట్టి మదమునన్ వెలుఁగు హరీ! ॥ 346

(10) గీ॥ స్తోతృవర పండితోత్తమా! ఖ్యాతు నింద్రు
స్తవము చేయవె! యాతఁడు శత్రు విజయి
యౌచు హరులకు దండము నందఁజేయ
నల హవిష్మంతు గృహమున కరుగుఁగాదె! ॥ 347

(11) గీ॥ ఇంద్ర! నీ బుద్ధి ఫలమును నిచ్చు నీవు
స్నిగ్ధరూపుఁడ వౌదువు శీఘ్రగామి
యైన యశ్వమ్ముతోఁగూడి యజ్ఞమునకు
వచ్చియుండిన సుఖమును బడయఁగలవు ॥ 348

(12) గీ॥ బలముగలవాఁడ! యింద్ర! సత్పతి! విశేష
ధనము నొసఁగుము! నుతులను వినుచు నీవు
వ్యాప్తి గాంచుచు నాశము నందనట్టి
యన్నమును స్తోతృవరులకు నందనిమ్ము! ॥ 349

(13) గీ॥ సూర్యుఁ డుదయింప మరియు నా సూర్యుఁ డంత
రిక్షమున నుండ నినుఁ బిల్తు దీక్షఁ బూని
నీవు ప్రీతుఁడవై యింద్ర! నిఖిల దేశ
గమనశీలాశ్వమును నెక్కి కదలి రమ్ము! ॥ 350

(14) ఉ॥ రమ్ము! మహేంద్ర! యిచ్చట విరాజిలుచుండుము! నీవు వెండియుం
బొమ్ము! సుగవ్య సోమమును బొందుము! ప్రీతిని గాంచుచుండుమా!
యిమ్మహి నే నెఱింగిన యహీన విధిం గృతయజ్ఞకర్మ నీ
వెమ్మెయి నైనఁ జేయవఁటె! యింపుగ మాపయిఁ జూఁపుచున్ దయన్ ॥ 351

(15) గీ॥ దూరమున నున్న దగ్గఱఁ జేరియున్న
నంతరిక్షంబునందున్న నంతటఁ గడు
సోమమును గ్రోలుచున్ నీవు శోభ లీన
సర్వభక్షకుఁడవు కమ్ము! శక్రదేవ! ॥ 352

(16) గీ॥ వృద్ధిఁ బొందించుఁగాక! నీ యింద్రు నుతులు
వృద్ధిఁ బొందించుఁగాక! నీ యింద్రు సోమ
రసము కూడ, మహాజను లసమశక్రు
పై నిరతిఁ గల్గుచుందురు పరమభక్తి ॥ 353

(17) గీ॥ తగిన రక్షలఁ గోరు మేధావు లెల్ల
రింద్రదేవుని యాహుతి వృద్ధిపరతు
రవనిగల సర్వదేశంబులందు శాఖ
లు విధి నభివృద్ధిఁ జెందు సంస్తవము నొంది ॥ 354

(18) గీ॥ అమరులు త్రికద్రుకంబను యజ్ఞమందు
నిష్టిఁ జేసిరి ప్రీతి మహేంద్రుఁగూర్చి
యట్టి యింద్రుని మా స్తుతి యన్ని విధుల
వృద్ధిఁ బొందించుఁగాక! నే విధమునైన ॥ 355

(19) గీ॥ స్తోత యనుకూల కర్మయై సూక్తములను
నుచ్చరించును వేళల నోయి యింద్ర!
యద్భుతుఁడ వని శుద్ధుండ వనియు జనులు
పావకుఁడ వని నిన్నెట్లు పలుకకుంద్రు? ॥ 356

(20) గీ॥ ఎవనికై జ్ఞాను లెల్లరు స్తవ మొనర్తు
రట్టి రుద్రుని సంతానమౌ మరుద్గ
ణము చిరంతనమౌ సుస్థలమునఁ జాల
వెలుఁగుచుండునుగాక! నేవిధమునైన ॥ 357

(21) గీ॥ చెలిమి చేయుచు మాతోడ లలితసోమ
రూప మగు నన్నమున్ దిని యో పవిత్ర!
వెలుఁగుచో మేము శత్రుల వివిధరీతిఁ
గొట్టి సామర్థ్య మందఁగఁ గొదువ యేమి? ॥ 358

(22) గీ॥ ఎపుడు నీ స్తోత సుఖముల నెల్లఁ బొందు?
నెట్టి కాలమునన్ గోవు లెసఁగు నశ్వ
ములును వాసప్రదంబైన లలిత ధనము
మాకు నొసఁగునొ? నుతిభాక్క! మాన్య! చెపుము! 359

(23) గద్యము॥

జరారహితుండ వగు నింద్రుఁడా! సేచన సమర్థము లగు నీ యశ్వములు నీ రథమును మాచెంతకుఁ దెచ్చునుగాక! నీ వత్యంత మదయుతుఁడవు! మేము నిన్నుఁ ప్రార్థించుచున్నాము ॥ 360

(24) గద్యము॥

బహుస్తుతుఁడు మహాత్ముఁడు నగునట్టి యింద్రుని దృప్తికర మగు నాహుతితో యాచించెదను.
వాఁడు ప్రీతికరములగు కుశలపైఁ గూర్చుండునుగాక! అనంతరము వివిధము లగు
హవ్యములను గ్రహించునుగాక! ॥ 361

(25) క॥ బహుకర్తృక సంస్తుతుఁడా!
బహుముని సంస్తుతుఁడ! నీవు బహురక్షలచే
నిహమున వృద్ధి నొసంగుచు
నహరహ మన్నంబు నీయుమా! యతుల దయన్ ॥ 362

(26) గీ॥ ఇంద్ర! వజ్రవంత! యిట్టుల స్తుతికార
కులకు రక్షకునిగ మెలఁగుమయ్య!
యిష్టికర్మ కెల్ల హేతు వౌ నీ యను
గ్రహము వడసి యుండఁగలము మేము ॥ 363

(27) గీ॥ సంతసంబుఁ గలిఁగి సత్ప్రసిద్ధిని బొంది
యధిక ధనము గలుఁగు నశ్వయుగ్మ
మరదమునకుఁ బూన్చి కరము సోమముఁ ద్రావ
నిష్టిఁ జేరరావె! యింద్ర! నీవు! ॥ 364

(28) క॥ నీ రుద్రపుత్రు లగు నా
వీర మరుత్తులు సుయజ్ఞవేది గనుచు మ
మ్మే రీతి నైనఁ బ్రీతిం
జేరఁగవలసిన దటంచుఁ జెప్పమె! యింద్రా! ॥ 365

(29) గద్యము॥

ఇంద్రుని నీ హింసకమరుత్ప్రభృతి ప్రజ లన్య దుష్ప్రాప్య మగు స్థానమును జేరుదురు.
ఏ స్థానమున మేము ధనమును స్వీకరింపఁగలమో! యా స్థానమునకు
సన్నిహితు లగుదురు ॥ 366

(30) గీ॥ యజ్ఞ మారంభమైనచో నట్టి వాస
వుండు ద్రష్టవ్యఫలమును మెండు పడయ
నానుపూర్వకముగ నిష్టి ననుభవించి
దాని నిష్పన్నముగఁ జేయ మాను నెట్లు? ॥ 367

(31, సీ॥ ఇంద్రుఁడా! నీ రథ మెల్లఁ గోర్కెల నిచ్చు నశ్వద్వయము కోర్కె లందఁజేయు
32, 33) నీ వభీష్టంబుల నిరత మిత్తువు భవదాహ్వానముం గోర్కె లమరఁ జేయుఁ
బ్రస్తరంబు లభీష్టవర్షులు సోమము కాంక్షితంబులనెల్లఁ గలుఁగఁజేయు
నిన్నుఁ జేరుచునుండు నీ యజ్ఞకర్మము నే కాంక్షితమునైన నెసఁగఁ జేయు
గీ॥ నేను హవ్యప్రదాతనై నిఖిల నుతుల నిన్నుఁ బిలుచుచు నుండెద నేను నీకు
జేయు నుతు లెల్లఁ బ్రీతి1 నిన్ జేరుచుంట, నీదు పిలుపులు వరముల నిత్య మొసఁగు! ॥ 368

## సూక్తమ్—14

ఋషిః.—గోషూక్త్యశ్వసూక్తినౌ కాణ్వాయనౌ
దేవతా.—ఇన్ద్రః
ఛందః.—గాయత్రీ

(1) యదిన్ద్రాహం యథా త్వమీశీయ వస్వ1 ఏక ఇత్ ।
స్తోతా మే గోషఖా స్యాత్ ॥ 371

(2) శిక్షేయమస్మై దిత్సేయం శచీపతే మనీషిణే ।
యదహం గోపతిః స్యామ్ ॥

1. నిం జేరుచుంట (వ్రా.ప్ర.పా.) 2. వస్వఒఏకఒఇత్. (వ్రా.ప్ర.)

(3) ధేనుష్ట[1] ఇన్ద్ర సూనృతా యజమానాయ సున్వతే ।
గామశ్వం పిప్యుషీ దుహే ॥ 373

(4) న తే వర్తాస్తి రాధస[2] ఇన్ద్ర దేవో న మర్త్యః ।
యత్ దిత్ససి స్తుతో మఘమ్ ॥ 374

(5) యజ్ఞ[3] ఇన్ద్రమవర్ధయద్ భూమిం వ్యవర్తయత్ ।
చక్రాణ[4] ఓపశం దివి ॥ 375

(6) వావృధానస్య తే వయం విశ్వా ధనాని జిగ్యుషః ।
ఊతిమిన్ద్రా వృణీమహే ॥ 376

(7) వ్యన్తరిక్షమతిరన్మదే సోమస్య రోచనా ।
ఇన్ద్రో యదభినద్ వలమ్ ॥ 377

(8) ఉద్ గా[5] ఆజదఙ్గిరోభ్య ఆవిష్కృణ్వన్ గుహా సతీః ।
అర్వాఞ్చం నునుదే వలమ్ ॥ 378

---

1. ధేనుష్టఽఇన్ద్ర, 2. రాధసఽఇన్ద్ర, 3. యజ్ఞఽఇన్ద్ర, 4. చక్రాణఽఓపశం,

5. ఉద్గాఽఆజదఙ్గిరోభ్యఽఆవిష్కృణ్వ. (ప్రా.ప్ర.)

(9) ఇన్ద్రేణ రోచనా దివో [1]దృళ్హాని దృంహితాని చ ।
స్థిరాణి న పరాణుదే ॥ 379

(10) అపామూర్మిర్మదన్నివ స్తోమ[2] ఇన్ద్రాజిరాయతే ।
వి తే మదా[3] అరాజిషుః ॥ 380

(11) త్వం హి స్తోమవర్ధన [4]ఇన్ద్రాస్యుక్థవర్ధనః ।
స్తోతౄణాముత భద్రకృత్ ॥ 381

(12) ఇన్ద్రమిత్ కేశినా హరీ సోమపేయాయ వక్షతః ।
ఉప యజ్ఞం సురాధసమ్ ॥ 382

(13) అపాం ఫేనేన నముచేః శిర[5] ఇన్ద్రోదవర్తయః ।
విశ్వా యదజయః స్పృధః ॥ 383

(14) మాయాభిరుత్సిసృప్సత[6] ఇన్ద్ర ద్యామారురుక్షతః ।
అవ[7] దస్యూగ్ంరధూనుథాః ॥ 384

---

1. దృళహ. 2. స్తోమఽఇన్ద్ర. 3. మదాఽఅరాజిషుః. 4. వర్ధనఽఇన్ద్ర. 5. శిరఽఇన్ద్రో.
6. సృప్సతఽఇన్ద్ర. 7. దస్యూగ్ంఽరధూ. (బ్రా.ప్ర.)

(15) ఆసున్వామిన్ద్ర సంసదం విషూచీం వ్యనాశయః ।
సోమపా ఉత్తరో భవన్ ॥ 385

## సూక్తము—14

ఋషి—కణ్వగోత్రీయులగు గోషూక్త్యశ్వసూక్తులు*
దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ అమరుఁడా! నీవె ధనపతి వౌదు వెట్టు
లట్టు లైశ్వర్యయుతుఁడను నౌదు నేనె
యట్టులై యున్నచో నింద్ర! యస్మదీయ
స్తోతలును ధేను సహితులై శోభఁ గాంత్రు ॥ 369

(2) గీ॥ నేను గోపతి నైనచో నిత్యభక్త
వరులకున్ దాన మొసఁగుచుఁ బరగఁగలను
నటులె ప్రార్థిత ధనమును నధికభక్తి
స్తోతలకు నందఁజేయుదు! సొగసు లీన ॥ 370

(3) గీ॥ సత్యనిరత మౌచు సత్యప్రవర్ధక
మైన నీదు మంత్ర మనెడు గోవు
సోమ మెల్లఁ దీయు సోమయాజికి నశ్వ
గోగణంబుఁ బ్రీతిఁ గూర్చుఁగాక! ॥ 371

(4) గీ॥ స్తుతుఁడవై నీవు శక్రుఁడా! చోద్య మలర
ధనము నీయంగఁ గోరిన దాని కెట్టి
దేవతయు, మానవుండును దివిరి నడ్డు
పెట్టలేఁడని పల్కెద నెట్టులైన ॥ 372

---

1. సోమపాఽఉత్తరో

*వ్రాతప్రతిలో (9వ సంపుటము. 25వ పుట) ఋషి "కణ్వగోత్రీయుఁడగు నశ్వసూక్తి గోసూక్తి యనియు, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "గోషూక్తి, అశ్వసూక్తి" యనియు శ్రీ నేమానివారు వ్రాసిరి.

(5) గీ॥ దివిని మేఘాళిపై హరి తేజరిల్లు
నవనికిన్ వృష్టి దానంబు నందఁజేయుఁ
గాన వానికి యజ్ఞంబు కలుఁగఁజేసి
వాని నభివృద్ధిఁ బరపుఁడు! వలసినట్లు ॥ 373

(6) గీ॥ వర్ధమానుఁడ వౌదు వో వాసవుండ!
శత్రుధనజేతవుగదయ్య! జగతి నీవు
కావునఁ మేము నీ రక్ష గలుఁగుటకయి
నిన్ను వేఁడుచున్నార మన్ని విధుల ॥ 374

(7) క॥ బలభేది యౌట వాసవుఁ
డల సోమ మదంబువలన నతి దీప్తుండై
లలితాంతరిక్షమందున
వెలుఁగఁడె! యభివృద్ధి గాంచి వేయి విధములన్ ॥ 375

(8) గీ॥ గుహకు మధ్యను జరియించు గోగణంబు
బైటఁ బెట్టుచు నంగిరోవర్గమునకు
వారి దాన మొసంగెడు వాసవుండు
బలుని గ్రిందు ముఖంబుగాఁ బడఁగఁ ద్రోసె! ॥ 376

(9) గీ॥ దివిని నక్షత్రముల కెల్ల ధృఢములైన
యవయవంబులఁ గల్పించి హరియె వాని
దృఢములుగఁ జేసె *నక్షత్ర దృఢత మాన్ప
శక్యుఁడే! యెవ్వఁడైన నీ జగతియందు ॥ 377

---

* నక్షత్రములనఁగా బ్రత్యేకముగఁ బుణ్యకర్మలఁజేసెడు వార లనంతర జన్మములయందుఁ బొందెడు విలక్షణ లోకములని పౌరాణికులు తలంచుచున్నారు. జ్యోతిర్విదులు నక్షత్ర మనఁగా ననేకగ్రహపరివృతము నతి దూరమందున్నదియు నగ్నిమయము నగు మండల మని చెప్పుచున్నారు. (నే.వేం.న.శా.)

(10) గీ॥ ఉదధియందుఁ జెలంగెడు నూర్మి వలెను
నీదు సుస్తోత్ర జాలము నిర్మలేంద్ర!
శీఘ్రముగ 1వెడలు నీదగు శ్రీమదంబు
హెచ్చుగా దీప్తిఁ గాంచత! మెచ్చు నటుల ॥ 378

(11) గీ॥ స్తోత్రముల వృద్ధిఁ బొందెడు సూక్తములను
వర్ధనీయుఁడ వౌదువు వాసవుండ!
స్తోత్రవర వర్గములకెల్ల సొగసు లీను
మంగళంబులఁ జేయుదు మహిని నీవు ॥ 379

(12) గీ॥ కేసరంబులతోఁ గూడి కీర్తనీయ
హరులు రెండును సోమము నాన నింద్రు
యజ్ఞ నికటంబునకుఁ దెచ్చి యచటఁ బెట్టఁ
బోవుచున్నవి చూడరె! పూజ్యులార! ॥ 380

(13) క॥ జలమునఁ గల ఫేనంబున
నల నముచి శిరస్సుఁ గొట్టి యతిశయముగఁ దా
గలఁగిన శత్రుగణంబులఁ
దొలఁగించుచుఁ బూర్ణజయముతో హరి యుండెన్ ॥ 381

(14) గీ॥ మాయలను జేసి యే వేళఁ బాయకుండఁ
దిరుగుచుండెడువారును దివికి నెక్కఁ
గోరువారును నగు దస్యువారములను
నమరుఁడ! యధోముఖంబుగ ననిపి తీవు ॥ 382

(15) గీ॥ ఇంద్రుఁడా! సోమరసమును నెంతయేనిఁ
గ్రోలు చుత్కృష్టతరుఁడవై లీల సోమ
రస విహీన జలంబుల కసమవైర
ములను గల్పించుమా! నీవు మోద మలర ॥ 383

---

1. ఇంద్రగణమునకు మారు పంచలఘు గణ మిక్కడఁ బ్రయుక్తమైనది.

## సూక్తమ్—15

ఋషిః—గోషూక్త్యశ్వసూక్తినౌ కాణ్వాయనౌ
దేవతా—ఇన్ద్రః
ఛందః—ఉష్ణిక్

(1) తమ్వభి ప్ర గాయత పురుహూతం పురుష్టుతం ।
ఇన్ద్రం గీర్భిస్తవిషమా వివాసత ॥ 386

(2) యస్యద్విబర్హసో బృహత్ సహో దాధార రోదసీ ।
[1]గిరీగ్ంరజ్రాగ్ం అపః స్వర్వృషత్వనా ॥ 387

(3) స రాజసి పురుష్టుతగ్ం[2] ఏకో వృత్రాణి [3]జిఘ్నసే ।
ఇన్ద్ర జైత్రా శ్రవస్యా చ యన్తవే ॥ 388

(4) తం తే మదం గృణీమసి వృషణం పృత్సు సాసహిమ్ ।
ఉ లోకకృత్నుమద్రివో హరిశ్రియమ్ ॥ 389

(5) యేన జ్యోతీంష్యాయవే మనవే చ వివేదిథ ।
మన్దానో[4] అస్య బర్హిషో వి రాజసి ॥ 390

---

1. గిరీరజ్రాగ్ంఽఅపః, 2. గ్ంఽఏకో, 3. జిఘ్నసే, 4. మన్దానోఽఅస్య. (వ్రా.ప్ర.)

(6) తదద్యా చిత్ త[1] ఉక్థినో ఽను ష్టువన్తి పూర్వథా ।
వృషపత్నీరపో జయా దివేదివే ॥ 391

(7) తవ త్యదిన్ద్రియం బృహత్ తవ శుష్మముత క్రతుమ్ ।
వజ్రం శిశాతి ధిషణా వరేణ్యమ్ ॥ 392

(8) తవ ద్యౌరిన్ద్ర పౌంస్యం పృథివీ వర్ధతి శ్రవః ।
త్వామాపః పర్వతాసశ్చ హిన్విరే ॥ 393

(9) త్వాం విష్ణుర్బృహన్ క్షయో మిత్రో గృణాతి వరుణః ।
త్వాం శర్ధో మదత్యను మారుతమ్ ॥ 394

(10) త్వం వృషా జనానాం మంహిష్ఠ[2] ఇన్ద్ర జజ్ఞిషే ।
సత్రా విశ్వా స్వపత్యాని దధిషే ॥ 395

(11) సత్రా త్వం పురుష్టుతగ్ం[3] ఏకో వృత్రాణి తోశసే ।
నాస్య ఇన్ద్రాత్ కరణం భూయ[4] ఇన్వతి ॥ 396

---

1. చిత్తఽఉక్థినో, 2. మంహిష్ఠఽఇన్ద్ర, 3. తగ్ంఽఏకో, 4. భూయఽఇన్వతి. (ప్రా.ప్ర.)

(12) యదిన్ద్ర[1] మన్మశస్త్వా నానా హవన్త[2] ఊతయే ।
అస్మాకేభిర్నృభిరత్రా స్వర్జయ ॥ 397

(13) అరం క్షయాయ నో మహే విశ్వా రూపాణ్యావిశన్ ।
ఇన్ద్రం జైత్రాయ హర్షయా శచీపతిమ్ ॥ 398

## సూక్తము—15

ఋషి.—కణ్వగోత్రీయు లగు గోషూక్త్యశ్వసూక్తులు
దేవత— ఇంద్రుఁడు

(1) గీ॥ బహుజనాహూతుఁడుఁ మరి బహుజన స్తు
తుండు నగు నింద్రదేవుని దృష్టి కలుఁగ
వినుతిఁ జేయుము! సద్వాక్యగణముతోడ
వాని పరిచర్యఁ జేయుము! భక్తిపరుఁడ! 384

(2) గీ॥ రెండు సుస్థానములయందు నిండినట్టి
పూజ్యమౌ నీ మహాబలస్ఫూర్తి దివిని
భువిని దాల్చును మేఘస్థ పూర్ణ జలము
వీర్యమునఁ దాల్చు శీఘ్రము వెడలుచుండి ॥ 385

(3) గీ॥ నీవు శోభించుచున్నావు నిఖిలమందు
నీ వజేతవ్యుఁడవు మరి నీవు శ్రవణ
యోగ్యుఁడవు కాన నింద్ర! మా కుచితధనము
నియతముగ నీయ వృత్రుని నెట్టినావు ॥ 386

1. యదిన్ద్రఽగన్మ, 2. హవన్తఽఊతయే. (ప్రా. ప్ర.)

(4) గీ॥ నీదు తుష్టి ప్రశంసింతు, నీవు కాంక్షి
తార్థుడుండవు శాత్రవ తండ హారి
వశ్వగణములతోఁ గూడ నధిక సేవ్యుఁ
డౌదు సుస్థానదుండవై యమరు దీవు ॥ 387

(5,6) గద్యము ॥

ఓ యింద్రుఁడా! యే హర్షమువలన నాయుస్సునకు, మనువునకు, సూర్యాది దాన మొసంగితివో!
యా హర్షమువలనఁ బ్రహృష్టుఁడవై నీవు ప్రవృద్ధ మగు యజ్ఞమునకుఁ గర్త వగుచున్నావు.
పూర్వకాలమందు వలె నిప్పుడును నుక్థంబులను మంత్రంబులను నుచ్చరించెడువారు నీ
బలమును బ్రశంసింతురు. నీవును బర్జన్యుఁడును దేనికి స్వాములో! యట్టి
జలంబువును జయింపుము! ॥ 388

(7) గీ॥ నీదు మహిమ మరియు నీదు వీర్యము నీదు
బలము వృద్ధిపరచి వెలుఁగుచుండి
యింద్ర! నీవు పవిని నెంతయుఁ దీక్ష్ణము
గాఁగ దిద్ది తీర్చి గ్రాలు మెపుడు ॥ 389

(8,9) సీ॥ ద్యోలోక మెల్ల నీ తోరంపు బలమును నభివృద్ధిఁ జేయుచు నమరుచుండెఁ
బృథ్వి నీదౌ యశఃపూరంబు నంతట వృద్ధిఁ జేయుచుఁ దాను వెలుఁగుచుండె
నంతరిక్షస్థలి యమల మేఘంబులు [1]నిజ బ్రీతుఁ జేయుచు నెసఁగుచుండె
వేశ్మకారకుఁడైన విష్ణువు నీ స్తుతిఁ జేయుచు నేవేళఁ జెలఁగుచుండె
గీ॥ వరుణమిత్రులు నీదైన పరమనుతుల, గాన మొనరింతు రా మరుద్గణము "నీవు
మత్తతను గాంచు పిమ్మట మత్తు లగుచుఁ, దిరుగుచుందురు వాసవా! కరము ప్రీతి 390

(10) గీ॥ వర్షకుఁడ వౌదు నీ వహా! వాసవుండ!
దాతృవరులను మించెడు దాత వగుదు
శక్ర! సుందర పుత్రాది సహితమైన
సర్వ ధనమును ధరియింప ఖర్వగతిని ॥ 391

1. నిం ప్రీతుఁ జేయుచు. (వ్రా.ప్ర.పా.)

(11) క॥ ఏకాకి వగుచు శత్రుల
మూకల వధియింపు మీవు పూర్ణ ప్రజ్ఞన్
నీకంటె నితరుఁ డెవ్వఁడు
లోకంబులఁ గర్మఁ బొందు లోకాహూతా! ॥ 392

(12) గీ॥ అవనమును గోరి జను లెల్ల రనులయందు
స్తోత్రముల నిన్ను వినుతించి శోభ గాంతు
రట్టి యుద్ధములం దింద్ర! యస్మదీయ
శత్రుగణముల నెక్కువ చంపు మీవు ॥ 393

(13) గద్యము॥

ఓ స్తోతా! మా మహాగృహమునకై పర్యాప్త పరివ్యాప్త రూపమును స్తుతులవలన వ్యాపింపఁ జేయుచుఁ గర్మ పాలకుం డగు నింద్రుని జేతవ్య ధనమునిమిత్తము వినుతింపుము! ॥ 394

## సూక్తమ్—16

ఋషిః—ఇరిమ్బిఠిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ప్ర సమ్రాజం చర్షణీనామిన్ద్రం స్తోతా నవ్యం గీర్భిః ।
నరం నృషాహం మంహిష్ఠమ్ ॥ 399

(2) యస్మిన్నుక్థాని రణ్యన్తి విశ్వాని చ శ్రవస్యా ।
అపామవో న సముద్రే ॥ 400

(3) తం సుష్టుత్యా వివాసే జ్యేష్ఠరాజం భరే కృత్నుమ్ ।
మహో వాజినం సనిభ్యః ॥ 401

(4) యస్యానూనా గభీరా మదా[1] ఉరవ స్తరుత్రాః ।
హర్షుమన్తః శూరసాతౌ ॥ 402

(5) తమిద్ ధనేషు హితేష్వధివాకాయ హవన్తే ।
యేషామిన్ద్రస్తే జయన్తి ॥ 403

(6) తమిచ్చ్యౌత్నై రార్యన్తి తం కృతేభిశ్చర్షణయః ।
ఏష[2] ఇన్ద్రో వరివస్కృత్ ॥ 404

(7) ఇన్ద్రో బ్రహ్మేన్ద్ర[3] ఋషిరిన్ద్రః పురూ పురుహూతః ।
మహాన్ మహీభిః శచీభిః ॥ 405

(8) సః స్తోమ్యః స హవ్యః సత్యః సత్వా తువికూర్మిః ।
ఏకశ్చిత్ సన్నభిభూతిః ॥ 406

---

1. మదాఽఉరవ, 2. ఏషఽఇన్ద్రో, 3. బ్రహ్మేన్ద్రఽఋషి. (వా.ప్ర.)

(9) తమర్కేభిస్తం సామభిస్తం గాయత్రైశ్చర్షణయః ।
ఇన్ద్రం వర్ధన్తి క్షితయః ॥ 407

(10) ప్రణేతారం వస్యో[1] అచ్ఛా కర్తారం జ్యోతిః సమత్సు ।
సాసహ్వాంసం యుధామిత్రాన్ ॥ 408

(11) స నః పప్రిః [2]పారయాతి స్వస్తి నావా పురుహూతః ।
ఇన్ద్రో విశ్వా[3] అతి ద్విషః ॥ 409

(12) స త్వం న[4] ఇన్ద్ర వాజేభిర్దశస్యా చ గాతుయా చ ।
అచ్ఛా చ నః సుమ్నం నేషి ॥ 410

## సూక్తము—16

ఋషి—ఇరింబిఠి

. దేవత—ఇంద్రుఁడు

(1) క॥ మనుజులలో సమ్రా ట్టగు
ఘను నింద్రుని సన్నుతింపు! కర్మజ్ఞానీ!
పనిగొని యాతఁడు శాత్రవ
గణహారి విశేషదాతగా వెలుఁగొందున్ ॥ 395

1. వస్యోఽఅచ్ఛా. (వ్రా.ప్ర.) 2. పారయతి (సా), 3. విశ్వాఽఅతి, 4. నఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)
*వ్రాతప్రతిలో (9వ సంపుటము. 31వ పుట) "ఇరెన్వటుఁడు" ఋషిగాను, 16b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ఇరింభిఠి" ఋషిగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ జలతరంగ సమూహము జలధియందు
వెలుఁగు చందాన నుక్థముల్ వెలుఁగు నింద్ర
దేవునందు విశేషము పావనాన్న
ములను దీపించుచుండును బొలుపు మిగుల ॥ 396

(3) ఉ॥ ఉత్తమ రూపమౌ నుతి నహో! యనునట్టి ధనంబు గోరి మా
చిత్త మెలర్ప నింద్రునకు సేవ లొనర్తుము! వాఁడు సంతతో
దాత్తములైన యుద్ధముల ధర్మక్రియన్ జరిపించి శక్తుఁడై
యుత్తమ విజ్ఞమధ్యఁ గడు నూర్జిత శోభను గాంచుచుండెడున్ ॥ 397

(4) గీ॥ ఎవరి మదము వైరి నెల్ల హరించుచు
శూరయుద్ధ హర్ష శోభఁ దేల
**విపులమై గభీరవిధి నొందుచుండునో!**
యట్టి యింద్రుఁ డుండు నతిశయించి 398

(5) గీ॥ ధనము లభియింప సజ్జనుల్ ఘన మహేంద్రుఁ
బక్షపాతంపు వాక్కులఁ బలుకుటకయి
పిలిచెదరు [1]మరియు నింద్రుని బిలుచు వారె
శత్రు విజయధనంబులఁ జాలఁ గొంద్రు ॥ 399

(6) క॥ బలకర సన్నుతిచే నిలఁ
గల మనుజులు కర్మచేతఁ గల్పించెద రా
బలహరుని నీశ్వరునిగాఁ
దలఁతు రతని ధనదుఁ డనియుఁ దత్పరమతులై ॥ 400

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్త మైనది.

(7, 8, 9, 10) సీ॥ సకలాధికుఁడు సర్వసజ్జనాహూతుండు కార్యపరంపరాఘనుఁ డసాధు
వరులఁ ద్రుంచెడువాఁడు కరము శాత్రవులకు నభిభవంబులు చేయ నరుగువాఁడు
చర్షణి, లోకాళి జరిపించు చర్చల వర్ధితుఁ డగుచుఁ దాఁ బరగువాఁడు
గాయత్ర మంత్రాళి ఘనసామ సంపత్తి నందుచు నభివృద్ధి నందువాఁడు
గీ॥ కడుఁ బ్రశస్త ధనంబు లగ్ర ధనమందు, నమల తేజస్సులం గూడి నాయుధముల
శత్రుగణముల నెల్లరఁ జంపువాఁడు, నౌ మహేంద్రుఁడు వెలుఁగొందు నఖిలమందు ॥ 401

(11) గీ॥ బహుజనాహూతుఁడౌ నల వాసవుండు
పూరయిత యౌచు శత్రుల బారినుండి
యంతరాయము లేకుండ నమరు నౌక
పైని మముఁ బెట్టి తప్పింపఁ బూనుగాక! ॥ 402

(12) క॥ ఈయుము! బలజాత ధనం
బీయుము! సత్పథము మాకు హెచ్చగు సౌఖ్యం
బీయఁ గడంగవె! ప్రీతిం
బాయక ప్రత్యక్ష మగుచు వాసవ! మాకున్ ॥ 403

## సూక్తమ్—17

ఋషిః—ఇరిమ్బిఠిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 14-వాస్తోష్పతిర్వా
ఛందః—గాయత్రీ, (14-బృహతీ, 15-సతో బృహతీ, ప్రగాథః)

(1) ఆ యాహి సుషుమా హి త[1] ఇన్ద్ర సోమం పిబా[2] ఇమమ్ ।
ఏదం బర్హిః సదో మమ ॥ 411

1. హితఽఇన్ద్ర, 2. పిబాఽఇమమ్. (వా.ప్ర.)

(2) ఆ త్వా బ్రహ్మయుజా హరీ వహతామిన్ద్ర కేశినా ।
ఉప బ్రహ్మాణి నః శృణు ॥ 412

(3) బ్రహ్మాణస్త్వా వయం యుజా సోమపామిన్ద్ర సోమినః ।
సుతావన్తో హవామహే ॥ 413

(4) ఆ నో యాహి సుతావతో ఽస్మాకం సుష్టుతీరుప ।
పిబా సు శిప్రిన్నన్ధసః ॥ 414

(5) ఆ తే సిఞ్చామి కుక్ష్యోరను గాత్రా వి ధావతు ।
గృభాయ జిహ్వయా మధు ॥ 415

(6) స్వాదుష్టే[1] అస్తు సంసుదే మధుమాన్ తన్వే౩ తవ ।
సోమః శమస్తు తే హృదే ॥ 416

(7) అయము త్వా విచర్షణే జనీరివాభి సంవృతః ।
ప్ర సోమ[2] ఇన్ద్ర సర్పతు ॥ 417

---

1. స్వాదుష్టేఽఅస్తు. 2. సోమఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(8) తువిగ్రీవో వపోదరః సుబాహురన్ధసో మదే ।
ఇన్ద్రో వృత్రాణి జిఘ్నతే ॥ 418

(9) ఇన్ద్ర ప్రేహి పురస్త్వం విశ్వస్యేశాన[1] ఓజసా ।
వృత్రాణి వృత్రహఞ్జహి ॥ 419

(10) దీర్ఘస్తే[2] అస్త్వఙ్కుశో యేనా వసు ప్రయచ్ఛసి ।
యజమానాయ సున్వతే ॥ 420

(11) అయం త[3] ఇన్ద్ర సోమో నిపూతో [4]అధి బర్హిషి ।
ఏహీమస్య ద్రవా పిబ ॥ 421

(12) శాచిగో శాచిపూజనాఽయం[5] రణాయ తే సుతః ।
ఆఖణ్డల ప్ర హూయసే ॥ 422

(13) యస్తే శృఙ్గవృషో నపాత్ ప్రణపాత్ కుణ్డపాయ్యః ।
న్యస్మిన్ దధ్ర[6] ఆ మనః ॥ 423

---

1. శానఽఓజసా, 2. దీర్ఘస్తేఽఅస్త్వ. 3. తఽఇన్ద్ర, 4. పూతోఽఅధి. 5. పూజనాయం, 6. దధ్రఽఆ. (వ్రా.ప్ర.)

(14) వాస్తోష్పతే ధ్రువా [1]స్థూణాంఽసత్రం సోమ్యానామ్ ।
ద్రప్సో భేత్తా పురాం శశ్వతీనామిన్ద్రో మునీనాం సఖా ॥ 424

(15) పృదాకుసానుర్యజతో గవేషణ[2] ఏకః సన్నభి భూయసః ।
భూర్ణిమశ్వం నయత్ తుజా పురో గృభేన్ద్రం సోమస్య పీతయే ॥ 425

## సూక్తము—17

ఋషి—ఇరింబిఠి*

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ రమ్మిచటకు నీకై సో
మ మ్మభిషుత మౌచు నుండె మా సోమము పా
నమ్మును జేయుము! దర్భల
నిమ్మగ వసియింప రావె! యింద్ర! మహాత్మా! ॥ 404

(2) గీ॥ కేసర విశిష్టములు మరి కీర్తనీయ
మంత్రయోజితములు నైన మాన్యహరులు
నిన్నుఁ గొనితెచ్చుఁగాక! నో సన్నుతేంద్ర!
నీవు మన్నుతి విను మిష్టి నికటమందు ॥ 405

---

1. స్థూణాసత్రం, 2. గవేషణఽఏకః. (వ్రా.ప్ర.)

*వ్రాఁతప్రతిలో (8వ సంపుటము. 35 పుట) "ఇరిశ్విషుఁడు" ఋషిగాను, 15 b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ఇరింభిఠి" ఋషిగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(3, సీ॥ స్తోతల మగుటచే స్తోత్ర పద్ధతులను బిలుచుచుంటిమి నిన్నుఁ బ్రీతి మిగుల
4,5) సోమాభియుతులమై సోమపాయిని నిన్నుఁ బిలుచుచుంటిమి మేము ప్రీతి మిగుల
నభిషుతసోమంబు నానుటకై నిన్నుఁ బిలుచుచుంటిమి మేము ప్రీతి మిగుల
నన్నము భక్షింప నస్మన్నుతిన్ వినఁ బిలుచుచుంటిమి నిన్నుఁ బ్రీతి మిగుల
గీ॥ నింద్రుఁడా! శీఘ్రయుక్తుఁడ! యెల్లవేళ,నీదు కుక్షిద్వయంబున సాదరముగ
సోమసేక మొనర్తు మా సోమ మెల్ల, జిహ్వతోడ గ్రహింపుము! శీఘ్రగతిని ॥ 406

(6,7,8,9,10)
గద్యము॥

ఇంద్రుఁడా! నీవు సుదాతవు! ఈ మధురసోమము నీ శరీరమునకు స్వాదు వగును. నీ హృదయమునకు సుఖ జనక మగును. లోకపతీ! స్త్రీ వలె సంవృత మగు నీ సోమము నీ చెంతఁ జేరుఁగాక! విస్తీర్ణ కంధర విశిష్టుఁడు, స్థూలోదరుఁడు, సుబాహువు నగు నింద్రునకు సోమ జనిత హర్ష ముదయించినయెడల నతఁడు శత్రువులను హరించును. ఇంద్రా! నీవు సర్వ జగత్తులకు స్వామివై మా ముందఱ నిలువుము! ఓ వృత్రహననుఁడా! నీవు మా శత్రువులను దును మాడుము! దేనివలన సోమాభిషవకారులకు ధన మొసంగెదవో! యట్టి నీ యంకుశము కడు దీర్ఘముకదా! ॥ 407

(11) గీ॥ నీ నిమిత్తము సోమము నిరత మింద్ర!
వేదిపైఁ గల దర్భల వెలుఁగుచుండె
నట్టి సోమము చెంతకు నరుగుదెంచి
యీ క్షణంబున నది ద్రావు! దీక్ష నీవు ॥ 408

(12) గీ॥ శక్తివంతుఁడ! ప్రఖ్యాతి సహిత! లోక
పూజ్యుఁడా! యింద్ర! నీకు సంపూర్ణ సుఖము
కలుఁగుటకు సోమ మతివృద్ధిఁ గాంచుచుండె
దాని నాఖండలా! త్రావి తనివిఁ గొనుము! ॥ 409

(13) గీ॥ శృంగవృష పుత్రుఁడా! యింద్ర! శ్రీల! నీవు
పరమరక్షకుఁడవు, కుండ పార్య మనెడు
యజ్ఞ కర్మను మే మెల్ల నతిశయించి
చేయుటకుఁ [1]దలఁచినారము చిత్త మలర ॥ 410

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్తమైనది.

(14) గద్యము॥

వాస్తోష్పతీ! గృహాధారస్థంభము దృఢ మగుఁగాక! సోమ సంపాదనమునకు మా
స్కంధములను సంరక్షించు బలము కలుఁగుఁగాక! బహుపురీ భేదకుం డగు
నింద్రుఁడు ఋషులకు మిత్రుఁ డగుఁగాక! ॥ 411

(15) గీ॥ సర్పరాజు వలెను సంశ్రిత యాగ యో
గ్యంబు ధేనువులను గూర్చు శక్రుఁ
డొక్కఁ డగుచు నరులఁ బెక్కుర బలమున
సంహరించుఁగాక! జగము మెచ్చ ॥ 412

గీ॥ భరణ శీలుఁడు బహుతరవ్యాప్తిపరుఁడు
నైన యింద్రుని, సంప్రీతి నమల సోమ
రసము గ్రోలంగ సంస్తోత యసమ భక్తిఁ
దెచ్చి పెట్టునుగాకఁ దా దీక్షఁ బూని ॥ 413

## సూక్తమ్—18

ఋషిః—ఇరిమ్బిఠిః కాణ్వః
దేవతా—ఆదిత్యాః, 4,6,7-అదితిః, 8-అశ్వినౌ, 9-అగ్నిసూర్యానిలాః†
ఛందః—ఉష్ణిక్

(1) ఇదం హ నూనమేషాం సుమ్నం భిక్షేత మర్త్యః ।
ఆదిత్యానామపూర్వ్యం సవీమని ॥ 426

† ఈ సూక్తమునకు దేవత 4,6,7 ఋక్కులకు అదితిగాఁ గొన్ని ప్రతులలోఁ బేర్కొనఁబడఁగా సాయన, మాక్స్‌ముల్లర్ ప్రతులలో 1వ ఋక్కునుండి 7వ ఋక్కువరకు నాదిత్యులుగాఁ బేర్కొనఁబడినది.

(2) అనర్వాణో హ్యేషాం పన్థా[1] ఆదిత్యానామ్ ।

అదబ్ధాః సన్తి పాయవః సుగేవృధః ॥ 427

(3) తత్ సు నః సవితా భగో వరుణో మిత్రో[2] అర్యమా ।

శర్మ యచ్ఛన్తు సప్రథో యదీమహే ॥ 428

(4) దేవేభిర్దేవ్యదితేఽరిష్టభర్మన్నా గహి ।

స్మత్ సూరిభిః పురుప్రియే సుశర్మభిః ॥ 429

(5) తే హి పుత్రాసో[3] అదితేర్విదుర్ద్వేషాంసి యోతవే ।

అంహోశ్చిదురుచక్రయోఽనేహసః ॥ 430

(6) అదితిర్నో దివా పశుమదితిర్నక్తమద్వయాః ।

అదితిః పాత్వంహసః సదావృధా ॥ 431

(7) ఉత స్యా నో దివా మతిరదితిరూత్యా గమత్ ।

సా శంతాతి మయస్కరదప స్రిధః ॥ 432

---

1. పన్థాఽఆదిత్యా, 2. మిత్రోఽఅర్యమా, 3. పుత్రాసోఽఅదితే. (ప్రా.ప్ర.)

8) ఉత త్యా దైవ్యా భిషజా శం నః కరతో[1] అశ్వినా ।

యుయుయాతామితో రపో[2] అప స్రిధః ॥ 433

(9) శమగ్నిరగ్నిభిః కరచ్ఛం నస్తపతు సూర్యః ।

శం వాతో వాత్వరపా[3] అప స్రిధః ॥ 434

(10) ఆపామీవామప స్రిధమప సేధత దుర్మతిమ్ ।

ఆదిత్యాసో యుయోతనా నో [4]అంహసః ॥ 435

(11) యుయోతా శరుమస్మదాగ్ం [5]ఆదిత్యాస ఉతామతిమ్ ।

ఋధగ్ద్వేషః కృణుత విశ్వవేదసః ॥ 436

(12) తత్ సు నః శర్మ [6]యచ్ఛతాఽఽదిత్యా యన్ముమోచతి ।

ఏనస్వన్తం చిదేనసః సుదానవః ॥ 437

(13) యో నః కశ్చిద్రిరిక్షతి రక్షస్త్వేన మర్త్యః ।

స్వైః ష [7]ఏవై రిరిషీష్ట యుర్జనః ॥ 438

---

1. కరతోఽఆశ్వినా, 2. రపోఽఅప, 3. రపాఽఅప, 4. నోఽఅంహసః, 5. స్మదాగ్ంఽఆదిత్యాసఽఉతా,

6. యచ్ఛతాదిత్యా, 7. షఽఏవై రిరి. (వ్రా.ప్ర.)

(14) సమిత్ తమఘమశ్నవద్ దుఃశంసం మర్త్యం రిపుమ్ ।
[1]యో అస్మత్రా దుర్హణావాగ్ం[2] ఉప ద్వయుః ॥ 439

(15) పాకత్రా స్థన దేవా హృత్సు జానీథ మర్త్యమ్ ।
ఉప ద్వయుం చాద్వయుం చ వసవః ॥ 440

(16) ఆ శర్మ పర్వతానామోతాపాం వృణీమహే ।
ద్యావాక్షామారే[3] అస్మద్ రపస్కృతమ్ ॥ 441

(17) తే నో భద్రేణ శర్మణా యుష్మాకం నావా వసవః ।
అతి విశ్వాని దురితా పిపర్తన ॥ 442

(18) తుచే తనాయ తత్ సు నో ద్రాఘీయ[4] ఆయుర్జీవసే ।
ఆదిత్యాసః సుమహసః కృణోతన ॥ 443

(19) యజ్ఞో హీళో వో[5] అన్తర ఆదిత్యా అస్తి మృళత ।
యుష్మే[6] ఇద్ వో అపి ష్మసి సజాత్యే ॥ 444

1. యోఽఅస్మత్రా, 2. వాగ్ంఽఉప, 3. మారేఽఅస్మద్ 4. ద్రాఘీయఽఆయుర్జీ, 5. వోఽఅన్తరఽఆదిత్యాఽఅస్తి.
6. యుష్మేఽఇద్వోఽఅపి. (వ్రా.ప్ర.)

(20) బృహద్ వరూథం మరుతాం దేవం త్రాతారమశ్వినా[1] ।
మిత్రమీమహే వరుణం స్వస్తయే ॥ 445

(21) అనేహో మిత్రార్యమన్ నృవద్ వరుణ శంస్యమ్ ।
త్రివరూథం మరుతో యన్త నశ్ఛర్దిః ॥ 446

(22) యే చిద్ధి మృత్యుబన్ధవ[2] ఆదిత్యా మనవః స్మసి ।
ప్ర సూ న ఆయుర్జీవసే తిరేతన ॥ 447

## సూక్తము—18

ఋషి——కాణ్వుఁడైన యిరింబిఠి*

దేవత——ఆదిత్యులు, 4,6,7-అదితి, 8-అశ్వినులు, 9-అగ్ని సూర్య వాయువులు*

(1,2, సీ॥ మనుజు లపూర్వమౌ ఘనసుఖం బిమ్మని యాదిత్యగణముల నడుగుచుంద
3,4) రాదిత్యసన్మార్గ మప్రతిహత మౌచు సుఖవర్ధకంబయి శోభఁ దేలు
మేము గోరు సుఖంబు మిత్రుఁడు వరుణుండు సవితృభగుల్ చక్కఁ జాటుచుంద
రదితి మహాదేవి! యతిలోకహిత! నీవు పాలక వైనచోఁ బ్రతికియుందు
గీ॥ మట్టులై యున్న మమ్ముల నెట్టివార, లైన హింసింపఁగాఁ జాల రందువలనఁ
బ్రాజ్ఞులై సుఖ మొసఁగెడు ప్రకృతిఁ గలుఁగు, దేవతలతోడ మమ్ములఁ గావ రమ్ము! ॥ 414

---

1. మవిశ్వినా, 2. బన్ధవఽఆదిత్యా. (వ్రా.ప్ర.)

* వ్రా. ప్రతిలో (9వ సంపుటము. 39పుట) నీ సూక్తమునకు ఋషి "ఇరిశ్విఠుఁడు"గాను, 15b సంపుటములో "ఇరింభిఠి" గాను వ్రాసి, వ్రా. ప్రతిలో దేవత 8-ఆదిత్యుఁడు, 9-అగ్ని సూర్యుఁడు వాయువ, అవశిష్టములకు ఆదిత్యుఁడుగాను, 15b సంపుటములో ఆదిత్యులు, అశ్వులు, అగ్ని, సూర్యుఁడు, వాయుముగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

(5) †గీ॥ అదితిపుత్రుల ద్వేషించునట్టివారి
వేరు చేయంగ నేర్తురు విపుల కర్మ
కారకులు రక్షకత్వము గలిగి, పాప
ములను భంజింప నేర్తురు తొలఁగకుండ ॥ 415

(6,7,8) సీ॥ అదితి మా పశువుల నహమందు నిశియందుఁ గాపాడుచుం దాను గ్రాలుఁగాక!
సర్వకాలములం దఖర్వరక్షలఁ బాపములను ఖండించుచుఁ జెలఁగుఁగాక!
స్తుతియోగ్యయై తాను సుందర దినమున మా సమక్షమునందు మసలుఁగాక!
శాంతిని సౌఖ్యంబుఁ జక్కఁగ నొనరించి శత్రుగణంబులఁ జంపుఁగాక!
గీ॥ నమర వైద్యులుగా నున్న యశ్వియుగ్మ, మస్మదీయులకున్ సుఖమందఁజేసి
పాపములనుండి మము వేరుపరచి శత్రు, పులను దూరముగాఁజేసి మెలఁగుఁగాక! ॥ 416

(9,10) సీ॥ అగ్నిదేవుఁడు వివిధాగ్నుల మూలానఁ బాయక సుఖమును జేయుఁగాక!
సూర్యదేవుఁడు మాకు సుఖ మిచ్చుచుం దాప దానము నొసఁగంగఁ బూనుఁగాక!
వాయువు తాపంబు వదలుచు నంతట విస్తృతంబుగఁ దాను వీచుఁగాక!
నతఁడె మా శాత్రవతతి వేరు చేయుచు దూరముగా వారిఁ ద్రోలుఁగాక!
గీ॥ గణన కెక్కిన యాదిత్యగణమ! రోగ, ములు, కుశత్రులు దూరము తొలఁగునట్లు
దుర్మతులు, పాపములుకూడఁ దొలఁగునట్టు, లుదయ మీ రెట్లులైనఁ జేయుదురుగాక! ॥ 417

(11,12,13,14)
గద్యము॥

ఓ యాదిత్యగణమా! హింసకులు, దుర్మతులు మాచెంతఁ జేరకుండఁ ద్రోలుము! శత్రువులను
మానుండి వేరుపఱపుము! సుదానశీలులారా! యే కళ్యాణము పాపాత్ము లగు స్తోతలను
బాపములనుండి తప్పించునో! యట్టి కళ్యాణమును మాకుఁ గలుగఁ జేయుఁడు! ఏ
మనుజుఁడు రాక్షసభావమును బొంది మమ్ము హింసించునో! యా మనుజుఁడు
†తన కార్యమువల్లనే బాధింపఁబడుఁగాక! ఎవఁడు దుష్కృతియై మాకు
నాఘాతమును గల్పించునో! కపటమును జేయునో! వాఁడు నిధనమును
బొందుఁగాక! ॥ 418

† అఘోరాస్త్రమంత్ర ప్రసక్తి యిక్కడఁ గలదు. వ.గో.కృ.

(15) గీ॥ పక్షి మైనట్టు మీ బుద్ధి వాసదాత
లార! మాపైని నిలుపుచు నకపట జను
లను గపటులను ద్వివిధ మౌ జనము నెరిఁగి
కనుఁడు! కీర్తిని నాదిత్యగణములార! ॥ 419

(16) గీ॥ జలద సంబంధ సుఖమును జల సముద్ధ
సుఖము భజియించుచుంటిమి సూక్ష్మబుద్ధిఁ
బాప సంచయ మంతయు బహుళదూర
దేశమున[1] కనుపరేమి? యాదిత్యులార! ॥ 420

(17,18,19,20,
21,22,) గద్యము

వసువులారా! యాదిత్యగణమా! సుందరము, సుఖకరము నగు నౌకచే మీరు మమ్ము
దురితములను దాటింపుఁడు! సుందరతేజోవిశిష్టులగు పుత్రులకొఱకు ఛాత్రులకొఱకు
మాకు దీర్ఘాయుర్దాయము నొసంగుఁడు! మే మొనర్చెడు యజ్ఞము మీ నిమిత్తమే!
మీరు మమ్ము సుఖవంతులుగఁ గావింపుఁడు! మీ చెలిమిని బురస్కరించుకొని మే
మెల్లప్పుడును మీవార మగుదుము. మరుత్తులను బరిపాలించెడు నింద్రుని
యశ్వద్వయమును మిత్రావరుణులను శీతాదినివారక మగు గృహము
నిమ్మని యడిగెదము. వరుణుఁడా! మరుద్గణమా! సకలవిధముల
హింసారహితము పుత్రాది విశిష్టము శీతాతపవర్షా నివారకము
నగు గృహము మా కొసంగుఁడు! ఏ మనుజులు మృత్యువునకు
బంధుస్వరూపులో! వారు జీవించుటకు నాయుస్సు
నుత్తమ రూపంబున నొసంగుఁడు! ॥ 421

## సూక్తమ్—19

ఋషిః—సోభరిః కాణ్వః
దేవతా—అగ్నిః, 34-35-ఆదిత్యాః, 36,37-త్రసదస్యుః పౌరుకుత్స్యః
ఛందః—1-26-విషమా కకుప్, సమా సతోబృహతీ (ప్రగాథః), 27-ద్విపదా
విరాట్, 28-33 సమా కకుప్, విషమా సతోబృహతీ (ప్రగాథః),
34-ఉష్ణిక్, 35-సతోబృహతీ, 36-కకుప్, 37-పంక్తిః

(1) తం గూర్ధయా స్వర్ణరం దేవాసో దేవమరతిం దధన్విరే ।
దేవత్రా హవ్యమోహిరే ॥ 448

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘగణము ప్రయుక్తమైనది.

(2) విభూతరాతిం విప్ర చిత్రశోచిషమగ్నిమీళిష్వ యన్తురమ్ ।
అస్య మేధస్య సోమ్యస్య సోభరే ప్రేమధ్వరాయ పూర్వ్యమ్ ॥ 449

(3) యజిష్ఠం త్వా వవృమహే దేవం దేవత్రా హోతారమమర్త్యమ్ ।
అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥ 450

(4) ఊర్జో నపాతం సుభగం సుదీదితిమగ్నిం శ్రేష్ఠశోచిషమ్ ।
స నో మిత్రస్య వరుణస్య సో[1] అపామా సుమ్నం యక్షతే దివి ॥ 451

(5) యః సమిధా య[2] ఆహుతీ యో వేదేన దదాశ మర్తో[3] అగ్నయే ।
యో నమసా స్వధ్వరః ॥ 452

(6) తస్యేదర్వన్తో రంహయన్త[4] ఆశవస్తస్య ద్యుమ్నితమం యశః ।
న తమంహో దేవకృతం కుతశ్చన న మర్త్యకృతం నశత్ ॥ 453

(7) స్వగ్నయో వో[5] అగ్నిభిః స్యామ సూనో సహస[6] ఊర్జాం పతే ।
సువీరస్త్వమస్మయుః ॥ 454

---

1. సోఽఅపామా, 2. యఽఆహుతీ, 3. మర్తోఽఅగ్నయే, 4. యన్తఽఆశవ, 5. వోఽఅగ్నిభిః,
6. సహసఽఊర్జాం. (ప్రా.ప్ర.)

(8) ప్రశంసమానో[1] అతిథిర్న మిత్రియోఽగ్నీ రథో న వేద్యః ।
త్వే క్షేమాసో[2] అపి సన్తి సాధవస్త్వం రాజా రయీణామ్ । 455

(9) సో[3] అద్ధా దాశ్వధ్వరోఽగ్నే మర్తః సుభగ స ప్రశంస్యః ।
స ధీభిరస్తు సనితా ॥ 456

(10) యస్య త్వమూర్ధ్వో[4] అధ్వరాయ తిష్ఠసి క్షయద్వీరః స సాధతే ।
సో[5] అర్వద్భిః [6]సనితా స విపన్యుభిః స శూరైః సనితా కృతమ్ ॥ 457

(11) యస్యాగ్నిర్వపుర్గృహే స్తోమం చనో దధీత విశ్వవార్యః ।
హవ్యా వా వేవిషద్విషః ॥ 458

(12) విప్రస్య వా స్తువతః సహసో యహో[7] మక్షూతమస్య రాతిషు ।
అవోదేవముపరిమర్త్యం కృధి వసో వివిదుషో వచః ॥ 459

(13) యో[8] అగ్నిం హవ్యదాతిభిర్నమోభిర్వా సుదక్షమావివాసతి ।
గిరా వాజిరశోచిషమ్ ॥ 460

---

1. మానోఽఅతిథి, 2. క్షేమాసోఽఅపి, 3. సోఽఅద్ధా, 4. మూర్ధ్వోఽఅధ్వరాయ, 5. సోఽఅర్వద్భి, (వ్రా.ప్ర.)
6. సనితాసః విప (సా), 7. యహోమక్షోమక్షూత, 8. యోఽఅగ్నిం, (వ్రా.ప్ర.)

(14) సమిధా యో నిశితీ దాశదదితిం ధామభిరస్య మర్త్యః ।
విశ్వేత్ స ధీభిః సుభగో జనాగ్ం[1] అతి ద్యుమ్నైరుద్న[2] ఇవ తారిషత్ ॥ 461

(15) తదగ్నే ద్యుమ్నమా భర యత్ సాసహత్ సదనే కం చిదత్రిణమ్ ।
మన్యుం జనస్య దూఢ్యః ॥ 462

(16) యేన చష్టే వరుణో మిత్రో[3] అర్యమా యేన నాసత్యా భగః ।
వయం తత్ తే శవసా గాతువిత్తమా[4] ఇన్ద్రత్వోతా విధేమహి ॥ 463

(17) తే ఘేదగ్నే స్వాధ్యోఽ యే త్వా విప్ర నిదధిరే నృచక్షసమ్ ।
విప్రాసో దేవ సుక్రతుమ్ ॥ 464

(18) త[5] ఇద్ వేదిం సుభగ త[6] ఆహుతిం తే సోతుం చక్రిరే దివి ।
త[7] ఇద్ వాజేభిర్జిగ్యుర్మహద్ ధనం యే త్వే కామం న్యేరిరే ॥ 465

(19) భద్రో నో [8]అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో[9] అధ్వరః ।
భద్రా[10] ఉత ప్రశస్తయః ॥ 466

---

1. జనాగ్ంఽఅతి, 2. రుద్నఽఇవ, 3. మిత్రోఽఅర్యమా, 4. విత్తమాఽఇన్ద్ర, 5. తఽఇద్వేదిం,
6. తఽఆహుతిం, 7. తఽఇద్వాజే, 8. భద్రో నో ఽఅగ్ని, 9. భద్రోఽఅధ్వరః. 10. భద్రాఽఉత. (ప్రా.ప్ర.)

(20) భద్రం మనః కృణుష్వ వృత్రతూర్యే యేనా సమత్సు సాసహః ।
అవ స్థిరా తనుహి భూరి శర్ధతాం వనేమా తే[1] అభిష్టిభిః ॥ 467

(21) ఈళే గిరా మనుర్హితం యం దేవా దూతమరతిం న్యేరిరే ।
యజిష్ఠం హవ్యవాహనమ్ ॥ 468

(22) తిగ్మజంభాయ తరుణాయ రాజతే ప్రయో గాయస్యగ్నయే ।
యః పింశతే సూనృతాభిః సువీర్యమగ్నిర్ఘృతేభిరాహుతః ॥ 469

(23) యదీ ఘృతేభిరాహుతో వాశీమగ్నిర్భరత[2] ఉచ్చావ చ ।
అసుర[3] ఇవ నిర్ణిజమ్ ॥ 470

(24) యో హవ్యాన్యైరయతా మనుర్హితో[4] దేవ ఆసా సుగంధినా ।
వివాసతే వార్యాణి స్వధ్వరో హోతా దేవో[5] అమర్త్యః ॥ 471

(25) యదగ్నే మర్త్యస్త్వం స్యామహం మిత్రమహో[6] అమర్త్యః ।
సహసః సూనవాహుత ॥ 472

---

1. తేఽఅభిష్టిభిః, 2. భరతఽఉచ్చావ చ, 3. అసురఽఇవ, 4. మనుర్హితో దేవఽఆసా,
5. దేవోఽఅమర్త్యః, 6. మహోఽఅమర్త్యః. (వ్రా.ప్ర.)

(26) న త్వా రాసీయాభిశస్తయే వసో న పాపత్వాయ సన్త్య ।
న మే స్తోతామతీవా న దుర్హితః స్యాదగ్నే న పాపయా ॥ 473

(27) పితుర్న పుత్రః సుభృతో దురోణ[1] ఆ దేవాగ్ం ।
ఏతు ప్ర ణో హవిః ॥ 474

(28) తవాహమగ్న[2] ఊతిభిర్నేదిష్ఠాభిః సచేయ జోషమా వసో ।
సదా దేవస్య మర్త్యః ॥ 475

(29) తవ క్రత్వా సనేయం తవ రాతిభిరగ్నే తవ ప్రశస్తిభిః ।
త్వామిదాహుః ప్రమతిం వసో మమాఽగ్నే హర్షస్వ దాతవే ॥ 476

(30) ప్ర సో[3] అగ్నే తవోతిభిః సువీరాభిస్తిరతే వాజభర్మభిః ॥
యస్య త్వం సఖ్యమావరః ॥ 477

(31) తవ ద్రప్సో నీలవాన్ వాశ[4] ఋత్వియ ఇన్ధానః సిష్ణవా దదే ।
త్వం మహీనాముషసామసి ప్రియః క్షపో వస్తుషు రాజసి ॥ 478

1. దురోణఽఆ దేవాగ్ంఽఏతు, 2. మగ్నఽఊతిభి, 3. సోఽఅగ్నే, 4. వాశఽఋత్వియఽఇన్ధానః. (వా. ప్ర.)

(32) తమాగన్మ సోభరయః సహస్రముష్కం స్వభిష్టిమవసే ।

సమ్రాజం త్రాసదస్యవమ్ ॥ 479

(33) యస్య తే[1] అగ్నే అన్యే అగ్నయ ఉపక్షితో వయా ఇవ ।

విపో న ద్యుమ్నా ని యువే జనానాం తవ క్షత్రాణి వర్ధయన్ ॥ 480

(34) యమాదిత్యాసో[2] అద్రుహః పారం నయథ మర్త్యమ్ ।

మఘోనాం విశ్వేషాం సుదానవః ॥ 481

(35) యూయం రాజానః కం చిచ్చర్షణీసహః క్షయన్తం మానుషాగ్ం[3] అను ।

వయం తే వో వరుణ మిత్రార్యమన్ స్యామేదృతస్య రథ్యః ॥ 482

(36) అదాన్మే పౌరుకుత్స్యః పఞ్చాశతం త్రసదస్యుర్వధూనామ్ ।

మంహిష్ఠో[4] అర్యః సత్పతిః ॥ 483

(37) ఉత మే ప్రయియోర్వయియోః సువాస్త్వా[5] అధి తుగ్వని ।

తిసృణాం సప్తతీనాం శ్యావః ప్రణేతా భువద్ వసుర్దియానాం పతిః ॥ 484

---

1. తే౽అగ్నే౽అన్యే౽అగ్నయ౽ఉపక్షితో౽వయా౽ఇవ. 2. దిత్యాసో౽అద్రుహః, 3. మానుషాగ్ం౽అను.

4. మంహిష్ఠో౽అర్యః, 5. సువాస్త్వా౽అధి. (ప్రా.ప్ర.)

# సూక్తము—19

ఋషి—కాణ్వుఁడైన సోభరి*

దేవత—అగ్ని, 34,35-ఆదిత్యులు, 36, 37- పౌరకుత్సుఁడైన యేసదస్యుఁడు*

(1) గీ॥ స్తోత! నుతియింపు మగ్నిని స్తుతులతోడ
నతఁడు హవ్యము గ్రహియించి యరిగి నాక
మునకు నమరాళికి నొసంగు భోజనంబు
ఋత్విజులు చేరఁగల రగ్నిఁ దత్త్వ మతిని ॥ 422

(2) చ॥ మతి గల సౌభరీ! నుతుల మాన్యుని నగ్నిని వేఁడుచుండుమా!
యతఁడు విభుత్వముం గలిఁగి యత్యధికంబుగ దాన మిచ్చుచున్
సతతము దీప్తిమంతుఁడయి సారససోమ సుసాధ్య మౌచు నా
తత మగు నిష్టి కర్మలను దప్పక గూర్చెడుఁగాఁ దలంపఁగన్ ॥ 423

(3) గీ॥ అగ్ని! యాజికి శ్రేష్ఠుఁడ వౌదు దేవ
తలకు దేవుఁడ వౌదు హోతవునుగూడ
నౌదు వమరుఁడ వౌదువు యజ్ఞకర్త
వౌదు నిను వేఁడుచుంటి మత్యధిక భక్తి ॥ 424

(4) గీ॥ అగ్ని దాత యౌచు నతి సుభగుం డౌచు
దీప్తివంతుఁ డౌచు వ్యాప్తుఁ డౌచు
మిగుల జ్వాలఁ గలిఁగి మించెడు నవ్వాని
సన్నుతింపఁగలను జాల భక్తి ॥ 425

* వ్రాతప్రతిలో (9వ సంపుటము.- 43వ పుట) నీ సూక్తమునకు "సౌభరి" ఋషిగాను, 16-17 ఏ సదృస్యరాజు దానము 34,35- ఆదిత్యులు, శేషమునకు-అగ్ని,దేవతగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "సౌభరి" ఋషిగాను, అగ్ని, ఆదిత్యులు, త్రసదస్యువుని దానములు దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి. 16-17 ఋగనువాదములలో "ఏసదస్య"రాజు ప్రసక్తి లేదు గాని 36-37 ఋగనువాదములలో "ఏసదస్య" శబ్దమునే శ్రీనేమానివారు ప్రయోగించిరి, (చూ-589పుట) 36, 37 ఋక్కులకుఁ త్రసదస్యుఁడు దేవతగాఁ బెక్కు ప్రామాణిక సంస్కృత మూల ఋగ్వేద ప్రతులలోఁ గలదు.

క॥ అనలుఁడు మాకై దివియం
దున వెల్గెడు వరుణ మిత్ర దుస్తర సౌఖ్యం
బును లక్ష్య ముంచుకొని తా
నొనరించునుగాక! నిష్టి నుదకంబునకై ॥ 426

(5,6,7) సీ॥ అనలుని పూజల నాచరించెదు వారి యగ్ని కాహుతి నిచ్చునట్టి వారి
వేదంబులకు సేవ విధిగఁ గూర్చెడు వారి యజ్ఞకర్మలఁ జేసి యమరు వారి
యతి నమస్కృతులను నాచరించెడువారి యశ్వముల్ ద్రుతగాము లగుచు నుండు
వారి సత్క్రియయు వర్షితంబగుచుండు వారి తాపంబు నివారిత మగు
గీ॥ నన్నపతి! జలజుఁడా! నీకు నంగభూతు, లైన యగ్నుల నుత్తమంబైన యగ్నిఁ
గలుఁగువారము వీర! నీ వెలమితోడ, మమ్ముఁ గాంక్షించుచుండు! మోదమ్ము మీర 427

(8) గీ॥ అధిక సన్నుతిఁ గాంచెడు నతిథి మాడ్కి
స్తోతలకు సుఖ మొసంగెడు సురథము వలె
ఫలము గలిఁగింతు వో యగ్ని! పరమ శుభము
నొనరిచెడు పతి వౌదువు ధనమునకును ॥ 428

(9) క॥ సుభగాగ్ని! యజ్ఞంబున్
సభయంబుగఁ జేయువాఁడు సత్యఫలుండౌ
సుభజనశీలుం డగు జన
శుభ నుతులఁ బ్రశస్తి గాంచు సుమ్ము! జగానన్ ॥ 429

(10) చ॥ ఎవని మహేష్టి కూర్ధ్వముగ నేపు వహించెద వగ్నిహోత్రుఁడా!
నివసన శీలుఁడౌ నతఁడు నిత్యము వీరులతోడఁ గూడు ను
త్సవకర సిద్ధిఁ బొందుఁ గడుఁ జక్కని యశ్వ సహాయసంపదన్
నవ జయ మందు సత్యవచన స్తుతి ప్రీతుఁడుగా వెలింగెడున్ ॥ 430

(11) గీ॥ సర్వవరణీయుఁడౌ నగ్ని సరసరూప
వంతుఁడై యెవని గేహము చెంతఁ జేరి
నుతుల నన్నము గ్రహియింప మతిఁ దలంచు
నతని హవ్యము సురలందు నమరుచుండు ॥ 431

(12) గీ॥ అమల మేధావి యొసఁగెడు హవ్యదాన
మం దభిజ్ఞుని వాక్యంబు లమరవరుల
క్రింద మర్త్యులలో వ్యాప్తిఁ జెందునటులఁ
జేయుమా! యగ్ని! బలపుత్ర! చిత్త మలర ॥ 432

(13) క॥ ఎవఁడు నమస్కారంబుల
నెవఁడు హవిస్సులను నగ్ని నెరుఁగఁగలండో!
యెవఁ డతని సేవఁ జేయనో!
నవ వృద్ధిం బొందువాఁ డనంతముగాఁగన్ ॥ 433

(14) గద్యము ॥
ఎవఁ డీ యగ్ని యవయవములతోఁ గూడి యగ్నికి సమిధల ద్వారా పరిచర్యఁ జేయునో!
వాఁడు కర్మలచే సౌభాగ్యవంతుఁడై విద్యోతమాన్నముచే జలము వలెస మస్తలోకమును
నతిక్రమించును ॥ 434

(15) గీ సదనములయందు రాక్షస సరణిఁ గొట్టు
నట్టి ధన మెద్దియో వహ్ని! యఖిల పాప
బుద్ధి కోపములం గొట్టఁ బూనుచుండు
నట్టి ధనమును గొనితెమ్ము! చుట్ట మగుచు ॥ 435

(16) సీ॥ ఏ నీదు తేజస్సు నెంతయు గ్రహియించి వరుణుఁ డాలోకంబు[1] కర మొసంగు
నే నీదు తేజస్సు నెంతయు గ్రహియించి యర్యముఁ డాలోక మందఁజేయు
నే నీదు తేజస్సు నెంతయు గ్రహియించి మిత్రుఁ డాలోకంబు నాత్త నొసఁగు
నే నీదు తేజస్సు నెంతయు గ్రహియించి స్తవముల విఖ్యాతిఁ జాలఁ గాంతు
గీ॥ నెవని తేజస్సు మూలాన నింద్రదేవ, కర్తృకంబైన రక్షల కలుఁగఁగలనొ!
యట్టి నీదు సుతేజస్సు నధికభక్తిఁ, గొల్చెదను నగ్నిదేవుండ! తల్చి నిన్ను 436

(17) గీ॥ ద్యుతిమదగ్నిదేవ! మతిమంతులకు సర్వ
సాక్షిభూతుఁ గర్మసహితు నిన్ను
సంగ్రహించునట్టి సజ్జనులెల్ల రు
త్కృష్ట భక్తు లనెడు కీర్తి గాంత్రు ॥ 437

(18,19) సీ॥ సుభగ! నిన్ గ్రహియించు శ్రోత్రియు లెల్లరు వేదిపయిం దాము వెలయఁగలరు
సుభగ! నిన్ ధరియించు శ్రోత్రియు లెల్లవా రభిషవంబును జేసి యమరఁగలరు
సుభగ! నిన్ వహియించు శ్రోత్రియు లెల్లరు బలమున ధనమును బడయఁగలరు
సుభగ! నిను వరించు శ్రోత్రియు లెల్లవా రాహుతి నీయంగ నరుఁగఁగలరు
గీ॥ సుభగ! నిన్ను భజించెడు సూరు లెల్లఁ, గాంక్షితంబుల నీవల్లఁ గాంచఁగలరు
యజ్ఞసంస్తుతులకు మాకు నగ్ని! నీదు, దానము శుభంబు నొసఁగంగఁ బూనఁగలదు ॥ 438

(20,21) సీ॥ అనలుఁడా! సంగ్రామమందు నీ చిత్తంబు కళ్యాణకరముగాఁ గలుఁగఁజేసి
యనులందు శత్రుల నంత మొందించుచు విజయంబులం గొని వేడ్క వెలసి
యభిభవకారియౌ నరిమండలంబును బ్రచుర బలంబునఁ బాడుచేసి
స్థిరమగు భక్తిచేఁ జేరు వైరుల నీవు దూరదేశమునకుఁ బారఁద్రోలి
గీ॥ చెలఁగుచుండుము! హవ్యముఁ జేతఁగొనుచు, నిన్ను భజియించెదము మేము సన్నుతులను
మను కృతాహితవహ్నికి ఘన సపర్య, లను నొనర్తుము పావకుండును బతి యగు ॥ 439

---

1. ఆలోకము = దృష్టి. (నే.వేం.స.శా.)

(22) గీ॥ జ్వాలచే శోభమానుఁడౌ జ్వలనుగూర్చి
స్తోత! గాన మొనర్చుము! స్తుతులతోడ
సూనృత స్తుత్యుఁడై యగ్ని సుఘృత ధార
చేత నాహూతుఁడై శక్తిఁ జేర్చు నెలమి ॥ 440

(23) గీ॥ ఉచిత ఘృతమునఁ బావకుం డూర్ధ్వగతిని
నిమ్నముగ శబ్దమును జేయ నేర్చు నప్పు
డసుర సూర్యుని వలె నతం డతిశయముగ
సహజరూపంబుఁ జూపెట్ట సాగుచుండు ॥ 441

(24) చ॥ మనుకృతుఁడై ద్యుతిం గలిఁగి మాన్యత వహ్ని సుగంధయున్ముఖం
బున నల హవ్య భాగ మిడు పూర్ణ మనస్సున దేవతాళి కిం
కొనరఁగ దేవ హోత యయి యూర్జిత యజ్ఞ విశిష్టుఁ డౌచు దీ
ప్తిని ధన సేవఁజేయుఁగద! తేజము నొందుచుఁ జావు వీడుచున్ ॥ 442

(25) క॥ అనలుఁడ! బలపుత్రుండా!
యనుకూల విశేషదీప్తి! యాహూతుండా!
మనుజుఁడను నేను గావునఁ
బనిగొని నీకాఁడ నౌదుఁ బరమ ప్రీతిన్ ॥ 443

(26) గద్యము॥

ఓ వాసకాగ్ని! మిథ్యాపవాదమునకు నిన్ను నేను నిందింపను. పాపమునకై నిన్నుఁ దూల
నాడను. మా స్తోత (అభిమతవచనంబుల) నిను నుద్దేశించి దుఃఖింపకుండుఁగాక!
దుర్మతు లగు శత్రువులు నాకుఁ గలుఁగకుందురు. వారు మాకు బాధలను
గలిఁగింపకుందురు ॥ 444

(27) క॥ పిత నెట్టులు పుత్రుఁడు స
న్మతిమంతు నొనర్చు నట్లు మాచేఁ బ్రీతిం
గృత యజ్ఞమందు హవ్యము
నతిభక్తి నొసంగు నగ్ని యమరులకుఁ గడున్ ॥ 445

(28) గీ॥ నీదు రక్షవలన నీ నికటస్థుఁడ
నౌచు నుందు వాసకాగ్ని! నేను
మనుజవరుఁడ నౌదు ఘన మగు నీ సేవఁ
జేయఁగలను భీతిఁ బాయకుండ ॥ 446

(29,30) గీ॥ నీదు పరిచర్యచే మేము నిన్ను మిగుల
భజనఁ జేసెదమయ్య! యో పావనాగ్ని!
నీ ప్రశంసలచేతను నీకు నొసఁగు
హవ్యమున నిన్ను భజియింతు మాదరమున ॥ 447

క॥ వసువా! ప్రకృష్ట బుద్ధీ!
యసమాన కర్త వనుచు ననెదరు నిన్నే
యసదృశు లగు నీ మిత్రులు
వెస రక్షలఁ గాంచి యన్న విస్తృతిఁ గనరే! ॥ 448

(31) సీ॥ సోమాభిషిక్తుఁడా! సుందర సోమము గ్రహియింపఁబడుచుండెఁ గనుము! దీని
ద్రవిణవంతుఁడ! నీకు ద్రవరూప సోమము గ్రహియింపఁబడుచుండెఁ గనుము! దీని
నీడవంతుఁడ! నీకు నిస్తుల సోమము గ్రహియింపఁబడుచుండెఁ గనుము! దీని
గమనీయ! ఋతుజాత! క్రాలు సోమరసంబు గ్రహియింపఁబడుచుండెఁ గనుము! దీని
గీ॥ నగ్నిదేవ! యుషస్సుల కధిక హితుఁడ, వౌదు రాత్రుల వస్తువు లన్నివిధుల
సుప్రకాశము నొందుచు శోభఁ దేలు, నట్టు లొనరింపవలవదె! యతిశయముగ ॥ 449

(32) గద్యము॥
సౌభరులు రక్షలను గోరి యగ్నికడకుఁ బోవుచున్నారు. వారు సహస్ర తేజో విశిష్టుఁడును
సమ్రాట్టును నగు దస్యునిచే స్తుతింపఁబడినవారలై చక్కఁగ నేతెంచఁగలరు ॥ 450

(33) గీ॥ అన్యులైనట్టి యగ్నులలో యగ్నిదేవ!
నీ సుశాఖాసమంబైన నికటమందు
నుండెదరు నేను నీ శక్తి మెండు చేసి
స్తోత వలె నన్ను మెలమిని జేతఁ గొనెద ॥ 451

(34) గీ॥ ద్యుతిమదాదిత్యులార! సుజ్యోతులార!
విగతవిద్రోహులార! యో విబుధులార!
హవ్యదులలోన శ్రేష్ఠుఁడౌ నగ్ని ప్రీతి
సుఫలముల నెల్ల నందడె! సుఖముఁ గోరి ॥ 452

(35) క॥ శుభకర శత్రుగణంబుల
కభిభవము నొనర్చునట్టి యాదిత్యులు! మీ
రభిభవమును శత్రువులకు
నభయంబునఁ జేయవలదె! యందరు మెచ్చన్ ॥ 453

గీ॥ వరుణమిత్రులార! పరమార్యముఁడ! యుష్మ
దీయ యజ్ఞమున కమేయ ప్రీతి
యుక్త మానసంబు నొగిఁ గల్గి నేతల
మౌదు మయ్యలార! సాదరముగ ॥ 454

(36) గీ॥ ఎలమిఁ బురుకుత్స పుత్రుఁడౌ నేసదస్యుఁ*
డనఘు లేఁబది సఖులను నందఁజేసెఁ
గావునన్ దాతృవరులలో ఘనుఁ డతండె
పతియు నార్యుఁడు శ్రేష్ఠుండు పరమవేది ॥ 455

(37) గద్యము॥

సువాసములు గలిఁగిన నదీఘట్టముల శ్యామలవర్ణము లగు వానికి నేతలును బూజనీయ
దానార్హములు నగు 280 గోవులకుఁ బతి యగు నేసదస్యుఁడు* ధనమును
నన్నమును నొసంగు ॥ 456

---

* ఈ 36-37 ఋగనువాదములలో నేసదస్యుఁడనియున్నది. కాని మూలములోఁ త్రసదస్యుఁడుగాఁ
బేర్కొనఁబడియున్నది.

## సూక్తమ్—20

ఋషిః—సోభరిః కాణ్వః

దేవతా—మరుతః

ఛందః—విషమా కకుప్, సమా సతోబృహతీ (ప్రగాథః)14-సతో విరాట్

(1) ఆ గన్తా మా రిషణ్యత ప్రస్థావానో మాప స్థాతా సమన్యవః ।
స్థిరా చిన్నమయిష్ణవః ॥ 485

(2) వీళుపవిభిర్మరుత[1] ఋభుక్షణ ఆ రుద్రాసః సుదీతిభిః ।
ఇషా నో[2] అద్యా గతా పురుస్పృహో యజ్ఞమా సోభరీయవః ॥ 486

(3) విద్మా హి రుద్రియాణాం శుష్మముగ్రం మరుతాం శిమీవతామ్ ।
విష్ణోరేషస్య [3]మీళ్హుషామ్ ॥ 487

(4) వి ద్వీపాని పాపతన్ తిష్ఠద్ దుచ్ఛునోభే యుజన్త రోదసీ ।
ప్ర ధన్వాన్యైరత శుభ్రఖాదయో యదేజథ స్వభానవః ॥ 488

(5) అచ్యుతా చిద్[4] వో అజ్మన్నా నానదతి పర్వతాసో వనస్పతిః ।
భూమిర్యామేషు రేజతే ॥ 489

---

1. మరుతఽఋభుక్షణఽఆ, 2. నోఽఅద్య, 3. మీళహుంషామ్, 4. వోఽఅజ్మన్నా. (వా.ప్ర.)

(6) అమాయ వో మరుతో యాతవే ద్యౌర్జిహీత[1] ఉత్తరా బృహత్ ।

యత్రా నరో దేదిశతే తనూష్వా త్వక్షాంసి బాహ్వోజసః ॥ 490

(7) స్వధామను శ్రియం నరో మహి త్వేషా[2] అమవన్తో వృషప్సవః ।

వహన్తే అహ్రుతప్సవః ॥ 491

(8) గోభిర్వాణో[3] అజ్యతే సోభరీణాం రథే కోశే హిరణ్యయే ।

గోబన్ధవః సుజాతాస[4] ఇషే భుజే మహాన్తో నః స్పరసే ను ॥ 492

(9) ప్రతి వో వృషదఞ్జయో వృష్ణే శర్ధాయ మారుతాయ భరధ్వమ్ ।

హవ్యా వృషప్రయావ్ణే ॥ 493

(10) వృషణశ్వేన మరుతో వృషప్సునా రథేన వృషనాభినా ।

ఆ శ్యేనాసో న పక్షిణో వృథా నరో హవ్యా నో వీతయే గత ॥ 494

(11) సమానమఞ్జ్యేషాం వి భ్రాజన్తే రుక్మాసో[5] అధి బాహుషు ।

దవిద్యుతత్యృష్టయః ॥ 495

---

1. హీతఽఉత్తరా, 2. త్వేషాఽఅమవన్తో, 3. గోభిర్వాణోఽఅజ్యతే, 4. సుజాతాసఽఇషే,

5. రుక్మాసోఽఅధి. (ప్రా.ప్ర.)

(12) త[1] ఉగ్రాసో వృషణ[2] ఉగ్రబాహవో నకిష్టనూషు యేతిరే ।
స్థిరా ధన్వాన్యాయుధా రథేషు వో ఽనీకేష్వధి శ్రియః ॥ 496

(13) యేషామర్ణో న సప్రథో నామ త్వేషం శశ్వతామేకమిద్ భుజే ।
వయో న పిత్ర్యం సహః ॥ 497

(14) తాన్ వన్దస్వ మరుతస్తాగ్ం[3] ఉప స్తుహి తేషాం హి ధునీనామ్ ।
అరాణాం న చరమస్తదేషాం దానా మహ్నా [4]తదేషామ్ ॥ 498

(15) సుభగః స వ[5] ఊతిష్వాస పూర్వాసు మరుతో వ్యుష్టిషు ।
యో వా నూనముతాసతి ॥ 499

(16) యస్య వా యూయః ప్రతి వాజినో నర[6] ఆ హవ్యా వీతయే గథ ।
అభి ష ద్యుమ్నైరుత వాజసాతిభిః సుమ్నా వో ధూతయో నశత్ ॥ 500

(17) యథా రుద్రస్య సూనవో దివో వశన్త్యసురస్య వేధసః ।
యువానస్తథేదసత్ ॥ 501

---

1. తఽఉగ్రాసో, 2, వృషణఽఉగ్ర, 3, తస్తాగ్ంఽఉప, 4. తదేష్యామ్, 5. సవఽఊతి,
6. నరఽఆ. (వ్రా.ప్ర.)

(18) యే చార్హన్తి మరుతః సుదానవః [1]స్మన్మీళ్హుషశ్చరన్తి యే ।
అతశ్చిదా న [2]ఉప వస్యసా హృదా యువాన[3] ఆ వవృధ్వమ్ ॥ 502

(19) యూన[4] ఊ షు నవిష్ఠయా వృష్ణః పావకాగ్ం[5] అభి సోభరే గిరా ।
గాయ గా[6] ఇవ చర్కృషత్ ॥ 503

(20) సాహా యే సన్తి ముష్టిహేవ హవ్యో విశ్వాసు పృత్సు హోతృషు ।
వృష్ణశ్చన్ద్రాన్న సుశ్రవస్తమాన్ గిరా వన్దస్వ మరుతో[7] అహ ॥ 504

(21) గావశ్చిద్ ఘా సమన్యవః సజాత్యేన మరుతః సబన్ధవః ।
రిహతే కకుభో మిథః ॥ 505

(22) మర్తశ్చిద్ వో నృతవో రుక్మవక్షస[8] ఉప భ్రాతృత్వమాయతి ।
అధి నో గాత మరుతః సదా హి వ[9] ఆపిత్వమస్తి నిధ్రువి ॥ 506

(23) మరుతో మారుతస్య న[10] ఆ భేషజస్య వహతా సుదానవః ।
యూయం సఖాయః సప్తయః ॥ 507

---

1. సన్మీళహూష, 2. దానఽఉప, 3. యువానఽఆ, 4. యూనఽఊషు, 5. పావకాగ్ంఽఅభి, 6. గాఽఇవ, 7. మరుతోఽఅహ, 8. వక్షసఽఉప, 9. వఽఆపిత్వ, 10. నఽఆ భేషజస. (వ్రా.ప్ర.)

(24) యాభిః సిన్ధుమవథ యాభిస్తూర్వథ యాభిర్దశస్యథా క్రివిమ్ ।
మయో నో భూతోతిభిర్మయోభువః శివాభిరసచద్విషః ॥ 508

(25) యత్ సిన్ధౌ [1]యదసిక్న్యాం యత్ సముద్రేషు మరుతః సుబర్హిషః ।
యత్ పర్వతేషు భేషజమ్ ॥ 509

(26) విశ్వం పశ్యన్తో బిభృథా తనూష్వా తేనా నో[2] అధి వోచత ।
క్షమా రపో మరుత[3] ఆతురస్య న[4] ఇష్కర్తా విహ్రుతం పునః ॥ 510

ఇతి
షష్ఠోఽష్టకే ప్రథమోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—20

ఋషి—కాణ్వుఁడైన సోభరి*
దేవత—మరుద్గణము

(1) గీ॥ గమనశీల మరుత్తులు! సుమతి మాకు
హింసఁ జేయకయుండుఁడీ! హెచ్చు క్రోధ
యుక్తులై పర్వతంబుల నొగిఁ గదల్చి
మీరు భయదులు కాకుండ మెలఁగుఁ డెలమి ॥ 457

1. యదసిక్న్యాం, 2. నో౽అధి, 3. మరుత౽ఆతురస్య, 4. న౽ఇష్కర్తా. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము 43,53,63,69 పుటలు) 19, 20, 21, 22 సూక్తములకు ఋషి "సౌభరి"గాను 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "సోభరి"గాను, శ్రీనేమానివారు వ్రాసిరి. 19వ సూక్తములోని 2వ, ఋగనువాదములోను, 20వ సూక్తములోని 2,8,19 ఋగనువాదములలోను, 22వ సూక్తములోని 15వ ఋగనువాదములోను, "సౌభరి"యని శ్రీనేమానివారు వ్రాసిరి. కాని వీనిలో నెక్కడను "సౌభరి" లోని "సౌ" వక్రకమయుక్తమై యతిస్థానమునఁ బ్రయుక్తము కాలేదు సంస్కృతమూలమున కనుగుణముగాను, శ్రీనేమానివారు ఋషిదేవతల పట్టికలో "సోభరి"యని పేర్కొన్న దాని కనుగుణముగాను, దెలుఁగున సవరించుట జరిగినది. 582వ పుటలోని 423వ పద్యములోను, పుట్‌నోటులోని రెండవ పంక్తిలోను నున్న "సౌభరి" శబ్దము పొరపాటున ముద్రిత మైనది. సంస్కృతమున నొకానొక ప్రతిలో "సోభరిః" "సోభిరిః" పాఠాంతరములు కూడఁ గన్పించుచున్నవి.

(2) ఉ॥ దీప్తి నివాసయుక్తు లగు దివ్య మరుత్తులు! మీర లెంతయున్
దీప్తి పరీతనేమియుత దివ్య రథంబును నెక్కి యంతటన్
వ్యాప్తిని జెందు సోభరిని బంధురప్రీతిని గోరుచుండి సం
దీప్తి నొసంగు నన్నమును దెచ్చుచు నిష్టికి రారె! వేడ్కతోన్ ॥ 458

(3) గీ॥ కర్మవంతుని విష్ణుని గాంక్షణీయ
జలసమూహము నొసఁగెడు సరస రుద్ర
పుత్రులైన మరుత్తుల పూర్ణబలము
నెఱిఁగియుండినవారమే కరము మేము ॥ 459

(4) ఉ॥ ఆయుధవంతులై కదలునప్పుడు మీ రిలఁ గల్గు దీవులున్
బాయక నాశ మొందు మరి బంధుర సుస్థిర వస్తు సంతతుల్
మాయ మగున్ దివిన్ భువియు మానక కంపము నొందువారిఁ దా
నాయితధారగా వెడలి యంతటఁ జేరును నో మరుద్వరుల్! ॥ 460

(5) గీ॥ మీర లేతెంచియున్నచో మేఘవితతి
వృక్ష ముఖ్యంబు లన్నియు విపుల శబ్ద
మును నొనర్చును నీ పృథ్వియును వణంకు
చుండుఁగాదె! మరుత్తులు! మెండు ప్రకృతి ॥ 461

(6) గద్యము॥

ఓ మరుద్గణమా! మీ దళము తిరుగుటకై ద్యోలోకమును బృహదంతరిక్షమును ద్యజించి యూర్ధ్వగత మయ్యెను. బలవంతులు నేతలు నగు మరుత్తులు దీప్తాభరణములఁ దమ శరీరముల నలంకరించుకొనుచున్నారు ॥ 462

(7) గీ॥ బలముగలిఁగి మిగుల వర్షణ దేహులై
యకుటిల స్వరూపమందు నేత
లౌ మరుత్తు లన్న మంద మహాశోభఁ
దాల్చుచున్నవారు తఱచు ప్రీతి ॥ 463

(8) గద్యము॥

సోభరి ఋషిగణము శబ్దముచే హిరణ్మయరథమధ్య దేశమునందు మరుత్తుల బాణములను
వ్యక్తపరచుచున్నది. గోమాతృక జన్మము గలవారును, మహానుభావులును నగు
మరుత్తులు మా యన్నభోగులును ప్రీతిప్రదులును నగుదురుగాక! ॥ 464

(9) గీ॥ అల మరుత్తులకుం బుష్టి నందఁజేయ
హవ్య మొసఁగరె! యధ్వర్యులార! మీర
లందుచే వారు సేక్తలై యున్నచోట్ల
కుం బ్రకృష్టంబుగాఁ బోవకుండ్రె? వేగ ॥ 465

(10) గద్యము॥

నేత లగు మరుత్తులు సేచన సమర్థము నశ్వయుక్తము, వృష్టిప్రదరూపయుతము,
వృష్టిప్రదము, నాభియుక్తము నగు రథమందుఁ గూర్చుండి హవ్యము కడ
కనాయాసముగా శ్యేనపక్షి వలె వచ్చుఁగాక! ॥ 466

(11) గద్యము॥

మరుదభివ్యంజకము లగు నాభరణంబు లొక్క రూపు గలవె! దీప్యమాన హిరణ్మయ హారములు
వారి కంఠములయందు శోభించును. బాహువులపై నాయుధము లత్యంతము
వెలుంగుచుండును ॥ 467

(12) గీ॥ ఉగ్రబాహుయుక్తు లుగ్రవృష్టిప్రదు
లౌ మరుత్తు లెల్ల రమల నైజ
దేహమునకు రక్షఁ దివిరి చేయఁగ వారి
హింసఁ బెట్టఁగలరె! యితరులు భువి ॥ 468

గీ॥ మీ రథంబుపైని మేలగు నాయుధ
ములు ధనుస్సమూహములు తిరములు
గాఁగ దృఢములుగను గ్రాలుచుండును గాన
జయము మీకుఁ గలుఁగు జన్యతతుల ॥ 469

(13) చ॥ ఉదకము రీతి నంతట మహోన్నత విస్తృతి నొంది దీప్తులై
గొద కడుఁజేయు నా ఘన మరుత్తుల నామ మదొక్కఁటై సదా
స్పదమయి పైతృకంబయి ప్రశస్తిని సుస్థిర మౌచునుండు నా
మదకరమైన యన్నతతిమాటిక్కఁ సుభోగ్యసమర్థ మౌన్గదా! ॥ 470

(14) ఉ॥ వందన మాచరింపు మల బంధుర మారుత పంక్తి కీవు పె
ల్గొందెడు నార్య భూపతికిఁ గుచ్ఛిత సేవకుఁ డట్లు కంపముం
బొందెడు భంగిఁ జేయు నల పూజ్య మరుత్తుల కేను భృత్యుఁడన్
బందువ! వారి దాన మతిభాగ్యమహత్వయుతంబు చూడఁగన్ ॥ 471

(15) గీ ॥ అవనమును బొంది మీవల్ల నఖిల జనులు
దివసములయందు సుభగులై తేజరిల్లు
దురుగదా! స్తోత లెల్లరు శోభఁ దేల
మీకు బంధువులేగద! మిత్రులార! ॥ 472

(16) ఉ॥ నేతలు! మీరు హవ్యముల నిత్య మొసంగెడు వారి హవ్యముం
బ్రీతిగఁ జూడఁ బొందు! కడు భీతిని గంతముఁ బుట్టఁ జేయు ప్ర
ఖ్యాత మరుత్సమూహములఁ గ్రాలెడు నన్నముఁ జేతఁగొంచు వి
స్ఫీత సుఖంబుఁ గోరికొని వీర మరుత్తులఁ గొల్వఁ బ్రోవుఁడీ! ॥ 473

(17) మత్తభద్రము† ॥
రుద్రపుత్రకు లసుర హంతలు రూఢ యౌవనవంతులై
భద్రమైన నణస్సు వీడుచు వచ్చి యే నుతివల్లి మా
క్షుద్రకాంక్షిత మెల్లఁ దీర్తురొ! సూటి నా స్తుతిగీతి ని*
ర్నిద్రఁ బొందుచుఁ గాంక్షితంబుల నిత్య మీర లొసంగరే! । 474

(18) గద్యము॥

దాత లగు నే యజమానులు మరుత్తులకుఁ బూజఁ జేయుదురో! యెవ్వరు స్తోతలకు
హవ్యమూలమున నర్చన లిడుదురో! యా యుభయ విధము లగు వారితోను
మేము సమానులము. మా చెంతకు నత్యంత ధనప్రద మనస్సుతో నా
మరుత్తులు వచ్చెదరు గాక! ॥ 475

† ఇది పంస్థాన విషమవృత్తము. చూ. పీఠిక.

* సూటి నా స్తోత్రాళినిన్. నిద్రఁబొందుచు. (వ్రా. ప్ర. పా.)

(19) గద్యము॥

ఓ సోభరీ! నిత్యతరుణులు, నత్యంత వృష్టిప్రదులును, పావకులు నగు మరుత్తులు మిక్కిలి మంతన వాక్యములచేఁ జక్కఁగ, గృషకగణము బలీవర్థమును నుతించునట్లు స్తుతింపుము! ॥ 476

(20) చ॥ కదనములన్ మరుత్తులను గ్రన్ననఁ బిల్చిన వార లెల్ల స
ముద్మదమున శత్రుమండలికిఁ బూర్ణ తిరస్కృతిఁ జేయువారు స
న్మద భరితాత్ములై వెలయు మల్లుల చందము తుష్టి నొందుచున్
బెదరక వాక్యమూలమున వేఁడెద మట్టి మరుద్గణంబులన్ ॥ 477

(21,22,23) గద్యము॥

సమాన క్రోధశీలు రగు మరుత్తులారా! గోసమూహ మేకజాతి గలదియై సమాన మైత్రిని బొంది నలుదిశల మేయుచున్నది. నృత్యకారులారా! యాభరణోజ్జ్వలవక్షస్థలులారా! మనుష్యుఁడు మీతోఁ జెలిమిఁజేయ వెడలుచున్నాఁడు. కాఁబట్టి మా పక్షముఁబూని మాట లాడుఁడు! సర్వదా ధారణీయ మగు యజ్ఞమునందు మాకు సంబంధము కలదు. దాతలు గమనశీలురు, సఖులు నగు రుద్రగణమా! మరుత్సంబంధ మగు నౌషధమును దెండు! ॥ 478

(24, సీ॥ ఎద్దానిఁ బూనుచు నెల్ల సంద్రంబులఁ గాపాడితిరొ! మీరు కరుణతోడ
25) నెద్దానిఁ బూనుచు నెల్ల శత్రువులను హింసించితిరొ! మిర లెలమితోడ
నెద్దానిఁ బూనుచుఁ దృష్ణుఁ డనువాని రక్షించితిరొ! మీరు రాణతోడ
నెద్దానిఁ బూనుచు నెల్ల సుఖంబులఁ బుట్టించువారలొ! పుష్టితోడ
గీ॥ నట్టి కళ్యాణకర రక్ష నస్మదీయు, లకు సుఖంబు లొసంగుచు సకల సింధు
నద మహీధర సిక్నుల నుదధియందు, నున్న యోషధులను దెండు! వన్నెమీర ॥ 479

(26) గీ॥ సకల మైనట్టి యౌషధ సరణి మీరు
మా శరీరార్థమై తెండు! మరువకుండ
వానితోడఁ జికిత్సల వలసినట్లు
చేయుచుంద్రు మరుత్తులు చెలువు మిగుల ॥ 480

క॥ మాలో నుండెడు రోగుల
కే లెలన్ రోగములను నెడఁజేయుదురో!
యా లీలన్ మా బాధలఁ
ద్రోలుచుఁ దనువులకుఁ బుష్టిఁ దుష్టి నొసఁగుఁడీ! ॥ 481

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
షష్ఠామాష్టకమునఁ బ్రథమాధ్యాయము
సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## అష్టమం మండలమ్
### షష్ఠోఽష్టకః—ద్వితీయోఽధ్యాయః

### అనువాకః—4, సూక్తమ్—21

ఋషిః— సోభరిః కాణ్వః
దేవతా— ఇన్ద్రః, 17-18- చిత్రః
ఛందః— విషమా కకుప్,సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) వయము త్వామపూర్వ్య స్థూరం న కచ్చిద్ భరన్తోఽవస్యవః ।
వాజే చిత్రం హవామహే ॥ 511

(2) ఉప త్వా కర్మన్నూతయే స నో యువోగ్రశ్చక్రామ యో ధృషత్ ।
త్వామిద్ధ్యవితారం వవృమహే సఖాయ[1] ఇన్ద్ర సానసిమ్ ॥ 512

(3) అ యాహీమ[2] ఇన్దవో ఽశ్వపతే గోపత[3] ఉర్వరాపతే ।
సోమం సోమపతే పిబ ॥ 513

1. సఖాయఽఇన్ద్ర, 2. యాహీమఽఇన్దవో, 3. గోపతఽఉర్వరా. (వా.ప్ర.)

(4) వయం హి త్వా బన్ధుమన్తమబన్ధవో విప్రాస[1] ఇన్ద్ర యేమిమ ।

యా తే ధామాని వృషభ తేభిరా గహి విశ్వేభిః సోమపీతయే ॥ 514

(5) సీదన్తస్తే వయో యథా గోశ్రీతే మధౌ మదిరే వివక్షణే ।

అభి త్వామిన్ద్ర నోనుమః ॥ 515

(6) అచ్ఛా చ త్వైనా నమసా వదామసి కిం ముహుశ్చిద్ వి దీధయః ।

సన్తి కామాసో హరివో దదిష్ట్వం స్మో వయం సన్తి నో ధియః ॥ 516

(7) నూత్నా[2] ఇదిన్ద్ర తే వయమూతీ[3] అభూమ నహి నూ తే[4] అద్రివః ।

విద్మా పురా పరీణసః ॥ 517

(8) విద్మా సఖిత్వముత శూర భోజ్యమా తే తా వజ్రిన్నీమహే ।

ఉతో సమస్మిన్నా శిశీహి నో వసో వాజే సుశిప్ర గోమతి ॥ 518

(9) యో న[5] ఇదమిదం పురా ప్ర వస్య[6] ఆనినాయ తము వః స్తుషే ।

సఖాయ[7] ఇన్ద్ర మూతయే ॥ 519

---

1. విప్రాసఽఇన్ద్ర, 2. నూత్నాఽఇదిన్ద్ర, 3. మూతీఽఅభూమ, 4. తేఽఅద్రివః, 5. నఽఇదం, 6. వస్యఽఆనినాయ, 7. సఖాయఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(10) హర్యశ్వం సత్పతిం చర్షణీసహం స హి ష్మా యో[1] అమన్దత ।
ఆ తు నః స వయతి గవ్యమశ్వ్యం స్తోతృభ్యో మఘవా శతమ్ ॥ 520

(11) త్వయా హ స్విద్ యుజా వయం ప్రతి శ్వసన్తం వృషభ బ్రువీమహి ।
సంస్థే జనస్య గోమతః ॥ 521

(12) జయేమ కారే పురుహూత కారిణో ఽభి తిష్ఠేమ దూఢ్యః ।
నృభిర్వృత్రం హన్యామ శూశుయామ [2]చాఽవేరిన్ద్ర ప్ర ణో ధియః ॥ 522

(13) అభ్రాతృవ్యో[3] అనా త్వమనాపిరిన్ద్ర జనుషా సనాదసి ।
యుధేదాపిత్వమిచ్ఛసే[4] ॥ 523

(14) నకీ రేవన్తం సఖ్యాయ విన్దసే పీయన్తి తే సురాశ్వః ।
యదా కృణోషి నదనుం సమూహస్యాదిత్ పితేవ హూయసే ॥ 524

(15) మా తే[5] అమాజురో యథా మూరాస[6] ఇన్ద్ర సఖ్యే త్వావతః ।
ని షదామ సచా సుతే ॥ 525

---

1. యోఽఅమన్దత, 2. చావేరిన్ద్ర, 3. అభ్రాతృవ్యోఽఅనా, 4. మిచ్ఛతే, 5. తేఽఅమాజురో,
6. మూరాసఽఇన్ద్ర. (బ్రా.ప్ర.)

(16) మా తే గోదత్ర నిరరామ రాధస1 ఇన్ద్ర మా తే గృహామహి ।
2దృళ్హా చిదర్యః ప్ర మృశాభ్యా భర న తే దామాన3 ఆదభే ॥ 526

(17) ఇన్ద్రో వా ఘేదియన్మఘం సరస్వతీ వా సుభగా దదిర్వసు ।
త్వం వా చిత్ర దాశుషే ॥ 527

(18) చిత్ర4 ఇద్ రాజా రాజకా ఇదన్యకే యకే సరస్వతీమను ।
పర్జన్య ఇవ తతనద్ధి వృష్ట్యా సహస్రమయుతా దదత్ ॥ 528



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—ద్వితీయాధ్యాయము

### అనువాకము—4, సూక్తము—21

ఋషి—కణ్వపుత్రుఁడు సోభరి*
దేవత—1-16-ఇంద్రుఁడు, 17,18-చిత్రరాజుదానము

(1) గీ॥ ఓయి పూర్వేంద్ర! వినుమ! యమేయు నిన్నుఁ
ప్రోషణ మొనర్చుచున్ రక్షఁ బొందఁ బ్రీతిఁ
బిలుచుచున్నార మనులందు వెలుఁగు నీవు
పెక్కు రూపులఁ దాల్తువు పెద్ద వగుచు ॥ 482

1. రాధస ఇన్ద్ర. 2. దృళ్హా. 3. దామాన్ ఆదభే. 4. చిత్ర ఇద్రాజా రాజకా ఇదన్యకే. (వ్రా.ప్ర.)

* చూ-594వ పుటలో ఋషి కిచ్చిన ఫుట్‌నోటు.

(2,3,4) సీ॥ ఇంద్రుఁడా! శత్రుల నెల్లఁ జంపెడివాఁడ వతి యౌవనాఢ్యుఁడ వశ్వపతివి
మాకు సఖుండవు మాన్యోర్వరాపతి వఖిల గోగణపతి వత్యుదగ్ర
మూర్తివి రక్షలఁ బొందించువాఁడవు వరణీయుఁడవు మాకుఁ బరమ సోమ
పతివౌదు వింకను భజనీయుఁడవు నీవు సరససోమముచెంత కరుగఁదెమ్ము!
గీ॥ బంధువులు లేనివారము పండితులము, బంధువంతుఁడ వౌదువు వాసవుండ!
నీకు మిత్రుల మగుదుము నీవు తేజ, మును వహించుచు సోమముఁ బుచ్చుకొనుము! ॥ 483

(5) గీ॥ గవ్య మిశ్రితమును మదకరము నాక
గతి సుహేతువు నగు భవత్కాంత సోమ
మును నుతించుచున్నాము మోద మలరఁ
బశులను బోలి వసియించి వాసవుండ! ॥ 484

(6) గద్యము ॥

ఓ యింద్రా! స్తోత్రములతోఁ గూడిన నీకు నభిముఖముగ నేము స్తవ మొనర్చెదము. నీవు మాటిమాటికిఁ జింతిల్లఁగా నేల? ఓ హరియుతుఁడా! మాకుఁ గోర్కెలు గలవు. నీవు దాతవు! మా కర్మ యంతయు నీ నికటమునఁ గలదు ॥ 485

(7) క॥ నూతనుల మగుచు నీదగు
నూతను గొని వజ్రి! నీ మహోన్నతి పూర్వం
బే తీరునైన నెరుఁగము
ఖ్యాతం బగు దానిఁ దెలియఁగల్గితి మిపుడే! ॥ 486

(8) క॥ శూరుఁడ! నీ భోజ్యముల న
పార సఖిత్వంబు నెఱిఁగి వర్ధిల్లితి నా
కారణమున నీ మైత్రి న
పార ధనం బిమ్మటంచుఁ బ్రార్థింతు నినున్ ॥ 487

క॥ సుందర హను సంయుతుఁడా!
నంద ప్రదవాసదాత యగు నింద్రుఁడు ని
షంద మగు గోసమూహము
చెందిన యన్నంబు ప్రీతిఁ జేర్చుత! మాకున్ ॥ 488

(9) క॥ తొలుతను నే యింద్రుఁడు మా
కెలమిని నీ ధనము తెచ్చియిచ్చెను? మిత్రుల్!
బలయుతుఁ డగు నా యింద్రుని
నిల మీ యవనంబు గోరి యేను నుతింతున్ 489

(10) గీ॥ సాధుపాలకుఁడై యశ్వసహితుఁ డగుచు
శాత్రవుల [1]కభిభవంబును జరుపునట్టి
నింద్రుఁ దద్ధనమును బొంది యెసఁగు జనుఁడు
సంస్తుతించును వానిని సరసమతిని ॥ 490

గీ॥ ధనదుఁ డగు నింద్రదేవుఁడు తనకు మేము
స్తోతల మటంచుఁ దలఁచుచు సుందరాశ్వ
గో సమూహశతంబులఁ గూర్చుఁగాక!
మా కనుచుఁ గోరుచుంటి మస్తోక లీల ॥ 491

(11) గీ॥ ఎల్లఁ గోర్కెలఁ దీర్చెడు నింద్రదేవ!
నీ సహాయముఁ గోరుచు నేను గో వి
శిష్టలోకయుతం బగు శ్రేష్ఠయుద్ధ
మందు శత్రుగణంబుల నడఁచఁగలను ॥ 492

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్తమైనది.

(12) సీ॥ హింసాకరగణంబు నెల్ల యుద్ధంబులఁ బరిమార్చి విజయంబుఁ బడయఁగలను
పాపాత్ములకుఁ బరాభవమును గల్పించి దూరంబుగా వారిఁ ద్రోలఁగలను
సరసమరుత్తుల సాహాయ్యమున వృత్రహతకుని గర్వంబు నడఁచఁగలను
భక్తిపూర్ణుఁడ నౌచుఁ బరమకర్మల నెల్ల వృద్ధిఁ బొందించుచు వెలుఁగఁగలను
గీ॥ గాన నో యింద్రదేవుఁడా! కర్మ కెల్ల, నవన మొసఁగుచు నుండు! మా సవనమందు
నోయి పురుహూత! మా కోర్కె లుచితరీతిఁ సఫలములుగా నొనర్చుము! సత్వరముగ॥ 493

(13,14) గద్యము॥

ఓయి యింద్రుఁడా! నీవు జన్మావధి శత్రురహితుండవు! చాలకాలమునుండి బంధుర హితుఁడవు!
నీ వే బంధుత్వమును బడయ నిచ్ఛగింతువో! దానిని యుద్ధముల ద్వారా సంపాదింపుము!
ధనవంతుఁ డగు మానవునితో నెవ్వఁడు బంధుత్వమును గల్పించుకొనఁడు?
సురాప్రమత్తుఁ డగు జనుఁడు నీకు హింసను గల్పించును. మనుష్యుని
విషయమై కాపట్యము నెపుడు విడచెదవో! యపుడు వాఁడు
పిత వలె ని న్నాహ్వానించును ॥ 494

(15) గీ॥ నిన్నుఁ గోరిన విధమున నేను సురలఁ
జెలిమిఁ గోరెద సోమము చెందకుండ
నుండ నో యింద్ర! సోమము మెండుగున్న
నొక్కచోట వసింతును నిక్కముగను ॥ 495

(16,17) సీ॥ మేము నీవారము మిక్కిలి ధనవంతు లగుదు మన్యుల కాచ మడుగఁబోము
సామివి నీ వింద్ర! సారధనం బెల్ల మా చెంత నునుచుము! మరువకుండఁ
ద్వద్దాన సంపత్తిఁ దప్పక హింసింపఁ దగినవా రెవ్వరు? ధరణియందు
హవ్యదాయిని నేను భవ్యశక్రుఁడ! నీవు దానంబు నిడెదవా? ధనము నాకు
గీ॥ సకలసౌభాగ్యవతి! సరస్వతి! ముదాన, నీ వొసంగెదవా? నాకు నిఖిలధనము
చిత్రుఁడా నీవు ధనము విచిత్రరూప, దానము నొసంగనుందువా? ధర్మబుద్ధి 496

(18) గద్యము॥

మేఘము వృష్టిచేఁ పృథ్విని సంతోషపరచునట్లు సరస్వతీతీరమునందు వాసముఁ జేయు నన్యరాజులను జిత్రరాజు సహస్రము లయుతములు పరిమితి గల ధనముచేఁ బ్రీతులఁగా నొనర్చెను ॥ 497

## సూక్తమ్—22

ఋషిః— సోభరిః కాణ్వః

దేవతా—అశ్వినౌ

ఛందః—1-6-విషమా బృహతీ,సమా సతోబృహతీ (ప్రగాథః)

7-బృహతీ, 8-అనుష్టుప్, 11-కకుప్. 12-మధ్యేజ్యోతిః,

9,13,15,17- కకుప్, 10,14,16,18- సతోబృహతీ (ప్రగాథః)

(1) ఓ త్యమహ్వ[1] ఆ రథమద్యా దంసిష్ఠమూతయే ।

యమశ్వినా సుహవా రుద్రవర్తనీ [2]ఆ సూర్యాయై తస్థథుః ॥ 529

(2) పూర్వాపుషం[3] సుహవం పురుస్పృహం భుజ్యుం వాజేషు పూర్వ్యమ్ ।

సచనావన్తం సుమతిభిః సోభరే విద్వేషసమనేహసమ్ ॥ 530

(3) ఇహ త్యా పురుభూతమా దేవా నమోభిరశ్వినా ।

అర్వాచీనా స్వవసే కరామహే గన్తారా దాశుషో గృహమ్ ॥ 531

1. మహ్వఽఆ, 2. రుద్రవర్తనీఽఆ సూర్యాయై, 3. పూర్వాయుషం. (వా.ప్ర.)

(4) యువో రథస్య పరి చక్రమీయత[1] ఈర్మాన్యద్ వామిషణ్యతి ॥
అస్మాగ్ం[2] అచ్ఛా సుమతిర్వాం శుభస్పతీ[3] ఆ ధేనురివ ధావతు ॥ 532

(5) రథో యో వాం త్రివన్ధురో హిరణ్యాభీశురశ్వినా ।
పరి ద్యావాపృథివీ భూషతి శ్రుతస్తేన నాసత్యా గతమ్ ॥ 533

(6) దశస్యన్తా మనవే పూర్వ్యం దివి యవం వృకేణ కర్షథః ।
తా వామద్య సుమతిభిః శుభస్పతీ[4] అశ్వినా ప్ర స్తువీమహి । 534

(7) ఉప నో వాజినీవసూ యాతమృతస్య పథిభిః ।
యేభి స్తృక్షిం వృషణా త్రాసదస్యవం మహే క్షత్రాయ జిన్వథః ॥ 535

(8) అయం వామద్రిభిః సుతః సోమో నరా వృషణ్వసూ ।
ఆ యాతం సోమపీతయే పిబతం దాశుషో గృహే ॥ 536

(9) ఆ హి రుహతమశ్వినా రథే కోశే హిరణ్యయే వృషణ్వసూ ।
యుఞ్జాథాం పీవరీరిషః ॥ 537

---

1. మీయతఽఈర్మా. 2. అస్మాగ్ంఽఅచ్ఛా. 3. శుభస్పతీఽఆ. 4. శుభస్పతీఽఅశ్వినా. (వ్రా.ప్ర.)

(10) యాభిః పక్థమవథో యాభిరధ్రిగుం యాభిర్బభ్రుం విజోషసమ్ ।
తాభిర్నో మక్షూ తూయమశ్వినా గతం భిషజ్యతం యదాతురమ్ ॥ 538

(11) యదధ్రిగావో[1] అధ్రిగూ ఇదా చిదహ్నో[2] అశ్వినా హవామహే ।
వయం గీర్భిర్విపన్యవః ॥ 539

(12) తాభిరా యాతం వృషణోప మే హవం విశ్వప్సుం విశ్వవార్యమ్ ।
ఇషా మంహిష్ఠా పురుభూతమా నరా యాభిః క్రివిం వావృధుస్తాభిరా గతమ్ ॥ 540

(13) తావిదా చిదహానాం తావశ్వినా వన్దమాన[3] ఉప బ్రువే ।
తా[4] ఉ నమోభిరీమహే ॥ 541

(14) తావిద్ దోషా తా[5] ఉషసి శుభస్పతీ తా యామన్ రుద్రవర్తనీ ।
మా నో మర్తాయ రిపవే వాజినీవసూ పరో రుద్రావతి ఖ్యతమ్ ॥ 542

(15) ఆ సుగ్మ్యాయ సుగ్మ్యం ప్రాతా రథేనాశ్వినా వా సక్షణీ ।
హువే పితేవ సోభరీ ॥ 543

---

1. గావోఽఅధ్రిగూఽఇదా, 2. చిదహ్నోఽఅశ్వినా, 3. మానఽఉప, 4. తాఽఉః, 5. తాఽఉషసి.(ప్రా.ప్ర.)

(16) మనోజవసా వృషణా మదచ్యుతా మక్షంగమాభిరూతిభిః ॥
ఆరాత్తాచ్చిద్ భూతమస్మే[1] ఒ అవసే పూర్వీభిః పురుభోజసా ॥ 544

(17) ఆ నో[2] ఒ అశ్వావదశ్వినా వర్తిర్యాసిష్టం మధుపాతమా నరా ।
గోమద్ దస్రా హిరణ్యవత్ ॥ 545

(18) సుప్రావర్గం సువీర్యం సుష్ఠు వార్యమనాధృష్టం రక్షస్వినా ।
అస్మిన్నా వామాయానే వాజినీవసూ విశ్వా వామాని ధీమహి ॥ 546

## సూక్తము—22

ఋషి—కణ్వపుత్రుఁడు సోభరి*

దేవత—అశ్విద్వయము

(1) గీ॥ అశ్వియుగ్మమ! సుందరాహ్వాన వీర
సూర్యుని నిమిత్తమై నీవు సొగసు మీను
నెట్టి రథ మెక్కి-యుంటివో! యట్టి రథముఁ
బిలుచుచున్నాము రక్షలు కలుఁగ మేము ॥ 498

1. మస్మేఒఅవసే. 2. నోఒఅశ్వావ. (ప్రా.ప్ర.)

* చూ. 594వ పుటలోని ఋషి కిచ్చిన పుట్‌నోటు.

(2) సీ॥ పూర్వజనాళిని బోషించునది సుందరాహ్వానయుత మౌచు నమరునదియు
సర్వకాంక్షితమయి సర్వరక్షకమయి జన్యంబులన్ ముందు జరుగునదియు
సకలపూజ్యంబయి శాత్రవ విద్వేషకారియై యంతటఁ జేరునదియు
నే యుపద్రవమును నెరుఁగక యంతటఁ ద్వరితంబుగాఁ దాను దిరుగునదియు
గీ॥ నైన యరదము సోభరీ! యతిశయముగ, శుభకరంబైన కమనీయ సూక్తితోడ
సంస్తుతింపుచు సర్వదా సరసరీతి, సుప్రసన్నముగాఁజేసి శోభఁ గనుము! ॥ 499

(3) గీ॥ స్తుతి విశిష్టము శాత్రవతతినిహంత
హవ్యదాయి గృహంబున కరుగునట్టి
యశ్వియుగ్మమ! యీ కర్మ కవన మీయు
మనుచు మీకు నమస్కార మాచరింతు ॥ 500

(4) ఉ॥ మీ రథ చక్ర మొక్కటి యమేయగతిన్ జను నాకభూమికిన్
వే రగు చక్ర మేఁగు నతివేగము మీ వెనువెంటఁ గావునన్
మీరలు సర్వకార్యముల మెచ్చెడు నట్టులు చేసి మమ్ములం
జేరుఁడు! మాకు నెల్ల విధి శ్రీల నొసంగుట కశ్వియుగ్మమా! ॥ 501

గీ॥ జలపతిద్వయంబ! లలితమై కళ్యాణ
మొసఁగు నీ సుబుద్ధి యసమ గోవు
ననుసరించి మాపయిని బ్రవర్తిల్లెడుఁ
గాక! ననుచుఁ గోరి ప్రాలుచుందు ॥ 502

(5) గద్యము ॥

ఓ యశ్విద్వయమా! మీ రథమందు బంధురత్రయము (సారథి స్థానములు) కలదు. అది ప్రసిద్ధమై ద్యావాభూములను బరిభవించును. నాసత్యద్వయమా! మీర లా రథము నధివసించి రండు! ॥ 503

(6) గీ॥ అతిపురాతన దివియందు నమరు జనము
మనువున కొసంగుచున్ మీరు ఘనములైన
†లాంగలంబులచే యవలను విశేష
కర్షణంబును జేసిరి కనుఁడు! నుతుల 504

(7) గీ॥ తక్షి యను వానికిన్ హెచ్చు ధనము నీయ
నెట్టి సుపథంబుఁ బట్టిరో! యట్టి యజ్ఞ
పథమునం బడుచు మీరు మా పజ్ఞ కరుగఁ
దెండు! కాంక్షిత దాతలు! నిండు దయను ॥ 505

(8) ఉ॥ నేతలు కాంక్షితప్రదులు నిస్తుల విత్తము గల్గునట్టి మీ
రీ తరిఁ బ్రస్తరంబుఁ గొని యిప్పుడె తీసిన సోమ మెల్ల సం
ప్రీత మనస్సుతో నెటులు భీతిని జెందక వచ్చి మా గృహ
వ్రాతములందుఁ గ్రోలరఁటె! పావన మైన మహాశ్వియుగ్మమా! 506

(9) గీ॥ ధనవిశిష్టాశ్వివరులార! ఘనులు మీరు
స్వర్ణరూపాయుధములకు స్థాన మైన
యరదమును నెక్కి యిచ్చట కరుగఁదెంచి
సోమరసమును గ్రోలుఁడీ! నీమ మలర ॥ 507

(10) సీ॥ అశ్విద్వయంబ! యే యవనంబుచేఁ బక్థుఁ డను వాని కాపాడి యమరినారొ!
యశ్విద్వయంబ! యే యవనంబుచే నధ్రిగునకు సంప్రీతిని గూర్చినారొ!
యశ్విద్వయంబ! యే యవనంబుచే బభ్రు నంచితగతిని రక్షించినారొ!
యశ్విద్వయంబ! యే యవనంబుచే వానిఁ బ్రీతునిగాఁ జేసి వెడలినారొ!
గీ॥ యట్టి యవనంబుచేత నత్యంత శీఘ్ర, గమనమున వచ్చి మమ్ములఁ గాంచి పిలుచు
వారికిఁ జికిత్సఁ జేయుచుఁ బరమ సుఖము, గలుగఁజేయుఁడు! విఖ్యాతిఁ గలిఁగి మీరు॥ 508

† ప్రథమ మండలములో నశ్వదేవతలు తామే స్వయముగా యాగప్రియులగు నార్యులకు వ్యవసాయపద్ధతుల బోధించునట్లును నెనిమిదవ మండలమందును నా విషయమే వర్ణింపఁబడెను. ఇంకను బెక్కు మంత్రములయందుఁ గృషికార్యములు వర్ణింపఁబడెను. శుక్లయజుర్వేదమందును 12-68-71 మంత్రములందుఁ గృషి చక్కఁగా వర్ణింపఁబడినది. అథర్వణవేదమందు 12-1-4 "యస్యాం కృష్టయః సంధ బభూవుః" అను మంత్రమువల్లఁ గృషి యీ దేశమందే యుద్భవించినట్లు స్పష్ట మగుచున్నది. (నే.వేం.న.శా.)

(11) గీ॥ శీఘ్రమే స్వీయకార్యము చేయు వార
మఖిల మేధావులము, మీర లశ్వులార!
కార్యము లొనర్పు వారలు కాన నిపుడు
సూక్తులం బిలిచెదము మిమ్ము సుదినమందు ॥ 509

(12) గీ॥ సకలరక్షాపరీతము సకలరూప
సంవిశిష్టము వరణీయశక్తి గలది
యైన యాహ్వానమునకు మీ రభిముఖముగ
నరుగఁ దెం డశ్వివరులార! యధికతుష్టి ॥ 510

గీ॥ హవ్య మభిలషించి యతిశయ ధనదాత
లౌచు యుద్ధమందు నఖిల భావ
ములను గలిఁగి పుత్రకులకు వృద్ధిని జేయు
రక్షతోడ రండు! రాజులార! ॥ 511

(13) గీ॥ దివసమందు నిట్టి దివ్యకాలమునందు
నశ్వులకు నమస్సు నాచరించి
వారి సూక్తితోడ వర్ణించి వారల
చెంత వేడఁగలను జతురధనము ॥ 512

(14) గీ॥ రాత్రులందు నుషస్సుల స్తోత్రములను
వారి నాయకులై రుద్రవర్తులైన
యశ్వులం బిల్తు మశ్విద్వయంబ! మమ్ము
శత్రువశులుగఁ జేయక చనుఁడు! మీరు ॥ 513

(15) గద్యము॥

ఓ యశ్విద్వయమా! లోకములతోఁ గలిసియుండుట మీ స్వభావము. నేను సుఖయోగ్యుఁడను. ప్రాతఃకాలమున సుఖమును గలుఁగనిండు! నా పేరు సోభరి. నేను దండ్రి వలె మిమ్ములఁ బిలిచెదను ॥ 514

(16) గీ॥ మనసు వలె శీఘ్రగాములు ఘనులు శత్రు
హంతకులు రక్షకులు నైన యశ్వివరులు!
పరమ రక్షా విధంబునఁ గరము రక్ష
ణార్థమై చెంత నిలువుఁడీ! సార్థకముగ ॥ 515

(17) గీ॥ అశ్వివరులార! మీర లత్యంతప్రీతి
సోమరసమును ద్రావుచు సుఖము గనుఁడు!
నేతలై దర్శనీయులై నిఖిలధేను
స్వర్ణ సంయుతులై మీరు సాగిరండు! ॥ 516

(18) సీ॥ ఎద్దాని దానంబు లెల్ల సుందరములై లోకంబు లంతటఁ బ్రాకుచుండు
నెద్దాని వీర్యంబు లెల్ల రమ్యంబులై జగములం దంతట జరుగుచుండు
నెయ్యది తనువరణీయమై సంప్రీతి నఖిల దిఙ్మండలి కరుగుచుండు
నెయ్యది శక్తిని గలిఁగిన వ్యక్తిచే నభిభవం బేమియు నందకుండు
గీ॥ నట్టి ధనమును మే మెల్ల నంది యుంటి
మన్న ధనులార! యశ్విద్వయంబ! మీరు
వచ్చియుండిన శీఘ్రమే వలసినంత
ధనము గలవార మగుదుము ఘనుల మగుచు ॥ 517

## సూక్తమ్—23

ఋషిః—విశ్వమనా వైయశ్వః,
దేవతా—అగ్నిః
ఛందః—ఉష్ణిక్

(1) ఈళిష్వా హి ప్రతీవ్యం౧ యజస్వ జాతవేదసమ్ ।
చరిష్ణుధూమమగృభీతశోచిషమ్ ॥ 547

(2) దామానం విశ్వచర్షణే ఽగ్నిం విశ్వమనో గిరా ।
ఉత స్తుషే విష్పర్ధసో రథానామ్ ॥ 548

(3) యేషామాబాధ[1] ఋగ్మియ ఇషః పృక్షశ్చ నిగ్రభే ।
ఉపవిదా వహ్నిర్విన్దతే వసు ॥ 549

(4) ఉదస్య శోచిరస్థాద్ దీదియుషో వ్యజరమ్ ।
తపుర్జమ్భస్య సుద్యుతో గణశ్రియః ॥ 550

(5) ఉదు తిష్ఠ స్వధ్వర స్తవానో దేవ్యా కృపా ।
అభిఖ్యా భాసా బృహతా శుశుక్వనిః ॥ 551

(6) అగ్నే యాహి సుశస్తిభి ర్హవ్యా జుహ్వాన[2] ఆనుషక్ ।
యథా దూతో బభూథ హవ్యవాహనః ॥ 552

(7) అగ్నిం వః పూర్వ్యం హువే హోతారం చర్షణీనామ్ ।
తమయా వాచా గృణే తము వః స్తుషే ॥ 553

---

1. బాధఽఋగ్మియఽఇషః, 2. జుహ్వానఽఆనుషక్. (ప్రా.ప్ర)

(8) యజ్ఞేభిరద్భుతక్రతుం యం కృపా సూదయన్త[1] ఇత్ ।
మిత్రం న జనే సుధితమృతావని ॥ 554

(9) ఋతావానమృతాయవో యజ్ఞస్య సాధనం గిరా ।
ఉపో[2] ఏనం జుజుషుర్నమసస్పదే ॥ 555

(10) అచ్ఛా నో[3] అఙ్గిరస్తమం యజ్ఞాసో యన్తు సంయతః ।
[4]హోతా యో అస్తి విక్ష్వా యశస్తమః ॥ 556

(11) అగ్నే తవ త్యే[5] అజరేన్ధానాసో బృహద్ భాః ।
అశ్వా[6] ఇవ వృషణస్తవిషీయవః ॥ 557

(12) స త్వం న[7] ఊర్జాం పతే రయిం రాస్వ సువీర్యమ్ ।
ప్రావ నస్తోకే తనయే సమత్స్వా ॥ 558

(13) యద్ వా[8] ఉ విశ్పతిః శితః సుప్రీతో మనుషో విశి ।
విశ్వేదగ్నిః ప్రతి రక్షాంసి సేధతి ॥ 559

---

1. యన్త౽ఇత్, 2. ఉపో౽ఏనం, 3. నో౽అఙ్గిరస్తమం, 4. హోతా యో౽అస్తి, 5. త్యే౽అజరే, 6. అశ్వా౽ఇవ, 7. న౽ఊర్జాం, 8. యద్ వా౽ఉ. (వా.ప్ర.)

(14) శ్రుష్ట్యగ్నే నవస్య మే స్తోమస్య వీర విశ్పతే ।

ని మాయినస్తపుషా రక్షసో దహ ॥ 560

(15) న తస్య మాయయా చన రిపురీశీత మర్త్యః ।

యో[1] అగ్నయే దదాశ హవ్యదాతిభిః ॥ 561

(16) వ్యశ్వస్త్వా వసువిదముక్షణ్యురప్రీణాదృషిః ।

మహో రాయే తము త్వా సమిధీమహి ॥ 562

(17) ఉశనా కావ్యస్త్వా ని హోతారమసాదయత్ ।

ఆయజిం త్వా మనవే జాతవేదసమ్ ॥ 563

(18) విశ్వే హి త్వా సజోషసో దేవాసో దూతమక్రత ।

శ్రుష్టీ దేవ ప్రథమో యజ్ఞియో భువః ॥ 564

(19) ఇమం ఘా వీరో[2] అమృతం దూతం కృణ్వీత మర్త్యః ।

పావకం కృష్ణవర్తనిం విహాయసమ్ ॥ 565

---

1. యోఽఅగ్నయే, 2. వీరోఽఅమృతం. (ప్రా. ప్ర.)

(20) తం హువేమ యతస్రుచః సుభాసం శుక్రశోచిషమ్ ।
విశామగ్నిమజరం ప్రత్నమీడ్యమ్ ॥ 566

(21) యో[1] అస్మై హవ్యదాతిభిరాహుతిం మర్తోఽవిధత్ ।
భూరి పోషం స ధత్తే వీరవద్ యశః ॥ 567

(22) ప్రథమం జాతవేదసమగ్నిం యజ్ఞేషు పూర్వ్యమ్ ।
ప్రతి స్రుగేతి నమసా హవిష్మతీ ॥ 568

(23) ఆభిర్విధేమాగ్నయే జ్యేష్ఠాభిర్వ్యశ్వవత్ ।
మంహిష్ఠాభిర్మతిభిః శుక్రశోచిషే ॥ 569

(24) నూనమర్చ విహాయసే స్తోమేభిః స్థూరయూపవత్ ।
ఋషే వైయశ్వ దమ్యాయాగ్నయే ॥ 570

(25) అతిథిం మానుషాణాం సూనుం వనస్పతీనామ్ ।
విప్రా[2] అగ్నిమవసే ప్రత్నమీళతే ॥ 571

---

1. యోఽఅస్మై. 2. విప్రాఽఅగ్నిః. (బ్రా.ప్ర.)

(26) మహో విశ్వాగ్ం[1] అభి షతో3 ఽభి హవ్యాని మానుషా।
అగ్నే ని షత్సి నమసాధి బర్హిషి ॥ 572

(27) వంస్వా నో వార్యా పురు వంస్వ రాయః పురుస్పృహః ।
సువీర్యస్య ప్రజావతో యశస్వతః ॥ 573

(28) త్వం వరో సుషామ్ణే ఽగ్నే జనాయ చోదయ ।
సదా వసో రాతిం యవిష్ఠ శశ్వతే ॥ 574

(29) త్వం హి సుప్రతూరసి త్వం నో గోమతీరిషః ।
మహో రాయః సాతిమగ్నే[2] అపా వృధి ॥ 575

(30) అగ్నే త్వం యశా[3] అస్యా మిత్రావరుణా వహ ।
ఋతావానా సమ్రాజా పూతదక్షసా ॥ 576

---

1. విశ్వాగ్ంఽఅభిషతో3ఽభి, 2. మగ్నేఽఅపా. 3. యశాఽఅస్యా. (ప్రా॰ప్ర॰)

## సూక్తము—23

ఋషి—వైయస్యుఁ డగు విశ్వమనస్సు

దేవత—అగ్ని

(1) చ॥ అనలుఁడు శత్రుహారి యగు నాతనికిన్ నుతిఁ జేయుమయ్య! త
ద్ఘనతరదీప్తి నే జనుఁడు కాంచఁగలండు? తదీయధూమ మె
ల్లను నలుదిక్కులందు సువిలాసగతిఁ జరియించుచుండు నా
యనలునకున్ విశేషముగ నర్చలఁ జేయుము! పండితోత్తమా! ॥ 518

(2) గీ॥ శత్రుబాధాకరుం డింక సరససూక్తి
పూజనీయుఁడు వహ్ని యే పురుషవరుని
వలన నన్నంబు సోమముఁ బడయఁగలఁడొ!
యట్టి వాఁడు ధనంబుల నందఁగలఁడు ॥ 519

(3)* గద్యము॥

ఋత్విజులచేత నుతియింపఁబడెడి వహ్నీ! శత్రువులవల్ల బాధింపఁబడక వెలుఁగొందుదువుగాక!
హవిస్సులను నీవు పరిగ్రహించి దేవతలకోసమై కొంపోదువుగాక! ఆ హవిర్దాన దానమును
నిచ్చు శక్తి మా కొసంగుదువుగాక! ॥ 520

(4, సీ॥ అత్యంత దీప్తిచే నమరుచుండెడునట్టి సంతాపకరుఁ డౌచు సాగునట్టి
5,6) యజమానవరులకు నాశ్రితుం డగునట్టి దండవిశిష్టుఁడై యుండునట్టి
సమ్ముఖస్థిత బృహత్సందీప్తిరాశుల నందుచు స్తుతులను నందునట్టి
†జర నెరుంగనియట్టి జ్వలితమౌ నగ్నులు నుతులచేఁ దేజమ్ము నొందునట్టి
గీ॥ యగ్నిహోత్రుఁడ! సురలకు హవ్యములను, నిచ్చుచున్ హవ్యవాహివై మెచ్చునట్టి
దూత వౌటను నీవు సంపూర్ణ నుతులఁ, గూడికొనిరమ్ము! ముదమును గూర్చు మాకు ॥ 521

---

* ఈ 23వ సూక్తములోని 3వ ఋక్కును శ్రీనేమానివా రాంధ్రీకరింపక విడిచిపెట్టిరి. (చూ. వ్రాతప్రతి, 9వ సంపుటము. 75వ పుట.)

† సీసపద్యములోని యీ 4వ పాదమును శ్రీనేమానివారు విరచింపక విడిచిపెట్టిరి.

*† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7,8) సీ॥ నిఖిల మానవ హోమ నిష్పాదకుని నగ్నిఁ బిలుచుచుంటిమి మేము ప్రీతి మిగుల
నత్యంత ప్రాచీనుఁడైనట్టి యనలుని వేఁడుచుంటిమి మేము వేడ్క మీర
నిట్టి వాక్యంబుల నిష్టికరాగ్నిని వర్ణించెదము మేము భక్తిఁ గలుగఁ
గరము జగంబున మెరసెడు నగ్నిని నుతియించెదము మేము మతులు వెలుఁగ
గీ॥ బంధు సదృశుండు తృప్తిని బడయువాఁడు, ప్రజ్ఞతోఁ గూడుకొనువాఁడు పావకుండు
యజ్ఞసామర్థ్యయుక్తుఁడై యజ్ఞములను, జేయువారల సఫలులఁ జేయుఁగాక! 522

(9) క॥ సవనాభిలాషులారా!
సవనాఢ్యుని సవనపూర్ణ సాధకు నగ్నిన్
సవనమ్మున వినుతింపుఁడు!
నవవిధ మంత్రములతోడ నానావిధులన్ ॥ 523

(10) గీ॥ నియమబద్ధమైన నిఖిలాంగిరోగణ
మగ్ని కభిముఖముగ నరుగుఁగాక!
నిఖిల మనుజ హోమ నిష్పాదకుండైన
యతఁడు కీర్తివంతుఁ డగునుగాక! ॥ 524

(11) గీ॥ ఓ జరావంతుఁడా! యగ్నిహోత్ర! నీదు
దీప్యమాన బృహద్రశ్మి తేజ మెల్ల
నభిమతంబుల నొసఁగెడు హయము మాడ్కి
బలము ప్రకటించుఁగాక! నీ ప్రకృతియందు ॥ 525

(12) క॥ బలపతి! మాకై యుత్తమ
బలయుత ధన మీయవయ్య! భాసురులౌ పు
త్రులఁ బౌత్రుల నఖిలంబును
గలిఁగించెడు యుద్ధమందుఁ గాపాడు! మమున్ ॥ 526

(13) గీ॥ మానవాధీశుఁడై తీక్ష్ణుఁడైన యగ్ని
ప్రీతుఁడై[1] మనుజగృహములఁ బెరుగునపుడు
సర్వరాక్షస గణముల సకల శక్తి
నంత మొందించుఁగాక నే చెంతనైన ॥ 527

(14) గీ॥ లోకపాలక! యగ్ని! యస్తోక! నీవు
నూతన స్తోత్రముల నెల్లఁ బ్రీతి వినుచు
తాప మొసఁగెడు తేజఃప్రతాపములను
దుష్టరాక్షసులను బ్రీతి ద్రోలి తీవు ॥ 528

(15,16,17,
18,19,20) గద్యము॥

హవ్య మొసఁగెడు ఋత్విజులారా! యగ్నికి హవ్య మెవ్వ రొసంగెదరో! మనుష్యశత్రువులు వారిని వశపరచుకోనఁజాలరు. తనను ధనదాతగాఁ జేసికొనుటకు వ్యశ్వుఁడను ఋషి నిన్ను సంప్రీతుని గావించెను. నీవు ధనప్రదుఁడ వగుటయే యందుకుఁ గారణము. విస్తార ధనమును బడయఁగోరి వానిని సందీపితునిగా నొనర్చెదను. నీవు యజ్ఞ శీలుఁడవు! కవిపుత్రుఁడవు! జాతవేదుఁడవు! ఉశనస్సు నిన్ను మను గృహమందు హోతగాఁ బ్రవేశపెట్టెను. ఓ యగ్నీ! విశ్వేదేవత లేకమై నిన్ను దూతగాఁ జేసిరి. ఓ దేవా! యగ్నీ! నీవు ప్రధానుఁడవు! నీవు యజ్ఞార్హుఁడ వగుచున్నావు! ఆగ్నీ! నిన్ను వీరమనుష్యులు దూతగా నొనర్చిరి. నేను బాల దండలను గ్రహియించుచు, దీప్తివంతుఁడు, శుభ్రవర్ణుఁడు, తేజోవిశిష్టుఁడు, మనుజ స్తుతియోగ్యుఁడు, జరారహితుఁడు నగు నగ్నిని నాహ్వానించెదము ॥ 529

(21,22,23,
24,25) గద్యము॥

ఏ మనుజుఁడు హవ్య మొసంగువారిచే నగ్నికి నాహుతి నిప్పించునో! యతఁడు పుష్టికరము, వీరయుక్తము నగు నన్నమును బొందును. దేవతాగ్రగణ్యుఁడు, జాతవేదుఁడు, పురాతనుఁడు నగు నగ్ని నిమిత్తము స్రుక్కులు నమస్కార పూర్వకముగ వెడలుచున్నవి. విశ్వమనస్సు గల వ్యశ్వుని చందమున స్తుతులఁ బ్రశస్తతముఁడు, పూజ్యతముఁడు, శుభ్రదీప్తుఁడు నగు నగ్నికిఁ బరిచర్య నొనర్చుచున్నాను. ఓ వ్యశ్వపుత్రఋషీ! నీవు స్థూలయూప న్యాయమున గృహభవుఁడు, మహాత్ముఁడు, నగు నగ్నిని స్తోత్రములచే నర్చించుము!. మేధావు లగు మనుజులు, నతిథి, వనస్పతి పుత్రుఁడు, పురాతనుఁడు నగు నగ్నిని రక్షఁ గోరి నుతించుచున్నారు ॥ 530

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్త మైనది.

(26,27 సీ॥ స్తోతలకుం గడు సుఖ మిచ్చు దర్భల వసియించియుండుమా! వహ్నిదేవ!
28,29,30) స్తుతియోగ్యతం బొంది మతిమత్ప్రదత్తమౌ హవ్యము గ్రహియింపు మగ్నిదేవ!
వరణీయ మైనట్టి చిరధన సంపత్తి దాన మొసంగుమా! ధర్మదేవ!
వీరులం బుత్రుల విపులకీర్తిని బౌత్రులను బ్రసాదింపుమా! ఘన యశుండ!
గీ॥ దాత వౌచు మహాభోగ దాత వౌచుం, బశువులను నన్నమును నిమ్ము! పావకుండ!
సత్యమును గల్గి నిత్యయశస్సుం గలిగి, వరుణమిత్రులం గొనితెమ్ము! పరమ! నీవు! ॥ 531

## సూక్తమ్—24

ఋషిః—విశ్వమనా వైయశ్వః
దేవతా—ఇన్ద్రః,28-30-వరుః సౌషామ్ణిః
ఛందః—ఉష్ణిక్,30-అనుష్టుప్

(1) సఖాయ[1] ఆ శిషామహి బ్రహ్మేన్ద్రాయ వజ్రిణే ।
స్తుష[2] ఊ షు వో నృతమాయ ధృష్ణవే ॥ 577

(2) శవసా హ్యసి శ్రుతో వృత్రహత్యేన వృత్రహా ।
మఘైర్మఘోనో[3] అతి శూర దాశసి ॥ 578

(3) స నః స్తవాన[4] ఆ భర రయిం చిత్రశ్రవస్తమమ్ ।
నిరేకే చిద్ యో హరివో వసుర్దదిః ॥ 579

---

1. సఖాయఽఆ శిషా, 2. స్తుషఽఊ షు, 3. మఘోనోఽఅతి, 4. స్తవానఽఆ భర. (వ్రా.ప్ర.)

(4) ఆ విరేకముత ప్రియమిన్ద్ర దర్షి జనానామ్ ।
ధృషతా ధృష్ణో స్తవమాన[1] ఆ భర ॥ 580

(5) న తే సవ్యం న దక్షిణం హస్తం వరన్త[2] ఆమురః ।
న పరిబాధో హరివో గవిష్టిషు ॥ 581

(6) ఆ త్వా గోభిరివ వ్రజం గీర్భిరృణోమ్యద్రివః ।
ఆ స్మా కామం జరితురా మనః పృణ ॥ 582

(7) విశ్వాని విశ్వమనసో ధియా నో వృత్రహన్తమ ।
ఉగ్ర ప్రణేతరధి షూ వసో గహి ॥ 583

(8) వయం తే [3]అస్య వృత్రహన్ విద్యామ శూర నవ్యసః ।
వసోః స్పార్హస్య పురుహూత రాధసః ॥ 584

(9) ఇన్ద్ర యథా హ్యస్తి తే ఽపరీతం నృతో శవః ।
అమృక్తా రాతిః పురుహూత దాశుషే॥ 585

---

1, స్తవమానఽఆభర, 2. వరన్తఽఆమురః, 3. వయం తేఽఅస్య. (ప్రా.ప్ర.)

(10) ఆ వృషస్వ మహామహ మహే నృతమ రాధసే ।
[1]దృళ్హశ్చిద్ దృహ్య మఘవన్ మఘత్తయే ॥ 586

(11) నూ[2] అన్యత్రా చిదద్రివస్త్వన్నో జగ్మురాశసః ।
మఘవఞ్ఛగ్ధి తవ తన్న[3] ఊతిభిః ॥ 587

(12) నహ్యఙ్గ నృతో త్వదన్యం విన్దామి రాధసే ।
రాయే ద్యుమ్నాయ శవసే చ గిర్వణః ॥ 588

(13) ఏన్దుమిన్ద్రాయ సిఞ్చత పిబాతి సోమ్యం మధు ।
ప్ర రాధసా చోదయాతే మహిత్వనా ॥ 589

(14) ఉపో హరీణాం పతిం దక్షం పృఞ్చన్తమబ్రవమ్ ।
నూనం శ్రుధి స్తువతో[4] అశ్వ్యస్య ॥ 590

(15) నహ్యఙ్గ పురా చన జజ్ఞే వీరతరస్త్వత్ ।
నకీ రాయా నైవథా న భన్దనా ॥ 591

---

1. దృళహశ్చ. 2. నూఽఅన్యత్రా, 3. తన్నఽఊతిభిః, 4. స్తువతోఽఅశ్వ్యస్య. (ప్రా.ప్ర.)

(16) ఏదు మధ్వో మదిన్తరం సిఞ్చ వాధ్వర్యో[1] అన్ధసః ।
ఏవా హి వీరః స్తవతే సదావృధః ॥ 592

(17) ఇన్ద్ర స్థాతర్హరీణాం నకిష్టే పూర్వ్యస్తుతిమ్ ।
ఉదానంశ శవసా న భన్దనా ॥ 593

(18) తం వో వాజానాం పతిమహూమహి శ్రవస్యవః ।
అప్రాయుభిర్యజ్ఞేభిర్వావృధేన్యమ్ ॥ 594

(19) ఏతో న్విన్ద్రం స్తవామ సఖాయః స్తోమ్యం నరమ్ ।
కృష్టీర్యో విశ్వా[2] అభ్యస్త్యేక ఇత్ ॥ 595

(20) అగోరుధాయ గవిషే ద్యుక్షాయ దస్మ్యం వచః ।
ఘృతాత్ స్వాదీయో మధునశ్చ వోచత ॥ 596

(21) యస్యామితాని వీర్యా౩ న రాధః పర్యేతవే ।
జ్యోతిర్న విశ్వమభ్యస్తి దక్షిణా ॥ 597

---

1. వాధ్వర్యో౽అన్ధసః, 2. విశ్వా౽అభ్యస్త్యేక౽ఇత్. (వా.ప్ర.)

(22) స్తుహీన్ద్రం వ్యశ్వవదనూర్మిం వాజినం యమమ్ ।
ఆర్యో గయం మంహమానం వి దాశుషే ॥ 598

(23) ఏవా నూనముప స్తుహి వైయశ్వ దశమం నవమ్ ।
సువిద్వాంసం చర్కృత్యం చరణీనామ్ ॥ 599

(24) వేత్థా హి నిరృతీనాం వజ్రహస్త పరివృజమ్ ।
అహరహః శున్ధ్యుః పరిపదామివ ॥ 600

(25) తదిన్ద్రావ[1] ఆ భర యేనా దంసిష్ఠ కృత్వనే ।
ద్వితా కుత్సాయ శిశ్నథో ని చోదయ ॥ 601

(26) తము త్వా నూనమీమహే నవ్యం దంసిష్ఠ సన్యసే ।
స త్వం నో విశ్వా[2] అభిమాతీః సక్షణిః ॥ 602

(27) య[3] ఋక్షాదంహసో ముచద్ యో వార్యాత్ సప్త సిన్ధుషు ।
వధర్దాసస్య తువినృమ్ణ నీనమః ॥ 603

---

1. తదిన్ద్రావఽఆ భర, 2. విశ్వాఽఅభిమాతీః, 3. యఽఋక్షా. (ప్రా.ప్ర.)

(28) యథా వరో సుషామ్ణే సనిభ్య[1] ఆవహో రయిమ్ ।
వ్యశ్వేభ్యః సుభగే వాజినీవతి ॥ 604

(29) ఆ నార్యస్య దక్షిణా వ్యశ్వాగ్ం[2] ఏతు సోమినః ।
స్థూరం చ రాధః శతవత్ సహస్రవత్ ॥ 605

(30) యత్ త్వా పృచ్ఛాదీజానః కుహయా కుహయాకృతే ।
ఏషో[3] అపశ్రితో వలో గోమతీమవ తిష్ఠతి ॥ 606

## సూక్తము—24

ఋషి—వైయశ్వుఁడగు విశ్వమనస్సు*
దేవత—ఇంద్రుఁడు, 28,29,30-వరువు*

(1) క॥ ఋత్విజ్ఞులార! మీకై
తత్త్వజ్ఞుఁడు వజ్రి శత్రు ధర్షకుఁడయి నే
తృత్వము నొందెను వానికి
సత్వరముగ సూక్తివలన సంస్తుతి నిడుఁడీ! ॥ 532

(2) క॥ ఘన బలుఁ డగు వృత్రాసుర
హననంబును జేసి వృత్రహననుఁడ వగుచున్
ధనమున ధనవంతులకున్
ధన మధికం బింద్ర! నీవు దానం బిడుమా! ॥ 533

1. సన్నిభ్యఽఆవహో. 2. వ్యశ్వాగ్ంఽఏతు, 3. ఏషోఽఅపశ్రితో. (వ్రా.ప్ర.)

* వ్రాఁతప్రతిలో (9వసంపుటము. 81వపుట) వ్యశ్వపుత్రుఁడగు వైయశ్వుఁడుఋషిగాను, ఇంద్రుఁడు, చివరి మూఁడు ఋక్కులకు వరుణుఁడు దేవతగాను,15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "విశ్వమానసుఁడు" ఋషిగాను, "ఇంద్రుఁడు, యువరాజుదానములు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(3, సీ॥ నానా విచిత్ర ధనంబు మాకు నొసంగి యింద్ర! సంస్తుతు లంది యెసఁగవలదె?
4,5) నిర్గమించెడు వేళ నీవు శత్రువులకు వాసప్రదుండవై పరగవలదె?
యశ్వ విశిష్టుండవై మాకు ధనమును వెల్గఁజేయుచు నీవు వెడలవలదె?
స్తూయమానుండవై సుస్థిర బుద్ధితో మాకు ధనం బిచ్చి మరువవలదె?
గీ॥ దివ్యతర దుగ్ధ మిచ్చెడు ధేనువులను, నీవు వెదకెడు వేళల నీదు వామ
దక్షిణ కరంబులను నే విధంబునైన, నెవరు రోదింపఁగలవారు? సవనదేవ! 534

(6) గీ॥ వాక్తతిన్ నీవు ప్రాప్తుండ వగుదు వజ్రి!
యటులె గోగోష్ఠములు శోకమందుఁ బొందఁ
బడును స్తోతలకున్ వానిఁ గడు నొసంగి
వారికిం దృప్తిఁ గలిఁగింపు! వారిఁ జేరి ॥ 535

(7) గీ॥ అధికముగ శత్రుహారివి యగుచు నింద్ర!
ధనద! వాసప్రదా! యింద్ర! తరచు విశ్వ
మనసుఁడను[1] ఋషి యొనర్చిన మాన్య కర్మ
యం దుపస్థితుఁడవు కావె! పొంది నుతుల ॥ 536

(8) గీ॥ ఓయి పురుహూత! యింద్రుఁడా! యోయి శూర!
యోయి వృత్రనివారకా! యొగి విశేష
వాసదం బగు ధనమును వలయు దానిఁ
బొందఁగల్గుదు విస్తృతి నొంద నీవుఁ 537

(9) గీ॥ ఇంద్ర! సకల నర్తయిత! నీదు బలమును
నరి తిరస్కరింప నరుగలేఁడు
పూర్ణ హవ్యములకుఁ బురుహూత! నీ విచ్చు
దానమును హరింపఁదగు నెవండు? ॥ 538

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచఘుగణము ప్రయుక్తమైనది.

(10,11, సీ॥ పూజ్య నేతృఁడ! యింద్ర! పూర్ణఫలార్థమై యుదరము సిక్తమై యుండనిమ్ము!
12,13) బహువిధ శాత్రవ పట్టణంబుల నేలపాలయి నాశంబుఁ బడయనిమ్ము!
తొల్లి త్వద్భిన్నుల నెల్ల చేరిన మాకు రక్షా ధనంబుల దీక్ష నిమ్ము!
బలకీర్తులన్ నేను గలుఁగంగ నన్యులఁ జేరకుండఁగ నన్నుఁ జెలఁగనిమ్ము!
గీ॥ స్తోతృవరులార! సోమము సురవరునకు, నొసఁగుఁ డాతఁడు దానిని మెసవి సహజ
మైన యన్నమునొసఁగును నంది నుతుల, నతఁడె రక్షకుఁడగుఁగద! యఖిలమునకు॥ 539

(14) గీ॥ అరిగణంబుల కధిపతియైన యింద్రు
నిన్ నుతించెద నాతఁడు నిఖిల సహజ
బల మొసంగును నన్యుల కెలమి శక్ర!
వ్యశ్వపుత్రుని మొఱ నీవు పడయవయ్య! ॥ 540

(15) గీ॥ ఇంద్రుఁడా! తొలుత[1] నీకంటె నితరుఁడైన
ధనము గలవాఁడు, సామర్థ్య ఘనుఁడు నుతులఁ
బొందువాఁ డాశ్రితుల నెల్లఁ బొందునట్టి
వాఁ డెవఁడు జన్మ మొందిన వాఁడు కలఁడు? ॥ 541

(16) గీ॥ మదకరాన్నముకంటె సమ్మదము నొసఁగు
నంశ మింద్రున కధ్వర్యు! యందనిమ్ము!
వీరు వర్ధనశీలుని వేల్పు నింద్రు
సంస్తుతింతురు లోకులు సరససూక్తి ॥ 542

(17) గద్యము॥

హర్యధిష్ఠాతా! యింద్రా! పూర్వ మౌనికృత మగు నీ స్తుతిని నిప్పుడు మహాత్ములు చేసెడు నుతులను నెవ్వఁడును బలముచే వ్యాపింపఁజాలఁడు. బలముచే నీ స్తుతి నెట్టివాఁడును నాక్రమింపలేఁడు ॥ 543

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భం"ము ప్రయుక్త మైనది.

(18) గీ॥ ఎట్టి యజ్ఞమందు నెల్ల ఋత్విగ్గణ
మప్రమత్త మగునొ! యట్టి యిష్టి
చేత దర్శనీయుఁ బూతాన్నపతి నింద్రు
నన్న మభిలషించి యాదరింతు ॥ 544

(19) గీ॥ మిత్రభూతు లౌచు మెలఁగెడు ఋత్విజుల్!
శక్రు నభినుతింప సాగుఁ డీర
లింద్ర దేవుఁ డొకఁడె యెల్ల శత్రువులను
సంహరింపఁగలఁడు సత్వరముగ ॥ 545

(20) గీ॥ స్తుతి నిరోధింపఁజాలని మతిమతుండు
శక్రుఁడు[1] స్తోత్రముల విను శ్రవణములను
మధు ఘృతంబులకంటెను మాన్యులార!
స్వాదుతర వాక్కుఁ పలుకుఁడు! శక్రునకయి 546

(21, సీ॥ ఏ యింద్రదేవుని యెక్కుఁడు వీర్య మమేయమై యంతట మెలఁగుచుండు
22) నే యింద్రదేవుని నెక్కుఁడు ధన మెల్ల వైరి హస్తంబులఁ జేరకుండు
నే యింద్రదేవుని యెల్ల కార్యంబులు జ్యోతిస్సు వలె స్తోత నొందుచుండు
నెవఁడు హవ్యదునకు నెసఁగెడు గృహమందు వితరణంబు నొనర్చి వెలుఁగుచుండు
గీ॥ నా మహేంద్రుని బలవంత మైనవాని, స్తోతృగణకర్తృకంబులౌ స్తుతులచేత
నన్ని విధుల నియంత్రితుండైన వాని, వ్యశ్వఋషి వలె నుతియింపు మార్య! నీవు ॥ 547

(23,24,25)*గద్యము॥

ఓ వైయశ్వుఁడా! మనుష్యులకు దశముఁడును సువిద్వాంసుఁడు నగు నింద్రుని నమస్కార
పురస్సరంబుగా వినుతింపుము! ఆదిత్యులు యజమానుల నెఱుంగు టెట్లో! నిఋతి
గణములను దృజించు టెట్లో! యది యంతయు నీవే యెరుంగుదువు! కాఁబట్టి
యో దర్శనీయేంద్రుఁడా! కర్మకారు లగు యజమానులఁగూర్చి మాకు
నీ యాశ్రయ మొసంగుము! "కుత్స"నామక ఋషికై రెండు విధము లగు
వధల నొనర్చితివి! మాకుఁగూడ నట్టి రక్ష నొసంగుము! ॥ 548

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "జ" గణము ప్రయుక్త మైనది.

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 85వ పుట.) నీ గద్యము పొరపాటున 23,24 ఋక్కులకు మాత్రమే యనువాదముగా వ్రాయఁబడినది.

(26) గీ॥ సన్యసించుటకై యింద్ర! చాల ధనము
నిన్ను యాచించుచున్నాము నిఖిల వంద్య!
నీవు మా శాత్రవగణంపు నిఖిలమహిమ
కళిభవంబును గల్పింతు వార్య వినుత! ॥ 549

(27) గీ॥ ఎవఁడు రాక్షసకృత పాప మెల్లఁ గొట్టి
సప్త నదులందు నివసించు జనుల కెల్ల
ధనము నొసఁగునొ! యెవ్వఁడు దాత? యతఁడు
దాసుఁ జంపంగ నస్త్రముఁ దాల్చుఁగాక! ॥ 550

(28,29,30) గద్యము॥

ఓయి [1]వరురాజా! సుషామ రాజు నుద్దేశించి యే విధమున యాచకులకు ధన మొసంగితివో! యా విధమున వ్యశ్వునకు నీ క్షణమందు ధన మొసంగుము! సౌభాగ్యశాలినియు నన్నవతియు నగు నుషస్సా! నీవు ధనము నొసంగుము! మనుజులకు హితముఁ గూర్చెడు సోమము గలవాఁడా! దక్షిణాసోమవిశిష్టు వ్యశ్వపుత్రుని సమీపమునకు వచ్చెదవుగాక! ఓ యుషోదేవి! యా వరురా జెక్కడ నుంతు నని యెవఁడు ప్రశ్నించునో! వాఁడు నీ కగ్రవర్తి యగు. ఇష్టివంతుఁడగు వరు రా జెక్కడ వసించునని యొకఁడు ప్రశ్నించినపుడు "సకలాశ్రయభూతుఁడు శత్రు నివారకుఁడు నగు నా వరురాజు గోమతీతీరమందుండు" నని చెప్పెదవు ॥ 551

## సూక్తమ్—25

ఋషిః—విశ్వమనా వైయశ్వః
దేవతా—మిత్రావరుణౌ,10-12-విశ్వే దేవాః
ఛందః—ఉష్ణిక్,23-ఉష్ణిగ్గర్భా

(1) తా వాం విశ్వస్య గోపా దేవా దేవేషు యజ్ఞియా ।
ఋతావానా యజసే పూతదక్షసా ॥ 607

1. ఇక్కడ మాత్ర మీ గద్యములో "రురురాజా!" అని కలదు. తరువాతి పంక్తులలో "వరురాజు" అనియే కలదు.

(2) మిత్రా తనా న [1]రథ్యా౩ వరుణో యశ్చ సుక్రతుః ।
సనాత్ సుజాతా తనయా ధృతవ్రతా ॥ 608

(3) తా మాతా విశ్వవేదసా[2] ఽసుర్యాయ ప్రమహసా ।
మహీ జజానాదితిరృతావరీ ॥ 609

(4) మహాన్తా మిత్రావరుణా సమ్రాజా దేవావసురా ।
ఋతావానావృతమా ఘోషతో బృహత్ ॥ 610

(5) నపాతా శవసో మహః సూనూ దక్షస్య సుక్రతూ ।
సృప్రదానూ ఇషో వాస్త్వధి క్షితః ॥ 611

(6) సం యా దానూని యేమథుర్దివ్యాః పార్థివీరిషః ।
నభస్వతీరా వాం చరన్తు వృష్టయః ॥ 612

(7) అధి యా బృహతో దివో౩ [3]ఽభి యూథేవ పశ్యతః ।
ఋతావానా సమ్రాజా నమసే హితా ॥ 613

---

1. న రథ్యా, 2. వేదసాసుర్యాయ, 3. దివో౩భి. (వా.ప్ర.)

(8) ఋతావానా ని షేదతుః సామ్రాజ్యాయ [1]సుక్రతూ ।
ధృతవ్రతా క్షత్రియా క్షత్రమాశతుః ॥ 614

(9) అక్ష్ణశ్చిద్ గాతువిత్తరా ఽనుల్బణేన చక్షసా ।
ని చిన్మిషన్తా నిచిరా ని చిక్యతుః ॥ 615

(10) ఉత నో దేవ్యదితిరురుష్యతాం నాసత్యా ।
ఉరుష్యన్తు మరుతో వృద్ధశవసః ॥ 616

(11) తే నో [2]నావమురుష్యత దివా నక్తం సుదానవః ।
అరిష్యన్తో ని[3] పాయుభిః సచేమహి ॥ 617

(12) అఘ్నతే విష్ణవే వయమరిష్యన్తః సుదానవే ।
శ్రుధి స్వయావన్ సిన్ధో పూర్వచిత్తయే ॥ 618

(13) తద్ వార్యం వృణీమహే వరిష్ఠం గోపయత్యమ్ ।
మిత్రో యత్ పాన్తి వరుణో యదర్యమా ॥ 619

---

1. సుక్రతు, 2. నావమురుష్యత, 3. నిపాయుభిః. (వా.ప్ర.)

(14) ఉత నః సిన్ధురపాం తన్మరుత స్తదశ్వినా ।
ఇన్ద్రో విష్ణుర్మీఢ్వాంసః సజోషసః ॥ 620

(15) తే హి ష్మా వనుషో నరో ఽభిమాతిం కయస్య చిత్ ।
తిగ్మం న క్షోదః ప్రతిఘ్నన్తి భూర్ణయః ॥ 621

(16) అయమేక[1] ఇత్థా పురూరు చష్టే వి విశ్పతిః ।
తస్య వ్రతాన్యను వశ్చరామసి ॥ 622

(17) అను పూర్వాణ్యోక్యా సామ్రాజ్యస్య సశ్చిమ ।
మిత్రస్య వ్రతా వరుణస్య దీర్ఘశ్రుత్ ॥ 623

(18) పరి యో రశ్మినా దివో ఽన్తాన్ మమే పృథివ్యాః ।
ఉభే[2] ఆ పప్రౌ రోదసీ మహిత్వా ॥ 624

(19) ఉదు ష్య శరణే దివో జ్యోతిరయంస్త సూర్యః ।
అగ్నిర్న శుక్రః సమిధాన[3] ఆహుతః ॥ 625

1. అయమేకఽఇత్థా, 2. ఉభేఽఆ పప్రౌ, 3. సమిధానఽఆహుతః. (వ్రా.ప్ర.)

(20) పచో వీక్ష్ణప్రసద్మనీశే వాజస్య గోమతః ।
ఈశే హి పిత్వో ఽవిషస్య దావనే ॥ 626

(21) తత్ సూర్యం రోదసీ[1] ఉభే దోషా వస్తోరుప బ్రువే ।
భోజేష్వస్మాగ్ం[2] అభ్యుచ్చరా సదా ॥ 627

(22) ఋజ్రముక్షణ్యాయనే రజతం హరయాణే ।
రథం యుక్తమసనామ సుషామణి ॥ 628

(23) తా మే[3] అశ్వ్యానాం హరీణాం నితోశనా ।
ఉతో ను కృత్వ్యానాం నృవాహసా ॥ 629

(24) స్మదభీశూ కశావన్తా విప్రా నవిష్ఠయా మతీ ।
మహో వాజినావర్వన్తా సచాసనమ్ ॥ 630

1. రోదసీఽఉభే, 2. స్మాగ్ంఽఅభ్య, 3. తా మేఽఅశ్వ్యానాం. (వ్రా.ప్ర.)

## సూక్తము—25

ఋషి—వైయశ్వుఁడగు విశ్వమనస్సు*
దేవత—మిత్రావరుణులు, 10,11,12-విశ్వే దేవతలు

(1) గీ అఖిలపాలక దేవతావరులు! మీర
లఖిలమందును యజ్ఞార్హులైనవారు
జనులు లోకమునం దెల్ల ఘనతరంపుఁ
బూజలను జేయుదురు మీకుఁ బూర్ణ భక్తి ॥ 552

గీ॥ వ్యశ్వుఁడా! సత్యసంయుతు లతి విచిత్ర
బలయుతులు [1]వరుణమిత్రులు వెలఁగుచుందు
రట్టివారలకై కడు నాదరమున
యాగము నొనర్చెదవుగాక నధిక మీరు ॥ 553

(2) క॥ వరుణుఁడు మిత్రుఁడు ధనముం
జిరసంభవు లదితి యనెడు చేడియ తనయుల్
వరకర్మవంతులై భా
సురయాగము గల్గువారు శుభద వ్రతులున్ ॥ 554

(3) గీ॥ సత్యవతి [1]మహతి యదితి యన్ చాన ధనము
గల్గి తేజస్సు గల్గుచు వెల్గు వరుణ
మిత్రులన్ సౌర మైనట్టి మేటి తేజ
మునకుఁ బుట్టించెఁగాదె! సమ్మోద మంద ॥ 555

---

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 87వ పుట) నీ సూక్తమునకు "రాజపుత్రుఁడగు వైయశ్వుఁడు" ఋషి గాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "వైశ్వానరుఁడు" ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్తమైనది.

(4, సీ॥ సమ్రాట్టులై మహాసత్యవంతులరైన†మిత్రావరుణు లిష్టి మెలఁగువారు
5,6,) ‡ నసురు లౌచు మహాత్ములౌచు దేవతలగు మిత్రావరుణు లిష్టి మెలఁగువారు
ధనదాతలై కర్మ మొనరించు వరుణండు మిత్రుఁ డన్నంబున మెలఁగువారు
బలమహాపుత్రులై పరగెడు వరుణుండు మిత్రుఁ డన్నంబున మెలఁగువారు
గీ॥ మిత్రుఁడా! [1]వరుణదేవుఁడ! మీరు పృథ్వి,యందుఁ బుట్టిన యన్నంబు కధికధనము
దాన మొసఁగుఁడు! జలవంత మైన వృష్టి, మీ సమీపమునందున మెలఁగుఁగాక! ॥ 556

(7) గీ॥ మిత్రుఁడా![1] వరుణదేవుఁడ! మిగుల సత్య
వంతులరు, హవ్యనిరతులు, పరమదేవ
తలను గోవుల విధమునఁ దఱచు హృష్టు
లుగ నొనర్పుఁడు! సంప్రీతు లగుచు మీరు ॥ 557

(8) గీ॥ సత్యవంతులు కర్మప్రశస్తి గల్గు
వారలౌ1 వరుణమిత్రు లపారదీప్తి
నొంద నుపవేశనముఁ జేయ నుంద్రుగాక!
వ్యాప్తిఁ జెందింత్రుగాక! నత్యధికబలము ॥ 558

(9) గీ॥ కన్నుదోయికంటె మున్నె మార్గంబులఁ
దెలియువారు ప్రేరకులు చిరంత
ను లగు వరుణ మిత్రు లెలమిఁ దేజోబల
ముల విశేషశోభఁ బొందఁగలరు! ॥ 559

(10) గీ॥ అదితిదేవత యశ్విద్వయంబు మిగుల
వేగవంతులు నౌ మరుద్విపులగణము
మమ్ము రక్షించెదరుగాక! నెమ్మనమున
ననుచుఁ బ్రార్థించుచున్నార మధిక మేము ॥ 560

---

† మిత్రావరుణులు సమ్రాట్టులుగాఁ జెప్పఁబడిరి. స్వరాజ్యాధిపతిని స్వరాట్టుగాఁ బిలుచుచుండినట్లు తోచుచున్నది. స్వరాజ్యమనెడు రాజ్యాంగవిధానము వింతగా నుండును. ఇట్టిది దక్షిణదేశములో నున్నట్టు ఐతరేయ బ్రాహ్మణమున (8-14) "ఏతస్యాంప్రతీచీం దిశి ఏకే చ నౌచ్యానాం రాజానో........నాచచక్షిరే" అని కలదు. (నే.వేం.న.శా.)

‡ అసురు లను విశేషణము ఆర్యాదైవతములగు మిత్రావరుణుల కుపయోగింపఁబడెను- ఈ యసుర శబ్దమునకు మొదట మంచి యర్థ మున్నను గాలక్రమమున దూష్యార్థము వచ్చినట్లు కన్పట్టుచున్నది. వీరినే రాక్షసులనియు, దస్యు లనియు ననెదరు. క్రమముగాఁ బురాతనార్యులలో యాగములు చేయనివా రొకజాతిగను యాగముల నొనర్చువా రొకజాతిగను మాఱియుండవచ్చును. (నే.వేం.న.శా.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్త మైనది.

(11) గీ॥ భవ్యదాతలార! పవలు రాతిరి మీరు
మాకు రక్ష నొసఁగ మరువవలదు
యుష్మదీయ రక్ష నొందుచు మే మెల్ల
నుండఁగలము శుభము నొందఁగోరి ॥ 561

(12,13) గద్యము॥

మే మహింసితులమై హింసారహితుఁ డగు సుదాత నుద్దేశించి స్తుతి నొనర్చెదము.
ఏకాకియు, యుద్ధకారియు నగు విష్ణూ! నీవు స్తోతలకు ధన మొసంగుము! యజ్ఞ
మారంభించెడు వారి స్తుతుల నాలింపుము! అత్యంతగురువును, సకల
రక్షకమును, వరణీయమును నగు నే ధనమును బొందెదమో!
యా ధనమును మిత్రావరుణులు నర్యముఁడు రక్షించెదరుగాక! 562

(14) క॥ మరుదశ్వులు పర్జన్యుఁడు
వరవిష్ణువు కాంక్షితముల వర్షించెడు నా
సురలును మా ధనమును సు
స్థిరముగ రక్షింత్రుగాత! శ్రీల నొసఁగుచున్ ॥ 563

(15) గీ॥ పూజనీయు లైన పూర్ణనేతలు మీరు
వేగగామి జలము వృక్షములను
బెల్లగించునటుల వేగులై ప్రతికూల
శత్రుగణము నెల్లఁ జంపఁగలరు ॥ 564

(16) గీ॥ పాత్రమిత్రావరుణులలో మిత్రుఁ డొకఁడె
ద్రవ్యములఁ జూచుటకుఁ దాను దగిన వాఁడు
కాన మిత్రుని కర్మల గౌరవమున
ననుసరింపంగఁగలవార మతిశయముగ ॥ 565

(17) గీ॥ అఖిలసామ్రాజ్యసహితుఁ డైనట్టి వరుణు
ని గృహముం బొందెదము మేము నిశ్చలముగ
మిక్కిలి ప్రసిద్ధుఁ డైనట్టి మిత్రు వ్రతము
నాచరింపంగఁగలవార మతిశయముగ ॥ 566

(18,19) గద్యము॥

ఏ మిత్రుఁడు ద్యావాపృథ్వుల యంతరమును రశ్ములచేఁ బ్రకాశితముగఁ జేయునో! యా
మిత్రుఁడే దానిని దన మహిమచేఁ బూరించును. సుందరవీర్యోపేతు లగు మిత్రావరుణులు
ద్యుతిమతి యగు నదితిగృహమందుఁ దమ జ్యోతిస్సును బ్రకటించెదరు. పరమం
దగ్ని వలె శుభ్రవర్ణులై సకలలోకులచే నాహూతు లగుచుందురు ॥ 567

(20) గీ॥ స్తోత! గృహయజ్ఞమందు నస్తోకలీల
వరుణునకు[1] నుతి నొనర్పుమా! వరుణుఁ డన్న
మునకు నీశ్వరుండయి యన్నమును నొసంగ
నతిసమర్థుఁడు పశుయుతం డౌచు వెలుఁగు॥ 568

(21) గీ॥ దివిని భూమిని నుతియింతు దినము రాత్రి
వరుణమిత్రుల తేజోఽభివర్ణనంబుఁ
జేయఁగలవాఁడ వరుణుఁడా! చిత్త మలరఁ
బరమదాతల చెంతకుఁ బంపు! మమ్ము॥ 569

(22) గద్యము॥

త్రైక్షగాత్రోత్పన్నుఁడు, శత్రుసంపదాదిహారకుఁడు నగు సుషామపుత్రుఁడు దాన మిచ్చుచుండ,
ఋజుగామి, రజతసదృశము నశ్వయుక్తము నగు రథమును బొందితిమి. సుషామపుత్రుని
యానము శత్రువుల జీవనాదులను హరించును॥ 570

(23) గీ॥ హరితవర్ణాశ్వముల మధ్య నరులఁ ద్రుంచి
సాయుధమనుష్యుల వహింప సాగుచుండు
నట్టి రెం డశ్వములు మాకు నధికశీఘ్ర
ముగఁ బ్రవృత్తము లగుఁగాక! మోద మలర॥ 571

(24) గద్యము॥

నూతన స్తుతులఁ బఠించుచు సుందర రజ్జువులతోఁ గూడికొనినట్టియుఁ, గశాయుక్తమగు
నట్టియు, యోగ్యము లైనట్టియు, శీఘ్రగతి గల్గినట్టివియు, నగు నశ్వద్వయమును
బొందఁగలను॥ 572

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

## సూక్తమ్—26

ఋషిః—విశ్వమనా వైయశ్వః, వ్యశ్వో వాఙ్గిరసః
దేవతా—అశ్వినౌ,20-25-వాయుః
ఛందః—ఉష్ణిక్,16-19,21,25-గాయత్రీ,20-అనుష్టుప్

(1) యువోరు షూ రథం హువే సధస్తుత్యాయ సూరిషు ।
అతూర్తదక్షా వృషణా వృషణ్వసూ ॥ 631

(2) యువం వరో సుషామ్ణే మహే తనే నాసత్యా ।
అవోభిర్యాథో వృషణా వృషణ్వసూ ॥ 632

(3) తా వామద్య హవామహే హవ్యేభిర్వాజినీవసూ ।
పూర్వీరిష[1] ఇషయన్తావతి క్షపః ॥ 633

(4) ఆ వాం వాహిష్ఠో[2] అశ్వినా రథో యాతు శ్రుతో నరా ।
ఉప స్తోమాన్ తురస్య దర్శథః శ్రియే ॥ 634

(5) జుహురాణా చిదశ్వినా[3] ఽఽ మన్యేథాం వృషణ్వసూ ।
యువం హి రుద్రా పర్షథో[4] అతి ద్విషః । 635

1. రిషఽఇషయన్తా, 2. వాహిష్ఠోఽఅశ్వినో, 3. చిదశ్వినామన్యేథాం, 4. పర్షథోఽఅతి.(ప్రా.ప్ర.)

(6) దస్రా హి విశ్వమానుషఙ్ మక్షూభిః పరిదీయథః ।
ధియంజిన్వా మధువర్ణా శుభస్పతీ ॥ 636

(7) ఉప నో యాతమశ్వినా రాయా విశ్వపుషా సహ ।
మఘవానా సువీరావనపచ్యుతా ॥ 637

(8) ఆ మే[1] అస్య ప్రతీవ్యఁమిన్ద్రనాసత్యా గతమ్ ।
దేవా దేవేభిరద్య సచనస్తమా ॥ 638

(9) వయం హి వాం హవామహ[2] ఉక్షణ్యన్తో వ్యశ్వవత్ ।
సుమతిభిరుప విప్రావిహా గతమ్ ॥ 639

(10) అశ్వినా స్వృషే స్తుహి కువిత్ తే శ్రవతో హవమ్ ।
నేదీయసః కూళయాతః పణీఁరుత[3] ॥ 640

(11) వైయశ్వస్య శ్రుతం నరోతో మే[4] అస్య వేదథః ।
సజోషసా వరుణో మిత్రో[5] అర్యమా ॥ 641

---

1. ఆమేఽఅస్య, 2. హవామహఽఉక్షణ్యన్తో, 3. పణీఁఽరుత, 4. మేఽఅస్య, 5. మిత్రోఽఅర్యమా. (ప్రా. ప్ర.)

(12) యువాదత్తస్య ధిష్ణ్యా యువానీతస్య సూరిభిః ।
అహరహర్వృషణా మహ్యం శిక్షతమ్ ॥ 642

(13) యో వాం యజ్ఞేభిరావృతో ఽధివస్త్రా వధూరివ ।
సపర్యన్తా శుభే చక్రాతే[1] అశ్వినా ॥ 643

(14) యో [2]వామురువ్యచస్తమం చికేతతి నృపాయ్యమ్ ।
వర్తిరశ్వినా పరి యాతమస్మయూ ॥ 644

(15) అస్మభ్యం సు వృషణ్వసూ యాతం వర్తిర్నృపాయ్యమ్ ।
విషుద్రుహేవ యజ్ఞమూహథుర్గిరా ॥ 645

(16) వాహిష్ఠో వాం హవానాం స్తోమో దూతో హువన్నరా ।
యువాభ్యాం భూత్వశ్వినా ॥ 646

(17) యదదో దివో[3] అర్ణవ ఇషో వా మదథో గృహే ।
శ్రుతమిన్మే[4] అమర్త్యా ॥ 647

---

1. చక్రాతేఽఅశ్వినా, 2. వామరువ్యచస్తమం, 3. దివోఽఅర్ణవఽఇషో. 4. శ్రుతమిన్మేఽఅమర్త్యా. (వా.ప్ర.)

(18) ఉత స్యా శ్వేతయావరీ వాహిష్ఠా వాం నదీనామ్ ।

సిన్ధుర్హిరణ్యవర్తనిః ॥ 648

(19) స్మదేతయా సుకీర్త్యా ఽశ్వినా శ్వేతయా ధియా ।

వహేథే శుభ్రయావానా ॥ 649

(20) యుఙ్క్ష్వా హి త్వం రథాసహా యువస్వ పోష్యా వసో ।

ఆన్నో వాయో మధు పిబాఽస్మాకం సవనా గహి ॥ 650

(21) తవ వాయవృతస్పతే [1]త్వష్టుర్జామాతరద్భుత ।

అవాంస్యా వృణీమహే ॥ 651

(22) త్వష్టుర్జామాతరం వయమీశానం రాయ[2] ఈమహే ।

సుతావన్తో వాయుం ద్యుమ్నా జనాసః ॥ 652

(23) వాయో యాహి శివా దివో వహస్వా సుస్వశ్వ్యమ్ ।

వహస్వ మహః పృథుపక్షసా రథే ॥ 653

---

1. త్వష్టుర్జామాత. 2. రాయఽఈమహే. (వ్రా.ప్ర.)

(24) త్వాం హి సుప్సరస్తమం నృషదనేషు హూమహే ।
గ్రావాణం నాశ్వపృష్ఠం మంహనా ॥ 654

(25) స త్వం నో దేవ మనసా వాయో మన్దానో[1] అగ్రియః ।
కృధి వాజాగ్ం[2] అపో ధియః ॥ 655

## సూక్తము—26

ఋషి—వైయశ్వుఁడైన విశ్వమనసుఁడు లేక అంగిరసుఁడైన వ్యశ్వుఁడు*
దేవత—అశ్విద్వయము, 20-25-వాయువు

(1) గీ॥ కాంక్షితాశ్విద్వయంబ! మీ ఘనబలంబు
నెవరు హింసంపఁజాలుదు రెల్ల స్తోతృ
వరులు మీ రాకఁ గోరి మీ యరద మెలమిఁ
బిలుచుచుందురుగాదె! సంప్రీతు లగుచు॥ 573

(2) గద్యము॥

''నాసత్యులు, నభిలాషప్రదులు, ధనవంతులు నగు నశ్విద్వయమా! మీరు సుషామరాజునకు
ధన మొసంగుటకు వచ్చినట్లు రక్షతోఁగూడ రండు!'' అని యో వరురాజా! నీ వనుము! ॥ 574

(3) గీ॥ అన్నరథయుక్తమైనట్టి యశ్వియుగమ!
యిపుడు రాతిరి గడిచిన నెలమి మిముల
హవ్యమును జేతఁబట్టుచు నాదరమునఁ
బిలిచెదము మేము మిక్కిలి ప్రీతి మెఱయ॥ 575

---

1. మన్దానోఽఅగ్రియః, 2. వాజాగ్ంఽఅపోధియః. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము, 93వ పుట) వైయశ్వుఁడో, విశ్వమనస్సుఁడో, ఋషిగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో వైశ్వానరుఁడు ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గీ॥ అధికవహనశీల మైనట్టి మీ యర
దంబు వచ్చుఁగాకఁ దనరి మీరు
స్తోత్రవరుల కెల్ల సుందరధన మిండు!
చూడుఁ డశ్వులార! స్తోమ మెల్ల॥ 576

(5) గీ॥ కుటిలకర్మకారికూటము మీ చెంతఁ
గలదు మీరు దానిఁ గాంత్రుగాత!
రుద్రు లౌట మీరు ఛిద్రకారుల కెల్లఁ
గ్లేశములను జూపి కీర్తిఁగనుఁడు! ॥ 577

(6) చ॥ జల గతిఁ గల్గువారలయి చారుతరంబగు కాంతిఁగూడి వి
చ్చలవిడి దర్శనీయు లగు సన్మతి యాగకరాశ్వియుగ్మమా!
విలసిత లౌచు నంతటకు వేగము పోయెడు నశ్వ మెక్కి మీ
రిలఁ గల యజ్ఞభూములకు నెంతయుఁ బ్రీతిని రండు! మత్తులై ॥ 578

(7) గీ॥ విశ్వపోషక ధనముచే వెలయునట్టి
యస్మదిష్టులకున్ రారె! యశ్వివరులు!
మీరు మఘవానులరు మరి మీరు వీరు
లభిభవంబును బొందక యమరఁగలరు ॥ 579

(8) గీ॥ ఇంద్ర! నాసత్యవరులార! యెలమి మీరు
సేవ్యమానులరై ప్రీతిఁ జెలఁగి, మేము
సేయు యజ్ఞాదికర్మలఁ జేర, దేవ
సముదయంబులతోఁ గూడి సాగిరండు! ॥ 580

(9) క॥ ధనముం గోరుచు మిమ్ముల
ఘనుఁడౌ వ్యశ్వుఁడు విధాన గౌరవ బుద్ధిన్
వినయమునఁ బిలువ నశ్వులు!
విని మా మొఱ నిటకు మీరు విచ్చేయరొకో! ॥ 581

(10) క॥ ముని! నీ వశ్విద్వయమును
విసుతించిన దాని వారు వినుచుం జెంతన్
గనఁబడు శత్రువులకు మరి
పణులకు హింసలను జేయఁ బరికింత్రుగదా! 582

(11,12) గద్యము॥

ఓ నేతృద్వయమా! వైయశ్వని యాహ్వానము నాలింపుము! మా స్తుతిని దెలిసికొనుము!
వరుణుఁడు, మిత్రుఁడు, నర్యముఁడు, సర్వదా కలిసి యుందురు. స్తుతి యోగ్యులు
నభిలాషప్రదులు నగు నశ్వులారా! మీరు స్తోతలకు దేని నిచ్చెదరో!
దేనిని గొనితెచ్చెదరో! దానిని బ్రతిదినమును దెచ్చుచుండుఁడు! 583

(13) గీ॥ వస్త్రమునఁ గప్పఁబడునట్టి వధువు మాట్కి-
నిష్టిచే నావృతుండైన యెల్ల వ్యక్తి
కఖిలపరిచర్యఁ జేయుచు నశ్వియుగ్మ
మఖిల మంగళములఁ గూర్చు నిఖిలమునకు ॥ 584

(14) గీ॥ వ్యాప్తనేతల కత్యంత పానయోగ్య
మైన సోమ రసంబును నందఁజేయ
నెరుఁగుదుము మేము లాభంబు జరుప మీరు
మా గృహంబులఁ జేరుఁడు! మాన్యులార! 585

(15) ఉ॥ కోరిక లిచ్చువారలయి కోరు ధనంబు నొసంగువార లౌ
వీర మహాశ్వులార! కడు విశ్రుతనేతకుఁ బానయోగ్య మౌ
సారస సోమ మానుటకుఁ జక్కఁగ రండు! నతిప్రసక్తి చే
మారక మౌ శరంబు వలె మా కృతయజ్ఞము నంతఁ బుచ్చుఁడీ! ॥ 586

(16) గీ॥ అఖిలనేతలుగా నున్న యశ్వులార!
సోమములు మీ కడకు వచ్చి నీమ మలర
మిమ్ముఁ బిలుచుచు మిక్కిలి మీకుఁ బ్రీతి
కారకము లౌచు విలసిల్లుఁగాకఁ గరము ॥ 587

(17) గీ॥ అశ్వులార! మీర లర్ణవమందునో!
స్వర్గమందో! లేక సకల యాగ
పరుల సదనమందో! పరమప్రమత్తుల
రవుచు నుతుల వినరె! యతిశయముగ ॥ 588

(18) గీ॥ "శ్వేతయావరి" యను పేరఁ జెలఁగు సింధు
వమల సౌవర్ణపథయుక్త యగుచు మిమ్ము
విమల సూక్తుల మూలాన వేఁడుచుండి
యధికవేగము మీకడ కరుగఁగలుఁగు ॥ 589

(19) గీ॥ పుష్టిహేతు వగుచుఁ బూర్ణ యశోవంత
మగుచు శ్వేతవర్ణ మైన "శ్వేత
యావరీ"సమాఖ్య నమరు నదిం బ్రవా
హితముగా నొనర్ప మతిఁ దలఁపుఁడు! ॥ 590

(20) ఉ॥ వాయువ! నీ రథంబునకు వారువముల్ సమకూర్చి యజ్ఞమం
దే యనుమాన ముంచక యదేపనిఁ బూనుచు నశ్వియుగ్మమున్
బాయక మిశ్రితంబులుగఁ బల్మరొనర్చుచు నీవు పిమ్మటం
జేయుచు సోమపానమును జేరుము! మూఁ డగు నిష్టికర్మలన్ ॥ 591

(21) గీ॥ యజ్ఞపతి వౌచు వాయువా! యద్భుతుఁడవు
త్వష్టృజామాత వౌదువు తగినయట్టి
నీదు పాలనమునఁజేసి నేను సర్వ
విధములన్ లాభ మందుచు వెలుఁగఁగలను 592

(22) గీ॥ త్వష్టృజామాత యైనట్టి వాయుదేవు
కడకుఁ జేరి ధనంబును నడుగఁగలను
సోమరసమును దీయుచు నూరు లెల్ల
ధనము గలవార లగుదురు తథ్య మదియె ॥ 593

(23,24) సీ॥ వాయుదేవుఁడ! నీవు స్వర్గస్థలంబున కతిమంగళుండవై యమరవలదె?
పార్శ్వద్వయపరీత పావనాశ్వంబుల నరదంబునకుఁ గూర్చి యమరవలదె?
యశ్వవిశిష్టమౌ నరదంబు నెక్కుచు దేశంబులం దెల్లఁ దిరుగవలదె?
భవదీయసర్వాంగ నవమహిమంబుచే నంతటన్ వ్యాపింప నరుగవలదె?
గీ॥ సోమరసమును దీసెడు సుందరంపుఁ, బ్రస్తరముఁ బోలి యజమాన వసతులందు
నిన్నుఁ బిలుచుచు నుందురు నిఖిలయజ్ఞ,పరులు నీవును బరమసుందరుఁడ వౌదు ॥ 594

(25) గీ॥ వాయుదేవుఁడ! దేవతావర్గమునకుఁ
గడుఁ బ్రధానుండవై నీవు కరము ముదము
కలిఁగి యన్నంబు జలమును గలుగఁజేసి
కర్మదాన మొసంగుమా! నిర్మలముగ ॥ 595

## సూక్తమ్—27

ఋషిః—మనుర్వైవస్వతః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) అగ్నిరుక్థే పురోహితో గ్రావాణో బర్హిరధ్వరే ।
ఋచా యామి మరుతో బ్రహ్మణస్పతిం దేవాగ్ం[1] అవో వరేణ్యమ్ ॥ 656

(2) ఆ పశుం గాసి పృథివీం వనస్పతీనుషాసా నక్తమోషధీః ।
విశ్వే చ నో వసవో విశ్వవేదసో ధీనాం భూత ప్రావితారః ॥ 657

1. దేవాగ్ంఽఅవో. (ప్రా.ప్ర.)

(3) ప్ర సూ న[1] ఏత్వధ్వరోఽగ్నా దేవేషు పూర్వ్యః ।
ఆదిత్యేషు ప్ర వరుణే ధృతవ్రతే మరుత్సు విశ్వభానుషు ॥ 658

(4) విశ్వే హి ష్మా మనవే విశ్వవేదసో భువన్ వృధే రిశాదసః ।
అరిష్టేభిః పాయుభిర్విశ్వవేదసో యన్తా నోఽవృకం ఛర్దిః ॥ 659

(5) ఆ నో[2] అద్య సమనసో గన్తా విశ్వే సజోషసః ।
ఋచా గిరా మరుతో దేవ్యదితే సదనే పస్త్యే మహి ॥ 660

(6) అభి ప్రియా మరుతో యా వో[3] అశ్వ్యా హవ్యా మిత్ర ప్రయాథన ।
ఆ బర్హిరిన్ద్రో వరుణస్తురా నర[4] ఆదిత్యాసః సదన్తు నః ॥ 661

(7) వయం వో వృక్తబర్హిషో హితప్రయస[5] ఆనుషక్ ।
సుతసోమాసో వరుణ హవామహే మనుష్వదిద్ధాగ్నయః ॥ 662

(8) ఆ ప్ర యాత మరుతో విష్ణో[6] అశ్వినా పూషన్ మాకీనయా ధియా ।
ఇన్ద్ర[7] ఆ యాతు ప్రథమః సనిష్యుభిర్వృషా యో వృత్రహా గృణే ॥ 663

---

1. నఽఏతధ్వరో, 2. ఆ నోఽఅద్య, 3. యా వోఽఅశ్వ్యా, 4. నరఽఆదిత్యాసః, 5. ప్రయసఽఆనుషక్,
6. విష్ణోఽఅశ్వినా, 7. ఇన్ద్రంఽఆయాతు. (వ్రా. ప్ర.)

(9) వి నో దేవాసో[1] అద్రుహో ఒచ్ఛిద్రం శర్మ యచ్ఛత ।
న యద్ దూరాద్ వసవో నూ చిదన్తితో వరూథమాదధర్షతి ॥ 664

(10) అస్తి హి వః సజాత్యం రిశాదసో దేవాసో[2] అస్త్యాప్యమ్ ।
ప్ర ణః పూర్వస్మై సువితాయ వోచత మక్షూ సుమ్నాయ నవ్యసే ॥ 665

(11) ఇదా హి వ[3] ఉపస్తుతిమిదా వామస్య భక్తయే ।
ఉప వో విశ్వవేదసో నమస్యురాగ్ం[4] అసృక్ష్యన్యామివ ॥ 666

(12) ఉదు ష్య వః సవితా సుప్రణీతయో ఒస్థాదూర్ధ్వో వరేణ్యః ।
ని ద్విపాదశ్చతుష్పాదో[5] అర్థినో ఒవిశ్రన్ పతయిష్ణవః ॥ 667

(13) దేవందేవం వో ఒవసే దేవందేవమభిష్టయే ।
దేవందేవం హువేమ వాజసాతయే గృణన్తో దేవ్యా ధియా ॥ 668

(14) దేవాసో హి ష్మా మనవే సమన్యవో విశ్వే సాకం సరాతయః ।
తే నో[6] అద్య తే అపరం తుచే తు నో భవన్తు వరివోవిదః ॥ 669

---

1. దేవాసోఒఅద్రుహో, 2. దేవాసోఒఅస్త్యాప్యమ్, 3. వఽఉపస్తుతి, 4. రాగ్ంఒఅసృక్ష్య.

5. చతుష్పాదోఒఅర్థినో, 6. తే నోఒఅద్య తేఒఅపరం. (ప్రా.ప్ర.)

(15) ప్ర వః శంసామ్యద్రుహః సంస్థ[1] ఉపస్తుతీనామ్ ।
న తం ధూర్తిర్వరుణ మిత్ర మర్త్యం యో వో ధామభ్యోఽవిధత్ ॥ 670

(16) ప్ర స క్షయం తిరతే వి మహీరిషో యో వో వరాయ దాశతి ।
ప్ర ప్రజాభిర్జాయతే ధర్మణస్పర్యరిష్టః సర్వ[2] ఏధతే ॥ 671

(17) ఋతే స విన్దతే యుధః సుగేభిర్యాత్యధ్వనః ।
అర్యమా మిత్రో వరుణః సరాతయో యం త్రాయన్తే సజోషసః ॥ 672

(18) అజ్రే చిదస్మై కృణుథా న్యఞ్చనం దుర్గే చిదా సుసరణమ్ ।
ఏషా చిదస్మాదశనిః పరో ను సాస్రేధన్తీ వి నశ్యతు ॥ 673

(19) యదద్య సూర్య[3] ఉద్యతి ప్రియక్షత్రా[4] ఋతం దధ ।
యన్నిమ్రుచి ప్రబుధి విశ్వవేదసో యద్ వా మధ్యందినే దివః ॥ 674

(20) యద్ వాభిపిత్వే[5] అసురా ఋతం యతే ఛర్దిర్యేమ వి దాశుషే ।
వయం తద్ వో వసవో విశ్వవేదస[6] ఉప స్థేయామ మధ్య[7] ఆ ॥ 675

---

1. సంస్థఽఉపస్తుతీ, 2. సర్వఽఏధతే, 3. సూర్యఽఉద్యతి, 4. క్షత్రాఽఋతం, 5. పిత్వేఽఅసురాఽఋతం.
6. వేదసఽఉప, 7. మధ్యఽఆ. (ప్రా.ప్ర.)

(21) యదద్య సూర[1] ఉదితే యన్మధ్యందిన[2] ఆతుచి ।
వామం ధత్థ మనవే విశ్వవేదసో జుహ్వానాయ ప్రచేతసే ॥ 676

(22) వయం తద్ వః సమ్రాజ[3] ఆ వృణీమహే పుత్రో న బహుపాయ్యమ్ ।
అశ్యామ తదాదిత్యా జుహ్వతో హవిర్యేన వస్యోఽనశామహై ॥ 677

## సూక్తము—27

ఋషి— వైవస్వతమనువు*
దేవత — విశ్వే దేవగణము

(1) ఉ॥ యాగములందు సూక్తముల నత్యధికంబుగఁ బల్కు వేళ నా
భోగమహాగ్ని ప్రస్తర విభూషిత ధర్భసమూహ సంలస
ద్భాగమునందు నుంచఁబడె వాఁడు మరుత్తుల బ్రహ్మణస్పతిన్
రాగ మెలర్ప మంత్రముల రంజిలఁజేయుచు నుండు నెంతయున్ ॥ 596

(2) సీ॥ పావకుండా! యజ్ఞపశువుచెంతకు నీవు వచ్చి మా నుతి విని మెచ్చవలదె!
సవనస్థలిం జేరి సువనస్పతిం జూడ వచ్చి మా నుతి విని మెచ్చవలదె!
సోమముం దీసెడు సుప్రస్తరముఁ జేరవచ్చి మా నుతి విని మెచ్చవలదె!
దిన నిశీథులయందుఁ దేజరిల్లుచు నీవు వచ్చి మా నుతి విని మెచ్చవలదె!
గీ॥ సకలధనవంతులార! యో సదనదాత, లార! విశ్వాధిదేవతలార! మీరు
మా కృతము లైన కర్మల మరువకుండ, వివిధరీతుల రక్షించి వెలుఁగవలదె! ॥ 597

---

1. సూరఽఉదితే, 2. దినఽఆతుచి, 3. సమ్రాజఽఆ. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 99 పుట) వైవస్వతమనువు ఋషిగాను, 15b సంపుటములో మనువు లేక విశ్వేదేవతలు ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(3) గీ॥ అతిపురాతనకర్మల నగ్ని సమర
సంఘముం జేయఁగాకఁ బ్రశాంతి నొంది
రూఢతేజోవిశిష్టమరుద్వరుణులు
వెలుఁగుదురుగాక! నా దితిబలముతోడ ॥ 598

(4) క॥ ధనసంపన్నులు! శాత్రవ
గణభక్షక విశ్వదేవగణములు! మీరల్
ఘన మగు పరిపాలనమున
ననహింసతగృహము మాకు నందింపరొకో! ॥ 599

(5) చ॥ నిరుపమ తుష్టియుక్తులయి నిత్యము విశ్రుత లౌచు సూక్తయుక్
నిరతిశయాఢ్యులై మిగుల నేర్పున వత్తురుగాకఁ జెంతకున్
మరుదమరేశులార! పరమార్యులు మీరలు మా గృహంబులన్
సురుచిరలీలఁ జేరి కడు సౌఖ్యము నందరె! సర్వభంగులన్ ॥ 600

(6,7) సీ॥ ఓ మరుద్వరులార! మీ మహాశ్వంబులఁ గదిలింపుఁడీ! కడుఁ గరుణ గలుఁగ
మిత్రదేవుఁడ! నీవు మే మిచ్చు హవ్యంబు గ్రహియింపఁగా రమ్మ! కాంతి మెఱయ
నింద్రావరుణురార! యీ కుశస్థలిపైని వసియింపుఁడీ! మీరు వాసి కెక్క-
నాదిత్యవరులార! యస్మత్కుశలపైని విశ్రమింపుఁడీ! మీరు వేడ్క-మీర
గీ॥ వరుణుఁడా! [1]మనువువలె నీకు భాసమాన, సోమరసము నొసంగుచు శుద్ధవహ్ని
వెల్గఁజేయుచు హవ్యము గల్గి కుశలఁ, ద్రుంచి పిలుచుచు నుందురు దోషహరులు ॥ 601

(8) గీ॥ అల మరుద్గణంబు లశ్విద్వయంబును
విష్ణుపూషసురలు విమలమతిని
మేము పల్కు-నుతుల మెచ్చుచు నిష్టిని
జూడ నుంద్రు జనులు చోద్య మంద ॥ 602

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "ఖల"ము ప్రయుక్తమైనది.

గీ॥ దేవతలలోన నుత్తమ దేవుఁడైన
యింద్రదేవత యిట విశ్రమించుఁగాక!
వివిధజనులు మహేంద్రుని వృత్రహంత
యనుచు నుడువుచునున్నారు మనసులందు ॥ 603

(9) గద్యము ॥

ద్రోహరహిత మగు దేవగణమా! బాధారహితము లగు గృహంబుల మా కొసంగుము!
వాసప్రద లగు దేవతలారా! దూరాంతిక దేశములనుండి యెవ్వరును నెప్పుడును
వరణీయసదనంబులకు హింసలను బుట్టింప సమర్థులు కారు ॥ 604

(10) గీ॥ శత్రుహంతలార! సకలదేవతలార!
యేక జాతి భావ మెసఁగు స్నేహ
ధర్మ ముండె మీకుఁ దగ ధనాభ్యుదయార్థ
మిపుడు వానిఁ జూపుఁ డెలమి మాకు ॥ 605

(11) గీ॥ సర్వధనవదమరసంఘమా! నే నన్న
మభిలషించి యోగ్య మైన మీ ధ
నంబు గోరి నుతివిధంబును మాత్రము
చేయుచున్నవాఁడఁ జిత్త మలర ॥ 606

(12) గద్యము॥

సుందరస్తుతివంతు లగు మరుత్తులారా! మీలో నూర్ధ్వగామియు, వరణీయుఁడు నగు సవిత
యెపు డుత్థితుఁ డగునో! యపుడు ద్విపదములు గల జంతువులు, పక్షులు తమతమ
కార్యములయందుఁ బ్రవర్తిల్లును ॥ 607

(13,14) సీ॥ స్తుతులచేతన్ మిమ్ము సొంపుగ వర్ణించి వ్రిశుతకర్ములఁ బిలుతు నేను
గాంక్షితదానంబు కలుఁగఁగోరి ద్యుతిఁ గలిఁగిన మిమ్ములఁ బిలుతు నేను
ద్యుతిమత్సరలయందు మతిమంతు లగు వారి బ్రీతివంతుఁడనయి పిలుతు నేను
సకలదేవతలకు సకలాన్నదానంబుఁ గలుఁగఁజేయఁగ మిమ్ముఁ బిలుతు నేను
గీ॥ విశ్వదేవత లెల్లరు విపులమైన, క్రోధమును [1]మనువునకుఁ గడుఁ గూర్చఁగోరి
యిప్పుడో! యెప్పుడో! మరి యెప్పుడైన, దాత లగుదురు మా యోగ్య తనయులకయి ॥ 608

(15) క॥ ప్రీతిమెయిం దేజో వి
ఖ్యాతాత్ములు సురలు! మీరు ఘను లగుదురు సం
స్తోతల కాధారములౌ
పూతేష్టుల మిముల నుతులఁ బొగడెదముగదా! ॥ 609

(16) ఉ॥ దేవతలార! యే జనుఁడు దివ్యహవిస్సును మీ కొసంగునో!
వావిరి వాని గేహ మతివర్ధితమై విలసిల్లు వాని కిం
కేవిధినైన నన్న మగు నిష్టులవల్లఁ దదీయప్రజ్ఞయున్
స్థావర మౌను వాఁడు కడు సౌఖ్యము నందు నిరస్తహింసుఁడై ॥ 610

(17) క॥ రణముల జరుపక యాతఁడు
ధన మందును నశ్వ మెక్కి తరలుచుఁ బో విం
కను వాని కర్యమాదులు
ఘనప్రాణము లొసఁగఁగలరు కనుచున్ వానిన్ ॥ 611

(18) గీ॥ అమరులార! దుర్గమాగమ్యదేశము
సుగమ మైనయట్లు తగ నొసర్చుఁ
దశని యెట్టివారికైన హింసలు సేయ
లేక నాశ మొందు లీల మాత్ర ॥ 612

(19) సీ॥ భాస్కరుఁ డుదయింప భవ్యగృహంబుల ధరియించి మీరలు తనియవలయు
సూర్యుడు గతియింప సుందరగృహముల ధరియించి మీరలు తనియవలయు
రవి ప్రబుద్ధుఁడు కాఁగ రాజద్గృహంబుల ధరియించి మీరలు తనియవలయు
భానుఁడు దినమధ్య భాసింప గృహముల ధరియించి మీరలు తనియవలయు
గీ॥ ఘనబలప్రియ దేవతాగణములార!, సర్వధనవంతులార! యో సరసులార!
సకలకళ్యాణ కరములౌ సదనములను, మీరు ధరియించెదరుగాక! మిక్కుటముగ ॥ 613

(20) ఉ॥ వాసదులార! సర్వధనభాసురులార! మహేష్టికర్తకే
వాస మొసంగువారలయి వర్ధిలు వారలు మీర లట్టి సద్
భాసురమై శుభం బొసఁగు వాసమునందు సమస్త పూజలం
జేసెదఁ బ్రాజ్ఞులార! విలసిల్లఁగ మీకు సమస్త భంగులన్ ॥ 614

(21) గద్యము॥

సర్వధనవంత మగు దేవతాబృందమా! సూర్యుఁ డుదయించు సమయమున, మధ్యాహ్న కాలమున, సాయంసమయమున, హవ్య మొసంగువాఁడును, ప్రకృష్టజ్ఞానవంతుఁడు నగు మనువు నుద్దేశించి కమనీయ ధనంబు ధరియింపుఁడు! ॥ 615

(22) గీ॥ పూతసుచలార! మా దివ్యపుత్రకులను
ననుసరించుచు ధనమును నందఁగలను
హోమముం జేయుచుం బ్రీతి మేము ధనము
పలన సంపద నొందెద మెలమి మిగుల ॥ 616

## సూక్తమ్—28

ఋషిః—మనుర్వైవస్వతః,
దేవతా—విశ్వే దేవాః
ఛందః—గాయత్రీ, 4-పురఉష్ణిక్

(1) యే త్రింశతి త్రయస్పరో దేవాసో బర్హిరాసదన్ ।
విదన్నహ ద్వితాసనన్ ॥ 678

(2) వరుణో మిత్రో[1] అర్యమా స్మద్రాతిషాచో[2] అగ్నయః ।
పత్నీవన్తో వషట్కృతాః ॥ 679

(3) తే నో గోపా[3] అపాచ్యాస్త ఉదక్త ఇత్థా న్యక్ ।
పురస్తాత్ సర్వయా విశా ॥ 680

(4) యథా వశన్తి దేవాస్తథేదసత్ తదేషాం నకిరా మినత్ ।
అరావా చన మర్త్యః ॥ 681

(5) సప్తానాం సప్త[4] ఋష్టయః సప్త ద్యుమ్నాన్యేషామ్ ।
సప్తో[5] అధి శ్రియో ధిరే ॥ 682

---

1. మిత్రోఽఅర్యమా, 2. షాచోఽఅగ్నయః, 3. గోపాఽఅపాచ్యాస్తఽఉదక్తఽఇత్థా న్యక్, 4. సప్తఽఋష్టయః, 5. సప్తోఽఅధి. (ప్రా.ప్ర.)

## సూక్తము—28

ఋషి—వైవస్వత మనువు*
దేవత—విశ్వే దేవగణము

(1) గీ॥ మూఁడుపదులమీఁద ముగ్గురౌ దేవతల్
దర్భపై వసించి తగ వెలింగి
రెండు విధములౌ నఖండధనంబుల
నెసఁగనున్న వార లెలమి మీర ॥ 617

(2) గీ॥ వరుణమిత్రార్యములు హవిఃప్రదులతోడ
గంతృ పత్నీగణంబుతోఁ గలిసికొనిన
వారలౌచు వషట్కారపద్ధతులను
బిలువఁబడుదురుగాకఁ దా మెలమి మీర ॥ 618

(3) గీ॥ సమ్ముఖమునందు వెనుకను సర్వవిధుల
నిమ్నమున నుత్తరంబున నీతి వేదు
లైన యనుచరులను గూడి యస్మదీయ
పాలకులు కారె! యమరులు పరమతుష్టి ॥ 619

(4) గీ॥ అమరు లెయ్యది కోరుదు రది సమస్త
విధుల సిద్ధంబుగాదె! యీ విశ్వమందు
దేవతల కామనంబులఁ దివిరి యెవరు
చెరుపఁగా శక్తి గలవార లరులయందు ॥ 620

(5) క॥ సప్తవిధ మరుత్తులకున్
సప్తేష్టులు గలవు మరియు సప్తాక్షరణ
వ్యాప్తులు వారలు, సంతత
సప్తవిధసుదీప్తు లుండె సర్వ సురలకున్ ॥ 621

---

† నొసఁగ మన్నవార లెలమి మీర (వ్రా.ప్ర. పా. యతి భంగము)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 107వ పుట) "మనువు" ఋషిగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "మనువు లేక విశ్వేదేవతలు" ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

## సూక్తమ్—29

ఋషిః—మనుర్వైవస్వతః, కశ్యపో వా మారీచః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—ద్విపదా విరాట్

(1) బభ్రురేకో విషుణః సూనరో యువాఞ్జ్యఙ్క్తే హిరణ్యయమ్ ॥ 683

(2) యోనిమేక[1] ఆ ససాద ద్యోతనో ఽన్తర్దేవేషు మేధిరః ॥ 684

(3) వాశీమేకో బిభర్తి హస్త[2] ఆయసీమన్తర్దేవేషు నిధ్రువిః ॥ 685

(4) వజ్రమేకో బిభర్తి హస్త[3] ఆహితం తేన వృత్రాణి జిఘ్నతే ॥ 686

(5) తిగ్మమేకో బిభర్తి హస్త[4] ఆయుధం శుచిరుగ్రో జలాషభేషజః ॥ 687

(6) పథ[5] ఏకః పీపాయ తస్కరో యథాఁ[6] ఏష వేద నిధీనామ్ ॥ 688

(7) త్రీణ్యేక[7] ఉరుగాయో వి చక్రమే యత్ర దేవాసో మదన్తి ॥ 689

(8) విభిర్ద్వా చరత[8] ఏకయా సహ ప్ర ప్రవాసేవ వసతః ॥ 690

(9) సదో ద్వా చక్రాతే[9] ఉపమా దివి సమ్రాజా సర్పిరాసుతీ ॥ 691

(10) అర్చన్త[10] ఏకే మహి సామ మన్వత తేన సూర్యమరోచయన్ ॥ 692

---

1. మేకఽఆ, 2. హస్తఽఆయ, 3. హస్త ఆహితం, 4. హస్తఽఆయుధం. 5. పథఽఏకః 6. యథాఁఽఏష.
7. త్రీణ్యేకఽఉరుగాయో, 8. చరతఽఏకయా, 9. చక్రాతేఽఉపమా, 10. అర్చన్తఽఏకే. (వ్రా.ప్ర.)

## సూక్తము—29

ఋషి—వైవస్వతమనువు లేక మారీచపుత్త్రుఁడు కశ్యపుఁడు*

దేవత—విశ్వే దేవతలు

(1,2, సీ॥ బభ్రువర్ణుఁడు, రాత్రిపతి, యువ, సోముండు సౌవర్ణభూషలఁ జక్కఁ బ్రోచు
3,4,5) నిశ్చలస్థలియందు నిలిచిన యా త్వష్టచేతఁ గుఠారంబుఁ జెలఁగఁ బట్టు
నేకాకియైనట్టి యింద్రుని హస్తంబు వజ్రాయుధము దాల్చి వరలుచుండు
తీక్ష్ణమౌ పవిధార తీక్ష్ణవృత్రాసుర నశియింపఁగాఁ జేయ నడచుచుండు
గీ॥ సుఖవివర్ధకు లోషధశోభ గల్గు, వార లుగ్రులు శుచి గల్గు వార లైన
రుద్రపుత్రకు లాయుధరూపములను, వెలుఁగుచున్నార లీ మహావిశ్వమందు ॥ 622

(6,7,8) సీ॥ ఒక్కఁడై తాఁ బూషు నెక్కువ దీక్షతోఁ బథమును రక్షింపఁ బారుచుండుఁ
దస్కరుఁ బోలుచు ధనమును నెఱుఁగుచు సంతసంబునఁ దాను సాగుచుండు
విష్ణు వొక్కఁడె లసద్వివిధలోకములచే స్తుతియోగ్యుఁడై తాను సొగసుఁ గాంచు
నతఁడు పదత్రయ మంతట క్షేపింప నమరులు హృష్టులై యరుగుచుండు
గీ॥ రశ్మిపుంగవు లొకతె యౌ యతివఁ గూడు, కొను ప్రవాసి ద్వయంబును ననుకరించి
యశ్వములతోడ నంతట కరుగఁదెంచి, సంతరించుచు నుందురు సకలవిధుల ॥ 623

(9,10) † సుమేళవృత్తము॥
పరస్పరోపమేయులైన వరుణమిత్రు లిద్దఱున్
బరీత దీప్తు లౌచు హవ్యభాగ్యసంయుతుల్ గదా!
కరంబు వారు సకలదివిని గల్పనంబుఁ జేయుచున్
పఠుల్ పఠించు సూక్తి సూర్యుఁ బరమదీప్తుఁ జేయరే! ॥ 624

---

*వ్రాతప్రతిలో (9వ సంపుటము-109 పుట) "మారీచపుత్త్రుఁడు కశ్యపుఁడో లేక వైవస్వతమనువో" ఋషిగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "మనువు లేక కశ్యపుఁడు" ఋషిగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

†ఈ 624 పద్యము 9,10 ఋక్కుల కనువాదముగా వ్రాతప్రతిలో (9వ సంపుటము-109వ పుట) వ్రాయఁబడలేదు. ఈ పద్యము "సుగంధివృత్తము"గా శ్రీ నేమానివారు వ్రాసిరి. ఇది సరికాదు. సుగంధికి ర, జ, ర, జ, ర, వ, గణము లుండును. ఇది త్రివిధ భిన్నచ్ఛందములతోఁ గూడిన యొకానొక విషమ వృత్తము. (చూ. పీఠిక.)

## సూక్తమ్—30

ఋషిః—మనుర్వైవస్వతః

దేవతా—విశ్వే దేవాః

ఛందః—1-గాయత్రీ, 2-పురఉష్ణిక్, 3-బృహతీ, 4-అనుష్టుప్

(1) నహి వో[1] అస్త్యర్భకో దేవాసో న కుమారకః ।

విశ్వే సతోమహాన్త[2] ఇత్ ॥ 693

(2) ఇతి స్తుతాసో[3] అసథా రిశాదసో యే స్థ త్రయశ్చ త్రింశచ్చ ।

మనోర్దేవా యజ్ఞియాసః ॥ 694

(3) తే నస్త్రాధ్వం తేఽవత త[4] ఉ నో అధి వోచత ।

మా నః పథః పిత్ర్యాన్మానవాదధి దూరం నైష్ట పరావతః ॥ 695

(4) యే దేవాస[5] ఇహ స్థన విశ్వే వైశ్వానరా[6] ఉత ।

అస్మభ్యం శర్మ సప్రథో గవేఽశ్వాయ యచ్ఛత ॥ 696

---

1 నహి వోఽఅస్త్యర్భకో, 2. మహాన్తఽఇత్, 3. స్తుతాసోఽఅసథా, 4. తఽఉనోఽఅధి,

5. దేవాసఽఇహ, 6. నరఽఉత. (వ్రా.ప్ర).

## సూక్తము—30

ఋషి—వైవస్వతమనువు*
దేవత—విశ్వే దేవగణము

(1) క॥ ఎవరు కుమారులు? మీ కిం
కెవ రగుదురు శిశువులుగను? నెటు చూచిన మీ
రవగతులు మహాత్ములుగా
సవనాధిపులైన దేవసంఘములారా! ॥ 625

(2) క॥ మనుకృతయజ్ఞార్హులు మీ
రనయము శాత్రవగణంబు నడఁచెదు మీరల్
గణనకు ముప్పదిముగ్గురు
ఘనదేవతలార! మమ్ముఁ గనుఁడీ! కరుణన్ ॥ 626

(3) గీ॥ మాకుఁ ద్రాణ మొసఁగి మమ్ముల రక్షించి
మిష్ట కథలతోడ మెలఁగుఁ డీరు
పథమునుండి దూరపథినుండి మే మెల్ల
జారకుండునటులఁ జరుపుఁ డీరు ॥ 627

(4) గీ॥ యజ్ఞసంభవులార! యో యమరులార!
యంతటన్ మీరు నివసింతు రధికసుఖము
గోవులను నశ్వముల నెల్లఁ గూర్మి మాకు
దానమును నిండు! సర్వతోదాతలార! ॥ 628

---

*వ్రాతప్రతిలో (9వ సంపుటము-111 పుట) "వైవస్వత మనువు" ఋషిగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "మనువు" ఋషిగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

## అనువాకః—5, సూక్తమ్—31

ఋషిః—మనుర్వైవస్వతః
దేవతా—1-4-యజ్ఞః యజమానశ్చ,5-9-దంపతీ, 10-18దంపత్యాశిషః
ఛందః—గాయత్రీ, 9,14-అనుష్టుప్,10-పాదనిచృత్,15-18-పంక్తిః

(1) యో యజాతి యజాత[1] ఇత్సునవచ్చ పచాతి చ ।
బ్రహ్మేదిన్ద్రస్య చాకనత్ 697

(2) పురోళాశం యో[2] అస్మై సోమం రరత[3] ఆశిరమ్ ।
పాదిత్తం శక్రో[4] అంహసః ॥ 698

(3) తస్య ద్యుమాగ్ం[5] అసద్రథో దేవజూతః స శూశువత్ ।
విశ్వా వన్వన్నమిత్రియా ॥ 699

(4) అస్య ప్రజావతీ గృహే ఽసశ్చన్తీ దివేదివే ।
ఇళా ధేనుమతీ దుహే ॥ 700

(5) యా దంపతీ సమనసా సునుత[6] ఆ చ ధావతః ।
దేవాసో నిత్యయాశిరా ॥ 701

---

1. యజాత్తఽఇత్సు, 2. యోఽఅస్మై, 3. రరతఽఆశిరమ్, 4. శక్రోఽఅంహసః,
5. ద్యుమాగ్ంఽఅసద్రథో. 6, సునుతఽఆచ. (ద్రా ప్ర.)

(6) ప్రతి ప్రాశవ్యాగ్ం[1] ఇలః సమ్యఞ్చా బర్హిరాశాతే ।
స తా వాజేషు వాయతః ॥ 702

(7) న దేవానామపి హ్నుతః సుమతిం స జుగుక్షతః ।
శ్రవో బృహద్ వివాసతః ॥ 703

(8) పుత్రిణా తా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతః ।
ఉభా హిరణ్యపేశసా ॥ 704

(9) వీతిహోత్రా కృతద్వసూ దశస్యన్తామృతాయ కమ్ ।
సమూధో రోమశం హతో దేవేషు కృణుతోదువః ॥ 705

(10) ఆ శర్మ పర్వతానాం వృణీమహే నదీనామ్ ।
ఆ విష్ణోః సచాభువః ॥ 706

(11) ఐతు పూషా రయిర్భగః స్వస్తి సర్వధాతమః ।
ఉరురధ్వా స్వస్తయే 707

---

1. ప్రాశవ్యాగ్ంఽఇలః. (వా.ప్ర.)

(12) అరమతిరనర్వణో విశ్వో దేవస్య మనసా ।
ఆదిత్యానామనేహ[1] ఇత్ ॥ 708

(13) యథా నో మిత్రో[2] అర్యమా వరుణః సన్తి గోపాః ।
సుగా[3] ఋతస్య పన్థాః ॥ 709

(14) అగ్నిం వః పూర్వ్యం గిరా దేవమీళే వసూనామ్ ।
సపర్యన్తః పురుప్రియం మిత్రం న క్షేత్రసాధసమ్ ॥ 710

(15) మక్షూ దేవవతో రథః శూరో వా పృత్సు కాసు చిత్ ।
దేవానాం య[4] ఇన్మనో యజమాన[5] ఇయక్షత్యభీదయజ్వనో భువత్ ॥ 711

(16) న యజమాన రిష్యసి న సున్వాన న దేవయో ।
దేవానాం య[4] ఇన్మనో యజమాన[5] ఇయక్షత్యభీదయజ్వనో భువత్ ॥ 712

(17) నకిష్టం కర్మణా నశన్న ప్ర యోషన్న యోషతి ।
దేవానాం య[4] ఇన్మనో యజమాన[5] ఇయక్షత్యభీదయజ్వనో భువత్ ॥ 713

---

1. మనేహ ఽ ఇత్, 2. మిత్రో ఽ అర్యమా, 3. సుగా ఽ ఋతస్య, 4. య ఽ ఇన్మనో,
5. మాన ఽ ఇయక్షత్. (ప్రా.ప్ర.)

(18) ఆసదత్ర సువీర్యముత త్యదాశ్వశ్వ్యమ్ ।
దేవానాం య1 ఇన్మనో యజమాన2 ఇయక్షత్యభిదయజ్వనో భువత్ ॥ 714

ఇతి
షష్ఠోఽష్టకే ద్వితీయోఽధ్యాయ
స్సమాప్తః

## అనువాకము—5, సూక్తము—31

ఋషి—వైవస్వత మనువు*
దేవత—యజ్ఞము, యజమానుఁడు, 5-9-దంపతులు, 10-18-దంపతుల యాశీస్సులు*

(1) గీ॥ ఇష్టిఁ జేసినపిమ్మట నిష్టిఁ జేయు
వాఁడు సోమము దీయును వాఁడు దానిఁ
బాకముగ వండు మరియు నా పాకహారి
యైన యింద్రుని నుతియించు నాదరముగ ॥ 629

(2,3, సీ॥ నవ పురోడాశంబు సవనేశునకు నిడువారిని వైరి కాపాడుచుండు
4,5) దేవతాప్రేరిత దివ్యయానము వారిదై ప్రవర్తిల్లుచు ధర వెలుంగు
వారు రథంబున వైరిబాధల నెల్లఁ దొలఁగింపఁజేయంగఁ దొలఁగుచుండు
రన్నంబు పుత్రుల నాలమందలఁ గడుఁ బోఁడిమతో వారు పొందుచుండు
గీ॥ రెవరు దంపతులై యభిషవ మొనర్తు, రెవరు సోమము శోధింతు రెవరు దాని
మిశ్రణద్రవ్యములతోడ నశ్రమమునఁ, గల్పువారలో! వారలు ఘనులు జగతి ॥ 630

---

1. యఽఇన్మనో. 2. మానఽఇయక్షత్య. (వా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 111వపుట.)''మనువు" ఋషిగాను, "యజ్ఞము" దేవతగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "మనువు" ఋషిగాను, "యజమానుఁడు, వాని భార్య, వారి యాశీస్సులు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(6) గీ॥ అట్టి దంపతు లన్నంబు నంది మిగతు
లౌచు నిష్టి నుపస్థితు లగుదు రింక
వార లన్నంబునకు నెపుఁ జేరకుండ
నుండువారలు వేల్పులపిండులార! ॥ 631

(7,8,9) సీ॥ అమరుల కిచ్చెద మని యపలాపంబుఁ జేయకుండెడివారు చెలఁగువారు
తమ యనుగ్రహమును దప్పింప నిచ్చగింపని వారు సంతుష్టిఁ బరుగువారు
నన్నమూలంబున నధికమౌ పరిచర్యఁ బొందువారలు ప్రీతి నొందువారు
సకుమారులై స్వర్ణసంపత్తి నాయువు నందువారలు ఖ్యాతి నందువార
గీ॥ లైన యా దంపతుల నుతు లమరవరులు, కోరెదరు వారు వారికిఁ గొదవ లేక
సుఖకరంబైన యన్నము శోభఁ గల్గ, నిచ్చు వారలు సంస్తుతి మెచ్చువారు ॥ 632

(10,11) గీ॥ పర్వతాఖ్యలు తటినుల పరమసురలఁ
గూడు విష్ణువు సుఖమును గూర్చుఁగాక!
నధికధనధారి పూషయు నధికపథము
మంగళకరంబుగాఁ జేయు మాకు నెలమి ॥ 633

(12) గీ॥ ద్యోతమానుం డధృష్యుఁడు పూతచరితుఁ
డైన పూషను భక్తు లత్యంతతుష్టి
నెరిఁగివారు మహాదిత్యవర సమూహ
పక్షమునఁ బాపశూన్యులై పరగినారు ॥ 634

(13,14) గద్యము॥

వరుణుఁడు, మిత్రుఁడు, నర్యముఁడు, నే రూపమున రక్షకులో! యజ్ఞమార్గ మంతయు నా
రూపమున సుగమ మగును. ఓ దేవగణమా! మీకుఁ బ్రధానుఁడును, దీప్తిమంతుఁడును,
నగు నగ్నిని ధనమున కాశించి స్తుతింతును. మీకుఁ బరిచర్య నొనర్తును.
మనుష్యులు బహులోకప్రియులు వారలు యజ్ఞసాధకుఁ డగు
నగ్నిని స్తుతించెదరు ॥ 635

(15) ఉ॥ శూరుఁడు సైన్యమధ్యమును జొచ్చిన భంగి సమస్తదేవులం
జేరెడు వాని యాన మతిశీఘ్రము దుర్గమమార్గ మందెడున్
వారక దేవమానసము బంధురభక్తినిఁ గొల్చువాఁడు ని
స్సారుని యజ్ఞశూన్యు జను సత్వరరీతిఁ దిరస్కరించెడున్ ॥ 686

(16,17) సీ॥ యజమానపుంగవా! యన్ని విధంబుల నీవు నశింపక నిలిచె దౌర!
సోమాభిషవకారి! శుభము లిచ్చెడివాఁడ! నష్టము పొందక నడచె దౌర!
దేవాభిలాషి వౌ దివ్యమహాజన! క్షీణింపకయె నీవు చెలఁగె దౌర!
యమరమానసమును నభినుతించెడువాఁడ! సవనహీనుని నీవు చంపె దౌర!
గీ॥ కర్మమూలాన నెవరితోఁ గలఁతఁ బడక, నీవు స్వస్థానములయందు నిలిచె దౌర!
పుత్రపౌత్రాదిగణములఁ బొందకుండు, నట్టి మార్గము పట్టక యమరె దౌర! 687

(18) చ॥ సురలకు నే మహాజనుఁడు సూక్తులతోఁ బరిచర్యఁ జేయు నా
పరమజనుండు యజ్ఞములఁ బాసినవారిఁ దిరస్కరించు సుం
దరుఁడగు వీర్యవంతుఁడయి ధర్మపరాయణుఁడైన పుత్రునిన్
సురుచిరవాజులన్ ధనము శూరులు మెచ్చఁగఁ బొందెదున్గదా! 688

ఇయ్యది
శ్రీ భారద్వాజగోత్ర శ్రీ వేఙ్కటేశ్వరపౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
షష్ఠాష్టకమున ద్వితీయాధ్యాయము
సంపూర్ణము



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## అష్టమం మండలమ్
### షష్ఠోఽష్టకః-తృతీయోఽధ్యాయః

### సూక్తమ్—32

ఋషిః—మేధాతిథిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ప్ర కృతాన్యృజీషిణః కణ్వా[1] ఇన్ద్రస్య గాథయా ।
మదే సోమస్య వోచత ॥ 715

(2) యః సృబిన్దమనర్శనిం పిప్రుం దాసమహీశువమ్ ।
వధీదుగ్రో రిణన్నపః ॥ 716

(3) న్యర్బుదస్య విష్టపం వర్ష్మాణం బృహతస్తిర ।
కృషే తదిన్ద్ర పౌంస్యమ్ ॥ 717

---

1. కణ్వా ఇన్ద్రస్య. (వ్రా.ప్ర.)

(4) ప్రతి శ్రుతాయ వో ధృషత్ తూర్ణాశం న గిరేరధి ।
హువే సుశిప్రమూతయే । 718

(5) స గోరశ్వస్య వి వ్రజం మన్దానః సోమ్యేభ్యః ।
పురం న శూర దర్షసి ॥ 719

(6) యది మే రారణః సుత[1] ఉక్థే వా దధసే చనః ।
ఆరాదుప స్వధా గహి ॥ 720

(7) వయం ఘా తే[2] అపి ష్మసి స్తోతార[3] ఇన్ద్ర గిర్వణః ।
త్వం నో జిన్వ సోమపాః ॥ 721

(8) ఉత నః పితుమా భర సంరరాణో[4] అవిక్షితమ్ ।
మఘవన్ భూరి తే వసు ॥ 722

(9) ఉత నో గోమతస్కృధి హిరణ్యవతో[5] అశ్వినః ।
ఇళాభిః సం రభేమహి ॥ 723

---

1. సుతఽఉక్థే, 2, తేఽఅపి, 3. స్తోతారఽఇన్ద్ర, 4. రరాణోఽఅవిక్షితమ్, 5. వతోఽఅశ్వినః. (వ్రా.ప్ర.)

(10) బృహదుక్థం హవామహే సృప్రకరస్నమూతయే ।
సాధు కృణ్వన్తమవసే ॥ 724

(11) యః సంస్థే చిచ్ఛతక్రతురాదీం కృణోతి వృత్రహా ।
జరితృభ్యః పురూవసుః ॥ 725

(12) స నః శక్రశ్చిదా[1] శకద్ దానవాగ్ం[2] అన్తరాభరః ।
ఇన్ద్రో విశ్వాభిరూతిభిః ॥ 726

(13) యో రాయో౽వనిర్మహాన్ త్సుపారః సున్వతః సఖా ।
తమిన్ద్రమభి గాయత ॥ 727

(14) ఆయన్తారం మహి స్థిరం పృతనాసు శ్రవోజితమ్ ।
భూరేరీశానమోజసా ॥ 728

(15) నకిరస్య శచీనాం నియన్తా సూనృతానామ్ ।
నకిర్వక్తా న దాదితి ॥ 729

1. శకశ్చిదా, 2. వాగ్ం౨అన్తరా. (వా.ప్ర.)

(16) న నూనం బ్రహ్మణామృణం ప్రాశూనామస్తి సున్వతామ్ ।
న సోమో[1] అప్రతా పపే ॥ 730

(17) పన్య[2] ఇదుప గాయత పన్య[3] ఉక్థాని శంసత ।
బ్రహ్మ కృణోత పన్య[4] ఇత్ ॥ 731

(18) పన్య[5] ఆ దర్దిరచ్ఛతా సహస్రా వాజ్యవృతః ।
ఇన్ద్రో యో యజ్వనో వృధః ॥ 732

(19) వి షూ చర స్వధా[6] అను కృష్టీనామన్వాహువః ।
ఇన్ద్ర పిబ సుతానామ్ ॥ 733

(20) పిబ స్వధైనవానాముత యస్తుగ్ర్యే సచా ।
ఉతాయమిన్ద్ర యస్తవ ॥ 734

(21) అతీహి మన్యుషావిణం సుషువాంసముపారణే ।
ఇమం రాతం సుతం పిబ ॥ 735

---

1. సోమోఽఅప్రతా, 2. పన్యఽఇదుప, 3. పన్యఽఉక్థాని, 4. పన్యఽఇత్, 5. పన్యఽఆ దర్ది,
6. స్వధాఽఅను. (వా.ప్ర.)

(22) ఇహి తిస్రః పరావత[1] ఇహి పఞ్చ జనాగ్ం అతి ।
ధేనా[2] ఇన్ద్రావచాకశత్ ॥ 736

(23) సూర్యో రశ్మిం యథా సృజా[3] ఽఽ త్వా యచ్ఛన్తు మే గిరః ।
నిమ్నమాపో న సధ్య్రక్ ॥ 737

(24) అధ్వర్యవా తు హి షిఞ్చ సోమం వీరాయ శిప్రిణే ।
భరా సుతస్య పీతయే ॥ 738

(25) య[4] ఉద్నః ఫలిగం భినన్న్యక్ సిన్ధూగ్ం[5] రవాసృజత్ ।
యో గోషు పక్వం ధారయత్ ॥ 739

(26) అహన్ వృత్రమృచీషమ[6] ఔర్ణవాభమహీశువమ్ ।
హిమేనావిధ్యదర్బుదమ్ ॥ 740

(27) ప్ర వ[7] ఉగ్రాయ నిష్టురే[8] ఽషాఢాయ ప్రసక్షిణే ।
దేవత్తం బ్రహ్మ గాయత ॥ 741

---

1. వతఽఇహి, 2. ధేనాఽఇన్ద్రా, 3. సృజఆత్వా, 4. యఽఉద్నః 5. న్ధూగ్ంఽరవా, 6. షమఽఔర్ణవా,
7. ప్ర వఽఉగ్రాయ, 8. షాళహాయ. (ద్రా.ప్ర.)

(28) యో విశ్వాన్యభి వ్రతా సోమస్య మదే[1] అన్ధసః ।
ఇన్ద్రో దేవేషు చేతతి ॥ 742

(29) ఇహ త్వా సధమాద్యా హరీ హిరణ్యకేశ్యా ।
వోళ్హా[2]మభి ప్రయో హితమ్ ॥ 743

(30) అర్వాఞ్చం త్వా పురుష్టుత ప్రియమేధస్తుతా హరీ ।
సోమపేయాయ వక్షతః ॥ 744



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—తృతీయాధ్యాయము

### సూక్తము—32

ఋషి—కణ్వగోత్రీయుఁడు మేధాతిథి
దేవత—ఇంద్రుఁడు*

(1) గీ॥ సహజ గాథల నాలించి శక్రుఁ డధిక
మత్తుఁడై జన్మ మొందఁగ మాన్యకణ్వ
గణములార! సుసోమోద్ధకార్యములను
వెల్లడింతురుగాక! నీ విశ్వమందు ॥ 639

1. మదేఽఅన్ధసః, 2. వోళహామభి. (వ్రా.ప్ర.)

* ఈ సూక్తమునకు వ్రాతప్రతిలో (9వ సంపుటము-117పుట) "ఇంద్రుఁడు" దేవతగా వ్రాసిరి. కాని 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "యజమానుఁడు, వాని భార్య, వారి యాశీస్సులు" దేవతగా శ్రీ నేమానివారు పొరపాటున వ్రాసిరి.

(2,3) గద్యము॥

ఉగ్రుఁడగు నింద్రుఁ డుదకమును బ్రేరింపించుచు సువిందుని, నర్శుని, బిప్రువుని, దాసును,
నభిసువుని వధించెను. ఓ యింద్రుఁడా! బృహన్మేఘముయొక్క యావరకస్థానమును
విడఁగొట్టుము! ఇట్టి వీరకర్మల నాచరింపుము! ॥ 640

(4) చ॥ జలదము చెంతఁ జేరుచుఁ బ్రశస్త జలంబును వేఁడునట్టు లా
బలహరుఁడైన యింద్రుఁడు భవస్తుతి నెల్ల వినంగ మీకు నే
వలనను నైన రక్ష లిడు వానికిఁ బ్రార్థనఁ జేయువాఁడు తా
ఖలగణగర్వభంజనుఁడు కావఁడె! స్తోతలు! తల్చి చూడఁగన్ ॥ 641

(5) క॥ శూరుఁడ! సంహృష్టుఁడవై
వీరారిపురంబు లెల్ల విడఁగొట్టునటుల్
మీరుచు గవాశ్వశాలా
ద్వారంబులఁ దెరువుమయ్య! ధర్మము గనుచున్ ॥ 642

(6) గీ॥ అభిషుతంబైన సోమమునందు నుతుల
యందు ననురక్తి నీ కున్న యన్న మింద్ర
దేవ! నీ కున్నదూరస్థ దివ్యసీమ
నుండి యన్నము కొనితెమ్ము! మెండు నీవు ॥ 643

(7,8, సీ॥ స్తుత్యుండవౌ నింద్ర! సోమపాయీ! నీవు మమ్ముఁ బ్రీతులఁ జేయ మరువకయ్య!
9,10) ప్రీతుఁడవై భవత్స్తోతల మగు మాకు నన్నంబు నొసఁగుట నాపకయ్య!
సాహసంబును బూని గోహిరణ్యాదుల నొసఁగకుండుట నీకు నుచితమయ్య!
మఘవానుఁడా! ధనమహిమ నీయందుండె మా కన్న మొసఁగుట మానకయ్య!
గీ॥ లోకముల నెల్లఁ బాలింప లోలబాహువులను బ్రసృతములుగఁ జేసి లలితకార్య
ములను నొనరించు నుక్థముల్ గలిఁగియుండు, నింద్రదేవుని వేఁడెద నేను నుతుల ॥ 644

(11,12, సీ॥ జన్యకార్యవిశేషశత్రువిచ్ఛేదియై భక్తదేయధనంబుఁ బట్టునట్టి
13,14,15) దాన స్వభావతఁ దగిన రక్ష నొసంగి ఛిద్రముల్ పరిపూర్తిఁ జేయునట్టి
ఘనత సుపారుఁడై ధనపాలకత సోమదులకు సఖుండయి వెలుఁగునట్టి
బలపూర్వకంబుగ బహుధనముల కీశ్వరుండయి మెలఁగుచు నుండునట్టి
గీ॥ యుద్ధములయందుఁ జలియింపకుండునట్టి, యింద్రదేవుని కృత్యము నెవఁడు నియమ
నంబుఁ జేయఁగల్గును? వాఁ డనారతంబు, దాతకాఁడని యెవఁ డను? ఖ్యాతిఁ దప్పి ॥ 645

(16) గద్యము॥

సోమపాయులు, సోమాభిషవకారులు, నగు స్తోతలకు ఋణంబు లుండవు. సామాన్యధనము
గలిఁగిన వ్యక్తులు సోమపాన మొనర్చుటకు సమర్థులు కాఁజాలరు ॥ 646

(17) క॥ స్తుతి యోగ్యుఁడైన యింద్రున
కతిగానముఁ జేసి నుతుల ననుఁడీ! విబుధుల్!
మతిమంతుఁడ! సన్నుతి న
ప్రతిహతముగ సంగ్రహించి భాసిలవలదే! 647

(18) క॥ స్తుతియోగ్యుఁడైన యింద్రుఁడు
తతబలమును గల్గి శత్రుతాహీనుండై!
శతశతవైరులఁ దా వి
చ్యుతులుగ నొనరించు నిష్ఠఁ జూచుచునుండున్ ॥ 648

(19,20,
21,22) గద్యము॥

ఓ యాహ్వానయోగ్యుఁడా! నీవు మనుష్య లొసంగెడు హవ్యముచెంతకుఁ జనుము!
అభిషుతసోమమును గ్రోలుము! ఇంద్రుఁడా! ధేను వినిమయముచే, గ్రీతమును,
జలసంస్పృష్టమును నగు నీ సోమును ద్రావుము! క్రోధపూర్వకముగ నభిషవ
మొనర్చెడువారిని, ననుపయుక్తస్థానమందు నభిషవ మొనర్చువారిని,
నతిక్రమించి పొమ్ము! నీవు మే మొసంగెడు నభిషుతసోమమును
దృప్తి దీరఁ ద్రావుము! నీవు స్తుతుల నాలించితివి!
దూరదేశముల నుండు మూఁడు దిక్కులకు రమ్ము!
నీవు పంచజనుల నతిక్రమించి వెడలిరమ్ము! ॥ 649

(23) గీ॥ సూర్యుఁ డే రీతి రశ్మల సూటి మీర
నిడునొ! యిట్టులు ధన మెల్ల నిడుము! శక్ర!
జలము నిమ్నప్రదేశానఁ జెలఁగునట్లు
స్తుతులు నీయందు విలసిల్లు సూరివినుత! ॥ 650

(24) గద్యము॥

ఓ యధ్వర్యులారా! సుందరహనువిశిష్టుఁడు వీరుఁడు నగు నింద్రు నుద్దేశించి శీఘ్రముగ
సోమమును జల్లుఁడు! సోమరసమును ద్రావుటకు వానిని నాహ్వానింపుఁడు! ॥ 651

(25, సీ॥ జలమునకై హరి జలమును భేదించిభేదించి కీర్తితో వెలుఁగువాఁడు
26) నిమ్నమునకు వారి నిశ్చలంబుగఁ బంపిపంపి విఖ్యాతిని బరగువాఁడు
పక్వదుగ్ధంబులఁ బాడి యావుల కిచ్చియిచ్చి భక్తుల నెల్ల మెచ్చువాఁడు
హిమజలంబున మేఘ మెంతయు వేధించివేధించి యంతట వెలయువాఁడు
గీ॥ ఖలు నహీశవు † వృత్రుని గతినుఁడైన, యూర్ణనాభుని వధియించి యున్నవాఁడు
దీప్తిమూర్తి వహించి తాఁ దీప్తి గల్గు, వాఁడు మన్నుతి నాలించి వరలుఁగాక! ॥ 652

(27,28,
29,30) గద్యము॥

ఉగ్రుఁడు, నిష్ఠురుఁడు, నభిభవకారి, ప్రసహనశీలుఁడు, నగు నింద్రు నుద్దేశించి దేవప్రసాద
లబ్ధంబు లగు స్తోత్రముల గానముఁ జేయుఁడు! సోమరూపాన్నమ త్తత జనించిన పిదప
నింద్రుఁడు సమస్త కర్మల దేవతకు విజ్ఞాపించును. ప్రమత్తులు, హిరణ్యకేశవిశిష్టులు
నగు నశ్విద్వయ మీ యజ్ఞమునందు హితకరాన్నాభిముఖముగ నింద్రుని
బిలిచికొనివచ్చెదరు. ఓ యింద్రుఁడా! ప్రియమేధకర్తృక స్తుతు లగు
నశ్విద్వయము సోమపానార్థము నిన్ను మా కభిముఖముగఁ
దెచ్చునుగాక! ॥ 653

† వృత్రవధవిషయమై కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తులో (కౌ॥3-1, ఐ-బ్రా 7-28) ఇంద్రుఁడు ప్రతర్దనకు "నేను వృత్రాసురుని (వాఁడు బ్రాహ్మణుఁడైనను) జంపితిని, బ్రహ్మప్రతిపాదక ఋక్కుల నెరుంగని వ్యాసులను ముక్కలుముక్కలుగ నరికి తోడేళ్ళవాత వేసితిని. మా ప్రతిజ్ఞల ననేకముల నుల్లంఘనముఁ జేసినవారును, బ్రహ్లాదుని యాప్తులును, గోత్రజులు నైన పౌలోమ కాల ఖంజ నామ రాక్షసుల వధించితిని, ఇట్టివి యెన్ని యొనర్చినను దానిచే ("తస్య మే తత్ర స లోమం చ మా మీయతే") నా లోమమునకైనను వంకర కలుగలేదు". అని చెప్పెను, ఇంతను నెవ్వరు పూర్ణముగ నాత్మజ్ఞానము కలవారై యున్నారో! వారికి మాతృవధ పితృవధ భ్రూణహత్య స్తేయాదులగు నితరకర్మల దోషములుకలుగవు. ఇట్టివిషయములు మనస్సునందిడుకొని యింద్రుఁడు ప్రత్యర్దన కాత్మవిద్య బోధించెను. (గీతారహస్యము)

## సూక్తమ్—33

ఋషిః—మేధ్యాతిథిః కాణ్వః

దేవతా—ఇన్ద్రః

ఛందః—బృహతీ, 16-18-గాయత్రీ, 19-అనుష్టుప్

(1) వయం ఘ త్వా సుతావన్త[1] ఆపో న వృక్తబర్హిషః ।
పవిత్రస్య ప్రస్రవణేషు వృత్రహన్ పరి స్తోతార[2] ఆసతే ॥ 745

(2) స్వరన్తి త్వా సుతే నరో వసో నిరేక[3] ఉక్థినః ।
కదా సుతం తృషాణ[4] ఓక ఆ గమ ఇన్ద్ర స్వబ్దీవ వంసగః ॥ 746

(3) కణ్వేభిర్ధృష్ణవా ధృషద్ వాజం దర్షి సహస్రిణమ్ ।
పిశఙ్గరూపం మఘవన్ విచర్షణే మక్షూ గోమన్తమీమహే ॥ 747

(4) పాహి గాయాన్ధసో మద[5] ఇన్ద్రాయ మేధ్యాతిథే ।
యః సంమిశ్లో[6] హర్యోర్యః సుతే సచా వజ్రీ రథో హిరణ్యయః ॥ 748

(5) యః సుషవ్యః సుదక్షిణ[7] ఇనో యః సుక్రతుర్గృణే ।
య[8] ఆకరః సహస్రా యః శతామఘ[9] ఇన్ద్రో యః పూర్భిదారితః ॥ 749

---

1. సుతావన్తఽఆపో. 2. స్తోతారఽఆసతే. 3. నిరేకఽఉక్థినః 4. తృషాణఽఓకఽఆ గమఽఇన్ద్ర.
5. మదఽఇన్ద్రాయ. 6. సమిశ్లో. 7. సుదక్షిణఽఇనో యః. 8. యఽఆకరః, 9. మఘఽఇన్ద్రో యః. (ప్రా.ప్ర.)

(6) యో ధృషితో యోఽవృతో యో[1] అస్తి శ్మశ్రుషు శ్రితః ।

విభూతద్యుమ్నశ్చ్యవనః[2] పురుష్టుతః క్రత్వా గౌరివ శాకినః ॥ 750

(7) క ఈం వేద సుతే సచా పిబన్తం కద్ వయో దధే ।

అయం యః పురో విభినత్త్యోజసా మన్దానః శిప్ర్యన్ధసః ॥ 751

(8) దానా మృగో న వారణః పురుత్రా చరథం దధే ।

నకిష్ట్వా ని యమదా సుతే గమో మహాగ్ంశ్చరస్యోజసా ॥ 752

(9) య[3] ఉగ్రః సన్ననిష్టృతః స్థిరో రణాయ సంస్కృతః ।

యది స్తోతుర్మఘవా శృణవద్ధవం నేన్ద్రో[4] యోషత్యా గమత్ ॥ 753

(10) సత్యమిత్థా వృషేదసి వృషజూతిర్నోఽవృతః ।

వృషా హ్యుగ్ర శృణ్విషే పరావతి వృషో[5] అర్వావతి శ్రుతః ॥ 754

(11) వృషణస్తే[6] అభీశవో వృషా కశా హిరణ్యయీ ।

వృషా రథో మఘవన్ వృషణా హరీ వృషా త్వం శతక్రతో ॥ 755

---

1. యోఽఅస్తి, 2. ద్యుమ్నయశ్చ్యవనః, 3. యఽఉగ్రఃసన్నినిష్టృతః, 4. నేన్ద్రోయోషత్యా,
5. వృషోఽఅర్వావతి, 6. వృషణస్తేఽఅభీశవో. (ప్రా. ప్ర.)

(12) వృషా సోతా సునోతు తే వృషన్నృజీపిన్నా భర ।
వృషా దధన్వే వృషణం నదీష్వా తుభ్యం స్థాతర్హరీణామ్ ॥ 756

(13) ఏన్ద్ర యాహి పీతయే మధు శవిష్ఠ సోమ్యమ్ ।
నాయమచ్ఛా మఘవా శృణవద్ గిరో బ్రహ్మోక్థా చ సుక్రతుః ॥ 757

(14) వహన్తు త్వా రథేష్ఠామా హరయో రథయుజః ।
తిరశ్చిదర్యం సవనాని వృత్రహన్నన్యేషాం యా శతక్రతో ॥ 758

(15) అస్మాకమద్యాన్తమం స్తోమం ధిష్వ మహామహ ।
అస్మాకం తే సవనా సన్తు శంతమా మదాయ ద్యుక్ష సోమపాః ॥ 759

(16) నహి షస్తవ నో మమ శాస్త్రే[1] అన్యస్య రణ్యతి ।
యో[2] అస్మాన్ వీర ఆనయత్ ॥ 760

(17) ఇన్ద్రశ్చిద్ ఘా తదబ్రవీత్ స్త్రియా[3] అశాస్యం మనః ।
ఉతో[4] అహ క్రతుం రఘుమ్ ॥ 761

---

1. శాస్త్రేఽఅన్యస్య, 2. యోఽఅస్మాన్వీరఽఆనయత్, 3. స్త్రియాఽఅశాస్యం, 4. ఉతోఽఅహ. (ప్రా.ప్ర.)

(18) సప్తీ[1] చిద్ ఘా మదచ్యుతా మిథునా వహతో రథమ్ ।
ఏవేద్ ధూర్వృష్ణ[2] ఉత్తరా ॥ 763

(19) అధః పశ్యస్వ మోపరి సంతరాం పాదకౌ హర ।
మా తే కశప్లకౌ దృశన్ స్త్రీ హి బ్రహ్మా బభూవిథ ॥ 763

## సూక్తము—33

ఋషి—కణ్వగోత్రీయుఁడగు మేధ్యాతిథి*
దేవత—ఇంద్రుఁడు*

(1) గీ॥ సోమము నమర్చి వృత్రారి! నీమ మలర
నిమ్న దేశముఁ జేరెడు నీటల వలె
భవదభిముఖంబుఁ జేరెద మవన మిడవె!
సేవకులు ని న్నుపాసింత్రు చిత్త మలర ॥ 654

(2) గద్యము॥

వాసప్రదుఁడా! యింద్రుఁడా! యభిషుతసోమము నిర్గతం బైనచో నుక్థ విశిష్ఠు లగు నేతలు స్తోత్రములను బఠింపఁగలరు. సోమము విషయమై నీవు తృష్ణార్తుఁడవై వృషభము వలె శబ్దముఁ జేయుచు యజ్ఞస్థానమున కేల వచ్చెదవు ? ॥ 655

---

1. సప్తీచిద్ధా, 2. వృష్ణఉత్తరా. (ప్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ. సంపుటము. 123 పుట) "కణ్వ గోత్రీయుఁడు మేథుఁడు" ఋషిగాను. దేవత "ఇంద్రుఁడు" గాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "మేధ్యాతిథి" ఋషిగాను, యజమానుఁడు, వాని భార్య, వారి యాశీస్సులు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(3) గీ॥ శత్రుదమనకారి! శక్రుఁడా! కణ్వుల
కన్నదాన మిడవె! యతిశయముగఁ
బటుపిశంగరూప భాగ్యవద్గోవుల
నిన్ను నడుగుచుంటి నేను బ్రీతి ॥ 656

(4,5) సీ॥ అశ్వద్వయంబును నరదంబునకుఁ బూన్చువాఁ డెవ్వఁడో! తీక్ష్ణవజ్రి యెవఁడొ!
సోమమునకు మహాశోభాసహాయము నొనరించు నెవ్వఁడో! ధని యెవండొ!
యీశ్వరుఁ డెవ్వఁడో! యిష్టుల స్థిరుఁడయి పురముల భేదించి పెరిగె నెవఁడొ!
కార్తస్వరరథంబుఁ గలిఁగియుండె నెవండొ! సుక్రతు వెవ్వఁడో! శూరుఁ డెవఁడొ!
గీ॥ యెవని హస్తద్వయము కడు నేపుఁగలిఁగి, వెలుఁగుచుండునొ! యటువంటి వేల్పు శక్రు
నకుఁ బ్రమత్తతఁ గలిఁగింప నకలుషమతి, నమల మేధ్యాతిథీ! కొల్వు మతని మిగుల ॥ 657

(6,7) సీ॥ ఎవఁడు ధర్షకుఁ డగు నెవని శాత్రవగణ మాక్రమింపకయుండు ననుల నుండు
నెవ్వని యాశ్రయ మెల్లరుఁ గోరెద రెవఁడు ధనాఢ్యుఁడో! యెవఁడు సుతులఁ
గొనువాఁడొ! యెవ్వఁడు ఘన సోమమును ద్రావు నెవ్వని హనువులు నివ్వటిలునొ!
యరిపురంబుల నెల్ల నడఁచిపెట్టె నెవండొ! సోమ మెవ్వఁడు ద్రావి శోభఁ గనునొ!
గీ॥ యట్టి యింద్రుఁడు కార్యము లాచరించు, కోవిదుల కెల్ల దుగ్ధద గోస్వరూపుఁ
డమల సోమము ద్రావిన యతని నెవఁడు, తెలిసికొనియున్న ధీరుఁడో! తెలియఁబడదు ॥ 658

(8) గీ॥ అరిగణంబుల వెదకెడు హస్తి, దాన
జలము ధరియించునట్టులు శక్రుఁ డిష్టి
కర్మల మదంబు నెంతయుఁ గలిఁగియుండు
నింద్రుఁడా! నిన్ను నియమించు నెవఁడు? జగతి ॥ 659

గీ॥ నీవు సోమాభిముఖముగ నిర్మలేంద్ర!
వచ్చియుండుము! సజ్జనుల్ మెచ్చునటుల
నీవు వీర్యప్రభం బొంది నిఖిలమందు
విచరణంబును జేయుచు వెలుఁగుమయ్య! ॥ 660

(9) ఉ॥ పాసపుఁ డుగ్రుఁడై వెలుఁగ వానిని శత్రులు చూడలేక సం
త్రాస మనస్కు లయ్యెదరు, రాజిలు యుద్ధములందు భూషలన్
భాసిలుచుండి వాఁడు బహుభక్తుల సూక్తుల నాలకించి త
ద్వాసము చేరుచుండుఁగద! తక్షణమే పరులన్ ద్యజించుచున్ ॥ 661

(10, సీ॥ నీ వభిష్టుతుఁడవు నీవు కామప్రదాకృష్టుండ వరులచే †నపరివృతుఁడ
11,12) వభిషుతదుఁడ వను ఖ్యాతిఁ బొందితి వీవు నీ యశ్వరజ్జువుల్ నిఖిల మెరుఁగు
నీ హిరణ్మయకశ నిఖిల మిచ్చుచునుండు ఋజుగామి శతయజ్ఞ! యింద్రదేవ!
యభిషవకరులకు నభిషుతార్థుఁడవై యొగిఁ బురస్కృతిని జేయుదువుగాక!
గీ॥ నశ్వమున కభిముఖంబుగ నమరియున్న, వర్షిత సుసోమమును గడు వారియందు
ధారణము చేయుచున్నాఁడు ధన్యతముఁడు, ధన మొసంగుము! వానికిఁ దద్ద నీవు ॥ 662

(13,14) **గద్యము॥**

ధనవంతుఁడ వగు నింద్రుఁడా! సోమరూప మధువును త్రావుటకు రమ్ము! సుకర్మ గలవాఁడు, బలవంతుఁడు, నగు నింద్రుఁడు మా చెంతఁ జేరకుండ నుక్థములను నాలించును. వృత్రమారకా! శతక్రతూ! నీవు రథస్థుఁడవు! ఈశ్వరుఁడవు! రథమునకుఁ బూన్పఁబడిన యశ్వము అన్యుల యజ్ఞములను దిరస్కరించి నిన్ను మా యజ్ఞమునకుఁ దెచ్చునుగాక! ॥ 663

(15) గీ॥ ఓ మహామహా! సందీప్త సోమపాయి!
నికటవర్తివిగా స్తోమ నిచయ మెల్లఁ
దాల్చియుండుము! నీకు మత్తత జనింప
నిష్టి కళ్యాణకర మౌను సృష్టియందు ॥ 664

(16,17) **గద్యము॥**

వీరుం డగు నే యింద్రుఁడు మాకు నేత యగునో! వాఁడు మన శాసనమువలనఁ బ్రీతుండు కాఁజాలఁడు. "స్త్రీల మనస్సు దుశ్శాస్యము. క్రతువు లఘువు." అని యింద్రుఁడే వచించెను ॥ 665

* ఇక్కడ యతిభంగము. తలకట్టు భ్రమవల్ల "ఆకృష్టుండవు" లోనున్న "కృ" వర్ణముమీఁది తలకట్టును జూచి "అ" కార మను భ్రమతో "అపరి" లోని "అ" కారమునకు యతి వేయఁబడినది. (చూ. పీఠిక.)

(18) గీ॥ సోమమున కభిముఖంబుగ నూజిఁ జనెడు
నశ్వములు రెండు వాసవు యానము కడు
మోయు నిట్టి మహేంద్రు నమేయ రథము
శ్రేష్ఠతర మౌను నశ్వ సుశ్రీలఁ దలఁప ॥ 666

(19) గద్యము॥

ప్రయోగీ! నీవు స్తోత్రవై స్త్రీవి యోటచే నధోదేశమును జూడుము! ఊర్ధ్వదేశమును
జూడకుము! నీ కశమును బత్కప్రదేశమును, నెవ్వరును, నిరీక్షింపఁగూడదు ॥ 667

## సూక్తమ్—34

ఋషిః—1-15-నీపాతిథిః కాణ్వః, 16-18- సహస్రం వసురోచిషోఽఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః - అనుష్టుప్, 16-18-గాయత్రీ

(1) ఏన్ద్ర యాహి హరిభిరుప కణ్వస్య సుష్టుతిమ్ ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 764

(2) ఆ త్వా గ్రావా వదన్నిహ సోమీ ఘోషేణ యచ్ఛతు ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 765

1. దివోఽఅముష్య. (బ్రా.ప్ర.)

(3) అత్రా వి నేమిరేషామురాం న ధూనుతే వృకః ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 766

(4) ఆ త్వా కణ్వా [2]ఇహావసే హవన్తే వాజసాతయే ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 767

(5) దధామి తే సుతానాం వృష్ణే న పూర్వపాయ్యమ్ ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 768

(6) స్మత్పురంధిర్న[3] ఆ గహి విశ్వతోధీర్న[4] ఊతయే ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 769

(7) ఆ నో యాహి మహేమతే సహస్రోతే శతామఘ ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 770

(8) ఆ త్వా హోతా మనుర్హితో దేవత్రా వక్షదీడ్యః ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 771

---

1. దివోఽఅముష్య, 2. కణ్వాఽఇహావసే, 3. ధీర్నఽఆగహి, 4. ధీర్నఽఊతయే (వ్రా.ప్ర.)

(9) ఆ త్వా మదచ్యుతా హరీ శ్యేనం పక్షేవ వక్షతః ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 772

(10) ఆ యాహ్యర్య[2] ఆ పరి స్వాహా సోమస్య పీతయే ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 773

(11) ఆ నో యాహ్యుపశ్రుత్యుక్థేషు రణయా[3] ఇహ ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 774

(12) సరూపైరా సు నో గహి సంభృతైః సంభృతాశ్వః ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 775

(13) ఆ యాహి పర్వతేభ్యః సముద్రస్యాధి విష్టపః ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 776

(14) ఆ నో[4] గవ్యాన్యశ్వ్యా సహస్రా దస్రాహి ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో ॥ 777

---

1. దివోఽఅముష్య, 2. యాహ్యర్యఽఆపరి, 3. రణయాఽఇహ, 4. ఆనోఽగవ్యాని. (ప్రా.ప్ర.)

(15) ఆ నః సహస్రశో భరాఽయుతాని శతాని చ ।
దివో[1] అముష్య శాసతో దివం యయ దివావసో । 778

(16) ఆ యదిన్ద్ర శ్చ దద్వహే సహస్రం వసురోచిషః ।
ఓజిష్ఠమశ్వ్యం పశుమ్ ॥ 779

(17) య [2]ఋజ్రా వాతరంహసో ఽరుషాసో రఘుష్యదః ।
భ్రాజన్తే సూర్యా[3] ఇవ ॥ 780

(18) పారావతస్య రాతిషు ద్రవచ్చక్రేష్వాశుషు ।
తిష్ఠం వనస్య మధ్య[4] ఆ ॥ 781

## సూక్తము—34

ఋషి—కణ్వగోత్రీయుఁడగు నీపాతిథి 16-18-ఆంగిరసుఁడైన సహస్ర వసురోచిషుఁడు
దేవత—ఇంద్రుఁడు*

(1) గీ ॥ సాశ్వ కణ్వుల సుందర సంస్తవముల
కభిముఖంబుగఁ జను మింద్ర! యధికదీప్త
హవ్యవంతుడా! వాసవా! యతిశయముగ
దివిని శాసించుచున్ నీవు దివికిఁబొమ్ము! ॥ 668

1. దివోఽఅముష్య, 2. ఋజ్రాఽవాతరం, 3. సూర్యాఽఇవ, 4. మధ్యఽఆ. (ప్రా.ప్ర.)

* ఈ సూక్తమునకు వ్రాతప్రతిలో (9వ సంపుటము, 127వ పుట] "కణ్వగోత్రీయుఁ డగు "నీపాతిథి" ఋషిగాను, "ఇంద్రుఁడు" దేవతగాను, వ్రాసి 15b సంపుటములోని ఋషిదేవతలపట్టికలో నీపాతితి" ఋషిగాను, "యజమానుఁడు, వానిభార్య, వారి యాశీస్సులు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ అభిషవ ప్రస్తరము శబ్ద మతిశయముగ
జేయుచున్ సోమవంతమై శ్రీల నొసఁగు
ధ్వనిని గూడుచు నింద్రుఁడా! వచ్చి పెద్ద
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! 669

(3) గీ॥ వృకము మేషిని గదలింప వెడలునట్లు
ప్రస్తరము సోమవల్లి సంత్రస్త మైన
యటు లొనర్చును నింద్రుఁడా! యతిశయముగ
దివిని శాసించుచుఁ నీవు దివికి బొమ్ము! ॥ 670

(4) గీ॥ కణ్వసంతతి యన్నంబుఁ గలుగఁగోరి
యవనమును గోరి యింద్ర! యీ యజ్ఞమందు
నిన్నుఁ బిలుచుచు నుండెఁ దా నెన్నునటుల
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! 671

(5) గీ॥ తొల్లి వాయువునకు సోమ మెల్ల నిష్టి
యందు నిడినట్టి యింద్రుఁడా! యాదరమున
నీకు సోమ మొసంగెద నిష్టఁ బూని
దివిని బాలించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 672

(6) గీ॥ స్వర్గలోక పురంధ్రి! మా సరస కరుగఁ
దెమ్ము! లోకాధారకా! నెమ్మి మాకు
రక్షల నొసంగు మింద్రుఁడా! దీక్షఁ బూని
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 673

(7) గీ॥ బహుధనాఢ్య! మహాపతి! బహు సహస్ర
రక్ష లొసఁగెడువాఁడ! విరాజమాన
హవ్య యుక్తుఁడ! మా కడ కరుగఁదెంచి
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 674

(8) గీ॥ అమరమధ్యంబునన్ నుతు లందునట్టి
మనుజగృహహోత యైనట్టి మాన్యుఁడైన
యగ్ని వహియించుఁగాక! ని న్నమర! యింద్ర!
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 675

(9) గీ॥ శ్యేనపక్షి స్వపక్షము లెటు ధరించు?
నటుల మదము స్వరించెడు నశ్వియుగ్మ
మింద్రు వహియించుఁగాకఁ! దా నింద్రదేవ!
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 676

(10) గీ॥ సర్వతోభావమున రమ్ము! సామి! నీవు
స్వాహ పలుకుచునున్నాను జాల సోమ
రసము దీసితి నీ కింద్ర! యసమరీతి
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 677

(11) గీ॥ ఉక్థము పఠింపఁబడఁగ నీ వుచితరీతి
మా సమీపంబునకు వచ్చి మమ్ము సంత
సాత్ములుగఁ జేయు మింద్రుఁడా! శక్తి మెరయ
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 678

(12) గీ॥ హృష్టపుష్టాశ్వవంతుఁడా! పుష్టములును
దుల్యరూప విశిష్టముల్ ధూర్వహంబు
లైన యశ్వంబులన్ గూడి యరుగుదెంచి
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 679

(13) గీ॥ పర్వతంబులనుండియో వాసవుండ!
యంతరిక్షమునుండియో యతిశయంపుఁ
బ్రీతిఁ గొని యిచ్చటకు వచ్చి ఖ్యాతహవ్య!
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 680

(14) గీ॥ శూరుఁడా! వేలకొలఁది సుశోభమాన
గోసమూహంబులన్ మాకుఁ గూర్చుచుండి
ధనము నొసఁగు మహేంద్రుఁడా! ఘన తరంపు
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 681

(15) గీ॥ శతసహస్రాయుతంబు లౌ సకల కాంతి
తంబులను నింద్రదేవ! ముదంబు మీర
మా కొసంగుచుఁ బ్రీతి నస్తోకమైన
దివిని శాసించుచుఁ నీవు దివికిఁ బొమ్ము! ॥ 682

(16,17,18)గద్యము॥

ధన మూలమును నేను శోధించెదను. ఇంద్రుఁడు, మేము, బలవంతము లగు నశ్వపశువులను గ్రహించెదము. ఋజుగాములు, వాయు సదృశములు, వేగవంతములు, నారోచమానములు, స్వల్పస్యందమానములు, నగు నశ్వములు సూర్యుఁడు వలెఁ బ్రకాశించును. ఈ సకల రథచక్రగతిం బుట్టించెడు నశ్వముల నొసంగునపుడు నేను వనమునకుఁ బోయెదను ॥ 683

## సూక్తమ్—35

ఋషిః—శ్యావాశ్వ ఆత్రేయః

దేవతా—అశ్వినౌ

ఛందః—ఉపరిష్టాజ్జ్యోతిః(త్రిష్టుప్), 22,24-పంక్తిః, 23-మహాబృహతీ

(1) అగ్నినేన్ద్రేణ వరుణేన విష్ణునాఽఽదిత్యై రుద్రైర్వసుభిః సచాభువా ।
సజోషసా[1] ఉషసా సూర్యేణ చ సోమం పిబతమశ్వినా ॥ 782

1. సజోషసాఽఉషసా. (వా.ప్ర.)

(2) విశ్వాభిర్ధీభిర్భువనేన వాజినా దివా పృథివ్యాద్రిభిః సచాభువా ।
సజోషసా1 ఉషసా సూర్యేణ చ సోమం పిబతమశ్వినా ॥ 783

(3) విశ్వైర్దేవైస్త్రిభిరేకాదశైరిహా2 ద్భిర్మరుద్భిర్భృగుభిః సచాభువా ।
సజోషసా1 ఉషసా సూర్యేణ చ సోమం పిబతమశ్వినా ॥ 784

(4) జుషేథాం యజ్ఞం బోధతం హవస్య మే విశ్వేహ దేవౌ సవనావ గచ్ఛతమ్ ।
సజోషసా1 ఉషసా సూర్యేణ2 చేషం నో వోళ్హమశ్వినా ॥ 785

(5) స్తోమం జుషేథాం యువశేవ కన్యనాం విశ్వేహ దేవౌ సవనావ గచ్ఛతమ్ ।
సజోషసా1 ఉషసా సూర్యేణ2 చేషం నో వోళ్హమశ్వినా ॥ 786

(6) గిరో జుషేథామధ్వరం జుషేథాం విశ్వేహ దేవౌ సవనావ గచ్ఛతమ్ ।
సజోషసా1 ఉషసా సూర్యేణ2 చేషం నో వోళ్హమశ్వినా ॥ 787

(7) హారిద్రవేవ పతథో వనేదుప సోమం సుతం మహిషేవావ గచ్ఛథః ।
సజోషసా1 ఉషసా సూర్యేణ చ త్రిర్వర్తిర్యాతమశ్వినా ॥ 788

---

1. సజోషసాఽఉషసా. 2,4,5,6 ఋక్కులకు గూడ గొన్ని వ్రాత ప్రతులలో "సూర్యేణ చ సోమం పిబతమశ్వినా" అని పేర్కొనబడినది. (వ్రా.ప్ర.)

(8) హంసావివ పతథో[1] అధ్వగావివ సోమం సుతం మహిషేవావ గచ్ఛథః ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చ త్రిర్వర్తిర్యాతమశ్వినా ॥ 789

(9) శ్యేనావివ పతథో హవ్యదాతయే సోమం సుతం మహిషేవావ గచ్ఛథః ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చ త్రిర్వర్తిర్యాతమశ్వినా ॥ 790

(10) పిబతం చ తృష్ణుతం చా చ గచ్ఛతం ప్రజాం చ ధత్తం ద్రవిణం చ ధత్తమ్ ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చోర్జం నో ధత్తమశ్వినా ॥ 791

(11) జయతం చ ప్ర స్తుతం చ ప్ర చావతం ప్రజాం చ ధత్తం ద్రవిణం చ ధత్తమ్ ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చోర్జం నో ధత్తమశ్వినా ॥ 792

(12) హతం చ శత్రూన్యతతం చ మిత్రిణః ప్రజాం చ ధత్తం ద్రవిణం చ ధత్తమ్ ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చోర్జం నో ధత్తమశ్వినా ॥ 793

(13) మిత్రావరుణవన్తా[3] ఉత ధర్మవన్తా మరుత్వన్తా జరితుర్గచ్ఛథో హవమ్ ।

సజోషసా[2] ఉషసా సూర్యేణ చాఽఽదిత్యైర్యాతమశ్వినా ॥ 794

---

1. పతథోఽఅధ్వగావివ, 2. సజోషసాఽఉషసా, 3. వన్తాఽఉత. (ప్రా.ప్ర.)

(14) అంగిరస్వన్తా[1] ఉత విష్ణువన్తా మరుత్వన్తా జరితుర్గచ్ఛథో హవమ్ ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చాఽఽదిత్యైర్యాతమశ్వినా ॥ 795

(15) ఋభుమన్తా వృషణా వాజవన్తా మరుత్వన్తా జరితుర్గచ్ఛథో హవమ్ ।
సజోషసా ఉషసా సూర్యేణ చాఽఽదిత్యైర్యాతమశ్వినా ॥ 796

(16) బ్రహ్మ జిన్వతముత జిన్వతం ధియో హతం రక్షాంసి సేధతమమీవాః ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చ సోమం సున్వతో[3] అశ్వినా ॥ 797

(17) క్షత్రం జిన్వతముత జిన్వతం నౄన్ హతం రక్షాంసి సేధతమమీవాః ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చ సోమం సున్వతో[3] అశ్వినా ॥ 798

(18) ధేనూర్జిన్వతముత జిన్వతం విశో హతం రక్షాంసి సేధతమమీవాః ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చ సోమం సున్వతో[3] అశ్వినా ॥ 799

(19) అత్రేరివ శృణుతం పూర్వ్యస్తుతిం శ్యావాశ్వస్య సున్వతో మదచ్యుతా ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చాఽశ్వినా [4]తిరోఅహ్న్యమ్ ॥ 800

---

1. వన్తాఽఉత, 2. సజోషసాఽఉషసా, 3. సున్వతోఽఅశ్వినా, 4. తిరోఽఅహ్న్యమ్. (బ్రా.ప్ర.)

(20) సర్గాగ్ం[1] ఇవ సృజతం సుష్టుతీరుప శ్యావాశ్వస్య సున్వతో మదచ్యుతా ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చాఽశ్వినా [3]తిరోఅహ్న్యమ్ ॥ 801

(21) [4]రశ్మీగ్ంరివ యచ్ఛతమధ్వరాగ్ం[5] ఉప శ్యావాశ్వస్య సున్వతో మదచ్యుతా ।
సజోషసా[2] ఉషసా సూర్యేణ చాఽశ్వినా [3]తిరోఅహ్న్యమ్ ॥ 802

(22) అర్వాగ్ రథం ని యచ్ఛతం పిబతం సోమ్యం మధు ।
ఆ యాతమశ్వినా గతమవస్యుర్వామహం హువే ధత్తం రత్నాని దాశుషే ॥ 803

(23) నమోవాకే ప్రస్థితే[6] అధ్వరే నరా వివక్షణస్య పీతయే ।
ఆ యాతమశ్వినా గతమవస్యుర్వామహం హువే ధత్తం రత్నాని దాశుషే ॥ 804

(24) స్వాహాకృతస్య తృమ్పతం సుతస్య దేవావన్ధసః ।
ఆ యాతమశ్వినా గతమవస్యుర్వామహం హువే ధత్తం రత్నాని దాశుషే ॥ 805

---

1. సర్గాగ్ంఽఇవ. 2. సజోషసాఽఉషసా. 3. తిరోఽఅహ్న్యమ్. 4. రశ్మీగ్ంఽరివ. 5. మధ్వరాగ్ంఽఉప.
6. ప్రస్థితేఽఅధ్వరే. (వా.ప్ర.)

## సూక్తము—35

ఋషి—అత్రిగోత్రీయ శ్యావాశ్వుఁడు*
దేవత—అశ్విద్వయము

(1) ఉ॥ పూనికతోడ విష్ణు వను పూజ్య మహేంద్రుని నశ్వరాజముల్!
మానక సర్వ రుద్రగణ మాన్యులఁ బూతవసుప్రపంచమున్
మానిని యౌ నుషస్స్తుతిని మౌని నుతాదితిపుత్రమండలిన్
భానుని గూడఁ గూడుకొని భాసురసోమము మీరు ద్రావుఁడీ! ॥ 684

(2) ఉ॥ దానవిశేషయుక్తు లగు దస్రులు! మీరలు భూతజాతముం
బూనుచుఁ బర్వతంబులను బూనుచుఁ బృథ్విని సంతసంబుతోఁ
బూని దివం బుషస్స్తుతిని బూని మహాబల మెల్ల సర్వదా
భానునిగూడఁ గూడుకొని భాసుర సోమము మీరు ద్రావుఁడీ! ॥ 685

(3) ఉ॥ మానవ యజ్ఞకర్మముల మానుగ హవ్యము సంగ్రహించి స
న్మానముఁ బొందు దేవతల మారుతమున్ భృగువంశ జాతులన్
మానిని యౌ నుషోఽంగన నమంద వికాసముఁ గల్గువాని నా
భానుని గూడఁ గూడుకొని భాసుర సోమము మీరు ద్రావుఁడీ! ॥ 686

(4) ఉ॥ మీరలు యజ్ఞకర్మల కమేయగతిం జనుదెంచుచుండి వి
స్తారముగా సుయష్టిగత సర్వ మెరుంగుచు నశ్వులార! గం
భీరముగా వినంబడెడు పిల్పును వీనులఁ బెట్టి కల్యమున్
సూరుని గూడఁ గూడుకొని శోభిలు నన్నము సంగ్రహింపుఁడీ! ॥ 687

(5) ఉ॥ పూరుషుఁడెట్లు కన్యకకుఁ బూర్ణముగాఁ బరిచర్యఁ జేయు నా
తీరున యజ్ఞ సన్నుతి కదేపనిఁ బూనుచు సేవఁ జేయుఁడీ!
మీరలు దస్రులార! కడు మే మొనరించెడు కర్మఁ జూచుచున్
సూరునితోడఁ గూడుకొని శోభిలు నన్నము సంగ్రహింపుఁడీ! ॥ 688

---

* వ్రాతప్రతిలో నీ 35వ సూక్తమునకు "శ్యావాశ్వుఁడు" ఋషిగాను, 36. 37,38 సూక్తములకు "శ్వావాశ్వుఁడు" ఋషిగాను, యకారవకార భేదములతో (చూ. 9వ సంపుటము. 131, 137, 139, 141 పుటలు) శ్రీనేమానివారు వ్రాసిరి. 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తము లన్నింటికిని ఋషి "శ్యావాశ్వుఁడు" గానే వ్రాయుట జరిగినది.

(6) ఉ॥ చేసచు యజ్ఞభూములను సేవ లొనర్చుచు వాని కెల్ల వి
స్తార మహేష్టి కర్మములఁ జాల నెఱుంగుచు సంతసంబుతో
మీర లుషస్సు వెంటఁగొని మిక్కిలి వెల్గెడు నశ్వులార! యా
సూరునితోడఁ గూడుకొని శోభిలు నన్నము సంగ్రహింపుఁడీ! ॥ 689

(7) ఉ॥ కానన భూములం బడిన కాంతఖగంబుల మాడ్కి సంతత
ధ్యాన పరాత్ములౌ సరసదస్రులు! సోమము చెంతఁ జేరి మీ
రూనుమ సన్మతిన్ మహిష యుగ్మము రీతి నెఱింగి కర్మలన్
మానుగ సూర్యుఁ గూడుచుఁ త్రిమార్గమునం బడి సంచరింపుఁడీ! ॥ 690

(8,9) సీ॥ హస్తి ద్వయము మాడ్కి నభిషుత సోమరసంబును జేరుఁడీ! సరసులార!
పథికద్వయము రీతిఁ బావన సోమరసంబును జేరుఁడీ! సరసులార!
మహిషద్వయము రీతి మరువక సోమంబు సంతుష్టిఁ జూడుఁడీ! సరసురార!
శ్యేనపక్షుల భంగి శ్రీకర సోమరసంబును జేరుఁడీ! సరసులార!
గీ॥ యశ్వివరులార! శుభకరంబైన ప్రత్యు, షస్సుతో సూర్యవిభునితో శాంతి మిళితు
లౌచు రమ్య త్రిమార్గమునందుఁ బడుచు, వెడలుఁడీ! మీరు ప్రీతితోఁ గడుఁ బ్రశస్తి ॥ 691

(10) ఉ॥ పానముఁ జేయుఁడీ! పరమపావన సోమము దృప్తిఁ దీర సం
తాన మొసంగి సద్ధనము దానము నీయుఁడు! మా కుషస్సుతో
భానునితోడఁ గూడుకొని భాగ్యముతోఁ జరియించుచున్ మహా
ధ్యాన పరాత్ములార! బల దాన మొసంగుఁడు! మాకు నిచ్చలున్ ॥ 692

(11) ఉ॥ దానము నిండు! సంతతిని దానము నిండు! ధనంబు జేతృతా
దానము నిండు! రక్షలను దానము నిండు! విశేషతుష్టితో
మానిని యౌ నుషస్సతిని మాన్యుని సూర్యుని గూడుకొంచు స
ధ్యాన పరాత్ములార! బల దాన మొసంగుఁడు! మాకు నిచ్చలున్ ॥ 693

(12) ఉ॥ దానము నిండు! సంతతిని దానము నిండు! ధనంబు శత్రులన్
బూనికతో వధించి పరిపూర్ణతఁ జెందిన మిత్రుఁ గూడుచున్
మానిని యౌ నుషస్సతిని మాన్యుని సూర్యుని గూడుకొంచు స
ద్ధ్యాన పరాత్ములార! బల దాన మొసంగుఁడు! మాకు నిత్యమున్ ॥ 694

(13,14, సీ॥ మిత్రుని వరుణుని మేటి మరుత్తులఁ గూడుచు మమ్ములఁ జూడ రండు!
15,16, 17) విష్ణు నంగిరసుల వివిధార్థ వర్షియౌ వాజి ఋభుస్ర గూడి పారి రండు!
కర్మకు నతులకుఁ గల్పించి విజయంబు దానవులను జంపఁ బూనిరండు!
మీర లాదిత్యులఁ జేరుచు మా కెల్ల నభిముఖంబుగఁ బ్రీతి నరుగఁ దెండు!
గీ॥ సుందర ప్రత్యుషస్సుతో సూర్యుతోడ, నన్నివిధముల సజ్జను లెన్ను నటుల
వచ్చియుండుఁడు! మీరలు సచ్చరిత్ర, నతిశయ ఖ్యాతులార! యో యశ్వులార! ॥ 695

(18) చ॥ ఉభయులు ధేను సంఘముల నూర్జిత లోకములన్ జయించి మా
కభయ మొసంగ రాక్షసుల నందరిఁ జంపుచు మీరు సర్వతో
విభు వగు సూర్యదేవతను విశ్రుత కల్యము గూడుచుండి యీ
యభిభవకారి సోమరస మానఁగ రండు! మహాశ్విదేవతల్! ॥ 696

(19) గద్యము॥

ఓ యశ్విద్వయమా! శాత్రవుల గర్వము నడంచుము! అత్రి స్తుతి నాలించునటుల సోమాభిషవకారి యగు *శ్యావాశ్వుని నుతి నాలింపుము! ఉషస్సుతో సూర్యునితో మిళితులై ప్రాతఃకాలమున నీ యజ్ఞమందు సోమపానమును జేయుము! ॥ 697

(20,21)గద్యము॥

అశ్విద్వయమా! *శ్యావాశ్వుని మనోహర స్తుతిని నాభరణము వలె గ్రహియించి యశ్వరజ్జువుల మాట్కి వాని యాగమునకుఁ జని యుషస్సుతో సూర్యునితోఁ గలిసి ప్రాతఃకాలమున సోమమును ద్రావుము! ॥ 698

---

* శ్యావాశ్వుని (ప్రా.ప్ర.పా.)

(22, సీ॥ అశ్విదేవతలార! యరదంబు మా కభిముఖముగఁ గొనితెచ్చి ముదము గనుఁడు!
23,24) మధువును ద్రావుఁడు! మా యిష్టిఁ జూడుడు! సోమాభిముఖముగ సాగిరండు!
నే విచక్షణుఁ డను నేతలు మీర లీ యభిషుత సోమంబు నందుకొనుఁడు!
రక్షాభిలాషినై రాజుల మిముఁ బిల్తు హవ్యదాతకు రత్న మందనిండు!
గీ॥ స్వాహాతో[1] నభిషుతంబైన సరస సోమ, రసముఁ ద్రావి నమోవాక్యరాజిఁ గూడు
సోమమును గ్రోలి మిక్కిలి శోభఁ జెంది, వెలుఁగుదురుగాక! మీరలు విశ్వమందు ॥ 699

## సూక్తమ్—36

ఋషిః—శ్యావాశ్వ ఆత్రేయః
దేవతా—ఇన్ద్రః
ఛందః—శక్వరీ, 7-మహాపంక్తిః

(1) అవితాసి సున్వతో వృక్తబర్హిషః పిబా సోమం మదాయ కం శతక్రతో।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా[1] ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే॥ 806

(2) ప్రావ స్తోతారం మఘవన్నవ త్వాం పిబా సోమం మదాయ కం శతక్రతో।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా[1] ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే॥ 807

(3) ఊర్జా దేవాగ్ం[3] అవస్యోజసా త్వాం పిబా సోమం మదాయ కం శతక్రతో।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే ॥ 808

---

1. పృతనాఽఉరు. 2. త్వాగ్ంఽఇన్ద్ర. 3. దేవాగ్ంఽఅవస్యో. (ప్రా.ప్ర.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

(4) జనితా దివో జనితా పృథివ్యాః పిబా సోమం మదాయ కం శతక్రతో ।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా[1] ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే ॥ 809

(5) జనితాశ్వానాం జనితా గవామసి పిబా సోమం మదాయ కం శతక్రతో ।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా[1] ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే ॥ 810

(6) అత్రీణాం స్తోమమద్రివో మహస్కృధి పిబా సోమం మదాయ కం శతక్రతో ।
యం తే భాగమధారయన్ విశ్వాః సేహానః పృతనా[1] ఉరు జ్రయః
సమప్సుజిన్మరుత్వాగ్ం[2] ఇన్ద్ర సత్పతే ॥ 811

(7) శ్యావాశ్వస్య సున్వతస్తథా శృణు యథాశృణోరత్రేః కర్మాణి కృణ్వతః ।
ప్ర త్రసదస్యుమావిథ త్వమేక[3] ఇన్నృషాహ్య ఇన్ద్ర బ్రహ్మాణి వర్ధయన్ ॥ 812

## సూక్తము—36

ఋషి—శ్యావాశ్వుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1 మ॥ త్వరితం బీవు కుశంబు సోమరసమున్ వర్ధిల్లఁగాఁజేయు నా
వరలోకాళికి రక్షలిచ్చుచు మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగా సూచించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగుచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 700

---

1 పృతనా ఉరు 2. త్వాగ్ం ఇన్ద్ర 3. త్వమేక ఇన్నృషాహ్య. (వ్రా.ప్ర.)

* శ్యావాశ్వుఁడు. (వ్రా.ప్ర.పా.)

(2) మ॥ పరమస్తోతల కెల్ల రక్ష లిడుచున్ భాసిల్లు సోమంబుచే
వర రక్షం గలిపించి యింద్రుఁడ! మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగా సూచించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగుచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 701

(3) మ॥ పరమస్తోతలకెల్ల రక్ష లిడుచున్ భాసిల్లు సోమంబుచేఁ
పరమేష్టి ప్రియుఁడా! మహేంద్రుఁడ! మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగా సూచించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగుచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 702

(4) మ॥ స్థిరతం దంద్రివి! సత్పతీ! దివికి సుశ్రీకారణం బౌదు వో
నవయజ్ఞప్రియుఁడా! మహేంద్రుఁడ! మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగాఁ జూపించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగుచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 703

(5) మ॥ పరమాశ్వాళికిఁ బాలకుండ వగుచుం బా లిచ్చు గోజాతికిం
బరమ శ్రీజనకుండవై యల మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగాఁ జూపించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగుచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 704

(6) మ॥ సురమాహాత్మ్యయుతాత్రిమౌని కృత సుస్తోత్రంబుఁ బూజించుచుం
బరమాద్రిన్ భరియించు నింద్రుఁడ! మరుద్ వారంబుతోఁ గూడుచున్
సుర లే సోమరసంబు భాగములుగాఁ జూపించిరో! దాని సు
స్థిరతం ద్రావుము! వారి జేత వగచుం జెండాడుచున్ శత్రులన్ ॥ 705

(7) గీ॥ అత్రి మునికృత నుతులను నాలకించి
నట్టి శ్యావాశ్వ*సూక్తుల నధిగమించి
యొక్కరుండవె యింద్రుఁడా! యుద్ధమందు
నేసదస్యుని గాపాడ నేగినావు ॥ 706

* శ్యావాశ్వ సూక్తుల (వ్రా.ప్ర.పా.)

## సూక్తమ్—37

ఋషిః—శ్యావాశ్వ ఆత్రేయః
దేవతా—ఇన్ద్రః
ఛందః—మహాపంక్తిః, 1-అతిజగతీ

(1) ప్రేదం బ్రహ్మ వృత్రతూర్యేష్వావిథ ప్ర సున్వతః శచీపత[1] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 813

(2) సేహాన[2] ఉగ్ర పృతనా అభి ద్రుహః శచీపత[1] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 814

(3) ఏకరాళస్య భువనస్య రాజసి శచీపత[1] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 815

(4) సస్థావానా యవయసి త్వమేక[3] ఇచ్ఛచీపత ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 816

(5) క్షేమస్య చ ప్రయుజశ్చ త్వమీశిషే శచీపత[1] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 817

---

1. శచీపతఽఇన్ద్ర. 2. సేహానఽఉగ్ర పృతనాఽఅభి. 3. త్వమేకఽఇచ్ఛచీపతఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(6) క్షత్రాయ త్వమవసి న త్వమావిథ శచీపత[1] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
మాధ్యందినస్య సవనస్య వృత్రహన్ననేద్య పిబా సోమస్య వజ్రివః ॥ 818

(7) శ్యావాశ్వస్య రేభత స్తథా శృణు యథాశృణోరత్రేః కర్మాణి కృణ్వతః ।
ప్ర త్రసదస్యుమావిథ త్వమేక[2] ఇన్నృషాహ్య ఇన్ద్ర క్షత్రాణి వర్ధయన్ ॥ 819

## సూక్తము—37

ఋషి—శ్యావాశ్వుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ నవనవ యజ్ఞభూముల ననారత రక్షల నిష్టికారులన్
సవనపతీ! సమస్తమును జక్కని రీతిని నేలుచుండి యో
పవిఁ గలవాఁడ! వృత్రహర! పావన మధ్యదినేష్టి సోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 707

(2) చ॥ సవనపతీ! మహేంద్ర! బల శత్రుబలంబు హరించి వేడ్క మా
కవనపరంపరాకలన నందఁగఁజేయుచు నుగ్రదేవతా!
పవిఁగలవాఁడ! వృత్రహర! పావనమధ్య దినేష్టి సోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 708

(3) చ॥ భువనమునందె నీవు చిర భూపతి వౌచు సమస్త రక్షలన్
సవనపతీ! మహేంద్రుఁడ! ప్రశస్తముగా వెలుఁగొందుచుండుమా!
పవిఁ గలవాఁడ! వృత్రహర! పావనమధ్య దినేష్టి సోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 709

---

1. శచీపతఽఇన్ద్ర, 2. త్వమేకఽఇన్నృషాహ్య, (ప్రా.ప్ర.)

* శ్యావాశ్వుఁడు (ప్రా.ప్ర.పా.)

(4) మ॥ సవనపతీ! సమాన మగు చక్కటి నొప్పెడు రెండు లోకముల్
ద్వివిధములైన యట్లు కడు దీక్ష వహించుచుఁ జేయుచుండుమా!
పవిఁ గలవాఁడ! వృత్రహర! పావనమధ్య దినేష్టి సోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 710

(5) మ॥ సవనపతీ! మహేంద్రుఁడ! వికాసవిధిం బరిరక్షకుండవై
భువన సుయోగ మంగళవిభూతికి నాథుఁడ వౌదు నిత్యముం
బవిఁ గొనువాఁడ! వృత్రహర! పావనమధ్యదినేష్టిసోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 711

(6) మ॥ అవితథ సర్వరక్షకుఁడ వౌదు శచీపతి! యింద్రదేవ! నీ
కవన మొసంగలేఁ డెవఁ డనంత బలంబును గల్గఁజేయు మో
పవిఁగలవాఁడ! వృత్రహర! పావనమధ్య దినేష్టి సోమముం
జవిఁగొని నీవు ద్రావవఁటె! చక్కఁగ దానిని నింద్రదేవుఁడా! ॥ 712

(7) గీ॥ అత్రిమునికృత నుతులను నాలకించి
నట్లు శ్యావాశ్వసూక్తుల నధిగమించి
యొక్కరుండవె యింద్రుఁడా! యుద్ధమందు
నేసదస్యుని గాపాడ నేగినావు ॥ 713

## సూక్తమ్—38

ఋషిః—శ్యావాశ్వ ఆత్రేయః
దేవతా—ఇన్ద్రాగ్నీ
ఛందః—గాయత్రీ

(1) యజ్ఞస్య హి స్థ[1] ఋత్విజా సస్నీ వాజేషు కర్మసు ।
ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ ॥ 820

1. స్థఃఋత్విజా (వ్రా. ప్ర.)

(2) తోశాసా రథయావానా వృత్రహణాపరాజితా ।
ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ ॥ 821

(3) ఇదం వాం మదిరం మధ్వధుక్షన్నద్రిభిర్నరః ।
ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ ॥ 822

(4) జుషేథాం[1] యజ్ఞమిష్టయే సుతం సోమం సధస్తుతీ ।
ఇన్ద్రాగ్నీ[2] ఆ గతం నరా ॥ 823

(5) ఇమా జుషేథాం సవనా యేభిర్హవ్యాన్యూహథుః ।
ఇన్ద్రాగ్నీ[2] ఆ గతం నరా ॥ 824

(6) ఇమాం గాయత్రవర్తనిం జుషేథాం సుష్టుతిం మమ ।
ఇన్ద్రాగ్నీ[2] ఆ గతం నరా ॥ 825

(7) ప్రాతర్యావభిరా గతం దేవేభిర్జేన్యావసూ ।
ఇన్ద్రాగ్నీ సోమపీతయే ॥ 826

1. జుషేథాం (సా.మా.) 2. ఇన్ద్రాగ్నీఉఆ గతం. (ప్రా.ప్ర.)

(8) శ్యావాశ్వస్య సున్వతో ఽత్రీణాం శృణుతం హవమ్ ।
ఇన్ద్రాగ్నీ సోమపీతయే ॥ 827

(9) ఏవా వామహ్వ[1] ఊతయే యథాహువన్త మేధిరాః ।
ఇన్ద్రాగ్నీ సోమపీతయే ॥ 828

(10) ఆహం సరస్వతీవతోరిన్ద్రాగ్న్యోరవో వృణే ।
యాభ్యాం గాయత్రమృచ్యతే ॥ 829

## సూక్తము—38

ఋషి—శ్యావాశ్వుఁడు*
దేవత—అగ్ని, యింద్రుఁడు

(1) గీ॥ అగ్నిదేవుఁడ! యింద్రుఁడా! యజ్ఞమునకు
ఋత్విజులు సర్వవిధ కర్మతత్త్వమందు
యుద్ధభూములయం దెల్ల నోపి మీరు
స్థిరమనస్సున నా స్తుతిఁ దెలిసికొనుఁడు! 714

(2) గీ॥ శత్రుహింసాకరులు మీరు శక్ర! యగ్ని!
రథముపైఁ బోవు వా రపరాజితులును
వృత్రసంహర్త లగుదురు వివిధరీతి
స్థిరమనస్సున నా స్తుతిఁ దెలిసికొనుఁడు! ॥ 715

---

1. వామహ్వ ఽఊతయే (ప్రా.ప్ర.) * శ్యావాశ్వుఁడు. (ప్రా.ప్ర.పా.)

(3) గీ॥ ఇంద్రుఁడా! యగ్ని దేవుఁడ! యజ్ఞనేత
లైన మిముఁగూర్చి శిలలను బూని మధువు
దోహనముఁ జేయుచున్నాము తుష్టి మీర
స్థిరమనస్సున మా స్తుతిఁ దెలిసికొనుఁడు! ॥ 716

(4) క॥ అనల! మహేంద్రుఁడ! మీరలు
విను వారల స్తుతుల నెల్ల విశ్వాధిపతుల్
గనుఁగొనుచు మా సుయజ్ఞము
పనిగొని మా సోమమునకుఁ బరుగిడి రండీ! ॥ 717

(5,6,7, 8,9,10) సీ॥ నేత లింద్రాగ్నులు! నిస్తుల గాయత్రమార్గ విశిష్టులై మా సమస్త
నుతి నాలకింపుఁడు! తతధనజేతలై సురలతోఁ గూడుచు సొగసు లీను
సోమముఁ ద్రావంగ నీమముతో రండు! *శ్యావాశ్వసంబంధ యజ్ఞకరుల
పిలుపు సోమమునకుఁ బ్రేరేపణముఁ జేయుఁ దతిప్రాజ్ఞుని విధాన నతిశయముగ
గీ॥ నవన మొసఁగంగ మా కృతసవనమందు, సోమముం ద్రావ నత్యంత సామనిరతు
లైన మీ చెంత మిమ్ముల నాదరముగ, సన్నుతించుచున్నాఁడ సర్వవిధుల ॥ 718

## సూక్తమ్—39

ఋషిః—నాభాకః కాణ్వః
దేవతా—అగ్నిః
ఛందః—మహాపంక్తిః

(1) అగ్నిమస్తోష్యృగ్మియమగ్నిమీళా యజధ్యై ।
అగ్నిర్దేవాగ్ం॥1 అనక్తు న ఉభే హి విదథే కవిరన్తశ్చరతి దూత్యం౧ నభన్తామన్యకే సమే ॥ 830

1. దేవాగ్ంఽఅనక్తు నఽఉభే. (వ్రా.ప్ర.)

* ఋషినామ నిర్దేశకత్వములో శ్రీనేమానివారు "శ్యావాశ్వ" శబ్దమును "వ" కార సంయుక్తాదిగానే వ్రాసినను నీ సందర్భమున "శ్యావాశ్వ" అని "య" కార యుక్తముగా వ్రాసి యతిస్థానమునఁ బ్రయోగించిరి. "శ్వా"అని "వ" కారయుక్తముగా నెక్కడను యతిస్థానమున శ్రీనేమానివారు ప్రయోగించకపోవుట విశేషము.

(2) న్యగ్నే నవ్యసా వచస్తనూషు శంసమేషామ్ ।

న్యరాతీ రరావ్ణాం విశ్వా అర్యో[1] అరాతీరితో యుచ్ఛన్త్వామురో నభన్తామన్యకే సమే ॥ 831

(3) అగ్నే మన్మాని తుభ్యం కం ఘృతం న జుహ్వ[2] ఆసని ।

స దేవేషు ప్ర చికిద్ధి త్వం హ్యసి పూర్వ్యః

శివో దూతో వివస్వతో నభన్తామన్యకే సమే ॥ 832

(4) తత్తదగ్నిర్వయో దధే యథాయథా కృపణ్యతి ।

ఊర్జాహుతిర్వసూనాం శం చ యోశ్చ మయో దధే

విశ్వస్యై దేవహూత్యై నభన్తామన్యకే సమే ॥ 833

(5) స చికేత సహీయసా ఽగ్నిశ్చిత్రేణ కర్మణా ।

స హోతా శశ్వతీనాం దక్షిణాభిరభీవృత[3] ఇనోతి చ ప్రతీవ్యం౧ నభన్తామన్యకే సమే ॥ 834

(6) అగ్నిర్జాతా దేవానామగ్నిర్వేద మర్తానామపీచ్యమ్ ।

అగ్నిః స ద్రవిణోదా[4] అగ్నిర్ద్వారా వ్యూర్ణుతే స్వాహుతో నవీయసా నభన్తామన్యకే సమే ॥ 835

---

1. అర్యోఽఅరాతీ, 2. జుహ్వాఽఆసని, 3. వృతఽఇనోతి, 4. ద్రవిణోదాఽఅగ్నిర్ద్వారా. (ప్రా.ప్ర.)

(7) అగ్నిర్దేవేషు సంవసుః స విక్షు యజ్ఞియాస్వా ।

స ముదా కావ్యా పురు విశ్వం భూమేవ పుష్యతి దేవో దేవేషు యజ్ఞియో నభన్తామన్యకే సమే ॥ 836

(8) యో[1] అగ్నిః సప్తమానుషః శ్రితో విశ్వేషు సిన్ధుషు ।

తమాగన్మ త్రిపస్త్యం మన్ధాతుర్దస్యుహన్తమమగ్నిం యజ్ఞేషు పూర్వ్యం నభన్తామన్యకే సమే ॥ 837

(9) అగ్నిస్త్రీణి త్రిధాతూన్యా క్షేతి విదథా కవిః ।

స [2]త్రీగ్ంరేకాదశాగ్ం ఇహ యక్షచ్చ పిప్రయచ్చ నో విప్రో దూతః

పరిష్కృతో నభన్తామన్యకే సమే ॥ 838

(10) త్వం నో[3] అగ్న ఆయుషు త్వం దేవేషు పూర్వ్య వస్వ[4] ఏక ఇరజ్యసి ।

త్వామాపః పరిస్రుతః పరి యన్తి స్వసేతవో నభన్తామన్యకే సమే ॥ 839

## సూక్తము—39

ఋషి—కణ్వగోత్రీయుఁడగు నాభాకుఁడు

దేవత—అగ్ని

(1) క॥ పనిగొని ఋఙ్మంత్రంబుల
ననలుని నుతియింతు నేను యజ్ఞార్థము కా
పున నాతఁడు దేవతలకు
ఘన హవ్యం బొసఁగుఁగాకఁ! గమనీయేష్టిఁ ॥ 719

---

1. యో౽అగ్నిః, 2. త్రీగ్ం౽రేకాదశాగ్ం, 3. నో౽అగ్న౽ఆయుషు, 4. వస్వ౽ఏక౽ఇరజ్యసి. (ప్రా.ప్ర.)

గీ॥ స్వర్గభూమిస్థలంబులు సరసరీతి
దౌత్యకార్యములను నెల్లఁ దద్ద జరుపు
ననలదేవుండు శత్రుల నంత మొందఁ
జేయుఁగావుత! హింసలఁ జేయుచుండి ॥ 720

(2) గద్యము॥

ఓ యగ్ని! నూతనస్తోత్రములచే మా శరీరమునఁ గల శత్రువులఁ బరిమార్చుము! హవ్య
మొసంగెడువారికున్న వైరులను హింసింపుము! అభిగమనశీలు రగు నరుల నిచ్చటనుండి
పారఁద్రోలుము! అనలుఁడు శత్రువులను హింసించుఁగాక! ॥ 721

(3) చ॥ అనలుఁడ! నీ ముఖంబున సుఖాకర మౌ ఘృతధారఁ బోని యీ
వినుతిని జేయఁగల్గుదుము విశ్రుత నిర్మల దేవ మధ్యమం
దున విను దాని బ్రత్నుఁడవు దుస్త్యజ సౌఖ్య మొసంగువాఁడవై
చనెదవు దూతగాఁ బ్రబలశత్రుహరుండవు నీవు కావఁటే! ॥ 722

(4) చ॥ అనయముఁ గోరువారలకు నన్న మొసంగుచు నట్టిదానితో
మొనయుచుఁ బిల్చువారలకు మోద మొసంగుచు భోగయోగ్యమై
వినఁబడు సౌఖ్య మిచ్చుచు నభీతిని దేవగణంబుఁ బిల్చు నా
యనలుఁడు సర్వవైరులకు నన్ని విధంబుల హింసఁ జేయుతన్! ॥ 723

(5) చ॥ ఘనతర నిష్ఠలం గలుఁగు కర్మలచేఁ గడు గోచరుఁడు తా
ననయము దేవహోత యయి యచ్ఛపక్షప్రకరంబు గల్గుచుం
జనిఁగొని శత్రుమండలముపజ్జకుఁ బోవుచు నున్నయట్టి యా
యనలుఁడు సర్వవైరులకు నన్నివిధంబుల హింసఁజేయుతన్! ॥ 724

(6) చ॥ మనుజుల గుహ్యరీతుల నమానుష జన్మము గుర్తెరుంగుచున్
ధనము నొసంగువాఁ డగుచుఁ దప్పక సన్నుతి నాలకించుచున్
ఘనమును బైటఁబెట్టెడు విధంబు నెరుంగుచు నుండునట్టి యా
యనలుఁడు సర్వవైరులకు నన్నివిధంబుల హింసఁజేయుతన్! ॥ 725

(7) చ॥ మనుజుల దేవతాతతుల మధ్యను వాసముఁ జేయు నిష్టియం
దనయముఁ బూజలన్ నుతుల నందును భూమి విధాన సర్వ పో
షణమును జేయు హర్షమునఁ జక్కఁగఁ గార్యము నాచరించు నా
యనలుఁడు సర్వవైరులకు నన్ని విధంబుల హింసఁ జేయుతన్! ॥ 726

(8,9) సీ॥ సప్తమానుషులతో సరిగఁ గూడెడువాఁడు నదుల కాశ్రితుఁడౌచు నడచువాఁడు
మాంధాతృదస్యుల మట్టుపెట్టినవాఁడు త్రిస్థానములయందుఁ దిరుగువాఁడు
సకలప్రధానుఁడై సకలవిభుఁడై బంధనస్థలములఁ బరఁగువాఁడు
ప్రాజ్ఞుఁడై దూతయై భాసురాలంకారయుతుఁ డౌచు సంప్రీతి నుండువాఁడు
గీ॥ నైన యగ్నిని జేరుదు మతఁడు దేవ, యజ్ఞము లొనర్చుఁగావుత మఖిలకాంక్షి
తములఁ దీర్చుత! శాత్రవదళములకయి, బాధలను[1] గలుగఁజేయుతఁ! బంత మలర॥ 727

(10) చ॥ ధనమున కీశ్వరుం డవుదు! ధర్మపరాయణ దేవకోటిలో
ధనమున కీశ్వరుం డవుదు! దద్దయు మానుషపంక్తిలోన నీ
వనయము సేతురూపివయి యంతటకుం జనువాఁడ వౌదు వా
యనలుఁడు సర్వవైరులకు నన్ని విధంబుల హింసఁ జేయుతన్! ॥ 728

## సూక్తమ్—40

ఋషిః—నాభాకః కాణ్వః
దేవతా—ఇన్ద్రాగ్నీ
ఛందః—మహాపంక్తిః, 2-శక్వరీ, 12-త్రిష్టుప్

(1) ఇన్ద్రాగ్నీ యువం సు నః సహన్తా దాసథో రయిమ్ ।
యేన [1]దృళ్హా సమత్స్వా వీళు చిత్ సాహిషీమహ్యగ్నిర్వనేవ వాత[2] ఇన్నభన్తామన్యకే సమే ॥ 840

1. దృళహా. 2. వాతఽఇన్నభ. (వా.ప్ర.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(8,9, సీ॥ ఆదిత్యులార! మీ యాశ్రయంబును నేను యోధుఁడు వర్మము నొందునట్లు
10) పొందుదు మిమ్ములఁ బోఁడిమితో మీరు మా యనిష్టంబుల మట్టుపెట్టుఁ
డదితి మా కవనంబు నందించుఁగావుత మదితి మాకు సుఖంబు నమరఁజేయు
వరుణమిత్రార్యమవరులకు నామెయె తల్లియై విలసిల్లు నుల్ల మలర
గీ॥ నఖిలశరణీయభజనీయ మగుచు రోగ, రహితమైత్రి గుణయుత మౌ గృహమున కయి
నొసగుఁడు! సుఖంబు మీ రక్ష యొగి నుపద్ర, వములఁ గొట్టును మీ రక్ష వరముకూడ॥ 863

(11) గద్యము॥

ఓ యాదిత్యగణమా! మనుష్యులు తీరమునందుండి యుదకమును దర్శించునట్లు
మీఁదినుండి నిమ్నముఖముగఁ జూడుఁడు! అశ్వముల ఘాటుల (ఘట్టముల) కెట్లు
త్రోలెదరో! యట్లు మమ్ము మంచి మార్గమునఁ బ్రవేశపెట్టుఁడు! మీరు
మమ్ముఁ గాపాడుచో మా కుపద్రవములు కలుఁగవు. మీ రక్షయే సురక్ష!॥ 864

(12, సీ॥ ఆదిత్యులార! యీ యఖిలంబునన్ హింసకులకు సుఖంబునుగూడ నిండు!
13) గోధేనువులు తాము గోరెడు సుఖమును నతిశయంబుగ మీర లమరనిండు!
వివిధాన్నములఁ గోరు వీరులకుం జాలఁ గమనీయ సుఖమును గలుఁగనిండు!
ప్రోద్యద్భవత్పాపపంక్తి యంతర్భూత పాపముల్ దూరము పారనిండు!
గీ॥ భాసురాప్త్యప్రితుఁడ నేను బాపలవము, నాకుఁ జెందింపకుండుఁడు! భీకరంబు
లౌ నుపద్రవములు కూడ నంతరించు, మీ సురక్షల మీ రక్ష మేలుసుండు!॥ 865

(14, సీ॥ గోసమూహమునకుఁ గూడెడు దుస్స్వప్నములను దూరముఁజేయ వలనుబడదె?
15) నిష్కకారులు చెందు నిస్తుల దుస్స్వప్నములను దూరముఁ జేయ వలనుబడదె?
మాకుఁ గల్గెడు నట్టి భీకరదుస్స్వప్నములను దూరముఁ జేయ వలనుబడదె?
మాల్యకారకులైన మనుజుల దుస్స్వప్నములను దూరముఁ జేయ వలనుబడదె?
గీ॥ స్వర్గదుహిత! విభావరీ! భాసురాప్త్య, ప్రితునికై పాపసంఘము మతిఁ దలంచి
దూరముగఁ బోవునట్టులు ద్రోలవలదె!, మీ సురక్ష జగంబున మేలు సురలు!॥ 866

(16) గద్యము॥

ఓ యుషోదేవి! స్వప్నమున నన్ను కర్మభావము కలిఁగినయెడల నాప్త్యత్రితుల
కష్టములఁ దొలఁగింపుము! ఆదిత్యులారా! మీరు రక్షించుచుండ
నుపద్రవములు కలుఁగవు. మీ రక్షయే సురక్ష!॥ 867

(17, సీ॥ యజ్ఞార్థపశుహృదయంబు తచ్ఛృంగముల్ క్రమవిలు ప్తంబైనకరణి ఋణము
18) క్రమముగ శోధను గాంచినరీతిని నా ప్త్యత్రిదుస్స్వప్న మంతరించు
విజయంబుఁ బడయుచు వివిధసుఖంబుల నందు చపాపుఁడ నౌదు నేను
బ్రత్యూషదేవి! నా ప్రబల దుస్స్వప్నంబువలన భీతిల్లక వెలుఁగుమమ్మ!
గీ॥ మీరు రక్షకు లైనచో వీరులార!, యే యుపద్రవములు కూడ నెగిరిపోవు
పుడమిఁ గల యెల్లవారల పూర్ణరక్ష, కన్న మీ రక్ష యెక్కువకాదె! తలఁప॥ 868

## సూక్తమ్—48

ఋషిః—ప్రగాథో ఘౌరః కాణ్వః†
దేవతా—సోమః
ఛందః—త్రిష్టుప్, 5-జగతీ

(1) స్వాదోరభక్షి వయసః సుమేధాః స్వాధ్యో వరివోవిత్తరస్య ।
విశ్వే యం దేవా[1] ఉత మర్త్యాసో మధు బ్రువన్తో[2] అభి సంచరన్తి ॥ 1024

(2) అన్తశ్చ ప్రాగా అదితిర్భవాస్యవయాతా హరసో దైవ్యస్య ।
ఇన్దవిన్ద్రస్య సఖ్యం జుషాణః శ్రౌష్టీవ ధురమను రాయ[4] ఋధ్యాః ॥ 1025

(3) అపామ సోమమమృతా[5] అభూమాగన్మ జ్యోతిరవిదామ దేవాన్ ।
కిం నూనమస్మాన్ కృణవదరాతిః కిము ధూర్తిరమృత మర్త్యస్య ॥ 1026

---

† "ప్రగాథో కాణ్వః" అని మాత్రమే మాక్సుముల్లర్ ప్రతిలో పేర్కొనఁబడినది.

1. దేవా ఉత. 2. బ్రువన్తోఽభి. 3. ఇన్దం విన్ద్రస్య. 4. రాయ ఋధ్యాః. 5. మమృతాఽభూమా. (వా. ప్ర.)

(4) శం నో భవ హృద[1] ఆ పీత ఇన్దో పితేవ సోమ సూనవే సుశేవః ।
సఖేవ సఖ్య[2] ఉరుశంస ధీరః ప్ర ణ[3] ఆయుర్జీవసే సోమ తారీః ॥ 1027

(5) ఇమే మా పీతా యశస[4] ఉరుష్యవో రథం న గావః సమనాహ పర్వసు ।
తే మా రక్షన్తు విస్రసశ్చరిత్రాదుత మా స్రామాద్యవయన్త్విన్దవః ॥ 1028

(6) అగ్నిం న మా మథితం సం దిదీపః ప్ర చక్షయ కృణుహి వస్యసో నః ।
అథా హి తే మద[5] ఆ సోమ మన్యే రేవాగ్ం[6] ఇవ ప్ర చరా పుష్టిమచ్ఛ ॥ 1029

(7) ఇషిరేణ తే మనసా సుతస్య భక్షీమహి పిత్ర్యస్యేవ రాయః ।
సోమ రాజన్ ప్ర ణ[7] ఆయూంషి తారీరహానీవ సూర్యో వాసరాణి ॥ 1030

(8) సోమ రాజన్ మృళయా నః స్వస్తి తవ స్మసి వ్రత్యాస్తస్య విద్ధి ।
అలర్తి దక్ష[8] ఉత మన్యురిన్దో మా నో[9] అర్యో అనుకామం పరా దాః ॥ 1031

(9) త్వం హి నస్తన్వః సోమ గోపా గాత్రేగాత్రే నిషసత్థా నృచక్షాః ।
యత్ తే వయం ప్రమినామ వ్రతాని స నో మృళ సుషఖా దేవ వస్యః ॥ 1032

---

1. హృదఽఆ పీతఽఇన్దో, 2. సఖ్యఽఉరుశంస, 3. ప్ర ణ ఽ ఆయుర్జీవసే. 4. యశసఽఉరుష్యవో,
5. మదఽఆ, 6. రేవాగ్ంఽఇవ, 7. ణ ఽ ఆయూంషి, 8. దక్ష ఽ ఉత,
9. మా నోఽఅర్యోఽఅనుకామం. (వా.ప్ర)

(10) ఋదూదరేణ సఖ్యా సచేయ యో మా న రిష్యేద్ధర్యశ్వ పీతః ।
అయం యః సోమో న్యధాయ్యస్మే తస్మా[1] ఇన్ద్రం ప్రతిరమేమ్యాయుః 1033

(11) అప త్యా[2] అస్థురనిరా అమీవా నిరత్రసన్ తమిషీచీరభైషుః ।
ఆ సోమో అస్మాగ్ం[3] అరుహద్ విహాయా అగన్మ యత్ర ప్రతిరన్త[4] ఆయుః 1034

(12) యో న[5] ఇన్దుః పితరో హృత్సు పీతో ఽమర్త్యో మర్త్యాగ్ం[6] ఆవివేశ ।
తస్మై సోమాయ హవిషా విధేమ మృళీకే[7] అస్య సుమతౌ స్యామ ॥ 1035

(13) త్వం సోమ పితృభిః సంవిదానో ఽను ద్యావాపృథివీ[8] ఆ తతన్థ ।
తస్మై త[9] ఇన్దో హవిషా విధేమ వయం స్యామ పతయో రయీణామ్॥ 1036

(14) త్రాతారో దేవా[10]అధి వోచతా నో మా నో నిద్రా[11]ఈశత మోత జల్పిః ।
వయం సోమస్య విశ్వహ ప్రియాసః సువీరాసో విదథమా వదేమ॥ 1037

(15) త్వం నః సోమ విశ్వతో వయోధా స్త్వం[12] స్వర్విదా విశా నృచక్షః ।
త్వం న[13] ఇన్ద ఊతిభిః సజోషాః పాహి పశ్చాతాదుత వా పురస్తాత్ ॥ 1038

---

1. తస్మాఽఇన్ద్రం, 2. అప త్యాఽఅస్థురనిరాఅఽమీవా, 3. అస్మాగ్ంఽఅరుహద్విహాయాఽఅగన్మ,
4. ప్రతిరన్తఽఆయుః, 5. యోఽనఽఇన్దుః, 6. మర్త్యాగ్ంఽఆవివేశ, 7. మృళీకేఽఅస్య,
8. పృథివీఽఆ, 9. తస్మై తఽఇన్దో, 10. దేవాఽఅధి, 11. నిద్రాఽఈశత,
12. వయోధాస్త్వం, 13. నఽఇన్దఽఊతిభిః. (ప్రా.ప్ర.)

## సూక్తము—48

ఋషి—కణ్వపుత్రుఁడు ప్రగాథుఁడు *

దేవత—సోముఁడు

(1) గీ॥ సుందరాధ్యయన[1]పరుఁడను శోభ లీను
కర్మఁగలవాఁడ బ్రాజ్ఞుఁడ ఘనుఁడ నేను
బూజితంబైన యన్నము పుచ్చుకొనుట
కతిసమర్థుండ నయ్యెద నధికతుష్టి॥ 869

గీ॥ విశ్వదేవగణంబులు వివిధమర్త్య
గణములును నిట్టి యన్నము ఘన మటంచుఁ
బలుకుచున్ దీని చెంతకు బహువిధముల
వచ్చెదరుగాక! దీనిని మెచ్చుచుండి॥ 870

(2) గీ॥ నీవు హృదయమధ్య నిలువుము! సోముఁడా!
యతిథి వౌదు మరియు నఖిలదేవ
సంఘతీక్ష్ణకోప సంచయంబును వేగ
వేరు చేయవలదె! వేడ్కమీర॥ 871

(3) గీ॥ ఇంద్రుఁడా! మాకు సౌఖ్యము నీయఁగోరి
త్వరితముగ నశ్వ మెట్టులు భారవహన
మును నొనర్చునో! యట్టులు ధనము నెల్ల
నీవు వహియించుచున్ మాకు నెమ్మిఁ దెమ్ము!'॥ 872

(4) గద్యము॥

ఓ యిందూ! పిత పుత్రునకు సఖుఁ డగునట్టు †మేము నిన్నుఁ ద్రావెదము. నీవు
మాకు సుఖకరుఁడ వగుము! అనేక ప్రశంసితుఁడ వగు సోముఁడా !
నీవు బుద్ధిమంతుఁడవు! నీవు మా జీవనార్థము మా యాయుస్సు
నభివృద్ధిఁ జేయుము! ॥ 873

---

*కణ్వపుత్రుఁడైన ఘౌర ప్రగాథుఁడని పాఠాంతరము. 16b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ప్రగాతుఁడు" ఋషిగా శ్రీనేమాని వారు వ్రాసిరి.

1. ఇక్కడ ఇంద్రగణమునకు మారు "నల"ముగాని, పంచలఘు గణముగాని, ప్రయుక్తమైనట్లు భావింపవలెను.

†"మేము నిన్ను (సోమమును) ద్రావెదము". ఆర్యులు సోమపానాభిలాషులు కావున సోమయాగములను జేయుచుండెడువారు. సోమయజ్ఞమున సోమ మతిప్రధాన మైనది. సోమరసమును, దయారుచేయు విధానము

వేరొకచోటఁ జెప్పఁబడినది. సోమరసోపయోగము పెక్కుమంత్రములయందుఁ గలదు. యజుర్వేదమున XIX - XXI సౌత్రామిని యజ్ఞవిధానము చెప్పఁబడియెను. ఆ యజ్ఞము సోమయజ్ఞమును బోలియున్నది. యజుర్వేదమునకుఁ గల మహీధరునిభాష్యమునుబట్టి చూచినచో (యజు. 32, 33, 34) సర్వమేధముఁ జేయుక్రమము వర్ణిత మయ్యెను. ఇది పురీషమేధముకంటె నతిముఖ్యమైనది. ఈ యజ్ఞమునొనర్చిన పిదప యజమానుఁడు సంసారత్యాగము గావింపవలెను. ఇట్టి యజ్ఞకర్తకుఁ బునర్జన్మ కలుఁగదు (యజు. 9. 10) సోమయాగభేదము లగు 'వాజపేయము, రాజసూయము' అనునవి వర్ణితము లయ్యెను. (యజు 19, 20) సౌత్రామిని యనెడు యజ్ఞము చెప్పఁబడినది. (యజు-3) నిత్యాగ్నిహోత్రవిధానక్రమము గలదు. ఇంకఁ బెక్కుయాగములు కలవు కాని గ్రంథవిస్తరభయముచే వానిని వ్రాయుట మానితిని. ఇవి యన్నియు గౌతమబుద్ధునిమతము వ్యాపింపఁగనే క్షీణింప సాగినవి. కాని వామాచార మనునది యొకటి లోకమున వ్యాపింప సాగినది ఈ వామమార్గమతము బహుశః క్రీ॥పూ॥ 4000 క్రీస్తు॥ పూ॥ 3000 మధ్యకాలమున వ్యాప్తి గాంచియుండవచ్చును. అప్పటినుండి ఇప్పటివరకును నిలచియున్నది వామమార్గప్రచారమున కిటీవలి వారలౌ వేదవ్యాఖ్యాతలగు చాయన మహీధరాదులు తమ భాష్యములలో అశ్వమేధము, గోమేధము, సౌత్రామిణి మొదలగు యాగములఁగూర్చి వింతలగు నిర్వచనములు వ్రాసియుండిరి.

వామాచార పద్ధతు లిట్లుండును.

"మద్యం మాంసం చ మీనం చ ముద్రా మైథునమేవ చ
ఏతే పంచ మకారాస్స్యుర్మోక్షదాహి యుగే యుగే" (కాళీతంత్రము)
"పీత్వా పీత్వా పునః పీత్వా యావత్పతతి భూతలే
పునరుత్థాయ వై పీత్వా పునర్జన్మ న విద్యతే" (మహానిర్వాణతంత్రము)
"సౌత్రామణ్యాం సురాం పిబేత్" - ప్రోక్షితం భక్షయేన్మాంసం
వైదికీ హింసా హింసా న భవతి"
"న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా" మను॥అ॥5-56

అనఁగా మద్యము త్రావుటయు, మాంసము భక్షించుటయు, వైదిక హింస హింసకాదనియుఁ దెలుచున్నది. పూర్వోక్తసుగుణ శ్వమేధశబ్దమునకు బ్రాహ్మణాదులయందు. వేరర్థములు గలవు "రాష్ట్రం వా అశ్వమేధః" శత. 13, 1, 6-3 "అగ్నిర్వా అశ్వః" శతపథ బ్రా-"ఆజ్యం మేధః" అశ్వమేధ మనఁగా రాష్ట్రియనియు, అశ్వ మనఁగా నగ్ని యనియు, ఆజ్య మనఁగా మేధస్సనియు, నర్థము లుండఁగా భాష్యకారుల కర్థము లెట్లు తట్టినవో తెలియదు. ఇట్టులే కొన్ని సందర్భములయందు శతపథాది బ్రాహ్మణముల మూలమునఁ గల్పనమును జేయుచో సమంజసముగా నుండునేమో ?

కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

(5,6) సీ॥ అతియశస్కుఁడయి యవనాభిలాషియౌ సోముఁడు ప్రీతుఁడై నీమ మలరఁ
బ్రతిపర్వమున గో వితతి రథంబునకయి యోజితం బగునట్టు లోర్మి మిగులఁ
బ్రతిపర్వమందునఁ బ్రబలకర్మల మాకు సరిగూర్చుఁగావుత! సచ్చరిత్ర
నాశంబు కాకుండ నడిపించుఁగావుత! వ్యాధుల నడఁచుచు నడఁచుఁగాక!
మథితాగ్నిఁ బోలుచు మాకు దీప్తి నొసంగ దర్శన మిడుఁగాకఁ! దాను మిగుల
గీ॥ మమ్ము ధనవంతులుగఁ జేయు! మాన్య!యింద్ర!, యీ క్షణంబున నీ కెంతొ యెక్కుడైన
సంతసముఁ బుట్ట నిను నేను సంస్తవింతుఁ, గనుకఁ బుష్టిని బొందుమా! ధనము గలిఁగి॥ 874

(7) గీ॥ పైతృక ధనంబు వడువునఁ బూత సోమ
రసము ద్రావుచు నీవు విరాజసోమ!
దివసముల సూర్యుఁ డభివృద్ధిఁ దేల్చునట్టు
లాయువును వృద్ధిపరపు మమేయమహిమ॥ 875

(8) గీ॥ రాజసోముఁడ! మమ్ము విరాజమాన
స్వస్తికై సౌఖ్యవంతుల సలుపు మీవు
వ్రతుల మైనట్టి మేము మీ వార మగుదు
మమృతకర! మమ్మల నెఱుంగుమయ్య! నీవు ॥ 876

గీ॥ ఇంద్ర! మా శాత్రవులు కడు వృద్ధిఁ బొంది
వెడలుచున్నారు క్రోధము వెలుఁగుచుండె
నుభయ విధముల బాధల నొసలఁజేసి
యుద్ధరింపుము! మమ్ముల నిద్ధచరిత! ॥ 877

(9) గీ॥ సోమ! మా శరీరశోభలకున్ రక్ష
కుండ వౌదు! కర్మఁ గూర్చువాఁడ
వౌదు! కానఁ బ్రీతి నఖిల గాత్రంబుల
నియతి నుండు మీవు! నెనరు నునిచి ॥ 878

గీ॥ మేము నీ వ్రతవిఘ్నంబు నేమి యైన
నాచరింపంగఁ గలవార మైన సోమ!
యుత్తమసఖుండవై మాకు నుచితసుఖము
నొసఁగి సుఖవంతులుగఁ జేయుమోయి! మమ్ము ॥ 879

(10) గీ॥ ఉదరపీడలఁ బుట్టింపకోయి! మాకు
సఖుఁడ వగు నిన్నుఁ గూడంగ జరుగఁగలము
సోమపీతుల మైనచో సూక్ష్మహింస
నైనఁ బొందకయుండెద మతిశయముగ ॥ 880

క॥ హరినామకాశ్వ! యింద్రుఁడ!
యురవడి మాయందు సోమ ముంచుటవలనన్
సురుచిర మగు నా సోమము
స్థిర మగు జఠరంబునందుఁ జేర్చు! మహేంద్రా! ॥ 881

(11) గద్యము॥

అన్ని చికిత్సలకును నసాధ్యము లగు కఠినపీడలు నశించును. ఈ సకలపీడలును
బలవంతములై మ మ్మేకాంతమునఁ గంపింపఁ జేయుచున్నవి. మహాసోమము
మాకుఁ బ్రాప్తమగుచున్నది. ఇది ద్రావినచో నాయువు వృద్ధి యగును.
మేము మనుజులము. మేము దీనిచెంతఁ జేరుదుము ॥ 882

(12) గద్యము॥

ఓ పితృగణమా! యే సోముఁడు పీతుఁడై మరణరహితుఁడై మర్త్యుల మగు మాయొక్క
హృదయములయందుఁ బ్రవేశించునో! యా సోమునకు హవ్యము ద్వారా
పరిచర్య జేసెదము. మేము ధనమునకుఁ బతుల మగుదుము 883

(13) గీ॥ పితృగణంబులఁ గూడుచుఁ బృథ్వి దివము
దాఁటుచుందువు సోముఁడా! తరచు నీవు
హవ్యమూలమునన్ నీకు నఖిల సేవ
లను నొనర్చుచు ధనరాట్టు లౌదు మేము ॥ 884

(14, 15) సీ॥ మిష్ట వాక్యములను మీరలు నుడివిన స్వప్నముల్ మా కేమి జరుపలేవు!
మిష్ట వాక్యములను మీరలు నుడివిన నిందకుల్ మముఁజేర నేర్వలేరు!
మిష్ట వాక్యంబులు మీరలు నుడివిన మా స్తోత్రముల నేరు మాన్పలేరు!
మిష్ట వాక్యంబుల మీరలు నుడివిన నెవరును మముల నిందింపలేరు!
గీ॥ సోముఁడా! యన్నిదిక్కుల శోభ! దేలు,నన్నము నొసంగువాఁడ వత్యంతసర్వ
దర్శి వౌదువు! నాక ప్రదర్శి వౌదు,నీవు మాయందు వసియించి నెగడవలదె! ॥ 885

గీ॥ ఇంద్ర! నీ వాక్ప్రచోటను నెల్ల వేళఁ
ప్రీతివంతుఁడవై మాకుఁ బ్రీతిఁ గొలుప
ముందు వెనుకల మమ్ముల మోద మలర
నీవు రక్షించెదవుగాక! నిశ్చలముగ ॥ 886

# అథ వాలఖిల్యమ్*

## సూక్తమ్—49

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) అభి ప్ర వః సురాధసమిన్ద్రమర్చ యథా విదే ।
యో జరితృభ్యో మఘవా పురూవసుః సహస్రేణేవ శిక్షతి । 1039

(2) శతానీకేవ ప్ర జిగాతి ధృష్ణుయా హన్తి వృత్రాణి దాశుషే ।
గిరేరివ ప్ర రసా[1] అస్య పిన్విరే దత్రాణి పురుభోజసః ॥ 1040

(3) ఆ త్వా సుతాస[2] ఇన్దవో మదా య ఇన్ద్ర గిర్వణః ।
ఆపో న వజ్రిన్నన్వోక్యం సరః పృణన్తి శూర రాధసే ॥ 1041

---

* ఈ 49వ సూక్తము మొదలు 59వ సూక్తమువరకు నున్న సూక్తములకు ద్రష్టలు "వాలఖిల్యులు". ఈ పదకొండు సూక్తములను బ్రామాణికములుగాఁ గొందరు పరిగ్రహింపఁగా మరికొందరు ప్రామాణికములుగా గ్రహింపలేదు. ఈ సూక్తముల విషయమై "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" ప్రథమ సంపుటములోఁ బ్రకటితమైన నా పీఠికలో (చూ. 83,84 పుటలు) సంగ్రహముగాఁ గొంత వివరించుట జరిగినది. వ.గో.కృ.

1. రసా ఽ అస్య. 2. సుతాస ఽ ఇన్దవో మదా య ఽ ఇన్ద్ర. (వా.ప్ర.)

(4) అనేహసం ప్రతరణం వివక్షణం మధ్వః స్వాదిష్ఠమీం పిబ ।
ఆ యథా మన్దసానః కిరాసి నః ప్ర క్షుద్రేవ త్మనా ధృషత్ ॥ 1042

(5) ఆ నః స్తోమముప ద్రవద్ధియానో[1] అశ్వో న సోతృభిః ।
యం తే స్వధావన్ త్స్వదయన్తి ధేనవ[2] ఇన్ద్ర కణ్వేషు రాతయః ॥ 1043

(6) ఉగ్రం న వీరం నమసోప సేదిమ విభూతిమక్షితావసుమ్ ।
ఉద్రీవ వజ్రిన్నవతో న సిఞ్చతే క్షరన్తీన్ద్ర ధీతయః ॥ 1044

(7) యద్ధ నూనం యద్వా యజ్ఞే యద్వా పృథివ్యామధి ।
అతో నో యజ్ఞమాశుభిర్మహేమత[3] ఉగ్ర ఉగ్రేభిరా గహి ॥ 1045

(8) అజిరాసో హరయో యే త[4] ఆశవో వాతా ఇవ ప్రసక్షిణః ।
యేభిరపత్యం మనుషః పరీయసే యేభిర్విశ్వం స్వర్దృశే ॥ 1046

(9) ఏతావతస్త ఈమహ ఇన్ద్ర[5] సుమ్నస్య గోమతః ।
యథా ప్రావో మఘవన్ మేధ్యాతిథిం యథా నీపాతిథిం ధనే ॥ 1047

---

1. యానో౽అశ్వో. 2. ధేనవ౽ఇన్ద్ర. 3. హేమత౽ఉగ్ర౽ఉగ్రేభిరా. 4. యే త౽ఆశవో వాతా౽ఇవ.
5. తస్త౽ఈమహ౽ఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(10) యథా కణ్వే మఘవన్ త్రసదస్యవి యథా పక్థే దశవ్రజే ।
యథా గోశర్యే[1] అసనోర్ఋజిశ్వనీన్ద్ర గోమద్ధిరణ్యవత్ ॥ 1048

# వాలఖిల్య సూక్తములు†

## సూక్తము—49

ఋషి—కణ్వపుత్రుఁడైన ప్రస్కణ్వుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1,2) గీ॥ ఎట్టి రూపున ధనమును బట్టినావొ!
యట్టి రూపున ధనవంతు నమరు నింద్రుఁ
ద్వత్పురస్థలి నునుచుచుఁ దగిన పూజఁ
జేయుదువుగాక! యజమాన! చింత వీడి ॥ 887

---

1. గోశర్యేఽఅసనో. (వ్రా.ప్ర.)

† 49వ సూక్తమునుండి 59 సూక్తము వరకుఁగల 11 సూక్తములు వాలఖిల్య ప్రోక్తములు. సాయనాచార్యుఁడీ వాలఖిల్య సూక్తములకు వ్యాఖ్యానముఁ జేయలేదు. అందుకుఁ గారణమును దెలుపలేదు. వీటిని భాషాంతరీకరించుట మిక్కిలి శ్రమ సాధ్యము. ఐతరేయ బ్రాహ్మణము టీకలో సాయణుఁడిట్లు వ్రాసెను. "ఎనిమిదిమాత్రము వాలఖిల్యుఁడు చెప్పిన సూక్తములు"- కాని మాక్స్ముల్లరు ప్రకటించిన గ్రంథమును దిలకించిన 11 సూక్తములు గలవు. ఆలోచింపఁగా సాయణుఁ డే గ్రంథ లిపిని దిలకించినాఁడోగాని యందు 8సూక్తములు మాత్రమే గలవు. ఋగ్వేదసంహితాసూక్తములు సాయణునికాలమందు 1028సూక్తములని నిర్దేశింపవచ్చును. ఋగ్వేదసూక్తములను గణనసేయఁగా 1028సూక్తము లగును. వీనిని(వాలఖిల్యసూక్తములను)విడిచిపెట్టినయెడల 1017సూక్తములగును.
(నే.వేం.న.శా.)

ఈ వాలఖిల్య సూక్తములకు సంబంధించిన మరికొన్ని విశేషవిషయములకై
చూ. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత. ప్రథమ సంపుటము. పీఠిక-83,84పుటలు.

* ఈ 49వ సూక్తము మొదలు 59 సూక్తమువరకును నున్న పదునొకండింటికిని ఋషి "వాలఖిల్యుఁడు" గా వ్రాతప్రతిలో(9వ సంపుటము 197,202,203,205,209,211,213,215,217,219పుటలు) వ్రాసి యా యా సూక్తములకా యా దేవతలను వ్రాసిన శ్రీనేమానివారు 15bసంపుటములోని ఋషిదేవతలపట్టికలో నీ వాలఖిల్య సూక్తములకు ఋషిదేవతలను వ్రాయనేలేదు. 15b సంపుటములో నసలీ వాలఖిల్య సూక్తసంఖ్యలను జేర్పకుండఁగనే తరువాతి సూక్తసంఖ్యలను మాత్రమే క్రమబద్ధముగా నిచ్చుట జరిగినది.

సీ॥ మఘవానుఁ డగు నింద్రుఁ డఘములఁ బోఁద్రోలు బహుధనవంతుఁడై పరగుచుండు
వేల ధనంబును వివిధభక్తులకయి దానము నొసఁగంగఁ బూనుచుండు
గర్వంబునన్ వాఁడు కదలుచు భీకరశతసేనలకు వాఁడు పతిగ నుండు
హవ్యదాతలకయి యతిఁ బోలు వృత్రుని జంపి సంప్రీతితో సాగుచుండు
గీ॥ వాఁడు బహులోకపాలకత్వమును దాల్చి, వానికై నీయఁబడినట్టి పరమరసము
పర్వతరసంబు చందాన భాసమాన, మౌచుఁ బ్రీతిని బుట్టించి యమరుచుండు ॥ 888

(3) గద్యము॥

స్తుతిభాజనుఁడా! యింద్రుఁడా! యే సోమము మదకరమో! నీ నిమిత్త మది యభిషుత
మైనది. వజ్రధారి! శూరుఁడ! ధనార్థమై జల మంతయు నిపుడు నీ వాసస్థాన మగు
సరోవరమును నిండఁజేయుచున్నది॥ 889

(4) గద్యము॥

నీవు సోమమువలనఁ బాపఘ్నుఁడవు! రక్షణకారివి! స్వర్గప్రదుఁడవు! నీవు మధుర తమ
రసమును గ్రోలుము! నీవు ప్రమత్తుఁడ వైనయెడల గర్వితుఁడ వౌదువు!
క్షుద్రులకు వలె మా కభిలషితదాన మొసంగుము! 890

(5) గీ॥ అన్నవంతుఁడ! యింద్రుఁడా! యఖిలకణ్వ
గణమునకు నీ వొసంగిన ఘనతరంపు
దాన మా స్తోమమును స్వాదుతరము చేయు
చున్న యది చూచెదవుగాక! నన్న! నీవు ॥ 891

గీ॥ అభిషవణకారకులు నిను నాదరమునఁ
బిలిచినట్లైన నశ్వము పెంపుఁ దాల్చి
స్తోమమున కభిముఖముగ శోభ లీను
గమనమున రమ్ము! పవిధారి కడకు నీవు ॥ 892

(6) గీ॥ అక్షయధనాఢ్యు నుగ్రుని నఖిలభూతి
సహితు వీరుని నింద్రుని రహిని గందు
జలవిరాజిత నిర్మల జలము మాటిκ-
నింద్ర! నినుఁ దద్వేదను నేను నిఖిల నుతుల ॥ 893

(7) ఉ॥ ఇచ్చట నుండుమోయి! హరి! యీ క్షణమందున నిష్టికర్మలన్
ముచ్చట లాడుచుండ వఁటి! మోదముతోడ మహామతీ! ద్రుతం
బచ్చటనుండి యెంతయును నాశు చరించెడు నశ్వరాజుతో
వచ్చుట నీకు యుక్త మగు వాసవదేవ! మహాముదంబునన్ ॥ 894

(8) చ॥ హరు లను పేరుతో వెలయు నశ్వము లున్నవి నీకు నింద్రుఁడా!
సురుచిరవాయువేగమున సొంపుగఁ బోవుచు శత్రుపంక్తి నీ
వరుగఁగఁ జేసి మానవుల నందఱఁ జేరుచు వస్తుసంతతిన్
స్థిరముగఁ జూచి లోకముల తీరులఁ గానఁగఁ బోవుమా! వడిన్ 895

(9,10) గద్యము॥

ఓ యింద్రుఁడా! యేతత్పరిమితము గో విశిష్టము నగు ధనమును నిన్ను యాచించెదను.
ఓ మఘవానుఁడా! నీవు ధనమునకై మేధ్యాతిథిని, నీపాతిథిని రక్షించితివి!
నీవు కణ్వునికి, నేసదస్యునకు, పక్థునకు, *గోశర్యునునకు, ఋజిశ్వునకు,
గో హిరణ్యరూప మగు ధన మొసంగితివి! ॥ 896

## సూక్తమ్—50

ఋషిః—పుష్టిగుః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ప్ర సు శ్రుతం సురాధసమర్చా శక్రమభిష్టయే ।
యః సున్వతే స్తువతే కామ్యం వసు సహస్రేణేవ [1]మంహతే ॥ 1049

---

* గోశర్యునకు. (వా.ప్ర.పా.) 1. మహతే. (వా.ప్ర.)

(2) శతానీకా హేతయో[1] అస్య దుష్టరా ఇన్ద్రస్య సమిషో మహీః ।
గిరిర్న భుజ్మా మఘవత్సు పిన్వతే యదీం సుతా[2] అమన్దిషుః ॥ 1050

(3) యదీం సుతాస[3] ఇన్దవో ఽభి ప్రియమమన్దిషుః ।
ఆపో న ధాయి సవనం మ[4] వసో దుఘా ఇవోప దాశుషే ॥ 1051

(4) అనేహసం వో హవమానమూతయే మధ్వః [5]క్షరన్తి ధీతయః ।
ఆ త్వా వసో హవమానాస[6] ఇన్దవ ఉప స్తోత్రేషు దధిరే ॥ 1052

(5) ఆ నః సోమే స్వధ్వర[7] ఇయానో అత్యో న తోశతే ।
యం తే స్వదావన్ త్స్వదన్తి గూర్తయః పౌరే ఛన్దయసే హవమ్ ॥ 1053

(6) ప్ర వీరముగ్రం వివిచిం ధనస్పృతం విభూతిం రాధసో మహః ।
ఉద్రీవ వజ్రిన్నవతో వసుత్వనా సదా పీపేథ దాశుషే ॥ 1054

(7) యద్ధ నూనం పరావతి యద్ వా పృథివ్యాం దివి ।
యుజాన[8] ఇన్ద్ర హరిభిర్మహేమత[9] ఋష్వ ఋష్వేభిరా గహి ॥ 1055

---

1. హేతయోఽఅస్య దుష్టరాఽఇన్ద్రస్య, 2. సుతాఽఅమన్దిషుః, 3. సుతాసఽఇన్దవో, 4. మఽవసో దుఘాఽఇవోప.
5. క్షరన్తి ధీతయః, 6. మానాసఽఇన్దవఽఉప, 7. స్వధ్వరఽఇయానోఽఅత్యో, 8. యుజానఽఇన్ద్ర,
9. మతఽఋష్వఽఋష్వేభిరా. (వా.ప్ర.)

(8) రథిరాసో హరయో యే తే[1] అస్రిధ ఓజో వాతస్య పిప్రతి ।
యేభిర్ని దస్యుం మనుషో నిఘోషయో యేభిః స్వః పరీయసే ॥ 1056

(9) ఏతావతస్తే వసో విద్యామ శూర నవ్యసః ।
యథా ప్రావ[2] ఏతశం కృత్వ్యే ధనే యథా వశం దశవ్రజే ॥ 1057

(10) యథా కణ్వే మఘవన్ మేధే[3] అధ్వరే దీర్ఘనీథే దమూనసి ।
యథా గోశర్యే[4] అసిషాసో అద్రివో మయి గోత్రం హరిశ్రియమ్ ॥ 1058

## సూక్తము—50

ఋషి—కణ్వపుత్రుఁడైన పుష్టిగుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1) క॥ ధనవిఖ్యాతుం డగు హరి
ననయముఁ బూజింతుఁగాక నాతఁడు నుతులన్
మొనయుచుఁ జేసెడు వానికి
ధన మొసఁగును దాను యోగ్యధనయుక్తుండై ॥ 897

(2) చ॥ శతమిత మైన యస్త్రతతి శత్రునకుం గల దన్న మెంతయున్
వితతము, వాఁడు సోమరస విస్తృతిచే మద మొందియున్న ప
ర్వతమును బోలి ఖాద్యము నఖర్వ మనీష నొసంగ దాతయై
సతతము విత్తవంతులకు సంతసమున్ జనియింపఁజేసెడున్ ॥ 898

---

1. తేఽఅస్రిధఽఓజో, 2. ప్రావఽఏతశం, 3. మఘవన్మేధేఽఅధ్వరే, 4. గోశర్యేఽఅసిషాసోఽఅద్రివో. (ప్రా.ప్ర.)

* వాలఖిల్యుఁడు. (ప్రా.ప్ర.పా.)

(3) చ॥ అభిషుత సోమ మెప్పుడు మహాముద మందఁగఁజేయు నప్పుడే
విభు వగు నింద్రదేవుఁ డతివిస్తృతహవ్య మొసంగు వారికిన్
రభసముతోడ ధేనువుల రాజులకున్ వలె సంతసంబుతో
శుభ మగు నీటి నిచ్చుఁగద! సుందరయజ్ఞమహోత్సవంబులన్ ॥ 899

(4) ఉ॥ ఋత్విజులార! మీ కిలను ప్రీతిని రక్ష నొసంగఁ గర్మముల్
తత్వ మెరుంగు నింద్రునకుఁ దక్షణ మిచ్చు మధుప్రపంచముౘ
సత్వర మో గృహప్రదుఁడ! చక్కని సోమము దెచ్చి నీ మన
స్తత్వము పొంగ నుంచఁబడుఁ సమ్ముఖమందు నుతించు వేళలౘ ॥ 900

(5) గీ॥ యజ్ఞసోమము ప్రేరితం బౌచు నింద్ర!
యశ్వము విధాన నతితుష్టి నరుగుచుండె
సిద్ధ మయ్యెను సోమంబు శ్రేష్ఠపురుష
సన్నుతులఁ బ్రీతిదములుగాఁ జలుపు మీవు ॥ 901

(6) గీ॥ వీరు నృగుని నంతట వెలుఁగు వాని
ధనముచేఁ బ్రేరితుం డగు ధర్మపరుని
మరియు ధనభూతి విగ్రహు మాన్యు నింద్రు
సన్నుతించెద నే వేళ సరస సూక్తి ॥ 902

గీ॥ జలవిశిష్టకూప సరణి నో పవిధారి!
యంతటం బ్రసక్త మైన ధనముఁ
గూడు హవ్యములకుఁ గూర్పంగ మంగళ
మమల సోమరసము నాను మీవు ॥ 903

(7) గీ॥ స్వర్గమందునఁ బృథ్విని జాల దూర
దేశమందున్న యింద్ర! నీ తేరు ముందు
హరివరంబులఁ గూర్చుచు నధికదర్మ
నీయ! ర మ్మిక్కడకు నీ వమేయతుష్టి 904

(8) ఉ॥ నీ రథవాహకాశ్వములు నిత్యము హింసలఁ బొందకుండు నో
వీరుఁడ! యవ్వి వాయుగత వేగము తాము జయింపఁగల్గుఁ దత్
సారమువల్ల దస్యులను ద్రచ్చితి వామను కీర్తి హెచ్చుగాఁ
బ్రేరణఁ జేసి తీవు మరి ప్రేరణఁ జేసితి వన్ని వస్తులన్ ॥ 905

(9) గద్యము॥

ఓ శూరుఁడా! నివాసప్రదుఁడా! యింద్రా! యేతత్పరిమిత మగు నీ నూతన ధనము నే నెరుంగుమను. నీ విట్టి కర్తవ్య ధనార్థమై యేతశుని దశవ్రజవిశిష్టుఁ డగు వశుని సంరక్షించితివి! ॥ 906

(10) గీ॥ కణ్వదీర్ఘనీథు కమనీయ గోశర్య
లనెడు వారి కెట్టు లవన మిచ్చి
యమరినావొ! యట్టు లశ్వముల్ మూలాన
కావవలదె! మమ్ముఁ గరుణఁ బూని ॥ 907

## సూక్తమ్—51

ఋషిః—శ్రుష్టిగుః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) యథా మనౌ సాంవరణౌ సోమమిన్ద్రాపిబః సుతమ్ ।
నీపాతిథౌ మఘవన్ మేధ్యాతిథౌ పుష్టిగౌ శ్రుష్టిగౌ సచా ॥ 1059

(2) పార్షద్వాణః ప్రస్కణ్వం సమసాదయచ్ఛయానం జివ్రిముద్ధితమ్ ।
సహస్రాణ్యసిషాసద్ గవామృషిస్త్వోతో దస్యవే వృకః ॥ 1060

(3) య¹ ఉక్థేభిర్న విన్ధతే చికిద్య² ఋషిచోదనః ।
ఇన్ద్రం తమచ్ఛా వద నవ్యస్యా మత్యరిష్యన్తం న భోజసే ॥ 1061

(4) యస్మా³ అర్కం సప్తశీర్షాణమానృచుస్త్రిధాతుముత్తమే పదే ।
స త్విమా విశ్వా భువనాని చిక్రదదాదిజ్జనిష్ట పౌంస్యమ్ ॥ 1062

(5) యో నో దాతా వసూనామిన్ద్రం తం హూమహే వయమ్ ।
విద్మా హ్యస్య సుమతిం నవీయసీం గమేమ గోమతి వ్రజే ॥ 1063

(6) యస్మై త్వం వసో దానాయ శిక్షసి స రాయస్పోషమశ్నుతే ।
తం త్వా వయం మఘవన్నిన్ద్ర గిర్వణః సుతావన్తో హవామహే ॥ 1064

(7) కదా చన స్తరీరసి నేన్ద్ర సశ్చసి దాశుషే ।
ఉపోపేన్ను మఘవన్ భూయ⁴ ఇన్ను తే దానం దేవస్య పృచ్యతే ॥ 1065

(8) ప్ర యో ననక్షే⁵ అభ్యోజసా క్రివిం వధైః శుష్ణం నిఘోషయన్ ।
యదేదస్తమ్భీత్ ప్రథయన్నమూం దివమాదిజ్జనిష్ట పార్థివః ॥ 1066

---

1. యఽఉక్థే, 2. చికిద్యఽఋషి, 3. యస్మాఽఅర్కం, 4. భూయఽఇన్ను తే, 5. ననక్షేఽఅభ్యో. (ప్రా. ప్ర.)

(9) యస్యాయం విశ్వ[1] ఆర్యో దాసః శేవధిపా[2] అరిః ।
తిరశ్చిదర్యే రుశమే పవీరవి తుభ్యేత్ సో[3] అజ్యతే రయిః ॥ 1067

(10) [4]తురణ్యవో మధుమన్తం ఘృతశ్చుతం విప్రాసో[5] అర్కమానృచుః ।
అస్మే రయిః పప్రథే వృష్ణ్యం శవో ఽస్మే సువానాస[6] ఇన్దవః ॥ 1068

## సూక్తము—51

ఋషి—కాణ్వుఁడైన ప్రుష్టిగుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ ఘనసాన్వరణి మనువునకు సోమరసంబు పానముఁ జేయంగఁ బూనినావు
మేధాతిథింగూర్చి మెఱయు నీపాతిథిఁగూర్చి సోమంబును గ్రోలినావు
శయనించు ప్రస్కణ్వశాంతఋషీశుని నూర్ధ్వదేశమునందు నునిచినాఁడ
వల్ల పార్షద్వానుఁ డనువాని దివమందు స్థాపింపఁగా నీవు చాలినావు
గీ॥ దస్యుగణపక్ష ఋషివర్గ ధర్మపరుఁడ, వైన నీవల్ల రక్షల నంది వేయి
గోవులకు రక్షణ మొసంగఁ గూడు వాని, కమితముదమును నొసఁగు మో యమరవిభుఁడ! ॥ 908

(3) గద్యము॥

ఎవనికి సూక్తములచే లాభముఁ జేయఁబడునో! యెవఁడు ఋషికర్తృకప్రేరితుఁడై సకలమునకు విజ్ఞాతుఁడో ! రక్షణాభిలాషియో ! యట్టి యింద్రుని సమ్ముఖమున సేవనిమిత్తము నూతనస్తుతి నుచ్చరింపుము! ॥ 909

---

1. విశ్వ ఽ ఆర్యో. 2. శేవధిపా ఽ అరిః. 3. తుభ్యేత్సో ఽ అజ్యతే. 4. పురణ్యవో.
5. విప్రాసో ఽ అర్కం. 6. నాస ఽ ఇన్దవః. (ప్రా.ప్ర.)
* వాలఖిల్యుఁడు. (ప్రా.ప్ర పా.)

(4) గద్యము ॥

ఉత్తమ స్థానమందు నెవరి నుద్దేశించి సప్తశీర్షవిశిష్టములు, స్థానత్రయయుతములు,
నగు నర్చనామంత్రము లుచ్చరింపఁబడునో! వాఁ డీ సమస్తభువనములను
శబ్దయుతములుగా నొనర్చెను. వాఁడే బలము నుత్పాదించెను ॥ 910

(5) గీ॥ ఎవఁడు మాకు ధనము నెల్లనొసంగునొ!
యట్టి యింద్రుఁ బిలిచె [1]దతని నూత్న
కరుణ నెఱుఁగు[2] దేను గమనీయ గోయుక్త-
లైన గోష్ఠములకు నరుగఁగలను ॥ 911

(6) చ॥ స్తుతిపర! యోగ్యవాసదుఁడ! తుష్టివిశేషము నీయఁదల్చి నీ
వతిశయ మైన దానము మహాత్మున కిచ్చిన వానికిన్ ధనం
బతిశయ మౌను గావున సమంచిత సోమముచేతఁ బట్టుచున్
హితకరసత్యసూక్తముల నెక్కువ మేము నినున్ నుతింపమే! ॥ 912

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీ వెక్కడను నివృత్తప్రసవుఁడవు కాకుము! హవ్యదాతలతోఁ
గలియుము! నీవు దేవతవు! నీ దానము మాటి మాటికి మా సమీపమునకు
వచ్చును ॥ 913

(8,9) సీ॥ అస్త్రప్రయోగంబు నాచరించుచు శుష్ణుఁ జెండి కూపము నిండఁజేసె నెవఁడొ!
ఘనదివికిన్ ఖ్యాతిఁ గల్పించుచున్ దాని స్తంభితంబుగఁజేయఁజాలె నెవఁడొ!
సకాలార్యదాసుల సంఘం బొనర్చెడు స్తోత్రంబులకు నెల్లఁ బాత్రుఁ డెవఁడొ!
శ్వేతవర్ణుఁ బరీరుఁ జేరుచుఁ బ్రీతితో నచ్చ [3]టుపస్థితుఁ డయ్యె నెవఁడొ!
గీ॥ యట్టి ఘనుఁడు మహాత్ముఁడత్యంతమైన, ధనము నొసఁగంగఁజాలుచు ధర్మనిరతుఁ
డైన యింద్రుఁడు మాతోడ నన్నివేళ,లందు మిళితుఁడై మనుఁగాక నతిశయముగ॥ 914

---

1. పిలిచెదతని. (పిలిచెదన్ + అతని) 2. ఎఱుఁగుదేను. (ఎఱుఁగుదున్ + ఏను)
3. అచ్చటుపస్థితుఁడు. (అచ్చటన్ + ఉపస్థితుఁడు)

(10) గీ॥ మధుఘృతస్రావి యైనట్టి మంత్రసరణి
విప్రులు పఠించుచున్నారు వివిధవారి
ధనము ప్రథితంబు పిరుషోచితబలము ప్రమ
దితము సోమరసంబు ప్రథితము గాదె!॥ 915

## సూక్తమ్—52

ఋషిః—ఆయుః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) యథా మనౌ వివస్వతి సోమం శక్రాపిబః సుతమ్ ।
యథా త్రితే ఛన్ద[1] ఇన్ద్ర జుజోషస్యాయౌ మాదయసే సచా ॥ 1069

(2) పృషధ్రే మేధ్యే మాతరిశ్వనీన్ద్ర సువానే[2] అమన్దథాః ।
యథా సోమం దశశిప్రే దశోణ్యే స్యూమరశ్మావృజూనసి ॥ 1070

(3) య[3] ఉక్థా కేవలా దధే యః సోమం ధృషితాపిబత్ ।
యస్మై విష్ణుస్త్రీణి పదా విచక్రమ[4] ఉప మిత్రస్య ధర్మభిః ॥ 1071

(4) యస్య త్వమిన్ద్ర స్తోమేషు చాకనో వాజే వాజిఞ్ఛతక్రతో ।
తం త్వా వయం సుదుఘామివ గోదుహో జుహూమసి శ్రవస్యవః ॥ 1072

---

1. ఛన్దఽఇన్ద్ర. 2. సువానేఽఅమన్దథాః. 3. యఽఉక్థా. 4. చక్రమఽఉప. (వా.ప్ర.)

(5) యో నో దాతా స నః పితా మహాగ్ం[1] ఉగ్ర ఈశానకృత్ ।
అయామన్నుగ్రో మఘవా పురూవసు[2]ర్గోరశ్వస్య ప్ర దాతు నః ॥ 1073

(6) యస్మై త్వం వసో దానాయ మంహసే స రాయస్పోషమిన్వతి ।
వసూయవో వసుపతిం శతక్రతుం స్తోమైరిన్ద్రం హవామహే ॥ 1074

(7) కదా చన ప్ర యుచ్ఛస్యుభే ని పాసి జన్మనీ ।
తురీయాదిత్య హవనం త[3] ఇన్ద్రియమా తస్థావమృతం దివి ॥ 1075

(8) యస్మై త్వం మఘవన్నిన్ద్ర గిర్వణః శిక్షో శిక్షసి దాశుషే ।
అస్మాకం గిర[4] ఉత సుష్టుతిం వసో కణ్వవచ్ఛృణుధీ హవమ్ ॥ 1076

(9) అస్తావి మన్మ పూర్వ్యం బ్రహ్మేన్ద్రాయ వోచత ।
పూర్వీరృతస్య బృహతీరనూషత స్తోతుర్మేధా[5] అసృక్షత ॥ 1077

(10) సమిన్ద్రో రాయో బృహతీరధూనుత సం క్షోణీ సము సూర్యమ్ ।
సం శుక్రాసః శుచయః సం గవాశిరః సోమా[6] ఇన్ద్రమమన్దిషుః ॥ 1078

---

1. మహాగ్ం ౼ ఉగ్ర ౼ ఈశాన, 2. వసుగోరశ్వస్య, 3. త ౼ ఇన్ద్రియమా,
4. గిర ౼ ఉత, 5. మేధా ౼ అసృక్షత, 6 సోమా ౼ ఇన్ద్ర (వ్రా.ప్ర.)

## సూక్తము—52

ఋషి—కాణ్వుఁడైన యాయువు*

దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ వాసవుఁడా! వివస్వన్మనుసోమ మన్ రసము నెట్టులు నీవు మెసవినావొ!
త్రితుని మన స్నెట్లు స్థిరముగ నీయందుఁ గలియునట్టులు చేయఁగలిఁగినావొ!
సతత మాయువుతోఁడ సరిఁగూడి నీ వెట్టు లధికమత్తుఁడ వౌచు నమరినావొ!
మాతరిశ్వ సుసోమ మథన మారంభింప నెట్లు మత్తుఁడ వౌచు నెసఁగినావొ!
గీ॥ యట్లె దీప్తివిశిష్టుఁడై యమరునట్టి, యీ దశోన్మని సోమంబు నింక మిగుల
శ్రేష్ఠదశశిప్ర సోమంబుఁ జేరి దాని, పానమును జేయుదువుగాక! భాగ్య మలర ॥ 916

(3,4) గద్యము॥

ఎవ్వఁ డుక్థముల ధరించునో! యెవ్వఁడు ధృష్ణుని వలె సోమపానము నొనర్చునో!
యెవరి నుద్దేశించి మిత్రుని కర్మ చెంత విష్ణువు మూఁడు పాదములను విక్షేపించెనో!
వేగవంతుఁడవు, శతక్రతువువు, నగు నట్టి నీ వెవరి యజ్ఞమున స్తుతులను
గోరెదవో! యట్టి మే మన్నాభిలాషులమై, గో దోహకుఁడు
గోవులను బిలుచునట్లు నిన్నుఁ బిలుచుచున్నాము ॥ 917

(5) సీ॥ ఏ వాసవుఁడు మాకు నెనలేని దాతయో! యాతఁడు మా కిల నతిశయించు
నే వాసవుఁడు మాకు నెనలేని దాతయో! యాతఁ డుగ్రుండయి యమరుచుండు
నే వాసవుఁడు మాకు నెనిలేని దాతయో! యాతఁ డైశ్వర్యంబు నందఁజేయు
నే వాసవుఁడు మాకు నెనలేని దాతయో! యాతఁడు మఘవుఁడై ప్రీతి నొసఁగు
గీ॥ నాతఁడు ప్రభూతధనవంతుఁ డగుచు మాకు, నశ్వసంఘంబులను మరి యాలమంద
లను నొసంగునుగాక నిల నిఁక మమ్ముఁ, బాలనముఁ జేయుఁగాక నే లీలనైన ॥ 918

(6) గీ॥ ఇంద్ర! నీ వెవ్వరికి ధన మీయ నుందు
వట్టి వారలు ధనపుష్టి నందఁగలరు
ధనముఁ గోరుచు వసుపతి ఘనశతేష్టి
నింద్రుఁ బిలుచుచునుంటిని నెల్ల వేళ ॥ 919

* వాలఖిల్యుఁడు. (ప్రా. ప్ర.పా.)

(7) గీ॥ వాసవా! యిప్పు డప్పుడు శ్రమల నీవు
పడుచునుందువుగద! ప్రాణిపంక్తి కెల్ల
నవన మొసఁగుము! కణ్వుని యచ్చనుతులఁ
బోలి మా[1] స్తుతుల నెల్ల సులీల వినుము! ॥ 920

(8) గీ॥ హవ్యదాతలకున్ దాన మందఁజేసి
కణ్వ మౌనీశు వాక్యము కరుణ వినిన
యటులె మా వాక్యపద్ధతి నాలకింపు!
స్తుతిపరా! వాసవా! నీవు! మతిఁ దలంచి ॥ 921

(9, సీ॥ ఇంద్రు నుద్దేశించి యెల్ల ప్రత్నస్తోమములను బఠింపుఁడు! మోద మలర
10) నతినవీనంబులై యత్యంతస్వచ్ఛంబు లౌ స్తవంబులఁ బల్కిఁ దంద మొప్ప
యజ్ఞంబునకుఁ బూర్వమందున్న సూక్తుల యుచ్చారణముఁ జేయుఁ డోర్మి మిగుల
స్తోతల మేధస్సు శోభ లీనెడునట్లు వృద్ధిని జేయుఁడు! వెలుఁగు కలుఁగ
గీ॥ నింద్రుఁడు ధనంబు దివి భువి నినుని శ్వేత, వర్ణశుచి వస్తువుల నెల్ల బహువిధములఁ
బ్రేరణముఁ జేసి వానిని బ్రీతి గవ్య,మిశ్రిత సుసోమరసమున మెఱయఁజేసె ॥ 922

## సూక్తమ్—53

ఋషిః—మేధ్యః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ఉపమం త్వా మఘోనాం జ్యేష్ఠం చ వృషభాణామ్ ।
పూర్భిత్తమం మఘవన్నిన్ద్ర గోవిదమీశానం రాయ[1] ఈమహే ॥ 1079

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

1. రాయఽఈమహే. (వా.ప్ర.)

(2) యః[1] ఆయుం కుత్సమతిథిగ్వమర్దయో వావృధానో దివేదివే ।
తం త్వా వయం హర్యశ్వం శతక్రతుం వాజయన్తో హవామహే ॥ 1080

(3) ఆ నో విశ్వేషాం రసం మధ్వః సిఞ్చన్త్వద్రయః ।
యే పరావతి సున్విరే జనేష్వా యే[2] అర్వావతీన్దవః[3] ॥ 1081

(4) విశ్వా ద్వేషాంసి జహి చావ చా కృధి విశ్వే సన్వన్త్వా వసు ।
శీష్టేషు చిత్తే మదిరాసో[3] అంశవో యత్రా సోమస్య తృమ్పసి ॥ 1082

(5) ఇన్ద్ర నేదీయ[4] ఏదిహి మితమేధాభిరూతిభిః ।
ఆ శంతమ శంతమాభిరభిష్టిభిరా స్వాపే స్వాపిభిః ॥ 1083

(6) ఆజితురం సత్పతిం విశ్వచర్షణిం కృధి ప్రజాస్వాభగమ్ ।
ప్ర సూ తిరా శచీభిర్యే త[5] ఉక్థినః క్రతుం పునత[6] ఆనుషక్ ॥ 1084

(7) యస్తే సాధిష్ఠో౽వసే తే స్యామ భరేషు తే ।
వయం హోత్రాభిరుత దేవహూతిభిః ససవాంసో మనామహే ॥ 1085

---

1. యః౽ఆయుం, 2. యే౽అర్వావతి, 3. రాసో౽అంశవో, 4. నేదీయ౽ఏదిహి, 5. త౽ఉక్థినః, 6. పునత౽ఆనుషక్, (వ్యా.ప్ర.)

(8) అహం హి తే హరివో బ్రహ్మ వాజయురాజిం యామి సదోతిభిః ।
త్వామిదేవ తమమే సమశ్వయుర్గవ్యురగ్రే మథీనామ్ ॥ 1086

## సూక్తము—53

ఋషి—కాణ్వుఁడైన మేధ్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

నీవు ధని కుపమాన స్వరూపుఁడవు! అభీష్టవర్షులలో జ్యేష్ఠుఁడవు! అందరికంటెఁ
గాంక్షితముల నొసంగువాఁడవు! స్వామివి! ఓ మఘవానుఁడా! యింద్రుఁడా!
ధనమును నిన్ను యాచించుచున్నాను॥ 923

(2) గీ॥ ఎవఁడు ప్రత్యహంబు నెంతయు నభివృద్ధిఁ
బొందుచుండి యాయు పూజ్యకుత్స
ముఖుల కవన మొసఁగె? సుఖవానుఁ డగు వాని
నాదరించుచుంటి నన్నమునకు॥ 924

(3) గీ॥ అధికదూరమునం దెద్ది యభిషుతంబొ?
యంతికమునందు నెయ్యది యభిషుతంబొ?
యట్టి సోమరసంబు మా యభిషవశిల
సిరులఁ బోషించుఁగాక! సుస్థిరము గాఁగ॥ 925

(4) ఉ॥ ఎచ్చట సోమపానమునఁ దృప్తుఁడ నయ్యెదవో! మహాత్మ ! నీ
వచ్చట శత్రుమండలిని నంతముఁ బుచ్చి పరాభవింపుమా!
[1]పొచ్చెము లేనిదౌ ధనము పూర్ణముగా నుపభోగ్య మౌను దా
నిచ్చట సోమ మంతట నహీన ముదంబును నీకుఁ జేసెడుఁన్॥ 926

---

* వాలఖిల్యుఁడు (ప్రా.ప్ర.పా.) 1. పొచ్చము. (ప్రా.ప్ర.పా.)

(5) గీ॥ నీవు కళ్యాణతముఁడవు! నిఖిలబంధు
వవుదు వత్యంతశుభదుఁడ వౌ దభీష్ట
కరుఁడ వౌదువు! రక్షాప్రకారకార్య
పద్ధతినిగూడి మా చెంతఁ బడు! మహేంద్ర!॥ 927

(6) గీ॥ సాధుపాలకుండు సకలలోకాధీశ్వ
రుండు యుద్ధమందు మెండు త్వరను
గలిఁగియున్న యింద్రు వెలిఁగెడు జనులందుఁ
బూజ్యునిగ నొనర్తు పూజ్యు లెల్ల॥ 928

గీ॥ ఎవరు కర్మవలన నెన్నియొ! సఫలముల్
గలుఁగఁజేయుచుంద్రు ఘనులు వార
ఖండభారమునను మెండుగ యజ్ఞముల్
జరుపుచుంద్రుగాత! జగతియందు॥ 929

(7) గద్యము॥

అన్నిటికన్న నుత్కృష్టమైనదియు నీ సంబంధ మైనదియు నేది కలదో! దానిని మేము
పొందెదము. రక్షావిషయమై మేము నీ వారమే యగుదుము. మేము స్తుతి చేతను,
నాహ్వానముచేతను, నిన్ను భజించుచు వినుతించెదము॥ 930

(8) ఉ॥ అన్నగవాశ్వకాంక్షినయి యశ్వవిశిష్టుఁడ! యింద్రదేవ! ని
గ్రన్నన సన్నుతించెద సురక్షలఁ గోరుచు యుద్ధభూమి, వి
ద్వన్నుత! భీతి నే విడచి తప్పక నిన్నుఁ గుశత్రు సన్నిధిన్
మన్ననతోడఁ బెట్టెదను మాన్యులు సూక్తులతోడ మెచ్చఁగన్॥ 931

## సూక్తమ్—54

ఋషిః—మాతరిశ్వా కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 3-4-విశ్వే దేవాః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ఏతత్ త[1] ఇన్ద్ర వీర్యం గీర్భిర్గృణన్తి కారవః ।
తే స్తోభన్త[2] ఊర్జమావన్ ఘృతశ్చుతం పౌరాసో నక్షన్ ధీతిభిః ॥ 1087

(2) నక్షన్త[3] ఇన్ద్రమవసే సుకృత్యయా యేషాం సుతేషు మన్దసే ।
యథా సంవర్తే[4] అమదో యథా కృశ ఏవాస్మే ఇన్ద్ర మత్స్వ ॥ 1088

(3) ఆ నో విశ్వే సజోషసో దేవాసో గన్తనోప నః ।
వసవో రుద్రా[5] అవసే న ఆ గమఞ్ఛృణ్వన్తు మరుతో హవమ్ ॥ 1089

(4) పూషా విష్ణుర్హవనం మే సరస్వత్యవన్తు సప్త సిన్ధవః ।
ఆపో వాతః పర్వతాసో వనస్పతిః శృణోతు పృథివీ హవమ్ ॥ 1090

(5) యదిన్ద్ర రాధో[6] అస్తి తే మాఘోనం మఘవత్తమ ।
తేన నో బోధి సధమాద్యో వృధే భగో దానాయ వృత్రహన్ ॥ 1091

---

1. ఏత త్త॰ఇన్ద్ర. 2. స్తోభ న్త॰ఊర్జ. 3. నక్ష న్త॰ఇన్ద్ర. 4. సంవ ర్తే॰అమదో యథా కృశ॰ఏవాస్మే॰ఇన్ద్ర.
5. రుద్రా॰అవసే న॰ఆ. 6. రాధో॰అస్తి. (ప్రా.ప్ర.)

(6) ఆజీపతే నృపతే త్వమిద్ధి నో వాజ[1] ఆ వక్షి సుక్రతో ।

వీతీ హోత్రాభిరుత దేవవీతిభిః ససవాంసో వి శృణ్విరే ॥ 1092

(7) సన్తి హ్యర్య[2] ఆశిష ఇన్ద్ర ఆయుర్జనానామ్ ।

అస్మాన్ నక్షస్వ మఘవన్నుపావసే ధుక్షస్వ పిప్యుషీమిషమ్ ॥ 1093

(8) వయం త[3] ఇన్ద్ర స్తోమేభిర్విధేమ త్వమస్మాకం శతక్రతో ।

మహి స్థూరం శశయం రాధో[4] అహ్రయం ప్రస్కణ్వాయ ని తోశయ ॥ 1094

## సూక్తము—54

ఋషి—కాణ్వుఁడైన మాతరిశ్వుఁడు*

దేవత—ఇంద్రుఁడు, 3,4-విశ్వే దేవతలు†

(1) క॥ స్తుతికరులు సన్నుతుల నీ
తతవీర్యము నుగ్గడించి తత్క్షణమె నినున్
స్తుతియించి బలముఁ బడయుదు
రతులిత కర్మముల నిన్ను నమరుఁడ! కంటే! ॥ 932

(2) గద్యము॥

ఎవరి సోమాభిషవమువలన నీవు ప్రమత్తుఁడ వగుదువో! వా రుత్కృష్టకర్మల నొనర్చి నిన్నుఁ బొందెదరు. ఎటులు సంవర్తుని విషయమై కృశుని విషయమై దయ తల్చితివో!
యటులు మముగురించి ప్రసన్నుఁడ వగుము! ॥ 933

1. వాజఽఆ. 2 ర్యఽఆశిషఽఇన్ద్రఽఆయుర్జనానామ్. 3. తఽఇన్ద్ర. 4. రాధోఽఅహ్రయం. (వ్రా.ప్ర.)

* వాలఖిల్యుఁడు (వ్రా.ప్ర.పా.) † 3,4-పెక్కుఁడు. (వ్రా.ప్ర.పా )

(3)గద్యము॥

సమస్త దేవతలు సమానప్రీతియుక్తులై మా కభిముఖముగ మా సమీపమునకు
వచ్చెదరుగాక! మరుత్తులు మా యాహ్వానమును నాలకింతురుగాక! ॥ 934

(4) గీ॥ పర్వత వనస్పతులు జలవాయువులును
బూష విష్ణు సరస్వతుల్ పూతయజ్ఞ
కర్మ రక్షించెదరుగాక! కరుణఁ బూని
పృథ్వి మా పిల్పు చెవులందుఁ బెట్టుఁగాక! ॥ 935

(5) గీ॥ ఇంద్రదేవ! నీకు నెల్ల ధనం బుండె
మదము నొంది వృద్ధి మాకుఁ జేయ
దానితో సమృద్ధిఁ దాల్చుచు నీ వతి
శ్రేష్ఠతముఁడ వౌదు సృష్టియందు ॥ 936

(6) గీ॥ నీవు మా యుద్ధములయందు నిలుచు చింద్ర
వినుము! మా స్తోత్రముల నెల్ల వీను లలర
యజ్ఞకర్మములం దెల్ల నమరవరులు
భక్షణార్థము మిళితులై పరఁగఁగలరు ॥ 937

(7) గీ॥ ఇంద్రుఁ డొసఁగుచుండె నెంతయు నాశీస్సు
నాయు వుండె జనుల కతిశయముగ
మఘవ! నీవు వచ్చి మా కభివృద్ధిని
నన్న సంపదలను నందనిమ్ము! ॥ 938

(8) గీ॥ స్తుతులచే నుతింతు శతయజ్ఞ! నీవు మా
వాఁడ వౌదువయ్య! ప్రకృతియందుఁ
బ్రచుర మైనయట్టి ప్రస్థూల మైనట్టి
ధన మొసంగవలదె! దాత వగుట ॥ 939

## సూక్తమ్—55

ఋషిః—కృశః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, ప్రస్కణ్వశ్చ
ఛందః—గాయత్రీ, 3, 5-అనుష్టుప్

(1) భూరీదిన్ద్రస్య వీర్యం వ్యఖ్యమభ్యాయతి ।
రాధస్తే దస్యవే వృక ॥ 1095

(2) శతం శ్వేతాస[1] ఉక్షణో దివి తారో న రోచన్తే ।
మహ్నా దివం న తస్తభుః ॥ 1096

(3) శతం వేణూఞ్ఛతం శునః శతం చర్మాణి మ్లాతాని ।
శతం మే బల్బజస్తుకా[2] అరుషీణాం చతుఃశతమ్ ॥ 1097

(4) సుదేవాః స్థ కాణ్వాయనా వయోవయో విచరన్తః ।
అశ్వాసో న చఙ్క్రమత ॥ 1098

(5) ఆదిత్సాప్తస్య చర్కిరన్నానూనస్య మహి శ్రవః ।
శ్యావీరతిధ్వసన్పథశ్చక్షుషా చన [3]సంనశే ॥ 1099

---

1. శ్వేతాసఽఉక్షణో, 2. స్తుకాఽఅరుషీణాం, 3. సన్నశే. (బ్రా. ప్ర.)

## సూక్తము—55

ఋషి—కాణ్వుఁడగు కృశుఁడు†
దేవత—ఇంద్రుఁడు, ప్రస్కణ్వుఁడు*

(1) గీ॥ ఇంద్ర! నీదు కర్మ లెక్క డటంచు నే
నెఱుఁగుచుంటి దస్యు వృకశరీర!
మఘవ! నీదు ధనము మా కభిముఖముగ
వచ్చుచుండె మేము మెచ్చునటుల ॥ 940

(2) గీ॥ ఆకసంబునఁ దారక లతిశయముగ
శోభఁ జెందెడునట్టులు సుందరంపు
వృషము లతికాంతి గాంచుచు వివిధరీతి
స్తంభితము లయ్యె సంతతాదంభవృత్తి ॥ 941

(3) గద్యము॥
శత వేణులును, శత శ్వానములును, శత మ్లాత చర్మములును, శత వల్వజస్తుకములును,
శత చతుష్టయమును, నరుషలును నున్నవి ॥ 942

(4) గీ॥ కణ్వగోత్రగణమ! గ్రాలెడు ప్రత్యన్న
మందుఁ దిరుగుఁ డీర లంద మైన
యశ్వగణముఁ బోలి యతిశయ శ్రీఘంబు
తోడ దేవతలను గూడుకొనుచు ॥ 943

(5) గీ॥ సప్తసంఖ్యా విశిష్టుఁడౌ శక్రునకు మ
హోన్నసంపత్తి యంతయు నమరుచుండె
శ్యామమార్గము దాఁటుచుఁ జాతురిమను
నేత్రములఁ జూడఁబడుచుండె నేతృవరుఁడు ॥ 944

---

† వాలఖిల్యుఁడు (వ్రా.ప్ర.పా.)
* వ్రాతప్రతిలో నీ సూక్తమునకు దేవః "ఇంద్రుఁడు"గా శ్రీ నేమానివారు వ్రాసి "ప్రస్కణ్వ" దైవత్వమును జేర్కొనలేదు. (చూ. వ్రాతప్రతి-9వ సంపుటము-213 పుట.)

## సూక్తమ్—56

ఋషిః—పృషధ్రః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, ప్రస్కణ్వశ్చ, 5-అగ్నిసూర్యౌ
ఛందః—గాయత్రీ, 5-పంక్తిః

(1) ప్రతి తే దస్యవే వృక రాధో[1] అదర్శ్యహ్రయమ్ ।
ద్యౌర్న ప్రథినా శవః ॥ 1100

(2) దశ మహ్యం పౌతక్రతః సహస్రా దస్యవే వృకః ।
నిత్యాద్రాయో[2] అమంహత ॥ 1101

(3) శతం మే గర్దభానాం శతమూర్ణావతీనామ్ ।
శతం దాసాగ్ం[3] అతి స్రజః ॥ 1102

(4) తత్రో[4] అపి ప్రాణీయత పూతక్రతాయై వ్యక్తా ।
అశ్వానామిన్న యూథ్యామ్ ॥ 1103

(5) అచేత్యగ్నిశ్చికితుర్హవ్యవాట్ స సుమద్రథః ।
అగ్నిః శుక్రేణ శోచిషా బృహత్ సూరో[5] అరోచత దివి సూర్యో[6] అరోచత ॥ 1104

---

1. రాధోఽఅదర్శ్య, 2. ద్రాయోఽఅమంహత, 3. దాసాగ్ంఽఅతి, 4. తత్రోఽఅపి,
5. బృహత్సూరోఽఅరోచత. 6. సూర్యోఽఅరోచత. (వ్రా.ప్ర.)

## సూక్తము—56

ఋషి—కాణ్వుఁడైన పృషధ్రుఁడు†
దేవత—5-అగ్ని సూర్యులు, 1-4- ఇంద్రప్రస్కణ్వులు*

(1) గీ॥ దస్యువృకరూప! నీదగు ధనము చాల
దర్శితం బౌచు నుండెను దరచు మాకు
నీ మహాసేన యంతయు నిఖిలదివముఁ
బోలి విస్తృత మగుచుండె లీలమాత్ర ॥ 945

(2,3) గీ॥ దస్యువృకరూప! నీ నిత్యధనమునుండి
దశసహస్రము మరియును దాస గర్ద
భముల మేష శతంబును సముచితముగ
దాన మిడుమయ్య! యింద్రుఁడా! తత్క్షణంబు ॥ 946

(4) గీ॥ అశ్వయాధము చందాన నతివికాస
మైన ధన మతిశయప్రాజ్ఞు లైనయట్టి
శుద్ధులౌ వ్యక్తులకు ముందు సొంపు కలుఁగఁ
జేరఁగల దంచు నే నిప్డు చెప్పఁగలను 947

(5) క॥ జ్ఞాతుఁడు, విజ్ఞాని, సదా
పూత హవిర్వాహి, కిరణ పూర్ణాగ్ని ప్రవి
స్ఫీతముగ వెలుఁగు సూర్యుఁడు
జ్యోతిని స్వర్గంబునందుఁ జొనిపెను ప్రీతిన్ ॥ 948

---

† వాలఖిల్యుఁడు. (వ్రా.ప్ర.పా.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము-215 పట) ఈ సూక్తమునకు దేవత "అగ్ని"గా మాత్రమే శ్రీ నేమానివారు వ్రాసిరి. మిగిలిన దేవతల నామములను చేర్చనలేదు.

## సూక్తమ్—57

ఋషిః—మేధ్యః కాణ్వః
దేవతా—అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్

(1) యువం దేవా క్రతునా పూర్వ్యేణ యుక్తా రథేన తవిషం యజత్రా ।
ఆగచ్ఛతం నాసత్యా శచీభిరిదం తృతీయం సవనం పిబాథః ॥ 1105

(2) యువాం దేవాస్త్రయ[1] ఏకాదశాసః సత్యాః సత్యస్య దదృశే పురస్తాత్ ।
అస్మాకం యజ్ఞం సవనం జుషాణా పాతం సోమమశ్వినా దీద్యగ్నీ ॥ 1106

(3) పనాయ్యం తదశ్వినా కృతం వాం వృషభో దివో రజసః పృథివ్యాః ।
సహస్రం శంసా[2] ఉత యే గవిష్టౌ సర్వాగ్ం[3] ఇత్ తాగ్ం ఉప యాతా పిబధ్యై ॥ 1107

(4) అయం వాం భాగో నిహితో యజత్రేమా గిరో నాసత్యోప యాతమ్ ।
పిబతం సోమం మధుమన్తమస్మే ప్ర దాశ్వాంసమవతం శచీభిః ॥ 1108

---

1. దేవాస్త్రయఽఏకాదశాసః. 2. శంసాఽఉత యే. 3. సర్వాగ్ంఽఇత్తాగ్ంఽఉప. (ప్రా.ప్ర.)

## సూక్తము—57

ఋషి—కాణ్వుఁడైన మేధ్యుఁడు*
దేవత—అశ్విద్వయము

(1) గీ॥ పూర్వమున నిర్మితంబైన పూర్ణరథము
పైని వసియించి యజ్ఞముఁ గాన రండు!
మీర లశ్వులు! పూజ్యులై మీ సుకర్మ
చేత మూఁడవ సవనముఁ జేరుఁ డిపుడు! ॥ 949

(2) గద్యము॥

దేవతలసంఖ్య త్రయస్త్రింశత్పరిమితి కలది. వారు నిత్య సత్యులై యజ్ఞసమ్ముఖమునఁ
జూడఁబడుదురు. వారు దీప్తిమంతులు. అగ్నివిశిష్ట మగు నశ్విద్వయమా! మీరు
మా వారలే! యజ్ఞమున కేతెంచి సోమమును త్రావుఁడు! ॥ 950

(3) క॥ దివియందు గగనమందున్
భువియందుం గాక్షితములఁ బూరించు మిమున్
నవనవములైన నుతులన్
బ్రవిమలమతు లశ్వులార! ప్రకటింతు నొగిన్ ॥ 951

(4) గీ॥ మీకు సోమ మిచట మెరయుచు నుండెను
స్తుతుల వినుచు రండు! సూరులార!
హవ్యదులకుఁ బ్రీతి సవనం బొసంగుచు
దానిఁ ద్రావి మీరు తనివి గనుఁడు! ॥ 952

* వాలఖిల్యుఁడు (ప్రా.ప్ర.పా.)

## సూక్తమ్—58.

ఋషిః—మేధ్యః కాణ్వః
దేవతా— విశ్వే దేవాః, 1-ఋత్విజో వా
ఛందః—త్రిష్టుప్

(1) యమృత్విజో బహుధా కల్పయన్తః సచేతసో యజ్ఞమిమం వహన్తి ।
యో[1] అనూచానో బ్రాహ్మణో యుక్త[2] ఆసీత్ కా స్విత్ తత్ర యజమానస్య సంవిత్ ॥ 1109

(2) ఏక[3] ఏవాగ్నిర్బహుధా సమిద్ధ[4] ఏకః సూర్యో విశ్వమను ప్రభూతః ।
ఏకైవోషాః సర్వమిదం వి భాత్యేకం వా[5] ఇదం వి బభూవ సర్వమ్ ॥ 1110

(3) జ్యోతిష్మన్తం కేతుమన్తం త్రిచక్రం సుఖం రథం సుషదం భూరివారమ్ ।
చిత్రామఘా యస్య యోగేఽధిజజ్ఞే తం వాం హువే[6] అతి రిక్తం పిబధ్యై ॥ 1111

## సూక్తము—58

ఋషి—కాణ్వుఁడైన మేధ్యుఁడు†
దేవత—విశ్వేదేవతలు, 1-విశ్వే దేవతలు లేక ఋత్విజులు*

(1) చ॥ కవివరు లెల్ల నెవ్వనిని గల్పనఁ జేయుచుఁ బెక్కురీతులన్
సవనముఁ జేయుచుండెద రసత్యవచస్సులఁ బల్కకుండ నిం
కెవఁడు నియుక్తుఁ డౌనొ? నుతి సృష్టి నొనర్చెడు వాని రూపుచేఁ
బ్రవిమలుఁడైనవానిఁ గనఁ బ్రాజ్ఞుల కెక్కడ జ్ఞాన మెంచఁగన్ ॥ 953

---

1. యోఽనూచానో, 2. యుక్తఽఆసీత్కా, 3. ఏకఽఏవాగ్ని, 4. సమిద్ధఽఏకః,
5. వాఽఇదం, 6. హువేఽఅతిరిక్తం (వ్రా.ప్ర.)
† వాలఖిల్యుఁడు. (వ్రా.ప్ర.పా.)
* వ్రాతప్రతిలో నీ సూక్తమునకు (9వ సంపుటము-217 పుట) దేవత "అగ్ని"గా మాత్రమే శ్రీ నేమానివారు వ్రాసి మిగిలిన దేవతలను పేర్కొనలేదు.

(2) గీ॥ బహువిధంబుల ననలుండు పరగుచుంట
విశ్వమందున సూర్యుండు వెలయుచుంటఁ
గల్య మొక్కటె జగమునఁ గలుఁగుచుంటఁ
గలుఁగుచుండును నొక్కటి కలుఁగుచుంట ॥ 954

(3) ఉ॥ జ్యోతిని వెల్గువాని సుఖయోగ్యరథాత్ముఁ బ్రవేశ యోగ్యునిం
గేతువుఁ గల్గి చక్రములఁ గీర్తిత దేహుని నగ్నిదేవుఁ బ్ర
ఖ్యాతిని గాంచు సోమమును యజ్ఞమునం జవిఁజూడఁ బిల్తు నేఁ
బ్రీతిని వానిఁ గూడుకొనఁ బెద్ద ధనంబును బొందకుందునే! ॥ 955

## సూక్తమ్—59

ఋషిః—సుపర్ణః కాణ్వః
దేవతా—ఇన్ద్రావరుణౌ
ఛందః—జగతీ

(1) ఇమాని వాం భాగధేయాని సిస్రత[1] ఇన్ద్రావరుణా ప్ర మహే సుతేషు వామ్ ।
యజ్ఞేయజ్ఞే హ సవనా భురణ్యథో యత్ సున్వతే యజమానాయ శిక్షథః ॥ 1112

(2) నిష్షిధ్వరీరోషధీరాప[2] ఆస్తామిన్ద్రావరుణా మహిమానమాశత ।
యా సిస్రతూ రజసః పారే[3] అధ్వనో యయోః శత్రుర్నకిరాదేవ[4] ఓహతే ॥ 1113

(3) సత్యం తదిన్ద్రావరుణా కృశస్య వాం మధ్వ[5] ఊర్మిం దుహతే సప్త వాణీః ।
తాభిర్దాశ్వాంసమవతం శుభస్పతీ యో వామదబ్ధో[6] అభి పాతి చిత్తిభిః ॥ 1114

---

1. సిస్రతఽఇన్ద్రా. 2. రాపఽఆస్తామిన్ద్రా. 3. పారేఽఅధ్వనో. 4. దేవఽఓహతే.
5. మధ్వఽఊర్మిం. 6. వామదబ్ధోఽఅభి. (ప్రా.ప్ర.)

(4) ఘృతప్రుషః సౌమ్యా జీరదానవః సప్త స్వసారః సదన¹ ఋతస్య ।
యా హ వామిన్ద్రావరుణా ఘృతశ్చుతస్తాభిర్ధత్తం యజమానాయ శిక్షతమ్ ॥ 1115

(5) అవోచామ మహతే సౌభగాయ సత్యం త్వేషాభ్యాం మహిమానమిన్ద్రియమ్ ।
అస్మాన్ త్విన్ద్రావరుణా ఘృతశ్చుతస్త్రిభిః సాప్తేభిరవతం శుభస్పతీ ॥ 1116

(6) ఇన్ద్రావరుణా యదృషిభ్యో మనీషాం వాచో మతిం శ్రుతమదత్తమగ్రే ।
యాని స్థానాన్యసృజన్త ధీరా యజ్ఞం తన్వానాస్తపసాభ్యపశ్యమ్ ॥ 1117

(7) ఇన్ద్రావరుణా సౌమనసమదృప్తం రాయస్పోషం యజమానేషు ధత్తమ్ ।
ప్రజాం² పుష్టిం భూతిమస్మాసు ధత్తం దీర్ఘాయుత్వాయ ప్ర తిరతం న³ ఆయుః ॥ 1118

ఇతి వాలఖిల్యమ్ సమాప్తమ్

## సూక్తము—59

ఋషి—కాణ్వుఁడైన సువర్ణుఁడు*
దేవత—ఇంద్రుఁడు, వరుణుఁడు

(1) చ॥ సురుచిర యాగకర్మముల సోమముఁ దీసెడు వేళలందు నో
వరుణమహేంద్రులార! మిము వాక్కులఁ బిల్చుచునుంటి నేను మీ
రిరువురి భాగధేయ మిది యీరలు దీనిని సంగ్రహించి స
త్పురుషులకున్ ధనం బొసఁగి పోషణఁ జేయుఁడు! యజ్ఞకర్మకున్ ॥ 956

1. సదనఽఋతస్య, 2. ప్రజాపుష్టిం. 3. నఽఆయుః. (వా.ప్ర.)

* వాలఖిల్యుఁడు. (వా.ప్ర.పా.)

(2,3) సీ॥ వరుణేంద్రులార! మీ రిరువురు గగనంబుపై నున్న పథమునఁ బారుచుండ్రు!
దేవతాన్యవ్యక్తి దివ్యులారా! మీకు శత్రువు కాకుండ సాగుచుండు!
మీ యనుగ్రహమున మే లగు నోషధుల్ సంపాదితంబులై సాగుచుండు!
మీ వర్తనంబున మించిన జలము తా లోకంబు లంతటఁ బ్రాకుచుండు!
గీ॥ మీ నిమిత్తము కుశ ఋషి పూని సోమ, రసముఁ దీయుచు నుండెను నసమకర్మ
పాలకుల మిమ్ముఁ బోషించు వారి కఖిల, కర్మముల[1] నవన మొసగుఁడు! మర్మ మెఱిఁగి॥ 957

(4) గీ॥ దానశీలము, కమనీయ దర్శనంబు,
సప్తభగినీ సమూహము, సద్ఘృత క్ష
రణము గల్గి మహాయజ్ఞమునఁ బ్రదాన
యుక్తమై[2] మెఱయుచుం[3]డనురక్తి మీర॥ 958

గీ॥ ఇంద్ర! వరుణ! మీకు నెవ్వరు ఘృతమును
నొసఁగువారొ! వారి యుచితయజ్ఞ
ధారణంబుఁ జేసి తగ యజ్ఞకరులకు
దాన మీయుఁ డీరు ధర్మనిష్ఠ॥ 959

(5) గీ॥ దీప్తవరుణేంద్రుల సమీపదేశమందు
నతిశయంబైన సౌభాగ్య మందఁగోరి
యింద్రుఁ డనువాని మహిమల నెల్ల నేను
బొగడెదను సర్వవిధములఁ బొలుపు మిగుల॥ 960

గీ॥ వర మహేంద్రాదిగాఁ గార్యవరపతు లను
వారలు త్రిసప్తసంఖ్యాకబహుళకార్య
ములను రక్షించెదరుగాక! జెలఁగు మమ్ము
ఘృతము వారికి నర్పింతు మతిశయముగ॥ 961

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.
2. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.
3. మెఱయుచుం డనురక్తి. (మెఱయుచుండున్ + అనురక్తి)

(6) చ॥ వరుణుఁడ! యింద్రదేవ! ఋషివర్యుల కెట్టి మనీష సంస్తుతిన్
సురుచిర సౌఖ్యుతంబు పరిశోభి తలంబు నొసంగినారలో!
పొరిఁ బొరి మేము ధైర్యమును బూనుచు యాగముఁ జేరి నిష్ఠచే
నెరుఁగుదు మా సమస్తమును నెక్కుడ భక్తి పురస్సరంబుగన్ ॥ 962

(7) గీ॥ ఎట్టి ధనమున మామన స్సెల్లఁ దృప్తిఁ
బొందునో! గర్వ మేమియుఁ జెందకుండు
నట్టి ధనము మహాత్ముల యజ్ఞకరుల
కిచ్చెదరుగాక! వరుణుఁడా! యింద్ర! మీరు ॥ 963

గీ॥ పుష్టిఁ బ్రజ్ఞల నొసఁగుఁడు! భూతి నిండు!
మేము దీర్ఘాయువుల మౌదు మో మహాత్ము
లార! యాయువు రక్షింపఁ బూనుఁ డనుచు
*వాలఖిల్యుండు ప్రార్థించె వరుణ మిత్రు ॥ 964

వాలఖిల్యసూక్తములు
సమాప్తము

## అనువాకః—7, సూక్తమ్—60

ఋషిః—భర్గః ప్రాగాథః
దేవతా—అగ్నిః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) అగ్న[1] ఆ యాహ్యగ్నిభిర్హోతారం త్వా వృణీమహే ।
ఆ త్వామనక్తు ప్రయతా హవిష్మతీ యజిష్ఠం బర్హిరాసదే ॥ 1119

(2) అచ్ఛా హి త్వా సహసః సూనో[2] అఙ్గిరః స్రుచశ్చరన్త్యధ్వరే ।
ఊర్జో నపాతం ఘృతకేశమీమహే ఽగ్నిం యజ్ఞేషు పూర్వ్యమ్ ॥ 1120

* మూల ఋక్కులో "వాలఖిల్య" శబ్దము ప్రయుక్తము కాలేదు. కాని శ్రీనేమానివా రీ యాంధ్రీకరణములో "వాలఖిల్య" శబ్దమును ప్రయోగించిరి.

1. అగ్నఽఆయాహ్యగ్ని. 2. సూనోఽఅఙ్గిరః (ప్రా.ప్ర.)

(3) అగ్నే కవిర్వేధా[1] అసి హోతా పావక యక్ష్యః ।
మన్ద్రో యజిష్ఠో[2] అధ్వరేష్వీడ్యో విప్రేభిః శుక్ర మన్మభిః ॥ 1121

(4) అద్రోఘమా వహోశతో యవిష్ఠ్య దేవాగ్ం[3] అజస్ర వీతయే ।
అభి ప్రయాంసి సుధితా వసో గహి మన్దస్వ ధీతిభిర్హితః ॥ 1122

(5) త్వమిత్ సప్రథా[4] అస్యగ్నే త్రాతరృతస్కవిః ।
త్వాం విప్రాసః సమిధాన దీదివ[5] ఆ వివాసన్తి వేధసః ॥ 1123

(6) శోచా శోచిష్ఠ దీదిహి విశే మయో రాస్వ స్తోత్రే మహాగ్ం[6] అసి ।
దేవానాం శర్మన్ మమ సన్తు సూరయః శత్రూషాహః స్వగ్నయః ॥ 1124

(7) యథా చిద్ వృద్ధమతసమగ్నే సంజూర్వసి క్షమి ।
ఏవా దహ మిత్రమహో యో[7] అస్మధ్రుగ్ దుర్మన్మా కశ్చ వేనతి ॥ 1125

(8) మా నో మర్తాయ రిపవే రక్షస్వినే మాఘశంసాయ రీరధః ।
అస్రేధద్భిస్తరణిభిర్యవిష్ఠ్య శివేభిః పాహి పాయుభిః ॥ 1126

1. ర్వేధాఽఅసి, 2. యజిష్ఠోఽఅధ్వరే. 3. దేవాగ్ంఽఅజస్ర, 4. సప్రథాఽఅస్యగ్నే, 5. దీదివఽఆ,
6. మహాగ్ంఽఅసి. 7. యోఽఅస్మధ్రుగ్. (వ్రా.ప్ర.)

(9) పాహి నో[1] అగ్న ఏకయా పాహ్యుత ద్వితీయయా ।
పాహి గీర్భిస్తిసృభిరూర్జాం పతే పాహి చతసృభిర్వసో ॥ 1127

(10) పాహి విశ్వస్మాద్రక్షసో[2] అరావ్ణః ప్ర స్మ వాజేషు నోఽవ ।
త్వామిద్ధి నేదిష్ఠం దేవతాతయ[3] ఆపిం నక్షామహే వృధే ॥ 1128

(11) ఆ నో[4] అగ్నే వయోవృధం రయిం పావక శంస్యమ్ ।
రాస్వా చ న[5] ఉపమాతే పురుస్పృహం సునీతీ స్వయశస్తరమ్ ॥ 1129

(12) యేన వంసామ పృతనాసు శర్ధతస్తరన్తో[6] అర్య ఆదిశః ।
స త్వం నో వర్ధ ప్రయసా శచీవసో జిన్వా ధియో వసువిదః ॥ 1130

(13) శిశానో వృషభో యథాగ్నిః శృఙ్గే దవిధ్వత్ ।
తిగ్మా[7] అస్య హనవో న ప్రతిధృషే సుజమ్భః సహసో యహుః ॥ 1131

(14) నహి తే[8] అగ్నే వృషభ ప్రతిధృషే జమ్భాసో యద్వితిష్ఠసే ।
స త్వం నో హోతః సుహుతం హవిష్కృధి వంస్వా నో వార్యా పురు ॥ 1132

---

1 నోఽఅగ్నఽఏకయా. 2. రక్షసోఽఅరావ్ణః. 3. తాతయఽఆపిం. 4. ఆ నోఽఅగ్నే. 5. చ నఽఉపమాతే. 6. తరన్తోఽఅర్యఽఆదిశః. 7. తిగ్మాఽఅస్య. 8. నహి తేఽఅగ్నే. (ప్రా.ప్ర.)

(15) శేషే వనేషు మాత్రోః సం త్వా మర్తాస ఇన్ధతే ।
అతన్ద్రో హవ్యా వహసి [1]హవిష్కృత ఆదిద్ దేవేషు రాజసి ॥ 1133

(16) సప్త హోతారస్తమిదీళతే త్వా ఒగ్నే సుత్యజమహ్రయమ్ ।
భినత్స్యద్రిం తపసా వి శోచిషా ప్రాగ్నే తిష్ఠ జనాగ్ం[2] అతి ॥ 1134

(17) అగ్నిమగ్నిం వో[3] అధ్రిగుం హువేమ వృక్తబర్హిషః ।
అగ్నిం హితప్రయసః శశ్వతీష్వా[4] ఒఒ హోతారం చర్షణీనామ్ ॥ 1135

(18) కేతేన శర్మన్ త్సచతే సుషామణ్యగ్నే తుభ్యం చికిత్వనా ।
ఇషణ్యయా నః పురురూపమా భర వాజం నేదిష్ఠమూతయే ॥ 1136

(19) అగ్నే జరితర్విశ్పతిస్తేపానో దేవ రక్షసః ।
అప్రోషివాన్ గృహపతిర్మహాగ్ం[5] అసి దివస్పాయుర్దురోణయుః ॥ 1137

(20) మా నో రక్ష[6] ఆ వేశీదాఘృణీవసో మా యాతుర్యాతుమావతామ్ ।
పరోగవ్యూత్యనిరామప క్షుధమగ్నే సేధ రక్షస్వినః 1138

---

1. హవవిష్కృతఒఒఆదిద్దేవేషు. 2. జనాగ్ంఒఒఅతి. 3. వోఒఒఅధ్రిగుం. 4. శశ్వతీష్వాఒహోతారం
5. మహాగ్ంఒఒఅసి. 6. రక్షఒఒఆవేశీ (వ్రా.ప్ర.)

## అనువాకము—7, సూక్తము—60

ఋషి—ప్రగాథపుత్రుఁడు భర్గుఁడు
దేవత—అగ్ని

(1) గీ॥ అగ్నులం గూడి రారాదె! యగ్నిదేవ!
నిన్ను హోతగఁ బ్రీతితో నెన్నుచుంటి
హవ్యమండితకుశలపై హవ్యదాత!
ని న్నలంకృతుఁగాఁ జేయ నేర్పుఁగాక! ॥ 965

(2) గద్యము॥

బలపుత్రుఁడ వగు నంగిరస్సా! స్రుక్కు లన్నియు నిన్నుఁ జేరుచున్నవి.
ప్రదీప్తజ్వాలాసహితుఁడును బురాతనుఁడును నగు నగ్నిని యజ్ఞమందు
మేము వినుతించుచున్నాము ॥ 966

(3) చ॥ ఫలము నొసంగె దీవు! శుభపావక! హోతవు! యాగయోగ్యతా
కలితుఁడ వార్యకాండ పరికల్పిత యజ్ఞములందు శుక్రుఁడా!
వెలిఁగెడువానికంటెఁ దగ వేయి మడుంగులు వెల్గు ని న్ననా
విలు లగు విప్ర సంతతులు వేడఁగ నుందురు మంత్రరాజులన్ ॥ 967

(4) గీ॥ ద్రోహరహితామరులు మమ్ము రూఢిఁ గోరు
చుంద్రు కావున వారికి నోపి యన్న
మును నొసంగిన నెంతైన మోద మబ్బు
నిత్య! తరుణ! నివాసదా! నిర్మలాగ్ని! ॥ 968

(5,6)సీ॥ సత్యస్వరూపుఁడా! సర్వరక్షకుఁడవై కవివయి యంతటఁ గ్రాలె దీవు!
సర్వవిస్తృతుఁడవై సకలవిప్రులుఁ జేయు నమలసేవల నెల్ల నందె దీవు!
దీప్తుఁడవై చాల దీప్తి నొసంగుచు సౌఖ్యం బొసంగఁగ జరగె దీవు!
మా స్తోతృవరు లెల్ల మరువక సురదత్త సౌఖ్య మందెదునట్లు సలిపె దీవు!
గీ॥ వారు శత్రుగణంబుల వంచునట్లు, వార లగ్నిపరీతులై వరలునట్టు
లోయి శుచికర! యనలుఁడా! పాయకుండఁ, జేయుచున్[1] మముల సంప్రీతిఁ జేరవలదె? ॥ 969

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "ఖల"ము ప్రయుక్తమైనది.

(7) గీ॥ మాకు ద్రోహము నొనరించి మమ్ము మందు
లుగ నొనర్చెడు వారిని నొగి సుమిత్ర
పూజకా! యగ్ని! దహియింపు! పుడమిఁ గలుఁగు
శుష్క కాష్ఠము లట్టులు సూటి నీవు ॥ 970

(8) గీ॥ అనలుఁడా! హింసఁ జేసెడు మనుజవరుల
కవశులుగఁ జేయుమా! మమ్ము నతిశయముగ
దుష్టకథలఁ బ్రసంగించు దోషుం కడ
కంపకుము మమ్ము నేవేళ సొంపు వీడి ॥ 971

గీ॥ నిత్యతరుణుఁడ! నీ రక్ష నిఖిల హింస
లను దొరంగుచు నాపదలను గతింపఁ
జేయు సుఖసంపదలఁ గూడఁ జేయుఁగాన
దానిచే మమ్ముఁ గాపాడఁ బూసు మీవు ॥ 972

(9) క॥ పాలింపు మొకట ఋకునఁ
బాలింపుము! నాల్గు వాక్యపద్ధతుల మమున్
బాలింపు! మూఁడు ఋక్కులఁ
బాలింపుము! నాల్గు వాక్యపద్ధతులఁ గడున్ ॥ 973

(10) గీ॥ రాక్షసులఁ గొట్టి మా కల రక్ష నొసఁగి
రణమునం దెల్ల మా కతిరక్ష నిచ్చి
యనల! చుట్టంబు వవుటచే యజన వృద్ధి
కొరకు నినుఁ బొందెదము మేము కొదవ లేక ॥ 974

(11) గీ॥ పావకా! యగ్ని! మా కన్నవర్ధకంబు
నతిప్రశస్తము నగు ధన మందనిమ్ము!
నీతి మూలంబునన్ స్పృహణీయ మైన
ధనము నీయుము! సంతతదాత! నీవు ॥ 975

(12) గీ॥ ఎట్టి ధనముచేత నెల్ల యుద్ధములందు
శత్రువులను నస్త్రసమితిఁ జిమ్మి
వానిఁ దప్పుకొనుచు వారికి హింసలఁ
జేయఁగలమొ! దానిఁ జేర్పు! మాకు ॥ 976

(13) గీ॥ వృషభముం బోలి శృంగముల్ వెలుఁగఁజేయు
చుండి తీక్ష్ణంబుగాఁ జేయుచుండి కనలు
నగ్ని తన మస్తకంబును నతిశయముగఁ
గదలఁజేయుచు నుండెఁ దా గౌరవమున ॥ 977

గీ॥ అగ్ని హనువులు తీక్ష్ణంబు లౌను నెవరు
తన్ని వారణఁ జేయంగఁ దగినవార ?
లగ్ని దంతాళి నుత్తముఁ డౌను నతఁడు
బలమునకుఁ బుత్రుఁ డౌఁగద! భాగ్య లీల ॥ 978

(14) గద్యము॥

వృష్టిప్రదా! యగ్నీ! యే కారణమున నీవు వృద్ధిఁ బొందెదవో! యా కారణమున
నీ దంతములు నివారింపఁబడఁగలవు! అగ్నీ! నీవు హోతవు! నీవు మా
హవ్యమును నుత్తమరూపమున హోమముఁ జేయుము! మాకు
వరణీయం బగు నుత్తమ ధనంబును దాన మొసంగుము! ॥ 979

(15) చ॥ అనలుఁడ! మాతృభూతవనమందు జనించెడు కాష్ఠమందు నీ
వనయము నిద్రఁ బోయెదు! మహాత్ములు ని న్నభివృద్ధిఁ జేయఁగా
ననలస భావముం గనుచు హవ్యద హవ్యము గొంచు దేవతా
గణముల కందఁజేసి యట గౌరవ భావముఁ బొంది వెల్గుమా! ॥ 980

(16) గద్యము॥

ఓ యగ్నీ! నిన్ను సప్తహోతలు వినుతింతురు. నీవు దానశీలుఁడవు! అక్షీణుఁడవు!
నీవు తాపప్రదు లగు తేజోబలమువలన మేఘమును భేదింపుము! అగ్నీ!
మమ్ముల నతిక్రమించి ముందుకుఁ జనుము! ॥ 981

(17) గద్యము॥

ఓ స్తోతృగణమా! మీ నిమిత్తమై యగ్ని నాహ్వానించుచున్నారు. మేము బ్రత్రిస్ములను ఛిన్నభిన్నములుగాఁ జేయుచున్నాము. అగ్ని కర్మధారి బహులోకములం దున్నవాఁడు. సమస్తలోకములకును హోత ॥ 982

(18) క॥ సోమయుత గృహములందున
నో మహనీయుండ! నిన్ను నూర్జిత విజ్ఞా
రామబలులైన వారిని
ప్రేమం గూడుకొని మిములఁ బ్రకటింప మొకో! 983

గీ॥ అనలదేవుఁడ! మా కిల నవన మొసఁగఁ
దావకేచ్ఛాప్రకారము తరచు నికట
వర్తులయి రూపములఁ దాల్చు పావనాన్న
సంపదలఁ దెమ్ము! నీ విష్ట సంతసమున ॥ 984

(19) గద్యము॥

ఓ యగ్ని! యో దేవతాస్తుత్యుఁడా! నీవు ప్రజాగణపాలకుఁడవు! యజమాన గృహపాలకుఁడవు! ఇట్టి పాలకత్వము నెప్పుడును విడువకుము! నీవు మహాత్ముఁడవు! ద్యోలోకమును గాపాడు వాఁడవు! యజమాన గృహములం దుండువాఁడవు! ॥ 985

(20) గద్యము॥

ఓ దీప్తధనుఁడా! యగ్ని! రాక్షసాదులు మా గృహమధ్యమును బ్రవేశింపకుండెదరు. యాతుధానుల పీడ మాకుఁ గలుఁగకుండుఁగాక! హింసాకారులు, బలవంతులు, నగు రాక్షసులను దూరమునఁ బరిహరింపుము! 986

## సూక్తమ్—61

ఋషిః—భర్గః ప్రాగాథః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః), 17-శంకుమతీ†

(1) ఉభయం శృణవచ్చ న[1] ఇన్ద్రో అర్వాగిదం వచః ।
సత్రాచ్యా మఘవా సోమపీతయే ధియా శవిష్ఠ[2] ఆ గమత్ ॥ 1139

(2) తం హి స్వరాజం వృషభం తమోజసే ధిషణే నిష్టతక్షతుః ।
ఉతోపమానాం ప్రథమో ని షీదసి సోమకామం హి తే మనః ॥ 1140

(3) ఆ వృషస్వ పురూవసో సుతస్యేన్ద్రాన్ధసః ।
విద్మా హి త్వా హరివః పృత్సు సాసహిమధృష్టం చిచిద్ ధృష్వణిమ్ ॥ 1141

(4) అప్రామిసత్య మఘవన్ తథేదసదిన్ద్ర క్రత్వా యథా వశః ।
సనేమ వాజం తవ శిప్రిన్నవసా మక్షూ చిద్యన్తో[3] అద్రివః ॥ 1142

(5) శగ్ధ్యూషు శచీపత[4] ఇన్ద్ర విశ్వాభిరూతిభిః ।
భగం న హి త్వా యశసం వసువిదమను శూర చరామసి ॥ 1143

† ఈసూక్తఋక్కులకు ఛందస్సు సాయన, మాక్సుముల్లర్ ప్రతులలో "ప్రగాథ" మతము మాత్రమే పేర్కొనఁబడినదికాని 17వ ఋక్కునకుఁగల శంకుమతి మతము పేర్కొనఁబడలేదు.

1. నఽఇన్ద్రోఽఅర్వాగిదం, 2. శవిష్ఠఽఆ గమత్, 3. చిద్యన్తోఽఅద్రివః, 4. శచీపతఽఇన్ద్ర. (వా. ప్ర.)

(6) పౌరో[1] అశ్వస్య పురుకృద్ గవామస్యుత్సో దేవ హిరణ్యయః ।
నకిర్హి దానం పరిమర్ధిషత్ త్వే యద్యద్యామి తదా భర ॥ 1144

(7) త్వం హ్యేహి చేరవే విదా భగం వసుత్తయే ।
ఉద్ వావృషస్వ మఘవన్ గవిష్టయ[2] ఉదిన్ద్రాశ్వమిష్టయే ॥ 1145

(8) త్వం పురూ సహస్రాణి శతాని చ యూథా దానాయ మంహసే ।
ఆ పురందరం చకృమ విప్రవచస[3] ఇన్ద్రం గాయన్తోఽవసే ॥ 1146

(9) అవిప్రో వా యదవిధద్విప్రో వేన్ద్ర తే వచః ।
స ప్ర మమన్దత్ త్వాయా శతక్రతో ప్రాచామన్యో[4] అహంసన ॥ 1147

(10) ఉగ్రబాహుర్మ్రక్షకృత్వా పురందరో యది మే శృణవద్ధవమ్ ।
వసూయవో వసుపతిం శతక్రతుం స్తోమైరిన్ద్రం హవామహే ॥ 1148

(11) న పాపాసో మనామహే నారాయాసో న జల్హవః ।
యదిన్విన్ద్రం వృషణం సచా సుతే సఖాయం కృణవామహై ॥ 1149

1. పౌరోఽఅశ్వస్య. 2. గవిష్టయేఽఉదిన్ద్ర. 3. వచసఽఇన్ద్రం. 4. మన్యోఽఅహంసన. (వా.ప్ర.)

(12) ఉగ్రం యుయుజ్మ పృతనాసు సాసహిమృణకాతిమదాభ్యమ్ ।
వేదా భృమం చిత్ సనితా రథీతమో వాజినం యమిదూ నశత్ ॥ 1150

(13) యత[1] ఇన్ద్ర భయామహే తతో నో[2] అభయం కృధి ।
మఘవఞ్ఛగ్ధి తవ తన్న[3] ఊతిభిర్వి ద్విషో వి మృధో జహి ॥ 1151

(14) త్వం హి రాధస్పతే రాధసో మహః క్షయస్యాసి విధతః ।
తం త్వా వయం మఘవన్నిన్ద్ర గిర్వణః సుతావన్తో హవామహే ॥ 1152

(15) ఇన్ద్రః స్పళుత వృత్రహా పరస్పా నో వరేణ్యః ।
స నో రక్షిషచ్చరమం స మధ్యమం స పశ్చాత్ పాతు నః పురః ॥ 1153

(16) త్వం నః పశ్చాదధరాదుత్తరాత్పుర[4] ఇన్ద్ర ని పాహి విశ్వతః ।
ఆరే[5] అస్మత్ కృణుహి దైవ్యం భయమారే హేతీరదేవీః ॥ 1154

(17) అద్యాద్యా శ్వఃశ్వ[6] ఇన్ద్ర త్రాస్వ పరే చ నః ।
విశ్వా చ నో జరితౄన్ త్సత్పతే[7] అహా దివా నక్తం చ రక్షిషః ॥ 1155

---

1. యతఽఇన్ద్ర. 2. నోఽఅభయం. 3. తన్నఽఊతిభి. 4. పురఽఇన్ద్ర.
5. ఆరేఽఅస్మత్. 6. శ్వఽఇన్ద్ర. 7. సత్పతేఽఅహా. (వా.ప్ర.)

(18) ప్రభఙ్గీ శూరో మఘవా [1]తువీమఘః సంమిశ్లో వీర్యాయ కమ్ ।
ఉభా తే బాహూ వృషణా శతక్రతో ని యా వజ్రం మిమిక్షతుః ॥ 1156

## సూక్తము—61

ఋషి—ప్రగాథుఁడైన భర్గుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ అస్మదీయోభయ విధంబు లైన వాక్య
ములను నింద్రుండు వినుఁగాక! మోద మలర
నతఁడె సహగామియై మాకు నఖిలబలము
నొసఁగుచున్ సోమమును ద్రావ నుండుఁగాక! ॥ 987

(2) గీ॥ పృథ్వి దివి యను శోభనవృష్టి నొసఁగు
నింద్రునిన్ సంస్కరించుచు నెసఁగ మెసఁగ
వానికిన్ *బలము కలుఁగంగ వలయు సంస్క
రణము చేయంగఁబడుచుండె జనులచేత ॥ 988

గీ॥ కాన నో యింద్ర! నీ వుపమానభూత
దేవతలలోనఁ బెద్దవై తేజరిల్లి
వేదిపై నివసింపుమా! వేల్ప! నీదు
మానసము సోమమును ద్రావఁ బూనుగాదె! ॥ 989

(3) గీ॥ జఠరమున సోమమును నీవు చల్లు మనల!
ని న్నదృష్టునిగా మరి నిన్ను ధర్ష
కునిగ నరిజేతగా నెన్నుకొనుచు నుంటి
మమలహర్యశ్వవంతుఁడా! యతిధనేశ ! ॥ 990

---

1. తువీమఘః. (ప్రా.ప్ర.)

* ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

(4) గద్యము॥

ఓ యింద్రుఁడా! మఘవుఁడా! నీ సత్యము నెవ్వరు హింసింపఁగలరు? దేనివలనఁ
గ్రతువులయందు ఫలము నందఁగలనో! యది యగుఁగాక! హనుయుక్త
వజ్రవంతుఁడా! నీ యాశ్రయమున నన్నమును బొంది శీఘ్రముగ
శత్రువులను దిరస్కరించెదము ॥ 991

(5) గీ॥ అభిమతఫలంబు నాకిమ్ము! యజ్ఞనాథ!
నీవు ధనపాలకుండవు! నీవు కీర్తి
మంతుఁడవు! శూరుఁడా! యింద్ర! చెంతనుండి
నీ సపర్యలఁ జేయంగ నేర్తు నేను ॥ 992

(6,7)సీ॥ అశ్వాళిఁ బోషించి యాలమందల నెల్ల వృద్ధిఁ జేయుచు నీవు వెలుఁగు మింద్ర!
స్వర్ణదేహుండవై పరమోత్ససదృశుండ వౌచు జగంబుల నమరు మింద్ర!
నీవు మాకు నొసంగు నిఖిల దానంబులు హింసింపఁబడ వని యెరుఁగు మింద్ర!
నేఁ గోరుచున్నట్టి నిఖిలకాంక్షితముల నింపుగ నీవు మా కీయు మింద్ర!
గీ॥ ధనముఁ గోరెడు వారికి ధనము నీయు,మశ్వములఁ[1] మరియు నావుల నభిలషించు
నాకు వానిని నొసఁగుచు నాకివాస!, యిటకు రమ్ము! మహేంద్రుఁడా! యెలమి నీవు ॥ 993

(8) గీ॥ బహుశతంబు లౌచు బహుసహస్రంబులౌ
నాల నొసఁగ నాకు ననుమతించు
మింద్ర! నగరభేది! యే వేళ నిను నుతి
యించుచుండి యిచట నెసఁగఁగలను ॥ 994

(9) గద్యము॥

ఇంద్రా! శతక్రతూ! యప్రతిహతక్రోధవిశిష్టుఁడా! సంగ్రామములయం దహంకారము
గలవాఁడా ! వేధాశూన్యుఁడు కాని, మేధావి కాని, నిన్ను వినుతించినచో వా
రానందితు లగుదురు ॥ 995

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(10) ఉ॥ పట్టణ భేది, యుగ్రతరబాహు, మహేంద్రుఁడు, మా స్తవాళిఁ దా
నెట్టులో యాలకింప గమకించిన మేము ధనంబు గోరి యి
ప్పట్టున శత్రుమారకుని, బావనకర్ముని, నింద్రదేవునిన్
గట్టిగఁ బిల్వకుందు మెటు? గ్రాలు మహాస్తుతి మూలకంబునన్ ॥ 996

(11) గీ॥ మేము ధనశూన్యులము మరి మేము వహ్ని
కార్యరహితుల మగుటచేఁ గఠినపాప
కార్యములఁ జేయువారము కాన నెట్టు
లింద్రదేవుని నిజముగ నెరుఁగఁగలము? ॥ 997

గీ॥ కాన నీ క్షణంబు కమనీయ సోమము
నభిషుతంబుఁ జేసి యమరియున్న
మేము కూడి యొకట నా మహాత్ముని నింద్రు
సఖునిగా నొనర్పఁజాలఁగలము ॥ 998

(12) గీ॥ ఉగ్ర యుద్ధతలంబున నున్నయట్టి
శత్రువులఁ జంపునట్టి యా శక్రదేవు
నునిచి యొకచోట వానికి నుచితపూజ
ధ్యానముల భక్తితోఁగూడ నాచరింతు ॥ 999

గీ॥ అతఁ డహింస్యుఁడు, రథపతి, యశ్వములను
నెరుఁగు దాత యగున్ మరి యెల్ల లోక
మధ్యతలముల నున్నట్టి మములఁ జేరు
చుండి సంప్రతితో వెల్గుచుండెఁగాదె? ॥ 1000

(13) గీ॥ అభయ మొసఁగుము! కడు మాకు నభయదాన
మునకు రక్షావిఘల శత్రుగణములకును
హింసల నొనర్చువారికి నెంతయేని
బాధఁ గల్పించుచుండుమా! వజ్రి! నీవు ॥ 1001

(14) క॥ ధనమునకు సేవఁ జేసెడు
ఘనుల గృహంబులకు వృద్ధిఁ గల్పింతువు! కా
వున సోమరసముఁ జేయుచు
నిను నాహ్వానింతు నింద్ర! నిత్యధనుండా! ॥ 1002

(15) గద్యము॥

ఇంద్రుఁడు సకలజ్ఞాత. ఇతఁడు వృత్రహంత. ఈ యింద్రుఁడు మా పుత్రుని మా
శేషపుత్రుని, మా మధ్యమపుత్రుని రక్షించుఁగాక! ఇతఁడె మమ్ము
సమ్ముఖమునందును, బశ్చాద్భాగమునందును, నుభయదిక్కులయందును
రక్షించుఁగాక! ॥ 1003

(16, సీ॥ వేల్పురేఁడా! నీవు వెనుకభాగమునుండి మమ్ము రక్షించుట మానఁ దగదు
17) పూజ్యదేవుడ! నీవు పూర్వభాగమునుండి మమ్ము రక్షించుట మానఁ దగదు
దోషహారీ! నీ వధోభాగముననుండి మమ్ము రక్షించుట మానఁ దగదు
భ్రాజిష్ణు! నీ వుత్తరపు భాగముననుండి మమ్ము రక్షించుట మానఁ దగదు
గీ॥ దివ్య! మా కిప్డు రేపటి దినమునందుఁ, దత్పరదినంబునందునఁ ద్రాణ మొసఁగు
మేము నీ స్తోతలముగద! భీమశత్రు, భయము దూరముగాఁ జేయఁ బాడి నీకు ॥ 1004

(18) క॥ హరి వీరత్వంబునకై
స్థిరముగఁ జరియించుఁగాదె! శ్రీలు చెలఁగఁగన్
సురుచిర వజ్రము కరముల
ధరియించుంగాదె! యతఁడు తత్పరమతియై 1005

## సూక్తమ్—62

ఋషిః—ప్రగాథో ఘౌరః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—పంక్తిః, 7-9-బృహతీ

(1) ప్రో[1] అస్మా ఉపస్తుతిం భరతా యజ్జుజోషతి ।
ఉక్థైరిన్ద్రస్య మాహినం వయో వర్ధన్తి సోమినో భద్రా[2] ఇన్ద్రస్య రాతయః ॥ 1157

(2) అయుజో[3] అసమో నృభిరేకః కృష్టీరయాస్యః ।
పూర్వీరతి ప్ర వావృధే విశ్వా జాతాన్యోజసా భద్రా[2] ఇన్ద్రస్య రాతయః ॥ 1158

(3) అహితేన చిదర్వతా జీరదానుః సిషాసతి ।
ప్రవాచ్యమిన్ద్ర తత్ తవ వీర్యాణి కరిష్యతో భద్రా[2] ఇన్ద్రస్య రాతయః ॥ 1159

(4) ఆ యాహి కృణవామ త[4] ఇన్ద్ర బ్రహ్మాణి వర్ధనా ।
యేభిః శవిష్ఠ చాకనో భద్రమిహ శ్రవస్యతే భద్రా[2] ఇన్ద్రస్య రాతయః ॥ 1160

(5) ధృషతశ్చిద్ ధృషన్మనః కృణోషీన్ద్ర యత్ త్వమ్ ।
తీవ్రైః సోమైః సపర్యతో నమోభిః ప్రతిభూషతో భద్రా[2] ఇన్ద్రస్య రాతయః ॥ 1161

† ఈ సూక్తమునకు ఋషి "ప్రగాథః" అని మాత్రమే సాయన, మాక్సుముల్లర్ ప్రతులతో పేర్కొనఁబడినది.

1. ప్రోఽఅస్మాఽఉపస్తుతిం. 2. భద్రాఽఇన్ద్రస్య. 3. అయుజోఽఅసమో. 4. తఽ ఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(6) అవ చష్ట[1] ఋచీషమో ఽవతాగ్ం[2] ఇవ మానుషః ।
జుష్ట్వీ దక్షస్య సోమినః సఖాయం కృణుతే యుజం భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1162

(7) విశ్వే త[4] ఇన్ద్ర వీర్యం దేవా[5] అను క్రతుం దదుః ।
భువో విశ్వస్య గోపతిః పురుష్టుత భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1163

(8) గృణే తదిన్ద్ర తే శవ[6] ఉపమం దేవతాతయే ।
యద్ధంసి వృత్రమోజసా[7] శచీపతే భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1164

(9) సమనేవ వపుష్యతః కృణవన్మానుషా యుగా ।
విదే తదిన్ద్రశ్చేతనమధ శ్రుతో భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1165

(10) ఉజ్జాతమిన్ద్ర తే శవ[8] ఉత్ త్వాముత్ తవ క్రతుమ్ ।
భూరిగో భూరి వావృధుర్మఘవన్ తవ శర్మణి భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1166

(11) అహం చ త్వం చ వృత్రహన్త్సం యుజ్యావ సనిభ్య[9] ఆ ।
అరాతీవా చిదద్రివో ఽను నౌ శూర మంసతే భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1167

---

1. అవ చష్టఽఋచీష. 2 తాగ్ంఽఇవ. 3 భద్రాఽఇన్ద్రస్య. 4. తఽఇన్ద్ర. 5. దేవఽఅను. 6. శవఽఉపమం. (బ్రా.ప్ర.)
7. వృత్రమోజసా. (సా.మా.బ్రా.ప్ర.) 8. శవఽఉత్త్వా. 9. సనిభ్యఽఆ. (బ్రా.ప్ర.).

(12) సత్యమిత్ వా[1] ఉ తం వయమిన్ద్రం స్తవామ నానృతమ్ ।
మహాఀ[2] అసున్వతో వధో భూరి జ్యోతీంషి సున్వతో భద్రా[3] ఇన్ద్రస్య రాతయః ॥ 1168

## సూక్తము—62

ఋషి—కణ్వుని పుత్రుఁడగు ఘౌరుఁడైన ప్రగాథుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ శ్రీసహితేంద్రుఁ డెల్లపుడు సేవ నొనర్చును గాన మీర లే
యీసులు లేక వానికయి యెంతయు సంస్తుతులం బఠింపుఁడీ!
భాసురసోమయజ్ఞగతి వానికి నన్నము వృద్ధిఁ బొందు నా
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1006

(2) ఉ॥ మోసముఁ జేయనట్టి సురముఖ్యుఁ డసాధ్యుఁ డసామ్యుఁడైన యా
వాసవుఁ డెల్ల మానవుల వర్గము జాతపదార్థమండలిన్
బాసి విశేషరూపమున వర్ధితుఁడై యసహాయుఁ డౌను నా
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1007

(3) ఉ॥ ఓ సుమనస్స! యింద్రుఁడ! యయోజితమౌ తగు నశ్వసంపదన్
వాసవ! నీవు సంతతము బంధురభోగము నందినాఁడ వా
నీ సుమహత్వ మెల్లెడల నిశ్చల కీర్తిత మౌను నింక నా
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1008

(4) ఉ॥ చేసెద మేము సంస్తుతులఁ జిత్త మెలర్పఁగ నీకు నెంతయున్
భాసుర తావకీన బలభాగ్యము హెచ్చగుచుండు నింద్రుఁడా!
యీ సరసంపు భక్తులకు నీయుము! మంగళ మన్న కాంక్షివై
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1009

1. మిద్వాఽఉ. 2. మహాఀఽఅసున్వతో. 3. భద్రాఽఇన్ద్రస్యఽరాతయః. (వ్రా. ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 233 పుట) నీ సూక్తమునకు ఋషి "ప్రగాథుఁడు" గానే వ్రాసిన శ్రీ వేమూరివారు 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "ప్రగాతుఁడు"గా వ్రాసిరి.

(5) ఉ॥ నీ సుమనస్సు గర్వితము నీ వల సోమమువల్లఁ బూజలన్
జేసెడు నట్టివారలకుఁ జెన్ను వహింతు! నమస్క్రియాతతిం
జేసెడు నట్టి వారలకుఁ జేర్పుదు! మంగళ మింద్రదేవుఁడా!
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1010

(6) ఉ॥ భాసుర సంస్తవప్రకర భాగ్యపరీతుఁడ వౌచు నిత్యమున్
వాసవ! మానవుల్ కుశలవర్ధిత దృష్టిని జూచునట్లు సం
తోసములోదఁ జూడు! మము, దుష్టుల నెల్లర సంహరించుచున్,
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1011

(7) ఉ॥ నీ సుమహాబలంబు మరి నీదగు ప్రజ్ఞయుఁ గూడుకొంచు నా
యాసురపఙ్క్తి వీర్యము మహస్సును దాల్తును ధేనుపాలకా!
యాసులు మాని లోకముల యెన్నిక నీవు వహించుచుండవే
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదా! తలంపఁగన్ ॥ 1012

(8) ఉ॥ చేసెడు యజ్ఞకర్మలను శ్రీల నొసంగు బలప్రసక్తులన్
భాసిలునట్టి సన్నుతులఁ బాయక వేఁడెద, నిన్ను శక్తిచే
వాసికి నెక్కు వృత్రుఁ డను వాని వధింపవె? యిష్టిపాలకా!
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1013

(9) ఉ॥ భాసుర యౌవనాఢ్య యగు భామిని పూరుషు నట్లు ప్రీతితో
వాసవ! మానవాళిఁ గడు వశ్యులఁగా నొనరింతు!, కాలమున్
[1]జేసెద వీవు, కావునఁ బ్రసిద్ధుఁడ వైతివి! లోక మంతటన్
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1014

(10) ఉ॥ ఓ సురవర్య! నీ కృత సుఖోన్నతిఁ బొందిన యజ్ఞకారకుల్
నీ సుబలంబు, సంతతము నీదగు ప్రజ్ఞను, వృద్ధిఁ జేయుచున్
వాసవ! నెన్నుఁగూడఁ గడు వర్ధితుఁ జేయుదు రెన్ని భంగులన్
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదే! తలంపఁగన్ ॥ 1015

---

1. కాలమున్ జేసెద వీవు="నీవు కాలాధిపతివి", అను నర్థము మాత్రమే యీ సందర్భములోఁ బరిగ్రాహ్యము. ఇది "చనిపోయెదవు" అను నర్థమున నుపయోగించు తెలుఁగు నానుడి కాదు.

(11) ఉ॥ ఏ సమయంబునన్ ధనవిహీనుల మయ్యెదమో! మహేంద్రుఁడా!
యా సమయంబునందు నిను న్రాత భజింపఁగఁ జేరువార మో
వాసవ! దానశూన్య మగు వ్యక్తియు నీదగు దాన మెన్నెడున్
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదా! తలంపఁగన్ ॥ 1016

(12) ఉ॥ మీస మసత్యమౌ నుతులఁ ద్రేలక సత్యపు సంస్తవంబులన్
జేసెద, యాగహీనులను జెండుచు సోమము నిచ్చువారి కా
వాసవుఁ డిచ్చు జ్యోతిని నవారిత లీల శుభప్రదంబుగన్
వాసవు దానముల్ మిగుల భద్రము లౌనుగదా! తలంపఁగన్ ॥ 1017

## సూక్తమ్—63

ఋషిః—ప్రగాథః కాణ్వః
దేవతా—ఇన్ద్రః, 12-దేవాః
ఛందః—గాయత్రీ,1,4-5,7-అనుష్టుప్, 12-త్రిష్టుప్

(1) స పూర్వ్యో మహానాం[1] వేనః క్రతుభిరానజే ।
యస్య ద్వారా మనుష్పితా దేవేషు ధియ[2] ఆనజే ॥ 1169

(2) దివో మానం నోత్సదన్ త్సోమపృష్ఠాసో[3] అద్రయః ।
ఉక్థా బ్రహ్మ చ శంస్యా ॥ 1170

(3) స విద్వాగ్ం[4] అఙ్గిరోభ్య ఇన్ద్రో గా అవృణోదప ।
స్తుషే తదస్య పౌంస్యమ్ ॥ 1171

---

1. మహానా వేనః, 2. ధియఽఆనజే, 3. పృష్ఠాసోఽఅద్రయః, 4. స విద్వాగ్ంఽఅఙ్గిరోభ్యఽ
ఇన్ద్రో గాఽఅవృణోదప. (వా.ప్ర.)

(4) స ప్రత్నథా కవివృధ[1] ఇన్ద్రో వాకస్య వక్షణిః ।
శివో[2] అర్కస్య హోమన్యస్మత్రా గన్త్వవసే ॥ 1172

(5) అదా ను తే[3] అను క్రతుం స్వాహా వరస్య యజ్వనః ।
శ్వాత్రమర్కా[4] అనూషతేన్ద్ర గోత్రస్య దావనే ॥ 1173

(6) ఇన్ద్రే విశ్వాని వీర్యా కృతాని కర్త్వాని చ ।
యమర్కా[5] అధ్వరం విదుః ॥ 1174

(7) యత్ పాఞ్చజన్యయా విశేన్ద్రే ఘోషా[6] అసృక్షత ।
అస్తృణాద్బర్హణా విపో౽ర్యో మానస్య స క్షయః ॥ 1175

(8) ఇయము తే[7] అనుష్టుతిశ్చకృషే తాని పౌంస్యా ।
ప్రావశ్చక్రస్య వర్తనిమ్ ॥ 1176

(9) అస్య వృష్ణో వ్యోదన ఉరు[8] క్రమిష్ట జీవసే ।
యవం న పశ్వ[9] ఆ దదే ॥ 1177

---

1. వృధఽఇన్ద్రో, 2. శివోఽఅర్కస్య, 3. తేఽఅను, 4. మర్కాఽఅనూషతేన్ద్ర, 5. యమర్కాఽ అధ్వరం, 6. ఘోషాఽఅసృక్షత, 7. తేఽఅను, 8. వ్యోదనఽఉరు, 9. పశ్వఽఆ దదే. (ప్రా.ప్ర.)

(10) తద్ధనా[1] అవస్యవో యుష్మాభిర్దక్షపితరః ।
స్యామ మరుత్వతో వృధే ॥ 1178

(11) బళృత్వియాయ ధామ్న[2] ఋక్వభిః శూర నోనుమః ।
జేషామేన్ద్ర త్వయా యుజా ॥ 1179

(12) అస్మే రుద్రా మేహనా పర్వతాసో వృత్రహత్యే భరహూతౌ సజోషాః ।
యః శంసతే స్తువతే ధాయి పజ్ర[3] ఇన్ద్రజ్యేష్ఠా అస్మాగ్ం అవన్తు దేవాః ॥ 1180

## సూక్తము—63

ఋషి—కణ్వపుత్రుఁడగు ప్రగాథుఁడు*
దేవత—ఇంద్రుఁడు, 12-దేవగణము

(1) చ॥ ఎవఁడు ప్రధానుఁడై వెలుఁగు? నెవ్వఁడు పూజ్యుల కర్మ పొందు? నిం
కెవఁడు మనోహరుండయి యహీనత నొప్పెడు? నట్టి యింద్రుకై
సవన విశేష కర్మముల సల్పి బలమ్ము నొసంగువాఁడు సం
స్తవముల నందు, దేవతల సన్నిధి నెంతయు భక్తియుక్తుఁడై ॥ 1018

(2) గీ॥ ప్రబల సోమాభిషవమునఁ బ్రతిభ గాంచు
ప్రస్తరము పీడకుండెఁ దాఁ బ్రబలు నింద్రు
స్తోత్ర పద్ధతులం గడు సుందరంపు
టుక్థముల నుచ్చరించుట యుచితముగద! ॥ 1019

1. ధానాఽఅవస్యవో. 2. ధామ్నఽఋక్వభిః. 3. పజ్రఽఇన్ద్రజ్యేష్ఠాఽఅస్మాగ్ంఽఅవన్తు. (వ్రా.ప్ర.)
* ప్రగాథుఁడు. (15b సంపుటము. పా.)

(3,4,5) గద్యము॥

విద్వాంసుండగు నింద్రు డంగిరసులకై గోవుల నావరించెను. ఆ పురుషత్వమును స్తుతించెదము.
ఇంద్రుడు పూర్వము వలె నేక కాలమున గవిగణముల వృద్ధి పరచుచున్నవాడు.
స్తోత్రకారనిర్వాహకుడు, సుఖకరుడు, నర్చనీయుడు నగు నింద్రుడు హోమ
కార్యముల ముందు మమ్ము రక్షించుటకై వచ్చుగాక! స్వాహాపతి నుద్దేశించి
యాగకరులు "ఇంద్రుడా! నీ కీర్తి గానము చేయబడుచుండెను! స్తోతలు
శీఘ్రము ధనమును బొందుటకై నిన్ను వినుతించుచున్నవారలు" అని
స్తుతించుచున్నారు ॥ 1020

(6) గీ॥ సకల కర్తవ్య కార్యముల్ సకల వీర్య
కార్యములు వాసవునియందె కలవు కాన
వాని నధ్వర్యువరునిగా బండితాళి
పలుకుచుందురుగాదె! యీ ప్రకృతియందు ॥ 1021

(7) గీ॥ పంచ జనపదలోకముల్ వాసవునకు
స్తుతుల ఘోషించుటంబట్టి శోషిలింగ
జేయు నింద్రుడు శాత్రవ శ్రీల నెల్ల
నతడె పూజలకున్ స్థాన మగునుగాదె! ॥ 1022

(8) గీ॥ సకలపౌరుష వాక్యముల్ శక్ర! నీవు
సలిపియుంటను నీకయి స్తవ మొనర్చు
చున్న వారము కావున నో మహేంద్ర!
చక్రమార్గము రక్షింపజాలు మీవు ॥ 1023

(9) గీ॥ వృష్టిద మహేంద్రు డొసగిన వివిధరూప
మైన యన్నము లోకాళి కందియున్న
యది బ్రతికి కర్మముల జేయు నదియె పశువు
చందమున[1] యవల నెల్లను సంగ్రహించు ॥ 1024

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్త మైనది.

(10,11)గద్యము॥

స్తోత్రకారకులము, నన్నాభిలాషులమునై మే మో ఋత్విజులారా! మరుద్విశిష్టుఁ డగు నింద్రుని యభివృద్ధికై మీతోఁ గలిసి యన్న పాలకుల మగుదుము! ఇంద్రుఁడా! నీవు యాగకాల ప్రాదుర్భూతుఁడవు! తేజోవిశిష్టుఁడవు! శూరుఁడా సత్యముగా మంత్రములవలన నిన్ను స్తుతించి నీ సహాయమువలన జయము నందెదము 1025

(12) చ॥ అతిశయభీతిఁ గొల్చెదు మహాంబుదముల్ పిలువంగ శాస్త్ర సం
తతి పఠియించి యింద్రుఁడు ముదంబును గాంచుచు సంస్తుతించు స
న్మతియుత యాగకారకుల మానుగఁ జేరును, వాఁడు దేవతా
ప్రతతుల జ్యేష్ఠుఁ డౌచు మముఁ బాలనఁ జేయునుగాక! ప్రీతితోన్ ॥ 1026

## సూక్తమ్—64

ఋషిః—ప్రగాథః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ఉత్ త్వా మన్దన్తు స్తోమాః కృణుష్వ రాధో[1] అద్రివః ।
అవ బ్రహ్మద్విషో జహి ॥ 1181

(2) పదా పణీగ్ంరరాధసో[2] ని బాధస్వ మహాగ్ం[3] అసి ।
నహి త్వా కశ్చన ప్రతి ॥ 1182

(3) త్వమీశిషే సుతానామిన్ద్ర త్వమసుతానామ్ ।
త్వం రాజా జనానామ్ ॥ 1183

1. రాధోఽఅద్రివః, 2. పణీగ్ంఽరరాధసో, 3 మహాగ్ంఽఅసి. (ప్రా.ప్ర.)

(4) ఏహి ప్రేహి క్షయో దివ్యా౩ఘోషఞ్చర్షణీనామ్ ।
ఓభే పృణాసి రోదసీ ॥ 1184

(5) త్వం చిత్ పర్వతం గిరిం శతవన్తం సహస్రిణమ్ ।
వి స్తోతృభ్యో రురోజిథః ॥ 1185

(6) వయము త్వా దివా సుతే వయం నక్తం హవామహే ।
అస్మాకం కామమా పృణ ॥ 1186

(7) త్వం హ్య వృషభో యువా తువిగ్రీవో[1] అనానతః ।
బ్రహ్మా కస్తం సపర్యతి ॥ 1187

(8) కస్య స్విత్ సవనం వృషా జుజుష్వాగ్ం[2] అవ గచ్ఛతి ।
ఇన్ద్రం క[3] ఉ స్విదా చకే ॥ 1188

(9) కం తే దానా[4] అసక్షత వృత్రహన్ కం సువీర్యా ।
ఉక్థే క[3] ఉ స్విదన్తమః ॥ 1189

---

1. గ్రీవో౽అనానతః, 2. జుజుష్వాగ్ం౽అవ, 3. క౽ఉ స్విదా, 4. దానా౽అసక్షత. (ప్రా.ప్ర.)

(10) అయం తే మానుషే జనే సోమః పూరుషు సూయతే ।
తస్యేహి ప్ర ద్రవా పిబ ॥ 1190

(11) అయం తే శర్యణావతి సుషోమాయామధి ప్రియః ।
ఆర్జీకీయే మదిన్తమః ॥ 1191

(12) తమద్య రాధసే మహే చారుం మదాయ ఘృష్వయే ।
ఏహీమిన్ద్ర ద్రవా పిబ ॥ 1192

## సూక్తము—64

ఋషి—కణ్వపుత్రుఁడగు ప్రగాథుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ సకల సంస్తవాళి సంతసంబును నీకుఁ
జేయుఁగాకఁ! దృప్తిఁ జేయుఁగాక!
ధన మొసంగి మాకుఁ దరచు నుతి ద్వేషు
లను హరింతుగాక! ఘనుఁడ! నీవు ॥ 1027

(2) గీ॥ అధిక లుబ్ధులైన యర్థార్థులను బాద
ఘట్టనములఁ ద్రుంతుగాక! నీవు
ఘనుఁడ వీవు దైవఘన! ప్రతిద్వంది నీ
కెవఁడు గలఁడు? సకలసవన దేవ! ॥ 1028

* ప్రగాతుఁడు. (౹5b సంపుటము. పా.)

(3,4,5) గద్యము॥

నీ వభిషుత సోమమునకు రాజువు! ఈశ్వరుఁడవు! జనసమూహ పాలకుఁడవు! ఓ యింద్రా! రమ్ము! మానవుల నిమిత్తము యాగ గృహంబులను శబ్దంబుచే నిండింపఁజేయుచు స్వర్గమునుండి రమ్ము! ద్యావాభూములను బరిపూర్ణము కావింపుము! నీవు స్తోతలకొఱకుఁ బర్వవిశిష్టములు, నత్యంత జల సహితములు నగు మేఘములను బ్రద్దలు సేసితివి! ॥ 1029

(6) గీ॥ సోమ మభిషుత మైనచో మేము రేయిఁ
బవలు నినుఁ [1]బిలుచుచుందుము వాసవుండ!
యభిలషించెదు మా కోర్కె నతిశయముగ
నీవు సఫలంబుఁ జేయుము! నిర్మలేంద్ర! ॥ 1030

(7,8) గద్యము॥

వృష్టిప్రదుఁడు, నిత్యతరుణుఁడు, విస్తీర్ణస్కంధ విరాజితుఁడు, ననవనతుఁడు నగు నింద్రుఁ డెక్కడ నుండునో? ఎవఁడు వానిని స్తుతింపఁగలఁడు! వృష్టిప్రదుఁడగు నింద్రుఁ డే యజమానుని యజ్ఞమును దెలిసికొనఁగలండు! ఏ యజమానుఁ డింద్రుని స్తుతింప నేర్చు ? ॥ 1031

(9) చ॥ సురుచిరశాస్త్రపద్ధతి ద్విజ సూక్తులఁ బాతముఁ జేయుకాలమం
దురుతర సంస్తవాళి కడు నూర్జిత సేవల నీ కొనర్చు నో
హరివిభు! నీవు కీదృశుఁడ వౌదువె! యెవ్వఁడు యుద్ధమందు నీ
కిరుగడ లుందు రిష్ట కరణీయ సుదానము నిన్నుఁ బొందఁగన్ ॥ 1032

(10) గీ॥ మానవావళి మధ్యను నేను నీకు
సోమమును దీయుచున్నాను శుభకరేంద్ర!
వారి నికటంబునకు నీవు చేర వచ్చి
వేగగామివి కాఁబట్టి త్రాగు మద్ది ॥ 1033

(11) గద్యము॥

ఈ సోమము శర్యణావతీ సుసోమ నదులకంటె నీ కన్నివిధంబుల నధిక ముదముఁ బుట్టించును. అట్లే యజేయ నదియు నన్నిరీతుల నన్నిటికంటె నిన్నుఁ బ్రమత్తునిగాఁజేయును ॥ 1034

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచఃఘుగణము ప్రయుక్త మైనది.

(12) గీ॥ ఈ మనోహరసోమంబు! నిపుడె త్రావి
ధనము నీయంగ శత్రులఁ ద్రచ్చ యోగ్య
మైన మదమును బొందంగ నమర! నీవు
శీఘ్రముగ సోమపాత్రను జేరవలదె! ॥ 1035

## సూక్తమ్—65

ఋషిః—ప్రగాథః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) యదిన్ద్ర ప్రాగపాగుదఙ్[1] న్యగ్వా హూయసే నృభిః
ఆ యాహి తూయమాశుభిః 1193

(2) యద్వా ప్రస్రవణే దివో మాదయాసే స్వర్ణరే ।
యద్వా సముద్రే[2] అన్ధసః ॥ 1194

(3) ఆ త్వా గీర్భిర్మహాముతుం హువే గామివ భోజసే ।
ఇన్ద్ర సోమస్య పీతయే ॥ 1195

(4) ఆ త[3] ఇన్ద్ర మహిమానం హరయో దేవ తే మహః ।
రథే వహన్తు బిభ్రతః ॥ 1196

1. దంత్యగ్వా. 2. సముద్రేఽఅన్ధసః, 3. ఆ తఽఇన్ద్ర. (వా.ప్ర.)

(5) ఇన్ద్ర గృణీష[1] ఉ స్తుషే మహాగ్ం ఉగ్ర ఈశానకృత్ ।
ఏహి నః సుతం పిబ ॥ 1197

(6) సుతావన్తస్త్వా వయం ప్రయస్వన్తో హవామహే ।
ఇదం నో బర్హిరాసదే ॥ 1198

(7) యచ్చిద్ధి శశ్వతామసీన్ద్ర సాధారణస్త్వమ్ ।
తం త్వా వయం హవామహే ॥ 1199

(8) ఇదం తే సోమ్యం మధ్వధుక్షన్నద్రిభిర్నరః ।
జుషాణ[2] ఇన్ద్ర తత్ పిబ ॥ 1200

(9) విశ్వాగ్ం[3] అర్యో విపశ్చితో ఽతి ఖ్యస్తూయమా గహి ।
అస్మే ధేహి శ్రవో బృహత్ ॥ 1201

(10) దాతా మే పృషతీనాం[4] రాజా హిరణ్యవీనామ్ ।
మా దేవా మఘవా రిషత్ ॥ 1202

---

1. గృణీషఽఉ స్తుషేఽమహాగ్ంఽఉగ్రఽఈశాన. 2. జుషాణఽఇన్ద్ర. 3. విశ్వాగ్ంఽఅర్యో
4. పృషతీనాగ్ం. (వ్రా.ప్ర.)

(11) సహస్రే పృషతీనామధి శ్చన్ద్రం బృహత్ పృథు ।
శుక్రం హిరణ్యమా దదే ॥ 1203

(12) నపాతో దుర్గహస్య మే సహస్రేణ సురాధసః ।
శ్రవో దేవేష్వక్రత ॥ 1204

## సూక్తము—65

ఋషి—కణ్వపుత్రుఁడగు ప్రగాథుఁడు*
దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ పూర్వదిక్కున నుండి పొగడెద ని న్నింద్ర!యశ్వంబుపై నెక్కి యరిగిరావె!
పశ్చిమాశను నుండి బహు ప్రశంసించెద నశ్వంబుపై నెక్కి యరిగిరావె!
దక్షిణ దిక్కునఁ దగ నిన్ నుతించెద నశ్వంబుపై నెక్కి యరిగిరావె!
యుత్తర దిక్కున నుండి నిన్ బిల్చెద నశ్వంబుపై నెక్కి యరిగిరావె!
గీ॥ తివిరి ప్రశ్రవణంబునఁ దేజరిలుము!, భూమిపై మత్తుఁడవుకమ్ము! పూజ్యమైన
యన్నమునకు నుపాదాన మైన యంత,రిక్షమున మత్తుఁడవుకమ్ము! దీక్ష నీవు ॥ 1086

(3,4,5) గద్యము॥
కాఁబట్టి యో యింద్రుఁడా! నిన్ను స్తుతులచేఁ బిలచెదను. నీవు మహాత్ముఁడవు! ప్రభూతుఁడవు!
సోమపానమునకు భోగమునకు గోవులను వలె ని న్నాహ్వానింతును! రథ యోజితములగు
నశ్వములు నీ మహిమను నీ తేజస్సును బిలుచునుగాక! ఓ యింద్రుఁడా! వాక్యముల
మూలమున స్తుతుల మూలమున నిను వినుతించెదను! నీవు మహాత్ముఁడవు!
ఉగ్రుఁడవు! ఐశ్వర్యకారివి! నీవు వచ్చి సోమమును ద్రావుము! ॥ 1087

---

* ప్రగాతుఁడు. ( $15_b$ సంపుటము. పా.)

(6,7) గీ॥ సోమమును నన్నమును గల్గి మేము యజ్ఞ
కర్తృసాధారణుండవౌ ఘనుని నిన్నుఁ
గుశలపై విశ్రమింపంగఁ గోరి పిలుచు
చున్నవారము వాసవా! యుచితభక్తి ॥ 1088

(8) గీ॥ భక్తి నధ్వర్యు ముఖ్యులు పరమ సోమ
మధువు దీయుచునున్నారు మాన్యము లగు
ప్రస్తరంబులఁ బట్టుచు వాసవుండ!
దానిఁ ద్రావుము! సంప్రీతిఁ బూని నీవు ॥ 1089

(9) గీ॥ నీవు సామి వౌదు! నీవు మహాస్తోత
లను నతిక్రమించి కనుము! నన్ను
శీఘ్ర మేగుదెంచి చేర్పుము! మా కన్న
రసము నింద్రదేవ! మసలకుండ! ॥ 1040

(10,11,12)గద్యము॥

ఇంద్రుఁడు హిరణ్య వర్ణముగల గోవులకు రాజు. మాకు దాత. దేవతలారా! యింద్రుని హింసింపకుఁడు! గో సహస్రధారితమైనట్టి బృహత్తు విస్తీర్ణము, నాహ్లాదకరము నగునట్టి హిరణ్యమును నేను స్వీకరించెదను. నే నక్షతుఁడను. అదుఃఖిని. నా లోక మంతయు నపరిమిత ధనంబున ధనవంత మగును. దేవతలు ప్రీతు లైనచో నపరిమితాన్నము పొందఁబడును ॥ 1041

## సూక్తమ్—66

ఋషిః—కలిః ప్రాగాథః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ, (ప్రగాథః) 15–అనుష్టుప్

(1) తరోభిర్వో విదద్వసుమిన్ద్రం సబాధ[1] ఊతయే ।
బృహద్గాయన్తః సుతసోమే[2] అధ్వరే హువే భరం న కారిణమ్ ॥ 1205

1. సబాధఽఊతయే. 2. సోమేఽఅధ్వరే. (వ్రా. ప్ర.)

(2) న యం దుధ్రా వరన్తే న స్థిరా మురో మదే సుశిప్రమన్ధసః ।
య ఆదృత్యా శశమానాయ సున్వతే దాతా జరిత్ర[1] ఉక్థ్యమ్ ॥ 1206

(3) యః శక్రో మృక్షో[2] అశ్వ్యో యో వా కీజో హిరణ్యయః ।
స[3] ఊర్వస్య రేజయత్యపావృతిమిన్ద్రో గవ్యస్య వృత్రహా ॥ 1207

(4) నిఖాతం చిద్యః పురుసంభృతం వసూదిద్వపతి దాశుషే ।
వజ్రీ సుశిప్రో హర్యశ్వ[4] ఇత్ కరదిన్ద్రః క్రత్వా యథా వశత్ ॥ 1208

(5) యద్వావన్థ పురుష్టుత పురా చిచ్ఛూర నృణామ్ ।
వయం తత్ త[5] ఇన్ద్ర సం భరామసి యజ్ఞముక్థం తురం వచః ॥ 1209

(6) సచా సోమేషు పురుహూత వజ్రివో మదాయ ద్యుక్ష సోమపాః ।
త్వమిద్ధి బ్రహ్మకృతే కామ్యం వసు దేష్ఠః సున్వతే భువః ॥ 1210

(7) వయమేనమిదా హ్యో ఽపీపేమేహ వజ్రిణమ్ ।
తస్మా[6] ఉ అద్య సమనా సుతం భరా ఽఽ నూనం భూషత శ్రుతే ॥ 1211

---

1. జరిత్రఽఉక్థ్యమ్. 2. మృక్షోఽఅశ్వ్యః. 3. సఽఊర్వస్య.
4. హర్యశ్వఽఇత్కర. 5. తత్తఽఇన్ద్ర. 6. తస్మాఽఉ. (ప్రా.ప్ర.)

(8) వృకశ్చిదస్య వారణ[1] ఉరామథిరా వయునేషు భూషతి ।
సేమం నః స్తోమం జుజుషాణ[2] ఆ గహీన్ద్ర ప్ర చిత్రయా ధియా ॥ 1212

(9) కదూ న్వస్యాకృతమిన్ద్రస్యాస్తి పౌంస్యమ్ ।
కేనో ను కం శ్రోమతేన న శుశ్రువే జనుషః పరి వృత్రహా ॥ 1213

(10) కదూ మహీరధృష్టా[3] అస్య తవిషీః కదు వృత్రఘ్నో[4] అస్తృతమ్ ।
ఇన్ద్రో విశ్వాన్ బేకనాటాగ్ం[5] అహర్దృశ ఉత క్రత్వా పణీగ్ం[6]రభి ॥ 1214

(11) వయం ఘా తే[7] అపూర్వ్యేన్ద్ర బ్రహ్మాణి వృత్రహన్ ।
పురూతమాసః పురుహూత వజ్రివో భృతిం న ప్ర భరామసి ॥ 1215

(12) పూర్వీశ్చిద్ధి త్వే తువికూర్మిన్నాశసో హవన్త[8] ఇన్ద్రోతయః ।
తిరశ్చిదర్యః సవనా వసో గహి శవిష్ఠ శ్రుధి మే హవమ్ ॥ 1216

(13) వయం ఘా తే త్వే[9] ఇద్విన్ద్ర విప్రా అపి ష్మసి ।
నహి త్వదన్యః పురుహూత కశ్చన మఘవన్నస్తి మర్డితా ॥ 1217

---

1. వారణఽఉరామ. 2. జుజుషాణఽఆగహీన్ద్ర. 3. ధృష్టాఽఅస్య. 4. వృత్రఘ్నోఽఅస్తృతమ్.
5. నాటాగ్ంఽఅహర్దృశఽఉత. 6. పణీగ్ంఽరభి. 7. తేఽఅపూర్వ్యేన్ద్ర.
8. హవన్తఽఇన్ద్రో, 9. త్వేఽఇద్విన్ద్ర విప్రాఽఅపి. (ప్రా.ప్ర.)

(14) త్వం నో[1] అస్యా అమతేరుత క్షుధో౽భిశస్తేరవ స్పృధి ।
త్వం న[2] ఊతీ తవ చిత్రయా ధియా శిక్షా శచిష్ఠ గాతువిత్ ॥ 1218

(15) సోమ[3] ఇద్వః సుతో అస్తు కలయో మా బిభీతన ।
అపేదేష ధ్వస్మాయతి స్వయం ఘైషో[4] అపాయతి ॥ 1219

## సూక్తము—66

ఋషి—ప్రగాథపుత్రుఁడు కలి
దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ అతిశయవేగవంత మగు నశ్వము మూలమునన్ ధనంబు సం
తతము నొసంగు నింద్రునికి ధన్యుఁడ! నీ వతిహింసితుండవై
నుత మగు సామగానమును నూత్నవిధిం బఠియించుచుండి స
న్మతిఁ గొని వాని సేవలను మానుగఁ జేయుము! సంతసంబునన్ । 1042

గీ॥ హితకరకుటుంబపోషకు నెట్లు పిలుతు?
నట్టు లభిషుతసోమరసాభిరాముఁ
డైన యింద్రుని యజ్ఞమునందు నేను
బిలిచెదను బ్రీతి మీరఁగ లలితనుతుల ॥ 1043

1. నో౽అస్యా౽అమతేరుత. 2. త్వం న౽ఊతీ, 3. సోమ౽ఇద్వః సుతో౽అస్తు.
4. ఘైషో౽అపాయతి. (వా.ప్ర.)

(2) సీ॥ శత్రుగణంబును చారు హవ్యంబితు నింద్రుని వారింప నెరుఁగలేరు
స్థిరులై వెలింగెడు సురుచిరదేవత లింద్రుని వారింప నెరుఁగలేరు
ఘనబలంబున నొప్పు మనుజవర్గములు దా మింద్రుని వారింప నెరుఁగలేరు
హింసాపరాయణు లెవ్వరైననుగూడ నింద్రుని వారింప నెరుఁగలేరు
గీ॥ సోమరసపానసంజాత శోభవలనఁ, దనకుఁ గలిఁగెడు నానందఘనతఁ గాంచ
సోమ మభిషవమును జేయు సూరులకయి, దాన మొసఁగు మహేంద్రుఁడు ధర్మబుద్ధి ॥ 1044

(3,4)సీ॥ ఎవఁడు శాత్రవసేన నేవగింపక యుండు? నెవఁ డద్భుతుండయి యెసఁగినాఁడొ!
యెవ్వఁడు గోవుల సవ్వడి నరుగుచు వాని గోష్ఠములకుఁ బంపినాఁడొ!
యెవఁడు భూమినిఖాత నవధనంబు గ్రహించి యిష్టికరాశికి నిచ్చినాఁడొ!
యెవఁడు స్వర్ణంబుతో నెనఁగల్గు దేహుఁడై యన్నివిధంబుల నున్నవాఁడొ!
గీ॥ యట్టి యింద్రుఁడు, పవిధారి, హనుయుతుండు, హరితవర్ణాశ్వవంతుఁడై యతిశయించి
దేనిఁ గాంక్షించుచుండునో! దానిఁ గర్మ, మూలమున సిద్ధముగఁజేయు లీలమాత్ర 1045

(5) గీ॥ తొల్లిటిని బోలి స్తోతలవల్ల దేనిఁ
గోరితివొ! దానినే మేము కూర్చఁగలము
దాని యజ్ఞాస్త్రవాక్కులఁ దేని నైన
నొసగఁగలవార మో యింద్ర! యుచితమతిని ॥ 1046

(6) గద్యము॥
ఓ పురుహూతుఁడా! వజ్రి! స్వర్గయుక్తసోమమయీ! సోమ మభిషుత మైనచో
మదయుక్తుఁడవు కమ్ము! స్తోత్రకారులకు సోమాభిషవ మొనర్చువారల
కత్యంతము ధన మిచ్చువాఁడవు! ॥ 1047

(7) గీ॥ ఇప్పుడో! రేపో! పవిధారి! యింద్రుఁ డచ్చ
సోమ మభిషుత మైనచో శోభఁ గాంచు
ననులకున్ సోమమును దెందు! నతఁడు ప్రీతి
నుతుల వినవచ్చు వినుటకు మతిఁ దలంచి ॥ 1048

(8) ఉ॥ చోరుఁడు సర్వకార్యములఁ జూచుచు శీఘ్రము మార్గగాములన్
జేరుమ వారికిన్ మిగులఁ జేటులు కూర్చునుగాని యిమ్మహా
వీరమహేంద్రదేవకృత విశ్రుతకార్యపరంపరన్ ద్వరన్
వారణఁ జేయఁజాలునొకొ! వాసవ! రమ్ము! విశేషతుష్టితోన్ ॥ 1049

(9) గీ॥ పౌరుషకృతస్వరూపమౌ పరమకార్య
సరణి నెద్దాని నింద్రుఁడు జరుపకుండె?
వాని కార్యము శ్రుతులను బడని దెద్ది ?
వాఁడు జన్మమవధిఖ్యాతి వడయుఁగాదె! ॥ 1050

(10) గద్యము॥

ఇంద్రుని సేనారూపబలంబు లెప్పుడును నన్యబలంబున హింసితములు కావు. వృత్రహంత యగు నింద్రుని శారీరక బల మితరులచే బాధపెట్టఁబడదు. ఇట్టి ద్వివిధము లగు బలముచే నింద్రుఁడు దివసగణనాకారులకు, వణిజులకుఁ దాడనము మొదలగువానిచే నభిభవమును గల్పించును ॥ 1051

(11, సీ॥ భృతిని గ్రహించిన విధమున నింద్రుఁడా! నిన్ను నే నుతియింతు నెనరు మిగుల
12) నా యాశ లన్నియు నీయందె యున్నవి మద్రక్ష నీయందె మాటువడియె
స్తోతృగణం బెల్ల సుందరకర్ముఁడా! నిన్నె యాహ్వానింప నేర్వఁగలదు
నీవు నా పిలుపును నిశ్చలంబుగ నాలకింపుము! పవిధారి! సొంపు కలుఁగ
గీ॥ నరు లొనర్చుచు[1] నున్నట్టి యజ్ఞములకుఁ, జనక, నే నిప్డు సేసెదు జన్నమునకు
వచ్చి మేము పఠించెదు పరమ నుతుల, వినుము! పురుహూతుఁడా! నీవు విపులతుష్టి ॥ 1052

(13) గీ॥ మేము నీ వారమెసుమ! యో మహేంద్ర!
నిన్ను నుతియించువారము, నీకు సేవ
లను నొనర్చెడువారము ఘనసుఖంబు
నిచ్చువా[1] రెవరు? నీకంటె నింద్ర! మాకు ॥ 1053

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "ఖలో"ము ప్రయుక్త మైనది.

(14) సీ॥ పరమదారిద్ర్యంబుఁ బారఁద్రోలుచు నింద్ర! యభిమతంబుల మాకు నందనిమ్ము!
క్షుద్బాధలను నెల్లఁ గొట్టుచుఁ దత్క్షణ మభిమతంబుల మాకు నందనిమ్ము!
నిందాపరంపర నెట్టుచుఁ గడు దూర మభిమతంబుల మాకు నందనిమ్ము!
సకలబాధల నీవు సాగనంపుచుఁ బ్రీతి నభిమతంబుల మాకు నందనిమ్ము!
గీ॥ మాకు నవనం బొసంగుచు మాకు నభిమతార్థములఁ గూర్చుచుండుమా! యధికబలము
గల్గువాఁడ! యుపాయజ్ఞ! వెల్గువాఁడ!, సకలలోకైకరక్షకా! శక్ర! నీవు ॥ 1054

(15) గద్యము॥

ఓ కవిగణమా! మీ సోమ మభిషుత మయ్యెను. ఈ రాక్షసాదులు దూరముగఁ
బోవుచున్నారు. మిమ్ము వారలు విడిచిపెట్టుచున్నారు ॥ 1055

## సూక్తమ్—67

ఋషిః—మత్స్యః సామ్మదః, మైత్రావరుణిర్మాన్యః,
బహవో వా మత్స్యా జాలనద్ధాః
దేవతా—ఆదిత్యాః, 10-12-అదితిః†
ఛందః—గాయత్రీ

(1) త్యాన్ ను క్షత్రియాగ్ం[1] అవ ఆదిత్యాన్ యాచిషామహే ।
సుమృళీకాగ్ం[2] అభిష్టయే ॥ 1220

(2) మిత్రో నో[3] అత్యంహతిం వరుణః పర్షదర్యమా ।
ఆదిత్యాసో యథా విదుః ॥ 1221

† ఈ సూక్తమునకు దేవత సాయన, మాక్సుముల్లర్ ప్రతులలో సామాన్యముగా నాదిత్యులుగా మాత్రమే పేర్కొనఁబడినదికాని 10-12 ఋక్కుల దేవత "అదితి" పేర్కొనఁబడలేదు.

1. క్షత్రియాగ్ం॰అవ॰ఆదిత్యా. 2. కాగ్ం॰అభిష్టయే. 3. మిత్రో నో॰అత్యం. (వ్రా.ప్ర.)

(3) తేషాం హి చిత్రముక్థ్యం౧ వరూథమస్తి దాశుషే ।
ఆదిత్యానామరంకృతే ॥ 1222

(4) మహి వో మహతామవో వరుణ మిత్రార్యమన్ ।
అవాంస్యా వృణీమహే ॥ 1223

(5) జీవాన్ నో[1] అభి ధేతనాఽఽదిత్యాసః పురా హథాత్ ।
కద్ధ స్థ హవనశ్రుతః ॥ 1224

(6) యద్వః శ్రాన్తాయ సున్వతే వరూథమస్తి యచ్ఛర్దిః ।
తేనా నో[2] అధి వోచత ॥ 1225

(7) అస్తి దేవా[3] అంహోరుర్వస్తి రత్నమనాగసః ।
ఆదిత్యా[4] అద్భుతైనసః ॥ 1226

(8) మా నః సేతుః సిషేదయం మహే వృణక్తు నస్పరి ।
ఇన్ద్ర[5] ఇద్ధి శ్రుతో వశీ ॥ 1227

---

1. జీవాన్నోఽఽఅభి. 2. నోఽఅధి. 3. దేవాఽఽఅంహోరు.
4. ఆదిత్యాఽఅద్భుతైః. 5. ఇన్ద్రఽఇద్ధి. (వ్రా.ప్ర.)

(9) మా నో మృధా రిపూణాం వృజినానామవిష్యవః ।
దేవా[1] అభి ప్ర మృక్షత ॥ 1228

(10) ఉత త్వామదితే మహ్యహం దేవ్యుప బ్రువే ।
సుమృళీకామభిష్టయే ॥ 1229

(11) పర్షి దీనే గభీర[2] ఆగ్ం ఉగ్రపుత్రే జిఘాంసతః ।
మాకిస్తోకస్య నో రిషత్ ॥ 1230

(12) అనేహో న[3] ఉరువ్రజ ఉరూచి వి ప్రసర్తవే ।
కృధి తోకాయ జీవసే ॥ 1231

(13) యే మూర్ధానః క్షితీనామదబ్ధాసః స్వయశసః ।
వ్రతా రక్షన్తే[4] అద్రుహః ॥ 1232

(14) తే న[5] ఆస్నో వృకాణామాదిత్యాసో ముమోచత ।
స్తేనం బద్ధమివాదితే ॥ 1233

---

1. దేవాఽఅభి. 2. గభీరఽఆగ్ంఽఉగ్ర. 3. నఽఉరువ్రజఽఉరూచి.
4. రక్షన్తేఽఅద్రుహః. 5. తే నఽఆస్నో. (వ్రా.ప్ర.)

(15) అపో షు ణ[1] ఇయం శరురాదిత్యా[2] అప దుర్మతిః ।
అస్మదేత్వజఘ్నుషీ ॥ 1234

(16) శశ్వద్ధి వః సుదానవ[3] ఆదిత్యా ఊతిభిర్వయమ్ ।
పురా నూనం బుభుజ్మహే ॥ 1235

(17) శశ్వన్తం హి ప్రచేతసః ప్రతియన్తం చిదేనసః ।
దేవాః కృణుథ జీవసే ॥ 1236

(18) తత్ సు నో నవ్యం సన్యస[4] ఆదిత్యా యన్ముమోచతి ।
బన్ధాద్బద్ధమివాదితే ॥ 1237

(19) నాస్మాకమస్తి తత్ తర[5] ఆదిత్యాసో అతిష్కదే ।
యూయమస్మభ్యం మృళత ॥ 1238

(20) మా నో హేతిర్వివస్వత[6] ఆదిత్యాః కృత్రిమా శరుః ।
పురా ను జరసో వధీత్ ॥

---

1. అపో షు ణఽఇయం, 2. శరురాదిత్యాఽఅప, 3. సుదానవఽఆదిత్యాఽఊతి,
4. సన్యసఽఆదిత్యా, 5. తత్తరఽఆదిత్యాసోఽఅతిష్కదే, 6. వివస్వతఽఆదిత్యాః. (వ్రా.ప్ర.)

(21) వి షు ద్వేషో వ్యంహతిమాదిత్యాసో వి సంహితమ్ ।
విష్వగ్వి వృహతా రపః ॥ 1240

ఇతి
షష్ఠోఽష్టకే చతుర్థోఽధ్యాయః
స్సమాప్తః

## సూక్తము—67

ఋషి—సామ్మదుఁడైన మత్స్యుఁడు, మైత్రావరుణి మాన్యుఁడు, జాలబద్ధములైన మత్స్యములు*
దేవత—ఆదిత్యగణము, 10-12-అదితి*

(1) గీ॥ బలము కలిఁగినవారయి పరమసుఖము
గలుఁగఁజేసెడు నాదిత్యగణము చెంతఁ
జేరి యవనము గోరెద శ్రీలఁ జెలఁగు
నభిమతఫలంబులను నెల్ల నందఁగోరి ॥ 1056

(2) గద్యము॥

మిత్రావరుణార్యమాదిత్యవర్గము దుస్సహ మని తెలిసికొని యహంతిని
దాఁటింతురుగాక! ॥ 1057

(3) గీ॥ ఘనత గల్గిన యాదిత్యగణము చెంత
సుందరంబయి సర్వదా స్తుత్య మైన
ధన సమూహంబు కడుఁగడు ధన్యుఁడైన
హవ్యదాతను జెందదె! యవనియందు ॥ 1058

---

* శ్రీనేమానివారు 10వ మండలములోని యీ 67వసూక్తమునకు వ్రాతప్రతిలోఁ (9వ సంపుటము. 249 పుట) "ప్రగాథపుత్రుఁడు కవి". ఋషి యనియు, "ఆదిత్యగణము, సమదనామక మహామీముని పుత్రుఁడగు మత్స్యుఁడు, మిత్రావరుణుల పుత్రుఁడు మాన్యుఁడు, లేక పెక్కుసంఖ్యగల మత్స్యములు జాలబద్ధములై యీ స్తుతి నొనర్చినవి." అని దేవతలను భ్రమాస్పదములుగాఁ బొరపాటున వ్రాసిరి. 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "మత్స్యుఁడు, మాన్యుఁడు" ఋషిగాను, "ఆదిత్యులు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి. ఈ ఋక్కులు మత్స్యస్తుతము లనుమాట వేరుమాట.

(4) క॥ వరుణాదులార! మీ సు
స్థిర మగు నవన ప్రశస్తి స్త్రీ పురుషులకున్
స్థిర మగునుగాదె! కావునఁ
గర మది మే మెల్లఁ బ్రీతిఁ గాంక్షింతుముగా ॥ 1059

(5) గీ॥ బ్రతికియున్నార మాదిత్యబంధుగణమ!
మముల నిప్పుడె యభిధారణమును జేయుఁ
దస్మదాహ్వానమును మీర లాలకించి
మృత్యుదేవతకంటె ముం దీరు రండు! ॥ 1060

(6) గద్యము॥
శ్రాంతాభిషవకారుల కొసంగఁబడు ధన మేది కలదో! గృహము లేవి కలవో!
తద్ద్వారా ప్రీతులై మాలో మిష్టవాక్యములఁ బలుకుము! 1061

(7) గీ॥ పాప శీలుర పాపముల్ పరగుచుండెఁ
బాపశూన్యుల సుకృతముల్ పరగుచుండెఁ
బాపహీనాత్ము లైనట్టి బంధుగణమ!
యభిలషిత మిందు! మాకయి యధిక మీరు 1062

(8) క॥ జాలముచే బంధింపఁడు
జాలము విడఁదీసి మముల శక్రుఁడు చాలన్
లీలమెయి వశముగాఁ గొను
చీ లీల ఖ్యాతి నందె యీ జగమందున్ 1063

(9) గీ॥ పరిహరించుచు మమ్ముల సురలు! మీరు
మాకు రక్షల నొసఁగుఁడు! భీకరాత్మ
శత్రుహింసకగణముల జాలజాత
బాధలను[1] దొలఁగఁజేయుఁడు! పరమతుష్టి 1064

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్త మైనది.

(10,11,12) గద్యము॥

దేవి! యదితి! నీవు మహాత్మురాలవు! కావున నభిమత లాభమునకై నిన్ను వినుతించుచున్నాను.
సకలదిక్కులనుండి సంరక్షింపుము! క్షీణము, సుగ్రపుత్రసహితము నగు జలమందు
హింసాకారులజాలము మా తనయులను హింసింపకుండునటులఁ జేయుము!
విస్తీర్ణగమనము గలదియు, గుర్వియు నగు నదితీ! నీవు పుత్రుల
జీవింపఁజేయుము! ॥ 1065

(13, సీ॥ సర్వశీర్షంబుల స్థానంబులుగఁ గొను నాదిత్యులార! మా కవన మిదుఁడు!
14,15) మనుజుల హింసింప మానిన వారలై యాదిత్యులార! మా కవన మిదుఁడు!
సత్కీర్తి సహితులై సరసులై యున్నట్టి యాదిత్యులార! మా కవన మిదుఁడు!
ద్రోహవిహీనులై దోషజ్ఞు లైనట్టి యాదిత్యులార! మా కవన మిదుఁడు!
గీ॥ బద్ధుఁడైనట్టి చోరుని పగది దుష్ట
బాధితుల మమ్ము రక్షించి వారి దీర్ఘ
జాలము నశించునట్టులు లీలఁజేసి
శత్రుమండలిఁ దోలుఁడు! చాల శక్తి ॥ 1066

(16) క॥ తొల్లిటి వలె మీ యాశ్రయ
మెల్లఁ గొనుచు నిపుడుకూడ నే మెల్లరమున్
సల్లలితభోగభాగ్యము
లుల్లసిలఁగ ననుభవింతు మో యాదిత్యుల్! ॥ 1067

(17) గీ॥ పాపకారులు మాపైని బడుచునున్న
వార లాదిత్యవర్గమా! మీరు మేము
బ్రతుకుచున్ జాల భాగ్యముఁ బడయుటకయి
త్రోలుదురుగాక! వారల దూరమునకు ॥ 1068

†(18,19,20,21) గద్యము॥

ఆదిత్యులార! మీ యనుగ్రహమువల్ల బంధనము బద్ధపురుషుని విడుచునట్లు జాలము మమ్ము విడుచును. మమ్ముల నే జాలము విడుచుచున్నదో! యది స్తుతియోగ్య మైనది. మీ కున్నట్టి వేగము మాకు లేదు. ఈ వేగము మమ్ము విడుచుటకు సమర్థ మైనది. మీరు మమ్ము సుఖవంతులుగాఁ జేయుఁడు! వివస్వంతుని యాయుధము వలె నున్న యీ కృత్రిమ జాలము పూర్వకాలమునందు వలె నిపుడు జీర్ణవ్యక్తులను వధింపదు. ద్వేషకారులను నున్ముక్తులుగాఁజేయుఁడు! పాతకములను నశింపఁజేయుఁడు! సర్వవాపి యగు కిల్మిషమును హరింపఁజేయుడు! ॥ 1069

ఇయ్యది
శ్రీ భారద్వాజగోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
షష్ఠాష్టకమునఁ జతుర్థాధ్యాయము
సంపూర్ణము

---

†ఈ గద్యము 18,19,20,21 ఋక్కుల కనువాదము. వ్రాతప్రతిలో (9వ సంపుటము, 253పుట) శ్రీనేమానివారీ గద్యము 18,19 ఋక్కులకు మాత్రమే అనువాదముగా నా సంఖ్యలను మాత్రమే పేర్కొని పొరపాటున 20,21 ఋక్సంఖ్యలను వ్రాయుట మరచిరి.



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### షష్ఠోఽష్టకః — పంచమోఽధ్యాయః

### సూక్తమ్ —68

ఋషిః — ప్రియమేధ ఆఙ్గిరసః

దేవతా —ఇన్ద్రః, 14-19-ఋక్షాశ్వమేధౌ

ఛందః—గాయత్రీ అనుష్టుమ్ముఖః (అనుష్టుప్+గాయత్ర్యౌ) (ప్రగాథః),

1,4,7,10-అనుష్టుప్, 13-శంకుమతీ

(1) ఆ త్వా రథం యథోతయే సుమ్నాయ వర్తయామసి ।

తువికూర్మిమృతీషహమిన్ద్ర శవిష్ఠ సత్పతే ॥ 1241

(2) తువిశుష్మ తువిక్రతో శచీవో విశ్వయా మతే ।

ఆ పప్రాథ మహిత్వనా ॥ 1242

(3) యస్య తే మహినా మహః పరి జ్మాయన్తమీయతుః ।

హస్తా వజ్రం హిరణ్యయమ్ ॥ 1243

(4) విశ్వానరస్య వస్పతిమనానతస్య శవసః ।
ఏవైశ్చ చర్షణీనామూతీ హువే రథానామ్ ॥ 1244

(5) అభిష్టయే సదావృధం [1]స్వర్మీళ్హేషు యం నరః ।
నానా హవన్త[2] ఊతయే ॥ 1245

(6) పరోమాత్రమృచీషమమిన్ద్రముగ్రం సురాధసమ్ ।
ఈశానం చిద్వసూనామ్ ॥ 1246

(7) తంతమిద్రాధసే మహ[3] ఇన్ద్రం చోదామి పీతయే ।
యః పూర్వ్యామనుష్టుతిమీశే కృష్టీనాం నృతుః ॥ 1247

(8) న యస్య తే శవసాన సఖ్యమానంశ మర్త్యః ।
నకిః శవాంసి తే నశత్ ॥ 1248

(9) త్వోతాసస్త్వా యుజా ఽప్సు సూర్యే మహద్ధనమ్ ।
జయేమ పృత్సు వజ్రివః ॥ 1249

---

1. స్వర్మీళహేషు. 2. హవన్త ఽఊతయే, 3. మహ ఽ ఇన్ద్రం. (వ్రా. ప్ర)

(10) తం త్వా యజ్ఞేభిరీమహే తం గీర్భిర్గిర్వణస్తమ ।
ఇన్ద్ర యథా చిదావిథ వాజేషు పురుమాయ్యమ్ ॥ 1250

(11) యస్య తే స్వాదు సఖ్యం స్వాద్వీ ప్రణీతిరద్రివః ।
యజ్ఞో వితన్తసాయ్యః ॥ 1251

(12) ఉరు ణస్తన్వే౩ తన[1] ఉరు క్షయాయ నస్కృధి ।
ఉరు ణో యన్ధి జీవసే ॥ 1252

(13) ఉరుం నృభ్య[2] ఉరుం గవ ఉరుం రథాయ పన్థామ్ ।
దేవవీతిం మనామహే ॥ 1253

(14) ఉప మా షడ్ ద్వాద్వా నరః సోమస్య హర్ష్యా ।
తిష్ఠన్తి స్వాదురాతయః ॥ 1254

(15) ఋజ్రావిన్ద్రోత[3] ఆ దదే హరీ ఋక్షస్య సూనవి ।
ఆశ్వమేధస్య రోహితా ॥ 1255

---

1. తనఽఉరు, 2. ఉరుం నభ్యఽఉరుం గవఽ ఉరుం, 3. ఇన్ద్రోతఽఆ దదే హరీఽఋక్షస్య. (వ్రా.ప్ర.)

(16) సురథాగ్ం[1] అతిథిగ్వే స్వభీశూగ్ంరార్క్షే ।

అశ్వమేధే సుపేశసః ॥ 1256

(17) షళశ్వాగ్ం[2] అతిథిగ్వ ఇన్ద్రోతే వధూమతః ।

సచా పూతక్రతౌ సనమ్ ॥ 1257

(18) ఐషు చేతద్వృషణ్వత్యన్తర్ఋజ్రేష్వరుషీ ।

స్వభీశుః కశావతీ ॥ 1258

(19) న యుష్మే వాజబన్ధవో నినిత్సుశ్చన మర్త్యః ।

అవద్యమధి దీధరత్ ॥ 1259

---

1. సురథాగ్ంఽఅతిథిగ్వే. 2. షళశ్వాగ్ంఽఅతిథిగ్వఽఇన్ద్రో. (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—పంచమాధ్యాయము

### సూక్తము—68

ఋషి— అంగిరసుఁడైన ప్రియమేధస్సు *

దేవత— ఇంద్రుఁడు, 14-19-ఋక్షాశ్వమేధములు *

(1) గీ॥ బలపతీ! సత్పతీ! నీవు ప్రచురకర్మ
గల్గువాఁడవు! హింసకగణనిహంత
వౌదు! రక్షాసుఖంబుల నంద నిన్ను
యానమును బోలి మరలింపఁ బూనినాను ॥ 1070

(2) గీ॥ ప్రాజ్ఞుఁడా! ప్రథితబలశాలి! బహుళకర్మ
పూజనీయుఁడ! యింద్రుఁడా! పూర్ణగతిని
వ్యాప్త మగు[1] మహిమచే లోక మాక్రమించి
యున్నవాఁడవుకావఁటె! యుచిత భంగి ॥ 1071

(3) గీ॥ నీ మహత్వంబు వలననే నిఖిలపృథ్వి
యం దతివ్యాప్త మౌచు నానంద మొసఁగు
స్వర్ణమయ వజ్రమున్ జేతఁ బట్టినాఁడ
వో మహేంద్రుఁడ! నీ యట్టి యొడయఁ డెవఁడు ? ॥ 1072

(4) క॥ యజమానులార! మిమ్ముల
భజియించెడు సైనికాళి ప్రధనంబులయం
దు జయము గాంచఁ దలంచుచు
విజయహేతువని బిలువుఁ డీరు వివిధస్తుతులన్ ॥ 1073

---

* వ్రాతప్రతిలో (6వ సంపుటము. 565 పుట) నీ సూక్తమునకు "ప్రియమేధస్సు" ఋషిగాను, "చివరి రెండు ఋక్కులకు దానము ఒక్కినవానికి ఇంద్రుఁడు" దేవతగాను వ్రాసి. 156 సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ప్రియమేధుఁడు" ఋషిగాను. "ఇంద్రుఁడు, రాజకుమారుల దానములు" దేవతగాను. శ్రీనేమానివారు వ్రాసిరి.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్త మైనది.

(5) క॥ అవనమును గోరి నాయకు
లెవనిని యుద్ధములయందు హెచ్చు పిలుతు రా
సవనపతి నింద్రు నే నా
యవనంబును గోరి నుతుల నాహ్వానింతున్ ॥ 1074

(6) గీ॥ స్తుతి పరిచ్ఛన్నుఁడై తాను సుందరంపు
ధనము నిచ్చుచు సామియై ధనసమూహ
మునకు, నపరిమితంబైన ఘనశరీర
మును ధరించిన యింద్రుని గనెద నేను ॥ 1075

(7) గీ॥ నేత యెవ్వఁడొ! మానవ పూతయజ్ఞ
భూమి సంస్థిత సంస్తుతిఁ బొందు నెవఁడొ!
యట్టి యింద్రుని బహుధన మందఁ గోరి
సోమమును ద్రావఁ బిలిచెద సొంపు మీర ॥ 1076

(8) క॥ బలవంతుఁడ! మానవ గణ
ములు నీ సఖ్యంబు నెట్టు పొందఁగలరు? నీ
బలధనముఁ జెందుటకు వా
రిలను సమర్థులరె? శీఘ్ర మింద్రుఁడ! చెపుమా! ॥ 1077

(9) చ॥ పవిధర! యింద్ర! నీ దయన పావన రక్షలఁ బొందుచుండి యు
త్సవకర సత్యమూలమునఁ జల్లని వారుల స్నాన మాడ స
ద్దివస మొనర్చు సూర్యుఁ డను దేవుని జూడ నమేయదీక్షతో
నవనవ యుద్ధవీథుల ననంతధనంబు జయింపకుందుమే! ॥ 1078

(10) గీ॥ ప్రస్తుతులఁ [1]గనెదు వాఁడ! యో ప్రాజ్ఞ! యెటులు
నీవు రక్షించెదవొ! మమ్ము నిఖిలయుద్ధ
ములను, నట్టులె నిష్టుల మోద మలర
నిన్ను వేఁడెద సంస్తుతి నికరములను ॥ 1079

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్త మైనది.

(11) గీ॥ వజ్రవంతుఁడ! నీ చెల్మి స్వాదు వగును
నీ ధనాదుల ప్రేరణ నీతి గలది
యగును, నీ యజ్ఞతతికూడ నధికయోగ్య
మగుచు నుండెనుగాదె! యీ యఖిలమందు ॥ 1080

(12) గీ॥ ఇమ్ము! పుత్రులకున్ దాన మిమ్ము! పౌత్ర
గణమునకు దాన మధికమ్ము ఘనుఁడ! నీవు
మేము నివసింప గృహమును మేము సౌఖ్య
జీవనముఁ జేయ ధనమును జేర్పు! మాకు ॥ 1081

(13) గీ॥ మనుజసమూహమునకు గో
గణములకున్ హితముఁ జేయఁగల్గు మనుచు నిం
కను రథమునకుఁ బథంబును
గనుపరుపు మటంచు వేఁడఁగల్గుదు నింద్రా! ॥ 1082

(14) గీ॥ నేత లైనట్టి యార్గురు నియమపరులు
సోమమునకయి యుపభోగశోభి ధనము
పట్టికొని యిద్ద రిద్దరు పరమతుష్టిఁ
గలియుచుందురు మమ్ములఁ గలియుచుండి ॥ 1083

(15, సీ॥ ఇంద్రోతముని చెంత నెనలేని యశ్వంబులను సంగ్రహించి చెలంగుచుంటి
16,17) ఋక్షపుత్రుని దరి నిద్ధాశ్వముల రెండు పొందుచుఁ బ్రీతిని బొందుచుంటి
నశ్వమేధుని పుత్రు నంతికంబందున నశ్వద్వయంబును నందుచుంటి
నతిథిగ్వసూనుని యంతికస్థలమున సుశకరాశ్వంబులఁ[1] జూచుచుంటి
గీ॥ నశ్వమేధుని తనయుని యంతికమున, శోభితాశ్వసమూహంబు సొగసు గంటి
శుద్ధకర్మాతిథిగ్వుని సుసుతుని కడ, నశ్వముల నశ్వినులఁ గూడ నడిగియుంటి ॥ 1084

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 259 పుట) నీ పద్యము 16, 17 ఋక్కుల కనువాదముగా శ్రీవేమూరివారు పొరపాటున వ్రాసిరి. ఇది 15, 16, 17 ఋక్కుల కనువాదము.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "తం"ము ప్రయుక్త మైనది.

(18) గద్యము॥

దీప్తిమతి, సోచనసమర్ధ యశ్వవిశిష్ట, సుందరకశవతియు నగు బడబ ఋజుగామి లగు నీ యశ్వముల మధ్యఁ గలదు ॥ 1085

(19) గద్యము॥

ఓ యన్నప్రదాతలారా! నిందకులు మాపై నిందల నారోపింపలేరు ॥ 1086

## సూక్తమ్—69

ఋషిః— ప్రియమేధ ఆఙ్గిరసః

దేవతా—ఇన్ద్రః, 11-(అర్ధర్చస్య)విశ్వే దేవాః, 11-(ఉత్తరార్ధస్య) 12-వరుణః

ఛందః—అనుష్టుప్, 2-ఉష్ణిక్, 4-6-గాయత్రీ, 11, 16-పంక్తిః, 17-18-బృహతీ

(1) ప్రప్ర వస్త్రిష్టుభమిషం మన్దద్వీరాయేన్దవే ।
ధియా వో మేధసాతయే పురంధ్యా వివాసతి ॥ 1260

(2) నదం వ[1] ఓదతీనాం నదం యోయువతీనామ్ ।
పతిం వో[2] అఘ్న్యానాం ధేనూనామిషుధ్యసి ॥ 1261

(3) తా[3] అస్య సూదదోహసః సోమం శ్రీణన్తి పృశ్నయః ।
జన్మన్ దేవానాం విశస్త్రిష్వా రోచనే దివః ॥ 1262

---

1. వఽఓదతీనాం, 2. వోఽఅఘ్న్యానాం, 3. తాఽఅస్య. (ప్రా.ప్ర.)

(4) అభి ప్ర గోపతిం గిరేన్ద్రమర్చ యథా విదే ।
సూనుం సత్యస్య సత్పతిమ్ ॥ 1263

(5) ఆ హరయః ససృజ్రిరే ఉరుషీరధి బర్హిషి ।
యత్రాభి [1]సంనవామహే ॥ 1264

(6) ఇన్ద్రాయ గావ[2] ఆశిరం దుదుహ్రే వజ్రిణే మధు ।
యత్ సీముపహ్వరే విదత్ ॥ 1265

(7) ఉద్యద్బ్రధ్నస్య విష్టపం గృహమిన్ద్రశ్చ గన్వహి ।
మధ్వః పీత్వా సచేవహి త్రిః సప్త సఖ్యుః పదే ॥ 1266

(8) అర్చత[3] ప్రార్చత ప్రియమేధాసో[4] అర్చత ।
అర్చన్తు పుత్రకా[5] ఉత పురం న ధృష్ణ్వర్చత ॥ 1267

(9) అవ స్వరాతి గర్గరో గోధా పరి సనిష్వణత్ ।
పిఙ్గా పరి చనిష్కదదిన్ద్రాయ బ్రహ్మోద్యతమ్ ॥ 1268

---

1. సన్నవామహే, 2. గావఽఆశిరం. 3. అర్చంత, 4. మేధాసోఽఅర్చత,
5 పుత్రకాఽఉత. (బ్రా.ప్ర.)

(10) ఆ యత్ పత న్త్యేన్యః సుదుఘా[1] అనపస్ఫురః ।

అపస్ఫురం గృభాయత సోమమిన్ద్రాయ [2]పాతవే ॥ 1269

(11) అపాదిన్ద్రో[3] అపాదగ్నిర్విశ్వే దేవా[4] అమత్సత ।

వరుణ[5] ఇదిహ క్షయత్ తమాపో[6] అభ్యనూషత వత్సం సంశిశ్వరీరివ ॥ 1270

(12) సుదేవో[7] అసి వరుణ యస్య తే సప్త సిన్ధవః ।

అనుక్షరన్తి కాకుదం సూర్మ్యం సుషిరామివ ॥ 1271

(13) యో వ్యతీగ్ంరఫాణయత్ సుయుక్తాగ్ం[8] ఉప దాశుషే ।

తక్వో నేతా తదిద్వపురుపమా యో[9] అముచ్యత ॥ 1272

(14) అతీదు శక్ర[10] ఓహత ఇన్ద్రో విశ్వా అతి ద్విషః ।

భినత్ కనీన[11] ఓదనం పచ్యమానం పరో గిరా ॥ 1273

(15) అర్భకో న కుమారకో ఒధి తిష్ఠన్ నవం రథమ్ ।

స పక్షన్మహిషం మృగం పిత్రే మాత్రే విభుక్రతుమ్ ॥ 1274

---

1. సుదుఘాఽఅనప, 2. పాతయే, 3. దిన్ద్రోఽఅపాద, 4. దేవాఽఅమత్సత, 5. వరుణఽఇదిహ.
6. తమాపోఽఅభ్య, 7. సుదేవోఽఅసి, 8. క్తాగ్ంఽఉప, 9. యోఽఅముచ్యత,
10. శక్రఽఓహతఽఇన్ద్రో విశ్వాఽఅతి, 11. కనీనఽఓదనం. (బ్రా.ప్ర.)

(16) ఆ త్వా సుశిప్ర దంపతే రథం తిష్ఠా హిరణ్యయమ్ ।
అధ ద్యుక్షం సచేవహి సహస్రపాదమరుషం స్వస్తిగామనేహసమ్ ॥ 1275

(17) తం ఘేమిత్థా నమస్విన[1] ఉప స్వరాజమాసతే ।
అర్థం చిదస్య సుధితం యదేతవ[2] ఆవర్తయన్తి దావనే ॥ 1276

(18) అను ప్రత్నస్యౌకసః ప్రియమేధాస ఏషామ్ ।
పూర్వామను ప్రయతిం వృక్తబర్హిషో హితప్రయస ఆశత ॥ 1277

## సూక్తము—69

ఋషి—ఆంగిరసుఁడైన ప్రియమేధస్సు
దేవత—ఇంద్రుఁడు, 11- (పూర్వార్థము) విశ్వే దేవతలు
11- (ఉత్తరార్థము) 12- వరుణుఁడు*

(1) గీ॥ ఎవఁడు వీరాళి కెలమిని హెచ్చు సంత
సమును బుట్టించునో! యట్టి శక్రునికయి
స్తోభసహితంబులౌ మూఁడు సుందరాన్న
ములను గ్రహియింపుఁ డీరలు మోద మలర 1087

గీ॥ ఇష్టి భోగార్థమై యాతఁ డెల్ల ప్రజ్ఞఁ
గల్గి కర్మల మూలాన గౌరవంబు
గల్గు మా కెల్ల సత్కృతిఁ గలుఁగఁజేయు
చుండు నింద్రుఁడు స్తుతులచే [3]నొానరఁబడును 1088

---

1. నమస్వినఽఉప. 2. ఏతవఽఆవర్తి. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 259 పుట) నీ సూక్తమునకు దేవత "వరుణుఁడు"గా మాత్రమే వ్రాసి, 16 b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ఇంద్రుఁడు, విశ్వదేవతలు" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి.

3. స్తుతులచే నెన్నఁబడును. (వ్రా.ప్ర.పా. యతిభంగము.)

(2) గద్యము॥

ఇంద్రుఁ డుషస్సులఁ బుట్టించును. నదులకు శబ్దమును గలుగఁజేయును. గోవులకుఁ బతి యగును. ఇట్టి యింద్రు నాహ్వానింపుము! అందునకుఁ గారణ మతఁడు క్షీరప్రదుఁ డగుటయే! ॥ 1089

(3) గీ॥ దేవతాదిత్యతలముల దీప్తి నెవ్వి
చేరఁగల్గునో! యెవ్వాని శ్రీద దుగ్ధ
నిస్సృతులు కూపములఁ గూడ నిండఁజేయు
నట్టి గోవులు సోమము నమరఁగూర్చు ॥ 1090

(4) గీ॥ సాధుపాలకుండు, సకలగోపతి యజ్ఞ
పుత్రుఁ డైన వాసవుండు ప్రీతి
నెట్టు లెరుఁగఁగలఁడొ! యట్టులే స్తోత్రాళి
నర్చ లిడుదు వాని కమితభక్తి ॥ 1091

(5) క॥ హరినామకాశ్వగణములు
స్థిరభక్తిన్ వెలుఁగుచుండి శ్రీకుశలపయిన్
హరివిభుని దెచ్చి పెట్టఁగఁ
బర మతిని భజించె దేను భాగ్యం బలరన్ ॥ 1092

(6) గీ॥ నలుదిశలనుండి యింద్రుఁడు నవనవ మధు
రసము కల్పించుటంబట్టి రాజమాన
ధేనుగణ మింద్రునకు సోమదివ్యరసము
మధుయుతంబుగఁ జేయు సన్మాన మెసఁగ ॥ 1093

(7,8) గద్యము॥

నేను నింద్రునితోఁగూడ సూర్యగృహమునకుఁ జనెదను. కావున నాదిత్యుని యేకవింశతి స్థానములయందు మధువును గ్రోలి మే ముభయులము కలసియుండెదము. ఓ ప్రియమేధోగణమా! మీ రింద్రుని విశేషముగ నర్చింపుఁడు! పుత్రగణము పురవిదారి నెట్టు లర్చించినారలో! యట్టు లింద్రుని మీర లర్చింతురుగాక! ॥ 1094

(9, సీ॥ గర్గర ధ్వనియుక్త కఠినవాద్యంబులు భీతిద శబ్దంబు బిట్టుఁజేయు
10) నాల్గుదిక్కులనుంచి నవగోద తరచుగ భీతిద శబ్దంబు బిట్టుఁజేయుఁ
బింగళవర్ణజ్య పెక్కు విధంబుల భీతిద శబ్దంబు బిట్టుఁజేయుఁ
గాతిన్యవృద్ధమౌ కదనము స్థిరముగ వాసవునకు నుతి వరలఁజేయు
గీ॥ నాపగలు శుభ్రవర్ణంబు లొంచు దోహ, న పరివీతంబులై వృద్ధి నడుచుచుండె
నట్టి యింద్రుఁడు త్రావంగ నచ్చసోమ, మును గ్రహింపుఁడు! మీరలు తనివి తీర ॥ 1095

(11) చ॥ వరుణుఁడు త్రావె సోమమును వాసవుదేవుఁడు గ్రోలె దానినే
సురుచిరవిశ్వదేవతలు శోభితు లౌచు వసింత్రుగాక! నా
పరమగృహంబునందుఁ గడుఁ బావనుఁడై వెలుఁగొందునట్టి యా
వరుణుఁడు నిల్చుఁగాక! ననివారితతుష్టి విశేషయుక్తులై॥ 1096

గీ॥ వత్సములతోడఁ గూడు గోవర్గ మెట్లు
వత్సములకై సుశబ్దంబు వరలఁజేయు
నట్టు లుదకంబు వరుణార్థ మధికశక్తి
వరుణు వినుతించుచుండు నవ్వారిగాఁగ ॥ 1097

(12) గీ॥ శుభదరశ్మి లెట్లు సూర్యాభిముఖముగఁ
[1]బరుగు లిడెడు నటుల వరుణదేవ!
సప్తనదులు నీదు చక్కని తాలువు
నం దనుక్షణంబు నమరఁ దిరుగు ॥ 1098

(13) గద్యము॥

ఏ యింద్రుఁడు వివిధ గమనాంచిత మగు నరదంబునకుఁ గట్టఁబడిన యశ్వములను
హవ్యదాతలకడ విడిచిపెట్టునో! యే యింద్రుఁ డుపమానభూతుఁడో! యెవని
కెల్లరును బలమును విడుతురో! యా యింద్రుఁడు యజ్ఞమునకుఁ బోవునపుడు
జలమునకు నేత యగును ॥ 1099

1. బరుగు లెట్టు లటుల (వ్రా.ప్ర.పా.)

(14) గీ॥ వివిధ విద్వేషకారుల, వివిధశత్రు
గణముల నతిక్రమించుచు ఘన మహేంద్రుఁ
డమల వాక్యంబులన్ దాడనమును జేసి
జలద భేదంబుఁ జేయుచు వెలుఁగుచుండు 1100

(15) గీ॥ క్షీణదేహము కలిఁగిన శ్రీకుమారుఁ
బోలి రథమున వసియించి లీల నింద్రుఁ
డమల పితృమాతల నిమిత్తమై మృగ స్వ
రూపమేఘమునకు వృద్ధి ఁజూపుఁగాక! 1101

(16) గద్యము॥

సుందరహనువిశిష్టుఁడ వగు రథస్వామీ! నీవు స్వరచ్ఛందగమనకారియు, దీప్తము,
సహస్రపాదయుతము, నుజ్జ్వలహిరణ్మయము నగు రథము నెక్కుము! అపుడు
మన ముభయులమును గలిసికొనెదము ॥ 1102

(17) గద్యము॥

ఓ యన్నవంతులారా! మీరు దీప్తేంద్రున కిట్లు సేవ లొనర్చుచున్నారు. పరమందు
గమనార్థము హవ్యదానార్థము స్తుతు లింద్రుని మరలించును ॥ 1103

(18) గద్యము॥

ప్రియమేధస్సులు వీరి పురాతనస్థానములను బొందిరి. వీరు పూర్వప్రదాన నిమిత్తమై
కుశలను బరచిరి. హవ్యమును స్థాపించిరి ॥ 1104

## అనువాకః—8, సూక్తమ్—70

ఋషిః—పురుహన్మా ఆఙ్గిరసః

దేవతా—ఇన్ద్రః

ఛందః—బృహతీ, 1-6-విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః). 12-శంకుమతీ, 13-ఉష్ణిక్, 14-అనుష్టుప్, 15-పురఉష్ణిక్

(1) యో రాజా చర్షణీనాం యాతా రథేభిరధ్రిగుః ।
విశ్వాసాం తరుతా పృతనానాం జ్యేష్ఠో యో వృత్రహా గృణే ॥ 1278

(2) ఇన్ద్రం తం శుమ్భ పురుహన్మన్నవసే యస్య ద్వితా విధర్తరి ।
హస్తాయ వజ్రః ప్రతి ధాయి దర్శతో మహో దివే న సూర్యః ॥ 1279

(3) నకిష్టం కర్మణా నశద్యశ్చకార సదావృధమ్ ।
ఇన్ద్రం న యజ్ఞైర్విశ్వగూర్తమృభ్వసమధృష్టం ధృష్ణ్వోజసమ్ ॥ 1280

(4) [1]అషాళ్హముగ్రం పృతనాసు సాసహిం యస్మిన్ మహీరురుజ్రయః ।
సం ధేనవో జాయమానే[2] అనోనవుర్ద్యావః క్షామో[3] అనోనవుః ॥ 1281

(5) యద్ద్యావ[4] ఇన్ద్ర తే శతం శతం భూమిరుత స్యుః ।
న త్వా వజ్రిన్ త్సహస్రం సూర్యా[5] అను న జాతమష్ట రోదసీ ॥ 1282

1. అషాళహ, 2. మానేఽఅనోనవు, 3. క్షామోఽఅనోనవుః, 4. ద్యావఽఇన్ద్ర, 5. సూర్యాఽఅను. (ప్రా.ప్ర.)

(6) ఆ ప్రప్రాథ మహినా వృష్ణ్యా వృషన్ విశ్వా శవిష్ఠ శవసా ।
అస్మాగ్ం[1] అవ మఘవన్ గోమతి వ్రజే వజ్రిఞ్చిత్రాభిరూతిభిః ॥ 1283

(7) న సీమదేవ[2] ఆపదిషం దీర్ఘాయో మర్త్యః ।
ఏతగ్వా చిద్య ఏతశా యుయోజతే హరీ[3] ఇన్ద్రో యుయోజతే ॥ 1284

(8) తం వో మహో మహాయ్యమిన్ద్రం దానాయ నక్షణిమ్ ।
యో గాధేషు య[4] ఆరణేషు హవ్యో వాజేష్వస్తి హవ్యః ॥ 1285

(9) ఉదూ షు ణో వసో మహే మృశస్వ శూర రాధసే ।
ఉదూ షు మహ్యై మఘవన్ మఘత్తయ[5] ఉదిన్ద్ర శ్రవసే మహే ॥ 1286

(10) త్వం న[6] ఇన్ద్ర ఋతయుస్త్వానిదో ని తృమ్పసి ।
మధ్యే వసిష్వ తువినృమ్ణోర్వోర్ని దాసం శిశ్నథో హథైః ॥ 1287

(11) అన్యవ్రతమమానుషమయజ్వానమదేవయుమ్ ।
అవ స్వః సఖా దుధువీత పర్వతః సుఘ్నాయ దస్యుం పర్వతః ॥ 1288

1. అస్మాగ్ం౽అవ. 2. దేవ౽ఆపదిషం. 3. హరీ౽ఇన్ద్రో. 4. య౽ఆరణేషు
5. మఘత్తయ౽ఉదిన్ద్ర. 6. త్వం న౽ఇన్ద్ర౽ఋతయు. (వ్రా.ప్ర.)

(12) త్వం న1 ఇన్ద్రాసాం హస్తే శవిష్ఠ దావనే ।
ధానానాం న సం గృభాయాస్మయుర్ద్విః సం గృభాయాస్మయుః ॥ 1289

(13) సఖాయః క్రతుమిచ్ఛత కథా రాధామ శరస్య ।
ఉపస్తుతిం భోజః సూరిర్యో2 అహ్రయః ॥ 1290

(14) భూరిభిః సమహ3 ఋషిభిర్బర్హిష్మద్భిః స్తవిష్యసే ।
యదిత్థమేకమేకమిచ్ఛర వత్సాన్ పరాదదః ॥ 1291

(15) కర్ణగృహ్యా మఘవా శౌరదేవ్యో వత్సం నస్త్రిభ్య4 ఆనయత్ ।
అజాం సూరిర్న ధాతవే ॥ 1292

## అనువాకము—8, సూక్తము—70

ఋషి—ఆంగిరసుఁడైన పురుహన్మ*
దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ ఎవఁడు మనుష్యసంతతికి నెప్పుడు రా జగుచున్ వెలుంగునో!
యెవఁడు రథోత్తమంబుపయి నేగునో! యెవ్వని యాత్ర కెవ్వఁడేన్
వివిధములైన కష్టములఁ బెట్టఁగఁజాలఁడొ! జ్యేష్ఠుఁ డౌచు నిం
కెవఁడు సుసైన్యనాయకుఁడొ! యట్టి మహేంద్రు నుతింతు నే నొగిన్ ॥ 1105

1. త్వం నఽఇన్ద్రాసాం. 2. సూరిర్యోఽఅహ్రయః. 3. సమహాఽఋషి.
4. నస్త్రిభ్యఽఆనయత్. (వ్రా ప్ర.)

* వ్రాఁ ప్రతిలో (9వ సంపుటము. 265 పుట.) నీ సూక్తమునకు ఋషి "పురుహన్మ"గా వ్రాసి, 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "పురుహన్మానుఁడు"గా శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) క॥ పురురుక్మ(చ! రక్షార్థము
హరిని నలంకృతుని జేయు మతిపాలకు(డా!
హరిదేవ సుస్వభావము
నెరు(గుము! ద్వైవిధ్య మనుచు నెంతయు భక్తిన్ ॥ 1106

క॥ సురుచిరహస్తంబందున
హరి వజ్రము దాల్చుచుండు నది రమ్యంబౌ
పరమాకాశంబందున
ఖరకరుని విధాన దీప్తిc గ్రాలుసుగాదే! ॥ 1107

(3) చ॥ అతిశయవృద్ధిశీలు(డు, మహాత్ము(డు. వైరిసమూహజేత, స
న్మతి గలవా(డు నౌ హరికి, మానవు( డెవ్వ(డు యాగదీక్ష సం
తతము నొనర్చు నాత(డె యతంద్రితు(డై హరి( జేరు(గాదె! యా
తత మగు కర్మసంగ్రహవిధంబున నెంతయు( బ్రీతియుక్తు(డై ॥ 1108

(4) ఉ॥ వైరివినాశకుండయి యవారితశక్తిపరీతు(డైన యా
వీర మహేంద్రు( డెంతయును వేడ్కను బుట్టగ వేగయుక్త గో
వారము భూమిగామి జనవారము ద్యోగతమైన స్వరమున్
జేరుచు వానికిన్ స్తుతుల( జేసిరిగాదె! విశేషభక్తితోన్ ॥ 1109

(5) సీ॥ ఇంద్రు(డ! ద్యోలోక మెల్ల నీ పరిమాణ సరణిని నెరు(గంగ(జాల(గలదె!
పృథ్వి శతాత్మయై పెరిగిన( ద్వత్పరిమాణము నెరు(గంగ(బూన(గలదె!
వెలి(గెడు సూర్యు లీ విశ్వంబునన్ నిన్ను సొంపు మీర(గ వెలి(గింప(గలరె!
రోదసీతలములు సాదరంబుగ నీదు పరిమాణ మెరు(గంగ జరుగ(గలవె!
గీ॥ పూర్వ మెయ్యది పుట్టెనో! పూజ్యమైన,యదియు నీదగు పరిమితి నధిగమింప(
జాలు నెట్లు? మహాత్మ! నీ లీల తెలియ, నెవ్వరికి శక్య మౌను నీ యెల్ల జగతి? ॥ 1110

(6) చ॥ బలయుతుఁడా! ధనీ! రుచిరవజ్రవిభాసితహస్తుఁడా! మరు
ద్బలమును గూడుచున్ జలము వ్యాప్తముఁ జేయుచు నుందు వెల్ల గో
బలము నిమిత్తమై మము నపార ముదంబునఁ బొందుచుండి నీ
విలను విశేషరూపముగ నీయుము! మాకు సమస్తరక్షలన్ ॥ 1111

(7) గీ॥ శ్వేతవర్ణాశ్వయుగ్మముఁ జేర్చు నెవఁడు?
నీ రథంబునకున్, వానిఁ జేర హరులఁ
గూర్పు మరదంబునకు నీవు కూడ నింద్ర
దేవవిరహితుఁ డన్నంపు దీప్తిఁ గనునె? ॥ 1112

(8,9)సీ॥ దానంబు నీ యిష్టి దర్శించు నింద్రుని సేవించుచుండుట శ్రేష్ఠ మగును
జలమును బొందంగ శక్రదేవునికయి పూజలు సేయుట పూజ్య మగును
నిమ్నస్థలార్థము నిరత మింద్రాహ్వానమును జేయుచుండుట మోద మగును
సంగ్రామములయందు శక్రునిఁ బిలుచుట సర్వవిధంబుల సౌఖ్య మగును
గీ॥ వాసవా! శూర! యింద్రుఁడ! వలయు ధనముఁ, బొందుటకుఁ, గీర్తి లాభంబుఁ బొందుటకును
మముల నుత్థాపితులఁజేసి మఘవ! నీకు, మాకు రక్షల నొసఁగుట మాన్య మగును ॥ 113

(10) గీ॥ నీవు యజ్ఞాభిలాషివి! నీవు మాకు
నిందఁ జేసెడు వారల నిఖిలధనము
నపహరించుచు నత్యంతమైన ప్రీతి
నందుమోయి! మహేంద్రుఁడా! యాదరమున ॥ 1114

గీ॥ తర్పణీయుఁడ! యత్యంతధనుఁడ! యింద్ర!
యూరు యుగ్మముచే మమ్ము నోలిఁ గప్పి
వైరుల వధింపుమా! దాస వర్గములను
నస్త్రములఁ బరి[1]హరింపుమా! యధికదీక్ష ॥ 1115

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(11) ఉ॥ వాసవ! నీకు మిత్రుఁ డగు పర్వతమౌని త్వదన్యనిష్ఫలం
జేసి యమానుషం బగుమ శ్రీకరయాగ మొనర్చకుండఁ దా
భాసిలుచున్నవాఁ డతని స్వర్గమునుండి యధస్స్థలంబుపైఁ
ద్రోసి వెలుంగు, దాసులను, దోషుల మృత్యుముఖంబుఁ జేర్పుమా! ॥ 1116

(12) గీ॥ మా నిమిత్తము బలవంత! పూని నీవు
దానములఁ బోలి గోవుల ధర్మబుద్ధి
సంగ్రహింపుము! మాకయి సకలవిధుల
నావులఁ బరిగ్రహింపు మత్యాదరమున ॥ 1117

(13) గద్యము॥

ఓ సఖులారా! కర్మలఁ జేయుట కిచ్చగింపుఁడు! ఆ హింసకు లింద్రు నే విధముగ
స్తుతింపఁగలరు? అతఁడు శత్రుగణభక్షకుఁడు. సూరి(ప్రేరకుఁడు). అతఁ డెక్కఁడను
దిరస్కారము నొందఁడు ॥ 1118

(14) గద్యము॥

సకలపూజనీయుం డగు నో యింద్రుఁడా! ఋషులు, హవ్యదాతలు నీ స్తవములఁ
జేయుదురు. ఓ హింసకుఁడా! యొక్కొక్కటి చొప్పున స్తోతలకు బహువత్సములు
దాన మిడుము! 1119

(15) గద్యము॥

ఓ మఘవ! ముగ్గురు హింసకులనుండి యుద్ధములందు జయించిన గోవులను, వత్సములను,
గర్ణములఁ బట్టికొని మా చెంతకుఁ దీసికొనిరమ్ము! ఇటులనే స్వామి దానము
నొసఁగుటకు నజమును దెచ్చును ॥ 1120

## సూక్తమ్—71

ఋషిః—సుచీతి, పురమీళ్హావాఙ్గిరసౌ, తయోర్వాన్యతరః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ, 10-15-విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) త్వం నో[1] అగ్నే మహోభిః పాహి విశ్వస్యా[2] అరాతేః ।
ఉత ద్విషో మర్త్యస్య ॥ 1293

(2) నహి మన్యుః పౌరుషేయ[3] ఈశే హి వః ప్రియజాత ।
త్వమిదసి క్షపావాన్ ॥ 1294

(3) స నో విశ్వేభిర్దేవేభిరూర్జో నపాద్భద్రశోచే ।
రయిం దేహి విశ్వవారమ్ ॥ 1295

(4) న తమగ్నే[4] అరాతయో మర్తం యువన్త రాయః ।
యం త్రాయసే దాశ్వాంసమ్ ॥ 1296

(5) యం త్వం విప్ర మేధసాతావగ్నే హినోషి ధనాయ ।
స తవోతీ గోషు గన్తా ॥ 1297

---

1. త్వం నోఽగ్నే, 2. విశ్వస్యాఽరాతేః, 3. షేయఽఈశే, 4. తమగ్నేఽఅరాతయో. (వా.ప్ర.)

(6) త్వం రయిం పురువీరమగ్నే దాశుషే మర్తాయ ।
ప్ర ణో నయ వస్యో[1] అచ్ఛ ॥ 1298

(7) ఉరుష్యా ణో మా పరా దా[2] అఘాయతే జాతవేదః ।
దురాధ్యేఽ మర్తాయ ॥ 1299

(8) అగ్నే మాకిష్టే దేవస్య రాతిమదేవో యుయోత ।
త్వమీశిషే వసూనామ్ ॥ 1300

(9) స నో వస్వః[3] ఉప మాస్యూర్జో నపాన్మాహినస్య ।
సఖే వసో జరితృభ్యః ॥ 1301

(10) అచ్ఛా నః శీరశోచిషం గిరో యన్తు దర్శతమ్ ।
అచ్ఛా యజ్ఞాసో నమసా పురూవసుం పురుప్రశస్తమూతయే ॥ 1302

(11) అగ్నిం సూనుం సహసో జాతవేదసం దానాయ వార్యాణామ్ ।
ద్వితా యో భూదమృతో మర్త్యేష్వా హోతా మన్ద్రతమో విశి ॥ 1303

1. వస్యోఽఅచ్ఛ, 2. పరా దాఽఅఘాయతే, 3. వస్వఽఉప. (ప్రా.ప్ర.)

(12) అగ్నిం వో దేవయజ్యయా ఽగ్నిం ప్రయత్యధ్వరే ।
అగ్నిం ధీషు ప్రథమమగ్నిమర్వత్యగ్నిం క్షైత్రాయ సాధసే ॥ 1304

(13) అగ్నిరిషాం సఖ్యే దదాతు న[1] ఈశే యో వార్యాణామ్ ।
అగ్నిం తోకే తనయే శశ్వదీమహే వసుం సన్తం తనూపామ్ ॥ 1305

(14) అగ్నిమీళిష్వావసే గాథాభిః శీరశోచిషమ్ ।
అగ్నిం రాయే పురుమీళ్హ[2] శ్రుతం నరో ఽగ్నిం సుదీతయే ఛర్దిః[3] ॥ 1306

(15) అగ్నిం ద్వేషో యోతవై నో గృణీమస్యగ్నిం శం యోశ్చ దాతవే ।
విశ్వాసు విక్ష్వవితేవ హవ్యో భువద్వస్తుర్ఋషూణామ్ ॥ 1307

## సూక్తము—71

ఋషి—ఆంగిరసులైన సుదీతి, పురుమీళ్హుఁడు లేక వారిలో నొకఁడు*
దేవత—అగ్ని*

(1) గీ॥ నీ వదాత్సలబ్ధ నిఖిలధనంబును
మా కొసంగి యధిక భీకరాత్ము
లైన శత్రువులను నడఁచుచు మమ్ముఁ బా
లనముఁ జేయు మగ్ని! ఘనుఁడ! నీవు ॥ 1121

---

1. నఽఈశే, 2. పురుమీళహ, 3. ఛర్దిః. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 269పుట)నీ సూక్తమునకు ఋషి "సుదితి, పురుమీఢుఁడు"గాను, దేవత "అదితి"గాను వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "సుదితి, పురుమిళ్హుఁడు లేక వారిలో నొకఁడో" ఋషిగాను, "అగ్ని" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ పురుషులకు సులభ మైనట్టి పూర్ణకోప
మనలుఁడా! నిన్ను బాధింప నాగఁగలదె?
సకలసుప్రియజాతుఁడా! సరసరాత్రి
వంతుఁడవు కావె! సంప్రీతిఁ బడయు! నీవు ॥ 1122

(3) గీ॥ వర్ణనీయకాంతివంతుఁడా! బలపుత్ర!
సకల దేవతలను జక్కఁ గూడి
సర్వకాంక్ష్య మైన సరసంపు ధనమును
నిమ్ము! మాకు నీవు నెమ్మి మిగుల ॥ 1123

(4) గీ॥ అర్థవంతులైన హవ్యదాతల నెల్లఁ
బాలనం బొనర్చి వాసవుండ!
వీర శత్రువులను వేరుగఁ జేయుచు
దూర దేశమునకుఁ ద్రోలు మీవు ॥ 1124

(5) గీ॥ అనల! మేధావి! యే వ్యక్తి ధనము గోరి
యజ్ఞము ప్రవర్తితముఁ జేయు నట్టి వ్యక్తి
నీదు రక్షాప్రతిజ్ఞచే నిఖిల గో వి
శిష్టుఁ డగుచుండు సుధన విశిష్టుఁ డగుచు॥ 1125

(6) గీ॥ హవ్య మొసఁగెడు మర్త్యుల కనల! వీర
సహిత మగు[1] ధనము నెల్లను జాల నొసఁగి
వాసయోగ్య ధనంబును వారి కభిము
ఖంబుగన్ ప్రేరణముఁ జేయు! ఘనుఁడ! నీవు ॥ 1126

(7) గీ॥ సర్వదాఽనిష్టములఁ బల్కి సకల విధుల
హింస లొనరించు బుద్ధిచే నిలను గల్గు
మనుజుల వశంబుఁ జేయకు! మమ్ము నీవు
దేవుఁడా! జాతవేదుఁడ! దివ్యతేజ! ॥ 1127

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్త మైనది.

(8) గీ॥ ద్యోతమానుండ! యనలుఁడా! పూతదేవ
రహితమౌ వ్యక్తి నిను ధనరాజి విరహి
తునిగఁ జేయంగఁ గల్గునె! యనలదేవ!
యట్టి వాఁ డెవ్వఁ డుండు? నీ యవనియందు ॥ 1128

(9) గీ॥ అనలుఁడా! నీవు సఖుఁడవు! ఘనబలంబు
వలనఁ బుట్టినవాఁడవు! వాసదుఁడవు!
మేము స్తోతల మగుదుము మేటి ధనము
మాకు దాన మొసంగుమా! మరువ కీవు॥ 1129

(10, సీ॥ అస్మదీయ స్తుతు లన్నియు నగ్నికి నభిముఖంబుగ శీఘ్ర మరుఁగుఁగాక!
11) హవ్యాంచితంబు లౌ హవ్యంబు లగ్నికి నభిముఖంబుగ శీఘ్ర మరుఁగుఁగాక!
నుతు లన్నియున్ బలసుతుఁడైన యగ్నికి నభిముఖంబుగ శీఘ్ర మరుఁగుఁగాక!
జాతవేదుం డగు జ్వలను చెంతకు నుతు లభిముఖంబుగ శీఘ్ర మరుఁగుఁగాక!
గీ॥ నగ్ని మనుజుల మధ్యను సమరుచుండు, నతఁడు ద్వైవిధ్యమును బూని యరుఁగుచుండు
హోమ సంధానకుండయి హోయలు కలుఁగు,మదముఁ బుట్టించుచుండుఁ దా సదయుఁ డగుచు॥ 1130

(12, సీ॥ దేవయాగమునకు దివ్యవహ్నిని నేను స్తుతియించుచున్నాను సూక్తితోడ
13) యజ్ఞం బొనర్చిన ననలదేవుని నేను స్తుతియించుచున్నాను సూక్తితోడఁ
బాలనకర్మలఁ బ్రథమాగ్ని హోత్రుని స్తుతియించుచున్నాను సూక్తితోడ
వైరివర్గంబును వంచిన యగ్నిని స్తుతియించుచున్నాను సూక్తితోడ
గీ॥ క్షేత్రఫలముల నే వేళఁ జెందుటకయి, నగ్ని నుతియించుచున్నాఁడ నధిక భక్తి
నగ్ని ధనమున కీశ్వరుం డగుటవలన, వానిఁ బూజించుచున్నా నవార్య భక్తి॥ 1131

గీ॥ అగ్ని మా కన్నదానంబు నందఁజేయుఁ
గాకఁ బుత్రులకుం బౌత్ర గణములకును
నంగపాలకుఁ డౌ నగ్ని నధిక ధనము
నేను యాచించుచున్నాఁడ నిశ్చలముగ॥ 1132

(14, సీ॥ పురుమీఢుఁడా![1] నీవు పుణ్యాత్ము నగ్నిని గణియింపుమా! మహాగాథవలన
15) దాహకరంబులౌ తచ్ఛిఖాసంతతి స్తుతియింపుమా! మృదుసూక్తివలన
సుదతి నిమిత్తమై సుందరగేహంబు ననలు యాచింపుమా! మనసువలన
నమ్యుల లాగున నడుగక యగ్నిని వినుతింపుమా! నీవు వినతివలన
గీ॥ వైరి గణముల వేరుగాఁ బారఁద్రోల
నభయ సుఖముల నొసఁగంగ నగ్నిఁ దలఁతు
జనులలో రాజు వలె ఋషిజనమునకయి
వాసములకు నడుగుమా! నీవు పావకుండ! ॥ 1133

## సూక్తమ్—72

ఋషిః—హర్యతః ప్రాగాథః
దేవతా—అగ్నిః హవీంషి వా
ఛందః—గాయత్రీ

(1) హవిష్కృణుధ్వమా గమదధ్వర్యుర్వనతే పునః ।
విద్వాగ్ం[1] అస్య ప్రశాసనమ్ ॥ 1308

(2) ని తిగ్మమభ్యంశుం సీదద్ధోతా మనావధి ।
జుషాణో[2] అస్య సఖ్యమ్ ॥ 1309

(3) అన్తరిచ్ఛన్తి తం జనే రుద్రం పరో[3] మనీషయా ।
గృభ్ణన్తి జిహ్వయా ససమ్ ॥ 1310

1. పురుమీఢుఁడా: (వా.ప్ర.పా.). 2. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

1. విద్వాగ్ం౽అస్య. 2. జుషాణో౽అస్య. 3. మనీషియా. (వా.ప్ర.)

(4) జామ్యతీతపే ధనుర్వయోధా[1] అరుహద్వనమ్ ।
దృషదం జిహ్వయావధీత్ । 1311

(5) చరన్వత్సో రుశన్నిహ నిదాతారం న విన్దతే ।
వేతి స్తోతవ[2] అమ్బ్యమ్ ॥ 1312

(6) ఉతో న్వస్య యన్మహదశ్వావద్యోజనం బృహత్ ।
దామా రథస్య దదృశే ॥ 1313

(7) దుహన్తి సప్తైకాముప ద్వా పఞ్చ సృజతః ।
తీర్థే సిన్ధోరధి స్వరే ॥ 1314

(8) ఆ దశభిర్వివస్వత[3] ఇన్ద్రః కోశమచుచ్యవీత్ ।
ఖేదయా త్రివృతా దివః ॥ 1315

(9) పరి త్రిధాతురధ్వరం జూర్ణిరేతి నవీయసీ ।
మధ్వా హోతారో[4] అఞ్జతే ॥ 1316

---

1. యోధా౭అరు, 2. స్తోతవ౭అమ్బ్యమ్, 3. స్వత౭ఇన్ద్రః, 4. హోతారో౭అఞ్జతే. (ప్రా.ప్ర.)

(10) సిఞ్చన్తి నమసావతముచ్చాచక్రం పరిజ్మానమ్ ।
నీచీనబారమక్షితమ్ ॥ 1317

(11) అభ్యారమిదద్రయో నిషిక్తం పుష్కరే మధు ।
అవతస్య విసర్జనే ॥ 1318

(12) గావ[1] ఉపావతావతం మహీ యజ్ఞస్య రప్సుదా ।
ఉభా కర్ణా హిరణ్యయా ॥ 1319

(13) ఆ సుతే సిఞ్చత శ్రియం రోదస్యోరభిశ్రియమ్ ।
రసా దధీత వృషభమ్ ॥ 1320

(14) తే జానత స్వమోక్యం౧ సం వత్సాసో న మాతృభిః ।
మిథో నసన్త జామిభిః ॥ 1321

(15) ఉప స్రక్వేషు బప్సతః కృణ్వతే ధరుణం దివి ।
ఇన్ద్రే[2] అగ్నా నమః స్వః ॥ 1322

---

1. గావఽఉపా, 2. ఇన్ద్రేఽఅగ్నా. (వ్రా.ప్ర.)

(16) అధుక్షత్ పిప్యుషీమిషమూర్జం సప్తపదీమరిః ।
సూర్యస్య సప్త రశ్మిభిః ॥ 1323

(17) సోమస్య మిత్రావరుణోదితా సూర[1] ఆ దదే । 1324
తదాతురస్య భేషజమ్ ॥

(18) ఉతో న్వస్య యత్ పదం హర్యతస్య నిధాన్యమ్ ।
పరి ద్యాం జిహ్వయాతనత్ ॥ 1325

## సూక్తము—72

ఋషి—ప్రగాథపుత్రుఁడు హర్యతుఁడు
దేవత—అగ్ని లేక హవిస్స్తుతి*

(1) గీ॥ అనలుఁ దేతెంచె మీరలు హవ్యములను
నతని కొసఁగరె, యధ్వర్యుతతి, విశేష
యజ్ఞములఁ జేయుచుండుఁ దా నగ్ని హవ్య
దాన మొసఁగుట నెరుఁగు నుదారబుద్ధి॥ 1134

(2) గీ॥ అగ్నియజమానులకు సఖ్య మమరియుండు
హోత తీక్ష్ణతరంబైన పూతవహ్ని
స్థాపనముఁ జేయుచున్ దాను సరసరీతిఁ
జెంతఁ జేరుచున్నాఁడు శీఘ్రగతిని॥ 1135

---

1. సూరఽ ఆ దదే. (వ్రా.ప్ర.)

* "అగ్ని" దైవత్వము నొక్కదానిని మాత్రమే శ్రీనేమానివారు పేర్కొనిరి.

(3) గీ॥ తమసి శుద్ధిని బడయంగఁ దామ ప్రజ్ఞ
వలన రుద్రాగ్నిఁ దమ చెంత వెలుఁగఁజేయ
నిద్రితాగ్నిని స్తుతులచే నెనరు మిగుల
సంగ్రహించుచున్నారు సత్త్వమతులు॥ 1136

(4) గద్యము॥

ఏ యంతరిక్షము సకల బృహద్వస్తువుల నతిక్రమించునో! యన్నదాత యగు నగ్ని
యా యంతరిక్షమున కధికతాపమును గలిఁగించుచున్నాఁడు. వాఁడు శిఖలచే
మేఘమును ఛేదించుచున్నాఁడు. జలముపై నారోహించుచున్నాఁడు॥ 1137

(5) గీ॥ చంచలుం డౌను నగ్ని వత్సరముఁ బోలి
శ్వేతవర్ణంబుతో వెల్గు శ్రీకరాగ్ని
జగము రోధించు వ్యక్తుల సరస కరుగు
భక్తవరులను గామించు భావనాగ్ని 1138

(6,7) గద్యము॥

మాహాత్మ్యయుక్తము నశ్వసహితము నగు నగ్నిప్రకాండయుగము, నగ్నిరథరజ్జువులు
గోచర మగును. అపుడు సప్తఋత్విజులు శబ్దసహిత మగు సింధునదీతీరమున
జలదోహనముఁ జేయుచున్నారు. ఇరువురు ఋత్విజులు పంచజనులను
వేరు ప్రవర్తితులుగ నొనర్చుచుండిరి॥ 1139

(8) గద్యము॥

పరిచర్యాకారు లగు దశాంగుళులచే యాచితుం డగు నింద్రుఁ డాకాశగత మేఘములనుండి
మూఁడు విధము లగు రశ్మలవలన జలమును వర్షించుచున్నాఁడు॥ 1140

(9, సీ॥ మూఁడు వర్ణములతో మురియుచుండెడు నగ్ని శిఖలతో యజ్ఞముఁ జేరుచుండె
10,11) నధ్వర్యు గణము తా నతిశయమధువుతోఁ బాయక తత్పూజఁ జేయుచుండె
నుపరిభాగ సుచక్రయుతుఁ డగ్ని జలమున బహువిధములఁ దద్పఁబడుచునుండె
నిమ్నముఖద్వార నిరతిశయాగ్ని తా నక్షీణుఁడై ప్రీతి నమరుచుండె
గీ॥ భక్తి నధ్వర్యులు సమీపవర్తు లగుచు, నగ్ని విడిచెడు వేళలయందు యోగ్య
పాత్రములయందు మధుసేక పరమకర్మ,నాచరించుచునున్నవా రతిశయముగ॥ 1141

(12) గీ॥ దోహనీయ సరస దుగ్ధ ప్రయోజన
మెల్లఁ దీరియున్న యెల్ల గోవు
లార! యగ్ని కడకు మీరలు వెడలుడు
స్వర్ణమయుఁ డతండు సర్వవిధుల॥ 1142

(13) గీ॥ పాలఁ బిదికిన యధ్వర్యువర్యులార!
రోదసికి నాశ్రితంబును దూఢి పిశ్రి
యంబునకు యోగ్య మగు దాని నంది చల్లి
యజము దుగ్ధము వహ్నికి నందఁజేయు ॥ 1143

(14) గీ॥ స్వీయ వాసప్రదం బైన శ్రీకరాగ్ని
నెరుఁగుదురు వారు వత్సము లెట్లు జనని
తోడఁ గూడునో! యట్టులే తుష్టగోవు
లెల్లఁ దమ బంధువులఁ గూడు నుల్లమలర॥ 1144

(15) గీ॥ శిఖలచే భక్షణంబును జేయునగ్ని!
యన్న మింద్రుని నగ్నిని నాదరించు
నంతరిక్షంబుఁ బోషించు నమరవసన
కగ్ని దేవునకును నన్న మందనిచ్చు ॥ 1145

(16) గీ॥ వాయు వతిచంచల సుశక్తపాదుఁ డగుచు
మాధ్యమిక వాక్కునుండి సన్మాన్యసూర్య
సప్తరశ్ములచే వృద్ధి సరణి నొంది
చాల నన్నము గ్రహియించు లీలతోడ॥ 1146

(17) గీ॥ సూర్యుఁ డుదయింపఁగా వాఁడు సోమ మాను
నాతురౌషధ మిది యగు హర్యత ఋషి
స్థానము సుహవ్యమును నుంచఁదగినది యగు
నగ్నిశిఖల దివంబున వ్యాప్తుఁ డగును॥ 1147

(18)†క॥ మిత్రావరుణులు సూర్యులు
ఛద్రత నుదయించి సోమపానముఁ జేయన్
మిత్రులుగ వెలుఁగు నొందుచుఁ
బత్ర లతా సుమ కలితపుఁ బ్రౌషధు లలరున్॥ 1148

## సూక్తమ్—73

ఋషిః—గోపవన ఆత్రేయః సప్తవధిర్వా
దేవతా—అశ్వినౌ
ఛందః—గాయత్రీ

(1) ఉదీరాథామృతాయతే యుఞ్జాథామశ్వినా రథమ్ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1326

(2) నిమిషశ్చిజ్జవీయసా రథేనా యాతమశ్వినా ।
అన్తి షద్భూతు వామవః ॥ 1327

(3) ఉప స్తృణీతమత్రయే హిమేన ఘర్మమశ్వినా ।
అన్తి షద్భూతు వామవః ॥ 1328

(4) కుహ స్థః కుహ జగ్మథుః కుహ శ్యేనేవ పేతథుః ।
అన్తి షద్భూతు వామవః ॥ 1329

---

† 8వ మండలము 72వ సూక్తమునందు మొత్తము 18 ఋక్కులుండఁగా శ్రీనేమానివారు 17 ఋక్కులను మాత్రమే యనువదించి 18వ ఋక్కును ననువదింపక విడిచిపెట్టిరి. (వ్రాతప్రతి 9వ సంపుటము. 277పుట)

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5) యదద్య కర్హి కర్హి చిచ్ఛుశ్రూయాతమిమం హవమ్ ।

అస్తి షద్భూతు వామవః ॥ 1330

(6) అశ్వినా యామహూతమా నేదిష్ఠం యామ్యాప్యమ్ ।

అస్తి షద్భూతు వామవః ॥ 1331

(7) అవ న్తమత్రయే గృహం కృణుతం యువమశ్వినా ।

అస్తి షద్భూతు వామవః ॥ 1332

(8) వరేథే[1] అగ్నిమాతపో వదతే వల్గ్వత్రయే ।

అస్తి షద్భూతు వామవః ॥ 1333

(9) ప్ర సప్తవధ్రిరాశసా ధారామగ్నేరశాయత ।

అస్తి షద్భూతు వామవః ॥ 1334

(10) ఇహా గతం వృషణ్వసూ శృణుతం మ ఇమం హవమ్ ।

అస్తి షద్భూతు వామవః ॥ 1335

---

1. వరేథేఽఅగ్ని. (వా.ప్ర.)

(11) కిమిదం వాం పురాణవజ్జరతోరివ శస్యతే ।
అన్తి షద్భూతు వామవః ॥ 1336

(12) సమానం వాం సజాత్యం సమానో బన్ధురశ్వినా ।
అన్తి షద్భూతు వామవః ॥ 1337

(13) యో వాం రజాంస్యశ్వినా రథో వియాతి రోదసీ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1338

(14) ఆ నో గవ్యేభిరశ్వ్యైః సహస్రైరుప గచ్ఛతమ్ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1339

(15) మా నో గవ్యేభిరశ్వ్యైః సహస్రేభిరతి ఖ్యతమ్ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1340

(16) అరుణప్సురుషా[1] అభూదకర్జ్యోతిరృతావరీ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1341

---

1. ప్సురుషా౨ అభూత. (వ్రా.ప్ర.)

(17) అశ్వినా సు విచాకశద్వృక్షం పరశుమాగ్ం[1] ఇవ ।
అన్తి షద్భూతు వామవః ॥ 1342

(18) పురం న ధృష్ణవా రుజ కృష్ణయా బాధితో విశా ।
అన్తి షద్భూతు వామవః ॥ 1343

## సూక్తము—73

ఋషి—ఆత్రేయుఁడైన గోపవనుఁడు లేక సప్తవధ్రి†
దేవత—అశ్విద్వయము

(1) గీ॥ అశ్వులార ! నేను యజ్ఞాభిలాషిని
నుదయ మొంది మీర లొగి రథంబు
యోజితముగఁ జేసి యుండుట కడు లెస్స
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1149

(2) గీ॥ అశ్వులార! మీర లరదంబు నెక్కుచు
నిమిషకాలమందె నిలువ నిచట
కరుగఁదెండు! శీఘ్ర మతితుష్టియుక్తులై
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1150

(3) గీ॥ అశ్వివర్యులార! యత్రికై హిమజల
పూరములను ఘర్మపూరముల ని
వారణంబుఁ జేయఁ జేరఁ డిచ్చుట కీరు
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1151

---

1. పరశుమాగ్ంఽఇవ. (వ్రా.ప్ర.)

† సప్తవధ్రి, సప్తబుధ్ని పాఠాంతరములు. వ్రాతప్రతిలో (6వ సంపుటము. 279వ పుట) నీ సూక్తమునకు ఋషి "సప్తబధ్ని"గా వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "గోపవనుఁడు లేక "సప్తవధ్రియో" అని శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గీ॥ ఎచట నున్నవారొ? యెచ్చట కరిగిరో!
శ్యేనపక్షి వలెను జెలఁగుచుండి
యెచటఁ బతితులైరొ! యెరుఁగరాకుండెను
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1152

(5) గీ॥ ఎట్టి తలమునందొ! యెప్పుడో! మా పిలు
నాలకింపువారొ! యది యుఁగూడ
నే నెరుంగఁజాల నిశ్చయము మీ మాట
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1153

(6) గీ॥ అమలకాలమందు నాహ్వానయోగ్యులౌ
నశ్వివరులకడకు నరిగి పిదప
నికట బాంధవులను నేఁ జేరి యుండెద
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1154

(7) గీ॥ అశ్వివర్యులార! యత్రి మహామునీ
శ్వరున కవన మొసఁగు చారు గృహముఁ
గల్పనంబుఁ జేసి కలిఁగించినారలు
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1155

(8) గీ॥ అతిమనోహర నుతికారి యైన యత్రి
కగ్నితాపము వారించి యధికసుఖము
నందఁజేయుఁడు! మీర లో యశ్వులార!
మీ సురక్షలు మా చెంత మెలఁగుచుండు ॥ 1156

(9) గీ॥ సప్తవర్ధి యనెడు సరసుఁడు స్తుతులచే
నగ్నిధార మిగుల నాశ్రయించి
సౌఖ్య మలరఁ దాను శయనించియుండెను
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1157

(10) గీ॥ వృష్టిధనము నొసఁగు వేల్పులారా! మీర
లిచ్చట కరుగఁదెంచి యెల్ల నుతుల
నాలకింపవలదె! యతిశయప్రీతితో
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1158

(11) గీ॥ అశ్వివర్యులార! యతివృద్ధునిం బోలి
రండటంచు జగము రాణఁ బిలువఁ
గారణం బదేమొ! కన్పట్టకున్నది
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1159

(12, గీ॥ మీకు బంధు వొకఁడె! మికు జన్మస్థాన
13) మొకటె! మీ రథంబు సకల దివికి
భువికి లోకములకుఁ బోవుచుండునుగాదె!
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1160

(14) గీ॥ వేయి ధేనువులను వేయి యశ్వంబులఁ
గూడుకొనుచు మీరు కూర్మి మిగుల
నశ్వివర్యులార! యరుగుదెం డిచటకు
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1161

(15) గీ॥ ఆల గణముతోడ నశ్వ సంఘంబుతో
నశ్వివర్యులార! యస్మదీయ
బాధ నపనయించి బహుతుష్టి నుండుఁడు!
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1162

(16) గీ॥ ప్రత్యుషస్సు శుభ్రవర్ణము జ్యోతిస్సుఁ
బుట్టఁజేయు యజ్ఞపూర్ణ మగును
నశ్వివర్యులార! యార్యవందితులార!
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1163

(17) గీ॥ చేత గొడ్డలిఁ గలవాఁడు చెట్లు పోలి
సూర్యుఁడు తమస్సుఁ గొట్టును సూక్తితోడ
నశ్వివర్యులఁ బిలిచెద నాదరమున
మీ సురక్షలు మా చెంత మెలఁగుమందు ॥ 1164

(18) గీ॥ సప్తబధ్రి! నీవు చక్కని కృష్ణ పే
టకమునందు నుంటి వకలుషముగఁ
బట్టణమును వలెను బాడు చేయుము! వారి
మీ సురక్ష మా సమీపవర్తి ॥ 1165

## సూక్తమ్—74

ఋషిః—గోపవన ఆత్రేయః
దేవతా—అగ్నిః, 13-15-ఆర్క్షః శ్రుతర్వా
ఛందః—1-12-గాయత్రీ అనుష్టుమ్ముఖః, (అనుష్టుప్ + గాయత్ర్యౌ) (ప్రగాథః),
13-15-అనుష్టుప్

(1) విశోవిశో వో[1] అతిథిం వాజయన్తః పురుప్రియమ్ ।
అగ్నిం వో దుర్యం వచః స్తుషే శూషస్య మన్మభిః ॥ 1344

(2) యం జనాసో హవిష్మన్తో మిత్రం న సర్పిరాసుతిమ్ ।
ప్రశంసన్తి ప్రశస్తిభిః ॥ 1345

(3) పన్యాంసం జాతవేదసం యో దేవతాత్యుద్యతా ।
హవ్యాన్యైరయద్దివి ॥ 1346

---

1. వో౦అతిథిం (వ్రా. ప్ర.)

(4) అగన్మ వృత్రహన్తమం జ్యేష్ఠమగ్నిమానవమ్ ।
యస్య శ్రుతర్వా బృహన్నార్క్షో[1] అనీక ఏధతే ॥ 1347

(5) అమృతం జాతవేదసం తిరస్తమాంసి దర్శతమ్ ।
ఘృతాహవనమీడ్యమ్ ॥ 1348

(6) సబాధో యం జనా[2] ఇమే౩ ఽగ్నిం హవ్యేభిరీళతే ।
జుహ్వానాసో యతస్రుచః ॥ 1349

(7) ఇయం తే నవ్యసీ మతిరగ్నే[3] అధాయ్యస్మదా ।
మన్ద్ర సుజాత సుక్రతో ఽమూర దస్మాతిథే ॥ 1350

(8) సా తే[4] అగ్నే శంతమా చనిష్ఠా భవతు ప్రియా ।
తయా వర్ధస్వ సుష్టుతః ॥ 1351

(9) సా ద్యుమ్నైర్ద్యుమ్నినీ[5] బృహదుపోప శ్రవసి శ్రవః ।
దధీత వృత్రతూర్యే ॥ 1352

---

1. బృహన్నార్క్షో ఽ అనీక ఽ ఏధతే, 2. జనా ఽ ఇమే౩గ్నిం, 3. రగ్నే ఽ అధా, 4. సా తే ఽ అగ్నే,
5. ద్యుమ్నైర్ద్యుమ్నినీ. (ప్రా.ప్ర.)

(10) అశ్వమిద్గాం రథప్రాం త్వేషమిన్ద్రం న సత్పతిమ్ ।
యస్య శ్రవాంసి తూర్వథ పన్యంపన్యం[1] చ కృష్టయః ॥ 1353

(11) యం త్వా గోపవనో గిరా చనిష్ఠదగ్నే[2] అఙ్గిరః ।
స పావక శ్రుధీ హవమ్ ॥ 1354

(12) యం త్వా జనాస[3] ఈళతే సబాధో వాజసాతయే ।
స బోధి వృత్రతూర్యే ॥ 1355

(13) అహం హువాన[4] ఆర్క్షే శ్రుతర్వణి మదచ్యుతి ।
శర్ధాంసీవ స్తుకావినాం మృక్షా శీర్షా చతుర్ణామ్ ॥ 1356

(14) మాం చత్వార[5] ఆశవః శవిష్ఠస్య ద్రవిత్నవః ।
సురథాసో[6] అభి ప్రయో వక్షన్ వయో న తుగ్ర్యమ్ ॥ 1357

(15) సత్యమిత్ త్వా మహేనది పరుష్ణ్యవ దేదిశమ్ ।
నేమాపో[7] అశ్వదాతరః శవిష్ఠాదస్తి మర్త్యః ॥ 1358

---

1. పన్యంపంచ, 2. దగ్నేఽఅఙ్గిరః, 3. జనాసఽఈళతే, 4. హువానఽఆర్క్షే, 5. చత్వారఽఆశవః,
6. సురథాసోఽఅభి, 7. నేమాపోఽఅశ్వదాతరః. (వ్రా.ప్ర.)

## సూక్తము—74

ఋషి—ఆత్రేయుఁడైన గోపవనుఁడు
దేవత—అగ్ని, 13-15-ఆర్క్షుఁడైన శ్రుతర్వుఁడు*
(ఇది దానస్తుతిపర మైన సూక్తము)

(1) చ॥ అతిథిని మానవాళులకు నన్నము గోరెడు వాని లోక స
మ్మతుఁ డగు వానినగ్ని విభు మాన్యునిగా వినుతింపుఁ డీరు నే
నతిశయ సౌఖ్య సంపదల నందఁగఁజేయఁగ మీకు, సత్య వా
క్తతులను నుచ్చరించెదను దత్క్షణమే ప్రతిభావిశేషతన్ ॥ 1166

(2, సీ॥ ఎవనికై ఘృతహోమ మెల్లఁ జేయఁగఁబడు నెవఁడు హవ్యాదుల నందఁగలుఁగు?
3,4) నెవ్వఁడు స్తోతల నెల్లఁ బ్రశంసించి జాతవేదుండయి పూతుఁ డగునొ !?
మెవఁడు యజ్ఞములందు నెల్ల హవ్యంబుల దివికిఁ బ్రేరణఁజేసి తిరుగఁగలుఁగు ?
నెవని శిఖాళిచే ఋక్షపుత్ర శ్రుతర్వవర్ధితుం డగు చరి స్పర్ధి యగును?
గీ॥ నట్టి వృత్ర నివారకుండైన వాని
మనుజ హితమును జేయుచు మనెడు వాని
సర్వ విధముల జ్యేష్ఠుఁడై సాగువాని
నగ్నిహోత్రుని సేవింతు నాదరమున ॥ 1167

(5, సీ॥ మరణవిహీనుఁడై స్థిరతమస్సును గొట్టు వహ్నికి ఘృతమీయఁబడును బ్రీతి
6,7) జాతవేదుండయి పూతస్తుతులఁ గొను వహ్నికి ఘృతమీయఁబడును బ్రీతి
జన్మం బొనర్చుచు సకలలోకంబుల వహ్నికి నుతి సల్పఁబడును బ్రీతి
స్రుక్కులఁ బట్టుచు శుభహవ్యముం దాల్చి వహ్నికి నుతి సల్పఁబడును బ్రీతి
గీ॥ హృష్టజాతుఁడ! సక్రతూ! స్పష్ట దర్శ
నీయుఁడా! మౌఢ్యరహిత! యమేయశక్తి!
సూక్తసంస్తవముల నెల్ల యత్నమునను
జేసియుంటినిగాదె! సుశీల నేను ॥ 1168

---

* 15b సంపుటములలోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తమునకు "అగ్ని, సుతుర్వుని దానము" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(8, సీ॥ అత్యంతసుఖకరం బైన యీ స్తుతి యగ్ని! నీకుఁ బ్రియంబయి నిలిచియుండుఁ!
9,10) బ్రజురాన్నసహితమై ప్రబలమౌ నీ సూక్తి నీకుఁ బ్రియంబయి నిలిచియుండు!
నన్న విశిష్టమై యనియందు నీ స్తుతి యన్నము ధరియించి యమరియుండు!
నుతులచేఁ గ్రమముగ స్తుతుఁడవై యభివృద్ధిఁ బొలుపారఁగా నీవు పొందియుండు!
గీ॥ వెవఁడు బలశాత్రవాన్నంబు నెల్ల ధనముఁ
గరము హింసించి యా ధన గౌరవమున
నరదమును నిండఁజేయు నా యగ్ని కశ్వ
వాసవుల రీతిఁ బరిచర్య పరగుఁగాక!॥ 1169

(11) గీ॥ [1]అనలుఁడా! గోపవన నుతి నమరె నీవు
దాన మొసఁగితి వన్నంబు తరచు గమన
శీలుఁడవు! పాలకుండవు! చిత్త మలర
వాని యాహ్వానమును వినఁ బూనుమోయి! ॥ 1170

(12) గీ॥ సకల బాధా విశిష్టమౌ సకలలోక
మన్నమును గోరి నీ స్తుతి నాచరించు
వివిధ భీకర సంగ్రామ వీథులందు
మేలుకొనుమయ్య! జగతికి మేలు కలుఁగ!॥ 1171

(13) గద్యము॥

శత్రువుల గర్వము నడఁచువాఁడును ఋక్షపుత్రుఁడు నగు [2]ప్రతుర్యుఁ డను రాజుచే
నీయఁబడిన లోమయుతాశ్వచతుష్టయముయొక్క యున్నతలోమాంచిత
మస్తకములను నే నాహూతుఁడనై హస్తముచే సమ్మార్జించెదను ॥ 1172

(14) గద్యము॥

మిక్కిలి యన్నవంతుఁ డగు తుర్వరాజు యొక్క నాలు గశ్వములు ద్రుతగామి యగు
రథమునకుఁ బూన్పఁబడి పక్షులు త్వరగు వహించునటు లన్నమును వహించినవి ॥ 1173

---

1. "అనలుఁడు" ఒకానొక ఋషి. (సే.వేం.న.శా) 2. శుతుర్వుఁడు. (ప్రా.ప్ర.పా.)

(15) గద్యము॥

మహానదీరుపక్షి! యో జలమా! సర్వాపేక్షయా బలవంతుఁ డగు తుర్వ్యుని కంటె నశ్వముల నొసంగు వే రొకఁడు మనుష్యులలో లేఁడు॥ 1174

## సూక్తమ్—75

ఋషిః—విరూప ఆంగిరసః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ

(1) యుక్ష్వా హి దేవహూతమాగ్ం[1] అశ్వాగ్ం అగ్నే రథీరివ।
ని హోతా పూర్వ్యః సదః॥ 1359

(2) ఉత నో దేవ దేవాగ్ం[2] అచ్ఛా వోచో విదుష్టరః।
శ్రద్విశ్వా వార్యా కృధి॥ 1360

(3) త్వం హ యద్యవిష్ఠ్య సహసః సూనవాహుత।
ఋతావా యజ్ఞియో భువః॥ 1361

(4) అయమగ్నిః సహస్రిణో వాజస్య శతినస్పతిః।
మూర్ధా కవీ రయీణామ్॥ 1362

---

1. మాగ్ంఽఅశ్వాగ్ంఽఅగ్నే, 2. దేవాగ్ంఽఅచ్ఛా. (వ్రా.ప్ర.)

(5) తం నేమిమృభవో యథాఽఽ నమస్వ సహూతిభిః ।
నేదీయో యజ్ఞమఙ్గిరః ॥ 1363

(6) తస్మై నూనమభిద్యవే వాచా విరూప నిత్యయా ।
వృష్ణే చోదస్వ సుష్టుతిమ్ ॥ 1364

(7) కము ష్విదస్య సేనయా ఽగ్నేరపాకచక్షసః ।
పణిం గోషు స్తరామహే ॥ 1365

(8) మా నో దేవానాం విశః ప్రస్నాతీరివోస్రాః ।
కృశం న హాసురఘ్న్యాః ॥ 1366

(9) మా నః సమస్య దూఢ్యః పరిద్వేషసో[1] అంహతిః ।
ఊర్మిర్న నావమా వధీత్ ॥ 1367

(10) నమస్తే[2] అగ్న ఓజసే గృణన్తి దేవ కృష్టయః ।
అమైరమిత్రమర్దయ ॥ 1368

1, ద్వేషసోఽఅంహతిః, 2. నమస్తేఽఅగ్నఽఓజసే (ప్రా.ప్ర.)

(11) పవిత్ సు నో గవిష్టయే ఽగ్నే సంవేశిషో రయిమ్ ।
ఉరుకృదురు ణస్కృధి ॥ 1369

(12) మా నో[1] అస్మిన్ మహాధనే పరా వర్గ్భారభృద్యథా ।
సంవర్గం సం రయిం జయ ॥ 1370

(13) అన్యమస్మద్భియా[2] ఇయమగ్నే సిషక్తు దుచ్ఛునా ।
వర్ధా నో[3] అమవచ్ఛవః ॥ 1371

(14) యస్యాజుషన్నమస్వినః శమీమదుర్మఖస్య వా ।
తం ఘేదగ్నిర్వృధావతి ॥ 1372

(15) పరస్యా[4] అధి సంవతో ఽవరాగ్ం[5] అభ్యా తర ।
యత్రాహమస్మి తాగ్ం[6] అవ ॥ 1373

(16) విద్మా హి తే పురా వయమగ్నే పితుర్యథావసః ।
అధా తే సుమ్నమీమహే ॥ 1374

---

1, మానో ఽఅస్మిన్ మహా. 2, ద్భియా ఽఇయమగ్నే. 3, నో ఽఅమవ, 4. పరస్యా ఽఅధి,
5. పరాగ్ం ఽఅభ్యా తర, 6. తాగ్ం ఽఅవ. (బ్రా.ప్ర.)

## సూక్తము—75

ఋషి—అంగిరఃపుత్రుఁడు విరూపుఁడు
దేవత—అగ్ని

(1,2, సీ॥ రథి వలె దేవతారాజి యాహ్వానంబు విని యశ్వములఁగూర్చి వెలుఁగు మనల!
3,4) నీవు ముఖ్యుండవై నిత్యము హోతవై యుపవేశనముఁ జేయుమోయి యనల!
సురలచెంతను మమ్ముఁ గరము విద్వాంసులఁగా వచించుచు నీవు గ్రాలు మనల!
బలమున వరణీయ బహుధనంబు హవిస్సు సార్థకంబుగ నీవు సలుపు మనల!
గీ॥ బలసుపుత్రుఁడ! తరుణుఁడా! బహుళ సత్య
వంతుఁడవు నీవు ఘన యజ్ఞవంతుఁ డవుదు
వన్నముల కెల్లఁ బతి వౌదు వతుల కవివి!
ఘనశిరోయుక్తుఁడవు! ధనమునకుఁ బతివి!॥ 1175

(5) గీ॥ ఋభుగణంబుల రథనేము లెట్టు లాన
మితములుగఁ జేయుదురొ! సురతతిని గూడి
యట్లు నికటంబునం గల యజ్ఞములను
నానమితములుగాఁ జేయు మనల! నీవు ॥ 1176

(6) గీ॥ నిత్యవాక్కులు† మూలాన నిత్యతృప్తుఁ
డవుచుఁ గాంక్షితముల నెల్ల నందఁజేయు
ననలునకు[1] స్తుతుల నర్పించు నధికభక్తి
వెలుఁగుచుండు విరూపుఁడా! వివిధగతుల॥ 1177

---

† నిత్యవాక్కులు అనఁగా వేదములు. వేదములు నిత్యములు. కాని సృష్టితోఁ గూడ నవి మరలమరలఁ బుట్టుచుండుటచే ననిత్యములని చెప్పవలనుపడదు. ఇవి బ్రహ్మచేతనే ప్రవర్తింపఁజేయఁబడుచున్నవి. అప్పటి కున్న ఋషులు వేదములను విలోకమునఁ బ్రవర్తింపఁజేయుచుందురు. దీనికిఁ బ్రమాణము మహాభారతము (శాంతి.) అ 210-5-19) "యుగాంతేఽంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః। లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా"॥ భవభూతి ఉత్తర రామచరిత్ర, (1-15) బ్రహ్మర్షయో బ్రహ్మ హితాయ తప్త్వా పరఃసహస్రాః శరదస్తపాంసి। ఏతాన్యపశ్యన్ గురవః పురాణాః స్వాన్యేవ తేజాంసి తపోమయాని॥ మహర్షులు స్వయంభువుచే ననుజ్ఞాతులై యుగాంతమం దంతర్హితము లగు వేదములను నితిహాసములను బూర్వమందలి తపశ్శక్తిచే సంపాదించిరి. కావున మహర్షులు వేదములను జూచినవారే కాని రచయితలు కారు. వేదములు నిత్యములే. వేదవాఙ్మయ మంతయు నీ యభిప్రాయమునే తెలియఁజేయుచున్నది. (నే.వేం.న.శా.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(7) గీ॥ మేము ధేనుగణ నిమిత్త మెక్కువ నేత్ర
ములను గల్గు నగ్ని వెలుఁగు శిఖల
నెట్టి ఫణికి నైన నెక్కువ హింసల
జేయఁగలమె! మిగులఁ జింత లేక ॥ 1178

(8) ఉ॥ క్షీరము లిచ్చు గోవులను జెచ్చెర వీడఁగలేని యట్లు గో
వారము వత్సలన్ మిగుల వత్సలతం దక్షజియింపనట్టు లో
వీరవతంస! యగ్నివిభు! వీడక మమ్ముఁ బరిగ్రహింపుమా!
పారము లేని భక్తి గలవారము మే మల దేవతాళికిన్ 1179

(9) గీ॥ అబ్ధిభంగాళి నౌకకు నధికతరము
బాధ కలిఁగించునట్టులు పరమ దుష్ట
శత్రువులు మమ్ముఁ జేరుచు సకలవిధులఁ
బాధ కలిఁగింపకుండుతఁ! బావకుండ! ॥ 1180

(10) గీ॥ మనుజవర్గము బలమును గనఁగఁ గోరి
యనల! నీకు నమోవాక మాచరించుఁ
గావునన్ నీవు శాత్రవగణము నెల్లఁ
బరిహరింపుము! మిక్కిలి బలముఁ గలిఁగి॥ 1181

(11) గీ॥ అనల! మేము ధేను బలము నందుటకయి
తగిన రథము మాకు దాన మిడుము!
వృద్ధికర్త వౌచు వివిధవిధంబుల
వృద్ధి నొసఁగు! మాకు విశ్వమందు॥ 1182

(12) గీ॥ భారవాహి వలెను బావక! యుద్ధము
నందు మమ్మ విడువ నంద మగునె?
వైరిగణముచేతఁ బడనట్టి ధనమును
బొందవలదె! నీవు పూర్ణమహిమ॥ 1183

(13) గీ॥ బాధ లెల్ల ననల! పరజనసమితికి
భయముఁ గలుఁగఁజేసి వరలు మీవు
బలముతోడఁ గూడు బహువేగమున మాకు
వృద్ధిఁ కలుఁగనిమ్ము! వివిధగతుల॥ 1184

(14) గీ॥ బహు నమస్కారములఁ జేయు వానికర్మ
నైన దృష్టము కానట్టి యజ్ఞకర్మ
నైన సేవింపు! వారల యంతికమున
ననలుఁడు వసింపఁబోవు తా నతిశయముగ॥ 1185

(15) గీ॥ అరుల సేనల వీడుచు నన్యవీర
సేనలను బంపుచో నవి చేరు మముల
నెవరి మధ్యను నే నుండి యెసగఁగలనొ!
యట్టి వారిని రక్షింపు మనల! నీవు॥ 1186

(16) గీ॥ నీవు తండ్రివి మా కౌదు నిర్మలాగ్ని!
పూర్వ కీతిని నిప్పుడే పూర్ణరక్ష
యవగతంబయి యుండెను నందువలన
నిన్ను యాచించుచున్నాము నిఖిలసుఖము॥ 1187

## సూక్తమ్—76

ఋషిః—కురుసుతిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః — గాయత్రీ

(1) ఇమం ను మాయినం హువ[1] ఇన్ద్రమీశానమోజసా ।
మరుత్వన్తం న వృఞ్జసే ॥ 1375

(2) అయమిన్ద్రో మరుత్సఖా వి వృత్రస్యాభినచ్ఛిరః ।
వజ్రేణ శతపర్వణా ॥ 1376

1, హువఽఇన్ద్ర. (బ్రా.ప్ర.)

(3) వావృధానో మరుత్సఖేన్ద్రో వి వృత్రమైరయత్ ।
సృజన్ త్సముద్రియా[1] అపః ॥ 1377

(4) అయం హ యేన వా[2] ఇదం స్వర్మరుత్వతా జితమ్ ।
ఇన్ద్రేణ సోమపీతయే ॥ 1378

(5) మరుత్వన్తమృజీషిణమోజస్వన్తం విరప్శినమ్ ।
ఇన్ద్రం గీర్భిర్హవామహే ॥ 1379

(6) ఇన్ద్రం ప్రత్నేన మన్మనా మరుత్వన్తం హవామహే ।
అస్య సోమస్య పీతయే ॥ 1380

(7) మరుత్వాగ్ం[3] ఇన్ద్ర మీఢ్వః పిబా సోమం శతక్రతో ।
అస్మిన్ యజ్ఞే పురుష్టుత ॥ 1381

(8) తుభ్యేదిన్ద్ర మరుత్వతే సుతాః సోమాసో[4] అద్రివః ।
హృదా హూయన్త[5] ఉక్థినః ॥ 1382

1. ముద్రియా౽అపః, 2. వా౽ఇదం. 3. త్వాగ్ం౽ఇన్ద్ర, 4. సోమాసో౽అద్రివః,

5. హూయన్త౽ఉక్థినః. (బ్రా.ప్ర.)

(9) పిబేదిన్ద్ర మరుత్సఖా సుతం సోమం దివిష్టిషు ।
వజ్రం శిశాన[1] ఓజసా ॥ 1383

(10) ఉత్తిష్ఠన్నోజసా సహ పీత్వీ శిప్రే[2] అవేపయః ।
సోమమిన్ద్ర చమూ సుతమ్ ॥ 1384

(11) అను త్వా రోదసీ[3] ఉభే కక్షమాణమకృపేతామ్ ।
ఇన్ద్ర యద్దస్యుహాభవః ॥ 1385

(12) వాచమష్టాపదీమహం నవస్రక్తిమృతస్పృశమ్ ।
ఇన్ద్రాత్ పరి తన్వం మమే ॥ 1386

## సూక్తము—76

ఋషి—కణ్వగోత్రీయుఁడు కురుసుతి*

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ ప్రాజ్ఞుఁ డగు నింద్రదేవుని వైరిగణముఁ
గొట్టుటకుఁ[1] బిలిచెదను వాఁడు కూర్మి సకల
సహజ బలమునకున్ సామి సన్మరుచ్ఛ
యంబుతోఁ గూడుకొని తా ముదంబునందు॥ 1188

(2) గీ॥ ఇంద్రుఁడు మరుద్గణంబుతో నెల్లఁ గూడు
కొనుచు శతసంధియుతమైన కొత్త వజ్ర
మును ధరించుచు దానితో మోదు[2] వృత్ర
మస్తకంబును నీదు ప్రశస్తి కలుఁగ ॥ 1189

1. శిశానఽఓజసా, 2. శిప్రేఽఅవేపయః, 3. రోదసీఽఉభే (వ్రా.ప్ర.)

* "కురుసూతి" రూపాంతరము. (వ్రా.ప్ర.పా. 9వ సంపుటము 289 పుట. 15b సంపుటములోనున్న ఋషి దేవతల పట్టికలోని పాఠము.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది. 2. మోది (వ్రా.ప్ర.పా.)

(3,4, సీ॥ వర్ధితంబయి మరుద్వర్గంబుతోఁ గూడి వృత్రుని బరిమార్ప వెడలునట్టి
5,6,7,) తగఁ జరించెడు మరుద్వర్గంబుతోఁ గూడి కఠినుని బరిమార్పఁ గడలునట్టి
ఘనమరుత్తులఁ గూడుకొనుచు సోమార్థమై స్వర్గంబు విజయింప సాగినట్టి
ఘనమరుత్తులఁ గూడుకొనుచు జిగీషు వై యోజస్వి యై ప్రీతి నుండునట్టి
గీ॥ వాఁడె యింద్రుఁడు మే మల వాని నిట్టి, సోమమును ద్రావు మని ప్రత్నసూక్తివలన
యజ్ఞకర్మములం దెల్ల నధికభక్తిఁ, బిలుచుచున్నాము మిక్కిలి ఫలములందు॥ 1190

(8) గీ॥ వజ్రధారి! మరుద్దేవవర్గమునకు
సోమ మభిషుత మగుచుండె సూక్తమంత్ర
పాఠముల నుచ్చరించెడు భక్తవరులఁ
బిలుచుచున్నారు ప్రీతిని గలుఁగుచుండి॥ 1191

(9,10,సీ॥ స్వర్గసాధనభూత సవనాభిషుత మైన సోమము ద్రావుము! సోమపాయి!
11) యభిషవణార్థమై యమరెడు ఫలకమునందలి సోమము నాను మింద్ర!
బలపూర్వకంబుగ వజ్రంబు గొని దాని వాడిగఁజేయు మో వాసవుండ!
యతిబలంబున లేచి హనువులఁ గంపింపఁజేసియుండుము! ప్రీతి శ్రీమహేంద్ర!
గీ॥ శాత్రవగణంబు నెల్లను జంపుమయ్య!, దస్యు సంఘంబు నంతను ద్రచ్చుమయ్య!
నిన్ను దివి భువి కంపింప నేర్చెనయ్య!, కరము నిన్ను నుతింప మా తరమటయ్య!॥ 1192

(12) గీ॥ అష్టనవదిక్కులకు వ్యాప్త మైన యట్టి
యజ్ఞముల నెల్ల స్పృశియించి యమరునట్టి
సూక్తి వాసవుకంటెను శూన్య మగును
జేయుచున్నాఁడ నా స్తుతిఁ జిత్త మలర॥ 1193

## సూక్తమ్—77

ఋషిః—కురుసుతిః కాణ్వః

దేవతా—ఇన్ద్రః

ఛందః—గాయత్రీ, 10-11-బృహతీ, సతోబృహతీ (ప్రగాథః)

(1) జజ్ఞానో ను శతక్రతుర్వి పృచ్ఛదితి మాతరమ్।
క[1] ఉగ్రాః కే హ శృణ్విరే॥ 1387

1, కఽఉగ్రాః. (వా.ప్ర.)

(2) అవీం శవస్యబ్రవీదౌక్థ్యమహీశువమ్ ।
తే పుత్ర సన్తు నిష్టురః ॥ 1388

(3) సమిత్ తాన్ వృత్రహాఖిదత్ ఖే[1] అరాగం ఇవ ఖేదయా ।
ప్రవృద్ధో దస్యుహాభవత్ ॥ 1389

(4) ఏకయా ప్రతిధాపిబత్ సాకం సరాంసి [2]త్రింశతమ్ ।
ఇన్ద్రః సోమస్య కాణుకా ॥ 1390

(5) అభి గన్ధర్వమతృణదబుధ్నేషు రజఃస్వా ।
ఇన్ద్రో బ్రహ్మభ్య[3] ఇద్వృధే ॥ 1391

(6) నిరావిధ్యద్గిరిభ్య[4] ఆ ధారయత్ పక్వమోదనమ్ ।
ఇన్ద్రో బున్దం స్వాతతమ్ ॥ 1392

(7) శతబ్రధ్న[5] ఇషుస్తవ సహస్రపర్ణ[6] ఏక ఇత్ ।
యమిన్ద్ర చకృషే యుజమ్ ॥ 1393

---

1. ఖత్ ఖేఽఅరాగంఽఇవ, 2. త్రిశఽమ్. 3. బ్రహ్మభ్యఽఇద్వృధే, 4. రిభ్యఽఆ ధారయత్,
5. బ్రధ్నఽఇషు, 6. పర్ణఽఏకఽఇత్. (ప్రా.ప్ర.)

(8) తేన స్తోతృభ్య[1] ఆ భర నృభ్యో నారిభ్యో[2] అత్తవే ।
సద్యో జాత[3] ఋభుష్ఠిర ॥ 1394

(9) ఏతా చ్యౌత్నాని తే కృతా వర్షిష్ఠాని పరీణసా ।
హృదా వీడ్వధారయః ॥ 1395

(10) విశ్వేత్ తా విష్ణురాభరదురుక్రమస్త్వేషితః ।
శతం మహిషాన్ క్షీరపాకమోదనం వరాహమిన్ద్ర[4] ఏముషమ్ ॥ 1396

(11) తువిక్షం తే సుకృతం సూమయం ధనుః సాధుర్బున్దో హిరణ్యయః ।
ఉభా తే బాహూ రణ్యా సుసంస్కృత[5] ఋదూపే చిదృదూవృధా ॥ 1397

## సూక్తము—77

ఋషి—కణ్వగోత్రీయుఁడు కురుసుతి*

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ ఇంద్రదేవుఁడు జనియించి యెల్ల కర్మ
యుక్తుఁడై తల్లిఁ బ్రశ్నించె "నోసి యంబ!
సుప్రసిద్ధిని గాంచిన శూరుఁ డెవ్వఁ
డుగ్రుఁడై సర్వవిధముల నుండె" ననుచు॥ 1194

---

1. స్తోతృభ్య ఆ భర, 2. నారిభ్యో అత్తవే, 3. జాత ఋభుష్ఠిర, 4. మిన్ద్ర ఏముషమ్,
5. సంస్కృత ఋదూపే. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 293 పుట) ఋషి "పురుసూతి"గాను, 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "కురుసూతి"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ "ఊర్ణనాభుఁ దశిశువు లున్నవారు
వారలను ధిక్కరించుట పాడి యగును"
ననుచుఁ దక్షణమే పల్కె నంబ శవసి
పుత్రకునితోడ సంతుష్టపూర్ణ యగుచు ॥ 1195

(3) గీ॥ రజ్జువులతోడ నా నార రాజి వలెను
వారి నాకర్షణముఁ జేసి వాసవుండు
సకలదస్యుగణంబులఁ జంపి చంపి
సుప్రసిద్ధుఁడు కాఁడఁటె! సొంపు మీర ॥ 1196

(4,5) ఉ॥ సుందరరూపముల్ గలిఁగి శోభిలుచుండెడు పాత్రలందు ని
స్పందత నున్న సోమమును వజ్రి గ్రహించుచు మూలశూన్యతన్
బొందిన యంతరిక్షమును బొందిన భక్తుల వృద్ధికై మహా
నందము మీర మేఘముల నాలుగు దిక్కులనుండి కొట్టఁడే! 1197

(6) గీ॥ వజ్రిపక్వాన్నమును సిద్ధపరచుచుండి
విస్తృతములైన బాణముల్ వేగఁదాల్చి
మేఘమండలి నంత నమేయశక్తి
తోడ ఛేదించి యుండఁడె? తుష్టి వజ్రి ॥ 1198

(7) గీ॥ ఇంద్రదేవుఁడ! నీదైన యేకమాత్ర
బాణము శతాగ్రయుక్తమై పరగి వేయి
పత్రములతోడఁ గూడుచుఁ బరిఢవిల్లె
దానికిన్ సాయ మొనరించి తనియు మీవు ॥ 1199

(8) క॥ స్తుతికర పురుషవరస్త్రీ
తతి కాహారంబు దెమ్ము! తక్షణమే యీ
తతబాణమువలనను నీ
వతిశయముగ స్థిరత నొందుమా! వాసవుఁడా! ॥ 1200

(9) గీ॥ వృద్ధిఁ బొందుచు మిక్కిలి వివిధదశలఁ
బరిణతం బైన పర్వతపంక్తి నీవు
జగతి నిర్మించినాఁడవు! చతుర బుద్ధి
స్థిరముగా వాని దాల్చుము! శ్రీమహేంద్ర! ॥ 1201

(10) ఉ॥ నీ కడ నున్న వారులను నీకె సమర్పణఁ జేసె విష్ణు వ
స్తోకము లైన వస్తువుల శూరుఁడ! యందఁగ నిచ్చుచుండు వే
సాకులు చెప్పకుండ మహిషంబులు నూరును దుగ్ధపక్వమై
శ్రీకరమైన యన్నమును జేర్చితి వీవు! వరాహపంక్తిలోన్ ॥ 1202

(11) ఉ॥ నీదు మనస్సు వాసవ! సునిర్మితమై సుఖదాయకంబునై
యాదర మొప్ప బాణముల నంతటఁ జిమ్ముచు నుల్లసిల్లదే!
నీదగు బాణపంక్తి యతినిర్మల రుక్మమయంబు వెండియున్
నీదగు బాహుయుగ్మము వినింద్యము కాదఁటె! మర్మ భేదియై ॥ 1203

## సూక్తమ్—78

ఋషిః — కురుసుతిః కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ, 10-బృహతీ

(1) పురోళాశం[1] నో అన్ధస ఇన్ద్ర సహస్రమా భర ।
శతా చ శూర గోనామ్ ॥ 1398

(2) ఆ నో భర వ్యఞ్జనం గామశ్వమభ్యఞ్జనమ్ ।
సచా మనా హిరణ్యయా ॥ 1399

---

1. పురోళాశం నోఽఅన్ధసఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(3) ఉత నః కర్ణశోభనా పురూణి ధృష్ణవా భర ।

త్వం హి శృణ్విషే వసో ॥ 1400

(4) నకీం వృధీక[1] ఇన్ద్ర తే న సుషా న సుదా[2] ఉత ।

నాన్యస్త్వచ్ఛూర వాఘతః ॥ 1401

(5) నకీమిన్ద్రో నికర్తవే న శక్రః పరిశక్తవే ।

విశ్వం శృణోతి పశ్యతి ॥ 1402

(6) స మన్యుం మర్త్యానామదబ్ధో ని చికీషతే ।

పురా నిదశ్చికీషతే ॥ 1403

(7) క్రత్వ[3] ఇత్ పూర్ణముదరం తురస్యాస్తి విధతః ।

వృత్రఘ్నః సోమపావ్నః ॥ 1404

(8) త్వే వసూని సంగతా విశ్వా చ సోమ సౌభగా ।

సుదాత్వపరిహ్వృతా ॥ 1405

---

1. వృధీకఽఇన్ద్ర. 2. సుదాఽఉత. 3. క్రత్వఽఇత్పూర్ణ. (ప్రా.ప్ర.)

(9) త్వామిద్యవయుర్మమ కామో గవ్యుర్హిరణ్యయుః ।
త్వామశ్వయురేషతే ॥ 1406

(10) తవేదిన్ద్రాహమాశసా హస్తే దాత్రం చనా దదే ।
దినస్య వా మఘవన్ త్సంభృతస్య వా పూర్ధి యవస్య కాశినా॥ 1407

## సూక్తము—78

ఋషి—కాణ్వుఁడైన కురుసుతి*
దేవత—ఇంద్రుఁడు

(1,2, సీ॥ ఇంద్ర! పురోడాశ మెల్ల గ్రహించుచు గో దానమును మాకుఁ గూర్పవలదె?
3,4) యశ్వదానంబుల నందిచుచున్ మాకు హేమభూషణముల నీయవలదె?
యెలమి నీ కథలను నెల్ల నాలించెదఁ జెవుల భూషావళిఁ జేర్పవలదె?
శాత్రవులకుఁ బరాజయము గావించుచు సదన్నప్రదాతలై సాగవలదె?
గీ॥ ఎవఁడు? నీకంటె భిన్నుఁడు వృద్ధికారి
యుత్తముం డెవఁడు? నీకంటె నోయిదేవ!
దాత యెవ్వఁడు నీకంటె? ధన్యులైన
ఋత్విజుల కెల్ల నేతయౌ నెవఁడు చెపుమ! ॥ 1204

(5,6, సీ॥ హరి యందఱి కవజ్ఞ నాచరించుచునుండు నతఁడు పరాభూతి నందకుండు
7) నతఁడు జగంబుల నందంబుగాఁ జూచు వీనులతో నెల్ల వినుచునుండు
నతఁడు కోపమునకు నంతస్సు నొసఁగఁడు మానవ హింసలఁ గానకుండు
నతనికి నపనింద లంటక గతియించు నతఁడు త్వరాయుక్తుఁ డగుచునుండు
గీ॥ నతఁడు వృత్రుని వధియించి యమరుచుండు
నతఁడు సోమంబు నే వేళ నానుచుండు
నట్టి యింద్రుని యుదరంబు నెట్లో పూత
కర్మమూలాన నిండింత్రు కర్మపరులు ॥ 1205

(8) క॥ హరి! ధన సౌభాగ్యంబులు
కరము నినుం బొందుచుండు ఘనసోమరతా
సురుచిర మగు నీ దానము
నిరతం బకుటిలితఁ గాంచు నిశ్చయ మిదియే! ॥ 1206

* కురుసూటి. (బ్రా.ప్ర.పా. 15b సంపుటములోని పాఠము.)

(9) సీ॥ మా మానసము భక్తి మరువక యవలను నభిలషించుచుఁ బ్రీతి నమరుచుండు
మా మానసము భక్తి మరువక గోవుల నభిలషించుచుఁ బ్రీతి నమరుచుండు
మా మానసము భక్తి మరువక స్వర్ణంబు నభిలషించుచుఁ బ్రీతి నమరుచుండు
మా మానసము భక్తి మరువక సర్వంబు నభిలషించుచుఁ బ్రీతి నమరుచుండు
గీ॥ నింద్ర! నీపైని నాశల నెల్లఁ బెట్టి
పాత్రములఁ బూనినారము పాణులందుఁ
బూర్వవిచ్ఛిన్న యవలనో! పూర్వసంగృ
హీత యవలనో! ముష్టితో నీయు మీవు ॥ 1207

## సూక్తమ్—79

ఋషిః—కృత్నుర్భార్గవః
దేవతా—సోమః
ఛందః—గాయత్రీ, 9-అనుష్టుప్

(1) అయం కృత్నురగృభీతో విశ్వజిదుద్భిదిత్ సోమః ।
ఋషిర్విప్రః కావ్యేన ॥ 1408

(2) అభ్యూర్ణోతి యన్నగ్నం భిషక్తి విశ్వం యత్ తురమ్ ।
ప్రేమన్ధః ఖ్యన్నిః శ్రోణో భూత్ ॥ 1409

(3) త్వం సోమ తనూకృద్భ్యో[1] ద్వేషోభ్యోఽన్యకృతేభ్యః ।
ఉరు యన్తాసి వరూథమ్ ॥ 1410

(4) త్వం చిత్తీ తవ దక్షైర్దివ[2] ఆ పృథివ్యా ఋజీషిన్ ।
యావీరఘస్య చిద్ ద్వేషః ॥ 1411

1. తనూక్నద్భ్యః, 2. దివఽఆ పృథివ్యాఽఋజీషిన్. (వ్రా.ప్ర.)

(5) అర్థినో యన్తి చేదర్థం గచ్ఛానిద్దదుషో రాతిమ్ ।
వవృజ్యుస్తృష్యతః కామమ్ ॥ 1412

(6) విదద్యత్ పూర్వ్యం నష్టముదీమృతాయుమీరయత్ ।
ప్రేమాయుస్తారీదతీర్ణమ్ ॥ 1413

(7) సుశేవో నో [1]మృళయాకురదృప్తక్రతురవాతః ।
భవా నః సోమ శం హృదే ॥ 1414

(8) మా నః సోమ సం వీవిజో మా వి బీభిషథా రాజన్ ।
మా నో హార్ది త్విషా వధీః ॥ 1415

(9) అవ యత్ స్వే సధస్థే దేవానాం దుర్మతీరీక్షే ।
రాజన్నప ద్విషః సేధ మీఢ్వో[2] అప స్రిధః సేధ ॥ 1416

---

1. మృడయాకు, 2. మీఢ్వోఽఅప. (ప్రా.ప్ర.)

## సూక్తము — 79

ఋషి — భార్గవుఁడైన కృత్నుఁడు †
దేవత — సోముఁడు

(1) గీ॥ ఇట్టి సోముఁడె కర్తయౌ, నెవఁడు వీని
సంగ్రహింపంగఁగలవాఁడు? సకలజేత
యుద్భిదుఁడు, మౌని, మేధావి, యోగి సమస్త
సంస్తుతుఁడు కాఁడె? యాతఁడు సకలవిధుల ॥ 1208

(2) క॥ రుగ్ణుల కారోగ్యము నిడు
నగ్నుల కాచ్ఛాదనమున నర్థుండయి యు
ద్విగ్నము విడి దర్శన మిడు
భగ్నులు పంగులకు సోమపతి సంప్రీతిన్ ॥ 1209

(3) గీ॥ దేవసోమ! నీవు దేహశోభ కృశింపఁ
జేయువాఁడ వౌ దమేయ విప్రి
యములనుండి మమ్ము సమముగఁ దప్పించి
రక్ష లొసఁగు! మాకు రాజు వౌట ॥ 1210

(4,5,6) గద్యము॥

ఋషీషసోమవంతుఁడా! నీవు ప్రజ్ఞాబలంబులతో ద్యోలోకమునుండి భూలోకమునుండి
శత్రుకార్యము మమ్ముఁ జెందకుండ నొనర్పుము! ధనాభిలాషులు ధనవంతుల
చెంతకు వెడలినచో వారివలన ధనమును బొందఁగలరు. భిక్షువుల
కాంక్షితము లీడేరును. పురాణనష్టధనమును బొందుదువు! కాఁబట్టి
యజ్ఞాభిలాషులను ప్రేరేపింపుము! దీర్ఘాయువు నొసంగుము! ॥ 1211

(7) గీ॥ సోమదేవుఁడ! మా చిత్తసుందరుఁడవు!
యజ్ఞసంపాదకుండ వత్యంతసుఖము
నొసఁగువాఁడవు! నీ వౌదు [1]వొనర రమ్య
మంగళకరుండ వౌదువు! మాకు మిగుల ॥ 1212

---

† కృత్నునకుఁ గృత్నుఁడని పాఠాంతరము కలదు. వ్రాతప్రతిలో (9వ సంపుటము-297 పుట) కృత్నుఁడుగాను, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "కృత్నుఁడు"గాను, ఋషినామము శ్రీనేమానివారు వ్రాసిరి.

1. సకల రమ్య (వ్రా. ప్ర పా. యతిభంగము)

(8,9) సీ॥ సరససోముఁడ! మమ్ముఁ జంచలాంగుల వలె నీవు సేయకు మతినిష్ఠఁ బూని
రాజ! మమ్ముల నీవు రంజింపఁజేసి మా భయమును గొట్టుము! పంత మూని
దీప్తితో మా చిత్తదీప్తిని దొలఁగింప యత్నముఁ జేయకు! యత్న మూని
యిట్లన్ని విధముల నెంతయు శ్రద్ధతోఁ బాలింపు! మమ్ములఁ బంత మూని
గీ॥ నీ గృహంబున దుష్టులౌ నిఖిలసురలు
లలిఁ బ్రవేశింపఁగలరఁటె? బల విరాజ
మానశత్రుల, హింసకసంఘములను
దుష్టు తొలఁగింపుచుండుమా! సోమసేక్త! ॥ 1213

## సూక్తమ్—80

ఋషిః—ఏకద్యూర్నౌధసః
దేవతా—ఇన్ద్రః, 10-దేవాః
ఛందః—గాయత్రీ, 10-త్రిష్టుప్

(1) నహ్యఙ్గన్యం బళాకరం మర్డితారం శతక్రతో ।
త్వం న[1] ఇన్ద్ర మృళయ ॥ 1417

(2) యో నః శశ్వత్ పురావిథాఽమృధ్రో వాజసాతయే ।
స త్వం న[1] ఇన్ద్ర మృళయ ॥ 1418

(3) కిమఙ్గ రధ్రచోదనః సున్వానస్యావితేదసి ।
కువిత్ స్విన్ద్ర ణః శకః ॥ 1419

(4) ఇన్ద్ర ప్ర ణో రథమవ పశ్చాచ్చిత్ సన్తమద్రివః ।
పురస్తాదేనం మే కృధి ॥ 1420

1. నః–ఇన్ద్ర మృడయ. (ప్రా.ప్ర.)

(5) హన్తో ను కిమాససే ప్రథమం నో రథం కృధి ।
ఉపమం వాజయు శ్రవః ॥ 1421

(6) అవా నో వాజయుం రథం సుకరం తే కిమత్ పరి ।
అస్మాత్సు[1] జిగ్యుషస్కృధి ॥ 1422

(7) ఇన్ద్ర దృహ్యస్వ పూరసి భద్రా త[2] ఏతి నిష్కృతమ్ ।
ఇయం ధీర్ఋత్వియావతీ ॥ 1423

(8) మా సీమవద్య[3] ఆ భాగుర్వీ కాష్ఠా హితం ధనమ్ ।
అపావృక్తా[4] అరత్నయః ॥ 1424

(9) తురీయం నామ యజ్ఞియం యదా కరస్తదుశ్మసి ।
ఆదిత్ పతిర్న[5] ఓహసే ॥ 1425

(10) అవీవృధద్వో[6] అమృతా అమన్దీదేకద్యూర్దేవా[7] ఉత యాశ్చ దేవీః ॥
తస్మా[8] ఉ రాధః కృణుత ప్రశస్తం ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 1426

1. కస్మాత్సు, 2. భద్రా తం ఏతి. 3. వద్యఽఆ భాగు, 4. వృక్తాఽఅర్న, 5. పతిర్నఽఓహసే,
6. ధద్వోఽఅమృతాఽఅమన్దీ, 7. దేవాఽఉత, 8. తస్మాఽఉ. (వ్రా.ప్ర.)

## సూక్తము—80

ఋషి—నోధసుని పుత్రుఁ డేకద్యూఁడు
దేవత—ఇంద్రుఁడు, 10-దేవతలు*

(1) గద్యము॥

ఇంద్రుఁడా! నీకంటె భిన్నుఁడగు సుఖదాతకు బహుమాన మొసంగుము! శతక్రతూ!
మమ్ము సుఖవంతులనుగాఁ జేయుము! ॥ 1214

(2) గద్యము॥

అహింసకుఁ డగు నే యింద్రుఁడు పూర్వ మన్నమునకై మిమ్ము రక్షించునో! వాఁడు
సర్వదా మమ్ము రక్షించుఁగాక! ॥ 1215

(3) గద్యము॥

ఓ యింద్రుఁడా! యారాధకులను బ్రవర్తితులుగా నొనర్పుము! నీ వభిషవకారులకు
రక్షకుఁడవు! కావున మాకు ధన మొసంగుము! ॥ 1216

(4) గద్యము॥

ఇంద్రుఁడా! నీవు మా వెనుక నున్న రథమును గాపాడుము! ఓ వజ్రీ! దానిని
సమ్ముఖమునకుఁ దెమ్ము! ॥ 1217

(5)గద్యము॥

ఓ హంత! యింద్ర! నీ వీ సమయమందు శబ్దశూన్యుఁడవై యున్నావు! మాకు
రథము నొసంగుము! అన్నాభిలాషివై యన్న సమీపవర్తివి కమ్ము! ॥ 1218

(6)గద్యము॥

అన్నాభిలాషి యగు మా రథమును రక్షింపుము! నీకుఁ గర్తవ్యకార్య మెద్ది? సర్వ
విధముల సంగ్రామములయందు మమ్ము జయశీలురుగ నొనర్పుము! ॥ 1219

---

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 299 పుట) "ఇంద్రుఁడు" దేవతగా వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ఇంద్రుఁడు, దేవతలు" దేవతగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(7) గద్యము॥

ఇంద్రుడా! దృఢుడ వగుము! నగరము వలె మంగళమయుడవు! స్తుతిక్రియ
యథాకాలమున నిన్నుఁ జేరును. నీవు యజ్ఞ నిష్పాదకుడవు! ॥ 1220

(8) గద్యము॥

నిందాభాక్కు లగు వారు మా కడకు రాకుందురుగాక! విస్తీర్ణదిక్కులందు నిహిత మగు
ధనము మాదే యగు. శత్రువులు నశింతురు ॥ 1221

(9) గద్యము॥

ఓ యింద్రుడా! నీవు యజ్ఞసంబంధ మగు చతుర్థనామమును ధరించినావు! కావున
మేము దానిని గోరుచున్నాము. నీవే మాకుఁ బాలకుడవు! నీవే మమ్ముఁ
బ్రతిపాలించువాడవు ॥ 1222

(10) గద్యము॥

మరణరహిత మగు దేవగణమా! ఏకద్యూ ఋషి మమ్ములను దేవతలను వృద్ధిఁ
బరచుచున్నాడు. సంతృప్తులుగాఁ జేయుచున్నాడు. వారి నుద్దేశించి మధు రసము
నొసంగుము! కర్మధనుఁ డగు నింద్రుడు ద్రుతతరముగ వచ్చుఁగాక! ॥ 1223

## అనువాకః—9, సూక్తమ్—81

ఋషిః—కుసీదీ కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ఆ తూ న[1] ఇన్ద్ర క్షుమన్తం చిత్రం గ్రాభం సం గృభాయ।
మహాహస్తీ దక్షిణేన॥ 1427

---

1. తూ నఽఇన్ద్ర (ప్రా.ప్ర.)

(2) విద్మా హి త్వా తువికూర్మిం తువిదేష్ణం తువీమఘం ।
తువిమాత్రమవోభిః ॥ 1428

(3) నహి త్వా శూర దేవా న మర్తాసో దిత్సన్తమ్ ।
భీమం న గాం వారయన్తే ॥ 1429

(4) ఏతో న్విన్ద్రం స్తవామేశానం వస్వః స్వరాజమ్ ।
న రాధసా మర్ధిషన్నః ॥ 1430

(5) ప్ర స్తోషదుప గాసిషచ్ఛ్రవత్ సామ గీయమానమ్ ।
అభి రాధసా జుగురత్ ॥ 1431

(6) ఆ నో భర దక్షిణేనాభి సవ్యేన ప్ర మృశ ।
ఇన్ద్ర మా నో వసోర్నిర్భాక్ ॥ 1432

(7) ఉప క్రమస్వా భర ధృషతా ధృష్ణో జనానామ్ ।
అదాశూష్టరస్య వేదః ॥ 1433

(8) ఇన్ద్ర య[1] దు ను తే అస్తి వాజో విప్రేభిః సనిత్వః ।
అస్మాభిః సు తం సనుహి ॥ 1434

(9) సద్యోజువస్తే వాజా[2] అస్మభ్యం విశ్వశ్చన్ద్రాః ।
వశైశ్చ మక్షూ జరన్తే ॥ 1435

ఇతి
షష్ఠోఽష్టకే పంచమోఽధ్యాయ
స్సమాప్తః

## అనువాకము—9, సూక్తము—81

ఋషి—కణ్వగోత్రీయుఁడు కుసీది
దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు మహాహస్త విశిష్టుఁడవు! నీవు మా కొసంగుటకై శబ్దవంతము, విచిత్రము, గ్రహణయోగ్యము నగు ధనము దక్షిణహస్తమున గ్రహింపుము! ॥ 1224

(2) గద్యము॥

ఇంద్రా! నిన్ను మే మెరుఁగుదుము! నీవు బహుకర్మ గలవాఁడవు! బహుదాతవు! బహురక్షాయుక్తుఁడవు! ॥ 1225

(3) గద్యము॥

శూరుఁడ వగు నింద్రుఁడా! నీవు దాన మిచ్చుటకు నిశ్చయించినచో దేవతలు, మనుష్యులు, భయంకర వృషభమును వలె నిన్ను నివారించుట యశక్యము ॥ 1226

---

1. ఇన్ద్ర యఽఉ ను తేఽఅస్తి, 2. వాజాఽఅస్మభ్యం. (ప్రా.ప్ర.)

(4) గద్యము॥

ఓ మా జనులారా! మీరు రండు! ఇంద్రుని స్తుతింపుఁడు! అతఁడు స్వయముగా దీప్యమాన ధనపతి. అన్యధనవంతుని వలె ధనముపలన బాధఁగలిఁగింపకుండుఁగాక! ॥ 1227

(5) గద్యము॥

ఇంద్రుఁడు మా స్తుతిని ప్రశంసించుఁగాక! ధనవంతుఁడై మమ్ములను నను గ్రహించుఁగాక! ॥ 1228

అర్థాంతరము*

*విప్రాస మధురగతి రగడ॥

మా సామ గానాల మహితేంద్రుఁ డొగి మెచ్చి
ధనరాసులను నిచ్చి ఘన తృప్తి పరచుతను! ॥ 1229

(6) గద్యము॥

ఇంద్రుఁడా! మమ్ముఁ జూచ రమ్ము! వామ హస్తముచే దాన మొసంగుము! మమ్ము ధనమునుండి వేరుపరచకుము! ॥ 1230

(7) గద్యము॥

ఇంద్రా! ధనము చెంతకు వెడలుము! శత్రువులను దిరస్కరించువాఁడా! సాహంకార మనస్సుతో నదాత లగు వారి ధనమును సంగ్రహింపుము! 1231

(8) గద్యము

ఇంద్రుఁడా! విప్రగణభజనీయుఁడా! యాచింపఁబడినవాఁడవై మాకు ధనం బొసంగుము! ॥ 1232

*రచయిత :— వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9) గద్యము

ఇంద్రుడా! నీ యన్నము మా చెంతకు శీఘ్రముగ వచ్చుగాక! మా స్తోతలు
నానాభిలాషయుక్తులై త్వరితముగ మిమ్ముల స్తుతించుచున్నారు ॥ 1233

ఇయ్యది
శ్రీ భారద్వాజగోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
షష్ఠాష్టకమునఁ బంచమాధ్యాయము
**సంపూర్ణము**



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### షష్ఠోఽష్టకః — షష్ఠోఽధ్యాయః

### సూక్తమ్ — 82

ఋషిః—కుసీదీ కాణ్వః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ఆ ప్ర ద్రవ పరావతో ఽర్వావతశ్చ వృత్రహన్ ।
మధ్వః ప్రతి ప్రభర్మణి ॥ 1436

(2) తీవ్రాః సోమాస[1] ఆ గహి సుతాసో మాదయిష్ణవః ।
పిబా దధృగ్యథోచిషే ॥ 1437

(3) ఇషా మన్దస్వాదు తే ఽరం వరాయ మన్యవే ।
భువత్ త ఇన్ద్ర శం హృదే ॥ 1438

---

1. సోమాసఽఆ గహి. (ప్రా.ప్ర.)

(4) ఆ త్వాశత్రవా గహి న్యుక్థాని చ హూయసే ।
ఉపమే రోచనే దివః ॥ 1439

(5) తుభ్యాయమద్రిభిః సుతో గోభిః శ్రీతో మదాయ కమ్ ।
ప్రసోమ[1] ఇన్ద్ర హూయతే ॥ 1440

(6) ఇన్ద్ర శ్రుధి సు మే హవమస్మే సుతస్య గోమతః ।
వి పీతిం తృప్తిమశ్నుహి ॥ 1441

(7) య[2] ఇన్ద్ర చమసేష్వా సోమశ్చమూషు తే సుతః ।
పిబేదస్య త్వమీశిషే ॥ 1442

(8) యో[3] అప్సు చన్ద్రమా ఇవ సోమశ్చమూషు దదృశే ।
పిబేదస్య త్వమీశిషే ॥ 1443

(9) యం తే శ్యేనః పదాభర తిరో రజాంస్యస్పృతమ్ ।
పిబేదస్య త్వమీశిషే ॥ 1444

---

1. ప్ర సోమఽఇన్ద్ర, 2. యఽఇన్ద్ర, 3. యోఽఅప్సు చన్ద్రమాఽఇవ. (ప్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—షష్ఠాధ్యాయము

### సూక్తము—82

ఋషి—కణ్వగోత్రీయుఁడు కుసీది*

దేవత—ఇంద్రుఁడు*

(1) గీ॥ దూరమందు నున్నఁ జేరువ నున్నను
వృత్రహంత! నీవు విలసిత పశు
సంగ్రహంబు గల్గు జన్నంబునకుఁ గదు
నభిముఖముగ శీఘ్ర మరుగఁదెమ్ము! ॥ 1234

(2) గద్యము॥

వేగము మదమును బుట్టించునవి, మాదన శీలములు నగు సోమములు నీ నిమిత్త
మభిషుతము లైనవి. నీవు మా యజ్ఞమునకు వచ్చి యా రసమును ద్రావుము!
అప్పుడు నీవు ప్రగల్భుఁ డవై యథా కామము గ్రోలుము! ॥ 1235

(3) గీ॥ సోమరూపాన్నమునఁ దుష్టి శోభ నందు
మింద్ర! నీ క్రోధము హరింప నీ సుసోమ
రసము పర్యాప్త మగుచు నీ రాజమాన
చిత్తమున కెల్ల సుఖమును జేయుఁగాక! ॥ 1236

* వ్రాతప్రతిలో (9వ సంపుటము.306పుట) ఋషినామము వ్రాయకయే పొరపాటున "కణ్వపుత్రుఁడు సీదుఁడు" దేవతగా వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "కుసీది" ఋషిగను, "ఇంద్రుఁడు" దేవతగను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(4) గద్యము॥

సపత్నీ సహితుఁడా! నీవు మా యజ్ఞమునకు రమ్ము! అగ్నులచే దీప్యమాన సమీపమునందు
నుక్థముల నుద్దేశించి నీ వాహ్వానింపఁబడుచున్నావు! ॥ 1237

(5) గీ॥ ఇంద్ర! గ్రావలచే సోమ మెల్ల నీకు
నభిషుతంబయి ధేను పయస్సుఁ గూడి
సంస్కృతంబయి మిక్కిలి శక్తి నీకు
వెలయఁజేయంగ నగ్నిని వేల్వఁబడియె ॥ 1238

(6) క॥ విను మింద్రుఁడ! మా పిలుపులఁ
బనిగొని నుత సోమ రస సుపాన క్రియచే
ననయముఁ దృప్తిం బొందుము!
ఘనసోమము దుగ్ధరసము కల విచ్చటనే! ॥ 1239

(7) గీ॥ ఇంద్రదేవుఁడ! నీవు సోమేశ్వరుఁడవు!
కాన సోమము ద్రావుము! కరుణఁ బూని
నీ నిమిత్తము సోమము నిఖిల చమస
పాత్రలం దభిషుతమౌచుఁ బరగుచుండె ॥ 1240

(8) గీ॥ ఇంద్రదేవుఁడ! నీవు సోమేశ్వరుండ
వగుటచే నంతరిక్షాన నమల చంద్రుఁ
డక్షులకు గోచరుం డగు నల గ్రహంబు
లందుఁ గన్పట్టుచుండెడ వంద మొప్ప ॥ 1241

(9) గీ॥ ఇంద్రదేవుఁడ! నీవు సోమేశ్వరుండ
వగుట, శ్యేనము నీకయి యఖిలసోమ
పాలకులఁ గెల్చుచున్ శత్రుపంక్తి ముట్ట
నట్టి సోమము పదములఁ బట్టి తెచ్చె ॥ 1242

## సూక్తమ్—83

ఋషిః—కుసీదీ కాణ్వః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—గాయత్రీ

(1) దేవానామిదవో మహత్ తదా వృణీమహే వయమ్ ।
[1]వృష్ణామస్మభ్యమూతయే ॥ 1445

(2) తే నః సన్తు యుజః సదా వరుణో మిత్రో[2] అర్యమా ।
వృధాసశ్చ ప్రచేతసః ॥ 1446

(3) అతి నో విష్పితా పురు నౌభిరపో న పర్షథ ।
యూయమృతస్య రథ్యః ॥ 1447

(4) వామం నో[3] అస్త్వర్యమన్ వామం వరుణ శంస్యమ్ ।
వామం హ్యావృణీమహే ॥ 1448

(5) వామస్య హి ప్రచేతస[4] ఈశానాసో రిశాదసః ।
నేమాదిత్యా[5] అఘస్య యత్ ॥ 1449

---

1. వృష్ణామ, 2. మిత్రో౽అర్యమా, 3. నో౽అస్త్వర్యమన్, 4. ప్రచేతస౽ఈశానాసో,
5. దిత్యా౽అఘస్య. (వా.ప్ర.)

(6) వయమిద్వః సుదానవః క్షియన్తో యాన్తో[1] అధ్వన్నా ।
దేవా వృధాయ హూమహే ॥ 1450

(7) అధి న[2] ఇన్ద్రైషాం విష్ణో సజాత్యానామ్ ।
ఇతా మరుతో[3] అశ్వినా ॥ 1451

(8) ప్ర భ్రాతృత్వం సుదానవో ఽధ ద్వితా సమాన్య ।
మాతుర్గర్భే భరామహే ॥ 1452

(9) యూయం హి ష్ఠా సుదానవ[4] ఇన్ద్రజ్యేష్ఠా అభిద్యవః ।
అధా చిద్వ[5] ఉత బ్రువే ॥ 1453

## సూక్తము—83

ఋషి— కణ్వపుత్రుఁడు కుసీదుఁడు*
దేవత—విశ్వే దేవతలు

(1) గద్యము॥

దేవతలారా! స్వతేజస్సుచే సర్వతోదీప్యమాను లగు మీ పాలనమును గోరుచున్నాము. అట్లు కోరుట మేము రక్షలను బొందుటకే! ॥ 1248

---

1. యాన్తోఽఅధ్వన్నా. 2. అధి నఽఇన్ద్రైషాం, 3. మరుతోఽఅశ్వినా, 4. సుదానవఽఇన్ద్రజ్యేష్ఠాఽఅభిద్యవః,

5. చిద్వఽఉత. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 307పుట) ఋషి "కణ్వపుత్రుఁడు కుసీదుఁడు" గా వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "కుసీది"గా శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ దేవవరుణులు మిత్రుఁడై మెలఁగు నర్య
ముండు మాకు సహాయము మోద మలరఁ
జేయుదురుగాక! విజ్ఞాన చిత్తు లగుచు
ధనము కలిఁగించెదరుగాకఁ! దక్షిణంబు ॥ 1244

(3) గీ॥ నావికోత్తముఁ డెట్టులు నౌకవలన
జలము తీరముఁ జేర్చునో! జనుల, నట్లు
యజ్ఞనాయకులార! మీ రరులనుండి
మములఁ దప్పింపుఁ డిప్పుడు సముచితముగ ॥ 1245

(4) గీ॥ అధికమౌ ధన మే మెల్ల నడుగుచున్న
వార మగుట సునర్యమ! వరుణదేవ!
స్తుత్యమై యొప్పి భజనీయశోభ నందు
ధనము మా కగుఁగాక! నీ క్షణమునందు ॥ 1246

(5) గద్యము॥

ప్రకృష్టజ్ఞానులును, శత్రుక్షేపకులును నగు దేవతలారా! మీరు సంభజనీయధనమునకు
స్వాములు! కావున మిమ్ము ధనమును యాచించుచున్నాను. *ఏ ధనము పాపులకుఁ
జెందియున్నదో! యా పాప ధనము నన్నుఁ బొందకుండునుగాక! ॥ 1247

(6) గీ॥ అగ్నిహోత్రార్థమై గృహమందు నున్న
వార మైనను, సమిధలఁ బడయ వెడలు
చున్నవారల మైనను, నో సుదాసు
లార! మిమ్ములఁ బిలుతు నపారభక్తి ॥ 1248

(7) గీ॥ ఓ మరుత్తులు! విష్ణువా! యోయి యింద్ర!
మా సజాత్యుల మధ్యను మమ్ము మీరు
గౌరవపురస్సరంబుగాఁ గనికరించి
తెలిసికొనియుండుఁడీ! తేటతెల్లముగను ॥ 1249

---

* ఏ ధనము పాపమునకుఁ జెందియున్నదో యా ధనము నన్నుఁ బొందనుగాక: ॥ (వ్రా.ప్ర.పా.
9వ సంపుటము. 309 పుట)

(8) గద్యము॥

శుభప్రదము లగు దానముల నొసఁగెడు నాదిత్యులారా! సామాన్యముగాఁ బూర్వమున
దేవతల సాహాయ్యమున మాత యగు దితి గర్భమున ద్విప్రకారముఁగ
సంజాతమైన మీ భ్రాతృత్వమును మేము ప్రకాశింపఁజేయుచున్నాము॥ 1250

(9) గీ॥ మంగళప్రద దానులౌ మఘవముఖ్య
దేవతోత్తములార! సద్దీప్తిఁ గలుఁగు
మీరు మా యజ్ఞములయందు మెలఁగుఁ దనుచుఁ
దక్షణమె మిమ్ము నుతియింతుఁ దత్పరమతి 1251

## సూక్తమ్—84

ఋషిః—ఉశనా కావ్యః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) ప్రేష్ఠం[1] వో అతిథిం స్తుషే మిత్రమివ ప్రియమ్ ।
అగ్నిం రథం న[2] వేద్యమ్ ॥ 1454

(2) కవిమివ ప్రచేతసం యం దేవాసో[3] అధ ద్వితా ।
ని మర్త్యేష్వాదధుః ॥ 1455

(3) త్వం యవిష్ఠ దాశుషో నౄఁః పాహి శృణుధీ గిరః ।
రక్షా తోకముత త్మనా ॥ 1456

---

1. ప్రేష్ఠ వో, 2. రథం వేద్యమ్, 3. దేవాసోఽధ. (ద్రా.ప్ర.)

(4) కయా తే[1] అగ్నే అఙ్గిర ఊర్జో నపాదుపస్తుతిమ్ ।
వరాయ దేవ మన్యవే ॥ 1457

(5) దాశేమ కస్య మనసా యజ్ఞస్య సహసో యహో ।
కదు వోచ[2] ఇదం నమః ॥ 1458

(6) అధా త్వం హి నస్కరో విశ్వా[3] అస్మభ్యం సుక్షితీః ।
వాజద్రవిణసో గిరః ॥ 1459

(7) కస్య నూనం పరీణసో ధియో జిన్వసి దంపతే ।
గోషాతా యస్య తే గిరః ॥ 1460

(8) తం మర్జయన్త సుక్రతుం పురోయావానమాజిషు ।
స్వేషు క్షయేషు వాజినమ్ ॥ 1461

(9) క్షేతి క్షేమేభిః సాధుభిర్నకిర్యం ఘ్నన్తి హన్తి యః ।
అగ్నే సువీర[4] ఏధతే ॥ 1462

---

1. తేఽఅగ్నేఽఅఙ్గిరఽఊర్జో, 2. వోచఽఇదం, 3. విశ్వాఽఅస్మభ్యం, 4. సువీరఽఏధతే. (ప్రా.ప్ర.)

## సూక్తము—84

ఋషి—కావ్యుఁడైన యుశనస్సు†
దేవత—అగ్ని

(1) చ॥ పురుషవరేణ్యులార! యతిపూజ్యు, భవత్ప్రియు, సర్వదేవతా
వరులకు హవ్య మీయఁగ నపార ముదంబున నేగు వాని, నిం
కరదము లాగునన్ ధనము నందఁగఁజేసెడువాని, మిత్రవ
త్పర మహితప్రదాత నల పావకు వేఁడెద మీ నిమిత్తమై ॥ 1252

(2) గీ॥ కవిని, విజ్ఞాని, నగ్నిని, ఘనుఁడు రెండు
కార్యముల ధర్మమును బోలి కనలుచుండు
నింద్ర ముఖ్యు దేవాళిని నెల్ల మర్త్యు
లందు ద్వివిధంబుగా నుంచి యమరినారు ॥ 1253

(3) క॥ యువతమ! యజమానులు
సంస్తవకారులఁ గాచి వారి తనయుల నెల్లన్
నవరీతిఁ గనుచు మా మా
స్తవముల రక్షింపు మీవు సరసపు తీవిన్ ॥ 1254

(4) గీ॥ అంతటం [1]దిరుగువాఁడ! యో యన్నరూప!
దేవ విద్యోతమానుఁడా! పావకుండ!
పరుఁడవైనట్టి నిన్నెట్టి సురుచిరంపు
వాక్కుచేత నుతింతును? వైరిహంత! ॥ 1255

(5) గీ॥ అనల! యే విధ యజమాన మనసుతోడఁ
గూడుకొని హవ్య మిడెదమో! కూర్మి మిగుల
నింక నీకు నమస్కార మెప్పు డెట్టు
లాచరింపంగఁగలవార మౌదు మోయి! ॥ 1256

---

† వ్రాతప్రతిలో (9వ సంపుటము. 309 పుట.) ఋషి "ఔశనసుఁడు"గా వ్రాపి, 16b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ఉశనస్సు-కావ్యుఁడు" ఇరువురును ఋషు లను భావము కలుగునట్లు శ్రీనేమానివారు వ్రాసిరి.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

(6) క॥ అనలుఁడ! మాచేతను నీ
వనయము నుతియింపఁబడుచు నధికము సంశో
భనము లగు నివాసంబుల
ధనపుత్రాన్నముల మాకుఁ దప్పక యిమ్మా! 1257

(7) గద్యము॥

గృహపతీ! యగ్నీ! యెవని సంబంధము లగు స్తుతులు గో లాభమును గలుఁగఁ జేయునో!
యట్టి నీ వెవరి కర్మలను ప్రీణింపఁజేయుచున్నావు? (†ఇతరుల యెవరి కర్మలను
సంతసింపఁజేయలేదు. మా కర్మలనే సంతసింపఁజేయుచున్నావు!) ॥ 1258

(8) గీ॥ శత్రుమండలి మున్ముందుఁ జంపువాని
సుక్రతుని[1] బలము గలవాని శోభనాగ్ని
స్స్వీయగృహములయం దుంచి చిత్త మలర
భక్తగణములు పూజింత్రు వాని నెపుడు ॥ 1259

(9) గీ॥ సదనములయందు నెవ్వఁడు సాధుపాల
నముల నుండునొ! యెవ్వఁ డనయము వైరిఁ
జంపఁగలవాఁడొ! యెవ్వనిఁ జంపలేరొ!
శత్రువులు, వాఁడె సంస్తోత జ్వలన! నీకు ॥ 1260

## సూక్తమ్—85

ఋషిః—కృష్ణ ఆఙ్గిరసః
దేవతా—అశ్వినౌ
ఛందః—గాయత్రీ

(1) ఆ మే హవం నాసత్యా ఽశ్వినా గచ్ఛతం యువమ్ ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1463

---

† ఎవరి కర్మలను (వ్రా.ప్ర.పా.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(2) ఇమం మే స్తోమమశ్వినేమం మే శృణుతం హవమ్ ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1464

(3) అయం వాం కృష్ణో[1] అశ్వినా హవతే వాజినీవసూ ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1465

(4) శృణుతం జరితుర్హవం కృష్ణస్య స్తువతో నరా ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1466

(5) ఛర్దిర్యన్తమదాభ్యం విప్రాయ స్తువతే నరా ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1467

(6) గచ్ఛతం దాశుషో గృహమిత్థా స్తువతో[2] అశ్వినా ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1468

(7) యుంజాథాం రాసభం రథే[3] వీడ్వఙ్గే వృషణ్వసూ ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1469

---

1. కృష్ణోఽఅశ్వినా, 2. స్తువతోఽఅశ్వినా, 3. వడ్వఙ్గే. (ప్రా.ప్ర.)

(8) త్రివన్ధురేణ త్రివృతా రథేనా యాతమశ్వినా ।
మధ్వః సోమస్య పీతయే 1470

(9) నూ మే గిరో నాసత్యా ఽశ్వినా ప్రావతం యువమ్ ।
మధ్వః సోమస్య పీతయే ॥ 1471

## సూక్తము—85

ఋషి—అంగిరసుఁడైన కృష్ణుఁడు*

దేవత—అశ్విదేవతలు

(1) గీ॥ అశ్వులార! మీర లస్మదాహ్వానంబు
నాలకించి పిదప నస్మదీయ
యజ్ఞసదనమునకు నతిశయ సోమ పా
నమును జేయ రండు! సముచితముగ ॥ 1261

(2,3) గీ॥ అన్నయుక్తులైన యశ్వులు! మీరు నా
స్తవము వినుచు నాదు సరస సోమ
మాను మనుచు మిముల నతివినయంబునఁ
బిలుచుచుండె మౌని ప్రీతి మెఱయ ॥ 1262

(4) క॥ సదయు లగు నశ్వులారా!
ముదమున నుతియించు కృష్ణముని వాక్కుల మీ
రెదఁ దలఁచి యాలకింపుచు
మదకరసోమంబుఁ ద్రావ మానుగ రండీ! ॥ 1263

(5) క॥ ముదమును గొల్చెడు నుతులన్
వదలక పఠియించు విప్రవరునకు భవ్య
ప్రద మగు గృహంబు నొసఁగుచు
మదకరసోమంబు ద్రావ మానుగ రండీ! ॥ 1264

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 311 పుట) "కృష్ణుఁడను అంగిరసుఁడు" ఋషిగా వ్రాసి, 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "కృష్ణుఁడు" ఋషిగా శ్రీ నేమానివారు వ్రాసిరి.

(6) క॥ సదయు లగు నశ్వులారా!
ముదమున హవ్యం బొసంగు మూర్తుల గృహముం
గదియుచు మీరలు ప్రీతిన్
మదకర సోమంబు ద్రావ మానుగ రండీ! ॥ 1265

(7) క॥ హృదయంగమ ధన మందిన
సదయాశ్వులు రాసభాఖ్యసారాశ్వములన్
ముదమున సిద్ధముఁ జేయుచు
మదకర సోమంబు ద్రావ మానుగ రండీ! ॥ 1266

(8) క॥ సదయు లయి, త్రిఫలకంబై
చెదరెడు రథ మెక్కి మీరు చేరుచు మా స
మ్మదకర సోమ క్రియలన్
మదకర సోమంబు ద్రావ మానుగ రండీ! ॥ 1267

(9) క॥ మద మల వాహకుల నెల్లను
నెదఁబెట్టఁగఁ దలఁచి మీర లిప్పుడె యశ్వుల్!
ముదితు లయి సర్వ విధముల
మదకర సోమంబు ద్రావ మానుగ రండీ! ॥ 1268

## సూక్తమ్—86

ఋషిః—కృష్ణ ఆఙ్గిరసః, విశ్వకో వా కార్ష్ణిః
దేవతా - అశ్వినౌ
ఛందః—జగతీ

(1) ఉభా హి దస్రా భిషజా మయోభువోభా
దక్షస్య వచసో బభూవథుః ।
తా వాం విశ్వకో హవతే తనూకృథే
మా నో వి యౌష్టం సఖ్యా ముమోచతమ్ ॥ 1472

(2) కథా నూనం వాం విమనా[1] ఉప స్తవద్యువం

ధియం దదథుర్వస్య[2] ఇష్టయే ।

తా వాం విశ్వకో హవతే తనూకృథే మా

నో వి యౌష్టం సఖ్యా ముమోచతమ్ ॥ 1473

(3) యువం హి ష్మా పురుభుజేమమేధతుం

విష్ణాప్వే దదథుర్వస్య ఇష్టయే ।

తా వాం విశ్వకో హవతే తనూకృథే మా

నో వి యౌష్టం సఖ్యా ముమోచతమ్ ॥ 1474

(4) ఉత త్యం వీరం ధనసామృజీషిణం[3]

దూరే చిత్ స న్తమవసే హవామహే ।

యస్య స్వాదిష్ఠా సుమతిః పితుర్యథా మా

నో వి యౌష్టం సఖ్యా ముమోచతమ్ ॥ 1475

(5) ఋతేన దేవః సవితా [4]శమాయత

ఋతస్య శృఙ్గముర్వియా వి పప్రథే ।

ఋతం సాసాహ మహి చిత్ పృతన్యతో మా[5]

నో వి యౌష్టం సఖ్యా ముమోచతమ్ ॥ 1476

---

1. విమనా ఉప, 2. థుర్వస్య ఇష్టయే, 3. జీషణం, 4. సమాయత ఋతస్య, 5. మ నో వి. (ప్రా.ప్ర.)

## సూక్తము—86

ఋషి—ఆంగిరసుఁడైన కృష్ణుఁడు లేక కార్ష్ణి యైన విశ్వకుఁడు*

దేవత—అశ్వులు

(1) ఉ॥ ఓపి సమస్తశత్రుపుల యుక్కుఁ నడంచెడు వారు, రోగ సం
తాపముఁ గొట్టు వైద్యులరు, దక్షవచస్కులు, సౌఖ్యదాతలై
యేపు వహింప విశ్వకుఁ డహీన సుతార్థము మిమ్ముఁ బిల్వఁడే!
మాపయి మీ సఖిత్వమును మందము చేయకుఁ డశ్విదేవతల్! 1269

(2) ఉ॥ చూపుచు నమ్రతన్ విమనసుండు మిమున్ నుతియించెఁ గాన మీ
రేపు వహించి వారికి నహీన ధనంబును బుద్ధి నీయ లే
దా పనిఁ బూని విశ్వకుఁడు ధర్మిసుతార్థము మిమ్ముఁ బిల్వఁడే!
మాపయి మీ సఖిత్వమును మందము చేయకుఁ డశ్విదేవతల్! ॥ 1270

(3) ఉ॥ ఓపి ధనప్రశస్తిని మహోన్నత పాలకులైన మీరు వి
ష్ణాపువుఁ దృప్తిఁ జేసితిరి వావిరి నిష్టధనం బొసంగుచున్
ప్రాపయి విశ్వకుండు మిముఁ బ్రార్థనసేయఁడె! పుత్రకామియై
మాపయి మీ సఖిత్వమును మందముఁ జేయకుఁ డశ్విదేవతల్! ॥ 1271

(4) ఉ॥ స్థాపితకర్మదక్షు, ధని సార గృహీత ఋజీష సోము వి
ష్ణాపుని రక్షలై నుతి యొనర్తుము తత్పితృసంస్తవంబు లె
ల్లేపు వహించు దేవతల కెంతయు నట్టుల వాని నెయ్యెడన్
మాపయి మీ సఖిత్వమును మందము చేయకుఁ డశ్విదేవతల్! ॥ 1272

(5) ఉ॥ ఓపి సవితృఁ†డే ఋతము యుక్తిని సంజ స్వభృష్టితాపముల్
వాపెడు నే ఋతాగ్రమున భవ్యవిభావమునందు దానిఁ దా
నే పొనరించు నట్టి ఋత మెంతయు మా యరిఁ ద్రుంచు దానిచే
మాపయి మీ సఖిత్వమును మందము చేయకుఁ డశ్విదేవతల్! ॥ 1273

---

* వ్రాతప్రతిలోను (9వ సంపుటము. 313 పుట), 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలోను ఋషి "విశ్వకుఁడు"గా మాత్రమే శ్రీనేమానివారు వ్రాసిరి.

† "సవితృ" శబ్దము ఋకారాంతము. కావున "తృ" పూర్వమందున్న "వి" వర్ణము లఘువే కావలసియున్నది. కాని శ్రీనేమానివారు "వి" వర్ణము నిక్కడ గురువుగాఁ బ్రయోగించుట విశేషము. (చూ. పీఠిక)

## సూక్తమ్—87

ఋషిః—కృష్ణ ఆఙ్గిరసో, వాసిష్ఠో వా ద్యుమ్నీకః, ప్రియమేధ ఆఙ్గిరసో వా

దేవతా—అశ్వినౌ

ఛన్దః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ద్యుమ్నీ వాం స్తోమో[1] అశ్వినా క్రివిర్న సేక[2] ఆ గతమ్ ।
మధ్వః సుతస్య స దివి ప్రియో నరా పాతం గౌరావివేరిణే ॥ 1477

(2) పిబతం ఘర్మం మధుమన్తమశ్వినా ఽఽ బర్హిః సీదతం నరా ।
తా మన్దసానా మనుషో దురోణ[3] ఆ ని పాతం వేదసా వయః ॥ 1478

(3) ఆ వాం విశ్వాభిరూతిభిః ప్రియమేధా[4] అహూషత ।
తా వర్తిర్యాతముప వృక్తబర్హిషో జుష్టం యజ్ఞం దివిష్టిషు ॥ 1479

(4) పిబతం సోమం మధుమన్తమశ్వినా ఽఽ బర్హిః సీదతం సుమత్ ।
తా వావృధానా[5] ఉప సుష్టుతిం దివో గన్తం గౌరావివేరిణమ్ ॥ 1480

(5) ఆ నూనం యాతమశ్వినా ఽశ్వేభిః[6] ప్రుషితప్సుభిః ।
దస్రా హిరణ్యవర్తనీ శుభస్పతీ పాతం సోమమృతావృధా ॥ 1481

---

1. స్తోమోఽశ్వినా. 2. సేకఽఆ గతమ్. 3. దురోణఽఆ ని, 4. మేధాఽఅహూషత,
5. వృధానాఽఉప, 6. మశ్వినాశ్వేభిః. (ప్రా.ప్ర.)

(6) ఇయం హి వాం హవామహే విపన్యవో విప్రాసో వాజసాతయే।
తా వల్గూ దస్రా పురుదంససా ధియాఽశ్వినా శ్రుష్ట్యా గతమ్ ॥ 1482

## సూక్తము—87

ఋషి—ఆంగిరసుఁడైన కృష్ణుఁడు లేక వాశిష్ఠుఁడైన ద్యుమ్నీకుఁడు
లేక ఆంగిరసుఁడైన ప్రియమేధుఁడు*
దేవత—అశ్విదేవతలు

(1) గద్యము॥

ఓ యశ్విదేవతలారా! యుదకము బైటకుఁ దోడివేయుచున్నను గూప మల్పోదకము కాని యట్లు
క్షీణింపని స్తోత్రములు గల ద్యుమ్నీకుఁ డను ఋషి మీకు స్తోత యగుచున్నాఁడు!
కాఁబట్టి మీరు మా యజ్ఞమునకు వచ్చి స్తుతుల నాలకింపుఁడు!
నేత లగు నశ్విదేవతలారా! యా స్తోతృవరుఁడు విద్యోతమాన మగు
యజ్ఞమున నభిషుత మగు సోమమునకుఁ బ్రియుఁ డగుచున్నాఁడు.
కావున దప్పిఁ గొను గౌరమృగము తటాకాదులయందు
నీరు ద్రావుటకు వచ్చునట్లు సుత సోమమును ద్రావుటకు మీరు రండు! ॥ 1274

(2,3) సీ॥ పాత్రములందున్న పరమసోమరసంబు నశ్వులారా! మీర లమరఁ గొనుఁడు!
బహువిస్తృతంబైన బర్హ్యాసనంబును నతిశయప్రీతితో నందికొనుఁడు!
మనుజ గృహంబుల ఘనయజ్ఞగృహముల సోమపానంబున శోభ గనుఁడు!
సత్పురోడాశాదిసహిత హవిస్సోమ మను నన్నసారము నందికొనుఁడు!
గీ॥ కాంక్షితార్థంబులను నెల్లఁ గలుఁగఁ గోరి
సకలయాగ ప్రియతములు చాల భక్తిఁ
బిలుచుచున్నారు మిమ్ములఁ బ్రీతి నుదయ
కాలములయందు హవ్యము కనుఁ డటంచు ॥ 1275

(4) చ॥ మదకర మైన సోమమును మాటికి మాటికిఁ ద్రావుచుండి మీ
రెదను దలంచి యజ్ఞముల నెంతయు మత్తత విశ్రమింపుఁడీ!
సుదివమునుండి రండు! కడు శోభన సంస్తుతికై సరస్సులన్
ముదమును జేరు గౌరములఁ బోలిక శీఘ్రమె యశ్విదేవతల్! ॥ 1276

---

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 315 పుట) "ద్యుమ్నీకుఁడు" ఋషిగా శ్రీనేమానివారు వ్రాసి,
సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ద్యుమణీకుఁడు, ప్రియమేధుఁడు, లేక కృష్ణుఁడు"
ఋషులుగా వ్రాసిరి.

(5,6) సీ॥ అశ్విదేవతలార! యశ్వంబులన్ గూడి యజ్ఞంబులకు మీర లరుగఁదెండు!
దస్రులారా! మీరు దర్శనీయ హిరణ్య యానంబుపై నెక్కి యరుగఁదెండు!
కళ్యాణమును మీరు కాపాడువారలై శీఘ్రము మీ స్థలమును జేరరండు!
జల వివర్ధకులార! సత్యపాలకు లయి యతితృప్తి సోమంబు నానరండు!
గీ॥ స్తోతలము మేము కావున సుందరంపు
టన్నమును గోరి మిమ్ముల నడుగుచున్న
ధనము మొదలగు వానిని దక్షిణంబ
యిచ్చుటకు[1] సులభ గమనులై యిటకు రండు! ॥ 1277

## సూక్తమ్—88

ఋషిః—నోధా గౌతమః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) తం వో దస్మమృతీషహం వసోర్మన్దానమన్ధసః ।
అభి వత్సం న స్వసరేషు ధేనవ[1] ఇన్ద్రం గీర్భిర్నవామహే ॥ 1483

(2) ద్యుక్షం సుదానుం తవిషీభిరావృతం గిరిం న పురుభోజసమ్ ।
క్షుమన్తం వాజం శతినం సహస్రిణం మక్షూ గోమన్తమీమహే ॥ 1484

(3) న త్వా బృహన్తో[2] అద్రయో వరన్త ఇన్ద్ర వీళవః ।
యద్దిత్ససి స్తువతే మావతే వసు నకిష్టదా మినాతి తే ॥ 1485

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

1 ధేనవఽఇన్ద్రం, 2. బృహన్తోఽఅద్రయో వరన్తఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(4) యోద్ధాసి క్రత్వా శవసోత దంసనా విశ్వా జాతాభి మజ్మనా ।
ఆ త్వాయమర్క[1] ఊతయే వవర్తతి యం గోతమా[2] అజీజనన్ ॥ 1486

(5) ప్ర హి రిరిక్ష[3] ఓజసా దివో అన్తేభ్యస్పరి ।
న త్వా వివ్యాచ రజ[4] ఇన్ద్ర పార్థివమను స్వధాం వవక్షిథ ॥ 1487

(6) నకిః పరిష్టిర్మఘవన్ మఘస్య తే యద్దాశుషే దశస్యసి ।
అస్మాకం బోధ్యుచథస్య చోదితా మంహిష్ఠో వాజసాతయే ॥ 1488

## సూక్తము—88

ఋషి—గౌతముఁడైన నోధస్సు
దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ పురుషవరేణ్యులార! కడుఁ బోఁడిమి శత్రుల నుక్కడంచి సుం
దర మగు పాత్ర సోమమును ద్రావి ప్రమత్తత మోద మందు నా
సురపతి కుచ్చరించెదము సూక్తము గోష్ఠమునందు ధేనువుల్
సురుచిర వత్సముం గనుచు శోభిలు శబ్దముఁ జేయు కైవడిన్ ॥ 1278

(2) గద్యము॥

అతిశయ దీప్తిమంతుఁడు, శోభనదానుఁడు, మేఘములచే శిలోచ్చయము వలె బలముచే నాచ్ఛాదింపఁబడినవాఁడు, సోమాది హవిఃప్రదానమున యజమానులవలన భోజనము పెట్టఁబడినవాఁడు, నగు నింద్రుని స్తోత్రాదులఁ జేయునదియు, శతసహస్ర సంఖ్యాక ధనయుక్తమును, గవాదిసహితమును, నగు నన్నమును శీఘ్రముగ యాచించుచున్నాము ॥ 1279

1. మర్క ఉఊతయే, 2. గోతమా ఽ అజీజనత్, 3. రిరిక్ష ఽ ఓజసా దివో ఽ అన్తేభ్య, 4. రజ ఽ ఇన్ద్ర. (వా.ప్ర.)

(3) గీ॥ బలముచేత మహత్వంబుఁ బడసినట్టి
యన్ని విధముల దార్ఢ్యము నందునట్టి
పర్వతాళి మహేంద్రుఁడా! బలమువలన
నిన్ను వారింపలేకుండు నెన్నఁడైన ॥ 1280

గీ॥ స్తోత్రములఁ జేయుచుం గడు శోభ గాంచు
మత్సమానులకే ధన మహిమ నొసఁగ
నున్నవాఁడవు! నీ వింద్ర! యుక్త ధనము
నెవఁడు హింసింపఁగల్గు నీ యవనియందు ॥ 1281

(4) గద్యము॥

వృత్రహననాదికర్మలచేతను, బలముచేతను, యోద్ధ వగుచున్నావు! స్వకర్మచేతను,
బలముచేతను, భూతజాతమును దిరస్కరించుచున్నావు! నోధఃప్రభృతు లెట్లు
నిన్నుఁ బ్రాదుర్భవింపఁజేసినారలో! యట్లు నిన్ను నీ మంత్ర
మభిముఖముగఁ జేసికొనుచున్నది ॥ 1282

(5) గీ॥ ఇంద్రదేవుఁడ! బలమున నెసఁగు దివిని
భువిని మించెదు నీవు విభూతితోడఁ
నన్న సంపదనో! శీతలాంబువులనో!
నొసఁగ నిచ్చ దలంపు మీ వొనర మాకు 1283

(6) క॥ ధనవన్మహేంద్రుఁడా! నీ
ధనము నిరోధించు వాఁడు ధరఁ గల్గునఁటే!
ధనమును నీ విచ్చిన నా
ధనమునకు నిరోధకుండు ధరఁ గల్గునఁటే! 1284

క॥ ధన చోదకుఁడవు! దాతవు
ఘనుఁడా! మే మెల్ల నధికగౌరవ నుతులం
బనిగొని యన్నంబునకై
యొనరఁ బఠించితి మటంచు నొగి నెఱుఁగవొకో! 1285

## సూక్తమ్—89

ఋషిః—నృమేధ-పురుమేధావాఙ్గిరసౌ
దేవతా—ఇన్ద్రః
ఛందః—1-4-విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః),
5-6-అనుష్టుప్, 7-బృహతీ

(1) బృహదిన్ద్రాయ గాయత మరుతో వృత్రహన్తమమ్ ।
యేన జ్యోతిరజనయన్నృతావృధో దేవం దేవాయ జాగృవి ॥ 1489

(2) అపాధమదభిశస్తీరశస్తిహా ఽథేన్ద్రో ద్యుమ్న్యాభవత్ ।
దేవాస్త[1] ఇన్ద్ర సఖ్యాయ యేమిరే బృహద్భానో మరుద్గణ ॥ 1490

(3) ప్ర వ[2] ఇన్ద్రాయ బృహతే మరుతో బ్రహ్మార్చత ।
వృత్రం హనతి వృత్రహా శతక్రతుర్వజ్రేణ శతపర్వణా ॥ 1491

(4) అభి ప్ర భర ధృషతా ధృషన్మనః శ్రవశ్చిత్తే[3] అసద్బృహత్ ।
అర్షన్త్వాపో జవసా వి మాతరో హనో వృత్రం జయా స్వః ॥ 1492

(5) యజ్జాయథా[4] అపూర్వ్య మఘవన్ వృత్రహత్యాయ ।
తత్పృథివీమప్రథయస్తదస్తభ్నా[5] ఉత ద్యామ్ ॥ 1493

---

1. దేవాస్తఽఇన్ద్ర. 2. వఽఇన్ద్రాయ. 3. చిత్తేఽఅసద్బృహత్. 4. యథాఽఅపూర్వ్య.

5. స్తభ్నాఽఉత. (ప్రా.ప్ర.)

(6) ఇత్ తే యజ్ఞో! అజాయత తదర్క ఉత హస్కృతిః ।
తద్విశ్వమభిభూరసి యజ్జాతం యచ్చ జన్త్వమ్ ॥ 1494

(7) ఆమాసు పక్వమైరయ ఆ సూర్యం రోహయో దివి ।
ఘర్మం న సామన్ తపతా సువృక్తిభిర్జుష్టం గిర్వణసే బృహత్ ॥ 1495

## సూక్తము—89

ఋషి— అంగిరసుఁడైన నృమేధుఁడు, పురుమేధుఁడు*
దేవత —ఇంద్రుఁడు

(1) క॥ మితభాషణులారా! మీ
రతిశయ పాపాపహారి యగు సోమముచే
మతిఁ దలఁచి యింద్రునిన్ మా
కృతయజ్ఞ సుకర్మలందుఁ గీర్తింపరాకో! 1286

గీ॥ సత్యవర్ధకు లెల్ల రే సామమునను
జాగరణశీలు దేవుని సారసాత్మ
సూర్యుఁ బుట్టించినార లా శోభి సామ
మును వచింపుఁడు! హరి కని ఘనులు! మీరు॥ 1287

(2) గీ॥ శత్రు వారకుఁ డైనట్టి శక్రుఁ డెలమి
శత్రుకృతహింసలం గొట్టి సకలతలము
లందు విద్యోతమాన మౌ యశముతోడ
యుక్తుఁడై వెల్గుచుండుఁ దా రక్తి మీర॥ 1288

---

1. యజ్ఞో ఽ అజా. 2. తదర్క ఽ ఉత, 3. రయ ఽ ఆ. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 321 పుట) "నృమేధుఁడు. పురుమేధుఁడు" ఋషులుగా వ్రాసిన శ్రీ నేమానివారు, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "నృమేధుఁడు లేక పురుమేధుఁడు" ఋషిగా వ్రాసిరి.

గీ॥ ఓ మరుద్గణతేజస్క! యోయి యింద్ర!
ప్రభలఁ గల్గెడు దేవతా వర్గ మెల్లఁ
దమకు సఖ్యంబు కలుఁగంగఁ దరచుఁ బ్రీతి
నిను నియోగించుచున్నారు నిష్ఠఁ బూని॥ 1289

(3) క॥ మితరావిఁబు లగు భక్త
ప్రతతులు! మీ బంధు లైన వాసవునకు సం
తతమును బ్రహ్మసుగానం
బతిశయముగ నుచ్చరించు చమరుఁడు! మీరల్! ॥ 1290

గీ॥ పాపహంత! శతేష్టుఁడు వజ్ర మూని
యుష్మదభితుష్టుఁడై శీఘ్ర ముదకమార్గ
వారకు నివృతుఁ డను వాని జేరి సత్వ
రముగఁ జంపునుగాక! విశ్రాంతికొఱకు ॥ 1291

(4) గీ॥ శత్రు ధర్షణశీలుఁడా! శక్ర! నీకు
నన్న ముండెఁ బ్రభూతంబు నది సుహృష్ట
మనసునం గూడుకొని నీవు మాకు మిగులఁ
బ్రీతితోడుత నీయుము! ఖ్యాతి మెఱయ ॥ 1292

గీ॥ నీళ్ళు మాతలు మా కౌను నిర్మలేంద్ర!
యవి ప్రవేశించుఁగాక నీ యవనియందు
శీఘ్రముగ [1]జలము సరికట్టి చెలఁగునట్టి
వృత్రుఁ బరిమార్చుచు జయించు! వివిధములను ॥ 1293

(5) గద్యము॥

సతోవ్యతిరిక్త మగు పూర్వ్యముచే వర్జితుండును, మహనీయ ధనవంతుఁడును, నగు
నింద్రుఁడా! వృత్రాసురహననమునకు నీ వెపుడు ప్రాదుర్భవించితివో! యప్పుడు
పృథ్విని దృఢముగా నొనర్చితివి! ద్యోలోకమును నంతరిక్షమును
నిరుద్ధముగాఁ జేసితివి! ॥ 1294

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(6) ఉ॥ ఎప్పుడు పుట్టినాఁడవో! మహేంద్రుఁడ! యజ్ఞము పుట్టె నప్పుడే!
యప్పుడె! హర్షకారి యగు నర్చితమంత్రము సంభవించె నిం
కప్పుడె! భూతజాతము మహాధృతి జన్మము నొందఁ గల్గె నీ
వప్పుడె! పుట్టనున్న జగ మంత మహామహిమన్ జయింపవే! ॥ 1295

(7) గద్యము॥

ఓ యింద్రుఁడా! యపక్వములను గోవులయందుఁ బక్వము లగు పయస్సులను నునుచితివి!
ద్యోలోకమున సూర్యుని స్థాపించితివి! దీపనశీల మగు ప్రవర్గ్యమును సామములచే
నెట్లు తపింపఁజేయుచున్నారో! స్తోతలారా! యటులు స్తుతులచే నింద్రు
నుగ్గడింపుఁడు! పిదప సూక్తములచే వననీయుఁ డగు నింద్రునకుఁ
బర్యాప్త మగు సామమును బఠింపుఁడు! ॥ 1296

## సూక్తమ్—90

ఋషిః—నృమేధ-పురుమేధావాఙ్గిరసౌ
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) ఆ నో విశ్వాసు హవ్య[1] ఇన్ద్రః సమత్సు భూషతు ।
ఉప బ్రహ్మాణి సవనాని వృత్రహా పరమజ్యా[2] ఋచీషమః ॥ 1496

(2) త్వం దాతా ప్రథమో రాధసామస్యసి సత్య[3] ఈశానకృత్ ।
తువిద్యుమ్నస్య యుజ్యా వృణీమహే పుత్రస్య శవసో మహః ॥ 1497

(3) బ్రహ్మ త[4] ఇన్ద్ర గిర్వణః క్రియన్తే[5] అనతిద్భుతా ।
ఇమా జుషస్వ హర్యశ్వ యోజనేన్ద్ర యా తే[6] అమన్మహి ॥ 1498

1. హవ్యఽఇన్ద్రః, 2. మజ్యాఽఋచీషమః, 3. సత్యఽఈశాన, 4. తఽఇన్ద్ర, 5. క్రియన్తేఽఅనతి,
6. తేఽఅమన్మహి. (వ్రా.ప్ర.)

(4) త్వం హి సత్యో మఘవన్ననానతో వృత్రా భూరి న్యృఞ్జసే ।
స త్వం శవిష్ఠ వజ్రహస్త దాశుషే ఽర్వాఞ్చం రయిమా కృధి ॥ 1499

(5) త్వమిన్ద్ర యశా[1] అస్యృజీషీ శవసస్పతే ।
త్వం వృత్రాణి హంస్యప్రతీన్యేక[2] ఇదనుత్తా చర్షణీధృతా ॥ 1500

(6) తము త్వా నూనమసుర ప్రచేతసం రాధో భాగమివేమహే ।
మహీవ కృత్తిః శరణా త[3] ఇన్ద్ర ప్ర తే సుమ్నా నో[4] అశ్నవన్ ॥ 1501

## సూక్తము—90

ఋషి—ఆంగిరసుఁడైన నృమేధసుఁడు పురుమేధస్సు*
దేవత — ఇంద్రుఁడు

(1) గీ॥ అసురయుద్ధములం దెల్ల నాత్మరక్ష
ణార్థమై పిలువఁదగినట్టి యమరుఁ డింద్రుఁ
డస్మదీయ హవీరూప మైన యన్న
ములను సేవించుఁగాకఁ! దా మోద మలర ॥ 1297

గీ॥ పాపబల నిహంత పరమబలంబున
శత్రువులను గొట్టు శక్తిఁ గలిఁగి
స్తుతులవలనఁ దనిసి సొంపగు స్తుతులను
బొందుఁగాకఁ! ప్రీతి నొందుఁగాక! ॥ 1298

---

1. యశాఽఅస్యృజీషీ, 2. తీన్యేకఽఇదనుత్తా, 3. తఽఇన్ద్ర, 4. నోఽఅశ్నవన్. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (9వ సంపుటము. 323పుట) నృమేధ - పురుమేధు లిరువురును ఋషులుగా వ్రాసి. 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నృమేధుఁడు లేక పురుమేధుఁడు ఋషిగా శ్రీనేమానివారు వ్రాసిరి.

(2) గీ॥ ఇంద్రుఁడా! నీవు ముఖ్యుండ వెల్లరకును
ప్రథముఁడవు! నీవు ధనదాతృవర్గమందు
జనుల నైశ్వర్యయుతులుగఁ జాలఁ జేసి
సత్యకర్ముఁడ వగుమయ్య! సకలవిధుల ॥ 1299

గీ॥ బహుధనంబు గలిఁగి వైరి వధార్థమై
బలమువలనఁ బుట్టి వెలుఁగు నింద్ర!
నీకు యోగ్య మైన నిఖిల ధనంబును
బొందఁగలము మేము పూర్ణభక్తి ॥ 1300

(3) గీ॥ ఇంద్ర! గిర్వణనీయుఁడా! యెల్ల వేళ
లందు సత్యస్వరూపంబు లౌచు వెల్గు
స్తోత్రములు నీ నిమిత్తము సొంపు మీర
వెల్లడించుచునున్నాము వినుము! వాని ॥ 1301

క॥ విను మింద్రుఁడ! నీకు సుయో
జన శీలము లైన సర్వసంస్తవతతులన్
విను మింద్ర! నీ నిమిత్తం
బనయము మే ముచ్చరించునట్టి స్తుతులన్ ॥ 1302

(4) గద్యము॥

ధనవంతుఁడ వగు నింద్రా! సత్కర్ముఁడ వగు నీ వెవ్వరికిని లొంగక బహురాక్షసుల
ధిక్కరించుచున్నావు! ఓ బలవృద్ధతమ! యో వజ్రహస్తుఁడా! యింద్రుఁడా! నీవు
హవ్య మొసంగువానికి ధనము మొదలగునవి యభిముఖ మగునట్లు చేయుము! ॥ 1303

(5) గద్యము॥

బలవంతులచే నప్రతిగతము లగుటచేతనే యన్యులచే జయింప శక్యులుగాని రాక్షసులను
నీ వొక్కరుఁడవే మనుష్యధారక మగు వజ్రముచేఁ జంపుచున్నావు! అభిషుతసోమము
గలవాఁడా! నేవు యశోవంతుఁడ వగుచున్నావు! ॥ 1304

(6) గీ॥ బలవదింద్రదేవ! ప్రబల విజ్ఞానివౌ
నిన్నె ధర్మహేతు నిఖిలధనము
నొకఁడు పైతృకంబు నొగిఁ గోరు రీతిని
నడుగుచున్నవార మధికతుష్టి ॥ 1305

గీ॥ అన్నము విధాన నీ కింద్ర! యంతరిక్ష
మందు ద్యోలోకమందును నంద మైన
వసతి కలదింక నీ పుత్రముఖ్య విషయ
సుఖము మమ్ములఁ బొందుత! సూరి వినుత! ॥ 1306

## సూక్తమ్—91

ఋషికా—ఆత్రేయీ అపాలా

దేవతా—ఇన్ద్రః

ఛందః—అనుష్టుప్, 1-2-పంక్తిః

(1) కన్యా౩ వారవాయతీ సోమమపి స్రుతావిదత్ ।
అస్తం భరన్త్యబ్రవీదిన్ద్రాయ సునవై త్వా శక్రాయ సునవై త్వా ॥ 1602

(2) అసౌ య[1] ఏషి వీరకో గృహంగృహం విచాకశత్ ।
ఇమం జమ్భసుతం పిబ ధానావన్తం కరమ్భిణమపూపవన్తముక్థినమ్ ॥ 1603

(3) ఆ చన త్వా చికిత్సామో ఽధి చన త్వా నేమసి ।
శనైరివ శనకైరివేన్ద్రాయేన్దో పరి స్రవ ॥ 1604

1. యఽఏషి. (వా.ప్ర.)

(4) కువిచ్ఛకత్ కువిత్ కరత్ కువిన్నో వస్యసస్కరత్ ।
కువిత్ పతిద్విషో యతీరింద్రేణ సంగమామహై ॥ 1505

(5) ఇమాని త్రీణి విష్టపా తానీంద్ర వి రోహయ ।
శిరస్తతస్యోర్వరామాదిదం మ ఉపోదరే ॥ 1506

(6) అసౌ చ యా న ఉర్వరాదిమాం తన్వం మమ ।
అథో తతస్య యచ్ఛిరః సర్వా తా రోమశా కృధి ॥ 1507

(7) ఖే రథస్య ఖేఽనసః ఖే యుగస్య శతక్రతో ।
అపాలామింద్ర త్రిష్పూత్వ్యకృణోః సూర్యత్వచమ్ ॥ 1508

## సూక్తము—91

ఋషిక—అత్రిపుత్రియగు నపాల†
దేవత—ఇంద్రుఁడు

*(1) గీ॥ కన్యయౌ నపాల కాంక్షితార్థము రీతి
సోమ మంది యధిక శోభఁ దీర
దంతములను ధ్వనిని దార్ఢ్యమ్మునగా నొప్ప
నింద్రుఁగూర్చి పల్కె నీడ్యమతిని ॥ 1807

---

1. మఽఉపోదరే, 2. సఽఉర్వరాదిమాం. (వ్రా.ప్ర.)

† శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత 8వ మండలము మూలవ్రాతప్రతి 9వ సంపుటము 325 పుటలో 91వసూక్తమునకు "ఋషిక" అయిన అత్రిపుత్రి యగు" అపాల" "ఋషిక"గాఁ గాక "ఋషి" గాఁబేర్కొనఁబడినది. ఇది పొరపాటు. "అపాల" త్వగ్దోష నివారణార్థమై యీ సూక్తమును బఠించినట్లు శ్రీ నేమానివారు వివరముగా నా చరిత్రను గూడ వ్రాయుట జరిగినది. కాని యా చరిత్రవారు సంపూర్ణముగా వ్రాయఁగాఁ గొంత భాగము మీఁదుమిక్కిలి తుదిభాగము పోయినట్లు తోచుచున్నది. అంతియేకాదు. ఈ 91వ సూక్తములోని ఋక్కులకేకాక 92-93-94 సూక్తములలోని ఋక్కులకు సైతము నాంధ్రానువాద భాగము మూల వ్రాతప్రతి 9వ సంపుటము చివరగాని, 10వ సంపుటము మొదటగాని లేదు. 9వ సంపుటము. 327వ పుటతో ముగియఁగా 10వ సంపుటము 4వ పుటలో (8వ మండలము)

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నారవ యష్టకమున 95వ సూక్తాదిగా ననువాదము ప్రారంభమైనది. మూలప్రతి 10వ సంపుటము, 4వ పుట ప్రారంభములో బ్రాకెట్లలో "షష్ఠాష్టకము శేషభాగమునఁగల 95సూక్తమునుండి యీ సంపుటమున వ్రాయఁబడినది" అని విస్పష్టముగా వ్రాయఁబడియున్నది. దీనినిబట్టి చూడఁగా మూలవ్రాతప్రతి 9వ సంపుటము 327వ పుటతో ముగియలేదనియు, నత్రిపుత్రియగు ఋషిక అపాల 91వ సూక్తమును చర్మదోషనివారణార్థమై పఠించిన వివరములు కథయుఁ బూర్తిగా సాయన భాష్యానుసారముగా శ్రీ నేమానివారు వ్రాయుటయేగాక 91-92-93-94 సూక్తములను సైతము తామే యాంధ్రీకరించి 9వ సంపుటములోనే వ్రాసి యీ 9వ సంపుటమును 94వ సూక్తానువాదభాగముతో ముగించి రనియుఁ దోచుచున్నది. కాఁగా అపాల కథ చివరిభాగముతోపాటు 91-92-93-94సూక్తముల ఆంధ్రానువాద భాగములు తరువాతి కాలమున శిథిలమై పోయినట్లు భావింపవచ్చును. అందువలన నపాల కథ తుది భాగమును 91-92-93-94 సూక్తలను నే నాంధ్రీకరించి పూరించుట జరిగినది. ఈ 91వ సూక్తము విషయమై ఫుట్‌నోట్‌గాఁ గాక "ఋషిక" నామము వద్దనే అసలు గ్రంథభాగములోనే శ్రీ నేమానివారు సాయనాచార్యులు వ్రాసిన వివరములను నీ క్రింది విధముగా ననువదించిరి. వ.గో.కృ.

-"అత్రిపుత్రి యగు అపాల ఆమె త్వగ్దోష నివారణార్థ మీ సూక్తమును బఠించినది. ఈ సూక్త సందర్భమున నొక యితిహాసము కలదు. అది యీ క్రింద నుదహరింపఁబడినది.

పూర్వ మొక కాలమున నత్రిసుత యగు అపాల బ్రహ్మవాదినియై యుండెను. ఏదో యొక కారణమున ఆమె త్వగ్ దోష దుష్టయయ్యెను. ఆ కారణమున "దుర్భగ" యని భర్తచే విడవఁబడినదియై యా త్వగ్ దోష నివారణార్థమై యామె పితురాశ్రమమునందు నింద్రునిగూర్చి తపస్సు చేసెను ఆ తపశ్చరణకాలమం దొకప్పుడు ఆ స్త్రీ "ఇంద్రునకు సోమము ప్రియ మగును గావున దానిని నింద్రున కొసంగెదను" అని నదీతీరమును జేరెను.

ఆమె యా నదిలోఁ దాన మాడి మార్గమందు సోమమును సంపాదించుకొని ఆశ్రమమునకు మరలి వచ్చుచు దానిని భక్షించెను. ఆమె యట్లు సోమమును భక్షించుచుండ దంతఘర్షణమువలన శబ్దము జనించెను. ఆ శబ్దము గ్రావలయొక్క యభిషవధ్వనిగా తలంచి యప్పుడె యింద్రుఁ డామెకుఁ బ్రత్యక్షమయి "ఇక్కడేల గ్రావల ధ్వని వినఁబడుచున్నది?" అని యామెను ప్రశ్నించెను. అపు డామె "అత్రికన్య నదికి స్నానార్థమై వచ్చి సోమమును సంగ్రహించి దానిని భక్షించుచున్నది. అది యా భక్షణమువలన కలిగిన ధ్వనియేకాని గ్రావల సోమాభిషవ ధ్వని కాదు." అని ప్రత్యుత్తర మిచ్చెను.

అట్టి ప్రత్యుక్తిని విని యింద్రుఁడు మరలెను. అపు డింద్రునితో నామె "అయ్యా! నీవు సోమమునకుఁ బ్రతిగృహంబునకుఁ బోవుచుందువు! ఇచ్చట నా దంతములచే నభిషుత మగు సోమమును త్రావుము! ధానములను భక్షింపుము!" అని తిరిగి ఆమె వానిని నింద్రునిగా నాదరింపక "నిన్నింద్రునిగా నే నెఱుఁగను. నీవు మద్గృహంబున కేతెంచినచో నిన్ను బహూకరించెదను." అని పలికి "ఇక్కడికి వచ్చిన వాఁడింద్రుఁడెకాని వేరొకఁడుకాఁ"డని నిశ్చయించి తన నోటియందుఁ గల సోమము నుద్దేశించి "ఓ సోమమా! యింద్రుని వృద్ధిపరచుటకు మెల్ల మెల్లగా స్రవింపుము!" అని పలికెను. పిదప నింద్రుఁడామెను‡ గాంచి యామె ముఖమునఁగల దంష్ట్రాభిషుత సోమమును త్రావెను. అప్పు డపాల "త్వగ్దోషమువలన భర్తచే విడువఁబడినదాననై యింద్రునిగూడితిని" అని నుడివెను. అంత నింద్రుఁడు "నీకేమి కావలయునో తెలిపినయెడల దాని నీ కొసంగెదను." అని పలుక "నా తండ్రి శిరస్సు రోమ వర్జితము. వాని యూసరక్షేత్రము ఫలాదిరహితము. నా గుహ్యస్థానము అరోమశము ఈ మూఁడింటిని రోమఫలాది యుక్తములుగా నొనర్పుము!" అని ప్రార్థించెను. ఇంద్రుఁ డట్లొనర్చి యా కాంత త్వగ్దోషము పోవుటకుఁ దన రథచ్ఛిద్రము లందు శకటయుగచ్ఛిద్రములందు నామెను మూఁడు పర్యాయములు దూర్చి పరిశుద్ధురాలనుగాఁ జేసెను. అపు డామె త్వక్కు శల్కకము, గోధి, కర్ణకలాపము నయ్యెను. పిదప నింద్రుఁ డా యపాలను సూర్యునితో సమాన మగు చర్మము గల దానినిగా నొనర్చెను. (ఈ యైతిహాసిక కథ శాట్యాయన బ్రాహ్మణమునందుఁగలదు.)

కావ్యతీర్థ
నేమాని వేంకటనరసింహశాస్త్రి

వాఙ్మయ మహోధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

‡ శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రిగారు వ్రాసిన అపాల కథ- "పిదప నింద్రుఁ డామెను" అనునంతవఱకు మాత్రమే వ్రాతప్రతి. 9వ సంపుటము 327వ పుటలో నసమగ్రముగాఁ గలదు. మిగిలిన కథాభాగము A.P.G.O.M.L. & R.I. లోనిBook No-29. Call No-T 25-29 Acc No-3773 ప్రతిలో నేను వ్రాసి పూర్తిచేయుట జరిగినది. వ.గో.కృ.

అర్థాంతరము

*గీ॥ సోమమ! నిను మహేంద్రుని శోభకొఱకు
సోమమా! నిను శక్రుని శుభముకొఱకుఁ
బుట్టఁజేయుదు నని యత్రి పూతకన్య
స్నాన మాడంగఁబోవుచుఁ బూని పలికె ॥† 1308

(2)*క॥ వీరుఁడ వగు నో యింద్రుఁడ!
వారక యేతెమ్ము! వేగ వర సోమముకై
పారని శకుల వెలిఁగెడు
చారు పురోడాశసహిత సర్వస్తుతులన్ ॥ 1309

అర్థాంతరము

*గీ॥ ఇంద్ర! నీవు సమర్థుఁడ వెసఁగు వాఁడ
వౌచుఁ బ్రతిగృహసీమకు నమలసోమ
రసము పానము సేయంగ నసమతుష్టి
నరుఁగుచున్నాఁడవు గదయ్య! యందువలన ॥† 1310

*గీ॥ సక్తుమంతము దానాదిసహిత మింక
స్తోత్రముఖ్యాదియుక్తము శోభి మామ
కీన దంతాభిషుత మౌచుఁ గీర్తనీయ
మైన సోమముఁ ద్రావనౌఁ బూని యింద్ర! ॥† 1311

(3)*గీ॥ ఇంద్ర! నిన్ను నేను నింద్రుఁగా నెరుఁగక
సోమ మీయ నైతిఁ బ్రేమ మీర
క్షరణ శీల మౌచు క్షత్రరహిత మైన
సోమ మొందుమోయి! చోద్య పడఁగ ॥ 1312

అర్థాంతరము

*గీ॥ నిన్నుఁ దెలియంగ మా కిట నేర్పు లేదు
నీవు మా యిల్లు చేరిన నిశ్చయముగ
నింద్రుగఁ దెలియఁ గల్గుదు మేమటంచుఁ
బలికెను నపాల యింద్రుతోఁ బట్టు పట్టి ॥† 1313

---

* రచయిత ;—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† ఈ యర్థాంతరానువాద పద్యములు సాయనభాష్యానుసారములు. ఆర్షవిజ్ఞానము దృష్టితో నీ ఋక్కుల కున్న వైశిష్ట్యమే వేరు.

*గీ॥ క్షరణ సోమరసమ! కరము క్షిప్రమె నాదు
నోటినుండి నీవు బైటc బడవె!
యనcగ నోట వచ్చు నా సోమరసమును
నింద్రదేవుc డాని యేపుc గాంచె ॥† 1314

(4)*క॥ సోమము ద్రావిన యింద్రుcడు
పేర్మిమెయిన్ జూచి మమ్ముc బెంచుత! శక్తిన్
నీమమున మాటి మాటికిc
గామిత శక్తుల నొసంగి కావుత! నెపుడున్ ॥ 1315

అర్థాంతరము

*సీ॥ ఇంద్రదేవుcడు నాకు నెక్కుడు సామర్థ్య మిచ్చుచుc దాc బ్రీతి హెచ్చుcగాక!
నింద్రదేవుcడు నాకు నెక్కువల్ గల్పించి వివిధరీతులc దాను వెలయుcగాక!
నింద్రదేవుcడు నాకు నెక్కువ వసువులు కలుcగునట్టులుచేసి గ్రాలుcగాక!
నింద్రదేవుcడు నాకు నెక్కటికముc జూపి యన్ని విధంబుల నమరుcగాకc!
గీ॥ జర్మదోషంబుచే నేను జతురc డైన
భర్తచే వీడcబడి యిటు పరుగు లిడుచు
నస్యు లెవ్వరిచేతను నాదరింపc
బడక యింద్రునితోc జెల్మిc బడసి యుంటి ॥† 1316

(5)*గీ॥ మూcడు విష్టపస్థానాల మూర్తి గొన్న
నాభిశక్తుల నెరుcగంగc బ్రాభవమున
నుర్వరక్షేత్ర సంనాశకోన్నతగతి
నుండి పెంపును జెందును నుచిత రీతి॥ 1317

అర్థాంతరము

*గీ॥ సాదరంబుగ నింద్రుcడా! నాదు తండ్రి
రోమ వర్జిత శిరసును రోమశముగ
వాని యూసరమౌ క్షేత్రపంక్తి పూర్ణ
సస్యపూర్ణముగాc జేయ సాగు మీవు! ॥† 1318

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
† ఈ యర్థాంతరానువాద పద్యములు సాయనభాష్యానుసారములు. ఆర్షవిజ్ఞానము దృష్టితో
నీ ఋక్కుల కున్న వైశిష్ట్యమే వేరు.

*గీ॥ చర్మదోషంబుచే నాదు మర్మతలము
నందు రోమాళి లేకుండె నందువలన
నచట రోమాళిఁ బుట్టించి యమరు మింద్ర!
పుట్టి మూఁడు వరంబుల నిడుము! నాకు॥† 1319

(6)*గీ॥ సహ్య మైనట్టి స్థానము గుహ్య మౌచు
రోమవర్జితమై యొప్ప రూఢగతిని
జర్మదోషాలు నశియింప ధర్మశక్తి
నింద్ర! మమ్ములఁ గాపాడు మెనయఁ బ్రేమ॥ 1320

అర్థాంతరము

*గీ॥ నా పితృక్షేత్రమును మరి నాదు తండ్రి
శిరస్సు నా గుహ్యతలమును గరము సఫల
రోమశాఢ్యములుగఁ జేయు మో మహాత్మ!
యనుచు వేఁడె నపాల యయ్యమరవిభుని॥† 1321

(7)*గీ॥ నూరు జన్నాల నొనరింప నోపినట్టి
శక్ర! మహితంపు శక్తిని జల్పరహిత
రథశకటయుగచ్ఛిద్రాల రాణ మీర
శోధనముఁ జేసి పొందుము! సూర్యశక్తి॥ 1322

అర్థాంతరము

*గీ॥ బహువిధప్రజ్ఞుఁ డగు హరి ప్రథితరథశ
కటయుగచ్ఛిద్రములు నట్టి కాంత మూఁడు
వారములు శుద్ధిఁ జేసి యా వనిత తనువు
సూర్యసదృశముగాఁ జేసి శోభ నొసఁగె॥† 1323

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† ఈ యర్థాంతరానువాద పద్యములు సాయనభాష్యానుసారములు. ఆర్షవిజ్ఞానము దృష్టితో నీ ఋక్కుల కున్న వైశిష్ట్యమే వేరు.

## సూక్తమ్ –92

ఋషిః—శ్రుతకక్షః సుకక్షో వా ఆఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ, 1-అనుష్టుప్

(1) పాన్తమా వో[1] అన్ధస ఇన్ద్రమభి ప్ర గాయత ।
విశ్వాసాహం శతక్రతుం మంహిష్ఠం చర్షణీనామ్ ॥ 1509

(2) పురుహూతం పురుష్టుతం గాథాన్యం సనశ్రుతమ్ ।
ఇన్ద్ర[2] ఇతి బ్రవీతన ॥ 1510

(3) ఇన్ద్ర[3] ఇన్నో మహానాం దాతా వాజానాం నృతుః ।
మహాగ్ం అభిజ్ఞ్వా యమత్ ॥ 1511

(4) అపాదు శిప్ర్యన్ధసః సుదక్షస్య ప్రహోషిణః ।
ఇన్దోరిన్ద్రో యవాశిరః ॥ 1512

(5) తమ్వభి ప్రార్చతేన్ద్రం సోమస్య పీతయే ।
తదిద్ధ్యస్య వర్ధనమ్ ॥ 1513

---

1. వోఽఅన్ధసఽఇన్ద్ర, 2. ఇన్ద్రఽఇతి, 3. ఇన్ద్రఽఇన్నో. (ప్రా.ప్ర.)

(6) అస్య పీత్వా మదానాం దేవో దేవస్యౌజసా ।

విశ్వాభి భువనా భువత్ ॥ 1514

(7) త్యము వః సత్రాసాహం విశ్వాసు గీర్ష్వాయతమ్ ।

ఆ చ్యావయస్యూతయే ॥ 1515

(8) యుధ్మం సన్తమనర్వాణం సోమపామనపచ్యుతమ్ ।

నరమవార్యక్రతుమ్ ॥ 1516

(9) శిక్షా ణ[1] ఇన్ద్ర రాయ ఆ పురు విద్వాగ్ం ఋచీషమ ।

అవా నః పార్యే ధనే ॥ 1517

(10) అతశ్చిదిన్ద్ర ణ[2] ఉపా ఽఽ యాహి శతవాజయా ।

ఇషా సహస్రవాజయా ॥ 1518

(11) అయామ ధీవతో ధియో ఽర్వద్భిః శక్ర గోదరే ।

జయేమ పృత్సు వజ్రివః ॥ 1519

---

1. ణఽఇన్ద్ర రాయఽఆ పురు విద్వాగ్ంఽఋచీ, 2. ణఽఉపా యాహి. (వ్రా.ప్ర.)

(12) వయము త్వా శతక్రతో గావో న యవసేష్వా ।
ఉక్థేషు రణయామసి ॥ 1520

(13) విశ్వా హి మర్త్యత్వనా ఽనుకామా శతక్రతో ।
అగన్మ వజ్రిన్నాశసః ॥ 1521

(14) త్వే సు పుత్ర శవసో ఽవృత్రన్ కామకాతయః ।
న త్వామిన్ద్రాతి రిచ్యతే ॥ 1522

(15) స నో వృషన్ త్సనిష్ఠయా సం ఘోరయా ద్రవిత్న్వా ।
ధియావిడ్ఢి పురంధ్యా ॥ 1523

(16) యస్తే నూనం శతక్రతవిన్ద్ర ద్యుమ్నితమో మదః ।
తేన నూనం మదే మదేః ॥ 1524

(17) యస్తే చిత్రశ్రవస్తమో య[1] ఇన్ద్ర వృత్రహన్తమః ।
య[2] ఓజోదాతమో మదః ॥ 1525

1. యఽఇన్ద్ర, 2. యఽఓజోదాతమో. (ప్రా.ప్ర.)

(18) విద్మా హి యస్తే[1] అద్రివస్త్వాదత్తః సత్య సోమపాః ।
విశ్వాసు దస్మ కృష్టిషు ॥ 1526

(19) ఇన్ద్రాయ మద్వనే సుతం పరి ష్టోభన్తు నో గిరః ।
అర్కమర్చన్తు కారవః ॥ 1527

(20) యస్మిన్ విశ్వా[2] అధి శ్రియో రణన్తి సప్త సంసదః ।
ఇన్ద్రం సుతే హవామహే ॥ 1528

(21) త్రికద్రుకేషు చేతనం దేవాసో యజ్ఞమత్నత ।
తమిద్వర్ధన్తు నో గిరః ॥ 1529

(22) ఆ త్వా విశన్త్విన్దవః సముద్రమివ సిన్ధవః ।
న త్వామిన్ద్రాతి రిచ్యతే ॥ 1530

(23) వివ్యక్థ మహినా వృషన్ భక్షం సోమస్య జాగృవే ।
యః[3] ఇన్ద్ర జఠరేషు తే ॥ 1531

1. యస్తేఽఅద్రి, 2. విశ్వాఽఅధి, 3. యఽఇన్ద్ర. (వా.ప్ర.)

(24) అరం త[1] ఇన్ద్ర కుక్షయే సోమో భవతు వృత్రహన్ ।
అరం ధామభ్య[2] ఇన్దవః ॥ 1532

(25) అరమశ్వాయ గాయతి శ్రుతకక్షో[3] అరం గవే ।
అరమిన్ద్రస్య ధామ్నే ॥ 1533

(26) అరం హి ష్మా సుతేషు ణః సోమేష్విన్ద్ర భూషసి ।
అరం తే శక్ర దావనే ॥ 1534

(27) పరాకాత్తాచ్చిదద్రివస్త్వాం నక్షన్త నో గిరః ।
అరం గమామ తే వయమ్ ॥ 1535

(28) ఏవా హ్యసి వీరయురేవా శూర[4] ఉత స్థిరః ।
ఏవా తే రాధ్యం మనః ॥ 1356

(29) ఏవా రాతిస్తువీమఘ విశ్వేభిర్ధాయి ధాతృభిః ।
అధా చిదిన్ద్ర మే సచా ॥ 1537

---

1. తఒఇన్ద్ర, 2 ధామభ్యఒఇన్దవః, 3. కక్షోఒఅరం గవే, 4. శూరఒఉత. (వ్రా.ప్ర.)

(30) మో షు బ్రహ్మేవ తన్ద్రియుర్భువో వాజానాం పతే ।
మత్స్వా సుతస్య గోమతః ॥ 1538

(31) మా న[1] ఇన్ద్రాభ్యా౩దిశః సూరో[2] అక్తుష్వా యమన్ ।
త్వా యుజా వనేమ తత్ ॥ 1539

(32) త్వయేదిన్ద్ర యుజా వయం ప్రతి బ్రువీమహి స్పృధః ।
త్వమస్మాకం తవ స్మసి ॥ 1540

(33) త్వామిద్ధి త్వాయవో ఽనునోనువతశ్చరాన్ ।
సఖాయ[3] ఇన్ద్ర కారవః ॥ 1541

## సూక్తము—92

ఋషి—ఆంగిరసుఁడైన శ్రుతకక్షుఁడు లేక సుకక్షుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1)*గీ॥ శత్రు హననకారి శతయజ్ఞుఁడు మనుష్య
దాత యగును సోమ పూతరసము
నాభి ముఖ్యముగను నానెడు నా యింద్రు
సన్నుతింపుఁ డీరు సరుసులార! ॥ 1324

---

1. నఽఇన్ద్రా, 2. సూరోఽఅక్తుష్వా, 3. సఖాయఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

*రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(2)*క॥ పురుహూతుని గాతవ్యుని
చిరకాల విశుద్ధ నుతులఁ జెలఁగెడు వానిన్
స్థిరముగ నింద్రుఁ డటంచున్
బరమమతిన్ మీరు పలికి పావను లగుఁడీ! ॥ 1325

(3)*గీ॥ అట్టి యింద్రుఁడె మా కిల నన్న మిడుత!
వాఁడె భక్తుల కెదురుగా వచ్చుఁగాక!
వచ్చి కరముల ధనమును బుచ్చుకొనుచు
మా కొసంగుత! మాన్యులు మెచ్చునటుల ॥ 1326

(4,5)*గద్యము॥

సుశిర ప్రాణుఁడు దేవతలఁ దృప్తిపరచువాఁడు నగు సుదక్షుఁ డనెడు ఋషి సంబంధ మగు నదియు, స్రవించునదియు నగు సోమలక్షణాన్నము నింద్రుఁడు స్వీకరించెను. సోమపానమే యింద్రుని వృద్ధిఁ బరచునది. కాఁబట్టి ఋత్విజులారా! యింద్రుఁడు సోమపానమును గావించుటకు వానిని స్తుతియింపుఁడు! ॥ 1327

(6)*క॥ ముదమున మా సోమము హరి
సదయుండై త్రావి దేవసదనాళి లస
న్మదకర సోమ బలమ్మున
నది యిది యనకుండ జగము నంత జయించెన్ ॥ 1328

(7)*గీ॥ స్తోత! బహువిజేత, సుందర స్తోత్రాఁ,
వితతుఁడైన యట్టి విశ్వభర్త
యస్మదీయ రక్షణార్థము యజ్ఞముఁ
జేయునటుల నుతులఁ జేయు మీవు! ॥ 1329

(8)*గీ॥ శత్రు హింసితుండు శత్రు ప్రహారి స
మస్త నేత యైన మఘవకుఁ గడు
సోమరస మదంబు శోభిల్ల నతఁ డని
వారణీయుఁ డౌను వీరవరుఁడ! ॥ 1330

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9)*క॥ సర్వ విషయజ్ఞుఁడా! యింద్ర! సర్వదర్శ
నీయ! శత్రు ధనంబుల నిడుము! మాకు
నట్లు లొనరించి మమ్ముల నమితధనము
వలనఁ బాలింపుమా! నీవు బహుళ మహిమ ॥ 1331

(10)*గీ॥ శత్రు తలమునుండి శతబలంబు సహస్ర
సంఖ్య గలుగు నన్న శక్తి బహుళ
మైన యన్నరసము నధిగమించుచు మాకు
నభిముఖముగ నింద్ర! యరుగఁదెమ్మ! ॥ 1332

(11)*గీ॥ కర్మవంతులమై శక్ర! కదనకర్మ
నందుటకు మేము కర్మల నందఁగలము
కదనములయందు నింద్రుఁడు గలుగఁజేయు
నశ్వములతోడ జయముల నమరఁగలము ॥ 1333

(12)*క॥ గోపాలుఁడు గోగణములఁ
గాపాడుచు వానిఁ బెట్టు గ్రాసస్థలియం
దా పగిది బహువిచక్షణఁ
బ్రాపగు నిను నుంచఁగలము ప్రాంచత్ స్తుతులన్ ॥ 1334

(13)*గద్యము॥

బహుప్రజ్ఞుఁడా! యింద్రుఁడా మానవులు కామోపేతులు. కాఁబట్టి యో వజ్రీ! యష్టల
మగు మేము ధనాదికామములను బొందుచున్నాము ॥ 1335

(14)*గద్యము॥

ఓ బలపుత్రుఁడా! కామపరములగు శబ్దములు గల మనుష్యులు లెస్సఁగా నివసించుచున్నారు.
కావున బలముచేతఁగాని ధనముచేతఁగాని యెట్టి దేవుఁడును ని న్నతిక్రమింప
సమర్థుఁడు కాఁజాలఁడు॥ 1336

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(15)*గద్యము॥

కామవర్షి! యింద్రుఁడా! పూర్వోక్త లక్షణుఁడ వగు నీవు ఘోరమైనట్టియు, శత్రుభయంకర
మగునట్టిదియు, శత్రువులు పరుగిడునట్లు చేయునదియు నగు కర్మచే మమ్ముల
నన్నివిధంబులఁ బాలింపుము! ॥ 1337

(16)*గీ॥శతవిధ జ్ఞానవంత! యశస్వి యైన
సోమ మభిషుత మయ్యె నీ శోభకొఱకు
నిపుడు మా సోమమున మద మింద్ర! నీకుఁ
గలుగ మాకు ధనంబును గలుగనిమ్ము! ॥ 1338

(17)*క॥ ఎయ్యది కీర్తియుతంబో!
యెయ్యది యభిషుతమొ! నీకు నెది పాపంబుం
జయ్యనఁ గొట్టునొ! బలదం
బెయ్యది యా సోమ మింద్ర! హెచ్చు మద మిడున్! ॥ 1339

(18)*గీ॥నీ నిమిత్తము మే మిచ్చు నిఖిల సోమ
మద్రి వజ్రుఁడ! సత్య యత్యంతదర్శ
నీయ! యింద్రుఁడ! మే మెల్ల నిష్టులందు
నీదె యని యెఱింగెదముగా నిశ్చయముగ ॥ 1340

(19)*గీ॥ మదన శీలేంద్రునకు నభిమానమైన
సోమము నుతించుఁగాక! సులభవాక్కు-
పిమ్మటన్ స్తోత లెల్లరుఁ బ్రీతిఁ బూజ్య
సోము మర్చింత్రుగాక! నా సుందరునకు ॥ 1341

(20)*గీ॥ఎవనియందుఁ గా తు లెల్ల వసించునో!
యిష్టికర్మకర్త లెవని నుతుల
వేఁడుచుందు రట్టి వేల్పును నేఁ బిల్తు
సోమ పానమునకు నీమ మలర ॥ 1342

* రచయిత :—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(21)*చ॥ సురలు త్రికద్రుకంబుల సుశోభిలు చేతనయజ్ఞకర్మలన్
బరిపరి రీతులన్ జరిపి పాలన చేసిరో! వాని నెటు మా
వరనుతి వాక్కు లెల్ల ననివారిత పద్ధతితోడ నట్లు మా
సురుచిర యజ్ఞ కర్మముల సూటిగఁ జేయుత! సంతసంబునన్ ॥ 1343

(22)*గీ॥ స్యందమాన నదులు సంద్రంబుఁ జేరెడు
నట్లు మే మొసంగు నమల సోమ
మింద్ర! నిన్నె పొందు నెవ్వఁడు బలమున
నిన్ను గెలువఁగలఁడు? నిఖిలమందు ॥ 1344

(23)*గీ॥ ఏది నీ జఠరతలాన నెసఁగునట్టి
పడిఁ బ్రవేశించునో! కామవర్షి! యింద్ర!
జాగరణశీల! యా సోమ శక్తికొఱకు
సర్వతోవ్యాప్తిఁ జెందితి! శక్ర! నీవు ॥ 1345

(24)*గీ॥ పాపహంత మహేంద్ర! మా భాసమాన
సోమమే నీదు కుక్షిని సూక్ష్మరీతిఁ
దృప్తిఁ బొందించుఁగాక! సుదీప్త సోమ
మే భవత్తనువుకుఁ దృప్తి నిచ్చుఁగాక! ॥ 1346

(25)*క॥ శ్రుతకక్షి యనెడు ముని వి
శ్రుత గోవుల నశ్వములను శోభి వసతి నం
చితముగఁ బొందఁగ నింద్రుని
శ్రుతులం గొనియాడుచుండె సూక్తులవలనన్ ॥ 1347

(26)*గీ॥ మేము సోమరసము మేలుగఁ దీయంగ
నీవె దానిఁ గ్రోలి నెగడుచుంటి
ధన మొసంగు నీకు ఘనమైన సోమము
తృప్తిఁ జేయుఁగాక!దీప్తి నింద్ర! ॥ 1348

---

* రచయిత ;—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(27)*గీ॥ వజ్రవన్నింద్ర! మా స్తుతివర్గ మెల్ల
దూరమునుండి నిన్నుఁ దాఁ జేరుఁగాక!
నట్టులై యున్న స్తోతల మైన మేము
నీ ధనముఁ బొందుదుముగాక! నిశ్చయముగ ॥ 1349

(28)*గీ॥ వీరకర్మల నే వేళఁ గోరుచుందు
వందుచే నీవు శూరుఁడ వౌదు వింద్ర!
కదనములయందు ధైర్యాదికము ధరించు
చుంటచే నీ మనస్సు మహోన్నతంబు ॥ 1350

(29)*గీ॥ కర్మ కర్త లెల్లఁ గాంత గవాశ్వ ధ
నాదులను ధరింత్రు సాదరముగఁ
గాన నింద్ర! నీవు కర్మిష్ఠునకు నాకు
ధనముఖాదు లొసఁగి తనుపు! నన్ను 1351

(30)*గీ॥ భక్తి యాగాది హీనుఁడౌ బ్రాహ్మణుని వి
ధానఁ గాకుండ నుండవు తరచు నింద్ర!
యభిషుతంబౌచు దుగ్ధాన నమరియున్న
సోమమును గ్రోలుచున్ మదశోభఁ జెందు ॥ 1352

(31)*గద్యము॥

ఓ యింద్రుఁడా! యన్నివిధము లగు నాయుధములను బ్రయోగించు సమర శీలు రగు రాక్షసు లహోరాత్రులయందు నియుతులు కాకుండ నుందురుగాక! వా రట్లు వచ్చిన యెడల వారిని నీ సహాయమునఁ జంపఁగలము ॥ 1353

(32)*గీ॥ స్పర్థమానుల శత్రులఁ జంపఁగలము
నీ సహాయంబువల్లనే నిశ్చయముగ
నీవు మావాఁడ వౌదువు! నిఖిలమందు
మేము నీవార మౌదుము సామి! యింద్ర! ॥ 1354

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(33)*గద్యము॥

ఓ యింద్ర! ధనాదికమును నిన్ను యాచించుచు నిన్ను స్తుతించుచు సఖు లగు స్తోతలు నీకే స్తుతులచేఁ బరిచర్యఁ జేయుదురుగాక! ॥ 1355

## సూక్తమ్—93

ఋషిః—సుకక్ష ఆఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః, 34-ఇన్ద్ర ఋభవశ్చ
ఛందః—గాయత్రీ

(1) ఉద్ఘేదభి శ్రుతామఘం వృషభం నర్యాపసమ్ ।
అస్తారమేషి సూర్య ॥ 1542

(2) నవ యో నవతిం పురో బిభేద బాహ్వోజసా ।
అహిం చ వృత్రహావధీత్ ॥ 1543

(3) స న² ఇన్ద్రః శివః సఖాఽశ్వావద్గోమద్యవమత్ ।
ఉరుధారేవ దోహతే ॥ 1544

(4) యదద్య కచ్చ వృత్రహన్నుదగా³ అభి సూర్య ।
సర్వం తదిన్ద్ర తే వశే ॥ 1545

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఉద్ఘేదభి, 2. స నఽఇన్ద్రః, 3. దగాఽఅభి. (వా.ప్ర.)

(5) యద్వా ప్రవృద్ధ సత్పతే న మరా[1] ఇతి మన్యసే ।
ఉతో తత్ సత్యమిత్ తవ ॥ 1546

(6) యే సోమాసః పరావతి యే[2] అర్వావతి సున్విరే ।
[3]సర్వాగ్ంస్తాగ్ం ఇన్ద్ర గచ్ఛసి ॥ 1547

(7) తమిన్ద్రం వాజయామసి మహే వృత్రాయ హన్తవే ।
స వృషా వృషభో భువత్ ॥ 1548

(8) ఇన్ద్రః స దామనే కృత[4] ఓజిష్ఠః స మదే హితః ।
ద్యుమ్నీ శ్లోకీ స సోమ్యః ॥ 1549

(9) గిరా వజ్రో న సంభృతః సబలో[5] అనపచ్యుతః ।
వవక్ష[6] ఋష్వో అస్తృతః ॥ 1550

(10) దుర్గే చిన్నః సుగం కృధి గృణాన[7] ఇన్ద్ర గిర్వణః ।
త్వం చ మఘవన్ వశః ॥ 1551

---

1. మరాఽఇతి, 2. యేఽఅర్వావతి, (ప్రా.ప్ర.) 3. సర్వాంసాగ్ం (సా), స్తాగ్ంఽఇన్ద్ర, 4. కృతఽఓజిష్ఠః, 5. బలోఽఅన, 6. వవక్షఽఋష్వోఽఅస్తృతః, 7. గృణానఽఇన్ద్ర. (ప్రా.ప్ర.)

(11) యస్య తే నూ చిదాదిశం న మినన్తి స్వరాజ్యమ్ ।
న దేవో నాధ్రిగుర్జనః ॥ 1552

(12) అధా తే[1] అప్రతిష్కుతం [2]దేవీ శుష్మం సపర్యతః ।
ఉభే సుశిప్ర రోదసీ ॥ 1553

(13) త్వమేతదధారయః కృష్ణాసు రోహిణీషు చ ।
పరుష్ణీషు రుశత్ పయః ॥ 1554

(14) వి యదహేరధ త్విషో విశ్వే దేవాసో[3] అక్రముః ।
విదన్మృగస్య తాగ్ం[4] అమః ॥ 1555

(15) ఆదు మే నివరో భువద్వృత్రహాదిష్ట పౌంస్యమ్ ।
అజాతశత్రురస్తృతః ॥ 1556

(16) శ్రుతం వో వృత్రహన్తమం ప్ర శర్ధం చర్షణీనామ్ ।
ఆ శుషే రాధసే మహే ॥ 1557

---

1. తేఽఅప్ర, 2. దేవి, 3. దేవాసోఽఅక్రముః, 4. తాగ్ంఽఅమః. (ప్రా.ప్ర.)

(17) ఒయా ధియా చ గవ్యయా పురుణామన్ పురుష్టుత ।
యత్ సోమేసోమ ఆభవః ॥ 1558

(18) బోధిన్మనా ఇదస్తు నో వృత్రహా భూర్యాసుతిః ।
శృణోతు శక్ర ఆశిషమ్ ॥ 1559

(19) కయా త్వం న ఊత్యా ఒభి ప్ర మన్దసే వృషన్ ।
కయా స్తోతృభ్య ఆ భర ॥ 1560

(20) కస్య వృషా సుతే సచా నియుత్వాన్ వృషభో రణత్ ।
వృత్రహా సోమపీతయే ॥ 1561

(21) అభీ షు ణస్త్వం రయిం మన్దసానః సహస్రిణమ్ ।
ప్రయన్తా బోధి దాశుషే ॥ 1562

(22) పత్నీవన్తః సుతా ఇమ ఉశన్తో యన్తి వీతయే ।
అపాం జగ్మిర్నిచుమ్పుణః ॥ 1563

---

1. సోమః౽ఆభవః, 2. మనాః౽ఇదస్తు, 3. శక్రః౽ఆశిషమ్, 4. త్వం౽న,
5. స్తోతృభ్యః౽ఆ భర, 6. సుతాః౽ఇమః౽ఉశన్తో. (వా.ప్ర.)

(23) ఇష్టా హోత్రా అసృక్షతేన్ద్రం వృధాసో అధ్వరే।
అచ్ఛావభృథమోజసా॥ 1564

(24) ఇహ త్వా సధమాద్యా హరీ హిరణ్యకేశ్యా।
వోళ్హామభి ప్రయో హితమ్॥ 1565

(25) తుభ్యం సోమాః సుతా ఇమే స్తీర్ణం బర్హిర్విభావసో।
స్తోతృభ్య ఇన్ద్రమా వహ॥ 1566

(26) ఆ తే దక్షం వి రోచనా దధద్రత్నా వి దాశుషే।
స్తోతృభ్య ఇన్ద్రమర్చత॥ 1567

(27) ఆ తే దధామీన్ద్రియముక్థా విశ్వా శతక్రతో।
స్తోతృభ్య ఇన్ద్ర మృళయ॥ 1568

(28) భద్రంభద్రం న ఆ భరేషమూర్జం శతక్రతో।
యదిన్ద్ర మృళయాసి నః॥ 1569

---

1. హోత్రాఽఅసృక్ష, 2. వృధాసోఽఅధ్వరే, 3. వోళహామభి, 4. సుతాఽఇమే, 5. స్తోతృభ్యఽఇన్ద్ర, 6. స్తోతృభ్యఽఇన్ద్ర, 7. నఽఆ భరేష. (వ్రా.ప్ర.)

(29) స నో విశ్వాన్యా భర సువితాని శతక్రతో ।
యదిన్ద్ర మృళయాసి నః ॥ 1570

(30) త్వామిద్వృత్రహన్తమ సుతావన్తో హవామహే ।
యదిన్ద్ర మృళయాసి నః ॥ 1571

(31) ఉప నో హరిభిః సుతం యాహి మదానాం పతే ।
ఉప నో హరిభిః సుతమ్ ॥ 1572

(32) ద్వితా యో వృత్రహన్తమో విద[1] ఇన్ద్రః శతక్రతుః ।
ఉప నో హరిభిః సుతమ్ ॥ 1573

(33) త్వం హి వృత్రహన్నేషాం పాతా సోమానామసి ।
ఉప నో హరిభిః సుతమ్ ॥ 1574

(34) ఇన్ద్ర[2] ఇషే దదాతు న[3] ఋభుక్షణమృభుం రయిమ్ ।
వాజీ దదాతు వాజినమ్ ॥ 1575

---

1. విదఽఇన్ద్రః, 2. ఇన్ద్రఃఽఇషే, 3. నఃఽఋభుక్షణ. (ప్రా.ప్ర)

## సూక్తము—93

ఋషి—ఆంగిరసుఁడైన సుకక్షుఁడు
దేవత—ఇంద్రుఁడు, 34-ఇంద్ర ఋభువులు

(1)†గీ॥ సూర్య రూపేంద్ర! సర్వవిశ్రుతధనుండ
వౌచు యాచక ధనవర్షి వౌచు నర హి
తుండ వౌచు సుదాతృత్వమందితుండ
వౌచుఁ బుట్టుచునున్నాఁడ వేచి నీవు ॥ 1356

(2)†క॥ నవనవతి పురంబులఁ గడు
నెవఁడు విభేదించె? వృత్రు నెవఁడు దునిమెఁ? దా
నెవఁ డహినిఁ జంపెనో! యా
సవనజ్ఞుఁడు ధనము మాకుఁ జాలఁగ నిడుతన్! ॥ 1357

(3)†క॥ శివుఁడు సఖుండు మహేంద్రుఁడు
యవధాన్యము ధేనువులను నశ్వచయంబున్
నవ ధనమును మా కిచ్చుత!
భువి ధేనువు పాలు వత్సమున కిడునట్లే! ॥ 1358

(4)†గీ॥ అప్పు నావరించు నంబుదంబును గొట్టు
వాఁడ! సూర్యరూపవాసవుండ!
దేని కెదుట నీవు దీపించితివొ! యది
నీకు వశ్య మగుచు నిలిచియుండె ॥ 1359

(5)†గీ॥ స్వబలవర్ధమాన! సత్పతీ! యింద్రుఁడ!
"మానవుని విధాన మరణ మేను
బొంద" ననెడు నీదు పూర్ణమౌ మననంబు
సత్య మగునుగాదె! సర్వవిధుల ॥ 1360

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(6)†క॥ దూరాంతికదేశంబులఁ
జేరిన సోమముల మరియు శ్రీ ఋత్విజ్ఞుల్
పేరిచిన సోమ మెల్లన
పారముగాఁ గ్రోలె దీవు వాసవ! దేవా! ॥ 1361

(7)†క॥ జలములను నావరించిన
బలవంతుని వృత్రహతకుఁ బరిమార్పఁ, హరిన్
విలసిల్లెడు సోమస్తుతి
బలవంతునిగా నొనర్పఁ బరగుదుముగదా! 1362

†క॥ ధనదాత యగుచు నంతట
ధనియై విలసిల్లునట్టి ధర్మాత్ముం డీ
ఘనసోమ మొసఁగ మాకున్
ధనసేచకుఁ డగునుగాతఁ! దద్దయుఁ బ్రీతిన్ ॥ 1363

(8)†గీ॥ ధనము మొదలగు వానిని దాన మీయ
సోమపానంబు సేయంగ నీమ మలర
నింద్రుఁడు సృజింపఁబడెఁ గాన సృష్టియందు
నా మహేంద్రుఁడు సోమార్హుఁ డయ్యె జగతి 1364

(9)†గద్యము॥

వజ్రమున వజ్రాయుధము తీక్ష్ణముగాఁ జేయఁబడునట్లు స్తుతిలక్షణ వాక్కుల మూలమున స్తోతలచే నుత్పాదితుండై తీక్ష్ణకృతుండును నందువలన బలయుతుండును గావున ననభిగతుఁడు మహాత్ముఁడు యుద్ధమం దహింసితుఁడు నగు నింద్రుఁడు స్తోతల నిమిత్తము ధనాదికమును వహించుట కిచ్ఛగించును ॥ 1365

(10)†గద్యము॥

వాగ్వననీయేంద్రుఁడా! నీవు సంస్తూయమానుఁడవై దుర్గమ మగు మార్గమునుగూడ మాకు సుగమముగ నొనర్పుము! ఓ మఘవానుఁడా! సోమపానమునకై మమ్ములను గోరినచో మార్గమును శోభనగమనము గలదానినిగ నొనర్పుము! ॥ 1366

---

† రచయిత :—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(11)†గీ॥ నీ బలంబును నింద్రుఁడా! నీ స్వరాజ్య
సంపదను నన్యదేవుఁడు సకలజన్య
కర్మలను జేయు వీరులు కలుగఁబోవు
మానవుఁడుకూడ హింసింపఁబూనలేఁడు ॥ 1367

(12)†గీ॥ అన్యబలశోషకంబును నరి నిరోధి
యైన నీదు బలంబు నత్యంత దీప్య
మాన రోదసి పూజింపఁ బూనుచుండు
శుభశిరస్త్రాణుఁడా! యింద్ర! సొగసుగాఁడ! ॥ 1368

(13)†గీ॥ కృష్ణ వర్ణాంచితంబులౌ కీర్తనీయ
గోవులందును లోహిత గోవులందు
శ్వేతవర్ణ పయస్సును శ్రీ మహేంద్ర!
తాల్చుచుండుట బలమును దాల్తు! నీవు ॥ 1369

(14)†గీ॥ ఆహా సుసామర్థ్యమున భీతి నందినట్టి
విశ్వదేవత లెప్పుడు వివిధపాద
విహరణంబును జేసిరో! వృత్ర బలము
దేవతాపంక్తి నప్పుడు తెలిసికొనియె ॥ 1370

(15)†గీ॥ నాకు బంధువుగానున్న పాకహారి
వృత్రవారకుఁడై తాను వెలసె వాని
బలమునన్ రాజ్యము లభించె వాఁ డజాత
శత్రు వయ్యెను బ్రతిహత శత్రు వగుచు ॥ 1371

(16)†గీ॥ అతిబలంబువలన నతిరిక్తుఁ డగు వృత్ర
హంత యింద్రుఁ డెలమి యష్టలార!
ధనము మీకు నొసఁగ ఘనుని వానిని దెచ్చి
మీకుఁ జూపుచుంటి మిగుల నేను ॥ 1372

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(17)†క॥ బహువిధ నామోపేతుఁడ!
బహుసంస్తుత! సోమ నీవు పానముఁ జేయన్
బహువిధముల యత్నించిన
బహువిధముగ నాదియుక్త భాగ్యముఁ గనవే! ॥ 1373

(18)†గద్యము॥

వృత్రహంత యగు బహుదేశాభిషుతసోముఁడు స్తోతల యభిమతముల నెఱుఁగువాఁడును,
సంగ్రామములయందు శత్రుహననసమర్థుండును నగు నింద్రుఁడు మా స్తుతి
నాలకించుఁగాక! ॥ 1374

(19)†క॥ ఎప్పుడు మా యజ్ఞంబునఁ
దప్పక సోమమును ద్రావ దయచేసెదవో!
యెప్పుడు స్తోతలకున్ ధన
మొప్పగ నిచ్చెదవో! యింద్ర! యో కామదుఘా! ॥ 1375

(20)†గీ॥ ఎవని యజ్ఞమందు నింద్రుండు రమియించు!
నెవడు నియుతుఁడగునొ! యెవఁడు ధనము
నిచ్చు వృత్రహంత యెవ్వఁడో! యా హరి
మత్క్రతేష్టి కిపుడు మరలుఁగాక! ॥ 1376

(21)†గద్యము॥

ఇంద్రుఁడా! నీవు మే మిచ్చు సోమముచే మదించిన వాఁడవై సహస్రసంఖ్యాక ధనమును
మాకుఁ గొనితెమ్ము! "హవ్య మొసంగు యజమానునకు ధనప్రదాత వగుచున్నావు"
అని నీవు తెలిసికొనుము! ॥ 1377

(22)†గద్యము॥

పరిపాలించునవియు, నభిషుతము లైనవియు, భవదీయగృహస్థములును జమసస్థములు నగు
సోమములు తమ్ముఁ బానము చేయు మని కోరుచు నింద్రుని బొందుచున్నవి.
సోమము జలమధ్యమును బొందును ॥ 1378

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(23)†గీ॥ అస్మదీయ యజ్ఞహవ్యంబులు మహేంద్రు
వృద్ధిఁ బరచుచుండు వెలుఁగు సప్త
హోత లంతమందునున్న తేజస్సుతో
విడుచుచున్నవారు వేల్పు నింద్రు ॥ 1379

(24)†గద్యము॥

ఇంద్రునితోఁగూడ హవ్యములతోఁ దర్పితవ్యములు, హిరణ్మయస్కంధగతకేశవంతములు,
నగు హరు లను సంజ్ఞ గల యశ్వములు నీ యజ్ఞమందు హితకర మగు పయస్సును
లక్ష్యముగాఁ జేసికొని యింద్రుని దెచ్చునుగాక! 1380

(25)†గీ॥ భాసమానాగ్ని! సోమము పరగుచుండెఁ
బరుపఁబడె దర్భ లెల్లెడఁ గరము నీకు
నందుచే నింద్రుఁడు సుసోమ మానుటకయి
పిలిచికొనిరమ్ము! వానినిఁ బెద్ద వగుచు ॥ 1381

(26)†గద్యము॥

ఓ యిష్టా! దీప్యమాన మగు బలము నింద్రుఁడు నీ కిచ్చుఁగాక! రత్నముల నొసంగుఁగాక!
స్తోతలారా! మీ కింద్రుఁడు బలరత్నాదికమును గలుగఁజేయుఁగాక! మీ రింద్రుని స్తుతి
హవ్యములచేఁ బూజింపుఁడు! ॥ 1382

(27)†క॥ శతయజ్ఞుఁడ! వీర్యాంచిత
మతిరుచ్యంబైన సోమ మతిశయ నుతి సం
తతులను సంపాదించితి
సతతము నుతి కారకులకు సరి సుఖ మిడుమా! ॥ 1383

---

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(28,†సీ॥ కరము శుభ్రదం బౌచుఁ గళ్యాణతమ మైన ధనము నిచ్చుట నీకు ఘనత యగును
29,30) బలవదన్నంబును బహుయజ్ఞుఁడా! నీవు తగు మా కొసంగుట ధర్మ మగును
సర్వమంగళముల సమకూర్చి దానిని మా కొసంగుట నీకు మాన్య మగును
నభిషుతసోమము నంది సంప్రీతితో నిన్నుఁ బిల్చుట మాకు నిష్ట యగును
గీ॥ నంబువుల నాదరించిన యావరకముఁ
గొట్టినట్టి మహేంద్రుఁడా! యెట్టులైన
మమ్ము సుఖపెట్టఁదల్చుచో మాకు నీవు
ధనము నిడు! నిన్నుఁ బిల్తుము తత్క్షణంబు॥ 1384

(31)†క॥ శతసంఖ్యాకాశ్వంబుల
తతిఁ గూడుచు సోమనాథ! తత్క్షణమున నీ
వతి శీఘ్రము రా వెందుకు?
సుత సోతము ద్రావఁ బూని శుచికర్మలకున్ ॥ 1385

(32)†గీ॥ వృత్రహంత! శతక్రతూ! యింద్ర! యుగ్రుఁ
డవుదు వృత్రాది హరణంబునందు జగము
పాలనముఁ జేయునప్పుడు పరమశాంతుఁ
డవుదు! నీవు వడిన్ రమ్ము! హరులతోడ ॥ 1386

(33)†గీ॥ పాపహర! నీవు మా సోమపాయి వగుదు
వందుచే నశ్వములఁ గూడి యాదరమున
సోమరసమును ద్రావంగ శోభతోడ
నరుగఁదె మ్మిచ్చటకుఁ బ్రీతి కరము గూడి ॥ 1387

(34)†గద్యము॥

ఇంద్రుఁడు మాచేత నుతింపఁబడినవాఁడై యాగాది కర్మకరణమున మహాత్మమైనట్టి సోమ రసమును ద్రావుటచే నమరత్వమును బొందినట్టి ఋభువను దేవుని మా కొసంగునుగాక! బలవంతుఁ డగు నింద్రుఁడు వాజుఁ డను వాని కనిష్ఠభ్రాతను మా కన్నలాభమునకు నొసంగునుగాక! ॥ 1388

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## అనువాకః—10, సూక్తమ్—94

ఋషిః—బిన్దుః పూతదక్షో వా ఆఙ్గిరసః
దేవతా—మరుతః
ఛందః—గాయత్రీ

(1) గౌర్ధయతి మరుతాం శ్రవస్యుర్మాతా మఘోనామ్ ।
యుక్తా వహ్నీ రథానామ్ ॥ 1576

(2) యస్యా దేవా[1] ఉపస్థే వ్రతా విశ్వే ధారయన్తే ।
సూర్యామాసా దృశే కమ్ ॥ 1577

(3) తత్ సు నో విశ్వే[2] అర్య ఆ సదా గృణన్తి కారవః ।
మరుతః సోమపీతయే ॥ 1578

(4) అస్తి సోమో[3] అయం సుతః పిబన్త్యస్య మరుతః ।
ఉత స్వరాజో[4] అశ్వినా ॥ 1579

(5) పిబన్తి మిత్రో[5] అర్యమా తనా పూతస్య వరుణః ।
త్రిషధస్థస్య జావతః ॥ 1580

---

1. దేవాఽఉపస్థే, 2. విశ్వేఽఅర్యఽఆ సదా, 3. సోమోఽఅయం,
4. స్వరాజోఽఅశ్వినా, 5. మిత్రోఽఅర్యమా. (వ్రా. ప్ర.)

(6) ఉతో న్వస్య జోషమాగ్ం[1] ఇన్ద్రః సుతస్య గోమతః ।
ప్రాతర్హోతేవ మత్సతి ॥ 1581

(7) కదత్విషన్త సూరయస్తిర[2] ఆప ఇవ స్రిధః ।
అర్షన్తి పూతదక్షసః ॥ 1582

(8) కద్వో[3] అద్య మహానాం దేవానామవో వృణే ।
త్మనా చ దస్మవర్చసామ్ ॥ 1583

(9) ఆ యే విశ్వా పార్థివాని పప్రథన్ రోచనా దివః ।
మరుతః సోమపీతయే ॥ 1584

(10) త్యాన్ ను[4] పూతదక్షసో దివో వో మరుతో హువే ।
అస్య సోమస్య పీతయే ॥ 1585

(11) త్యాన్ ను యే వి రోదసీ తస్తభుర్మరుతో హువే ।
అస్య సోమస్య పీతయే ॥ 1586

---

1. మాగ్ంఽఇన్ద్రః, 2. స్తిరఽఆపఽఇవ, 3. కద్వోఽఅద్య, 4. త్యాన్నుపూత. (ప్రా.ప్ర.)

(12) త్యం ను మారుతం గణం గిరిష్ఠాం వృషణం హువే।
అస్య సోమస్య పీతయే॥ 1587

## అనువాకము—10, సూక్తము—94

ఋషి—ఆంగిరసుఁడైన బిందువు లేక పూతదక్షుఁడు
దేవత—మరుత్తులు

(1)*గీ॥ ధని మరుద్గణాలకు నెల్ల, దాతి యైన
పృశ్ని యను గోవు సోమముఁ బిల్చుచుండు
నదియె యన్నంబుఁగూడఁ దా నందఁగోరు
నద్దియె మరుత్సమూహము యొద్ద నుండు॥ 1389

(2)*గద్యము॥

సర్వమరుత్తులకు మాత యగు గోవుయొక్క యుపస్థమునందుఁగల విశ్వేదేవతలచేతను
వ్రతములచేతను స్వప్నకర్మలు ధరింపఁబడును. సూర్యచంద్రులు సర్వలోక
ప్రకాశముకొఱకు నా గోవు సమీపమున నుందురు. అట్టి గోవు సోమమును
ద్రావుచున్నది॥ 1390

(3)*క॥ మే మొసఁగు సోమముం గొన
నీమముతోఁ దిరుగునట్టి నిఖిల జనులకున్
భీమ మరుద్గణ బలమును
శ్రీమహితస్తుతులతోడఁ జెప్పెదరుగదా!॥ 1391

(4)*క॥ మరుదర్థ మభిషుతంబయి
కర మిచ్చుట సోమరసము గ్రాలును మరి వా
రురుతరతేజస్సుం గొని
తరుచుగ నశ్వములఁ గూడి త్రావుదు రదియే!॥ 1392

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5)*గీ॥ స్తుత్యజనవంతమును బరిశోధితంబు
మూఁడు సుస్థానములు గల్గి మరియునదియు
నైన సోమరసంబును నర్యముఁడు వ
రుణులు మిత్రుండుఁ ద్రావెద రనయముఁ గడు ॥ 1393

(6)*గద్యము॥

మరియుఁ బ్రాతస్సవనమున స్తోత దేవతల స్తుతులను వినుట కిచ్చగించునటులు నింద్రుఁడు
మాచే నభిషుత మైనట్టియు గవ్యమిశ్రితమైనట్టియు దశాపవిత్రమున సంశోధింపఁబడియున్న
సోమముయొక్క పానరూఢ సేవను ప్రాతస్సవనమునందుఁ బ్రత్యక్షముగా
వినుతించును ॥ 1394

(7)*గీ॥ పూని ప్రాఙ్ము లుదకమును బోలుచుం దిర
శ్చీన గతినిఁ గల్గి చెలఁగు వార
లెపుడు బలి మరుత్తు లెప్పుడు వచ్చెద
రిష్టిఁ జూడఁగోరి యెలమిఁ దాము॥ 1395

(8)*గీ॥ భూషణంబులు లేకున్న పూత దర్శ
నీయు లవుటను దీప్తినిఁ బాయనట్టి
మీర లెపుడున్ మరుత్తులు! చేరి మమ్ముఁ
బాలనము చేయువారలు పరమప్రీతి॥ 1396

(9)*గీ॥ ఎవరు పార్థివ భూతాళి దివిని వెల్గు
దివ్య తేజస్సులనుగూడఁ దివిరి విస్తృ
తములుగాఁ జేయు వారలో! తగిన యట్టి
వారలను సోమమునకయి చేరి పిల్తు॥ 1397

(10)*క॥ పరిశుద్ధ బలము గలుగుచుఁ
బరమంబౌ తేజమునను భాసిల్లెడు నో
మరుదమరులార! మిమ్ముల
సురుచిర సోమంబుఁ ద్రావ సూక్తులఁ బిలుతున్॥ 1398

---

* రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(11)*క॥ పరమంబౌ స్వబలంబున
స్థిరముగ రోదసినిఁ జేసి చెలఁగుచు నుంటన్
మరుదమరులార! మిమ్ముల
సురుచిర సోమంబుఁ ద్రావ సూక్తిని బిలుతున్॥ 1399

(12)*గీ॥ సర్వతో విస్తృతంబును సరస మేఘ
సంస్థితంబును మరుత్సంఘ మేను
క్షిప్రగమనంబునన్ సోమసీమ నందఁ
బిలుచుచుందును నేవేళఁ బ్రీతి నేను॥ 1400

## సూక్తమ్—95

ఋషిః—తిరశ్చీరాఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—అనుష్టుప్

(1) ఆ త్వా గిరో రథీరివాఽస్థుః సుతేషు గిర్వణః।
అభి త్వా సమనూషతేన్ద్ర వత్సం న మాతరః॥ 1588

(2) ఆ త్వా శుక్రా[1] అచుచ్యవుః సుతాస[2] ఇన్ద్ర గిర్వణః।
పిబా త్వస్యాన్ధస[3] ఇన్ద్ర విశ్వాసు తే హితమ్॥ 1589

(3) పిబా సోమం మదాయ కమిన్ద్ర శ్యేనాభృతం సుతమ్।
త్వం హి శశ్వతీనాం పతీ రాజా విశామసి॥ 1590

---

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. శుక్రాఽఅచుచ్యవుః, 2. సుతాసఽఇన్ద్ర, 3. స్యాన్ధసఽఇన్ద్ర. (వా.ప్ర.)

(4) శ్రుధీ హవం తిరశ్చ్యా[1] ఇన్ద్ర యస్త్వా సపర్యతి।
సువీర్యస్య గోమతో రాయస్పూర్ధి మహాꣳ[2] అసి ॥ 1591

(5) ఇన్ద్ర యస్తే నవీయసీం గిరం మన్ద్రామజీజనత్ ।
చికిత్విన్మనసం ధియం ప్రత్నామృతస్య పిప్యుషీమ్ ॥ 1592

(6) తము ష్టవామ యం గిర[3] ఇన్ద్రముక్థాని వావృధుః ।
పురూణ్యస్య పౌంస్యా సిషాసన్తో వనామహే ॥ 1593

(7) ఏతో న్విన్ద్రం స్తవామ శుద్ధం శుద్ధేన సామ్నా ।
శుద్ధైరుక్థైర్వావృధ్వాంసం శుద్ధ[4] ఆశీర్వాన్ మమత్తు ॥ 1594

(8) ఇన్ద్ర శుద్ధో న ఆ[5] గహి శుద్ధః శుద్ధాభిరూతిభిః ।
శుద్ధో రయిం ని ధారయ శుద్ధో మమద్ధి సోమ్యః ॥ 1595

(9) ఇన్ద్ర శుద్ధో హి నో రయిం శుద్ధో రత్నాని దాశుషే ।
శుద్ధో వృత్రాణి జిఘ్నసే శుద్ధో వాజం సిషాససి ॥ 1596

---

1. తిరశ్చ్యాఽఇన్ద్ర, 2. మహాꣳఽఅసి, 3. యం గిరఽఇన్ద్ర,
4. శుద్ధఽఆశీర్వాన్, 5. నఽఆ గహి. (వ్రా.ప్ర.)

## సూక్తము—95

ఋషి— ఆంగిరసుఁడైన తిరశ్చి
దేవత—ఇంద్రుఁడు

(1)క॥ వననీయమహేంద్రుఁడ! రథి
తన గంతవ్యస్థలంబుఁ దాఁ జేరెడు తీ
రున నస్మదీయ నుతితో
నినుఁ జేరును సోమ మెల నిశ్చయము సుమా!॥ 1401

క॥ ధేనువు వత్సమునుం గని
మానక శబ్దంబుఁ జేయుమాడ్కి మహేంద్రా!
మా నుతి సంఘము నిను స
న్మానముతోఁ బొగడుచుండె మాన్యులు మెచ్చన్॥ 1402

(2)గీ॥ పాత్రములయందు విలసిల్లు పరమ సోమ
ములు నినుం బొందుఁగాక! సమ్మోద మలర
నీదు భాగముఁ ద్రావుము! నిఖిల దిక్కు-
లందు సోమాదికంబుండు టందువలన॥ 1403

(3)గీ॥ వహ్నులకు దేవతామరుద్వర్గమునకుఁ
బతివి! రాజువు! కావున వాసవుండ!
శ్యేనగాయత్రి తెచ్చిన పానయోగ్య
సోమమును నీవు గ్రోలుము! శోభ మీర॥ 1404

(4)గీ॥ హవ్యముల నీకు నేవేళ నందఁజేయు
నటి నా స్తుతి నాలింపుమయ్య! నీవు
సుతగవాశ్వాదియుతమును సుభగవీర్య
వంతమును నగు ధనమును వరుస నిమ్ము!॥ 1405

(5) గీ॥ క్రొత్తదియు[1] మదము నే వేళఁ గూర్చునదియు
నైన నుతి నెవ్వఁడు పఠించు నతనికొఱకు
దివ్య సత్యస్వరూప మతీంద్రియార్థ
దర్శకం బగు నీ రక్షఁ దయ నొసఁగుము!॥ 1406

(6) క॥ స్తుతు లుక్థము లెవ్వని వి
స్తృతునిగఁ జేసినవో! వాని తీవ్ర సుతులన్
నుతియింతుము తద్వీర్య
ప్రతతులను భజించి వానిఁ బ్రకటింపమొకో! ॥ 1407

(7) గద్యము॥

శుద్ధ్యుత్పాదక మగు సామముచే శుద్ధిహేతువు లగు నుక్థములచేతను నింద్రుని బరిశుద్ధునిగా†
నొనర్చి స్తుతించెదము. పిమ్మట సామశస్త్రములవలనఁ బాపరహితుఁడయి వృద్ధిఁ బొందిన
యింద్రుని శుద్ధమును, నాశ్రయణవంతము నగు సోమము మదింపఁజేయుఁగాక!॥ 1408

(8) క॥ శుద్ధుఁడవై మా సామ వి
శుద్ధుఁడవై యింద్ర! నీవు శుద్ధమరుత్సం
శుద్ధుఁడవై ధన మిడుచున్
శుద్ధిన్ సౌమ్యుండ వగుచు శోభం గనుమా! 1409

(9) క॥ శుద్ధుఁడవై హరి మాకున్
శుద్ధులరై హవ్య మొసఁగు శుద్ధాత్మలకున్
శుద్ధధనంబు నొసంగుము!
శుద్ధమతివి నీవ యగుట సూరిస్తుత్యా! ॥ 1410

క॥ శుద్ధుఁడవై యరిఁ ద్రుంచితి
శుద్ధుఁడవై యస్మదీయ సురుచిర సూక్తిన్
బద్ధమనస్కత నీ పరి
శుద్ధాన్నము మాకు నొసఁగఁజూడు! మహేంద్రా! ॥ 1411

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్త మైనది.

† పూర్వకాలమున నింద్రుఁడు వృత్రాసురుని జంపి బ్రహ్మహత్యాదిదోషమువలనఁ దనను నపరిశుద్ధునిగఁ దలఁచెను. తద్దోషమును నివారింపుమని యింద్రుఁడు ఋషులను బ్రార్థింప వారు సోమముచేతను శస్త్రములచేతను వానిని బరిశుద్ధునిగాఁ జేసిరి. అట్టి పరిశుద్ధుఁ డగు నింద్రునకు ఋషులు యాగాదుల నొనర్చి సోమాదు లొసంగిరి. (శాట్యాయన బ్రాహ్మణము) (నే.వేం.న.శా.)

## సూక్తమ్—96

ఋషిః—తిరశ్చీరాఙ్గిరసో, ద్యుతానో వా మారుతః
దేవతా—ఇన్ద్రః, 14-ఇన్ద్రామరుతః, 15-ఇన్ద్రాబృహస్పతీ
ఛందః—త్రిష్టుప్, 4-విరాట్, 21-పురస్తాజ్జ్యోతిః

(1) అస్మా[1] ఉషాస ఆతిరన్త యామమిన్ద్రాయ
నక్తమూర్మ్యాః సువాచః।
అస్మా[2] ఆపో మాతరః సప్త తస్థుర్నృభ్యస్తరాయ
సిన్ధవః సుపారాః ॥ 1597

(2) అతివిద్ధా విథురేణా చిదస్త్రా త్రిః
సప్త సాను సంహితా గిరీణామ్।
న తద్దేవో న మర్త్యస్తుతుర్యాద్యాని
ప్రవృద్ధో వృషభశ్చకార ॥ 1598

(3) ఇన్ద్రస్య వజ్ర[3] ఆయసో నిమిశ్ల ఇన్ద్రస్య
బాహ్వోర్భూయిష్ఠమోజః।
శీర్షన్నిన్ద్రస్య క్రతవో నిరేక[4]
ఆసన్నేషన్త శ్రుత్యా ఉపాకే ॥ 1599

1. అస్మాఽఉషాసాఽఆతిరన్త, 2. అస్మాఽఆపో, 3. వజ్రఽఆయసో నిమిశ్లఽఇన్ద్రస్య,
4. నిరేకఽఆసన్నేషన్త శ్రుత్యాఽఉపాకే. (ప్రా.ప్ర.)

(4) మన్యే త్వా యజ్ఞియం యజ్ఞియానాం

మన్యే త్వా చ్యవనమచ్యుతానామ్ ।

మన్యే త్వా సత్వనామిన్ద్ర కేతుం మన్యే

త్వా వృషభం చర్షణీనామ్ ॥ 1600

(5) ఆ యద్వజ్రం బాహ్వోరిన్ద్ర ధత్సే

మదచ్యుతమహయే హన్తవా[1] ఉ ।

ప్ర పర్వతా[2] అనవన్త ప్ర గావః ప్ర

బ్రహ్మాణో[3] అభినక్షన్త ఇన్ద్రమ్ ॥ 1601

(6) తము ష్టవామ య[4] ఇమా జజాన

విశ్వా జాతాన్యవరాణ్యస్మాత్ ।

ఇన్ద్రేణ మిత్రం దిధిషేమ గీర్భిరుపో

నమోభిర్వృషభం విశేమ ॥ 1602

(7) వృత్రస్య త్వా శ్వసథాదీషమాణా

విశ్వే దేవా[5] అజహుర్యే సఖాయః ।

మరుద్భిరిన్ద్ర సఖ్యం తే[6] అస్త్వథేమా

విశ్వాః పృతనా జయాసి ॥ 1603

---

1. హన్తవాఽఉ, 2. పర్వతాఽఅనవన్త, 3. బ్రహ్మాణోఽఅభినక్షన్తఽఇన్ద్రమ్,

4. యఽఇమా, 5. దేవాఽఅజహుర్యే, 6. తేఽఅస్త్వథేమా. (ప్రా.ప్ర.)

(8) త్రిః షష్టిస్త్వా మరుతో వావృధానా[1]
ఉస్రా ఇవ రాశయో యజ్ఞియాసః ।
ఉప త్వేమః కృధి నో భాగధేయం శుష్మం
త[2] ఏనా హవిషా విధేమ ॥ 1604

(9) తిగ్మమాయుధం మరుతామనీకం కస్త[3]
ఇన్ద్ర ప్రతి వజ్రం దధర్ష ।
అనాయుధాసో[4] అసురా అదేవాశ్చక్రేణ
తాగ్ం[5] అప వప ఋజీషిన్ ॥ 1605

(10) మహ[6] ఉగ్రాయ తవసే సువృక్తిం
ప్రేరయ శివతమాయ పశ్వః ।
గిర్వాహసే గిర[7] ఇన్ద్రాయ పూర్వీర్ధేహి
తన్వే కువిదఙ్గ వేదత్ ॥ 1606

(11) ఉక్థవాహసే విభ్వే మనీషాం ద్రుణా
న పారమీరయా నదీనామ్ ।
ని స్పృశ ధియా తన్వి శ్రుతస్య
జుష్టతరస్య కువిదఙ్గ వేదత్ ॥ 1607

---

1. వృధానాఽఉస్రాఽఇవ, 2. తఽఏనా, 3. కస్తఽఇన్ద్ర, 4. యుధాసోఽఅసురాఽఅదేవా,
5. తాగ్ంఽఅప వపఽఋజీషిన్, 6. మహఽఉగ్రాయ, 7. గిరఽఇన్ద్రాయ. (వ్రా. ప్ర.)

(12) తద్వివిడ్ఢి యత్ త[1] ఇన్ద్రో జుజోషత్ స్తుహి
సుష్టుతిం నమసా వివాస ।
ఉప భూష జరితర్మా రువణ్యః శ్రావయా
వాచం కువిదఙ్గ వేదత్ ॥ 1608

(13) అవ ద్రప్సో[2] అంశుమతీమతిష్ఠదియానః
కృష్ణో దశభిః సహస్రైః ।
ఆవత్ తమిన్ద్రః శచ్యా ధమన్తమప
స్నేహితీర్నృమణా[3] అధత్త ॥ 1609

(14) ద్రప్సమపశ్యం విషుణే చరన్తముపహ్వరే
నద్యో[4] అంశుమత్యాః ।
నభో న కృష్ణమవతస్థివాంసమిష్యామి
వో వృషణో యుధ్యతాజౌ ॥ 1610

(15) అధ ద్రప్సో[5] అంశుమత్యా ఉపస్థే
ఽధారయత్ తన్వం తిత్విషాణః ।
విశో[6] అదేవీరభ్యాచరన్తీర్బృహస్పతినా
యుజేన్ద్రః ససాహే ॥ 1611

---

1. యత్తఽఇన్ద్రో, 2. ద్రప్సోఽఅంశు, 3. మణాఽఅధత్త, 4. నద్యోఽఅంశుమత్యాః,
5. ద్రప్సోఽఅంశుమత్యాఽఉపస్థే, 6. విశోఽఅదే. (ప్రా.ప్ర.)

(16) త్వం హ త్యత్ సప్తభ్యో జాయమానో
ఽశత్రుభ్యో[1] అభవః శత్రురిన్ద్ర ।
[2]గూళ్హే ద్యావాపృథివీ అన్వవిన్దో విభుమద్భ్యో
భువనేభ్యో రణం ధాః ॥ 1612

(17) త్వం హ త్యదప్రతిమానమోజో
వజ్రేణ వజ్రిన్ ధృషితో జఘన్థ ।
త్వం శుష్ణస్యావాతిరో వధత్రైస్త్వం
గా[3] ఇన్ద్ర శచ్యేదవిన్దః ॥ 1613

(18) త్వం హ త్యద్వృషభ చర్షణీనాం
ఘనో వృత్రాణాం తవిషో బభూథ ।
త్వం సిన్ధూగ్ంరసృజస్తస్తభానాన్
త్వమపో[4] అజయో దాసపత్నీః ॥ 1614

(19) స సుక్రతూ రణితా యః
సుతేష్వనుత్తమన్యుర్యో[5] అహేవ రేవాన్ ।
య[6] ఏక ఇన్నర్యపాంసి కర్తా స వృత్రహా
ప్రతీదన్యమాహుః ॥ 1615

---

1. శత్రుభ్యోఽఅభవః. 2. గూళహే ద్యావాపృథివీఽఅన్వ, 3. గాఽఇన్ద్ర, 4. త్వమపోఽఅజయో, 5. మన్యుర్యోఽఅహేవ. 6. యఽఏకఽఇన్నర్య. (వ్రా. ప్ర.)

(20) స వృత్రహేన్ద్రశ్చర్షణీధృత్ తం
సుష్టుత్యా హవ్యం హువేమ
స ప్రావితా మఘవా నోఽధివక్తా
స వాజస్య శ్రవస్యస్య దాతా ॥ 1616

(21) స వృత్రహేన్ద్ర[1] ఋభుక్షాః
సద్యో జజ్ఞానో హవ్యో బభూవ।
కృణ్వన్నపాంసి నర్యా పురూణి
సోమో న పీతో హవ్యః సఖిభ్యః ॥ 1617

## సూక్తము—96

ఋషి—ఆంగిరసుఁడైన తిరశ్చి లేక మారుతుఁడైన ద్యుతానుఁడు*
దేవత—ఇంద్రుఁడు, 14-ఇంద్రా మరుత్తులు, 15-ఇంద్రా బృహస్పతులు*

(1,2) సీ॥ వాసవు భీతిచేఁ బ్రత్యుషస్సులు తమ గమనాభివృద్ధిని గాంచుచుండు
హరికయి నిశియందు నఖిలజనావళి కళ్యాణవాక్కులఁ గలిఁగియుండు
సర్వత్ర వ్యాపించు సప్తసింధువులును స్యందమానంబులై సాగుచుండు
మనుజులు దాఁటంగ ననువులై యా సింధువులును దార్యంబులై వెలుఁగుచుండు
గీ॥ శత్రుమారక శీలుఁడౌ శక్రుఁ డేక
వింశతి గిరీశసానుప్రవిదళనంబుఁ
జేసి సోమప్రవృద్ధుఁడై సేసినట్టి
కార్యముల నెల్ల నెవ్వఁడు కలతఁ బెట్టు? ॥ 1412

1. వృత్రహేన్ద్రఽఋభుక్షాః. (వ్రా.ప్ర.)

* వ్రాతప్రతిలో (10వ సంపుటము. 5వ పుట) "మరుత్పుత్రుఁడో. అంగీరసో" ఋషిగాను "ఇంద్రుఁడు" దేవతగాను వ్రాసి, 15b సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ద్యుతనుఁడు లేక తిరశ్చి" ఋషిగాను, "ఇంద్రుఁడు, మరుత్తులు, ఇంద్రబృహస్పతులు" దేవతగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(3) సీ॥ మఘవవజ్రం బయోమయమయి తద్ధస్త తలమున నేవేళ వెలుఁగుచుండుఁ
గానఁ దద్భుజములు కమనీయ వీర్యంబు గలుఁగుచుఁ గార్యముల్ కలుపుచుండు
జన్యంబులకు హరి జరుగఁగ గన్నులు వీక్షణాదిక్రియన్ వెలుఁగుచుండు
నశ్వాదులను ద్రోలుఁ దను వాక్యపద్ధతి వాని యాస్యంబునఁ బరగుచుండు
గీ॥ మరియు సంగ్రామమునకయి యరుగుచున్న
యింద్రదేవుని వాక్యంబు లెల్ల వినుట
కయి తదంతికమును జేరఁ గ్రాలుచున్న
వారు భృత్యులు సర్వదా వీరు లగుచు॥ 1413

(4) సీ॥ యజ్ఞార్హులైనట్టి యమరుల ముందర నిష్టి కర్హుఁడ వని యెరుఁగుచుంటి
పవివల్లఁ బర్వతపంక్తిఁ గొట్టుటకయి తగినవాఁడ వటంచుఁ దలఁచుచుంటి
భజమానులైనట్టి భటులకుఁ గేతువుగా నిన్ను శక్రుఁడ! కాంచుచుంటి
మానవాభిమతంబుఁ బూని యిచ్చెద వంచు ఘనబుద్ధితో ననుకొనుచునుంటి
గీ॥ బలవిరాజితులైనట్టి వైరివరుల
నెల్లఁ ద్రుంచెద వంచు నే నెరుఁగుచుంటి
భక్తసంతతికిన్ నీవు పరుఁడ వనుచు
నంచితంబుగ నిన్ బ్రశంసించుచుంటి॥ 1414

(5) సీ॥ అహిని జంపఁగఁ బవి నమరుఁడు తాల్పఁగ జలదముల్ ధ్వనిఁ జేసి వెలిఁగియుండె
నహిని జంపఁగఁ బవి నమరుఁడు తాల్పఁగఁ దత్రస్థ జలములు ధ్వని నొనర్చె
నహిని జంపఁగఁ బవి నమరుఁడు ధరియింపఁ దాను స్తుతుల నెల్లఁ బూనియుండె
నహిని జంపఁగఁ బవి నమరుఁడు తాల్పఁగ బ్రాహ్మణుం డాతని బ్రస్తుతించె
గీ॥ మదము నడఁగించు శత్రుల మద మణంచు
పవిని నీచేతఁ బట్టఁగా వాసవుండ!
బహుళవృద్ధిని బొందిన పర్వతములు
నిశ్చలంబుగ నుతియించె నిన్ను భీతి॥ 1415

(6) సీ॥ వానినే మే మెల్ల వర్గముగాఁ గూడి సంస్తవంబులఁ జేయఁజాలఁగలము
వానినే స్తుతులచే వర్ణించి తన్మైత్రిఁ బరమభక్తిని మేము పడయఁగలము
వానికి సఖులము మాన కయ్యెద మని తీరైన స్తుతుల నుతింపఁగలము
వాని మా యభిముఖ వర్తిఁ జేసికొనంగ హవ్యాదు లందించి యమరఁగలము
గీ॥ వానివల్లనే సర్వమౌ వస్తు వితతి
యపరకాలీనములు కూడ నవతరించు
నెవ్వఁడు సమస్త భూతాళి నెల్లవిధులఁ
బుట్టఁజేయుచు నింద్రుఁడై పూజ్యుఁ డగునొ?॥ 1416

(7) గద్యము॥

ఇంద్రుఁడా! యే విశ్వేదేవతలు "నీ సఖిత్వమును సంగ్రామములయందుఁ బొందఁగల మని నీకు మిత్రు లయిరో! యా విశ్వేదేవతలు వృత్రాసురుని నిశ్వసనమువలన భీతులై యంతటను బరుగిడుచు యుద్ధమునందు నిన్ను విడిచిరి. ఇది యిట్లుండ నో యింద్రుఁడా! మరుత్తులతో సఖిత్వము నీ కుండనిమ్ము! వారు నీ మైత్రిని విడనాడరు. నీ శత్రుసేన లన్నిటిని నీవు జయింపఁగలవు॥ 1417

(8) గద్యము॥

ఓ యింద్రుఁడా! త్రిషష్ఠి సంఖ్యాకము లగు మరుత్తులు గోవుల వలె సంఘీభవించి నిన్ను వృద్ధిఁ బొందించి యజ్ఞార్హము లైనవి. మరుత్సహాయము గల నిన్నుఁ బొందెదము. కావున నీవు మాకు భజనీయ మగు ధనము నిమ్ము! మరల మేమును హవిస్సుచే శత్రుశోషక మగు బలమును నీకుఁ గలుఁగఁజేయుదుము॥ 1418

(9) గీ॥ అమరుఁడా! నీదు తీక్ష్ణమౌ నాయుధంబు,
వజ్రము, మరుత్సమూహంబు, పామరామ
రాశి నెవ్వఁడు నిందింపఁ గ్రాలు వాఁడొ!
చెప్పఁగా నౌను నెవనికిఁ? దప్పకుండ॥ 1419

గీ॥ ఓ ఋజీష! యింద్ర! యోపియ దేవుల
చక్ర సదృశ మైన శక్తివలన
నపగతాసువులుగ నతిశీఘ్ర మొనరించి
వెలుఁగుమయ్య! నీవు విశ్వమందు॥ 1420

(10) సీ॥ స్తోత! గుణోగ్రుని సుందరవృద్ధుని స్తుతియింపుమా! నీవు మతిఁ దలఁచి
కళ్యాణవంతుని గమనీయ సూక్తుల స్తుతియింపుమా! నీవు మతిఁ దలంచి
సుఖమును ధనమును జూపించుటకుఁ గడు స్తుతియింపుమా! నీవు మతిఁ దలంచి
మంత్రంబుల వహించు మఘవాను వేళ్ళతో స్తుతియింపుమా! నీవు మతిఁ దలంచి
గీ॥ యిటు లొనర్చిన పిమ్మట నింద్రవిభుడు
పుత్రసంతతికిన్ మఱి పూర్ణదేహ
మునకు ధన సంచయంబును బొందఁజేయుఁ
గాక! సంతుష్టి నే వేళఁ గలిఁగి తాను॥ 1421

(11) గీ॥ నావికుఁడు పథికుల నెల్ల నదుల యొడ్డు
చేర్చునట్టులు స్తోతృఁడా! శ్రీమహేంద్ర
విభునకున్ సన్నుతుల నెల్ల వివిధ రీతిఁ
బొందఁజేయుచు నుండుమా! పూర్ణభక్తి ॥ 1422

గీ॥ అంతటన్ విశ్రుతుండయి యమరునట్టి
ప్రీణయిత యయి మిక్కిలి పెరుగునట్టి
యింద్రదేవుని ధనమును నెల్ల మాకు
నీ నుతిం[1] గలుఁగఁజేయుము! నిష్ఠ నీవు ॥ 1423

(12) సీ॥ సోమాదిహవ్యంబు సుందరేంద్రుని కయి ఋత్విజుఁడా! ప్రీతి నిడుము నీవె!
చేసెడు స్తోత్రంబు శ్రీమహేంద్రుఁడు పొందునట్టు లొనర్చుచు నమరు నీవె!
స్తోతృప్రధానుఁడా! సురుచిర మహేంద్రుని వివిధ సూక్తులతోడ వేఁడు మీవె!
స్తోత్రహవిస్సుల సుందరేంద్రున కగు పరిచర్యఁ జేయంగ నరుగు దీవె!
గీ॥ సురుచిరాలంకృతుండవై శోభ గనుము!
ధనము లేదను దుఃఖంబు దాల్చకుండు
మింద్రుని నుతించుచో నీ వతంద్ర వృత్తి
నతఁడు ధనము నొసంగఁడె! యతిశయముగ ॥ 1424

(13) గద్యము॥

శీఘ్రముగఁ బోవుచు దశసహస్రసంఖ్యాకు లగు నసురులతోఁ గూడుకొని కృష్ణుఁ డను †నసురుఁ డంశుమతి యను నదిలో నుండెను. ప్రజ్ఞానముచే నుదక మధ్యమున జగద్భీతికర మగు శబ్దమును జేయు నా యసురుని నింద్రుఁడు మరుత్తులతోఁగూడి వెదలి పరిమార్చెను. వాని యనుచరులను గూడ సంహరించెను ॥ 1425

(14) గద్యము॥

మరుద్గణమా! ద్రుతగామి యగు కృష్ణుని నేను జూచితిని. వాఁడు విషమప్రదేశమందుఁ దిరుగాడుచుండెను. అంశుమతీనదియొక్క యత్యంతనిగూఢస్థానంబున నభస్సున నాదిత్యుని వలెఁ బ్రకాశించుచుండును. ఉదకసేచకు లగు మరుత్తులారా! వాఁడు దృష్టికిఁ గనఁబడిన దక్షణము యుద్ధార్థము మిమ్ములఁ గోరితిని. పిదప మీ రా కృష్ణుని యుద్ధమందు జయింతిరి! ॥ 1426

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

† ఇచ్చట నొక కథ కలదు - కృష్ణుఁ డను నసురుఁడు దశసహస్రసంఖ్యగల యసురలఁ గూడి యంశుమతీజల మధ్యమునందుండెను. అప్పు డింద్రుఁడు బృహస్పతితో సహా వచ్చి వానిని వాని యనుచరులను బరిమార్చెను. (నే.వేం.న.శా.)

(15) గద్యము॥

ద్రుతగామి యగు కృష్ణుఁ డంశుమతీ నదీ సమీపమునఁ బ్రకాశించుచుఁ బరులచే నహింస్య మైన
శరీరమును ధరించెను. అచ్చటి కింద్రుఁడు వచ్చి బృహస్పతి యను దేవత సహాయమునఁ
గృష్ణరూపము లగు సేనలను సంహరించెను॥ 1427

(16, సీ॥ జాయమానుండవై సప్తశత్రువులతో శత్రుత్వమును బూని సాగునట్టి
17) ప్రాదుర్భవించుచుఁ బరమగోవులకయి ఫణిగణ వైరివై పరగునట్టి
పర్వతద్యోభూమి పఙ్క్తిని సృష్టించి తివిరి యా త్రయమును దెలియనట్టి
లోక పంక్తులనుండి ప్రోకెదు రమణుని దర్శనీయంబుగఁ దాల్చునట్టి
గీ॥ వజ్రవన్నింద్ర! శాత్రవవర్గహనన
కార్యములయందుఁ గుశలతఁ గాంచుచుండి
మగటిమిం గల శుష్ణుని తగిన బలము
వజ్ర మను నాయుధంబున వంచి తీవు! ॥ 1428

(18) గద్యము॥

కామవర్షి! యింద్ర! నీవు మనుజోపద్రవములం గొట్టువాఁడవు! ప్రవృద్ధ బలవంతుఁడవు!
అసురులచే విరుధ్యమానము లగు గంగాదిసప్తనదులను సృజించితివి! అసురస్వాములను
జయించి జలమును బుట్టించితివి! ॥ 1429

(19) సీ॥ అభిషుత సోమంబు నానుచుండెడు వాఁడు శోభన కర్ముఁడై శోభఁ జెందు
వాఁడు శాత్రవపఙ్క్తి వంచుచుండెడు వాఁడు దివసముల్ ధనమునఁ దేలఁజేయు
వాఁడు ధనంబును బట్టుచుండెడు వాఁడు నిస్సహాయుండయి నిఖిల మనుజ
కర్మల కేవేళఁ గర్తయై వెలుఁగొంది యసురవిధ్వంసియై యమరుచుండు
గీ॥ వాఁ డనుచుఁ జెప్పుచుందురు పరమశత్రు
సంఘములఁ గూడఁ గిన్కతోఁ జంపుచుండు
వాఁ డనుచు సర్వవిధముల వాయి విడిచి
పలుకుచుందురు లోకులు పరమ ప్రీతి ॥ 1430

(20, సీ॥ ఆ వృత్రమారకుం డఖిల జనాళికి ధనము నొసంగెడు దాత యగును
21) నా యింద్రదేవత యస్మదీయస్తుతి కోలి విశేషము యోగ్యుఁ డగును
యా మేఘమే మాకు నధిక మౌ బహుమాన వరమతితో మాకు వక్త యగును
నాతఁడు కీర్తినో! యన్నంబునో! మాకుఁ దగ నిచ్చునట్టి వదాన్యుఁ డగును
గీ॥ నాతఁడే[1] ఋభుగణంబుతో నమరుచుండు
నతఁడు పుట్టిన యప్పుడె యఖిల యష్టృ
సంతతులవల్ల సంస్తుతుల్ చాలఁ గాంచు
నట్టి యింద్రుఁడె యఖిల మహాత్ముఁ డగును ॥ 1431

1. ఇక్కడ సంద్రగణమునకు మారు "నల"ము ప్రయుక్త మైనది.

గీ॥ నరులకు హితముఁ గూర్చుచుఁ గరము వెలిఁగి
యష్టలకు స్వర్గఫలముల నందఁజేయు
పీతసోమము చందానఁ బ్రీతి సఖుల
పిలుపునకు నింద్రుఁడే కడుఁ బెద్ద యగును॥ 1432

## సూక్తమ్—97

ఋషిః—రేభః కాశ్యపః
దేవతా—ఇన్ద్రః
ఛందః—బృహతీ, 10,13-అతిజగతీ, 11-12-ఉపరిష్టాద్బృహతీ,
14-త్రిష్టుప్, 15-జగతీ

(1) యా[1] ఇన్ద్ర భుజ ఆభరః స్వర్వాగ్ం అసురేభ్యః ।
స్తోతారమిన్మఘవన్నస్య వర్ధయ యే చ త్వే వృక్తబర్హిషః ॥ 1618

(2) యమిన్ద్ర దధిషే త్వమశ్వం గాం భాగమవ్యయమ్ ।
యజమానే సున్వతి దక్షిణావతి తస్మిన్ తం ధేహి మా పణౌ॥ 1619

(3) య[2] ఇన్ద్ర సస్త్యవ్రతో ఽనుష్వాపమదేవయుః ।
స్వైః ష[3] ఏవైర్ముమురత్ పోష్యం రయిం సనుతర్ధేహి తం తతః ॥ 1620

(4) యచ్ఛక్రాసి పరావతి యదర్వావతి వృత్రహన్।
అతస్త్వా గీర్భిర్ద్యుగదిన్ద్ర కేశిభిః సుతావాగ్ం[4] ఆ వివాసతి ॥ 1621

---

1. యాఽఇన్ద్రభుజఽఆభరః స్వర్వాగ్ంఽఅసురేభ్యః, 2. యఽఇన్ద్ర, 3. షఽఏవైర్ముః,

4. సుతావాగ్ంఽఆవివాసతి. (వా.ప్ర.)

(5) యద్వాసి రోచనే దివః సముద్రస్యాధి విష్టపి ।
యత్ పార్థివే సదనే వృత్రహన్తమ యదన్తరిక్ష[1] ఆ గహి ॥ 1622

(6) స నః సోమేషు సోమపాః సుతేషు శవసస్పతే ।
మాదయస్వ రాధసా సూనృతావతేన్ద్ర రాయా పరీణసా ॥ 1623

(7) మా న[2] ఇన్ద్ర పరా వృణగ్భవా నః సధమాద్యః ।
త్వం న[3] ఊతీ త్వమిన్న ఆప్యం మా న ఇన్ద్ర పరా వృణక్ ॥ 1624

(8) అస్మే[4] ఇన్ద్ర సచా సుతే ని షదా పీతయే మధు ।
కృధీ జరిత్రే మఘవన్నవో మహదస్మే[5] ఇన్ద్ర సచా సుతే ॥ 1625

(9) న త్వా దేవాస[6] ఆశత న మర్త్యాసో[7] అద్రివః ।
విశ్వా జాతాని శవసాభిభూరసి న త్వా దేవాస[6] ఆశత ॥ 1626

(10) విశ్వాః పృతనా[7] అభిభూతరం నరం సజూస్తతక్షురిన్ద్రం జజనుశ్చ రాజసే ।
క్రత్వా వరిష్ఠం వర[9] ఆమురిముతోగ్రమోజిష్ఠం తవసం తరస్వినమ్ ॥ 1627

---

1. రిక్షఽఆ గహి, 2. నఽఇన్ద్ర, 3. త్వం నఽఊతీ త్వమిన్నఽఆప్యం మా నఽఇన్ద్ర, 4. అస్మేఽఇన్ద్ర,
5. మహదస్మేఽఇన్ద్ర, 6. దేవాసఽఆశత, 7. మర్త్యాసోఽఅద్రివః, 8. పృతనాఽఅభి,
9. వరఽఆమురి. (వా. ప్ర.)

(11) సమీం రేభాసో[1] అస్వరన్నిన్ద్రం సోమస్య పీతయే ।
స్వర్పతిం యదీం వృధే ధృతవ్రతో హ్యోజసా సమూతిభిః ॥ 1628

(12) నేమిం నమన్తి చక్షసా మేషం విప్రా[2] అభిస్వరా ।
సుదీతయో వో[3] అద్రుహో ఽపి కర్ణే తరస్వినః సమృక్వభిః ॥ 1629

(13) తమిన్ద్రం జోహవీమి మఘవానముగ్రం
సత్రా దధానమప్రతిష్కుతం శవాంసి ।
మంహిష్ఠో గీర్భిరా చ యజ్ఞియో వవర్తద్రాయే
నో విశ్వా సుపథా కృణోతు వజ్రీ ॥ 1630

(14) త్వం పుర[4] ఇన్ద్ర చికిదేనా వ్యోజసా శవిష్ఠ శక్ర నాశయధ్యై ।
త్వద్విశ్వాని భువనాని వజ్రిన్ ద్యావా రేజేతే పృథివీ చ భీషా ॥ 1631

(15) తన్మ[5] ఋతమిన్ద్ర శూర చిత్ర పాత్వపో
న వజ్రిన్ దురితాతి పర్షి భూరి ।
కదా న[6] ఇన్ద్ర రాయ ఆ దశస్యేర్విశ్వప్స్న్యస్య[7]
స్పృహయాయ్యస్య రాజన్ ॥ 1632

ఇతి
షష్ఠోఽష్టకే షష్ఠోఽధ్యాయ
స్సమాప్తః

---

1. రేభాసోఽఅస్వర, 2. విప్రాఽఅభి, 3. వోఽఅద్రుహో, 4. పురఽఇన్ద్ర, 5. తన్మఽఋత,
6. కదా నఽఇన్ద్ర రాయఽఆ, 7. శ్వప్స్న్యస్య. (వ్రా.ప్ర.)

## సూక్తము—97

ఋషి—కాశ్యపుఁడైన రేభుండు
దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ అసురబృందము నెల్లఁ దా నంతఁ ద్రుంచి
సకల భోక్తవ్య ధనమును సంగ్రహించి
యున్నవాఁడవు! దానిని నో మహేంద్ర!
యిచ్చి మాకుఁ బ్రసిద్ధిని నెసఁగు మీవు! 1433

గీ॥ అన్యపురుషు లెవరు యష్టలై నినుఁగూర్చి
కుశల భూమిపైని గూర్చువార
లట్టి వార కెల్ల నతిశయధనమును
వృద్ధిఁ జేయు మింద్ర! వివిధగతుల॥ 1434

(2) చ॥ గమన సుసాధకంబులయి గ్రాలెడు నశ్వములన్ బయస్సులన్
సమముగ నిచ్చు గోవులను శాశ్వతమౌ ధనసంచయంబు నా
కుమతులవల్ల మాకు సమకూర్చు! మహేంద్రుఁడ! నీవు కాని పా
పముల నొనర్చు నీ పణికి భవ్యధనం బిడఁబోకు! ప్రీతితోన్॥ 1435

(3) ఉ॥ దేవతలన్ స్మరింపకను దివ్య తపస్సులఁ జేయకుండ నో
దేవ! మహేంద్ర! స్వప్నములఁ దేలెడునట్టులు నిద్ర పోవు వాఁ
డే విధి నైనఁ బోష్య మగు స్వీయధనంబును గోలుపోయెడున్
నీ వల వానిఁ బెట్టవఁటె! నిర్మల కర్మప్రదేశమం దౌగిఁ॥ 1436

(4,5)సీ॥దుష్టహారక! యింద్ర! ద్యోలోకమందున్న నీ వధస్థలియందు నిల్చియున్న
నతిసమీపంబున నమరుచున్నను భూమిభాగంబును బొందియున్న
దివి రెండు తలములఁ దిరుగాడుచున్నను నుదధి మధ్యంబును నొందియున్నఁ
బాపవారక! యింద్ర! పార్థివసదనంబునందున్న నే లోకమందు నున్నఁ
గీ॥ గౌరవంతంబు లౌచుఁ బ్రకాశమాన
హరుల వలె నుండి చాల సుందరము లైన
స్తుతులవల్లను యజమానతతులు నిన్నుఁ
గర్మలనుఁ బొందఁజేయంగఁగలరు సుమ్ము! ॥ 1437

(6) క॥ బలపాలక! యింద్రుడ! యీ
యిలఁ బుత్రోపేత మైన నెక్కుడు ధనముల్
బలవర్ధక మగు నన్నము
గలిగింపుము! నీవు మాకుఁ గరుణ దర్పన్॥ 1438

(7, సీ॥ మఘవ! సోమమువల్ల మాదనశీలుండవై ప్రకాశింపుమా! యధికతుష్టి
8,9) నింద్రుఁడా! మమ్ముల నెల్ల రక్షలయందు వసియింపఁజేయుమా! పరమకృపను
నీవె బాంధవుఁడవు! నిరతము మా కోట మము వీడకుండమా! మమత వెలుఁగ
మధుకర సోమేష్టి మమ్ములఁ గూడుచు నివసింపుమా! యిట నిశ్చలముగ
గీ॥ సోమరసమును ద్రావంగ శుభద దేవ
తలు మనుష్యులు నినుఁజేరి వెలుఁగలేరు
విశ్వఘాతంబులన్ నీవు విపుల సహజ
బలముచేత జయింతువు! భాగ్య మలర॥ 1439

(10)గీ॥ సేన లన్నియు నొకచోటఁ జేర్చియుండి
శత్రువర్గము నంతటఁ జంపువాని
సర్వనరనేత నింద్రుని సంస్తవముల
నధిక బలవంతునిగఁ జేయ సమరియుండె॥ 1440

గీ॥ శోభఁ గాంచుటకై తాము సూర్యరూపుఁ
డైన యింద్రుని బుట్టించి యఖిల భక్తు
లాత్మ ధనలాభమునకై యతని జేరి
సంస్తుతించుచునున్నారు సరసరీతి॥ 1441

గీ॥ ఉగ్రుఁ, దేజోవిశిష్టు, నుదగ్రయుద్ధ
శత్రుహననంబునకు వేగఁ జనెడు వాని
నాత్మ ధనలాభ మాశించి యఖిల పురుష
వరులు వర్ణించుచున్నారు వలసినట్లు॥ 1442

(11) ఉ॥ సోమము ద్రావ మం చఖిల సూరులు శక్రుని వేఁడి పిమ్మటన్
సీమముతోడ హస్తముల నిర్మల హవ్యముఁ బట్టికొంచు నా
సామి, ధనాధినాథు, మనసార నుతింప నతండు తృప్తుఁడై
భీమ బలప్రపాలనముఁ బెట్టు వహించునుగాదె! చూడఁగన్ ॥ 1443

(12) చ॥ అరముల నేమి పొందునటు నా యమరేంద్రుని జూచినంతనే
కరము నమోవచస్సు లతిగౌరవ రీతిని బొందె వాని నా
హరి పటు మేషమై మునిని నాదర మొప్పఁగ నాకభూమికిన్
వెరవునఁ బంప నా మునియుఁ బెట్టు మహేంద్రుని సంస్తుతింపఁడే! ॥ 1444

గీ॥ మీరు భక్తులార! మిక్కిలి దీప్తులై
కర్మకుశలు రగుచు ఘనతరేంద్రు
కర్ణసీమయందు వర్ణించు సూక్తుల
నాతఁ డాలకించు నధిక కృపను ॥ 1445

(13) గీ॥ పరమధను, నుగ్రుని, యదార్థ బలుని, శత్రు
వారకుని, నింద్రుఁ బిలుతు, నా వాసవుండు
పూజ్యతముఁడయి ప్రీతి సంపూర్ణుఁ డగుచు
నిలుచుఁగావుత! మీ యిష్టి నికటమందు ॥ 1446

గీ॥ వలసినంత ధనము వజ్రి మే మొందంగ
సుపథములను మాకుఁ జూపి చూపి
సకలదిశలనుండు సకల ధనంబును
నిచ్చుఁగాక! జనులు మెచ్చఁగాను ॥ 1447

(14) క॥ బలవత్తమ! శక్రుండా!
యిల శంబరపట్టణముల నెగురం గొట్టన్
పలె ననెడు తెలివిఁ గలుఁగుచు
వెలుఁగుచు నున్నావుకావె! వివిధక్రియలన్ 1448

ఆ॥ వజ్రధారి! నీదు బంధురధీతిచే
వివిధభూతతతులు, విపుల దివియు,
భూమి కంప మొందెఁ బోఁడిమి దప్పుచు
నుండునదియుఁ గలఁత నొందు నదియు॥ 1449

తే॥ వివిధరూప! యింద్ర! విపుల బలాఢ్యుఁడా!
నీ ప్రశస్త్ర జలము నిఖిల విధుల
నాణ మీర నన్నుఁ రక్షించుఁగాక! నో
వజ్రధారకుండ! వాసవుండ! ॥ 1450

మ॥ నావికుఁ డాపగాజలము నావలచే మనుజాళి కైవడిన్
నీవు మహేంద్రుఁడా! మముల నిస్తుల పాపమునుండి దాఁటఁగా
దావిరిఁ జేసి మాకుఁ గడు వాంఛిత మైన ధనంబు నెప్డు స
ద్భావముతోడ నిచ్చెదవొ! భాసుర గాత్రుఁడ! సత్యసాంద్రుఁడా! ॥ 1451

ఇయ్యది
శ్రీ భారద్వాజగోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
షష్ఠాష్టకమున షష్ఠాధ్యాయము
సంపూర్ణము



# సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## అష్టమం మండలమ్

### షష్ఠోఽష్టకః — సప్తమోఽధ్యాయః

### సూక్తమ్—98

ఋషిః—నృమేధ ఆఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—ఉష్ణిక్, 7,10-11-కకుప్, 9,12-పురఉష్ణిక్

(1) ఇన్ద్రాయ సామ గాయత విప్రాయ బృహతే బృహత్ ।
ధర్మకృతే విపశ్చితే పనస్యవే ॥ 1633

(2) త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః ।
విశ్వకర్మా విశ్వదేవో మహాఀ1 అసి ॥ 1634

(3) విభ్రాజఞ్జ్యోతిషా స్వరగచ్ఛో రోచనం దివః ।
దేవాస్త2 ఇన్ద్ర సఖ్యాయ యేమిరే ॥ 1635

---

1. మహాఀఽఅసి, 2. దేవాస్తఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(4) ఏన్ద్ర నో గధి ప్రియః సత్రాజిదగోహ్యః ।
గిరిర్న విశ్వతస్పృథుః పతిర్దివః ॥ 1636

(5) అభి హి సత్య సోమపా[1] ఉభే బభూథ రోదసీ ।
ఇన్ద్రాసి సున్వతో వృధః పతిర్దివః ॥ 1637

(6) త్వం హి శశ్వతీనామిన్ద్ర దర్తా పురామసి ।
హన్తా దస్యోర్మనోర్వృధః పతిర్దివః ॥ 1638

(7) అధా హీన్ద్ర గిర్వణః[2] ఉప త్వా కామాన్ మహః ససృజ్మహే ।
ఉదేవ యన్త[3] ఉదభిః ॥ 1639

(8) వార్ణ త్వా యవ్యాభిర్వర్ధన్తి శూర బ్రహ్మాణి ।
వావృధ్వాంసం చిదద్రివో దివేదివే ॥ 1640

(9) యుఞ్జన్తి హరీ[4] ఇషిరస్య గాథయోరౌ రథ[5] ఉరుయుగే ।
ఇన్ద్రవాహా వచోయుజా ॥ 1641

---

1. సోమపాఽఉభే. 2. గిర్వణఽఉప, 3. యన్తఽఉదభిః, 4. హరీఽఇషి, 5. రథఽఉరుయుగే. (వ్రా.ప్ర.)

(10) త్వం న[1] ఇన్ద్రా భరగ్ం ఓజో నృమ్ణం శతక్రతో విచర్షణే ।
ఆ వీరం పృతనాషహమ్ ॥ 1642

(11) త్వం హి నః పితా వసో త్వం మాతా శతక్రతో బభూవిథ ।
అధా తే సుమ్నమీమహే ॥ 1643

(12) త్వాం శుష్మిన్ పురుహూత వాజయన్తముప బ్రువే శతక్రతో ।
స నో రాస్వ సువీర్యమ్ ॥ 1644



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అష్టమ మండలము

### షష్ఠాష్టకము—సప్తమాధ్యాయము

### సూక్తము—98

ఋషి—ఆంగిరసుఁడైన నృమేధుఁడు
దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ ధర్మకర్త మహాత్ముఁడు తగు విపశ్చి
తుండు సంస్తవముల విన నుండు విప్ర
వరుఁడు నగు నింద్రునకు మీరు పరమసామ
మును బఠింపరె! యుద్గాతృముఖ్యులార ! ॥ 1452

---

1. నఽఇన్ద్రా భరగ్ంఽఓజో. (వ్రా.ప్ర.)

(2, సీ॥ శక్రుఁడా! నీ వెల్ల శత్రువులకుఁ బరాభవమును గల్పించి వరలలేదె ?
3,4) తేజఃప్రసక్తిచేఁ దేజస్వి నాదిత్యు నింపుగా నీవు వెల్గింపలేదె ?
యఖిలకర్ముండవై నమరుచు సర్వదా విశ్వదేవుండవై వెలుఁగలేదె ?
యాదిత్యదీపకం బైన నాకంబును బోషించుచున్ దాని బొందలేదె ?
గీ॥ నీదు మైత్రిని బొందంగ నిఖిలసురలు
సర్వరీతుల యత్నంబు సలుపలేదె ?
ప్రియతముండవు! జేతవు! పెద్దకొండ
వలెను నున్నట్టివాఁడవు స్వర్గపతివి! ॥ 1453

(5) గీ॥ సత్య! సోమపాయి! సకల భూ దివముల
గెలువఁగలిఁగి నీవు వెలుఁగుచుంటి!
సోమరసము దీయు సూరులకున్ వర్ధ
కుఁడవు! స్వర్గవర్ధకుఁడవు! నీవు ॥ 1454

(6) క॥ తెగఁగొట్టఁ దగుదు శత్రులఁ
దగు పురముల నసుమఁ జంపఁ దగుదు మహేంద్రా !
యొగి మనుజుల కిష్టికరుం
డగుదువు! నాకేశ్వరుండ వగుదువు! నీవే! ॥ 1455

(7) క॥ ఇప్పుడె నినుఁ బొందింతుము
తప్పక మా కామములను దద్దయు రతి నే
చొప్పున జలవర్షులు కడ
నొప్ప జనుల పైని జలము నొగిఁ జల్లెదరో ! ॥ 1456

(8) గీ॥ నదులచే [1]నుదకతలమును నరులు వృద్ధిఁ
బరుచునట్టులు పవిధారి పరమవృద్ధి
నొందియున్నట్టి నిను సేవకోత్తము లభి
వృద్ధిఁ బొందించుచున్నారు సిద్ధిఁ బడయ ॥ 1457

---

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్త మైనది.

(9) గీ॥ ఉరుయుగంబులు గల్గిన హరి రథోత్త
మమునకున్ వాని సద్వాహనముల గుండు
హరుల, వచనంబుచేతనే కరము గూర్చు
చున్నవారలు స్తోతలౌ సూరు లెల్ల ॥ 1458

(10) క॥ అనయము సూర్యోపేతం
బును, సేనాసహము నౌచుఁ బొలుపొందెడు నీ
ధనమును నోజోబలములఁ
బనిగొని యాచింతు మేము బహుకర్మ! నినున్ ॥ 1459

(11) గీ॥పాలకుండవు! పితవలెఁ బరమమాత
వలెను నుద్ధారకుండవు! వాసవుండ !
బహుసుకర్ముఁడ ! నీ దైన పరమసుఖము
మేము కోరుచున్నా మమేయభక్తి ॥ 1460

(12) క॥ పురుహూతుఁడ! బలవంతుఁడ!
సురుచిర మగు కర్మవలన శోభిలువాఁడా !
పరమతి నినుఁ బ్రార్థింతున్
గరము సువీర్యంబు నాకుఁ గల్పింపవొకో ! 1461

## సూక్తమ్ — 99

ఋషిః—నృమేధ ఆఙ్గిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

(1) త్వామిదా హ్యో నరో ఽపీప్యన్
వజ్రిన్ భూర్ణయః ।
స[1] ఇన్ద్ర స్తోమవాహసామిహ
శ్రుధ్యుప స్వసరమా గహి ॥ 1645

1. స ఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(2) మత్స్వా సుశిప్ర హరివస్తదీమహే

త్వే ఆ భూషన్తి వేధసః ।

తవ శ్రవాంస్యుపమాన్యుక్థ్యా

సుతేష్విన్ద్ర గిర్వణః ॥ 1646

(3) శ్రాయన్త[1] ఇవ సూర్యం

విశ్వేదిన్ద్రస్య భక్షత ।

వసూని జాతే జనమాన[2] ఓజసా

ప్రతి భాగం న దీధిమ ॥ 1647

(4) అనర్శరాతిం వసుదాముప

స్తుహి భద్రా ఇన్ద్రస్య రాతయః ।

సో[3] అస్య కామం విధతో న రోషతి

మనో దానాయ చోదయన్ ॥ 1648

(5) త్వమిన్ద్ర ప్రతూర్తిష్వభి

విశ్వా[4] అసి స్పృధః ।

అశస్తిహా జనితా విశ్వతూరసి

త్వం తూర్య తరుష్యతః ॥ 1649

---

1. శ్రాయన్తఽఇవ, 2. జనమానఽఓజసా, 3. సోఽఅస్య, 4. విశ్వాఽఅపి. (వ్రా.ప్ర.)

(6) అను తే శుష్మం తురయన్తమీయతుః

క్షోణీ శిశుం న మాతరా ।

విశ్వాస్తే స్పృధః శ్నథయన్త మన్యవే

వృత్రం యదిన్ద్ర తూర్వసి ॥ 1650

(7) ఇత[1] ఊతీ వో అజరం

ప్రహేతారమప్రహితమ్ ।

ఆశుం జేతారం హేతారం

రథీతమమతూర్తం తుగ్ర్యావృధమ్ ॥ 1651

(8) ఇష్కర్తారమనిష్కృతం సహస్కృతం

శతమూతిం శతక్రతుమ్ ।

సమానమిన్ద్రమవసే హవామహే

వసవానం వసూ[2]జువమ్ ॥ 1652

## సూక్తము—99

ఋషి—ఆంగిరసుఁడైన నృమేధుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గద్యము॥

వజ్రి! హవిర్భరణశీలు రగు యజమాను లే నీచే సోమము నిప్పుడును, గతదినమునందును ద్రావించితిరో! యట్టి నీవు స్తోత్రవాహకుల మగు మాయొక్క స్తుతి నీయజ్ఞమునందు నాలింపుము! నీవు మా గృహంబులకు రమ్ము! ॥ 1462

---

1. ఇత ఊతీ వో అజరం. 2. వసుజువమ్. (ప్రా. ప్ర.)

(2) గద్యము॥

ఓ శోభనోష్ణీషుఁడా!* యశ్వవంత! గిర్వణనీయుఁడా! నీకడఁ బరిచారకులు
నివసించుచున్నారు. కాఁబట్టి సోమరసము ద్రావి మదింపుము! సోమము
లభిషుతములయిన పిదప నీ కుపాయన భూతము లగు నన్నములు
ప్రశంస్యములైనవి యగుఁగాక! ॥ 1463

(3) గద్యము॥

అస్మజ్జనులారా! సమాశ్రితారంభులై సూర్యుని భజించుచున్న మీ రింద్రుని విశ్వధనములను
బొందుఁడు! అతఁ డుత్పన్నుఁడు, జనిష్యమానుఁడు,నగు మనుష్యున కోజోబలంబున
నే ధనము నొసంగునో! యా ధనంబును బిత్రృభాగమును వలె సంగ్రహించెదము॥ 1464

(4) గీ॥ ధన మొసంగువాని, ఘనదాత యగు వాని
నింద్రు సన్నుతింపుఁ డీరు మిగుల
నతని దానరీతు లధిక కళ్యాణంబుఁ
జేయునవియుఁ దృప్తిఁ జేయునవియు॥ 1465

గీ॥ అతఁ డభీష్టదాన మందింప జనులను
ప్రేరణంబుఁజేసి ప్రీతిఁ జేసి
సేవఁ జేయునట్టి సేవకావళి కాంక్షి
తములఁ జెరుపఁబోఁడు ధర్మనిష్ఠ॥ 1466

(5,6)సీ॥ సంగ్రామములయందు శత్రుసేనల కెల్ల నభిభవంబులఁగూర్చి యమరుచుంటి
శత్రుబాధక! నీవశ స్తిహంతవు దైత్యహంతవై యంతట నమరుచుంటి
సకలాసురలనుండి చాల నశస్తులఁ బుట్టించుచుం గీర్తిఁ బొందుచుంటి
సర్వశత్రులను సంహరించుచు బాధఁ బెట్టువారికి బాధఁ బెట్టుచుంటి
గీ॥ వింద్రుఁడా! నీదు బలమును హింసఁ బెట్టు
శత్రువుల్ ద్యోభువంబులు సరసహృదయ
లైన మాతలు శిశువును ననుసరించు
నట్టులే[1] యనుసరింతు రత్యద్భుతముగ॥ 1467

---

* ఇంద్రు డుష్ణీషము ధరించియున్నట్టు తెలియుచున్నది. ఆర్యులలో నాయకు లగు వారు ఉష్ణీషములను ధరించు చున్నట్లైన నుండవలయును లేక అప్పటి యార్యులందరును దలపాగాలను ధరించినట్లైన నుండవలయు. ఇప్పుడు కొంద రుష్ణీషమును ధరించున ట్లప్పు డందరును పాగాలను ధరించుచుండిరేమో! (నే.వేం.న.శా.)

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

(7,8)సీ॥ అజరుఁడై శత్రుల నడఁచువాఁడై యరి ప్రేరకుండయి కీర్తి వెలుఁగువాని
వేగవంతుండయి వివిధవిజేతయై యప్రహితుండయి యమరువాని
నుదకవర్ధకుఁడయి యుత్తమ రథి యయి హింసావిహీనుఁడై యెసఁగువాని
స్వయ మసంస్కృతుఁడయి శత్రుసంస్కర్తయై సాధారణుండయి పొగువాని
గీ॥ ధనముఁ గప్పెడువానిని, ఘనుల కెల్ల,
వసువుఁ గూర్చెడు వానిని నసము నింద్రు
సంస్తుతింపుఁడు! మీరలు! చాల మేము
నభినుతింతుము! వానినే యసమ భక్తి ॥ 1468

## సూక్తమ్—100

ఋషిః—1-3, 6-12-నేమో భార్గవః, 4-5-ఇన్ద్రః
†దేవతా—ఇన్ద్రః, -సుపర్ణః, 9-ఇన్ద్రః వజ్రో వా, 10,11-వాక్
ఛందః—త్రిష్టుప్, 6-జగతీ, 7-9-అనుష్టుప్

(1) అయం త[1] ఏమి తన్వా పురస్తాద్విశ్వే
దేవా[2] అభి మా యన్తి పశ్చాత్ ।
యదా మహ్యం దీధరో భాగమిన్ద్రాదిన్మయా[3]
కృణవో వీర్యాణి ॥ 1653

(2) దధామి తే మధునో భక్షమగ్రే హితస్తే
భాగః సుతో[4] అస్తు సోమః ।
అసశ్చ త్వం దక్షిణతః సఖా మే ఽధా
వృత్రాణి జఙ్ఘనావ భూరి ॥ 1654

† ఈ సూక్తమునకు దేవతలు 1-7, 12 ఋక్కులకు ఇంద్రుఁడుగాను, 10-11 ఋక్కులకు వాక్కుగాను, సాయన, మాక్స్‌ముల్లర్ ప్రతులలో పేర్కొనఁబడినదిగాని 8, 9 ఋక్కులకు దేవత పేర్కొనఁబడలేదు.

1. అయం తఽఏమి, 2. దేవాఽఅభి, 3. భాగమిన్ద్రాదిన్మయా, 4. సుతోఽఅస్తు. (ప్రా.ప్ర.)

(3) ప్ర సు స్తోమం భరత వాజయన్త[1]

ఇన్ద్రాయ సత్యం యది సత్యమస్తి ।

[2]నేన్ద్రో అస్తీతి నేమ ఉ త్వ ఆహ

క ఈం దదర్శ కమభిష్టవామ ॥ 1655

(4) అయమస్మి జరితః పశ్య మేహ

విశ్వా జాతాన్యభ్యస్మి మహ్నా ।

ఋతస్య మా ప్రదిశో వర్ధయన్త్యాదర్దిరో

భువనా దర్దరీమి ॥ 1656

(5) ఆ యన్మా వేనా[3] అరుహన్నృతస్యఁ[4]

ఏకమాసీనం హర్యతస్య పృష్ఠే ।

మనశ్చిన్మే హృద[5] ఆ ప్రత్యవోచదచిక్ర

దఞ్ఛిశుమన్తః సఖాయః ॥ 1657

(6) విశ్వేత్ తా తే సవనేషు ప్రవాచ్యా

యా చకర్థ మఘవన్నిన్ద్ర సున్వతే ।

పారావతం యత్ పురుసంభృతం వస్వపావృణోః

శరభాయ[6] ఋషిబన్ధవే ॥ 1658

---

1. వాజయన్తఽఇన్ద్రాయ. 2. నేన్ద్రోఽఅస్తీతి నేమఽఉ త్వఽఆహ, 3. వేనాఽఅరుహ, 4. స్యఁఽఏక, 5. హృదఽఆ, 6. భాయఽఋషి. (వ్రా.ప్ర.)

(7) ప్ర నూనం ధావతా పృథఙ్ నేహ

యో వో[1] అవావరీత్ ।

ని షీం వృత్రస్య మర్మణి

వజ్రమిన్ద్రో[2] అపీపతత్ ॥ 1659

(8) మనోజవా[3] అయమాన

ఆయసీమతరత్ పురమ్ ।

దివం సుపర్ణో గత్వాయ

సోమం వజ్రిణ[4] ఆభరత్ ॥ 1660

(9) సముద్రే[5] అన్తః శయత

ఉద్నా వజ్రో అభీవృతః ।

భరన్త్యస్మై సంయతః

పురః ప్రస్రవణా బలిమ్ ॥ 1661

(10) యద్వాగ్వదన్త్యవిచేతనాని

రాష్ట్రీ దేవానాం నిషసాద మన్ద్రా ।

చతస్ర[6] ఊర్జం దుదుహే పయాంసి

క్వ స్విదస్యాః పరమం జగామ ॥ 1662

---

1. వోఽఅవా, 2. మిన్ద్రోఽఅపీ. 3. జవాఽఅయమానఽఆయ, 4. వజ్రిణఽఆభరత్,

5. సముద్రేఽఅన్తః శయతఽఉద్నా వజ్రోఽఅభీ, 6. చతస్రఽఊర్జం. (వ్రా.ప్ర.)

(11) దేవీం వాచమజనయన్త దేవాస్తాం
విశ్వరూపాః పశవో వదన్తి ।
సా నో మన్ద్రేషమూర్జం దుహానా
ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు 1663

(12) సఖే విష్ణో వితరం వి క్రమస్వ ద్యౌర్దేహి
లోకం వజ్రాయ విష్కభే ।
హనావ వృత్రం రిణచావ సిన్ధూనిన్ద్రస్య
యన్తు ప్రసవే విసృష్టాః ॥ 1664

## సూక్తము—100

ఋషి — భార్గవుఁడైన నేముఁడు, 4-5-ఇంద్రుఁడు*
దేవత—ఇంద్రుఁడు, 8-సుపర్ణుఁడు, 9-ఇంద్రుఁడు లేక వజ్రము, 10,11-వాక్కు-*

1. సీ॥ శత్రువుల చెంత నున్నట్టి సకలధనము
మా కొసంగఁ దలంచిన మఘవుఁడ! కడుఁ
బుత్ర సహితులమై శత్రు పూర్ణవిజయ
మునకుఁ బోయెడు శక్తిని నొసఁగ నిమ్ము! ॥ 1469

2. ఆ॥ మునుకొని సోమముఁ దాల్చెద
నదె నీ హృదయంబునందు నమరుత నింద్రా !
ముదమున నా పార్శ్వంబున
సదయుండవై యున్న నీవు శత్రులు చనరే! ॥ 1470

* శ్రీ వా. ప్రతిలో (13వ సంపుటము. 17వ పుట) ఈ సూక్తమునకు దేవత "ఇంద్రుఁడు"గాను, ఋషి "నేముఁడు" గాను వ్రాసి. 16b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "నేముఁడు, ఇంద్రుఁడు (4,5)" ఋషిగాను, "ఇంద్రుఁడు, వాక్కు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

(3) గద్యము॥

ఓ జనులారా! సంగ్రామములను గోరుచున్న మీ రింద్రునకు సత్యభూత మగు స్తోమమును బట్టుఁడు! భార్గవుం డగు నేముఁ డనెడివాఁడే యింద్రుఁడు. కాని వే రొకఁ డింద్రుఁడు లేఁడు. ఎవఁ డింద్రుని జూచెను ? ఎవ్వాఁడును దర్శింపలేఁడు. కాఁబట్టి యెవ్వని స్తుతింపఁ గలము ? (ఇంద్రుఁ డను వాఁ డొకఁ డుండె నను వాక్యము సత్యమైనది కాదు)॥ 1471

(4) సీ॥ నీ సమీపంబున నే నున్నవాఁడను నన్నుఁ జూడ వదేమి ? యెన్న వేమి ?
యన్ని లోకంబుల నభిభవించుచునుండు నన్నుఁ జూడ వదేమి ? యెన్న వేమి ?
సత్యవిద్వాంసుల సన్నుతిఁ గనుచుండు నన్నుఁ జూడ వదేమి ? యెన్న వేమి ?
యాసక్తిశీలినై యరులఁ గొట్టుచునుండు నన్నుఁ జూడ వదేమి ? యెన్న వేమి ?
గీ॥ యనుచు "నింద్రుఁడు లేఁ"డని యరచుచున్న
నేముఁ డను మౌని వాక్యముల్ నిశ్చలముగ
వినుచు నా మౌని ముందర వేగగామి
యౌచుఁ బ్రత్యక్ష మయ్యెను నమరవిభుఁడు 1472

(5) గద్యము॥

ఎవరు యజ్ఞమును గావించుచున్నవారలై యంతరిక్షము నందున్న నన్నుఁ దెలిసికొనిరో! యట్టి మీ మనస్సు "పుత్ర యుక్తులు సఖులు నగు మీరు నన్నుఁగూర్చి పరితపించుచున్నా"రని నాకుఁ దెలియఁబరచెను 1473

(6) గీ॥ మఘవ! సోమముఁ దీసెడు మానవునకు
నెట్టి కర్మలఁ జేసితి వట్టి కర్మ
లను వచించుట శక్యమె ? ఘనుఁడ వైన
నీదు మహిమ యనంతమై నెగడుఁగాదె ॥ 1474

(7) గీ॥ ఎవఁడు పరుగిడుచుండునో! యెవఁడు మీకు
దూరమం దుండనియె మిమ్ముఁ జేరువాఁడొ!
యట్టి శత్రుని మర్మమునందు వజ్రి
కులిశమును[1] విడుచుఁగాదె! తాఁ దొలఁగకుండ 1475

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(8) గీ॥ కడు మనోవేగమును గల్గు గరుడుఁడు తగఁ
బోవుచు హిరణ్మయం బగు పురము దాఁటి
స్వర్గమును జేరి సోమము శక్రునకయి
తెచ్చి యిచ్చె జగంబులు మెచ్చునటుల 1476

(9) గీ॥ జలధిమధ్యంబునం దేది మెలఁగుచుండు?
నంబువుల నెయ్యి దధివృత మౌచు నుండు?
నట్టి వజ్రమునకు శాత్రవాళి యెల్లఁ
బవిగ నర్పణఁ జేయంగఁబడునుగాదె! ॥ 1477

(10) ఉ॥ రాజన శీలవాక్కు కడు రంజిలు నర్థములన్ వచించు వి
భ్రాజిత యజ్ఞవేదికల భాసిలుచుండును దానివల్ల రా
రాజిలు దిక్కు లన్నము విరాజి పయస్సు జలంబుఁ గల్గెడున్
దేజము లొల్కు నా వచనదీప్తిని జూడఁగ శక్య మౌనఁటే! ॥ 1478

(11) గద్యము॥

ద్యోతమానమైన యే మాధ్యమిక వాక్కును* దేవతలు పుట్టించుచున్నారో! యా వాక్కును సర్వరూపములు వ్యక్తావ్యక్తవాచులు నగు పశువులు చెప్పుచున్నవి. ఆ వాగ్దేవి స్తుత్యయై వృష్టిప్రదానమున మా కన్నముగను బయోఘృతాదిరూపము లగు రసములుగను స్రవించుచు ధేనుభూతయై నేముల మగు మమ్ముఁ బొందుఁగాక! ॥ 1479

(12) గద్యము॥

ఓ సఖుఁడా! విష్ణూ! నీవు మముఁగూర్చి విక్రమింపుము! ఓ దివమా! వజ్రవిష్కంభనమునకు నవకాశము నొసంగుము! ఓ విష్ణూ! మన ముభయులము నసురను జంపెదము. నదులను బొందించెదము. విసృష్టము లగు నా నదు లింద్రుని ప్రేరణమున నుండుఁగాక! ॥ 1480

---

* ఈ మాధ్యమిక వాక్కు సర్వప్రాణ్యంతర్గత మైన ధర్మమును వచించుచున్నది. (నే.వేం.న.శా)

# సూక్తమ్—101

ఋషిః—జమదగ్నిర్భార్గవః

దేవతా—మిత్రావరుణౌ, 5-మిత్రావరుణాదిత్యాః, 6-ఆదిత్యాః,

7-8-అశ్వినౌ, 9-10-వాయుః, 11-12-సూర్యః, 13-ఉషాః సూర్యప్రభా వా*

14-పవమానః, 15-16-గౌః

ఛందః—1-2-బృహతీ, సతోబృహతీ (ప్రగాథః), 3-గాయత్రీ,

4-సతోబృహతీ, 5-13-విషమా బృహతీ, సమా సతోబృహతీ (ప్రగాథః)

14-16-త్రిష్టుప్

(1) ఋధగిత్థా స మర్త్యః

శశమే దేవతాతయే ।

యో నూనం మిత్రావరుణావభిష్టయ[1]

ఆచక్రే హవ్యదాతయే ॥ 1665

(2) వర్షిష్ఠక్షత్రా[2] ఉరుచక్షసా నరా

రాజానా దీర్ఘశ్రుత్తమా ।

తా బాహుతా న దంసనా రథర్యతః

సాకం సూర్యస్య రశ్మిభిః ॥ 1666

(3) ప్ర యో వాం మిత్రావరుణాజిరో దూతో[3] అద్రవత్ ।

అయఃశీర్షా మదేరఘుః ॥ 1667

---

* సూర్యప్రభా ఉషాః (ప్రా.ప్ర.)

1. వభిష్టయఽఆచక్రే, 2. క్షత్రాఽఉరు, 3. దూతోఽఅద్రవత్. (ప్రా.ప్ర.)

(4) న యః సంవృచ్ఛే న పునర్హవీతవే

న సంవాదాయ రమతే ।

తస్మాన్నో[1] అద్య సమృతేరురుష్యతం

బాహుభ్యాం న[2] ఉరుష్యతమ్ ॥ 1668

(5) ప్ర మిత్రాయ ప్రార్యమ్ణే

సచథ్యమృతావసో ।

వరూథ్యం౧ వరుణే ఛన్ద్యం వచః

స్తోత్రం రాజసు గాయత ॥ 1669

(6) తే హిన్విరే[3] అరుణం జేన్యం

వస్వేకం పుత్రం తిసృణామ్ ।

తే ధామాన్యమృతా మర్త్యానా

మదబ్ధా[4] అభి చక్షతే ॥ 1670

(7) ఆ మే వచాంస్యుద్యతా

ద్యుమత్తమాని కర్త్వా ।

ఉభా యాతం నాసత్యా సజోషసా

ప్రతి హవ్యాని వీతయే ॥ 1671

---

1. తస్మాన్నోఽఅద్య, 2. నఽఉరుష్యతమ్, 3. హిన్విరేఽఅరుణం, 4. మదబ్ధాఽఅభి. (వ్రా.ప్ర.)

(8) రాతిం యద్వామరక్షసం హవామహే

యువాభ్యాం వాజినీవసూ ।

ప్రాచీం హోత్రాం ప్రతిరన్తావితం

నరా గృణానా జమదగ్నినా ॥ 1672

(9) ఆ నో యజ్ఞం దివిస్పృశం వాయో

యాహి సుమన్మభిః ।

అన్తః పవిత్ర[1] ఉపరి శ్రీణానోఽయం

శుక్రో[2] అయామి తే ॥ 1673

(10) వేత్యధ్వర్యుః పథిభీ రజిష్ఠైః

ప్రతి హవ్యాని వీతయే ।

అధా నియుత్వ[3] ఉభయస్య నః

పిబ శుచిం సోమం గవాశిరమ్ ॥ 1674

(11) బణ్మహాగ్ం[4] అసి సూర్య

బళాదిత్య మహాగ్ం[5] అసి ।

మహస్తే సతో మహిమా పనస్యతే

ఽద్ధా దేవ మహాగ్ం[5] అసి ॥ 1675

---

1. పవిత్రఽఉపరి, 2. శుక్రోఽఅయామి, 3. నియుత్వఽఉభయస్య, 4. బణ్మహాగ్ంఽఅసి,

5. మహాగ్ంఽఅసి. (వ్రా.ప్ర.)

(16) వచోవిదం వాచముదీరయ న్తీం
విశ్వాభిర్ధీభిరుపతిష్ఠమానామ్ ।
దేవీం[1] దేవేభ్యః పర్యేయుషీం గామా
మావృక్త మర్త్యో దభ్రచేతాః ॥ 1680

## సూక్తము—101

ఋషి—భార్గవుఁడైన జమదగ్ని*
దేవత—మిత్రావరుణులు, 5-మిత్రావరుణాదిత్యులు,
6-ఆదిత్యులు, 7-8-అశ్వినులు, 9-10-వాయువు, 11-12 సూర్యుఁడు,
13-సూర్యప్రభ లేక ఉషస్సులు†, 14-పవమానుఁడు, 15-16-గోవులు*

(1) గీ॥ హవ్య మొసఁగునట్టి యజమాను చెంతకు
వరుణదేవు, మిత్రుఁ, బనుపునట్టి
మానవుండు సత్య మూని యజ్ఞార్థము
సంస్కరించుఁగాక! సద్ధవిస్సు॥ 1481

2) గద్యము॥

అతిశయప్రవృద్ధ బలులును, మహాదర్శనులు నగు నేతలు కర్మచే దీప్యమానులును గడు
విద్వాంసులు నగు మిత్రావరుణులు భుజములు వలె సూర్యరశ్ములవలనఁ
గార్యమును బొందుచున్నారు॥ 1482

(3) క॥ వరుణుఁడ! మిత్రుఁడ! మిమ్ములఁ
గరము మహాకర్మకరుఁడు గాంచు, నతఁడే
సురదూత స్వర్ణశీర్షుం
డురు ధనవంతుండు కాఁడె! యూహింపంగన్॥ 1483

---

1. దేవీం-దేవేభ్యః. (వ్రా.ప్ర.)

*వ్రాతప్రతిలో (10వ సంపుటము-19 పుట) నీ సూక్తమునకు "జమదగ్ని" ఋషిగా వ్రాసి, "మిత్రావరుణులు" దేవతగా వ్రాసె. 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "జమదగ్ని" ఋషిగా వ్రాసి, "మిత్రావరుణులు, ఆదిత్యులు, అశ్వులు, వాయువు, సూర్యుడు, ఉషస్సు, పవమాన గోవు" దేవతలుగా శ్రీనేమానివారు వ్రాసిరి.

† సూర్యప్రభయైన యుషస్సులుగా సంస్కృతమూలమునఁ బాఠాంతరము గలదు.

(4) గీ॥ హవ్యవాహక విషయ ప్రశ్నార్థమునకు[1]
వాదమును జేయు నిష్టము పడనియట్టి
శత్రువులనుండి మమ్ముల శక్తితోడ
మీరు రక్షింప రారండె! మిత్ర! వరుణ! ॥ 1484

(5) గీ॥ యజ్ఞధన! మిత్ర సేవకు నర్హమైన
యజ్ఞదేహభవం బగు నమల స్తుతిని
వరుణునకు నర్యముం డను సురవరునకుఁ
బరమసంతోషవాక్కుసు బలుకు మీవు!॥ 1485

(6) గీ॥ అరుణవర్ణాంచితుని, జయకరుని, వాస
కుని, బృథివ్యాది పుత్రుని గూర్మి దేవ
తావరులు ప్రేరణముఁ జేసి తనిసినారు
గాఢమైనట్టి తమసును గలఁతఁ బెట్టి ॥ 1486

క॥ సుర లన్యాహింసితులై
మరణరహితు లగుచుఁ బ్రీతి మనుజస్థలులన్
బరమ ముదమ్మం గొనుచున్
సుకుచిరముగఁ జూచుచుంద్రు చోద్యం బలరన్ ॥ 1487

(7) గీ॥ సత్యసంకల్పులై కడు సంగతులయి
మీరు నా స్తోత్రముల విని మిగుల నేను
జేయు కర్మలకై వచ్చి పాయకుండ
హవ్యముల నెల్లఁ బ్రీతితో నందుకొనుఁడు! ॥ 1488

(8) గీ॥ అన్నధనవంతులార! యో యశ్వులార!
మీ సుదానము యోగ్యమై మెలఁగుచుండుఁ
గాన మీరలు ప్రీతినిఁ బూని చేయు
దానమును గోరుదుము మేము తనివిఁ జెంద॥ 1489

1. హవ్యము వహించుఁ బ్రశ్నకు నమలబుద్ధి (తొ.పా.)

గీ॥ ప్రాఙ్ముఖంబులుగా నుండి ప్రస్తుతులను
వృద్ధిఁ బొందించు నేతలై వృద్ధిఁ బొందు
వారలై మీరు జమదగ్ని ప్రస్తుతులను
నధిగమించుచు నిచటకు నరుగుదెండు!॥ 1490

(9) గద్యము ॥

సుస్తుతులచేఁ బవిత్ర మధ్యమందు నిషిచ్యమాన మగు సోమము నీ నిమిత్త ముండెను.
వాయువా! మా యజ్ఞమునకు రమ్ము!॥ 1491

(10) క॥ వాయువ! తగు నధ్వర్యుఁడు
పాయక హవ్యములఁ బ్రీతి భక్షింపంగా
న్యాయ మగు మార్గమునఁ బడి
తా[1]యరుగుచు నుండుఁగాకఁ! దత్పరమతియై॥ 1492

గీ॥ శుద్ధసోమము గవ్యవిశుద్ధసోమ
మనెడు నుభయాత్మకంబు లౌ నస్మదీయ
సోమరసములఁ ద్రావుమీ! శుభద వాయు
దేవుఁడా! సన్నియుక్తాశ్వ! దివ్యమూర్తి!॥ 1493

(11, సీ॥ దివ్యసూర్యుఁడ! నీవు తేజోఽధికుఁడ వౌట సత్యము ముమ్మారు సత్య మగును!
12) నాదిత్య!బలముచే నధికుండవై యుంట సత్యము ముమ్మారు సత్య మగును!
వీర్యంబుచే నీవు వెలయుచుండుట కడు సత్యము ముమ్మారు సత్య మగును!
నాదిత్య! నీదు మహత్వ మెక్కువ యౌట సత్యము ముమ్మారు సత్య మగును!
గీ॥ శ్రవణసర్వాధికుఁడ వౌట సత్య మగును!
సకల దేవాధికుఁడ వౌట సత్య మగును!
శత్రు సంహారకుఁడ వౌట సత్య మగును!
సర్వసురరక్షకుఁడ వౌట సత్య మగును॥ 1494

---

1. "తాను" ప్రుత ప్రకృతికము. "తా నరుగుచు" ననుటకు మాఱ ప్రాసభంగ భయమున శ్రీ నేమానివా రగతికముగా యవాగమము చేసిరి. (చూ. పీఠిక)

(13) సీ॥ నీచయై యెవ్వతె నికశ ముండు నటన్న సూర్యాప్రభ యటంచు సూరు లనరె!
స్తుతుల నందుచు రూపవతి యెవ్వతె యటన్న సూర్యాప్రభ యటంచు సూరు లనరె!
యతి ప్రకాశాన్విత యగు నెవ్వతె యటన్న సూర్యాప్రభ యటంచు సూరు లనరె!
భాసురసామర్థ్యభవ యెవ్వతె యటన్న సూర్యాప్రభ యటంచు సూరు లనరె!
గీ॥ యట్టి ప్రభ లోక మధ్యంబు నందు
బాహుభూత దిక్కుల నెల్లఁ బొందుచుండి
చిత్రగోవు విధంబునఁ జిత్రరీతిఁ
జూడఁబడుఁగాక! సర్వముఁ జోద్య మంద॥ 1495

(14) గద్యము ॥

మూఁడు విధము లగు నే ప్రజ లత్యాయమును బొందిరో! యన్యు లగు నట్టి ప్రజ
లర్చనీయుఁ డగు నగ్నిని నంతటఁ బ్రవేశింపఁజేసినారు. అందువలన వారు
పరాభూతులు కాలేరు. భువన మధ్యమున మహాత్ముఁ డగు నాదిత్యుఁ
(ఛాయాపతి యని కొంద ఱనెదరు) డుండెను. దిక్కులయందు
వాయువు ప్రవేశించెను॥ 1496

(15) సీ॥ ఎవతె[1] మరుత్తుల కెల్ల మాతగనుండి ప్రజలను సంతోష పరచునదియొ!
యెవ్వతె[1] వసువుల కెల్లఁ బుత్రిక యయి యానందకర్త్రియై యమరు నదియొ!
యెవతె[1] యాదిత్యుల కెల్ల సోదరి యయి సంతోషకరయయి సాగునదియొ!
యెవతె[1] పయస్సుల కెల్ల సుస్థానమై యెంతయుఁ బ్రీతిని నిచ్చునదియొ!
గీ॥ కడు ననాగస యౌ నట్టి క్రమగోవు
మీరు హింసింపకుండుఁడు! వీరులార!
యనుచు శుశ్రూషమాణు లౌ నఖిలజనుల
కెపుడు వచియించితినిగాదె! యెలమి మీర॥ 1497

(16) గద్యము ॥

వాక్కుల నుచ్చరించునదియు, సమస్త వాక్కులచేతను సేవింపఁబడుచుండునదియుఁ,
బ్రకాశించునదియు, నన్ను దేవతల వశము చేయునదియు నగు గోవును, నల్పబుద్ధి గల
మనుష్యుఁడు విడిచిపెట్టుచున్నాఁడు॥ 1498

---

1. వ్రాత ప్రతిలో (10వ సంపుటము. 21పుట) 1,3,4 పాదములలో "ఏది" అని మొదట వ్రాసి దానిని గొట్టివేసి "ఎవతె"అనియు, రెండవ పాదములో తొలుత "ఎయ్యది" అని వ్రాసి దానిని గొట్టివేసి "ఎవ్వతె" అనియు సవరింపఁబడినది. ఈ నాలుగుపాదములలోను "ఎవ్వతె" శబ్దము బ్రాకెట్లలో నుంచుటకూడ జరిగినది.

## సూక్తమ్—102

ఋషిః—భార్గవః ప్రయోగః, అగ్నిర్వా బార్హస్పత్యః, పావకో వా, సహసః పుత్రౌ గృహపతి-యవిష్ఠౌ తయోర్వాన్యతరః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) త్వమగ్నే బృహద్వయో దధాసి దేవ దాశుషే ।
కవిర్గృహపతిర్యువా ॥ 1681

(2) స న[1] ఈళానయా సహ దేవాగ్ం[2] అగ్నే దువస్యువా ।
చికిద్విభానవా వహ ॥ 1682

(3) త్వయా హ స్విద్యుజా వయం చోదిష్ఠేన యవిష్ఠ్య ।
అభి ష్మో వాజసాతయే ॥ 1683

(4) ఔర్వభృగువచ్ఛుచిమప్నవానవదా హువే ।
అగ్నిం సముద్రవాససమ్ ॥ 1684

(5) హువే వాతస్వనం కవిం పర్జన్యక్రన్ద్యం సహః ।
అగ్నిం సముద్రవాససమ్ ॥ 1685

---

1. స నఽఈళా, 2. దేవాగ్ంఽఅగ్నే. (ప్రా.ప్ర.)

(6) ఆ సవం సవితుర్యథా భగస్యేవ భుజిం హువే ।
అగ్నిం సముద్రవాససమ్ ॥ 1686

(7) అగ్నిం వో వృధన్తమధ్వరాణాం పురూతమమ్ ।
అచ్ఛా నప్త్రే సహస్వతే ॥ 1687

(8) అయం యథా న[1] ఆభువత్ త్వష్టా రూపేవ తక్ష్యా ।
అస్య క్రత్వా యశస్వతః ॥ 1688

(9) అయం విశ్వా[2] అభి శ్రియో ఽగ్నిర్దేవేషు పత్యతే ।
ఆ వాజైరుప నో గమత్ ॥ 1689

(10) విశ్వేషామిహ స్తుహి హోతౄణాం యశస్తమమ్ ।
అగ్నిం యజ్ఞేషు పూర్వ్యమ్ ॥ 1690

(11) శీరం పావకశోచిషం జ్యేష్ఠో యో దమేష్వా ।
దీదాయ దీర్ఘశ్రుత్తమః ॥ 1691

---

1. యథా న ఽఆభువత్. 2. విశ్వా ఽఅభిశ్రియే. (ప్రా. ప్ర.)

(12) తమర్వన్తం[1] న సానసిం గృణీహి విప్ర శుష్మిణమ్ ।
మిత్రం న యాతయజ్జనమ్ ॥ 1692

(13) ఉప త్వా జామయో గిరో దేదిశతీర్హవిష్కృతః ।
వాయోరనీకే[2] అస్థిరన్ ॥ 1693

(14) యస్య త్రిధాత్వవృతం బర్హిస్తస్థావసందినమ్ ।
ఆపశ్చిన్ని దధా పదమ్ ॥ 1694

(15) పదం దేవస్య మీళ్హుషో[3] ఽనాధృష్టాభిరూతిభిః ।
భద్రా సూర్య[4] ఇవోపదృక్ ॥ 1695

(16) అగ్నే ఘృతస్య ధీతిభిస్తేపానో దేవ శోచిషా ।
ఆ దేవాన్ వక్షి యక్షి చ ॥ 1696

(17) తం త్వాజనన్త మాతరః కవిం దేవాసో[5] ఽఙ్గిరః ।
హవ్యవాహమమర్త్యమ్ ॥ 1697

---

1. తమర్వన్తన్న, 2. నీకేఽఅస్థిరన్, 3. మీళ్హుషో, 4. సూర్యఽఇవోప,
5. దేవాసోఽఅఙ్గిరః (ప్రా.ప్ర.)

(18) ప్రచేతసం త్వా కవే ఒగ్నే దూతం వరేణ్యమ్ ।
హవ్యవాహం ని షేదిరే ॥ 1698

(19) నహి మే¹ అస్త్యఘ్న్యా న స్వధితిర్వనన్వతి ।
అథైతాదృగ్భరామి తే ॥ 1699

(20) యదగ్నే కాని కాని చిదా తే దారూణి దధ్మసి ।
తా జుషస్వ యవిష్ఠ్య ॥ 1700

(21) యదత్త్యుపజిహ్వికా యద్వమ్రో² అతిసర్పతి ।
సర్వం తదస్తు తే ఘృతమ్ ॥ 1701

(22) అగ్నిమిన్ధానో మనసా ధియం సచేత మర్త్యః ।
అగ్నిమీధే వివస్వభిః ॥ 1702

---

1. నహి మేఽఅస్త్యఘ్న్యా. 2. యద్వమ్రోఽఅతి. (వ్రా.ప్ర.)

## సూక్తము—102

ఋషి—భార్గవుఁడైన ప్రయోగుఁడు, బార్హస్పత్యుఁడైన యగ్ని లేక పావకుఁడు
సహునిపుత్రులు గృహపతి-యవిష్ఠులు లేక వారిలో నొకఁడు*
దేవత—అగ్ని*

(1) గీ॥ క్రాంతకర్ముఁడ వగుదువు! కవివి! నిత్య
యౌవనుండవు! గృహపతి వగుచు నుండి
హవ్యము నొసంగు వారికి నధిక మైన
యన్నము నొసంగుచున్నాఁడ వగ్ని! నీవు ॥ 1499

(2) గీ॥ ఓ విశిష్టదీప్త! యో యగ్నిదేవుఁడా!
జ్ఞాత వగుచు నీవు పూత సేవ
లను నొనర్చునట్టి ఘనవాక్ప్రశస్తిచేఁ
బిలువుమయ్య! నీవు ప్రీతి సురల ॥ 1500

(3) గీ॥ యువతమాగ్నిదేవ! యుత్తమ ధనదాత
వైన నీదు మైత్రి నంది మేము
కఠినశత్రువులకుఁ గల్పించి హింసల
నతిశయాన్నలాభ మందఁగలము ॥ 1501

(4) గీ॥ శుద్ధుఁ డౌచుఁ దాను శోభిల్లు నగ్నిని
నౌర్వ భృగు మునీశుఁ డధిక మెట్లు
పిలిచి పొందె నటులఁ బ్రీతితో నే నల
నబ్ధివాసియైన ననలుఁ బిలుతు ॥ 1502

(5) గీ॥ పూతలైన యట్టి వాత పర్జన్యుల
శబ్దములను బోలు శబ్దములను
జలుపువానిఁ గవిని ఘోరు సహస్విని
నబ్ధివాసి యైన యగ్నిఁ బిలుతు ॥ 1503

* వ్రాతప్రతిలో (10వ సంపుటము 21వ పుట) నీ సూక్తమునకు ఋషి "ప్రయోగుఁడు"గాను, దేవత "గాయత్రి, అగ్ని" గాను వ్రాసి, 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "ప్రయోగుఁడు లేక అగ్ని. గృహపతి లేక యవిష్ఠుఁడు" ఋషిగాను, దేవత "అగ్ని" గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

(6) గీ॥ భగుని భోగభాగ్య భంగిఁ బ్రేరేపించు
సవితృదేవు ప్రసవ సరణి నేను
గ్రాంతకర్ము దేవరాజును సంప్రీతి
నట్టివాసి యైన నగ్నిఁ బిలుతు ॥ 1504

(7) గద్యము॥

అహింస్యు లగు బలవంతులకు బంధువును జ్వాలావర్ధమానుఁడును నతిశయించిన
వాఁడును నగు నగ్నిని నో ఋత్విజులారా! మీరు సేవింపుఁడు! ॥ 1505

(8) గద్యము॥

త్వష్టకర్తృవ్యరూపములను వలె నీ యగ్ని యెటుల మమ్ములను బొందుచున్నాఁడో!
యటుల మీ రగ్నిని బొందుఁడు! ॥ 1506

(9) క॥ మానవసంపద నగ్ని!
పూనుచు దేవతల మధ్యఁ బొలుపొందుచు నీ
వూనిన యన్నములను స
ద్దానము నీయంగ మాకు దర్శన మిడుమా! ॥ 1507

(10) గీ॥ హోతృవరుల మధ్య నున్నత కీర్తిని
నుండునట్టి యిష్టి నుండునట్టి
యగ్ని నస్మదీయ యజ్ఞమునం దోయి
స్తోత! సన్నుతింపు! సూక్తివలన ॥ 1508

(11) గీ॥ దేవతలలోన ముఖ్యుఁడు ధీరవరుఁడు
యజ్ఞగృహములయం దెల్ల నమరువాఁడు
శిరుఁడైనట్టి యగ్నిని జేరి మీరు
సన్నుతింపుఁడు! ప్రీతితో సరసులార! ॥ 1509

(12) గీ॥ ఆశ్వము విధాన భజనీయుఁ డైనవాఁడు
బలము కలిఁగిన మిత్రుని పగిది శాత్ర
వులను జంపెడు వాఁడు నై వెలఁగు నగ్ని
నన్నుతింపుఁడు! మీరలు సరసులార! ॥ 1510

(13) క॥ స్వసలు వలెన్ యజమానుల
కసమ స్తుతు లెల్ల నీ మహాగుణగణములన్
వెసఁ దెలిపి వాయు సన్నిధి
విస్మరునిగ నిన్నుఁ జేసి వెలసిరి విజ్ఞుల్ ॥ 1511

(14) గద్యము॥

ఏ యగ్నికిఁ ద్రిధాతువు ననావృతము నబద్ధము నగు బర్హి స్సాసనము నిముత్తమై కుందో! యా యగ్నియందు జలముకూడ స్థానమును గల్పించుకొనినది ॥ 1512

(15) గీ॥ అభిమతార్థము లిచ్చెడు నగ్నిపథము
శత్రువిరహిత మైనట్టి సర్వరక్ష
చేత భజనీయ మగు వాని పూతదృష్టి
భద్ర మగు సూర్యదేవుని పగిదిఁ దలఁప ॥ 1513

(16) గీ॥ దేవ! యగ్నిహోత్ర! దీప్తిసాధన విధా
నములవలన నీవు సముచితముగ
వెలిఁగి జ్వాలచేత వేల్పుల నెల్లరఁ
బిలిచి యిష్టిఁ జేయ వెడలు మీవు ॥ 1514

(17) గీ॥ అంగిరస్స! సర్వహవ్యవాహునిఁ గవిఁ
గ్రాంతకర్మ, మరణరహితు నిన్ను
సర్వదేవగణము జనపజ్క్తి కైవడిఁ
బుటజేయుచుండుఁ బూర్ణశక్తి ॥ 1515

(18) గీ॥ క్రాంతకర్మ! యగ్ని! ఘనబుద్ధునిగ దేవ
తలకు దూతునిగను దరచు హవ్య
వాహకునిగ నిన్ను వరియించుచున్ బుధుల్
నీకు సేవఁజేయ నిలుతురుగద! ॥ 1516

(19) గీ॥ దేని దుగ్ధముచే నీకుఁ దివిరి యజ్ఞ
కర్మ నొనరింతు నా గోవు కలుఁగకుండెఁ
బరశువున నెట్టి కాష్ఠము లరయఁగలనో!
యట్టి కాష్ఠము లర్పింతు నగ్ని! నీకు ॥ 1517

(20) గీ॥ యువతమాగ్ని! నీదు సవనంబులం గొన్ని
కాష్ఠముల ధరింపఁ గలుఁగునపుడు
కడు సువృక్ణములను గాంచుచు వానిని
బొందుమయ్య! నీవు పూర్ణ ప్రీతి ॥ 1518

(21) గద్యము॥

ఓ యగ్నీ! యే కాష్ఠాదికమును నుపజిహ్వ భక్షించుచున్నదో! యే కాష్ఠాదికమును వమ్రము
పొందుచున్నదో! యది యంతయు నీకు ఘృతసదృశ మగుఁగాక! 1519

(22) క॥ మనుజుఁడు కాష్ఠంబులతో
ననలుని వెలిఁగింపఁజేసి యతని భజించున్
మనమున శ్రద్ధం గొని వాఁ
డనయము జ్వలియింపఁజేయు ననఘులవలనన్ ॥ 1520

## సూక్తమ్—103

ఋషిః—సోభరిః కాణ్వః

దేవతా—అగ్నిః, 14-అగ్నామరుతః

ఛందః—బృహతీ, 5-విరాడ్రూపా, 7, 9, 11, 13-సతోబృహతీ

8, 12-కకుప్, 10-హ్రసీయసీ, 14-అనుష్టుప్

(1) అదర్శి గాతువిత్తమో యస్మిన్ వ్రతాన్యాదధుః ।
ఉపో షు జాతమార్యస్య వర్ధనమగ్నిం నక్షన్త నో గిరః ॥ 1703

(2) ప్ర దైవోదాసో[1] అగ్నిర్దేవాగ్ం అచ్ఛా న మజ్మనా ।
అను మాతరం పృథివీం వి వావృతే తస్థౌ నాకస్య సానవి ॥ 1704

(3) యస్మాద్రేజన్త కృష్టయశ్చర్కృత్యాని [2]కృణ్వతః ।
సహస్రసాం మేధసాతావివ త్మనాఽగ్నిం ధీభిః సపర్యత ॥ 1705

(4) ప్ర యం రాయే నినీషసి మర్తో యస్తే వసో దాశత్ ।
స వీరం ధత్తే[3] అగ్న ఉక్థశంసినం త్మనా సహస్రపోషిణమ్ ॥ 1706

(5) స [4]దృళ్హే చిదభి తృణత్తి వాజమర్వతా స ధత్తే[5] అక్షితి శ్రవః ।
త్వే దేవత్రా సదా పురూవసో విశ్వా వామాని ధీమహి 1707

---

1. దాసోఽగ్నిర్దేవాగ్ంఽఅచ్ఛా, 2. కృణ్వతః, 3. ధత్తేఽఅగ్నఽఉక్థ,

4. దృళహే, 5. ధత్తేఽఅక్షితి. (వ్రా.ప్ర.)

(6) మో [illegible] యతే వసు హోతా మన్ద్రో జనానామ్ ।

మధోర్న పాత్రా ప్రథమాన్యస్మై ప్ర స్తోమా యన్త్యగ్నయే ॥ 1708

(7) అశ్వం న గీర్భీ రథ్యం సుదానవో

మర్మృజ్యన్తే దేవయవః ।

ఉభే తోకే తనయే దస్మ విశ్పతే

పర్షి రాధో మఘోనామ్ ॥ 1709

(8) ప్ర మంహిష్ఠాయ గాయత[1] ఋతావ్నే

బృహతే శుక్రశోచిషే ।

ఉపస్తుతాసో[2] అగ్నయే ॥ 1710

(9) ఆ వంసతే మఘవా వీరవద్యశః

సమిద్ధో ద్యుమ్న్యాహుతః ।

కువిన్నో[3] అస్య సుమతిర్నవీయస్యచ్ఛా

వాజేభిరాగమత్ ॥ 1711

(10) ప్రేష్ఠము ప్రియాణాం స్తుహ్యాసావాతిథిమ్ ।

అగ్నిం రథానాం యమమ్ ॥ 1712

---

1. గాయతఽఋతావ్నే. 2. స్తుతాసోఽఅగ్నయే, 3. కువిన్నోఽఅస్య. (వా.ప్ర.)

(11) ఉదితా యో నిదితా వేదితా వస్వా యజ్ఞియో వవర్తతి ।
దుష్టరా యస్య ప్రవణే నోర్మయో ధియా వాజం సిషాసతః ॥ 1713

(12) మా నో హృణీతామతిథిర్వసురగ్నిః పురుప్రశస్త[1] ఏషః ।
యః సుహోతా స్వధ్వరః ॥ 1714

(13) మో తే రిషన్యే[2] అచ్ఛోక్తిభిర్వసో ఽగ్నే కేభిశ్చిదేవైః ।
కీరిశ్చిద్ధి త్వామిట్టే దూత్యాయ రాతహవ్యః స్వధ్వరః ॥ 1715

(14) అగ్నే యాహి మరుత్సఖా రుద్రేభిః సోమపీతయే ।
సోభర్యా[3] ఉప సుష్టుతిం మాదయస్వ స్వర్ణరే ॥ 1716

ఇతి
అష్టమం మణ్డలం
సమాప్తమ్

---

1. ప్రశస్తఽఏషః, 2. యేఽఅచ్ఛోక్తి, 3. సోభర్యాఽఉప. (బ్రా.ప్ర.)

## సూక్తము—103

ఋషి—కాణ్వుఁడైన సోభరి*
దేవత—అగ్ని, 14-అగ్నిమరుత్తులు*

(1) సీ॥ ఏవనియందుఁ గర్మ లెల్ల ధరింతురో!
యజ్ఞకర్త లట్టి యగ్ని పుట్టు
నార్ద్రవర్ధకుఁ డగు నగ్ని సుజాతుని
స్తుతులు పొందుచుండుఁ దుష్టి మీర ॥ 1521

(2) సీ॥ అల దివోదాస హూయమానాగ్ని మాత
యైన పృథ్విని గూర్చి తా నాదరమున
యజ్ఞమున దేవతలకయి హవ్యములను
నిచ్చుటకు[1] వెదలనే లేదు మెచ్చునటుల ॥ 1522

సీ॥ బలముచేత దివోదాస పరమ మౌని
యగ్ని దేవుని పిలుచుట కఖిల విపుల
స్వర్గలోకస్థలిం బ్రీతిఁ బడసి చాల
వెలుఁగుచుండెను నప్పటి వివిధ గతుల ॥ 1523

(3) ఉ॥ కర్మలఁ జేయు వారలకుఁ గర్మల జేయక యుండు వారు త
న్మర్మ మెఱుంగి సంతత మనంతము హింసలఁ జేయుచుందురో!
కర్మకులార! మీకు కడు గారవ మొప్ప ధనం బొసంగు నా
కర్మపరాగ్ని యజ్ఞములఁ గాంచుచు వానినిఁ దృప్తిఁ జేయుఁడీ! ॥ 1524

(4) ఉ॥ వాసక వహ్నీ! నీ యమల భక్తునకున్ ధన మిచ్చుచుండుమా !
భాసురుఁడైన మర్త్యుఁడు విభాసిలు హవ్యము నీ కొసంగు నా
వాస నివాసి తాను నుతి వారము పల్కుచు నిత్యసంతసో
ద్భాసి ధనాఢ్య వీర సుతభాగ్యము ప్రీతిని దాల్చుచుండెడున్ ॥ 1525

---

* ప్రాతిశాఖ్యలో (10వ సంపుటము. 24 పుట) ఈ సూక్తమునకు ఋషి "సౌభరి"గాను, దేవత "అగ్ని"గాను వ్రాసి. 15b సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "సోభరి"గాను, దేవత "అగ్ని"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

1. ఇక్కడ సంప్రసారణమునకు మాత్ర పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(5) గీ॥ బహుధనాగ్ని! యెవఁడు బహు హవ్యము నొసంగు
నతఁడు శత్రుపురమునందు నుండు
నన్నకలనయొక్క యాధిక్యమును గొట్టు
నశ్వమహిమవలన నధిక ప్రీతి ॥ 1526

గీ॥ పురుషుఁ దక్షిణధనమును గరము పట్టు
నటుల నీకు హవిస్సును నందఁజేయు
మేము నీ కున్నయట్టి యమేయ ధనము
దాల్చుచున్నట్టివారము తత్పరమతి ॥ 1527

(6) గీ॥ సురలఁ బిల్చునట్టి శుభదాగ్ని జనులకు
ధన మొసంగుచుండెఁ గనుక వాని
కమల సోమపాత్ర నతిశీఘ్రముగ నీయఁ
బడుచునుండెఁగాదె! కడు ముదాన॥ 1528

(7) చ॥ అతిశయ దర్శనీయుఁడ! మహాగ్ని! సురాళిని గోరుచుండి స
న్నుతుల నినున్ భజించెద మనూన రథంబు వహించునట్టి యూ
ర్జిత మగు నశ్వమున్ వలెను జిత్తమునం దలపోసి నీవు మా
సుతులకుఁ బుత్ర సంతతికి శోభిలుచున్న ధనం బొసంగుమా! ॥ 1529

(8) గీ॥ ఓ యుపస్తోతలార! మీ రోలి ధాత్ర
వరుని, సత్యస్వరూపుని, సురుచిర మగు
దీప్తిఁ గలవాని నగ్నిని దీప్త నుతుల
సన్నుతింపుఁడు! భక్తి విస్తార మొప్ప ॥ 1530

(9) చ॥ ధనమును గల్గి యన్నమును దాల్చి వెలింగి పరాక్రమాఢ్యతం
దనరి యొసంగు నగ్ని నిరతం బహితంబుగ నిచ్చు నన్నమున్
ఘనులకు, వాని దైన మతి, గౌరవ మిచ్చెడు నన్నరాశితో
డను నిడుఁగాక! వారిని విడంబన చేయక సంతసంబునన్॥ 1531

(10) గీ॥ స్తోతృవరుఁడ! నీవు పూతమౌ బుద్ధితో
యానముఁ కు నెల్ల నంతయైన
వాని, నతిథి యైన వానిని, బ్రియతమము,
నగ్ని, వేఁడుమయ్య! యసదృశముగ ॥ 1532

(11) గీ॥ వేత్తయై యిష్టికర్మల వెలయు నటులఁ
బూజ్యుఁ డగుచుండి సర్వదా పూర్ణుఁ డైన
యగ్ని మరలించుచుండును నఖిలలోక
నందితోదిత మైనట్టి నిఖిలధనము ॥ 1533

గీ॥ జన్యములఁ జేయఁబోవు నా జ్వాలను మంట
లెల్లఁ బ్రవణాభిముఖముగ నెగు, నవ్వి
జలధి తరగలు బోని దుస్తరము లగును
నట్టి యగ్నిని స్తుతియింపుమయ్య! నీవు ॥ 1534

(12) గద్యము॥

వాసకుఁడు, నతిథి వలెఁ బ్రియుఁడు, బహుస్తుతుఁడు, దేవతలఁ బిలుచువాఁడును నగు,
నీ యగ్ని యెవ్వరిచేతను నష్టుపెట్టఁబడకుండ మాకు ధనము నొసంగుఁగాక! ॥ 1535

(13) †గద్యము॥

ఓ వాసకాగ్నీ! మనుష్యు లగు స్తోత లెట్టి యభిష్టుతులచేతను, నెట్టి యభిగమనములచేతను
నిన్ను హింసింపకుందురుగాక! దత్త హవిష్కుఁడు సోభనయజ్ఞుఁడు నగు స్తోత,
హవిర్వహనాది దూత కర్మకొఱకు నిన్ను వినుతించుచున్నాఁడు ॥ 1636

(14) గద్యము॥

ఓ యగ్నీ! మరుత్ప్రియుండ వగు నీవు మేము చేయు యజన కర్మకొఱకు, సోమపానమునకు,
మరుత్తులను గూడి రమ్ము! సోభరి నగు నా స్తుతి నాలింప నరుగుదెమ్ము!
స్తుతిని విని సోమమును ద్రావి మదింపుము! ॥ 1537

ఇయ్యది
శ్రీ భారద్వాజగోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర శ్రీ సంగమేశ్వర పుత్ర
సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
నష్టమ మండలము
**సంపూర్ణము**

---

† వ్రాతప్రతిలో (10వ సంపుటము. 25పుట) నిక్కడ "గద్యము" అని వ్రాయుటకు మారు "గీ" అని పొరపాటున వ్రాయఁబడినది.

ఋగ్వేదాలోకనమున
దిగ్విలసిత కాల మూల దీప్తులు కల్గున్
ఋగ్వేద దివ్యదృష్టిని
దిగ్విలసన కాల రహిత దీప్తులు వెల్గున్ ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

# సంకేతాక్షర పద వివరణ

అ - అధ్యాయం, అష్టకం

ఋ - ఋక్కు

ఐ. బ్రా - ఐతరేయ బ్రాహ్మణమ్

కా - కాంత

కౌ - కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు

తొ. పా - తొలిపాఠము

నే. వేం. న, శా - నేమాని వేంకట నరసింహ శాస్త్రి

పా - పాఠము, పాఠాంతరము

భా - భారతము

మం — మండలము

మా - మాక్స్‌ముల్లర్ ప్రతి

వ. గో. కృ - వఝ్జమూడి గోపాలకృష్ణయ్య

వ్రా. ప్ర - వ్రాతప్రతి

వ్రా. ప్ర. పా - వ్రాతప్రతి పాఠము

శాంతి - శాంతి పర్వము

స. శ్రీ. ఋ - సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

సా - సాయణాచార్యభాష్యోపేత ప్రతి

# ఉదాహృత గ్రంథాలు – గ్రంథ సముచ్చయాలు

అథర్వవేదం
ఆథర్వణకారికావళి - అథర్వణుడు
అనంతుని ఛందం - అనంతుడు
అనుభవసారము-పాల్కురికి సోమన
అప్పకవీయం - కాకునూరి అప్పకవి
అప్పకవీయ వివరణము - వేదుల రామ శాస్త్రి
అమరకోశం
అష్టాధ్యాయి - పాణిని మహర్షి
అహోబల పండితీయం - ప్రభంజనం అహోబలపతి పండితుడు (గాలి నరసయ్య)
ఆంధ్రప్రభ (తెలుగు దినపత్రిక)
ఆంధ్రభూమి (తెలుగు సచిత్ర వారపత్రిక)
ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము - కళా-ప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి
ఆంధ్ర శబ్ద చింతామణి - నన్నయభట్టు
ఆంధ్ర శబ్ద చింతామణి : బాలసరస్వతీ వ్యాఖ్య - ఎలకూచి బాలసరస్వతి
ఆంధ్ర శబ్ద శాసనము - పరవస్తు చిన్నయసూరి
ఆనంద రంగరాట్ ఛందం - కస్తూరి రంగకవి
ఆయుర్వేద గ్రంథాలు
ఆరణ్యకాలు
ఆర్ష విజ్ఞాన సర్వస్వం - తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణ
ఆర్ష విజ్ఞాన సర్వస్వం - వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
ఆర్షవిజ్ఞాన సర్వస్వము - శీలపు రామకృష్ణ శాస్త్రి
ఉత్తర రామచరిత్ర - భవభూతి
ఉపపురాణాలు
ఐతరేయ బ్రాహ్మణమ్
ఋగ్విధానం - శౌనకమహర్షి
ఋగ్వేదం
ఋగ్వేద దివ్యాలోకనం - వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
ఋగ్వేద సాయణభాష్యం
ఋగ్వేద స్కందభాష్యం
కవి జనాశ్రయం - మల్లియ రేచన
కావ్యాలు

కృష్ణయజుర్వేదం
కృష్ణశతశతి - వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు
ఖగోళ శాస్త్రాలు
గాథా ఉపైన్వతి (పార్శీగ్రంథం)
గీతా రహస్యము - బాల గంగాధర తిలక్
చతుర్వేదసారము-పాల్కురికి సోమన
చుక్కలసుద్ది - గొబ్బూరు వెంకటానంద రాఘవరావు
చెన్నమల్లు సీసములు-పాల్కురికి సోమన
ఛందోదర్పణం - అనంతుడు
జలనాడి గ్రంథాలు
జలార్గళ శాస్త్రం
జ్యోతిర్వేదం - గొబ్బూరు వెంకటానంద రాఘవరావు
త్రిలిఙ్గ (తెలుగు వారపత్రిక)
తెలుగులో ఛందోరీతులు - డాక్టర్ గిడుగు వెంకట సీతాపతి
నక్షత్రములు - గొబ్బూరు వెంకటానంద రాఘవరావు
నామలిఙ్గానుశాసనం
పతంజలి వ్యాకరణ మహాభాష్య ప్రదీప వ్యాఖ్య - కైయటుడు
పాణినీయశిక్ష - పాణిని మహర్షి
**పురాణాలు**
ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష
లేక
ధ్వని - లిపి - పరిణామం - వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ
ప్రాతిశాఖ్యలు
బ్రహ్మ పురాణం
బ్రహ్మ వైవర్త పురాణం
బ్రహ్మాండ పురాణం
బాల వ్యాకరణం - పరవస్తు చిన్నయ సూరి
బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశికా వ్యాఖ్య - కల్లూరి వెంకటరామ శాస్త్రి
బాల వ్యాకరణ గ్రాంథికాంధ్ర కల్పక నామాంతర సారస్యసర్వస్వపేటికా టీక-దూసి రామమూర్తి శాస్త్రి
బాల వ్యాకరణ లఘుటీక - బులుసు వెంకట రమణయ్య
బ్రాహ్మణాలు
భగవద్గీతా భాష్యం - మధ్వాచార్యులు
భగవద్గీతా భాష్యం - రామానుజాచార్యులు
భగవద్గీతా భాష్యం - శంకరాచార్యులు
మంత్రశాస్త్రాలు
మహాభాగవతం - వ్యాసమహర్షి
మహాభారతం - వ్యాసమహర్షి
మార్గ - దేశి; - వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
రత్నశాస్త్రాలు
రామాయణం - వాల్మీకి
లక్షణ సార సంగ్రహం - చిత్రకవి పెద్దన

వాఙ్మయ మహోధ్యక్షుని సామవేద విశ్వరూప ప్రదర్శన -
వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ"
వాసుదేవ వృత్తి - మంచెళ్ల వాసుదేవ కవి
వృక్షశాస్త్రం
వ్యాకరణ మహాభాష్యం - మహర్షి పతంజలి
వ్యావహారిక భాషా వ్యాకరణం-వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
వికృతి వివేకం - అథర్వణుడు
విష్ణు పురాణం
వేద భూమి - అచ్యుతుని వేంకటాచలపతి
వేద వ్యాకరణం - వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
వేద విజ్ఞాన సర్వస్వం - వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
వైద్య శాస్త్రాలు
శతపథ బ్రాహ్మణం
శాట్యాయన బ్రాహ్మణం
శ్రీ విరూపాక్ష - శ్రీరామ శాసనములు : ఆరవీటి వంశచరిత్ర -
వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ
శుక్ల యజుర్వేదం
శృంగార పదములు పీఠిక - వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళాప్రపూర్ణ"
సంగీత శాస్త్రాలు
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత - ప్రథమ సంపుటము - పీఠిక -
వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత : ద్వితీయ సంపుటము - పీఠిక -
వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాల కృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
సామవేద కౌథుమశాఖ
సామవేద జైమిని శాఖ
సామవేద రాణాయణీయ శాఖ
సామవేద వాంకార శాఖ
సామవేద ఉవ్వట భట్ట భాష్యం
,, దేవరాజయజ్వ భాష్యం
,, భరతస్వామి భాష్యం
,, భాస్కరమిశ్ర భాష్యం
,, మాధవదేవ భాష్యం
,, రామావదేవ భాష్యం
,, శ్రీనివాస భాష్యం
,, సాయణాచార్య భాష్యం
,, స్కంద భాష్యం
సుశ్రుతం - ధన్వంతరి
సూత్రాంధ్ర వ్యాకరణం (సంస్కృతం) - పరవస్తు చిన్నయ సూరి
స్వప్న శాస్త్రాలు
హరివంశం - యెఱ్ఱాప్రెగడ
Arctic Home of Vedas - Bala Gandadhara Tilak.

